ఇందులో

## జి. వి. కృష్ణరావు రచనలు

ఒకటో సంపుటం : సాహిత్య విమర్శ (కావ్యజగత్తు, ఇతర వ్యాసాలు)

రెండో సంపుటం : Studies in Kalapurnodayam

మూడో సంపుటం : నవలలు పాపికొండలు

నాలుగో సంపుటం : నవలలు కీలుబొమ్మలు, జఘనసుందరి, రాగరేఖలు,

ఐదో సంపుటం : నాటికలు – నాటకాలు
(ఆదర్శ శిఖరాలు, ప్రతిమ, బొమ్మ ఏడ్చింది.)

ఆరో సంపుటం : పద్యాలు, కథలు, ఇతరాలు

ఏడో సంపుటం : తాత్త్వికం – విగ్రహ వ్యావర్తని, ప్లేటో, కాంట్ ఇతర తాత్త్విక వ్యాసాలు

# కీలుబొమ్మలు

జి. వి. కృష్ణరావు

సంపాదకుడు
అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి

A GIFT FROM A DAUGHTER
IN MEMORY OF HER FATHER, THE WRITER

ప్రభాస పబ్లికేషన్స్
బోస్‌రోడ్ - తెనాలి

కీలుబొమ్మలు
జఘన సుందరి
రాగరేఖలు


ప్రభాస పబ్లికేషన్స్
బోస్‌రోడ్ - తెనాలి

ఆరవ ముద్రణ . సెప్టెంబర్, 1998

వెల : రూ 100/-

ప్రతులకు : పల్లవి పబ్లికేషన్స్
దుర్గయ్య వీధి, గవర్నరుపేట,
విజయవాడ - 520 002

గ్రాఫిక్స్ & ప్రింటర్స్ : కళాజ్యోతి ప్రాసెస్ లిమిటెడ్.
ఆర్. టి. సి క్రాస్‌రోడ్స్, ముషీరాబాద్
హైదరాబాద్ - 500 020

# సంపాదకుని మాట

ఒక రచయిత తన రచనల ద్వారానే ఎల్లకాలం సజీవంగా జనాళిలో ఉండగలడు. అదెప్పుడు? ఆయన రచనలో గ్రంథరూపంలోనో, మరో రూపంలోనో అందుబాటులో ఉన్నప్పుడే కాని దురదృష్టవశాత్తు కృష్ణరావుగారి రచనలు చాలా కాలంగా లభ్యంకావడం లేదు ఆయన సాహిత్యం మీద పరిశోధనలు చేసే వారంతా, నేను ఆయనకు సన్నిహిత మిత్రుణ్ణి కావడంతో, నన్ను కలిసి, ఆయనను గురించి, వారి గ్రంథాలు లభ్యమయ్యే విధం గురించి అడుగుతూ ఉంటారు గ్రంథాలు లేక పోవడంతో నేనూ వారికి ఏమి చేయలేని వాడినయ్యాను

కృష్ణరావుగారి కొమరితలిద్దరూ - ఉమాదేవి, శోభాదేవి - ఎప్పుడు అమెరికానుంచి తెనాలి వచ్చినా, వారిదగ్గిర వారి తండ్రిగారి గ్రంథాల ప్రచురణ గురించి ఈ అవసరంతో ప్రస్తావిస్తూ ఉండేవాణ్ణి వారు ఎప్పుడూ సుముఖతనే వ్యక్తం చేశారు కాని అది కార్యం రూపం ఆమధ్య జనవరి 1998న వారు తెనాలి వచ్చినప్పుడు, దాల్చింది ప్రచురణ బాధ్యతలు నేను స్వీకరిస్తానంటే వారు 'సరే' అన్నారు నేను దానికి, కృష్ణరావుగారిమీద నాకున్న ఎనలేని గౌరవాభిమానాలను పురస్కరించుకొని, వెంటనే అంగీకరించాను

ఈ కార్యంలో నేను చాలా మందికి కృతజ్ఞతలు చెప్పుకోవలసి ఉంది

తొలుదొల్తగా, తమ అమూల్యమైన సలహాలిచ్చి, జి వి కె ని స్థూలంగా పరిచయంచేసే వ్యాసాన్ని వ్రాసి ఇచ్చిన హితశ్రీ గారికి, కృష్ణరావుగారి గ్రంథాలనూ, వ్యాసాలనూ, అందించిన విజయవాడ సిద్ధార్థ సైన్స్ అండ ఆర్ట్స్ కాలేజి సిద్ధార్థ కళాపీఠం సంచాలకులు నాగళ్ళ గురుప్రసాద రావుగారికి, అలాగే డి టి పి ప్రింటింగ్, ప్రూఫ్ రీడింగ్ విషయాలలో అడుగడుగునా నాకు కుడిభుజమై నిలిచిన సిద్ధార్థ ఆర్ట్స్ & సైన్స్ కళాశాలలో ఆంగ్లోపన్యాసకులుగా పనిచేస్తున్న ప్రముఖ సాహితీ విమర్శకులు బి తిరుపతిరావుగారికి, జి వి కృష్ణరావుపై పరిశోధన చేసి పిహెచ్ డి పొందిన, తెలుగు అకాడమి లో పనిచేస్తున్న, మాణిక్య లక్ష్మిగారు కృష్ణరావు గారి వివిధ రచనల కాలాలను తెలియ జేశారు - వారికి, గ్రంథాకృతిని గురించి సలహాలు ఇచ్చిన డా పి వి రమణ గారికి, గ్రంథ సేకరణలో అత్యంతంగా సహాయసహకారాలందించిన డా వెలగా వెంకటప్పయ్య గారికి, అందంగా ముద్రించి ఇచ్చిన కళాజ్యోతి ప్రాసెస్ లిమిటెడ్ హైదరాబాద్ వారికి నేను హృదయ పూర్వకంగా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను

- సంపాదకుడు

# ప్రకాశకుల మాట

మా నాన్నగారు జీవించి ఉన్నప్పుడే ఆయన రచనలకు మలికూర్పు రాక పోవడం వల్ల అవి దొరకడం దుర్లభంగా ఉండేది. ఆయనమీద పరిశోధనలు సాగించేవారు గ్రంధాలు దొరకక చాల ఇబ్బందులకు గురయ్యారు ఏ హితశ్రీగారో, రెడ్డిగారో తమ వద్ద ఉన్న మానాన్నగారి రచనలను వారికి ఇచ్చి వారి అవసరాలు తీర్చేవారు ఆవిధంగా వారి దగ్గర కూడా గ్రంధాలు లేకుండా పోయాయి

తరువాత మానాన్నగారు గతించి నప్పటినుంచి, ఆయన రచనలన్నీ ఒకమారు అచ్చొత్తించాలని రెడ్డిగారు మాకు సూచిస్తూనే ఉన్నారు మాకూ అదే తలంపు ఉంది చూస్తుండగానే చాలకాలం గడిచింది.

**1998** జనవరిలో మేము భారతదేశానికి వచ్చినప్పుడు శ్రీ అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి గారు మళ్ళీ ఆప్రస్తాపన తీసుకొచ్చారు మేము ‘సరే’ అన్నాం రెడ్డిగారిని అచ్చుపని చూడవలసిందిగా అభ్యర్థించాం వారికి మానాన్నగారితో ఉన్న స్నేహ సంబంధాలను పురస్కరించుకొని, సంతోషంతో ‘సరే’ అన్నారు ఎంతో శ్రమించి, ఎక్కడెక్కడో వెతికి, దొరకని రచనలను దొరికించుకొని, ఏడు సంపుటాలలో ముద్రణా నిర్వహణను విజయవంతంగా నిర్వహించినందుకు వారికి మా హృదయపూర్వక కృతజ్ఞతలు.

అలాగే ఈ గ్రంధాలు వెలికి రావడంలో చేయూతనిచ్చిన వారందరికీ కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాం

జి ఉమాదేవి

జి శోభాదేవి.

# జీవితం, రచనలు

– హితశ్రీ

ఒక రచయితను అంచనా వేయడానికి, అతడు నిశ్వసించింది ఉచ్ఛ్వసించింది ఏమిటో తెలియాలి అతడు నిశ్వసించింది – అతడు చదివిన చదువు, పొందిన శిక్షణ అతడు ఉచ్ఛ్వసించింది అతడు కావించిన సృష్టి, రాసిన రాతలు

ఆయన ఎంతో చదివారు చదవక రాయడం కుదిరేపనికాదు ప్రాక్పశ్చిమ రససిద్ధాంతాలను, సాహిత్యాన్ని, దర్శనాలను లోతుగా చదివారు

ప్రాక్పశ్చిమ రస సిద్ధాంతాలను ఆస్వాదించారు అంటే అటు అరిస్టటిల్ కావ్యాను శాసనం, ప్లేటో రామణీయకతనుంచి కాంట్ పరతత్వవాదం వరకు, ఇటు బరతుని నాట్య శాస్త్రంతో మొదలెట్టి బామహ, ఉద్భట, బట్టనాయక, బట్టలోల్లట, ఆనందవర్ధన, ఇందు రాజ, అబినవగుప్త, క్షేమేంద్ర, మహిమబట్ట, మమ్మటుల దాకా బారతీయ రస సిద్ధాంతాలను ఔపోశన పట్టారు

అర్ధరాహిత్య రంగస్థలిని (Theatre of the Absurd) అర్థం చేసుకొన్నారు ''సప్తభంగుల అస్పష్టత'' (Seven Types of Ambignity) లోని స్పష్టతను ఎరిగారు పాక్పశ్చిమ దర్శనాలను మధించారు ఆర్య నాగార్జును నిసాపేక్ష వాదంలో జెనో "Flying arrow is at rest" (ఎగురుతున్న బాణం నిశ్చల స్థితిలో ఉంది) ను చూశారు

మార్క్స్ గతి తర్కం గతిని పరిశీలించి యన్ యమ్ రాయ్ మానవత్వాన్ని (Human-ness) గుర్తించారు

మార్క్స్, హెగెల్‌ల వ్యవస్థలలో (దర్శనాలలో) వ్యక్తిలుప్తమైనాడని, సార్త్ర్ అస్తిత్వంలోని మనిషి అస్తిత్వ వేదనను పట్టుకొన్నారు ఫ్రాయిడ్ స్వప్న శిల్పాన్ని బారతీయ ధ్వని సిద్ధాంతంతో ముడిపెట్టారు ప్రవర్తన వాదాన్ని, గెస్టాల్ట్ సిద్ధాంతాన్ని సాహిత్యానికి అన్వయించారు

ఇదీ క్లుప్తంగా ఆయన విస్తృత కాన్వాస్ దీని మీద ఆయన ఉలితో ఉల్లేఖించారు

సాహితీ మేరువు డాక్టర్ జీ వి కృష్ణరావు పూర్తిపేరు గవిని వెంకటకృష్ణరావు వారి స్వస్థలం తెనాలి తాలూకా కూచిపూడి గ్రామం నివాసస్థలం తెనాలి వారు కూచిపూడిలో 1914లో జన్మించారు వ్యవసాయ కుటుంబం తురుమెళ్ళ, కొల్లూరు హైస్కూళ్ళలో పాఠశాల విద్య అబ్యసించారు యస్ యస్ ఎల్ సి నాటికే ఒక చిన్న నవల, ఒక శతకం రచించారు. గుంటూరు ఏ సి కాలేజిలో బి ఏ వరకు చదివారు కాలేజిలో చదివేరోజుల్లోనే ''వరూధిని''

ఖండకావ్యం రచించారు 1937లో బి ఏ డిగ్రీ పొందారు గుంటూరులో పళ్ళెపూర్ణ ప్రజ్ఞాచార్యులుగారి దగ్గర సంస్కృతం చదువుకొన్నారు

తెనాలి ఆ రోజుల్లో ఒక సాహితీకేంద్రం చక్రపాణి, కొడవటిగంటి కుటుంబరావు, త్రిపురనేని గోపీచంద్ మొదలైన రచయితలెందరో తెనాలిలో ఉండేవారు వారితో కృష్ణరావుకి పరిచయం ఏర్పడింది సాహిత్యచర్చలు జరుగుతుండేవి గోపీచంద్ సాంగత్యం వల్ల కృష్ణరావుకి పాశ్చాత్య సాహిత్యాభిలాష, ఎం ఎన్ రాయ్ రచనలపట్ల ఆకర్షణ, మార్క్సిస్ట్ దృక్పథం అలవడ్డాయి కొన్నికథలు, నాటికలు రాశారు

డిగ్రీ అందిన తరువాత కృష్ణరావుకి నిరుద్యోగం ఎదురైంది నిరాశా నిస్పృహల అనుభవాలతో ''భిక్షాపాత్ర'' నాటిక రాశారు ఇతివృత్తం కాశీనుంచి వ్యాస నిష్కాసనం మార్క్సిస్టు దృక్పదంతో రాసిన ఈ నాటిక పదహారు భారతీయ భాషల్లోకి అనువదింపబడి ఆకాశవాణి నుంచి ప్రసారితమైంది నిరుద్యోగంతో విసుగెత్తి కృష్ణరావు బెనారస్ హిందూ విశ్వవిద్యాలయంలో ఎం ఏ ఇంగ్లీషు లిటరేచర్‌లో చేరారు ఆంగ్ల సాహిత్యాధ్యయనంలో మునిగి తేలారు ఎం ఏ చదువుతున్న రోజుల్లోనే ''కావ్య జగత్తు'' సాహిత్య విమర్శనా గ్రందం రచించారు దేశ కాల పరిస్థితుల్ని అనుసరించి కావ్యాల్లో వస్తువు రూపం ఎలా మార్పు చెందుతుందో ఇందులో మార్క్సిస్టు దృక్పథంతో వివరించారు ఇది చాలా ప్రసిద్ధమై విశ్వవిద్యాలయాల్లో పాఠ్యపుస్తకమైంది పరిస్థితులు అనుకూలించక కృష్ణరావు ఎం ఏ పరీక్షలు రాయకుండానే 1941లో తిరిగి వచ్చారు

కాశీ నుంచి తిరిగి వచ్చింతరువాత కృష్ణరావు జర్నలిజంలోకి అడుగు పెట్టారు కొంతకాలం మిత్రులతో కలిసి ఓ ప్రెస్, ఓ ఫర్నీచర్ షాపు నడిపారు అవేవీ విజయవంతం కాలేదు ఇంతలో ''ఆంధ్రప్రభ''లో సబ్ ఎడిటర్ పదవి లభించింది నార్ల, శ్రీశ్రీలతో పాటు '' ఆంధ్ర ప్రబ'' సంపాదక వర్గంలో పనిచేశారు ఆ కాలంలో ''జఘనసుందరి'' నవల రాశారు ఇది ఫ్రాయిడ్ సిద్ధాంతాల్ని తార్కికంగా బేరీజు వేసే ప్రసిద్ధ నవల ఆ తరవాత సంపాదకవర్గ నిర్ణయానుసారం కృష్ణరావు ''ఆంధ్రప్రభ'' నుండి వైదొలగారు దేశాభిమాని, విజయప్రబ పత్రికల్లో కొంత కాలం పని చేసి విరమించుకొన్నారు

పత్రికారంగానికి ఉద్వాసన పలికి కృష్ణరావు పిహెచ్ డి డిగ్రీ కోసం మద్రాసు విశ్వవిద్యాలయంలో పరిశోధనకు పూనుకొన్నారు పింగళి సూరన ''కళాపూర్ణోదయం'' వారి దృష్టిని ఆకట్టుకొంది "Studies in Kalapoornodayam" అనే ఆంగ్ల గ్రందాన్ని డాక్టరేట్ కోసం రాయాలని సంకల్పించి ఆ పరిశోధనలో నిమగ్నులయ్యారు ఈలోగా వారికి వ్యక్తి స్వాతంత్ర్యం మీద జిజ్ఞాస కలిగి తత్వ శాస్త్ర గ్రందాల్ని తిరిగేశారు జేగంటలు–కాంట్ పరతత్వవాదం, ప్లేటో–ప్రచురించారు తాత్విక చింతన స్వంతంత్ర విచారానికి దారి తీసింది

తత్ఫలితమే 1951లో ''కీలుబొమ్మలు'' నవలా రచన ఇది కృష్ణరావుకి ఎంతో పేరు తెచ్చిపెట్టిన విఖ్యాత నవల ఇటీవల ఇది ఆంగ్లంలోకి అనువదించబడి మాక్మిలన్ కంపెనీచే ప్రచురింపబడింది వ్యక్తిలో కర్తవ్య జిజ్ఞాసని రేకెత్తించటమే ఈ నవల లక్ష్యం

అప్పుడప్పుడు రాసిన నాటికల్ని గుదిగుచ్చి ''ఆదర్శ శిఖరాలు '' నాటికల సంపుటి ప్రచురించారు ఇది విలువల కాణాచి

మద్రాసు విశ్వవిద్యాలయం "Studies in Kalapurnodayam" ఆంగ్ల వ్యాసానికి కృష్ణరావుకి 1955లో పిహెచ్ డి డిగ్రీ ప్రదానం చేసింది ''కళాపూర్ణోదయం''లో కళ ఎలా పూర్ణోదయం చెందిందో ఈ గ్రందంలో కృష్ణరావు పింగళి సూరనని ప్రపంచ కవుల సరసన నిలబెట్టారు 1952లో కృష్ణరావు తెనాలిలో వి యస్ ఆర్ కాలేజిలో అద్యాపకునిగా చేరారు ఈ రోజుల్లో మాధ్యమిక వాదంలో కుతూహలం కలిగి ఆర్యనాగార్జునుని గ్రందాలను కొన్నిటిని పద్యాలుగా అనువదించారు అవి పోయాయి ''విగ్రహవ్యావర్తని'' నిమాత్రం తిరిగి అనువదించి విపుల బూమికతో ప్రచురించారు కేంద్ర సాహిత్య అకాడమీ తరుపున ప్లేటో 'రిపబ్లిక్' గ్రందాన్ని ''ఆదర్శరాజ్యం'' పేరుతో తెలుగు చేశారు ''రాగరేఖలు'' నవలరాశారు

1992లో పరిస్థితులతో రాజీపడలేక కాలేజి ఉద్యోగానికి తిలోదకమిచ్చారు మళ్ళీ నిరుద్యోగం ఈ సమయంలో ''పాపికొండలు'' నవల ప్రారంబించారు అది దిన పత్రికలో సీరియల్‌గా వచ్చింది అధికారం మనుషుల్ని ఎలా మత్తుల్ని చేస్తుందో వివరించటం ఈ నవల ఇతివృత్తం ఇందులో కృష్ణరావు తన ఆలోచనా రీతులను వ్యంగ్య వైబవంతో నిక్షేపించారు ఇది ఒక రసగంగ స్వల్ప కాలం పొన్నూరు సంస్కృత కళాశాల ప్రిన్సిపల్‌గా పనిచేసి, కృష్ణరావు 1963లో ఆలిండియా రేడియో విజయవాడ కేంద్రంలో స్పోకెన్ వర్డ్ ప్రొడ్యూసర్‌గా పదవి నదిష్టించారు ఈసారి మాత్రం 1973లో పదవీ విరమణచేసేవరకు ఉద్యోగంలో కొనసాగారు రేడియో ఉద్యోగంలో ఉన్ననాడే భాస మహాకవి సంస్కృత నాటకం ప్రతిమ నాటకాన్ని తెలుగు చేశారు కొన్ని కవితలు, కదలు, సాహిత్య వ్యాసాలు చేర్చి ''ఉద బిందువులు'' సంపుటి ప్రచురించారు

రేడియో ఉద్యోగంతో కుంటుపడిన ''పాపికొండలు'' రచన కృష్ణరావు అనారోగ్య కారణాలవల్ల అర్ధంతరంగా ఆగిపోయింది ఇది తెలుగువారి దురదృష్టం 1979లో ''బొమ్మ ఏడ్చింది'' నాటకం వెలువడింది ఇది ఆర్యనాగార్జుననికీ, అప్పటి పాలకుడు గౌతమీ పుత్ర శాతకర్ణి, అతని తల్లి గౌతమీ బాలశ్రీకి సంబందించిన ఇతివృత్తంతో రాసిన నాటకం రాజ్యపాలకులు మత నిరపేక్షంగా రాజ్యం చేయాలని ఇందులో సందేశం

తెనాలిలోని శ్రీ అరవింద సాహిత్య సేవా సమితి ఆధ్వర్యంలో డాక్టర్ జి వి కృష్ణారావుకి తెనాలిలో మార్చి 30, 1979 తేదీన అప్పటి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అధ్యక్షులు శ్రీ బెజవాడ గోపాలరెడ్డి గారి అధ్యక్షతన ఘన సన్మానం కన్నుల పండువగా జరిగింది తరవాత వారు ఎక్కువ కాలం జీవించలేదు కృష్ణారావు ఆగష్టు 23, 1979 తేదీన తుది శ్వాస విడిచారు

## రచనల వైశిష్ట్యం

కృష్ణారావు సంస్కృతాంధ్ర ఆంగ్ల బాషల్లో విద్వాంసులు ఆయా భాషా సాహిత్యాల్లో నిష్ణాతులు వ్యాకరణ సూత్రాల్ని, అలంకార శాస్త్రాన్ని లోతుగా తరచి ఆకళింపు చేసుకొన్నవారు ప్రాచ్య పాశ్చాత్య తత్వ శాస్త్రాల్ని మధించిన వారు సామాజిక, రాజకీయనైతిక, మనోవైజ్ఞానిక శాస్త్రాల్ని అవలోడించిన వారు ప్రాక్ పశ్చిమ దేశాల విభిన్న సంస్కృతుల్ని అవగాహన చేసుకొన్నవారు అనన్య ప్రతిభావ్యుత్పత్తులతో, బహుముఖ పరిజ్ఞానంతో, సునిశిత ఆలోచనలతో కృష్ణారావు ఉత్తమ కవితల్ని, నాటక నాటికల్నీ, కదల్నీ, నవలల్ని, సాహిత్య విమర్శనా వ్యాసాల్నీ రచించి తమ సాహితీ చైత్ర రధాన్ని 1963 శోభాయమానం చేశారు ఆ పూదోట సర్వాంగ సుందరం, పరిమళభరితం

కృష్ణారావు జీవితాన్ని, రచనల్ని పరిశీలిస్తే వారి జీవితంలో, రచనల్లో అంతర్వాహినిగా భారతీయత ప్రవహించటం గోచరిస్తుంది ఎర్రగా, సన్నగా, పొడుగ్గా, గరుడనాసికతో, తీక్షణమయిన కనుదోయితో ఎప్పుడూ తెల్లని లాల్చీ, గ్లాస్కో ధోవతి ధరించి అచ్చం భారతీయుడుగా, ఆంధ్రుడుగా కృష్ణారావు కనపడేవారు వివిధ సంస్కృతుల్ని పరిశీలించి వారు చివరకి భారతీయ సంస్కృతి వైపే మొగ్గు చూపారు ఆంగ్లంతో పాటు సంస్కృతాంధ్రాలను చక్కగా చదువుకొన్నారు ప్రాచీన సంస్కృతాంధ్ర కవుల రచనల్ని సమీకరించారు మన సామాన్య ప్రజానీకం విలువలన్ని రామాయణ బారతాల నుంచి వారసత్వంగా వచ్చినవేనని అభిభాషించారు అలంకార శాస్త్రంలో భారతీయ ధ్వని సిద్ధాంతమే పరమ శిరోధార్యంగా భావించారు వారినాటికల్లో అనేకం భారతీయ సాంస్కృతిక ఇతివృత్తంలో కలవే నాగార్జున మాధ్యమిక వాదాన్ని అభిమానించారు బాస ప్రతిమ నాటకాన్ని అనువదించారు కళాపూర్ణోదయం మీద థీసిస్ రాశారు సృజనాత్మకరచన సద్యః పర నిర్వృతి నివ్వాలని భారతీయ లాక్షణికులతో ఏకీభవించారు అయితే బారతీయమంతా ఆమోదయోగ్యమని కృష్ణారావు భావించేవాడు ఏ విషయాన్నయినా కార్యకారణాలతో తర్కించి నిగ్గు తేల్చే హేతువాది కృష్ణారావు తన పరీక్షకి నిలబడిన వాటినే స్వీకరించారు మొదట మార్క్సిస్టు ప్రభావానికి లోనయ్యారు త్వరలోనే ఆ ప్రభావంనుంచి బయట పడ్డారు ''డమడమాలబండి'' నాటిక వారి కనువిప్పుకి రూపకల్పన వ్యష్టిలో సమిష్టినీ, సమిష్టిలో వ్యష్టిని గుర్తించినప్పుడే ఏ రాజకీయ

వ్యవస్థ అయినా అభ్యుదయం సాధిస్తుందని కృష్ణరావు భావించారు లేకపోతే అది వట్టి నినాదాల డమడమాలబండే అలాగే ''కార్యజగత్తు''లోని మార్క్సిస్టు దృష్టిమారి వారి సాహిత్య విమర్శనా ప్రతిభ కళాపూర్ణోదయ సిద్ధాంత గ్రంథంలో వెల్లి విరుస్తుంది

కృష్ణరావు ఆదర్శం దర్మం ఆశయం వ్యక్తి స్వాతంత్ర్యం ''దర్మం'' ధర్మం కోసమే, ఆదర్మమే మానవ జీవితం అంటారు కృష్ణరావు ''కీలుబొమ్మలు'' నవలలో ధర్మానుష్ఠానంలోనే ఆనందం ఉన్నదనుకొని చేసినప్పుడే వ్యక్తికీ, తద్వారా సమాజానికీ అభ్యుదయం సిద్ధిస్తుందని కృష్ణరావు విశ్వాసం వ్యక్తులకి స్వతంత్ర విచారం ఉండాలి వ్యక్తికి అంతఃకరణం ఉంటుంది అది వివేక చోదితం పరిస్థితులు చుట్టు ముట్టినప్పుడు ప్రతి వ్యక్తీ స్వతంత్రాలోచనతో తన అంతఃకరణం సాక్షిగా ప్రవర్తించి తన దర్మాన్ని తాను నిర్వర్తించాలి లేనినాడు అదర్మం ప్రవర్తిల్లి సమాజం సంక్షోభం చెందుతుంది ఇదే ''కీలుబొమ్మలు'' నవల సందేశం అంతేకాని వ్యక్తులు పరిస్థితుల కీలుబొమ్మలని కాదు వ్యక్తి ధర్మం లుప్తమై తేసే దేశం శష్టమవుతుంది వ్యక్తి స్వాతంత్ర్యాన్ని ఉద్దీప్తం చేయటం రచయిత బాద్యత అని కృష్ణరావు తలచారు ఈ వ్యక్తి స్వాతంత్ర్య చేతనే ''పాపికొండలు'' నవలలో మరింత స్పష్టమవుతుంది ఇందులోని కొన్ని పాత్రలు పరిస్థితులకు ఎదురునిలచి తాము నమ్మిన దర్మాన్ని అనుసరించి తమ వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకొంటాయి ''బొమ్మ ఏడ్చింది'' నాటకంలో ఆర్య నాగుర్జునల పాత్ర అలాంటిదే

కృష్ణరావు దృష్టిలో జీవితం, కళా వేరువేరు కావు అవి రెండూ ఒకటే జీవిత ప్రవాహానికి ఆద్యంతాలు లేవు అది అనంతం దాన్ని అర్ధం చేసుకోటానికి ఉపకరించే ఆద్యంత సహిత జీవిత శకలమే కళ – అంటారు వారు

కళాత్మకమైన రచన జీవితపు విలువల్ని నిర్దేశించి వెలుగునివ్వాలని కృష్ణరావు తాత్పర్యం విలువ అంటె ఏ వస్తువులో నయినా మన మెప్పుకి పాత్రమైన గుణం జీవితపు విలువలనేకం వాటిని ఆర్ధిక, నైతిక, సామాజిక, తాత్విక విలువలుగా వర్గీకరించవచ్చు విలువలకి ఆదిక్యతా క్రమం ఉంటుంది తాత్విక విలువలు పై విలువ లైతే ఆర్ధిక విలువలు కిందివి సామాజిక నైతిక విలువలది మద్యస్థానం బారతీయ సంస్కృతి తాత్విక విలువల్ని జీవిత ద్యేయాలుగా ఆదరించి జీవితావశ్యకాలైనా ఆర్ధిక విలువల్ని విస్మరించింది ఇది దారిద్ర్యానికి దారితీసిందనే అబియోగం ఉంది ఇది కృష్ణరావుని కలవర పెట్టింది డిగ్రీ పుచ్చుకొన్నతరువాత నిరుద్యోగం కర్కశ నిజమై చికాకు పరచింది వ్యాసుడు గుండెల్లోంచి పైకి వచ్చి శాపజలం అందుకొన్న దృశ్యం తళుక్కుమంది ''బిక్షాపాత్ర'' నాటిక ఆవిర్భవించింది అది ఆకలి పోలికేక మార్క్సిస్టు దృక్పదంతో ఆర్ధిక విలువల్ని హైలైట్ చేసిన రచన కృష్ణరావు నిజ జీవితంలో విలువల్ని అపారంగా గౌరవించారు నమ్మిన విలువల కొసం ఉద్యోగాల్ని తృణప్రాయంగా చూశారు కృష్ణరావు

దృష్టిలో విలువలన్నీ సమాదరణీయాలే వారి ''ఆదర్శ శిఖరాలు'' నాటికల సంపుటిలో నాటికలన్నీ విలువల దీప్తి రేఖలే ఈ సంపుటిలో మొదటిది ''భిక్షాపాత్ర'' చివరిది తాత్విక విలువల్ని ప్రతిపాదించే ''ఆదర్శ శిఖరాలు'' ఇది మహాశిల్పి జక్కణచార్యుల కద మధ్యలో వన్ని ఇతర విలువల్ని ప్రతిపాదించేవి ఇవన్నీ వ్యక్తి ధర్మాన్ని ప్రబోదించే విలువల వెలుగులు ఆర్థిక, నైతిక, సామాజిక, తాత్విక విలువల సమాహారాన్ని అనుభూతిలోకి తెచ్చుకొని మానవ వ్యక్తి సంపూర్ణ సమగ్ర చరతార్థత సంతరించుకోవాలని కృష్ణరావు ధ్వని

''బొమ్మ ఏడ్చింది'' నాటకం మతానికి విలవలకి సంబందించిన కొన్ని మౌలిక దార్శనిక విషయాలను స్పృశిస్తుంది మతం అంతిమ విలువ అది కొంత వైయక్తికం, కొంత నైతికం నైతిక విలువలూ ఒకవిధంగా సామాజికాలే అందువల్ల సామాజిక స్పర్శ ఉన్న మేరకు ప్రభుత్వం మతంతో ప్రమేయం కల్పించుకోవచ్చు ఆ పరిదిని దాటి రాజ్యం వాటి విలువలతో సంబందం పెట్టుకోరాదు ''బొమ్మ ఏడ్చింది'' నాటకంలో రాజు గౌతమీ పుత్రశాతకర్ణి హిందూ మతాను యాయి బౌద్ధుల్ని బాదిస్తాడు ఆర్య నాగార్జునల ఉపదేశం పెడచెవిని పెడతాడు నాగార్జునులకు దేశ బహిష్కరణ శిక్ష విదిస్తాడు ఈ అధర్మానికి బొమ్మ ఏడుస్తుంది ఈ బొమ్మ బౌద్ధుల ఆరాధ్య దేవత షట్పారమితాదేవి ఓ పాత్ర ద్వారా ''ఆ బొమ్మ మానవుల మనస్సుల్లో మెదిలిన నాడే లోకకళ్యాణం'' అంటారు కృష్ణరావు ఇది ప్రస్తుత సమాజానికి అన్యాప దేశమైన కర్తవ్య బోద

కృష్ణరావు కొన్ని సాహిత్య వ్యాసాల్ని, సాహిత్య విమర్శనా వ్యాసాల్ని, తాత్విక వ్యాసాల్నీ రచించారు వాటిలో వారి నిశిత మేధాశక్తి, సహేతుకత, అంతర్ దృష్టి అంతర్లీనంగా ద్యోతకమవుతుంది కృష్ణరావు శైలి తెలుగు నుడికారపు ఇంపుసొంపులకి పట్టు కొమ్మ

జీవితం నిరంతర స్రవంతి సమాజం నిత్య పరిణామ శీలం గలది వ్యక్తి యుక్తాయుక్త విచక్షణా జ్ఞానం కలవాడు బావజీవి సంస్కృతి పరంపరా గతమైంది సాహిత్యం సౌందర్య సంబంధి సౌందర్యం వస్తుగతం, హృదయ గతం కూడా ఇవన్నీ పరస్పర ఆశ్రితాలు కృ ష్ణరావు సాహిత్యం మానవసంబందాల్ని పరామర్శించి వాటిలోని అంతరార్థాన్ని వెలుగులోకి తెస్తూ, పాఠకుడిలో సమాధ్యవస్థ కల్పిస్తుంది ఆనందమిస్తుంది ఆలోచన రేకెత్తిస్తుంది లోకకల్యాణ మార్గం సూచిస్తుంది ఇది సహృదయ హృదయైక వేద్యం

# ప్రస్తావన

ఇది ప్రణయగాధ కాదు ప్రాచీన చరిత్రకాదు భారతీయ ధర్మవిశిష్టతాబోధకం కాదు. వ్యక్తులను కాని, పార్టీలనుకాని, వస్తున్న ఎన్నికలను కాని ఉద్దేశించి దీనిని వ్రాయలేదు. ఇంకా అపోహ ఉంటే బోజర్ వ్రాసిన ది పవర్ ఆఫ్ ఎలై అన్న రచన చూడటం మేలు అతడు ఈ దేశం వాడు కాడు ఈనాటి వాడూ కాడు. అయితే అతని రచన కిది అనువాదం కాదు అనుసరణమూ కాదు

ఈ రచన కళానుభూతే ప్రధానం. పార్టీ ఆవేశాలను సాధ్యమైనంతవరకు మరచి చదివినప్పుడే ఆ అనుభూతి ఇందులో సాధ్యం

తెనాలి

15 3 1951

జి. వి. కృష్ణరావు

---

జి వి కృష్ణరావు

పక్షద్వేషము ద్రాళ్ళు ద్రెంచుకొని పైపై దూక, స్వార్థమ్ము పా
లశేష మ్మొనరించి కాండ్రు మనుమున్ లంఘింప, దీన స్థితుల్
భిక్షాం దేహీ యటంచు హ్రాత్కృహార నిర్వేదంబుగా నార్వ, క
ర్మక్షేత్రంబున నెవ్వ,డింక గతి నిర్మాణంబు గావించునో!

లుప్తమ్ము లయ్యె ధర్మములు, లుప్తము లయ్యె నుదారవర్తనల్
లుప్తము లయ్యె స్నేహములు, లుప్తము లయ్యె కలా రసజ్ఞతల్
లుప్తము లయ్యె భావములు, లుప్తము లయ్యె విచారధారలున్
శప్తము శప్త మింక మనసా! దిగులొందకు మాతృభూమికై.

కీలుబొమ్మలు

# ..... ఒకటి . ...

మునిమాపు ఇంకా చీకట్లను విరబోసుకోలేదు. పుల్లయ్య చిరాకుతో గిత్తలను గదిమాడు. నిండుబండితో అవి గునుకు పరుగు లంకించుకొన్నవి పంచాయితీబోర్డు పుణ్యాన రోడ్డు పొడుగునా పూటీ గుంటలే! బండి అంతంతమాత్రంగా ఉన్నది. వేసినది ఏడుపలకల వడ్లు. బండి ఎక్కడ బోల్తాపడుతుందో! పూటీలు విరిగితే ఆ రాత్రి అక్కడే జాగారం చేయాలి. అసలు లేతగిత్తల గుండెలు చిక్కబడితేనో! పుల్లయ్య ఏమైనా సహిస్తాడు కాని వాటి ఇమ్ముదప్పుసహించలేడు. 'ఓ', ఓ బుజ్జగిస్తూ పగ్గాలు లాగి పట్టాడు

గునుకుపరుగు మాని గిత్తలు రుసరుస లాడుతూ పోతున్నవి. పైన నిర్మల నీలాకాశం. క్రింద ఎర్రని రోడ్డు. రోడ్డుపై అర్రులువంచి బండిలాగుతున్న తెల్లనిగిత్తలు. వాటి మెళ్ళల్లో నల్లని పట్టెడలు. కాళ్ళకు నల్లని వెంద్రుక త్రాళ్లు గిట్టలు తాకుతున్న కుచ్చుతోకలు. బండిమీద గోధుమవన్నె గోతాలు తొట్టిలో నీరుకాని తలపాగా చుట్టుకొని ఉన్న నిండు విగ్రహం. చల్లని గాలి పిట్టల కిలకిల ధ్వనులు గిత్తల మువ్వల ధ్వనులు మధ్యమధ్య బండి కిరకిరలు.

పుల్లయ్య ఆలోచనలో పడ్డాడు. నోరులేని పశువుల మీదనా కోపం? అసలు కోపం యెందుకు రావాలి? స్కూలు కమిటి అతనికి తెలియకుండానే సమావేశమై అమాయికుడైన ఉపాధ్యాయుణ్ణి తీసివేయటానికి నిశ్చయించింది. అతడు చేసిన తప్పేమిటి? కమిటీ మెంబరు కొడుక్కు పైవేటు చెప్పలేదనే గదా? ఇంతకన్నా అన్యాయం ఏముంది? అతడు వచ్చి పుల్లయ్యతో లబ్బున మొత్తుకొన్నాడు. ఉద్యోగం ఎక్కడో ఒకచోట దొరకకపోదు. కాని ఉన్న ఊరు వదలిపోతే అక్కడిచ్చే నాలుగు రాళ్ళతో సంసారం ఎలా గడుస్తుంది? ఇవన్నీ చెప్పుకొని అతడు పుల్లయ్య సాయం కోరాడు ఆటంకాలు వస్తాయని పుల్లయ్యకి తెలుసు. అందుకనే అతడు చూదాములే అన్నాడు. అనుకొన్నట్లుగానే కమిటీ అతనికి తెలియకుండా సమావేశం జరిపి ఉపాధ్యాయుణ్ణి తీసివేయటానికి తీర్మానించింది ఎంత అన్యాయం! అతన్ని లేకుండాచేసి ఈపని చేస్తారా! ఈనాడు ఈపని చేసినవాళ్ళు రేపు ఏపనిచేయరు?

పుల్లయ్య ఒక మాత్రాన తొణికేవాడు కాడు అంతకన్నా ప్రబల కారణం ఉన్నది. అతడు మారువాడీవద్ద చంద్రశేఖరానికి అయిదు వేలకు అడ్డమున్నాడు. ఆనాడు అతడు అడ్డం ఉండకపోతే మారువాడి డబ్బు ఇచ్చివుండేవాడు కాడు. అసలు పుల్లయ్య కూడా డబ్బు విషయంలో మానవమాత్రుడుడికి చోటు పెట్టడు. కాని ఆనాడు, రెండేళ్ళ క్రితం, ఏ గుణాన ఉన్నాడో చంద్రశేఖరానికి అడ్డమున్నాడు.

నాటి సంఘటనలు అతనికిప్పుడు కన్నులవుందు జరుగుతున్నట్టుగా ఉన్నాయి. చంద్రశేఖరమూ, అతడు పనిమీద బస్తీకి వెళ్ళారు. రాత్రి ఇద్దరూ హోటల్లో తృప్తిగా భోజనం

చేశారు తర్వాత వర్ధంటున్నా వినక శేఖరం పుల్లయ్యను నాటకానికి లాక్కొనివెళ్ళాడు ఆనాటి ఖర్చంతా శేఖరమే పెట్టుకొన్నాడు ఆ మరునాడు అతడు పుల్లయ్యసాయం కోరాడు అప్పటికి శేఖరం పని మూడుపువ్వులు ఆరుకాయలుగా ఉంది. ఊళ్ళో లక్షల పెటుటబడితో కాగిలాలమిల్లు ఝంఝామారుతంగా సాగిస్తున్నాడు అలాంటి ఆసామి నోరుతెరచి అయిదు వేలకు మారువాడి వద్ద తనకు అడ్డం ఉండవలసినదని అడిగాడు. పుల్లయ్య అప్పుడు కాదనలేక పోయాడు భార్య లక్ష్మమ్మ మొదటినుంచి చెవినిల్లు కట్టుకొని చెబుతూనే ఉన్నది ఆమెకు తెలియకుండా పుల్లయ్య శేఖరానికి అడ్డం ఉండటం జరిగిపోయింది. శేఖరం పూర్తిగా చితికిపోయాడని తెలిసింది మారువాడి తనకు రావలసిన అయిదేవేలు గూబలు పిండి మరి పుల్లయ్య వద్ద పుచ్చుకొంటాడు అందులో సందేహం ఏమాత్రం లేదు.

ఇప్పుడు పుల్లయ్యను బాధిస్తున్నది అయిదువేలు పోతాయని కాదు అలాంటి మొత్తాలు పదిపోయినా అతనికి లెక్కలేదు. కాని లక్ష్మమ్మకు ఈ సంగతి తెలిస్తే అతని మర్యాద దక్కదు. ఏడు లోకాలు ఎదుర్కొన్నా అతన్ని ఏమీ చేయలేవు కాని లక్ష్మమ్మ కనుబొమలు ముడివడితే మాత్రం గజగజలాడిపోతాడు. ఆమె సాధారణంగా మాట్లాడదు ఒకరి సొమ్ము ఆశించదు. తనది పూచికపుల్ల అయినా సరే బయటికి పోనీదు. ఈనాడు పుల్లయ్య యాభైవేలు తిప్పుతున్నాడంటే
2 సగం ఆమే కారణం. ముప్పైయేళ్ళనాడు కాపురానికి వస్తూ అయిదేవేలు కట్నం తెచ్చింది. వడ్డీపై వడ్డీలతో అవి మిగిలిని మొత్తం ఆమె పొదుపరితనంవల్ల, పసుపు వ్యాపారంలో వచ్చిన లాభంవల్లా పోగయింది అంతేకాదు, తండ్రి యిచ్చిపోయిన అయిదెకరాలు కాక పుల్లయ్య మరొక పదెకరాలు కొన్నాడు. ఊరు పెరుగున్నది. అందువల్ల ఊరికి ఆనుకొనిఉన్న మూడెకరాల మడి ఇళ్ళస్థలాలకి అడుగుతున్నారు. ఎట్లా లేదన్నా దాని మీద ఇరవైవేలకు పైగా వస్తుంది ఈ స్థితిలో అయిదు వేల నష్టానికి పుల్లయ్య అంత కాళ్ళు తొక్కుకోవలసిన పనిలేదు

కాని లక్ష్మమ్మ మండిపడుతుంది. తన అదృష్టాన్ని తిట్టుకొంటుంది. అంతలోకం కావాలనుకొంటే సన్యాసం పుచ్చుకొనక తన్నెందుకు కట్టుకొన్నావంటుంది. బిడ్డల నోట దుమ్ముకొడతావా అని యేడుస్తుంది. అంతటితో ఊరుకొంటే బాగానే ఉంటుంది కాని మళ్ళీ ఒక నెలరోజులదాకా భార్యాభర్తలకు మాట లుండవు మేఘసందేశాలు కావు కాని కుడ్యసందేశాలు ప్రారంభమౌతాయి. ఇవన్నీ జ్ఞప్తికి వచ్చి పుల్లయ్య కంపించిపోయాడు. ఇంతకంటే బాధకలిగించేది మరొకటి ఉన్నది.

పుల్లయ్య ఒకరి వలలో పడేవాడూకాడని ప్రసిద్ధి, పాషాణంనుంచి అయినా పాలు పిండుతాడని గ్రామస్థులకు గౌరవం శేఖరంవల్ల టోకరా తిన్నాడంటే ఊళ్లో ఎంత పలచదనం! కూడబెడుతున్న వారికున్న గౌరవం పల్లెటూళ్ళల్లో మరెవ్వరికీ ఉండదు పుల్లయ్యను ముఖ్యంగా చీకాకు పరుస్తున్నది ఇదే. ఇదే ఆలోచిస్తున్నాడు లక్ష్మమ్మతో ఏమి చెప్పాలి? ఊళ్ళో తన పేరు ప్రతిష్ఠలు ఎలా నిలబెట్టుకోవాలి? ఇవే అతన్ని పీడిస్తున్న సమస్యలు చంద్రశేఖరం దివాలా తీశాడని ఊరంతా కోడై కూస్తుంది.

మార్వాడీకి వ్రాసి యిచ్చిన ఋణపత్రంమీద శేఖరం మీ సంతకాన్ని ఫోర్జరీ చేశాడటనే! అని ఒకరిద్దరు అతన్ని అప్పుడే అడగటం కూడా అయింది ఆ మాటకు ఏమి సమాధానం చెప్పాలి? ఓడంటే కంచమంతా ఓడా? పుల్లయ్యకు నవ్వు వచ్చింది. కోపమూ వచ్చింది.

ఇంతలో దాపటి గిత్త మెడ క్రిందికి క్రుంగిపోయింది పుల్లయ్య తెప్పరిల్లి చూస్తే పగ్గాలు తొట్టిలోనుంచి జారి గిత్తగిట్టలో తగులుకొని ఉన్నాయి. అతడు చప్పున దిగి పగ్గాలు కాలినుంచి తప్పించి మరల తొట్లో ఎక్కి కూర్చున్నాడు బండి దొడ్లోకి పోగానే పశువులన్నీ లేచి పుల్లయ్యను చూచి అంబా అని అరిచాయి ఆ అరుపు వినగానే అతనికి ఎక్కడలేని సంతోషం వచ్చింది. నోరులేని పశువులైనా యెంత కృతజ్ఞత!

నౌకరులకు బండి అప్పగించి పుల్లయ్య వెళ్ళి వాకిటిముందు వాల్చిన్న మంచం మీద అడ్డం పడ్డాడు చల్లగాలికి ఆలోచన లన్నీ మరచి పండుకొన్నాడు 'బావు' మంటూ మనుమడు జగ్గారావు వెనకనుంచి వచ్చి తాత మెడకౌగలించుకొన్నాడు. ఆకౌగలింత అతన్ని ఎక్కడికో తీసుకువెళ్ళింది.

''అమ్మదొంగా, నువ్వా?''

''నాను, తాతయ్యా నాను ''

''నాచిట్టిబాబుగా ఇటురా!''

''లాను, లానంటే లాను.''

''ఎందుకని?''

''అమ్మా, దొంగలున్నాలుగా!''

''ఎక్కడ?''

''ఆ మీసాల్లో.''

''ఎవరు చెప్పారు?''

''అమ్మ.''

''ఛా!''

ప్రక్క వంట యింట్లో పని చేసుకొంటున్న రంగమ్మ ఇదంతా వింటూ కొడుకును పిలిచింది అతడు తల్లి పిలుపు వినిపించుకోకుండానే తాతయ్యతో మొదలెట్టాడు!

''నిజమే తాతయ్యా, నాయనమ్మను గూలా అలిగా ''

''ఏం చెప్పింది?''

''పగలంతా నోట్లో దాక్కుంతాలంత పొద్దుగూకంగానే ఆ మీసాల్లో ఉండి ముత్తుకుంతే గొంతు కోత్తాలంత.''

''అయితే ఆ దొంగలు నీగొంతు ఎన్నిసార్లు కోశారే అని నాయనమ్మను కనుక్కో.

''ఓ అలుగుతా. నాయనమ్మా నాయనమ్మా!''

''స్నానానికి వేడి నీళ్ళు తోడు పట్టించుకొని వస్తున్న లక్ష్మమ్మ ఏమిటని అడిగింది.''

''పెద్దదానివిగందా. చెప్పేవన్నీ అబద్ధాలే నంతే?''

---

జి.వి. కృష్ణరావు

''లక్ష్మమ్మ విస్తుపోయింది రొంట ఎడమచేయి మోసి కుడిచేయి గడ్డంక్రింద పెట్టుకొని మనమడి వంక చూస్తూ నిలబడ్డది.''

''మీసాలదొంగలు నీ గొంతు యెన్నిసాల్లు కోశాలే?''

''ఓరి పిడుగా! అని ముసిముసి నవ్వు నవ్వుకొంటూ ఆమె లోపలికి వెళ్ళింది ''

''ప్రొద్దు పోతున్నది, లే'' అని తండ్రిని ఆన్నానికి హెచ్చరించి కూతురు సీత, మారాము చేస్తున్న జగ్గారావును చంకకెత్తుకొని పోయి వదిన రంగమ్మ కిచ్చింది. ఆమె పిల్ల వాణ్ణి బుజ్జగించి తీసుకొని వెళ్ళి డాబాహాలులో వాల్చిన్న మంచంమీద నిద్ర పుచ్చింది.

స్నానం చేసివచ్చి కూర్చున్న త ండ్రి రపక్కన సీత కూడా భోజనానికి కూర్చుంది లక్ష్మమ్మ వడ్డిస్తూ ఉంది. ''సెలవులు పూర్తికావచ్చినవి త్వరలో నేను కాలేజికి వెళ్ళాలి'' అని సీత చెప్పింది

ఆమె పట్టణంలోని స్త్రీల కళాశాలలో ఇంటర్మీడియట్ చదువుతున్నది సెలవలకని ఇంటికి వచ్చింది తండ్రికి సీత ఒక కన్ను, చిన్న కొడుకు రామారావు మరొక కన్ను వీళ్ళను చూడందే పుల్లయ్య ఉండలేడు ఏ కారణంచేతనో సంవత్సరమున్నరనుంచి రామారావు ఇంటికి రావటంలేదు. ఎన్నోసార్లు ఇంటికి ఒకసారి వచ్చిపోవలసిందని ఉత్తరాలపై ఉత్తరాలు వ్రాశాడు కాని జవాబులేదు. అలా కాదని డబ్బు పంపటం మానుకొన్నాడు అయినా అతడు డబ్బుకోసం వ్రాయలేదు కాని
4 తలిదండ్రుల క్షేమం, చిరంజీవి జగ్గారావు క్షేమం అడుగుతూ నెల కొకసారి వ్రాస్తూవచ్చాడు తండ్రికి కొడుకు అంతర్యం అర్థం కాలేదు అర్థం చేసుకొనే తాహతుకూడా అతనికి లేదు సీత తన ప్రయాణం సంగతి హెచ్చరించగానే అతనికి కొడుకు సంగతి జ్ఞప్తికి వచ్చింది సీతకు రాముడి సంగతి తెలియదని అతనికి తెలుసు ఆ విషయం గడచిన పదిరోజుల్లో ఏ ఇరవై సార్లైనా చెప్పి ఉంటుంది అయినా కన్నకడుపు ఊరుకోనిచ్చింది కాదు అతడు మళ్ళీ అడిగాడు

''ఏమే సీతా! అన్నయ్య నీకు కనుపించడూ?''

''లేదు నాన్నా! ఎప్పుడన్నా ఒకసారి ఇలా వస్తాడు అలా పోతాడు ఏమీ చెప్పడు ''

''అసలు అక్కడ ఏమి చేస్తున్నాడు?''

''ఎవరికి తెలుసు? నోరు తెరచి అడిగినా చెప్పడు.''

''డబ్బు పంపటం లేదే – ఎలాగడుస్తున్నది? నీవేమైనా సర్దుతున్నావా?''

''నేనా?'' సీత తండ్రివంక నవ్వుతూ చూచింది.. .

''అలా చూస్తావేం, అతడు అన్నగాడా, నీవు చెల్లెలివి కావా?'' మజ్జిగ వడ్డిస్తున్న లక్ష్మమ్మ అప్పుడే అందుకొన్నది.

''దానికి ఎంత పంపిస్తున్నా రేమిటి?''

''అమ్మీ, నవ్వులాటలకంటూవుంటే ఎందుకంత కోపం?'' కాసేపు ఎవరూ మాట్లాడలేదు. పుల్లయ్య మళ్ళీ ప్రారంభించాడు.

''పట్నమంటే ఊరికినే ఉందా? కూర్చుంటే డబ్బు, లేస్తే డ బ్బుకావాలి? ఎట్లా గడుపుతున్నాడు? ఎక్కడైనా ఉద్యోగం సంపాయించాడా?''

''లేదు అప్పుడప్పుడు పత్రికలకు యేదైనా వ్రాస్తుంటాడు వాళ్ళేమైనా యిస్తారేమో తెలియదు ''

పుల్లయ్య ఆలోచనలో పడ్డాడు తల్లి అడిగింది.

''వాడి బస కెప్పుడైనా వెళ్ళి చూచి వచ్చావటే?''

''ఆ, మీ అన్న కట్టించి వుంచిన రాజభవనం ఉంది కదూ! అన్నాయి అందులోనే ఉంటున్నాడు ''

''మా అన్న మీ అన్నలాగ దేశమ్మ కాకి కాదు తిండికి, గుడ్డకూ వాచిపోవటం లేదు.'' లక్ష్మమ్మ మూతి మురకటించింది తండ్రి కూతుళ్ళు ఒక్కసారి నవ్వారు తల్లికి నిజంగా కోపం వస్తుందేమోనని భయపడి సీత అన్నది.

''అదికాదే! ఏణ్ణర్ధంనుంచి పోరాడుతూవస్తే ఒక్కసారి మాత్రం అన్నయ్య గదికి వెళ్ళగలిగాను. అటు మంచం ఇటు తిప్పటానికైనా సందులేదు. ఆ గదిలో గాలి తప్ప అన్నీ ఉన్నాయి.''

''ఇంకే మున్నాయి?'' తండ్రి అడిగాడు

''దోమలు, కాల్చి పడేసిన సిగరెట్టు పీకలు, చిందర వందరగా పుస్తకాలు. డోకు వచ్చినంత పని అయింది అన్నయ్య నవ్వి వెంటనే నన్ను బస్సు ఎక్కించి పంపివేశాడు.''

''పోయిందానివి గది కాస్త ఊడిస్తే కాకపోయిందా?''

''నిజమేనే, వెళ్ళేటప్పుడు చీపురుకట్ట ఒకటి పట్టుకుపోవలసింది. మరచిపోయాను. ఇప్పుడైనా మునుచుకుపోయిన దేమున్నదిలే నేను వెళ్ళుతున్నానా, వెళ్ళిన తరువాత ఒకటి పార్సెలు చేసి పంపించు ''

''ఇన్నేళ్ళు వచ్చాయి అత్తగారిచేత గాని ఆడబిడ్డచేత గాని ఒకమాట అనిపించుకోలేదు. ఇవ్వాళ కన్నబిడ్డచేత పడవలసి వచ్చింది. ఔనులే, అక్షరం ముక్క లేదనేగా మీ యిద్దరి ఎద్దేవన!''

భోజనాలు ముగించుకొని ఇద్దరూ లేచారు.

సీతకు తండ్రి అన్నా, అన్న అన్నా ప్రాణాలు లేచి వస్తాయి. లోకంలో ఆమె ద ష్టికి ఆ యిద్దరిలాంటివాళ్ళు లేరు. ముఖ్యంగా తండ్రి ధర్మస్వరూపుడు. దయామయుడు. తెలివి తేటల్లో అతనికి సరివచ్చేవాళ్ళు ఆ ఊళ్ళోనే లేరని ఆమె నమ్మకం చంద్రశేఖరం తన తండ్రిని అయిదువేలకు ముంచాడని ఎవరో అనుకుంటే విన్నది మునగటానికి ఆయన అంతతెలివితక్కువవాడా? తల్లికి ఆ సంగతి తెలియదు. తెలిస్తే లగ్గలకెక్కి ఉండేది తండ్రి ఆమెమీద రంకెలువేసే ఉండేవాడు ఇదంతా సీతకు ఏమాత్రం ఇష్టంలేదు. ముందుగా తండ్రిని కనుక్కోకుండా తల్లిని అడగగూడదు. ఇంతవరకు తండ్రికోసం ఎదురు చూస్తూ వుంది. తండ్రివచ్చాడు కాని ఒంటరిగా మాట్లాడటానికి అదను దొరకలేదు.

సీత ఇదే ఆలోచిస్తూ పండుకొన్నది తండ్రి దొడ్లోని పశువులకు మేతవేయించి వచ్చి గదిలో పడుకొన్న అలికిడి వినిపించింది తల్లి, వదినె వంటింట్లో ఏదో సద్దుతున్నారు అదే సమయమని సీత మెల్లగా గదిలోకివెళ్ళి, తండ్రి తలగడ వద్దకూర్చున్నది అతడు కళ్ళుమూసుకొని ఉన్నాడు.

అయినా వచ్చింది సీత అని తెలుసు ఎందుకే వచ్చావు? అని అడిగాడు సీత మాట్లాడలా తల్లికి తెలియకుండా డబ్బు అడుగుదామని వచ్చి ఉంటుందనుకొన్నాడు. ఆమెచేతనే అడిగించాలని మాట్లాడలేదు. నిద్రవస్తున్నట్లుంది. నేను వెళుతున్నానంటూ ఆమె లేచింది అబ్బా ఏమి ఎత్తు, నా చేతనే అడిగించదలచింది, ఇప్పటికారుతో సరితూగలేము సుమా! అనుకొన్నాడు తన ఓటమి అంగీకరించటం ఇష్టంలేదు. ఊరుకొంటే వచ్చిన సంగతి చెప్పకుండానే పోతుంది. ఎందుకు వచ్చి ఉంటుంది? కుతూహలం ఆపుకోలేక అడిగాడు.

"ఆ ఏమీ లేదు. చంద్ర శేఖరానికి మువ్వు అడ్డం ఉన్నావటగా?" అన్నది సీత

"ఎవ రన్నారు?"

"లోకులు అనుకొంటున్నారు."

అప్పటికే పుల్లయ్యకు నిద్రమత్తు ఆవరిస్తూ ఉంది

"లోకులకు మరి పనిపాటులేమున్నాయి?"

ఈమాట వినగానే సీతకు రొమ్ముకుంపటి దించినట్లయింది హృదయం సంతోషంతో పరవళ్ళుతొక్కింది తండ్రి అసలు మాట జారనీడు పొరపాటున జారినా ఆరుమూడయ్యేది నిలుపుకొని తీరుతాడు. లోకంలో మాట నిపుకోగలిగిన వాళ్ళు ఎంత మంది ఉన్నారు? పెదవులమీద అమృతం హృదయంలో కాకోలం సూనృతంతోనే తండ్రి పుట్టాడు. కాదు, తండ్రి తరువాతనే సూన తం పుట్టింది.



సీతకు చంద్ర శేఖరం సుందరరూపం జ్ఞప్తికి వచ్చింది ఋజువర్తనానికి సౌందర్యానికి ఎంతదూరం! లక్ష్మీ సరస్వతుల వలెనే ధర్మ సౌందర్యాలు ఒకేచోట ఉండవు కాబోలు! ఎంత విత్రం. ఇక అతని గతి ఏమౌతుంది? మూరువాడి ఊరుకోడు అయిదువేల రూపాయలు పోగొట్టుకొంటాడా? తండ్రి శేఖరంగారిమీద ఫోర్జరీకేసు బనాయిస్తాడు అప్పుడు శేఖరంగారికి శిక్షపడక తప్పదు. అవును అంతే కావాలి. లేకపోతే, ప్రపంచమేమైపోతుంది? అందరూ మోసగాళ్ళే అయితే, లోకం ఎలా సాగుతుంది? క్రమం ఎలా ఉంటుంది? క్రమం, నీతి లేకపోతే బ్రతుకు దుర్భరంకాదా? అసలు ఇలాంటి అవినీతి ఎలా వస్తున్నది? అది మానవ స్వభావమా? స్వభావమే నంటే నీతేలేదు. కాదంటే మధ్యలో ఎలా వచ్చింది? సీత ఆలోచించలేకపోయింది తత్త్వవేత్తలకు తేలనివిషయాలు ఆమెమాత్రం ఎలా పరిష్కరిస్తుంది?

సీతకు శేఖరం భార్య లలిత జ్ఞప్తికి వచ్చింది ఇప్పటికే ముగ్గురు పిల్లలు ఈ మూడు నాలుగు నెలలుపోతే మళ్ళీకనబోతున్నది శేఖరంగారికి శిక్ష ఆమె ఏమౌతుంది? మరి ఆ పిల్లలగతి? పాపం దిక్కులేని పక్షులైపోతారు కామాలు! ఎంతగా బ్రతికిన వాళ్ళకు ఎలాంటిగతి పడుతున్నది. ఆమె ఆ కుటుంబ విషయం ఆలోచించలేకపోయింది మనస్సు తిరిగి తండ్రివైపు మళ్ళింది. అతడు అడ్డం ఉండలేదు. అవినీతి కూపంలో పడలేదు. ఇవాళ లేచినవేళ మంచిది సీత సంతోషం పట్టలేకపోయింది. ఎవరికైనా చెప్పాలి. ఆ రాత్రివేళ యెవరికి చెబుతుంది? వదినె నిద్రపోతున్నది అన్నగారు కలవరిస్తున్నాడు. దొడ్లో పెద్దవాళ్ళు ఎవరూ లేరు పోయి తన పక్కమీద పడుకొన్నది. నిద్రపట్టక చాలా సేపు దొర్లింది.

చీకటి ఉండగానే పుల్లయ్యలేచి జీతగాళ్ళకు పని పురమాయించి, దూళ్ళను పాలకు విడిచాడు కాలకృత్యాలు తీర్చుకొని బయటికి పోతుండగా ''ఆచారిగారిని ఒకసారి ఇంటికి రమ్మని చెప్పమంటినే, చెప్పావా?'' – లక్ష్మమ్మ అడిగింది కొత్తధాన్యం ఇంటికిరాగానే ఆంజనేయస్వామికి అప్పాలు పోయించటం ఆ యిల్లాలికి ఆచారం అందుకే ఆచారిగారికి గుర్తుచేయవలసిందని నిన్ననే భర్తకు చెప్పింది పుల్లయ్యకు ఆచారి కనిపించాడు కాని, నిన్నటి యెదురు దెబ్బల చిరాకుతో మరిచిపోయాడు లేదు, గురుతే ఉన్నది కాని చెప్పలేదు, లక్ష్మమ్మ ప్రశ్నకు పుల్లయ్య మాటాడలేదు. ఒక క్షణం కోపంగా చూచి గిరుక్కున లోపలికి పోయింది తెప్పరిల్లుకోటానికి కొంతసేపు పట్టింది ముఖం తుడుచుకొంటూ అతడు దొడ్లోకి వెళ్ళాడు

అక్కడ రామయ్య, కుశాలయ్య పాతబ్లోకి గడ్డి కట్టలు కడుతూ ఏయే చేను ఎలా రాలుతున్నదో చెప్పుకొంటున్నారు. వాళ్ళిద్దరికీ చెరొక ఎకరమూ ఉంది. సొంత సేద్యానికి ఎద్దూ మొద్దూ లేదు అందువల్ల పుల్లయ్య పనిపాటల్లో తిరిగి తమ ధాన్యం కూడా ఇంటికి చేర్చుకొంటూ ఉంటారు పుల్లయ్య రాగానే, ''చంద్రశేఖరంగారికి మీరు అడ్డం ఉండలేదటగా?'' అని అడిగారు. ఇంటిలోని సంఘటనవల్ల అతడు వెంటనే సమాధానం చెప్పలేదు. దానినిబట్టి అది నిజమే ననుకొన్నారు ''ఈదెబ్బతో మల్లతిండి, ముంతనీళ్ళు తప్పవులే'' అంటూ నవ్వారు. ''మీ కెవరు చెప్పారు? '' అని పుల్లయ్య అడిగాడు. ''బసవాచారి ఉండగానే అమ్మాయి చెప్పిందన్నారు.''

''బసవాచారి వచ్చి వెళ్ళాడా?''

అవునంటూ తల ఊపారు

ఇప్పుడే వస్తా నంటూ పుల్లయ్య బజారుకు వచ్చాడు బసవాచారినోట నువ్వుగింజ నానదు. అతన్ని అలాగే పోనిస్తే శేఖరానికి హామీ ఉండలేదన్న సంగతి ఊరంతా పాకుతుంది. అప్పుడు అతనిమాట పోదా? తిరిగి ఎలా తల ఎత్తుకొంటాడు? అసలు పొరపాటు ఎలా జరిగింది? రాత్రి సీతతో ఏమి చెప్పాడు? అతనిమాట సీత అపార్థం చేసుకొన్నది దాని వల్లనే ఈ మాట పుట్టింది. ఎలాగైనాసరే దీన్ని త్రుంచి వేయాలి. దూరంగా వీధి మలుపులో బసవాచారి కనిపించాడు. కేకలు పెడుతూ అతడు బసవాచారివైపు గబగబా నడిచాడు. దాటిపోతాడేమో నన్న భయంతో వయసునన్నా చూడకుండా కొంతదూరం పరుగెత్తాడు ఇంతలో గుర్రపు బండి పోతూఉంటే ఆచారి అందులో ఎక్కాడు బండి వెంట పుల్లయ్య ఎలా పరుగెత్తుతాడు? అతనికి కోపంవచ్చింది. అసలు సంగతి వదిలి, ''బండి బాగుచేస్తానని డబ్బు పట్టుకెళ్ళి ఎంత కాలమయింది? ఇదిగో అదిగో అంటున్నావా? నీ అంతు తేల్చకపోతే నా పేరు పుల్లయ్య కాదు!'' అని కేక వేశాడు. ఈ మాట మాత్రమే బండిలో పోతున్న బసవాచారికి వినిపించింది ఆ ఆసామికి తనమీద అంతకోపం ఎందుకు వచ్చిందో అర్థం కాలేదు విస్తుపోయి అలాగే చూస్తూ కూర్చున్నాడు కొరడా దెబ్బతిన్న గుర్రం దౌడుతీసింది ఎర్రబారిన ముఖంతో పుల్లయ్య ఉత్తుంగ శిలావిగ్రహంలాగా నడివీధిలో నిలబడిపోయాడు.

7

---

జి వి కృష్ణరావు

## .. .. రెండు . ...

పొద్దు నెత్తిమీదకి వచ్చింది సూర్పిళ్ళతరుణం పెద్ద వాళ్ళెవరూ ఇళ్ళవద్దలేరు. విద్యార్థులు బడులకు పోయారు లైబ్రరీవద్ద కాని, రచ్చబండవద్ద కాని, వీధుల్లోకాని సందడి లేదు. ఆడవాళ్ళు ఇంటిపనులు తీర్చుకొని చాపలమీద నడుములు వాల్చారు. అప్పుడప్పుడు చెట్లమీదనుంచి కాకుల అరుపులు, ధాన్యం చేరవేసే బళ్ళుచప్పుళ్ళు మాత్రం వినిపిస్తున్నవి.

సత్యనారాయణ పంతులు భోజనంచేసి వచ్చి లెక్క పనిచూడటానికి పుల్లయ్య డాబాగదిలో వ్రాతబల్ల ముందు పెట్టుకొని కూర్చున్నాడు ఇంతలోనే లోపలి నుంచి ''పంతులూ!'' అన్న కేక వినిపించింది అతడు ఉలిక్కి పడ్డాడు దానికి కారణం లేకపోలేదు తన తండ్రి అనంతరం తాను పుల్లయ్యగారివద్ద గుమస్తాగిరికి కుదిరినప్పటినుంచీ లక్ష్మమ్మ తన్ను పిలిచి కాని, పని చెప్పి గాని ఎరగదు ఈ పిలుపు అతనికి ఆశ్చర్యం కలిగించింది. ''ఇదిగో వస్తున్నా నండీ'' అంటూ వ్రాస్తున్న పుస్తకాలు సర్ది లేచేలోపల వాకిట్లో ఆమె ప్రత్యక్షమయింది.



''పంతులూ!''

''ఏమండీ!''

'' మీ షావుకారు చంద్రశేఖరం గారికి పదివేలు అడ్డముండి ఇప్పించాడటగా?'' నిజమేమిటో తేల్చుకొందామని ఆమె అడిగింది ఎక్కడో ఏదో పొరపాటు వచ్చిందని పంతులు పసికట్టాడు అయితే ఆ పొరపాటు ఏమిటో తెలుసుకోకుండా జవాబు చెబితే మళ్ళీ నెత్తిమీదికి ఏమి వస్తుందో? ఆలోచించటానికి వ్యవధి కావాలి

''ఎవరన్నారండి?''

''కుండ మూయటానికి మూకుడున్నదిగాని లోకాన్ని మూయటానికి ఏమున్నది?''

సత్యనారాయణ మాట్లాడలేదు. ఆమె మళ్ళీ అందుకొన్నది.

''దాపరికం దేనికి? మీ షావుకారే సీతకు చెప్పాడు ''

''వారే చెబితే నన్ను అడగటం దేనికి!'' పంతులు మెల్లగా నవ్వాడు.

''చక్కగా జతకుదిరింది! షావుకారుకు తగ్గ గుమాస్తా, గుమాస్తాకు తగ్గ షావుకారు.''

సత్యనారాయణ మనసు నొచ్చుకున్నది దాన్ని లోలోపలనే అణచుకొన్నాడు

లక్ష్మమ్మ హృదయాన్ని ఆపుకోలేక ఒక్కసారిగా పొంగింది.

''పంతులూ, నిజంచెప్పు మీ నాయనగారు ఎంతో మంచివారు. కష్టనిష్ఠురాలకు ఆదుకొనేవారు కేవలం మెప్పుకోసం చెబుతున్న మాటలు కావు నలుగురు కట్టిన ఇంట్లో ఉండి చెబుతున్నా నీకూ మీ తండ్రి గుణాలే వచ్చాయి ఏడు సంవత్సరాలనుంచి ఈ ఇంటిలెక్కలన్నీ నీ చేతి మీదుగానే నడుస్తున్నాయి అలాంటప్పుడు నీకు తెలియని రహస్యాలేముంటాయి? నాబిడ్డల్లో

నువ్వొ ఒకడ వనుకొంటున్నా ఇప్పుడయినా నిజంచెప్పు పంతులూ! మీ షావుకారు శేఖరం గారికి హామీ ఉండలేదట. హామీ ఉన్నట్లు ఆయన పత్రాలు సృష్టించి మారువాడికి ఇచ్చాడట. ఈ సంగతి ఇవాళే మీ షావుకారు అమ్మాయికి చెప్పాడు అమ్మా, ఎంత పనికి ఒడికట్టాడు! నా పిల్లల్ని అన్యాయం చేయటానికి సిద్ధమయ్యాడుగా! అతడికి చేతులు ఎట్లావచ్చాయో? అతనికి పిల్ల జెల్లా ఉన్నారే! మెత్తని వాళ్ళను చూస్తే ఎవరికైనా ఒత్తబుద్ధి పుడుతుందట నోట్లో నాలుక లేదని శేఖరం ఇంత అన్యాయం తలపెడుతాడా? మీ షావుకారు ఎందుకు ఊరుకొన్నాడు? నీవుమాత్రం ఎందుకు చెప్పలేదు? వకీలుకు చెప్పి ఎందుకు నోటీసు ఇప్పించలేదు?''

సత్యనారాయణకు ఊపిరాడలేదు ఆమెకు ఏమిచెప్పాలో అర్థంకాలేదు పుల్లయ్యగారి ఉద్దేశమేమిటో? ఏమంటే ఏమి మెడకు చుట్టుకొంటుందో? షావుకారు అభిప్రాయం తెలుసుకొన్న తరువాతనే చూచుకోవచ్చునని అతడు మాట్లాడలేదు. పంతులు మౌనముద్రనుబట్టి ఆమె అదంతా నిజమనుకొన్నది ఆమె భావనావీధిలో అనదలై రామారావు, సీత తిండికీ, గుడ్డకూ వాచిపోతున్నట్లు కనిపించారు ఒళ్ళు జలదరించింది. వెంటనే బాడుగ బండిని పిలిపించి అందులో ఎక్కి పోతూ సత్యనారాయణను వెంట రమ్మన్నది. ఎక్కడకని అతడు అడిగాడు. అన్నకొడుకు వద్దకని చెప్పింది అర్థంలో కనిపించినట్లుగా అంతా అతనికి పొడకట్టింది అందులో చిక్కుకొనటం ఇష్టంలేక అతడు పనిసాకు చెప్పి తప్పుకొన్నాడు బాడుగబండి చూస్తూ ఉండగానే దాటిపోయింది ఆ దృశ్యం సత్యనారాయణకు ఆశ్చర్యం కలిగించింది తండ్రి పుల్లయ్య దగ్గర తన్ను గుమస్తాగి రికి కుదిర్చిన తరువాత ఇన్నాళ్ళకు కొత్తవిశేషం జరుగుతూ ఉంది. పుల్లయ్య అతన్ని కన్నులకు అద్దుకొంటూ ఉంటాడు. తడు సాధారణంగా పుల్లయ్యను ఏమీ అడగడు ఎప్పుడైనా ఏదన్నా అడిగినా అతడు కాదనడు. ఏటేటా రెండుపుట్లధాన్యం ఇంటికి తోలిపెడుతూ ఉంటాడు తాను అతనికి లెక్కలు వ్రాస్తూ ఉంటాడు పసుపు వ్యాపారం, వడ్డీవ్యాపారం ఈ రెంటితో జరగవలసిన వ్రాతకోతలు అతడే చూస్తూ ఉంటాడు లాభం వచ్చినయేడు అణావంతు అతనికి ఇస్తాడు లక్ష్మమ్మకూడా అతన్ని కనిపెట్టి చూస్తూ ఉంటుంది పొలంనుంచి కూరగాయలు ఇంటికి రాగానే నాలుగోవంతు జీతగాడిచేతికి ఇచ్చి పంతులింటికి పంపిస్తుంది పెరుగూ మజ్జిగా అక్కడనుంచే వెళ్లుతాయి. షావుకారు అతనిమీద ఎంతో నమ్మకం. వేలకొలది మరొకచోట ఇచ్చిరావలసినా, తెవలసినా అతన్నే పంపుతాడు ఇచ్చిపుచ్చుకోళ్ళలో అతనికి తెలియని రహస్యమంటూ లేదు.

చంద్రశేఖరంగారికి హామీమాట ఏమిటి? పంతులు తీరికగా ఆలోచించాడు. మొదట ఏమీ జ్ఞప్తికి రాలేదు తరువాత తరువాత కొంచెంకొంచెంగా స్ఫురించింది. రెండేండ్ల నాటి మాట. ఎయట జోరున వర్షం కురుస్తూవుంది అతడు ఆ గదిలోనే కూర్చుని యేవో పద్దులు వ్రాస్తున్నాడు పుల్లయ్యగారు గోడకు చేరగిలబడి, ''నిన్న ఒక పొరపాటు జరిగింది పంతులూ!'' అన్నాడు. ఏమిటని అతడు అడిగాడు చంద్రశేఖరానికి మారువాడీవద్ద తాను అయిదువేలకు హామీ ఉన్నానన్నాడు. ఒకరికి అడ్డం ఉండటం కన్నా తప్పు మరి లేదన్నాడు ''అయిందేదో అయిపోయింది ఇప్పుడనుకొని లాభమేమిటి?'' అని పుల్లయ్యగారు అన్నారు. ''అయితే లెక్క వ్రాయమంటారా?''

జి వి. కృష్ణరావు

అవి అప్పుడే అడిగాడు. ''ఎలా పోయి ఎలా వస్తుందో, అనామత్తులో వ్రాయండి,'' అని ఆయన అన్నాడు. ఆ పుస్తకాలన్నీ యిప్పుడు లోపలి బీరువాలో ఉన్నాయి. తన చేతిమీదుగానే అతడు అనామత్తులో ఖర్చు వ్రాశాడు.

ఇప్పుడిదంతా యేమిటి? పంతులకు అర్థం కాలేదు పీక పోతున్నా పుల్లయ్యగారు అబద్ధ మాడడు. అలాంటివాడే అయితే ఆయన ఇప్పటికంటే ఎంతో లాభించి ఉండేవాడు మరి ఈ వ్యవహార మేమిటి? మాట పట్టింపులు వచ్చాయా? అవకాశం లేదే! పగ సాధించటానికి పూనుకొన్నాడా? తెలిసినంతలో అదీ కనిపించటం లేదు. ఇదంతా ఏమిటి? ఎక్కడో పొరపాటు జరిగి ఉంటుంది, పుల్లయ్యగారే సర్దుకొంటారు. దీనితో అతనికి సంబంధంలేదు ఒకవేళ మరచి పోయాడేమో! గుర్తు చేయటం అతని ధర్మం కాదా? ఆయనకు కోపం వస్తేనో! గంపెడు సంసారం ఎలా ఈదాలి? ఇప్పుడు అంతగా మించిపోయింది ఏమీ లేదు అతడు బాగానే వ్యవహరించాడు లక్ష్మమ్మతో వెళ్ళక పోవటమే మంచి దయింది లేకపోతే ఆమెను అతడే ఎక్కడోలి ఈ పని చేయించాడని ఆయన అనుమానపడి ఉండేవాడు అన్న కొడుకు వద్దకు ఎందుకు పోయినట్లు? ఆ, శేషగిరి అడ్వొకేటు. ఒకవేళ చంద్రశేఖరం గారికి నోటీసు ఇప్పిస్తుందా కొంపతీసి అలాగేచేస్తే వ్యవహారం ముదురుతుందే! ఈమెను ఆపి ఉంటే ఎంతో బాగుండేది అయినా అతడు చెబితే ఆగుతుందా? పైగా అనుమానించి ఉండేది అప్పటిదాక అతని మీద ఉంటున్న అభిమానం
10 అంతరించేది.

ఏది ఎలా ఉన్నా ఆనాడేదో కానిపని జరుగుతూంటే ఊరుకొన్నట్లుగా సత్యనారాయణను అంతరాత్మ బాధించమొదలు పెట్టింది. దానితో మనస్సు సరిలేక లెక్కలు కట్టిపెట్టి ఇంటికి పోయాడు.

ఆ రాత్రి పుల్లయ్యకు అన్నం సీత వడ్డించింది భార్య శేషగిరిని చూడటానికి పోయిందని విన్నాడు. అతనికి ఎక్కడ లేని కోపం వచ్చింది ఆడది పెత్తనం కట్టుకొని వ్యవహరిస్తుంధా? గదిలోకి వెళ్ళి ''యేయ్'' అని గర్జించాడు ఏదో ముంచుకు వచ్చిందని సీత, రంగమ్మపసికట్టి గడగడ లాడిపోయారు. పుల్లయ్యతో అప్పుడు మాట్లాడటానికి ఆ యిద్దరిలో ఎవరికీ గుండె చాలదు అసలు అతని ముందుకు వెళ్ళలేరు. పుల్లయ్య భార్యను ఆపాదమస్తకం చురుచుర చూశాడు. ఆమె అణుమాత్రమైనా చలించలా.

''ఎక్కడకు వెళ్ళింది?''

''శేషగిరి వద్దకు.''

''దేనికి? ఇంకా నేను బతికే ఉన్నానే?''

''కనిపిస్తూనే ఉంది ''

లాగి చెంపపెట్టు పెట్టటానికి పుల్లయ్య చేయి ఎత్తాడు. అంతలోనే తన్ను తానే తమాయించుకొని కోపంతో కంపించి పోతున్నాడు ''అవును తప్పేముంది? మనలో మెత్తదనం చూచి తప్పుడు నోట్లు వ్రాసి పిల్లల నోటికాడే కూడు తీస్తూ ఉంటే ఆపుతున్నాను. ఏమిటి తప్పు? శేషగిరిచేత నోటీసు ఇప్పించాను. బిడ్డల సొమ్ము పారవేయటానికి మీ రెవరు? మీకున్నంత అధికారం నాకూ ఉంది.''

---

ఇక కొట్టి ప్రయోజనమేమిటి? పుల్లయ్య ఇంట్లో నుంచి వెళ్ళిపోయాడు. ఇంత జరగటానికి తానే కారణం, సీతకు స్పష్టంగా చెప్పి ఉంటే యీ అబద్ధం రామయ్యకూ, కుశాలుకూ చెప్పి ఉండేది కాదు బసవాచారి ఊరంతా టమ టమా వేసి ఉండేవాడు కాదు. భార్య ఈ పని చేసి ఉండకపోను. ఆమెను కొడితే నలుగురు అమ్మలక్కలు ఆడిపోసుకోవటం తప్ప ఏమిటి లాభం? నోటీసు జారీ అయితే ఊరంతా మరీ గుప్పుమంటుంది. అప్పుడు తన పేరు ప్రతిష్ఠలు ఏమవులాయి? ఇప్పుడే శేషగిరి వద్దకు పోతేనో? అతడు ఇంకా నోటీసు వ్రాసి ఉండడు బహుశా రేపు పంపిస్తాడేమో! జరిగిన దంతా అతనికి చెప్పాలి నిన్నగాక మొన్న తన కళ్ళముందు పుట్టిన శేషగిరికి తాను చెప్పుకోవాలా? ఎంత పలచదనం! ఇంతకూ నోటీసు ఇచ్చి ఉంటేనో? తానుపోయి అంతా వట్టిదేనని చెప్పాలి నలుగురిలో భార్య నగుబాటు పాలవుతుంది లోకం తన్ను చూచి నవ్వితే ఒకటీ, తనభార్యను చూచి నవ్వితే మరొకటీనా?

చంద్రశేఖరం వద్దకు పోయి పొరపాటు చెప్ప బ్రతిమాలుకొంటే మేలేమో? దుర్భరం. అక్కరకు ఆదుకొన్నందుకు అతని కాళ్ళు పట్టుకోవాలా? ఛీ, ఆ దరిద్రుడికి అద్దం ఉండటమే అసలు తప్పు ఆ తప్పు వల్లనే తన పెద్దకొడుకు చచ్చిపోయాడు కొడుకు చావుకీ, తాను అతనికి సాయం చేయటానికి సంబంధ మేమిటి?

ఇంతకూ ఆరోంపినుంచి బయటపడే మార్గం కనిపించలేదు "కాని ఏదో ఒకటి కనిపించక పోతుందా!" అని పుల్లయ్య నాటికి రట పొందాడు



జి వి కృష్ణరావు

## .... మూడు . ..

పిండారబోసినట్లు వెన్నెల కాస్తూ ఉంది. చలిగాలి సాగుతున్నది కీచురాళ్ళ.ఎలుగులు వినిపిస్తున్నవి రోడ్డుకు రెండు ప్రక్కల పచ్చలు ఆరబోసినట్లుగా జనుపచేలు. నిర్భాగ్యుల ఆశారేఖలవలె మిణుగురు పురుగుల మిలమిలలు, కల్లాలలోనుంచి చెదురాటుగా ఏలపాటలు

'' ఎవరది?'' రాశిపై కప్పిన గడ్డిలోనుంచి తలయెత్తి కుశాలయ్య రోడ్డున పోతున్న వ్యక్తిని పలకరించాడు

''నేనే, చంద్రశేఖరాన్ని ''

'' మీరా! నడచి వస్తున్నారేం?''

''బస్తీలోనే పొద్దు గూకింది బళ్ళు లేవు.''

తన సమాధానం చంద్రశేఖరానికే కష్టం కలిగించింది పై చెట్టువద్ద బండి దిగి చల్లగాలికి నడిచి వస్తున్నానని చెప్పలేదే అని నాలుక కరచుకొన్నాడు వెనక అయితే ఇలా చెప్పినందుకు నొచ్చుకొని ఉండేవాడు కాదు. అప్పుడు ఒకరి ఇష్టానిష్టాలతో పనిలేదు హృదయం ఎలా చెబితే అలా చేసేవాడు. ఇవాళమాత్రం ఎందుకు పాటించాలి? వెనక ఏదో మార్పు వచ్చింది ఏమిటి ఆ మార్పు? శేఖరం తెలియకుండానే తన చరిత్రను ఒకసారి తిరగ వేసుకొన్నాడు

శేఖరం తల్లిదండ్రులు కలవాళ్లు ఒకళ్లకు పెట్టటానికీ, తాము తినటానికీ తగినంత ఉంది తండ్రి విద్యాభిమాని కొడుకును చదివించాడు దురభ్యాసాలకు చిక్కక అతడు వళ్లువంచే చదివాడు కళాశాలలో ప్రవేశించాడు. ఆ రోజులలో రాజకీయ నాయకుల గర్జనలు ఆసేతుహిమాచలం ప్రతిధ్వనించాయి అన్యభాషాభ్యాసం వదలి కార్యరంగంలో దూకండని ఉద్బోధించారు భావి భాగ్యోదయమంతా యువ విద్యార్థుల భుజస్కంధాలమీద నిలిచి ఉన్నదన్నారు నా డా రాజకీయ రంగంలో పెక్కు సిద్ధాంతాలు మోసు లెత్తాయి అందులో ఒకటి శేఖరాన్ని ఆకర్షించింది మానవుని కష్టసుఖాలకు మానవుడే కారణం మానవ కల్యాణం ఆర్థికసామ్యస్థితిమీద ఆధారపడి ఉంది ఆర్థికస్థితి కొన్ని సూత్రాలను అనుసరించి సాగుతూ ఉంటుంది అపమార్గాలు అనుసరించటం వల్లనే ధనిక నిర్ధనిక భేదాలు ఏర్పడి కోటానుకోట్ల ప్రజలు అగచాట్ల పాలవుతున్నారు ధర్మం నశించి జీవితం దుర్భర మౌతున్నది శాస్త్రం, కళలుప్తమై, దారిద్ర్యం, దుఃఖం, అజ్ఞానం, విలయతాండవం చేస్తున్నవి ఆర్థిక సామ్యస్థితికి హేతుభూతమైన సూత్రాలు అమలుపరిస్తే, సంఘం ఎచ్చులొచ్చులు లేక కళకళ లాడుతుంది అప్పుడు దేశంలో ఏమూల చూచినా పాడిపంటలు సమృద్ధిగా ఉంటాయి ఆకలిబాధతో అలమటించే వాళ్లు, అజీర్ణరోగంతో అవస్థపడే వాళ్లు ఉండరు అంతా నవ్వుతూ పేలుతూ ఉంటారు అప్పుడే నిజమైన అభ్యుదయం ప్రారంభమౌతుంది

ఈ లక్ష్యం యువకుడైన చంద్రశేఖరాన్ని ఆకర్షించింది ఆ విద్యార్థి దశలోనే ఒకసారి కృష్ణజన్మస్థానం చూచివచ్చి, తరువాత పట్టభద్రుడైనాడు ఆ తరువాత రామిరెడ్డిగారి కుమార్తె లలితను పెండ్లి చేసుకొన్నాడు ఆ పెండ్లితో మరి కొన్నివేలు లభించాయి.

చంద్రశేఖరం ఉన్న కొంద్ర చూచుకొంటూ తక్కిన వాళ్ళవలె ఉంటే జీవితం వడిదొడుకులు లేక ప్రశాంతంగా సాగిపోతుండేది కాని దానికి అతని మనస్సు ఒప్పలేదు ఆధునిక పరిశ్రమలు లేక దేశం బాగుపడదు పొలాలులేని కార్మికులకు పరిశ్రమలే ఆధారాలు. పారిశ్రామిక క్షేత్రం విస్తరిస్తే నూతన జీవనోపాధులు ఏర్పడుతవి వాటితో సామాజిక స్థితిగతులు మారి ప్రజాస్వామ్యం, విజ్ఞానవికాసం, మూఢాచారనిరాసం జరుగుతుంది అప్పుడే ప్రతి ఒక్కడూ జ్ఞానవంతుడై సుఖపడతాడు యుగయుగాలనుంచి పేరుకొని ఉన్న కల్మషం కొట్టుకుపోతుంది

ఈ దృష్టితో కాగితాలమిల్లు పెట్టటానికి శేఖరం పూనుకొన్నాడు అతడు యువకుడు ఉత్సాహ మున్నది. పరపతి ఉన్నది ఆస్తిపాస్తులున్నవి వాటన్నిటిని మూలధనంగా మార్చాడు. బంధువులవద్ద మిత్రులవద్ద ఋణాలు పుచ్చుకొన్నాడు అన్నీ కరగబోశాడు కొలదికాలంలోనే ''ఎంత కాగితం కావా'' లని ప్రశ్నిస్తూ ముప్పూట మిల్లు కూయసాగింది. పరిసరాలలో పిల్లపిల్ల కుటీరాలు లేచాయి

ఆ రోజులు నిజంగా చంద్రశేఖరానికి ఆనందమయాలు అతనికి ఉత్సాహమైతే ఉంది కాని ఒక సంస్థ నిర్వహించాలంటే కావలసిన అనుభవం, సమర్ధత, ఆర్ధికస్థోమత, సహకారం లేవు. మిల్లులో పనిచేయవలసిన కాలం రోజుకు ఆరుగంటలు అని నిర్ణయించాడు జీతాలు ఆ ప్రాంతాలలో ఉన్న వానికంటే ఎక్కువ పెంచాడు వైద్య సౌకర్యం కలిపచాడు అయితే కార్మికులు మరికొన్ని సౌకర్యాలు కావాలన్నారు శేఖరం తమ్ము దోచుకుంటున్నాడని సముచిత నాయకత్వాన తమ అసంతృప్తి వెల్లడించడానికి ప్రారంభించారు దానితో ఉత్పత్తి తగ్గి వ్యయం ఎక్కువ కాసాగింది

అతడు కార్మికులనందర్నీ ఒక రోజున సమావేశపరిచాడు ''ఈమిల్లు మీది ఇప్పటి ఆదాయ వ్యయాలు ఇంత ఇంత నష్టం వస్తున్నది ఏమిచేయమంటారు? మిల్లును మరికొంత పెంచితే కాని ఉత్పత్తి పెరిగి నష్టంపూడదు అలా చేయాలంటే పెట్టుబడి కావాలి అనుమానముంటే లెక్కలు తెలిసిన ప్రతినిధులను అయిదారుగురిని ఎన్నుకోండి. వాళ్ళకు ఇప్పటిదాకా తేలిన లెక్కలు చూపుతాను ఏమంటారు? మనమంతా బ్రతకాలంటే మిల్లు బ్రతకాలి. దీనికి ఒకటే మార్గం కనిపిస్తున్నది సహకారపద్ధతి మీద నడుపుకొందాము'' అని హృదయం విప్పి స్పష్టంగా చెప్పాడు కార్మికులు ఎవరూ మాటాడలేదు అతడు మళ్ళీ హెచ్చరించాడు చివరికి వాళ్లు తేల్చి చెప్పారు. లాభనష్టాలతోగాని, ఉత్పత్తిమూలధనాలతో గాని వాళ్ళకు సంబంధంలేదు. కోరుతున్న వేతనాలు, సౌకర్యాలుమాత్రం కావాలి. అవును. మానవుడు సుఖాభిలాషి కదా! అలా కోరటంలో విద్రోహ మేమున్నది?

శేఖరానికి నాటినుంచి చిక్కులు ఎక్కువయ్యాయి మిల్లు నడిపితే చిక్కు నడపకపోతే చిక్కు అంతడబ్బు ఖర్చు పెట్టి మానుకొంటే తాను వైరాగి కావాలి అందుకుకూడా అతడు జంకలేదు నలుగురూ ఏమంటారు? తిరిగి సంఘంలో తలెత్తుకోవటం ఎలా? పైగా మిల్లువల్ల వందల కొలది కార్మికులు బ్రతుకుతున్నారు. వాళ్ళను నట్టేట ముంచటమేనా? అది ఏమాత్రం రుచించలేదు తనవద్ద పేదసాదలు నమ్మి దాచుకొన్న డబ్బుకూడా మిల్లుకు ఖర్చుపెట్టాడు అదీ చాలలేదు మిల్లు క్రమ క్రమంగా మారువాడీలకు తనఖా పెట్టాడు దానితో కొంతకాలం గడిచింది



---

జి వి కృష్ణరావు

మిల్లు సాగుతున్నప్పుడు కార్మికుల చిత్తవృత్తి విచిత్రరూపం దాల్చింది లాభం రేకపోతే శేఖరం మిల్లుల కట్టివేసుకోడా? మనలను ఉద్ధరించటానికి సాగిస్తున్నాడా? పెట్టుబడిదారులకు కార్మికులమీద అంత సానుభూలా? పెద్దపులికి కూడా మేకమీద జాలే! ఆనాడు చెప్పినవన్నీ బూటకాలే. కాకపోతే ఇంతకాలం మిల్లు ఎలా సాగుతున్నది? ఈ ఆలోచనలతో అతని మంచితనంకూడా అనుమానానికి హేతువైంది

చంద్రశేఖరం కన్ను విప్పి చూచుకొనేప్పటికి మిల్లు మూలపడ్డది వందలకొలది కార్మికులకు జీవనోపాధి ఊడింది చుట్టుపట్ల గ్రామాలలోని కర్షక కుటుంబాల దీపాలు చాలా ఆరిపోయాయి తన ఆస్తి, భార్య ఆస్తి, మామగారి ఆస్తి కర్పూరంలాగా కరిగిపోయినవి అతనికి ఎటు చూచినా కారుచీకటులే! స్థితిగతులు తలచుకొన్నప్పుడు భయదుఃఖాలు పొంగి పొర్లాయి. మనసార సాంఘిక లభ్యుదయం వాంఛించాడు పేదసాదల జీవితం ఆనందమయం చేయాలని ఉబలాటపడ్డాడు. శక్తిసంపనలేక దానికోసం కృషి చేశాడు చివరికి ఏమి జరిగింది? రక్తమోడ్చి పేద సాదలు సంపాదించుకొన్న డబ్బు పోవటానికి తోడ్పడ్డాడు వందలకొలది కార్మికులకు ఎవరుంటారు? పెట్టుబడిదారులకంటె సామాన్య ప్రజలకు తాను మాత్రం తక్కువ చేసినది యేమున్నది?

ఈ అపరాధంవల్ల చంద్రశేఖరం పగటిపూట గ్రామంలో అడుగు పెట్టటానికి నోచుకోలేదు

అప్పుల వాళ్ళకు జంకి రాత్రివేళనే ఇంటికి వచ్చి తెల్లవారుజాముననే బస్తీకి పోతున్నాడు రాచబిడ్డలాగ బ్రతికి ఈనాడు ఎంత నిక్రృష్టంగా బ్రతకవలసి వచ్చింది! వెనకటిస్థితిలో అయితే దీనికి అంతకు కారణం తానే అనేవాడు. నేడు మాత్రం అలా గట్టిగా చెప్పలేడు. విధి ఒకటి ఉన్నదేమోనని శంకించే స్థితి ఏర్పడింది

అతడు ఊళ్లోని చెరువు దగ్గరకు రాగానే భీమేశ్వరం స్వాగత మిచ్చాడు. కోటులో భద్రపరచిన సీసా ఒకటి తీసి యిచ్చి, అతడు ఇంటివైపు సాగాడు వెళ్లదువుగానిలే రమ్మంటూ అతనిచేయి పుచ్చుకొన్నాడు

''ఇంట్లో ఎవరూ తోడుకూడా లేరు పోవాలి.''

''నీకోసం శంకరం మా యింటివద్ద కనిపెట్టుకున్నాడు.''

''రేపు వస్తాలే.''

''కాదు. ఇవ్వాళ మాటాడ వలసిన ముఖ్యవిషయం ఏదో ఉందట '' భీమేశ్వరం బలవంతంచేస్తే కాదనలేకశేఖరం అతని యింటికివెళ్ళాడు. శంకరం మందహాసంతో ఆహ్వానించాడు కూర్చుండటానికి ప్రక్కన ఉన్న పాతకుర్చీ చూపించాడు భీమేశ్వరం సీసా సీలు ఊడగొట్టి విస్కీ రెండు గ్లాసుల్లో పోశాడు శంకరం గ్లాసు అందుకొంటూ, ''శేఖరం గారూ! మీరింత తెలివితక్కువ వాళ్ళనుకోలేదు సుమా!'' అన్నాడు.

''ఏమిటి?''

''దొంగ నోట్లు వ్రాయటంకంటే కరెన్సీ నోట్లువేస్తే లాభం కాదా?''

''దొంగనోటా! యెవరు వ్రాశారు?'' శేఖరం ఆశ్చర్యపడి అడిగాడు

''మీరు పుల్లయ్య అడ్డం ఉన్నట్లుగా ఫోర్జరీ చేసి లాల్‌చంద్‌కు కాగితం ఇచ్చారటగా!''

''నేనా! ఫోర్జరీ చేశానా?''

''ఏమో, ఊరంతా అనుకొంటూ ఉంటే నేనూ విన్నాను.'' భీమేశ్వరం అందుకొన్నాడు.

''రేపో, మాపో నోటీసుకూడా వస్తుంది'' శంకరం వివరించాడు.

''అయితే త్వరలోనే తేలుతుంది!'' చంద్రశేఖరం ఇంటివైపు బయలుదేరాడు.

పుల్లయ్య అభిప్రాయం ఏమై ఉంటుంది? ఈ దుర్బుద్ధి ఎందుకు పుట్టింది? శంకరం చెప్పినట్లే చేస్తే అతనికి జైలు తప్పదు అప్పుడు ప్రాయశ్చిత్తం జరిగితీరుతుంది. అయితే ఈ వార్త లలిత చెవినికూడా పడి ఉంటుందా? వినకపోయినా యెవరో ఒకరు ఆ మాత్రం పుణ్యం కట్టుకోక మానరు ఆమె తండ్రి డబ్బు తీసుకొని బికారినిచేశాడు ఆమె అంత కష్టపడలేదు. భర్త అసమర్థతకు నొచ్చుకోలేదు ఇలాంటి దగుల్బాజీ పని చేశాడంటే నమ్ముతుందా? లోకమంతా కోడై కూస్తుంటే ఎలా నమ్మకుండా ఉంటుంది? చాలవరకు నమ్మరు. కాకపోతే అనుమానం కలిగితే కలగవచ్చును. డబ్బుపోయినా కష్టం లేదు కాని భర్త నేరస్థుడని అనుమానం కలిగినప్పుడు ఆమె మనస్సు ఎలా ఉంటుంది? ఇలా నరకకూపంలో త్రోయటానికేనా పెండ్లాండింది? ఘోరం. వెలలు వచ్చిన యిల్లాలు ఇంట్లో పలకరించే దిక్కుకూడా లేదు

చంద్రశేఖరానికి ఇప్పుడు కొంత ధైర్యం కలిగింది. లోగడ వచ్చిన అవర్థకాలకు అన్నిటికీ తాను, తన అసమర్థతా కారణం! కొత్తవిపత్తుకు తానేమాత్రం కారణం కాదు. తాను పూర్తిగా నిర్దోషి. వెనుక తానుచేసిన అవకతవకలకు భార్యవద్ద భయపడవలసి వచ్చేది. ఇప్పుడు భయపడవలసిన పనిలేదు. 15
తన నిర్దోషిత్వాన్నీ, లోకక్రౌర్యాన్నీ ఆమెకు చూపించవచ్చును ఈ భావంతో అతనికి మాతవ ఉత్సాహం కలిగింది అంతవరకు వంగి ఉన్న బ్రహ్మదండం తీర్చి నిలిపినట్లుగా నిలబడ్డది. రొమ్ము ఉబికి గాఢంగా నిశ్వసించింది. ముఖంలో ఒక విచిత్ర కాంతి ప్రసరించింది.

జి.వి. కృష్ణరావు

# ... నాలుగు ...

చంద్రశేఖరానిది ఏనాడో పెద్దలు కట్టించిన లోగిలి లంకలాగా ఉంటుంది చుట్టూ ఎంతో ఖాళీస్థలం. ఒక ప్రక్కన పెద్ద పెంకుటి చావడి. దానికి ప్రక్కన వామివేసే చోటు ముందరి దొడ్లో బావి. వెనక దొడ్లో బావి ఒక ప్రక్క ఆకాశంలోకి తొంగిచూస్తున్న తాటిచెట్ల జంట.

బిక్కుబిక్కు మంటూ లలిత తూర్పింట్లో సోఫాలో కూర్చుని నాలుగురోజులనాటి పత్రిక తిప్పుతూ ఉంది. చీమ చిటుక్కుమన్నా ఉలికిపడి చూస్తూ ఉంది పాతికేళ్లు నిండీ నిండని వయసు. పలచని దేహం. నున్నగా దువ్వి దూముడి వేసిన కేశాలు పచ్చనిచాయ, ఎర్రని పెదవులు, పై పెదవి ఎడమ ప్రక్కన నల్లని పుట్టుమచ్చ. చూలాలితనం సొగసును ఇనుమడింప జేస్తున్నది.

చెప్పుల చప్పుడు వినిపించగానే చప్పునలేచి వాకిలి వద్దకు ఎదురుపోయింది. శేఖరం అలవాటు చొప్పున ద్వారం ప్రక్కగా చెప్పులు విడుస్తూ ఉండగానే "నిజమేనా?" అని ప్రశ్నించింది శేఖరం ఏమిటని అడగలేదు. చెప్పకుండానే ఆమె అభిప్రాయం బోధపడింది ఫోర్జరీ సంగతి అడుగుతున్నదని అర్థం చేసుకున్నాడు

"నువ్వుకూడా నమ్ముతున్నావా?"

ఆ మాటతో గుండెబరువు ఒక్కసారిగా ఆమెకు దించివేసినట్లయింది భర్త ఉత్తరీయం అందుకొన్నది. కోటు నలగకుండా విడిచి, గోడనున్న వంకెకు తగిలించి, వచ్చి సోఫాలో కూర్చున్న శేఖరం ప్రక్కనే చేరగిలబడి, చొక్కా కాలరు మడతలు సవరించ సాగింది. చడీ చప్పుడు లేదు. గంటలాగా దీపం వెలుగుతున్నది. నిద్రపోతున్న పిల్లల ఉచ్ఛ్వాస నిశ్వాసాలు వినిపిస్తున్నవి.

"పుల్లయ్య ఇంత దురాగతానికి ఎందుకు దిగినట్లు?" లలిత తన్ను తాను ప్రశ్నించుకొంటున్నట్లుగా అడిగింది.

"అదే నాకూ విచిత్రంగా ఉన్నది. అయినా ఎప్పుడో ఒకప్పుడు బయటపడుతుంది. మొత్తంమీద పొరపాటైనా జరిగి ఉండాలి. లేదా. "

"ఏమి జరిగి ఉంటుందంటారు?"

"ఎలా చెప్పటం? ముఖ్యంగా పుల్లయ్య సంగతి అసలే చెప్పలేము అయిదువేల రూపాయలు కదా! డబ్బున్న తరువాత పెరపెరలు పుట్టి ఉండవచ్చును "

"అక్కడ కూడా అయిదువేలా?"

చేసిన అప్పులన్నీ జ్ఞప్తికి తెస్తే లలితకు గుండె పగిలిపోతుంది ఆమెకే కాదు, అతనికి కూడా ఆ రాత్రి నిద్ర పట్టటం దుర్లభం. దుఃఖాన్ని అనిష్టాలను మరచి పోటానికి మనస్సు ప్రయత్నిస్తూనే ఉంటుంది. శేఖరం కూడా అప్పుల మొత్తాలపై దృష్టి పోనీయకుండా దాటవేశాడు. తను అలా చేస్తున్నానని కూడా అతనికి తెలియదు.

"అసలు సాక్షులున్నా రన్నసంగతి కూడా మరచి పోయినట్టున్నాడు " ఆనాడు ఉదయం బస్తీకి పోతూ ఆమె తండ్రి కీయవలసిన దాంట్లో కొంత సర్దుతా నని అతడు చెప్పాడు ఆ మాట ఇప్పుడు ఆమెకు జ్ఞప్తికి రాకపోలేదు. కాని ఆ సంగతి ఎత్తలేదు పుల్లయ్య వ్యవహారంలో తన భర్త

నిర్దోషి అని తేల్చుకొన్న తరువాత ఆమె ఎంతో సంతోషించింది లోలోన తిరుపతి వెంకన్నకు మొక్కింది ఆ మాత్రం దయవుంటే చాలుననుకొన్నది తన భర్తకు అప్రతిష్ఠ రాకుంటే చాలు అదే పదివేలు

''ఈ దిగులు విచారం ఇవాళ వచ్చాయా? ఎంతకాలం ఉండితారాలని ఉందో అంతకాలం తప్పదు గదా! స్నానానికి లెండి నీళ్లుకూడా ఆరిపోయాయేమో ''

ఆమె వెళ్లి నీళ్లు తోడింది తోడు పడతానన్నా వినిపించుకోక అతడే నిండు కాగు పట్టుకొని వెళ్లి స్నానం చేసి వచ్చాడు ఒక పళ్ళెంలోనే భోజనం వడ్డించి ఉంది సాధారణంగా ఇద్దరూ ఒకేసారి భోజనం చేయటం పరిపాటి అందువల్ల అడిగాడు

''భోజనం చేశావా?''

''నాకు ఆకలి లేదు మీరు భోంచేయండి ''

''రెండు ప్రాణాలను ఉపవాసం చేయిస్తావా?''

''అబ్బా, ఆకలి లేదండి!''

''నీకు లేకపోయినా బుల్లి పాపాయికో? ఆకలి అవుతున్నదిగా – నాకు తెలుసు.'' బుల్లిపాపాయి ప్రస్తావన తేగానే చిరునవ్వు పెదవులమీద తాలకరించింది.

పసిపిల్లను బుజ్జగించినట్లుగా అతను బుజ్జగించాడు ఇద్దరూ భోజనం చేశారు. అతడు చేయి కడుక్కొని పడమటింట్లోకి వెళ్ళాడు. వరసగా రెండు మంచాలు వేసివున్నాయి పెద్ద మంచంమీద చిన్నపిల్ల లిద్దరు, చిన్న మంచంమీద పెద్ద పిల్ల పండుకొని ఉన్నారు పెద్ద మంచం పక్క అంతా ఒక పక్కకు చేరుకొన్నది. కప్పిన దుప్పటి కింద పడిఉంది. అతడు దానిని విదిలించి ఇద్దరి పిల్లలకూ కప్పాడు పెద్ద పిల్ల ముఖం ఆ నిద్రలోనే నవ్వుతున్నది. ఆ ముఖాన్ని మెల్లగా ముద్దు పెట్టుకొని వచ్చి ప్రక్కనే ఉన్న ఈజీచైరులో కూర్చున్నాడు ఆ అమాయికుల అవతరణానికి తానే కారణం తన పేరు చెప్పుకొని ఇక దారిద్ర్యంలో ఈదుతూ ఉండాలి , ఏమీ తెలియని పసివాళ్లను ముగ్గుర్ని అమాంతము ప్రత్యక్షనరకంలో పడవేయటానికి తనకేమీ అధికారముంది? మానవుని జ్ఞాన స్వాతంత్ర్యాలు ఇందుకే వినియోగపడుతున్నవా? అతని హృదయకుహరంలో విచారమేఘాలు బయలుదేరాయి

ఇంతలో వంట ఇల్లు సర్దివచ్చి లలిత పెద్దపిల్ల మంచంమీద కూర్చున్నది

''మా నాన్న వచ్చి వెళ్ళాడు' మరీ మరీ సర్దకపోతే ఎలా చెప్పండి? మా అన్నయ్య ఎన్నడైనా ఒంటిమీద గుడ్డమాయనిచ్చేవాడా? ఇవాళ చూడండి. చింపిరి గుడ్డలు కట్టుకొని తిరుగుతున్నాడు మన్ని ఆదుకొనేకదా పచ్చని సంసారం ఈ గతికి వచ్చింది?'' లలిత పైటకొంగుతో కళ్ళు తుడుచుకొన్నాది

అతడు భార్య వంక చూడలేక పోయాడు ప్రక్కకు చూస్తున్న అతని కళ్ళకు టేబులు మీద కవరు కనిపించింది

''అదేమిటి?''

''పుల్లయ్యగారి నోటీసు.''

''లేకపోతే నాకెలా తెలుసు?''

కొంచెంసేపు ఎవరూ మాట్లాడలేదు ''సాయిబు ఇవాళ నాలుగుసార్లు తిరిగి వెళ్ళాడు ''

''ఏ సాయిబు?''

''మిషను కుట్టుకుంటాడే, అతడు. కళ్ళు చూస్తేనే ఎక్కడ లేని భయం కలిగింది చిన్నపిల్లాడు కెవ్వుమన్నాడు కూడా అతనిపిల్లలు భార్య మంచ మెక్కారట అతనికి జబ్బుటల ఈ పూటకు గంజి లేదని ఏడ్చాడు పాపం వాడికివ్వవలసినది రెండు వందలేనటగా తల తాకట్టు పెట్టి అయినా సరే వాడికిముందు సర్దండి ''

చంద్రశేఖరం మాట్లాడలేక పోయాడు హృదయం బరువెక్కి పోయింది అ తనికి ఊరట కావాలి ఆ దోషం తనది కాదనుకొన్నప్పుడు కాని అది కలుగదు అందుకని పుల్లయ్య సంగతి ఎత్తాడు '' ఎంత దుర్మార్గానికి తలపెట్టాడు! నా పేరు ప్రతిష్ఠలు చూచి అతనికి కన్ను కుట్టింది లేకపోతే దీనికి దిగడు అన్నట్లు స్కూలు కమిటీ అధ్యక్షపదవికి పోటీచేసి కిందటి సంవత్సరమే ఓడిపోయాడు. దానికి నేనే కారణ మనుకొంటున్నాడు ఊళ్ళో అతనంటే ఇష్టం లేదు. ఆ సంగతి తెలుసుకోక నా మీద కక్షసాధించటానికి పూనుకొన్నాడు కక్షకు ఇంకా కారణాలున్నాయి పేపరుమిల్లు వచ్చింతరువాత కూలి పెరిగిపోయింది. అసలే వీళ్ళను రాచి రంపాన పెట్టాలంటాడు ఈ రోజుల్లో ఎవ రొప్పుకొంటారు? పైగా పేపరు మిల్లుచూచి అసూయపడుతున్నాడు. ఈ

18 వ్యాపారం చెడగొడితేగాని తన ఆటలు సాగవని చూస్తున్నాడు కూలి జనం తాను ఇచ్చిన కూలికి వస్తారని ఎత్తు వేశాడు అసలు కూలి పెరగటం ఈ పెద్ద ఆసాములందరికి కడుపు మంటగానే ఉంది ''

ఈ వాదన విన్న లలిత ఆశ్చర్యపడ్డది ఇంతగూడుపురాణీ జరగటానికి అవకాశం ఉండవచ్చునని మనస్సుకు తట్టలేదు

''ఇంత కుళ్ళు వున్నదా?'' అన్నది

''లోకమంతా నీలాంటిదే ననుకొన్నావా?'' అతడు గంభీరంగా అన్నాడు.

''చాలా పొరపడ్డాను. మిమ్మల్ని అపార్థం చేసుకున్నాను ఇదంతా మీ అసమర్థతవల్లే జరిగిందనుకున్నాను.'' ఆమె మృదుహస్తం అతని క్రాపును సవరించింది ఆ సుఖస్పర్శతో అతడు కన్నులు మూశాడు. కొంచెంసేపటికి తన చినిగిన గుడ్డలు చూపుతూ మామ, మంచ మెక్కిన భార్యా పిల్లలను చూపుతూ మిషన్‌సాయిబు, కన్నులవెంట బొటబొట నీరు కారుస్తూ దిక్కులేని విధవరాలు సాక్షాత్కరించారు పాడుపడ్డ కార్మిక కుటీరాలు గోచరించాయి ఒకసారి కంపించి పోయాడు ఉలికిపడి లేచాడు ''లలితా, నీవు పండుకో, తలుపు వేయకు నేనిప్పుడే బజారుకు పోయి వచ్చేస్తాను'' అని చెప్పి భీమేశ్వరం ఇంటికి వెళ్ళాడు.

లలితకు అర్థం కాలేదు. నిర్జీవంగా లేచి, ఎలాగో భర్తకు పక్కవేసి తరువాత తన పక్క మీదకు పోయి పండుకొన్నది ఎంతసేపటికీ నిద్ర పట్టలేదు పక్క కుదరనూ లేదు అటూ యిటూ దొర్లుతూనే ఉన్నది ఒక రాత్రివేళ చూస్తే తూలుతూ తూలుతూ భర్త అతని మంచందగ్గరకు వెళ్ళుతున్నాడు అంతకు ముందెన్నడూ ఎరుగని లలిత కెవ్వుమని అరచింది.

---

# ఐదు

భారతదేశం చాలగొప్పది ఆ గొప్పతనానికి అంతకూ గ్రామపౌరులే కారణం. ఈ సంస్కృతి కాలేజీ చదువులు చదివి బస్తీలు మరిగిన కుర్రవాళ్ళకు ఏ మాత్రం తెలియదు. పిల్లి కాకికి ఉండేలు దెబ్బ ఏమి తెలుసు గనుక! ప్రాచీన సంస్కృతి నాగరికతలు ఈనాటికీ నిలిచి ఉన్నవంటే యీ గ్రామసీమలే కారణం ఊళ్లో ఆ పూట ఎవరి యింట్లో ఏమి వండుకొన్నారో, తిండికి లేక ఎవరు పస్తుపడుకొన్నారో, ఏ యిల్లాలు భర్తమీద అలిగి బిర్రబిగిసి పడుకొన్నదో, ఏ సంసారి తన పిల్లలను ఈడేర్చలేక క్రిందెట్లు మీదెట్లు అవుతున్నాడో ఏ షావుకారికి ఎంత బాకీ ఉందో సాధారణంగా ప్రతి ఒక్కడూ కనుక్కొంటాడు కాస్తలేని వాడైతే రచ్చబండవద్దకు వచ్చినప్పుడో, లైబ్రరీవద్ద కూర్చున్నప్పుడో హితోపదేశం చేస్తారు· ''ఒరే, పిల్లకాయ పెళ్ళిచేయకెందుకూరుకున్నావురా?'' అంటారు ''రాత్రి ఏమి కూర వండుకొన్నారురా?'' అని అడుగుతారు ఆ రేయి ఆ దౌర్భాగ్యుడి యింట్లో పొయ్యిరాజలేదని తెలుసు 19

చంద్రశేఖరం ఫోర్జరీ పుట్టించాడన్న సంగతి ఊరంతా వ్యాపించిందంటే విడ్డూరంలేదు. చంద్రశేఖరం ఐ పి దాఖలు చేయకపోవటం ప్రబల ప్రతిబంధకమైపోయింది లేకపోతే పుణ్యాలు నిర్ణయించి ఉండేవాళ్ళు అటు పుల్లయ్య అంటే ఒక పులి అతనితోక బారెడుంది. కాకపోతే ఒక వేలుడు తక్కువ ఉంటుందేమో నిజనిజాలు ఎలా తేలుతాయి? గ్రామస్థులందరికీ అంతర్జాతీయ సమస్య వచ్చిపడ్డది తేలక తలలు బద్దలు కొట్టుకొంటున్నారు

పొట్టి రామయ్య ఒకరోజున పుల్లయ్యదగ్గరకు వచ్చాడు అతడు దొడ్లో గిత్తలకు మేత వేయిస్తున్నాడు. పుల్లయ్యకు ఎడ్లమీద అమితమైన మోజని అతనికి తెలుసు ''మామా, మీ వెలపలి గిత్త పనికి మహా మొనగాడు అలాంటిది మన జిల్లాలోనే లేదంటే నమ్ము'' అన్నాడు.

''నువ్వెప్పుడు చూచావ్?''

''మొన్న తూర్పు పొలం నుంచి వడ్లు తోలుకురాలా? నాడు కాలవలో బండి దిగేసినప్పుడు చూచాగా!''

పుల్లయ్య పొట్టి రామయ్యకు పుగాకు కాడ యిస్తూ, ''దావలిగిత్త గూడా దానికి తీసిపోయింది కాదు '' అన్నాడు

''లేకపోతే దానివద్ద నిపాయించవద్దూ? సరేకాని, వాడికేమి పోయేకాలం పుట్టింది? నువ్వు హామీ వున్నట్లు నోటు సృష్టించాడటగా? అది చెల్లుతుందనే కామాలు వాడి ఆశ! చెల్లి మళ్ళీ యీ గడ్డమీద ఉంటాడు? ఈ కళ్ళతో చూడమూ? అంతా పచ్చికలి అయిపోయిందే మామా! వెనుకటి

---

కాలం వేరు, ఇప్పటి కాలం వేరు అబద్దం ఆడటమంటేఆ రోజుల్లో చచ్చిపోయేవాళ్ళు ఈ రోజుల్లో అంతకన్నా సులువైన పని మరొకటి లేదు. లేచింది లగాయుతు పండుకొనేదాక అదే కూడయిపోయింది ''

''అంతే రామయ్యా! లోకమంతా మారిపోయింది'' అన్నాడు పుల్లయ్య

పుచ్చుకొన్న పుగాకు కాడ చుట్టచుట్టి ముట్టించుకొని, ''దొడ్లోకి తొంగిచూస్తే నువ్వు కనపించావు కాస్త పలక రించి పోదామని వచ్చా దూడను విడిచే వేళ కూడా అయింది వస్తా''నంటూ వెళ్ళిపోయాడు

పోతున్న పొట్టి రామయ్య వంక చూస్తూ చుట్ట కొరికి ఊసి, ''తొత్తు కొడకా! నిజంగా పలకరించి పోదామనే వచ్చావా? మల్లయ్య పంపితే ఫోర్జరీ వ్యవహార మేమిటో, నేనేమంటానో కనుక్కొని పోవటానికి వచ్చావు గాని? ఇంతకూ నక్కను తొక్కి వచ్చావులే, అణా పొగాకు కాడ వేసుకుపోతున్నావు.'' అనుకొన్నాడు.

పుల్లయ్యకు ఇలా తటస్థపడింది పొట్టి రామయ్య ఒక్కడే కాదు నలుగురైదుగురు ఫోర్జరీసంగతి ప్రస్తావించి చంద్రశేఖరాన్ని నిరసించారు అతడు అవుననలేదు, కాదనలేదు నవ్వి ఊరుకొన్నాడు ఊళ్ళో బయలుదేరిన మల్లగుల్లాలు అతడు కనిపెడుతూనే ఉన్నాడు కాని రెండో పార్టీ నాయకుడైన మల్లయ్య సంగతే అతనికి అంతుపట్టడంలేదు. అతడు ఏమి అభిప్రాయపడుతున్నాడో, ఈ వ్యవహారం అతడు అసలు గమనిస్తున్నాడో లేదో తెలియలేదు

వీటన్నిటికంటె పుల్లయ్యకు అంతరాత్మవల్ల బాధ ఎక్కువైంది ఇలాంటి తప్పుడు వ్యవహారానికి దిగాలని కాని, దిగుతానని కాని ఎన్నడు అనుకోలేదు చంద్రశేఖరానికీ, తనకూ వెనకటి మూడు తరాలు తిరగవేసి చూచుకొన్నా, ఎలాంటి శత్రుత్వం లేదు అతడు తనకు ఎందులోనూ అడ్డురాలేదు. ఏ విధంగానూ అపకారం చేయలేదు ఏదో తిండి లేనివాళ్ళకు జీవనోపాధి చూపుదా మన దృష్టితో తన చేతులుకాల్చుకొన్నాడే తప్ప ఎలాంటి దురాగతం తలపెట్టలేదు అలాంటి వ్యక్తిని చూస్తూ చూస్తూ జైలుకు పంపించటం ఘోరంగా కనిపించటం మొదలు పెట్టింది తనకూ పిల్లాజెల్లా ఉన్నారు ఇలాంటి పనిచేస్తే అతని ఉసురుకొట్టదా? తాను అనుకోకుండా స్థితిగతులు ఇంతవరకు నెట్టుకొని వచ్చాయి ఈ మురికికూపంలోనుంచి ఎలా బయటపడటం?

ఇలాంటి చింతతో ఆకలి మంద గించింది. కంటికి నిద్రకరవై పోసాగింది మీసాలు అకస్మాత్తుగా నెరిసిపో మొదలెట్టాయి ఈ మార్పు మొదట సీత కనిపెట్టింది ఒకనాడు లక్ష్మమ్మవద్ద అన్నది:

''ఎందుకే అమ్మా! నాన్న అదొక తీరుగా ఉంటున్నాడు?''

''నిజమేనే, తిండి బొత్తిగా పడిపోయింది, మూడు పూటలు సుష్ఠుగా తినే మనిషి రెండుపూటల్లో పడ్డాడు అదికూడా నంజీనంజనట్లు ఇన్ని మెతుకులు తింటున్నాడు. ఈ మాయదారి ఫోర్జరీ మనిషిని నిలువునా కుంగదీస్తున్నదే తల్లీ!''

సీత కన్నీళ్ళపర్యంతమైనది తనతండ్రివంటి ధర్మమూర్తి ఎవరున్నారు? అలాంటివాడికి ఈ చిక్కులు ఎందుకు రావాలి? లోకంలో ధర్మానికి న్యాయానికి చోటులేదా? ఆమెకు మొదటినుంచీ తండ్రి అంటే ఎంతో భక్తి, గౌరవం ఇప్పుడు ఆ భక్తిశ్రద్ధలు మరీ ఎక్కువయ్యాయి. ప్రొద్దున్నే ముఖం కడుక్కోవటానికి చెంబుతో నీళ్లు, వేపపుల్ల పెట్టి తుండుగుడ్డ పట్టుకొని హాజరుగా ఉంటున్నది తలనొప్పి అంటే స్వయంగా మందు తీసుకొనివెళ్ళి వద్దనేదాకా రుద్దుతున్నది.

ఒకపూట తప్పంతా తనతండ్రిదేనని చంద్రశేఖరం అన్నట్టు విని ఆశ్చర్యపడ్డది. శేఖరానికి నోరెలా వచ్చిందో? అతనికీ పిల్లాపాప ఉన్నారే! గుండ్రాయికాదే! ఇలాంటి అఘాయిత్యానికి యెలాతలపడ్డాడు? దుర్మార్గుడు అన్నా దేపో, లోకమంతా విని ఎలా ఊరుకొంటున్నది? అతన్ని నరికి ఉప్పు పాతట్లో వెయ్యక ఎందుకు చూస్తున్నది? ఈ లోకానికి ఎగ్గుసిగ్గులు రెండూ లేవు. అన్నీ విడిచి కూర్చున్నది. కొంపదీసి ఈ దిగులుతో నాన్నకు ఛీ శేఖరం మనిషి కాడు!

సీతకు సెలవులు అయిపోయినవి. రైలు ఎక్కించి రావటానికి పుల్లయ్య బండికి సవారి కట్టించాడు. ''రెండురూపాయలు పారేస్తే ఊళ్ళోనుంచి గుర్రపుబండి రైలుస్టేషన్ వద్ద 21
దించుతుందికదా! ఈ శ్రమంతా దేనికి నాన్నా?'' అని సీత అన్నది కాని అతడు ఒప్పుకోలేదు. ''పాడుగుర్రపుబండిగా, ఒళ్ళంతా అతల కుతలమైపోతుంది. నీకు తెలియదులే ఊరుకో'' అన్నాడు. ఇంట్లో దాచిన మువ్వల పట్టెళ్ళూ, నడుమువాళ్లు తెచ్చి గిత్తలకు తగిలించాడు. లక్ష్మమ్మ యీ అలంకరణ అంతాచూచి, ''ముసలితనం వచ్చినా పోకిలాతనం పోదు'' అని నవ్వింది. జీతగాడు జల్లలో పరువుపరిచి, పెట్టె తీసుకొని వెళ్ళి పెట్టాడు. అమ్మకు చెప్పి సీతమ్మ బండి ఎక్కింది.

''ఒరే! నీవు పోయి పనిచూడు'' అన్నాడు పుల్లయ్య.

''అసలే పొగరుబోతు గిత్తలు. కార్లు బోర్లు వస్తుంటాయి. ఎందుకైనా మంచిది. వాణ్ణికూడా వెంట తీసుకెళ్ళండి'' అన్నది లక్ష్మమ్మ

''వాడు దేనికి? నువ్వు వస్తే సరిపోతుంది ఎక్కు, చూస్తావెందుకు? ఎక్కడన్నా గిత్తలు బెదిరితే దిగి పట్టుకొందువుగాని.''

జీతగాడు నవ్వాడు.

''హై, చో!''

గేటులోనే నిలబడి ''భద్రమే సీత భద్రం'' మని లక్ష్మమ్మ కేకవేసి చెప్పింది ఊరు వెనకపడ్డది. గిత్తల మెడలలోని మువ్వలు గల్లుగల్లు మంటున్నవి చల్లని గాలి వీస్తున్నది. రోడ్డుకు రెండు ప్రక్కల ఆకుపచ్చని జనపచేలల్లో పసుపు పచ్చనిపూలు ఎండి వెనక ఎర్రదుమ్ము, పైన తెల్ల మబ్బులు–సీత విచిత్రంగా చూస్తూ ఉంది.

---

జి.వి. కృష్ణరావు

''సీతా !''

'' ఏమిటి నాన్న !''

''రాముడు పట్నంలోనే తగలతాడు దేనికే ? దొరబిడ్డ లాగా ఇంటివద్ద కూర్చొని వ్యవసాయం చూచుకోగూడదూ ?''

'' అన్నయ్యకి చదువంటే సంతోషం ''

''వ్యవసాయంలో సంతోషంలేదా ? మేమంతా సంతోషం లేకుండా పశువుల్లాగానే బతుకుతున్నామా ?''

'' ఒక్కొక్కళ్ళకు ఒక్కొక్కటంటే యిష్టముంటుంది అంతమాత్రాన తతిమ్మావాళ్ళంతా పనికిరానివాళ్ళా ?''

పుల్లయ్య మాట్లాడలేకపోయాడు. స్టేషన్‌కు చేరుకొన్న తరువాత బండి ఒక ప్రక్కన విడిచి, కూలివాణ్ణి పిలుస్తానన్నా వినక, తానే పెట్టె తీసుకొని లోపలికి వెళ్ళాడు కూతురికి తనకు టిక్కెట్లుకొని ప్లాటుఫారంమీదికి వెళ్ళాడు. బండి వచ్చే వేళ అయింది. తన గారాబు కూతురు వెళ్ళుతున్నది. ఆమెతో ఏమి మాటాడాలో తనవాత్సల్యం ఎలా వెల్లడించాలో అతనికి తోచలేదు పదేళ్ళ క్రితమైతే గిలిగింతలు పెట్టి వుండేవాడు చేతుల్లోకి తీసుకొని పైకి ఎగరేసి ఉండేవాడు లేదా అల్లాబిల్లి తిప్పి వుండేవాడు. ఎదిగిన పిల్ల. తన బుజాల ఎత్తున ఉన్నది ఆమెతో ఏమి ఆడుకొంటాడు ? ఏమి మాటాడతాడు ? ఆమె జగత్తు వేరు, తన జగత్తు వేరు దిగులుపడి పక్కకు చూస్తూ ఉన్నాడు.

22

సీత బొమ్మలమ్మే వాడివద్ద ఒక బిగులు కొన్నది పెట్టె తెరచి సిల్కు జేబుగుడ్డ తీసుకొని మళ్ళా తాళంవేసింది. పుల్లయ్య చూస్తూనే ఉన్నాడు. బండి వచ్చింది గబాగబా పెట్టెతీసుకొని వెదికి ఆడవాళ్ళ పెట్టెలో పెట్టి సీతను కూడా ఎక్కించాడు సీత '' ఈ రెండు జగ్గడి కియ్యి నాన్నా'' అని బిగులు, జేబుగుడ్డ తండ్రిచేతిలో పెట్టింది '' మట్టి పూసుకోనే వాడి కెందుకే ఈ సిల్కుగుడ్డ ?'' పాపం దీనిపై వాడి కెంతో మోజు. ఏడుస్తున్న కొద్దీ వదినె లాగి నా పెట్టెలో పడేసింది. సరే నువ్వు దిగడు.''

పుల్లయ్య ఏమి చెప్పాలో తోచలేదు. బండి కూత వేసింది ఆదరా బాదరా జేబులోనుంచి వందరూపాయలు తీసి ఆమెచేతిలో పెట్టి గుప్పెట మూశాడు ఆమె చూచింది. ఎంత యిచ్చాడో మాత్రం తెలియదు '' ఇంకా డబ్బు దేనికి ? ఇంటిదగ్గర ఇచ్చావుగా !'' అంటూ మళ్లా యివ్వబోయింది. ''గుడ్డలు కొనుక్కోవచ్చులే ఉంచు'' అని ఎడంగా నిలబడి, '' ఉత్తరం ముక్క రాస్తూ ఉండు'' అన్నాడు. బండి కనుమేర దాటి పోయేదాకా చూస్తూనే నిలబడ్డాడు.

పుల్లయ్య ఇంటికి రాగానే ''మారువాడి ఉత్తరానికి జవాబు వ్రాశారా ?'' అని లక్ష్మమ్మ అడిగింది. వ్రాయలేదన్న సంగతి తెలిసి, అతడు కూర్చుని వెంటనే సమాధానం వ్రాసేదాక ఊరుకోలేదు ఆ ఉత్తరాన్ని వచ్చిన పంతులుచేత పోస్టులో వేయించింది

---

కీలుబొమ్మ.

ఆనాడు బడలికతో అతడు కనుమూశాడు--తన గిత్తల బండి పోతున్నది. తోట్టిలో రాముడు కూర్చున్నాడు. కుర్రతనంచేత చెరణాకోలతో రెండు గిత్తల్ని రెండు తీతలు తీశాడు అవి నాలుగుకాళ్ళ స్వారి లంకించుకొన్నవి బండి భూమిమీద ఆగటం లేదు. బండి వెనుక కూర్చున్న తనకు పగ్గాలు ఎలా అందుతాయి ? '' ఒరే రాముడూ, ఒరే రాముడూ !'' అని కేకవేస్తూనే ఉన్నాడు ఎదురుగా శరవేగంతో బస్సు వస్తున్నది తనకు గుండెల్లో గుండెల్లేవు 'రా' మని ధ్వని లోతుగా ఉన్న ప్రక్క కాలవలోకి బండి బోల్లాలు కొడుతూ ఉంది వెలపలి గిత్త తల పగిలి రోడ్డు మీద గోలి తిరిగి చస్తూ ఉంది. దాపలిగిత్త 'కూ' అని రైలు లాగా కూతపెట్టి అంతదూరాన పోయి పడ్డది. దాని వళ్ళంతా రక్తమయమే, సీత, రాముడు ఏమయ్యారో అంతే లేదు గడగడ వణుకుతూ బండిలోనుంచి బయటకి వచ్చాడు పకపక నవ్వుతూ చంద్రశేఖరం బస్సు ఆపుకొని నిలబడ్డాడు. '' అంతే కావాలి. అన్యాయానికి ఒడిగడితే ఏమౌతుంది !'' ఆ వికటహాసం అతని చెవుల్లో గింగురు మన్నది.

ఉలిక్కిపడి పుల్లయ్య లేచాడు. ఒళ్ళంతా చెమటలు. భార్యను కేకవేసి నీళ్ళు తెప్పించుకొని కాళ్ళు చేతులు కడుక్కొని మంచినీళ్ళు త్రాగేవరకు అతనికి దడపోలేదు.

అతడు నేరుగా పోలం వెళ్ళాడు. పనిమనుషులు గడ్డి మోపులు కడుతున్నారు. ఆపని ఆ సాయంకాలానికి పూర్తి కావలసింది కాని మరునాటి మధ్యాహ్నం వరకూ పూర్తి అయ్యేటట్లు కనిపించలేదు ''తూంబుర్రల్లాగ నిద్రపోతున్నారా ? ఏమి చేస్తున్నారు పొద్దుణ్ణించి ? '' అని 23
గదిమాడు అసలు తానంటే ఇటీవల తనపనిలో తిరిగేవాళ్ళకు కూడా భక్తిగౌరవాలు ఒక్కసారిగా మటుమాయమైనట్లు కనిపించింది బండివద్ద కట్టివేసి ఉన్న ఎద్దులముందు మేత ఎగద్రోయాలని పోతే అమిత సాధువుగా ఉండే పుల్లెద్దు కస్సు మన్నది అవును, తనంటే పశువులకు కూడా మంటగానే ఉన్నది ! ఉండదు మరి, తా నలాంటి అకృత్యానికి తలపడితే ?

పుల్లయ్య అంతలోనే వాస్తవలోకంలో పడ్డాడు, అదంతా వట్టిది. తనహృదయం ఉలిక్కిపడుతున్నది అంతేకాని మంచిచెడ్డలు న్యాయాన్యాయాలు పశువుల కేమి తెలుసు? జడ్జీలవంటి వాళ్ళకే ధర్మ మంటే ఏమిటో తేలక కొట్టుకుచస్తారే, నోరు వాయి లేని పశువుల కెలా తెలుసు ?

పుల్లయ్య మళ్ళా ఊళ్ళోకి బయలుదేరాడు. చింత చెట్టు వద్ద సాంబయ్య ఆప్యాయంగా పలకరించాడు రచ్చబండవద్ద కూర్చున్న వాళ్ళు మందహాసం చేసి, 'వెళ్ళుదురుగాని రండి' అని సగౌరవంగా పిలిచారు. ఇదంతా భక్తిగౌరవాలతో జరుగుతున్నదా ? అతనికి అనుమానం వచ్చింది ఊరంతా నన్ను వేళాకోళం చేస్తున్నదేమో ? అతని మనస్సు పరితపించింది. శరీరం వణికిపోయింది వాస్తవం ఎలా తెలుస్తుంది ? నేరుగా అడిగితే నిజం ఎవడు చెపుతాడు ? తాను మాత్రం నేపు బోనెక్కి చెప్పబోతున్న దేమిటి ?

పుల్లయ్య ఏదో సాకు చెప్పి ఊరంతా భోజనానికి పిలిచాడు ఒకడు కూడా దిగడకుండా పిలచినవాళ్ళంతా వచ్చారు. తృప్తిగా భోంచేసి వెళ్ళిపోయారు. ఆ శుభకార్యానికి శేషగిరి కూడా వచ్చాడు మామతో ఒంటరిగా కూర్చుని చంద్రశేఖరం వ్యవహారం ఎత్తాడు.

---

జి.వి కృష్ణరావు

"మొన్న మార్వాడి నా దగ్గరకు వచ్చాడు మామా !"

"అలాగా ?"

"హామీ పత్రం చూపించాడు. అచ్చుగా నీ సంతకంలాగానే ఉన్నది ఎవణ్ణి పట్టాడో కాని బలే చక్కగా ఫోర్జరీచేశాడు శేఖరం కూడా కనిపిస్తే అడిగా, ఏమిటి వ్యవహారమని హోటలుగదిలో నువ్వు ఆ పత్రంమీద సంతకం చేశావంటున్నాడు"

"పచ్చి అబద్ధం నాజన్మలో ఇంతవరకెన్నడూ ఆ హోటలు గదిలో ఏ కాగితం మీద సంతకం చేయలేదు" పుల్లయ్య కచ్చితంగా చెప్పాడు

"శేఖరం వ్యవహారం కూడా ఏమీ బాగుండలేదు ఎప్పుడో చెల్లువేసిన పద్దులకు ఇవాళ రిజిష్టరు నోటీసులు ఇస్తున్నాడు తన రసీదులను బట్టి అతని లెక్కలే తిరగవేస్తే జమలున్నాయట ఏది ఎలా ఉన్నా వ్యవహారంలో సాక్షి సంతకం చేసిన ఒక వ్యక్తి చనిపోయాడు"

పుల్లయ్యకు అవకాశం చిక్కింది. నిజంగా హోటల్లో అతనెప్పుడూ యే కాగితం మీదా సంతకం చేయలేదు. అది అంతా పచ్చి అబద్ధం అక్కడ తాను సంతకం చేశాడని ఎవరూ రుజువు చేయలేదు కనుక కేసు నెగ్గుతుంది. ఢంకా బజాయించి నెగ్గుతుంది ఇంతకూ తాను నెగ్గుతాడా?

ఆ రాత్రి పుల్లయ్యకు కుర్చీలోనే తెల్లవారింది

## .. . ఆరు ..

లమ్మాయమ్మగారంటే ఆ ఊళ్ళోనేకాదు, ఆ చుట్టుపట్ల మూడు జిల్లాలలోను పేరు మోసింది నాలుగుసార్లు లాఠీ దెబ్బలు తిన్నది ఆరుసార్లు జైలుకు వెళ్ళివచ్చింది ఆమె పనిచేయని ఉద్యమమంటూ లేదు హరిజన ఉద్యమం, సూత్ర యజ్ఞం, ఉప్పు సత్యాగ్రహం, విదేశ వస్త్ర దహన బహిష్కరణలు, హిందీప్రచారం మొదలైన అన్ని ఉద్యమాలలోను పని చేసింది. పవిత్రభారతనారి త్యాగశీలాన్ని, దేశ సేవా ధురంధరతను, సూక్ష్మగ్రాహిత్వాన్ని తెలుసుకోవాలంటే ఆమె చరిత్రకంటె ప్రబలనిదర్శనం వేరే అవసరం లేదు

ఆమె ఎంతక్లిష్టవిషయాలనైనా ఇట్టే తేల్చివేస్తుంది. ఇప్పుడున్న సమస్యలను రాజకీయవేత్తలు, ఆర్థిక నిపుణులు, సాంఘిక సంస్కర్తలు, శాస్త్రవిశారదులు, డాక్టర్లు, లాయర్లు ముఖ్యమైన సూత్రాల అర్థం సాకల్యంగా తెలుసుకోక పోవటంవల్లనే పరిష్కరించలేక తలలు బద్దలు చేసుకొంటున్నారు అర్థం చేసుకొంటే ఈ సమస్యలు తల యెత్తనే యెత్తవు ఆ సూత్రాలలో మొట్టమొదటిది – ఆ భారతీయాలన్నీ వెంటనే బహిష్కరించాలి యంత్ర పరిశ్రమలు, పాశ్చాత్య విద్యలు, సంప్రదాయాలు పనికిరావు ఇవి నిషిద్ధాలైతే దేశంలో నిరుద్యోగత్వం, కార్మిక సమస్యలు, సాంఘిక సమస్యలు ఉండవు రెండవ సూత్రం స్వయం సంపూర్ణత ప్రతి ఒక్కడు తన పనులన్నీ తానే చక్కబెట్టుకోవాలి. అప్పుడు ఎచ్చులొచ్చులు లేక సంపూర్ణ ప్రజాస్వామ్యమేర్పడుతుంది. మూడవ సూత్రం వ్యక్తులకంటె సమాజం, దేశం గొప్పవి దేశం కోసం, సమాజం కోసం ప్రతి ఒక్కడు సంపూర్ణ త్యాగం చెయ్యాలి అలా చేస్తున్న నాడు దేశం గొప్ప దౌతుంది దేశంలో వ్యక్తులు బాగుపడతారు. ''దేశమంటే మట్టికాదోయ్ దేశమంటే మనుషులోయ్'' అన్న వాక్యంలో అర్థం లేదు 25

ఈ సూత్రాలను అమ్మాయమ్మగారు అక్షరాల అనుసరిస్తూ ఉన్నదనే చెప్పాలి. జైలులోనుంచి బయటికి వచ్చినది మొదలు ఆమె చందాలు పోగుచేసి హరిజనాశ్రమం నెలకొల్పి సాగిస్తూ ఉన్నది ఈనాడు వందమంది వరకు బాలబాలికలు ఆశ్రమంలో శిక్షణపొందే అవకాశం ఉన్నదంటే, ఆ కృషి అంతా ఒక్క అమ్మాయమ్మగారిదేనని చెప్పాలి. ప్రభుత్వం ఆమెపై నున్న అభిమానం కొలది ఇస్తున్న ప్రత్యేకపు గ్రాంట్లు ఏమీ లేవు. తానే స్వయంగా చుట్టుపట్ల గ్రామాలన్నీ తిరిగి విరాళాలు వసూలు చేసుకొని వచ్చింది. ఆశ్రమస్థలం కూడా విరాళం ద్వారా వచ్చిందే! ఆమె అంటే, ఆ ఉద్యమ మంటే గిట్టనివారు ఏమేమో అనుకొంటారు అదంతా నమ్మటానికి వీల్లేదు

కావాలనుకొంటే రాజకీయబాధితురాలుగా అయిదెకరాల పొలం సంపాదించి ఉండేది. కాని ఆమె దరఖాస్తు కూడా పెట్టలేదు. అలాంటి వ్యక్తి హరిజన విద్యార్థుల వసతి భవనం కోసం

సంపాదించిన సిమెంటు, ఇనుము మొదలైన వాటిలో చాలవరకు బ్లాకుమార్కెట్లో అమ్మింది లాభం సంపాదించిదంటారు ఇరవై పుట్లు పండి యింటికి వస్తుంటే ప్రభుత్వానికి ఎన్ని బస్తాలు అప్పగించిందో కనుక్కోమంటారు. ఆమె చెల్లెలి పేర బ్యాంకులో ఎంత నిలవ ఉందో లెక్కలు తేల్చుకోండి అంటారు ఇవన్నీ ఏ మాత్రం నమ్మటానికి వీలులేదనే చెప్పాలి కాకుంటే ప్రతి వార్షికోత్సవం ఏ హైకోర్టు న్యాయమూర్తో, ఏ ప్రముఖ మంత్రో, లేక ఏ భారత ప్రధాన నాయకుడో వచ్చి ఎందుకు జరుపుతాడు? పాడు లోకం! ఓర్వలేని లోకం!! ఎంత ఉదాత్త కార్యానికైనా స్వార్థం, సంకుచిత్వం, అధర్మత్వం ఆపాదిస్తుందే తప్ప మంచిని మెచ్చుకోలేదు గదా దీనికి ఎప్పుడు నివృత్తి కలుగుతుందో!

ఆమె వ్యక్తిగత జీవితాన్ని గూర్చి చెప్పే కథలకు అంతే లేదు మంగనిచేత కాళ్ళు పిసికించుకొంటుందట. మాలవాళ్ళకు సరిగా కూలీ నాలీ ఇవ్వదట ఒకసారి ఇంట్లో చెల్లెలి నెక్లేసు కనిపించలేదట. జీతగాడిమీద అనుమానం కలిగి కమసాలి దుకాణంలో పట్టకారు తెప్పించి తోలు ఊడివచ్చేదాకా తొడలు మెలిపెట్టించిందట అక్కడికీ చెప్పకపోతే నెత్తురు కక్కేదాకా కొట్టించిందట ఆ దెబ్బలకు తాళలేక వాడి దగ్గర దాచాను, వీడి దగ్గర దాచాను అని చెప్పాడు. తీరా వాళ్ళను కనుక్కొంటే ఏమీ ఎరుగరు. ఆ తరువాత అది ఇంటిలోనే ఉన్నదని తేలింది ఇవన్నీ నమ్మటం

ఎలా? గులాబికి ముళ్ళున్నవని చెడ్డదనలేము అమ్మాయమ్మగారిలో ఒకటి రెండు చెడ్డ గుణాలు ఉన్నవే అనుకొందాము. అంత మాత్రంచేతనే లోకంతో ఏకీభవించి ప్రతిపని చెడ్డదని యెలా అనటం? మానవుడికి ఏ మచ్చ లేకపోయినా కనీసం పుట్టుమచ్చ అన్నా ఉంటుంది.

అమ్మాయమ్మగారికి చంద్రశేఖరం సంగతి తెలుసు. పూర్తిగా చితికిపోయాడు దానికి అంతకూ కారణం అభారతీయ ప్రవర్తనమే ఎప్పుడైనా ధర్మం నెగ్గుతుంది కాని అధర్మం నెగ్గుతుందా? ఫోర్జరీ వ్యవహారంలోకూడా నేరస్థుడు చంద్రశేఖరమే కావాలి. డబ్బు కక్కుర్తి ఉన్నవాడు శేఖరమే కాని పుల్లయ్యకాడు. పుల్లయ్య చేతిలో ఏభై వేలకు పైగా మెదులుతున్నది. అది అలా ఉంచి పుల్లయ్య తండ్రి, తాత, బంధువులు సిసలైన రైతులు రైతు గొంతుకోసినా అబద్ధమాడడు. ప్రాణాలు పోతున్నా సత్యానికి నిలబడతాడు. నిజంగా పుల్లయ్య అక్రమానికి ఒడిగడితే అతని పని మూడు పూవులు ఆరు కాయలుగా ఎలా ఉంటుంది? ధర్మమే జయిస్తుంది కాని, అధర్మం జయించదుకదా! కాబట్టి పుల్లయ్య నిరపరాధి.

అమ్మాయమ్మగారికి లలిత జ్ఞాపకం రాగానే దుఃఖం పొంగిపార్లింది ఎలాంటి గతి పట్టింది! చితికిన సంసారం! ముగ్గురు కాదు నాలుగో పిల్లాడుకూడా పుట్టాడు పిల్లల్ని ఇవతలికి అవతలకి తీసేవాళ్ళు లేరు పాపం చినిగిన పాతలు కట్టుకొని ఇంత పూసుకొని తిరుగుతున్నారు వాళ్ళకు వేళకు అన్నపానాలు లేవు. కేశసంస్కారం లేదు. అలాంటివాళ్ళను ఆదుకోటానికి కాకపోతే ఆశ్రమాలు దేనికి? పెద్దపిల్లల నిద్దరినీ ఆశ్రమంలో చేర్చుకొంటే లలితకు కాస్త తేలిక అవుతుంది సంఘంలో పాతుకొనిఉన్న అస్పృశ్యతను తొలగించటానికి మార్గం ఏర్పడుతుంది రైతులు కూడా తమ పిల్లలను ఆశ్రమానికి పంపిస్తారు అన్ని వర్గాల పిల్లలు ఒకేచోట చదువుకోటం, ఒకేచోట కూడిచి ఆడుకోవటం

ఇవన్నీ విషమల్యానికి, వర్ణవిభేదనిర్మూలనకు తోడ్పడుతవి. ఇంతవరకూ కూలినాలి జనానికి ఆశ్రమమంటే పెంటుగా ఉన్నది తాను వాళ్ళకు చేసిన అపకార మేమిటో తెలియదు శేఖరంపిల్లలు ఆశ్రమంలో ఉంటే వాళ్ళకు అతనిమీద ఉన్న అభిమానం కొంతలో కొంతైనా తన కృషిమీద ప్రసరిస్తుంది. ఇవాళ లోకమంతా ప్రజాభిప్రాయంమీద కదా నడుస్తున్నది

ఆమె ఖద్దరు సంచి పట్టుకొని బయలుదేరింది. పాడు దేవుడు ఆమెకు స్థూలశరీరం ఇచ్చాడు తనాబీలాగా ఉంటుంది స్త్రీ సహజమైన మిట్టపల్లాలు ఎక్కడాలేవు మెల్లగా రుబ్బుడు పత్రంలాగా దొర్లుకొంటూ వెళ్లింది. లలిత అప్పటికి నీళ్ళు పోసుకొని నెలరోజులైనది కాని రుగ్మత వదలలేదు పాపను పక్కలో వేసుకొని మంచంలో పండుకొన్నది. లేచే సత్తువ లేక హీనస్వరంతో అమ్మాయమ్మ గారిని పక్కన ఉన్న కుర్చీలో కూర్చోమన్నది. పాతకుర్చీ కిరకిరలాడింది.

వాల్చిన మంచాలు వాల్చినట్లుగానే ఉన్నాయి పక్క గుడ్డలు పాతచీరలు అక్కడొకటి అక్కడొకటి పడేసి ఉన్నాయి టేబులుమీద చిందరవందరగా పుస్తకాలు, చిత్తు కాగితాలు ఉన్నవి. ఆడపిల్ల ఒక మూల కూచుని అచ్చం గాయలు ఆడుకొంటున్నది చిన్న వాళ్ళిద్దరూ గుప్ గుప్ కూ, గుప్ గుప్ కూ, గుప్ గుప్ కూ అని అరుస్తూ ఇంట్లో అటూ ఇటూ పరిగెత్తుతున్నారు అమ్మాయమ్మగారికి ఒళ్ళంతా చీమలు పారుకాడినట్లయి ఆ వికారాన్ని పూర్తిగా అణచి వేసుకొన్నది

ఆమె జాగ్రత్తగా లలిత తల్లిదండ్రుల పూర్వస్థితిని పొగడింది , చంద్రశేఖరం చదువుసంధ్యలను, తెలివితేటలను మెచ్చుకొన్నది ఇప్పుడు వచ్చిన కష్టాలకు లలితతోపాటు కన్నీరు పెట్టింది ''అన్నీ చీకటిరోజులే కావమ్మా! కొన్ని రోజులు వెన్నెల, కొన్ని రోజులు చీకటి సుఖదుఃఖాలు కూడా యింతే'' అని ఓదార్చింది.

''లలితమ్మా'', ఇటు చూడు. పెద్ద పిల్లల్ని, ఇద్దర్నీ ఈ రెండు నెల్లూ ఆశ్రమంలో ఉంచుకొంటాను. ఈ లోపున మీ వ్యవహారాలన్నీ ఒక ఒడ్డున పడతాయి. నీకు కాస్త ఒంట్లో సత్తువ వస్తుంది'', అని వచ్చిన పని కాస్తా బయట పెట్టింది

లలితకు దుఃఖం కోపం ఒక్కసారి ఉప్పెనలాగా వచ్చాయి. రోగదౌర్బల్యంవల్ల బావురున ఏడ్చింది దానితో అమ్మాయమ్మగారి గుండె దడదడలాడిపోయింది.

'' ఎంత చితికిపోయినవాళ్ళకైనా కన్నపిల్లలు ఎక్కువ కారమ్మా! డబ్బు లేకపోయినా, కులగౌరవాలున్నాయి మాలా మాదిగ పిల్లల పొత్తుకు నా పిల్లల్ని పంపించేదా? ఈ బొందిలో ప్రాణం ఉండగా అలాంటిది జరగదు. ముమ్మాటికీ జరగదు'' అన్నది లలిత.

''నేనన్న మాటల్లో తప్పు ఏముందమ్మా?'' అని కలవరపడుతూ అన్నది అమ్మాయమ్మ

''మీకూ, మీ దేశభక్తికి పదివేల నమస్కారాలు. ఉన్నదో లేదో మాపాట్లు మేము పడతాము ఎందుకు చెల్లాచెదరు చేస్తారు? మమ్మూ, మా పిల్లల్నీ ఒక చోటనే పడి ఉండనీయండి మీ ఆశ్రమానికి పిల్లలేమీ తక్కువకాదు. మీ చెల్లెలి సంతానం మద్రాసులో చదువుతున్నదిగా!'' అన్నది

అమ్మాయమ్మ మండిపడ్డది ఒక్కక్షణం మరి కూహోచేసిపోయింది లేచి తిరిగి ఆశ్రమంవైపు దొర్లించి ఆమె హృదయంలోనో భావాలలోనో ఎక్కడో గాయమున్నది లలిత అమాయికంగా అన్నమాట పోయి అక్కడనే తగిలి ఉంటుంది. లేకపోతె అంత కోపపడవలసిన అవసరం లేదు.

లలిత వెక్కి వెక్కి యేడుస్తూనే ఉంది అమ్మాయమ్మ గారు అటుపోగానే యిటు చంద్రశేఖరం వచ్చాడు. అతడు వచ్చేటప్పటికి లలితకంటివెంట నీరు కారుతూ ఉంది. అతడు కాళ్ళు తొక్కుక్కొన్నాడు కారణం అడిగాడు. ఆమెకు ఏడుపు ఆగలేదు మంచం ప్రక్కన ఉన్న కుర్చీలో కూర్చుని ఆమె తల నిమురుతూ మళ్ళీ అడిగాడు అమ్మాయమ్మగారి మాటలన్నీ పూసగుచ్చినట్లు చెప్పింది అతడు మండిపడ్డాడు. చెడ బడా తిట్టాడు. తన భార్యను, పిల్లలను తనకు కాకుండా చేయడానికి పూనుకొన్నది. తాను వచ్చినప్పుడే ఉండక పోయింది ఏమి చేసేవాడో తేలేది.

లలిత అతనిచెయ్యి పట్టుకొన్నది. '' ఏమైనా కానీండి, మిమ్మల్ని వదలి పెట్టిపోతామా? ఎక్కడికి పోతాము?'' అంటూ అతనిచేయి కన్నీటితో అభిషేకించింది ''ప్రపంచమేమైనా మనలను ఎవరూ విడదీయలేదు'' అంటూ ఆ బాలెంతరాలిని ఓదార్చాడు

# .. ఏడుం ..

మల్లయ్య ఆ ఊరికి అంతకూ షావుకారు. ఎంత ఉందో మాత్రం ఎవరూ చెప్పలేరు. ఇన్‌కంటాక్సు అధికారులకు తేలని లెక్కలు మనవోటి సామాన్యులకు ఎలా తేలుతవి? ఉన్న భూమి ఏమో కరణాల లెక్కలో ఉన్నది. అది దాయటానికి వీలులేదు దానినిబట్టి చూస్తే, మేనమామకు పిల్లలు లేక వచ్చినది పాతిక ఎకరాల మాగాణి పినతల్లి ప్రేమకొందికి వ్రాసి యిచ్చినది ఏభై ఎకరాలు. కూతురు భర్త చనిపోవటంవల్ల ఇప్పుడు భుక్తంలో ఉన్నది వందెకరాలు ఈ కంద్రిక కూతురు పోతే తిరిగి వారసులకే సంక్రమిస్తుంది పోతే తండ్రి అప్పగించి పోయినది వందెకరాలు మాత్రమే. ఈ పొలం కూడా అంతమంచిది కాదనే చెప్పాలి సాలీనా పండేది ఒకటే పంట. అదికూడా ఎకరానికి ముప్పందుమే రాలుతుంది.

సంసారం కూడ పెద్దదే. మల్లయ్య, అతని భార్య, ఒక కొడుకూ, ఒక కూతురూను. వీళ్ళలో సంపాయించే వాళ్ళు ఎవరూ లేరు. అంతా తినేవాళ్ళే! ఇది చాలదన్నట్లుగా యాభైయోవడిలో ఒక కొడుకు పుట్టాడు. మల్లయ్య జ్యోతిష్కుణ్ణి కనుక్కుంటే వాడు ఎంతో కాలం బ్రతకడని చెప్పాడు దారిద్ర్యంలో ఉన్న మల్లయ్యకు చాల తేలిక యిచ్చి ఉండాలి. పైకి ఎక్కడా అనలేదు. అయినా ఆ సంగతి మనకు అనవసరం. 29

ఆయన చదువుకోలేదు. కాని కనీసం 18 ఏళ్లు కష్టించి చదివినవాళ్లకు తెలియని శాస్త్రార్థ కూడా ఆయనకు కొట్టిన పిండే, అతని ప్రతిభ అలాంటిది. ఉధాహరణకు జగత్తులోని శక్తి తీసుకుందాము ఈ శక్తి అంతా నియతం దీన్ని పెంచలేము. తగ్గించలేము. ఎప్పుడూ అవ్యయమే! ఈ సిద్ధాంతాన్ని రుజువు చేయాలంటే యెంత పరిశోధన కావాలి? ముఖ్యంగా సూర్యుడు చల్లబడిపోతున్నాడని ఇటీవల బయలుదేరిన సిద్ధాంతాన్ని ఖండించాలంటే యెంత పరిశోధన కావాలి? ముఖ్యంగా సూర్యుడు చల్లబడిపోతున్నాడని ఇటీవల బయలుదేరిన సిద్ధాంతాన్ని ఖండించాలంటే మాటలా? మల్లయ్య ఇట్టే రుజువు చేస్తాడు ఎలాంటి ఉపకరణాలు లేకుండానే సత్యాన్ని సాక్షాత్కరింప చేస్తాడు. ప్రపంచంలో ఉన్న శక్తే డబ్బు ఈ డబ్బు పెరగదు. ఒకడు సంపాదిస్తున్నాడంటే అంతమేరా ఇతరులు నష్టపడుతున్నారన్నమాట. అలాగే పుల్లయ్య డబ్బు కూడ బెడుతున్నాడంటే అంతలెక్క తాను నష్టపడుతున్నాడు. తన షావుకారుతనం నిలబెట్టుకోవాలన్నా, తనకు ఉన్నది కాపాడుకోవాలన్నా వెయ్యికళ్లతో చూస్తూ ఉండాలి. తాను అలా చూస్తున్నాడు కాబట్టే ఊళ్లో బ్రాహ్మణుల ఆస్తులు మాన్యాలదగ్గరనుండి దొడ్డిదోవలు దాకా తనకు దక్కాయి తాను చూడకపోతే ఏమయ్యేది? ఇతరులు తన్నుకపోయేవాళ్లు ఇదివరకు చంద్రశేఖరాన్ని కనిపెట్టి ఉండలేక దుంపతెగిపోయింది. ఇప్పుడు అతనివల్ల భయపడవలసిన పనిలేదు కాని పుల్లయ్య సంగతే తేలకుండా వచ్చినది.

---

జి వి కృష్ణరావు

పుల్లయ్య నిజంగా హామీ ఉన్నాడా లేదా? చంద్రశేఖరం దెబ్బతిని ఉన్నాడు ప్రజలకి జంకి ఉండటం, మాటనిలబెట్టుకోవలసిన అవసరం నేడెంతైనా ఉన్నది కాబట్టి ఈ తప్పుడుతనానికి దిగే అవకాశం లేదు. ఒకవేళ దిగాడే అనుకొన్నా పుల్లయ్య వంటివాడికి తప్పు అంటగట్టి రుజువు చేయటమంటే మాటలా? చంద్రశేఖరం అంత లోకం తెలియని వెర్రివెంగళప్ప కాడు ఎంత అనుభవం లేకపోయినా ఫ్యాక్టరీ వ్యవహారంతో నెత్తి బొప్పి కట్టి తెలిసివచ్చి ఉండాలి. అలాంటప్పుడు నిర్హేతుకంగా పుల్లయ్యమీద వ్యవహారం నడపటానికి దిగి ఉండడు. పుల్లయ్యే దురాగతానికి దిగి ఉండాలి!

అతడు ఈ పనికి ఎందుకు దిగాడు? మిల్లు కాజేయటానికి వీలులేదు మారువాడీలే కోడిపిల్లను తన్నుకుపోయినట్లు తన్నుకుపోతారు. ఇతనిదాకా రానివ్వరు. శేఖరం ఇంటి మీద కన్ను ఉన్నదా? అది తనకు తనఖా పెట్టి ఉంటే అతనికి ఎలా వస్తుంది? కాబట్టి అదికూడా కాదు మరేమిటి పుల్లయ్య ఉద్దేశం? అదే బోధపడకుండా వచ్చింది. వీడి తస్సాదియ్యా! లేవలేని పుల్లయ్యకు ఇవాళ కొమ్ములు బారెడై కూచున్నవే! ఏది ఎలాఉన్నా పెద్దఎత్తే ఏదో ఎత్తాడు. మెదలకుండా ఉంటే లాభంలేదు. అతని వేలితోనే అతని కన్ను పొడవాలి. ఈ వ్యవహారంలో ఎలాగైనా పుల్లయ్యను జైలుకు పంపిస్తే ఊళ్లో మరి తలయెత్తే మగాడే ఉండడు. చితికిన చంద్రశేఖరం కోర్టులో గెలిచినా తనకు ఎలాంటి ప్రమాదం లేదు.



మల్లయ్యకు పుల్లయ్యను నూరారైనా సాధించటం అవసరమైపోయింది అతనివేళ్ళు మీసాలు దువ్వాయి. "అరే గంగాధరం! కాస్త ఇటు రారా!" అని కేక వేశాడు. దొడ్లో పన్నెండేళ్ళవాడు ఒంటరిగా బచ్చా లాడుకొంటూ పలకలేదు మరొకసారి కేక వేశాడు జారిపోతున్న లాగు పైకి ఎగలాగుకొంటూ వచ్చాడు. చొక్కా బుజాలవద్ద చినిగి ఉన్నది అది మల్లయ్యకంటబడ్డది

"ఓరి వెధవ! నీదగ్గర కత్తులున్నాయిరా?" అన్నాడు

"చాకు కొనిమ్మంటే ఇవ్వలేదే నాకు కత్తులెక్కడినుంచి వచ్చాయే?"

"నీ తెలివితేటలు మండినట్లే వున్నాయి. వీరయ్యడాబాలో కూచుని వుంటాడు కాని ఒకసారి పిల్చుకురా. ఇక్కడున్నట్లు రావాలి."

"ఎందుకే?"

"నీముఖానికి – చెయ్యమన్నపని చెయ్యవు నీకున్న తెగులేగా"

"మళ్ళీ ఇంటికి వస్తావా?"

"ఓ" అని చేతులతో చక్రాలు కొడుతూ పరుగెత్తుకు వెళ్లాడు. మల్లయ్య లోపలికి వెళ్లి పాయుగల రెండు పొగాకు కాడలు పట్టుకువచ్చాడు. ఒకకాడ చక్కగా ఈనెలుతీసి చుట్ట చుడుతున్నాడు. ఇంతలోనే వీరయ్య వచ్చాడు

"పిలిచావా బావా?" అంటూ గచ్చు అరుగుమీద పై పంచకొసతో అటూ ఇటూ దుమ్ములేకుండా కొట్టి కూర్చున్నాడు.

''ఇదిగో కాడ, చుట్టకాల్చి చెప్పు ఎలా ఉందో? ఉత్తరాది దని మొన్నొకడు వచ్చి ఇచ్చిపోయాడు. నాకు అనుమానంగా ఉంది ''

వీరయ్య పొగాకునాణెం, గొడ్డునాణెం ఎన్నటంలో మొనగాడు. అతడు వాసన చూచి, ''ఉత్తరాదిదే కాని సరిగా పదును చేయలేదు'' అంటూ చుట్టచుట్టి ముట్టించాడు.

''ఏదో జిరాయితీహక్కు అంటున్నారు వచ్చే ఏడాదినుంచి వ్యవసాయం పెడదామని ఉంది ఏమంటావు?''

''ఏమనేది ఏముంది! మగతాకిస్తే భూమి గుల్లయిపోవటం తప్ప మరేమీ ప్రయోజనం లేదు మళ్లీ చేలు చేలు కావాలంటే యెంత ఖర్చు పడాలి? అందులోనూ రెండో పంటకు అలవాటు పడ్డారు పొలాలు యెందుకూ పనికిరాకుండా పోతున్నాయి అయితే ఎడ్లు ఏడెనిమిది జతలకన్నా కావాలా?''

''ఈ యేటికి రెండుజతలు చాల్లే. ఇప్పుడు చేయదలచుకున్నది ఇరవై యెకరాలేగా!''

''మొన్ననే చూచి వచ్చాను మూడు మూళ్ళు, మూడుమూళ్ళ బెత్తెడు ఉంటాయి మంచిగిత్తలు పుల్లయ్యగారి గిత్తలు వాటిముందు బలాదూరు దియ్యను పనికిరావు కాకపోతే పదిరూపాయలు పెచ్చుచెపుతున్నాడు. ఏమి పుటక! ఏమి తలకట్టు! వాటిని వదలి రా బుద్ధి పుట్టలేదంటే నమ్ము '' 31

''అన్నట్లు కొన్నాళ్లు మాధవయ్యగారి పనిలో ఉన్నావు కదూ!''

''లేకేమీ నాలుగేళ్ళున్న. ఆ యింట్లో యేమి జరగవలసివచ్చినా నాచేతిమీదుగా జరిగేది?''

''పుల్లయ్య హామీ సంగతి యేమన్నా నీకు మాధవయ్య చెప్పాడా? అతడేనటగా సాక్షి సంతకం చేసింది.''

వీరయ్య తన తెల్లజుట్టు గోకుకొన్నాడు. ''సరిగా జ్ఞాపకం రావటం లేదు'' అన్నాడు.

''మళ్ళొకసారి ఆలోచించి ఏ సంగతి చెబుతావుగా!'' మల్లయ్య యెక్కడికో బయలు దేరడానికి నిలబడ్డాడు.

''అలాగే'' అని వీరయ్య చుట్ట అవతల పారేసి ఒకటి రెండడుగులు వేశాడు '' ఇదిగో మంచిరోజు చూచి ఎడ్లకు బయలు దేరుదాము'' అని షావుకారు హెచ్చరించాడు తప్పకుండా వస్తానంటూ వీరయ్య వెళ్ళిపోయాడు

వీరయ్యకు అప్పటినుంచీ అదే స్మరణ అయిపోయింది తన మీదనే చంద్రశేఖరం భవితవ్యం ఆధారపడి ఉంది మాధవయ్యగారు ఎప్పుడన్నా యీ సంగతి చెప్పి ఉంటాడా? చెబితే ఎప్పుడు చెప్పి ఉంటాడు? మెట్టదున్నే రోజులలోనో లేక మాసూలు రోజులలోనో అయి ఉండాలి మాసూలు రోజుల్లో మాత్రం కాదు అప్పుడు ఉబ్బసంవచ్చి మాధవయ్యగారు మంచం దిగిలేదు ష్టిదూగర ఆయన తత్వానికి పడదు వామిలో గడ్డి దూసినా, నూర్పిళ్ళులో ఉన్నా, వామివేసినా ఉబ్బసం వచ్చేది అప్పుడు కాదు తొలకరిరోజులలోనే అయి ఉంటుంది. ఎండుగడ్డమీద క్రిందటి

రోజుననే నాలుగు దుక్కులవర్షం కురిసింది కాలువలు వదిలారు మబ్బుపట్టి చల్లగా ఉంది ఆ రోజున తాను, మాధవయ్యగారు కోటేర్లు వేసుకొని దుక్కి దున్నటానికి పడమటి పొలం పోతున్నారు అవును. సరిగా అప్పుడే చెప్పాడు. పుల్లయ్యగారు శేఖరంగారికి హామీ ఉన్నారనీ. తాను సాక్షిసంతకం చేశాననీ చెప్పాడు ఆ మాటలు ఇప్పటికి కూడా చెవుల్లో వినిపిస్తూ ఉంటే చెప్పలేదనుకోటానికి వీలులేదు. ఆ గొంతు, ఆ మాటలు ఇప్పుడు వినబడుతూనే ఉన్నవి తనకల్పనే అయితే అవి ఎలా వినిపిస్తాయి?

మల్లయ్యగారికి ఈ గొడవంతా దేనికి? ఈ వ్యవహారంలో ఆయనకు వచ్చి ఒళ్ళో పడేదేముంది? ధర్మంకోసమే ఆయన తాపత్రయపడుతుండాలి

మల్లయ్యగారు ఆలోచించుమని చెప్పిన మూడో రోజున అతడు ఇంటిముందు అరుగుమీద మునిమాపువేళ కూర్చుని ఉండగా వీరయ్య కనిపించి చెప్పాడు.

''ఆలోచించానండి! జ్ఞాపకం వచ్చింది. తొలకరిరోజుల్లో మాధవయ్యగారు అన్నారు పుల్లయ్యగారు శేఖరంగారికి హామీ వున్నారనీ, తాను సాక్షిసంతకం చేశానని చెప్పారు చచ్చి ఏలోకాన ఉన్నాడో ఆయన అబద్ధ మాడడు. కాటికి కాళ్ళు చూచుకొన్న నాకూ అబద్ధం ఆడవలసిన పని అంతకన్నా లేదు.''



''మంచి పనే జరిగింది. నీకే జ్ఞాపకం రాకపోతే పాపం చంద్రశేఖరానికి జైలు తప్పేది కాదు భగవంతుడు నిన్ను సాయంపంపుతున్నాడు పోయి నిన్ను సాక్ష్యం వేసుకోమని చెప్పు. అతడు నీబుణమెన్నడూ తీర్చుకోలేడు.'' అన్నాడు ''వస్తానండీ'' అని వీరయ్య బయలుదేరి పోతుండగా '' ఇదిగో వీరయ్యా! కోమటింట్లో మంచి పుగాకు లేదు నెత్తి మూటల వాళ్లుకూడా రావటం లేదట్లే వుంది. సరియైన కాడ దొరక్క ఇబ్బందిపడుతుండాలి. ఈ నాలుగు కాడలు తీసికెళ్ళి కాల్చుకో'' అని మల్లయ్య సవాసేరు పుగాకు ఇచ్చి పంపాడు.

మల్లయ్యగారిది యెంత ధర్మబుద్ధి! పేదలమీద ఎంత కనికరం! దీపాలు పెట్టారు. ఆలోచనలో మునిగి ఉన్న మల్లయ్య ఉత్తరీయం నడుముకు మోకాళ్ళకు చుట్టుకొని వెనుకకూ ముందుకూ ఊగుతున్నాడు. ఆ సమాధిలో సగుణ బ్రహ్మమే తోచిందో నిర్గుణ బ్రహ్మాస్వాదమే కలిగిందో చెప్పలేము. అతడు కళ్ళు విప్పి చూచేటప్పటికి ప్రక్కయింట్లో గొంతెత్తి చదువుతున్న విద్యార్థి గొంతు వినిపించింది.

''నాన్నా, నీకు అక్కాయి నీళ్ళు తోడిందే'' గంగాధరం చెప్పాడు

''నువ్వు పోసుకో, నేనే వచ్చుటప్పటికి కాస్త ఆలస్యం అవుతుంది'' అని కొడుకుకు చెప్పి ఉత్తరీయం బుజాన వేసుకొని చీకట్లోనే బయలుదేరాడు

పంతులు ఆవులిస్తే ప్రేవులు లెక్కపెడతాడు ఎలా ఒప్పించేటట్లు? కంపనా కట్టైనా కాలదే. ఎలాగబ్బా? ఊళ్లో అన్ని తత్వాలు కాచి వడపోశాడు తండ్రి కున్న మెతకదనమే ఉంటే ఊరంతా ఒక కొలికికి వచ్చి ఉండేది. తన బోటివాళ్లంతా శంకరమాన్యాలు పట్టి ఉండేవాళ్లు మనస్సుకు

నచ్చితే తప్పు వినడు డబ్బూ గిబ్బూ ఏమీ ప్రయోజనం లేదు అతడు పూనుకొంటేకాని పని కాదు. ఎలాగైనా మెడలువిరిచి పనిచేయించాలి. కొంపతీసి తనకే యెసరు లేదు కదా! అలాంటి దుర్మార్గాలకు రాడు. వచ్చినా తనతో వ్యవహారమంటే నిప్పుతో తలగోకుకొనటమని తెలుసు ఎరిగి ఎరిగి యెవడైనా అద్వైతానపడతాడా?

మల్లయ్యకు భజగోవిందశ్లోకాలు వినిపించాయి బయట వాకిట్లో నిలబడి, ''ఎంతులూ'' అని కేక వేశాడు లోన సత్యనారాయణపంతులు పిల్లవాడికి తెలుగు పాఠమేదో చెబుతున్నాడు. కుర్రవాడు, ''నాన్నగారూ, స్కూల్లో తెలుగు పండితులు ఇలా చెప్పారే'' అన్నాడు. ''అలా చెవితే చాలా దోషాలు వస్తాయి, నేను ఇప్పుడు చెప్పిందే సంప్రదాయం ''

''ఇలా రేపు పరీక్షల్లో వ్రాస్తే గుండుసున్నా పెడితే?''

''ఎందుకు పెడతారు సరిగా వ్రాస్తే?'' మల్లయ్య మళ్లీ కేక వేశాడు ఈసారి వినిపించింది ''ఎవరు వారు?'' అంటూ పంతులు వీధిగుమ్మంలోకి వచ్చాడు

''నేనే పంతులూ!''

సత్యనారాయణ ఆ చీకట్లో ఎగాదిగా చూశాడు '' మీరా లోపలికి వెళ్లుదాము రండి ''

''ఎందుకులే! ఇక్కడే కూర్చో వచ్చుగా!'' మల్లయ్య అరుగుమీదికి చేరాడు. 33

''అరే! పెద్దబ్బాయి, లాంతరు, చాప పట్టుకురారా!'' సత్యనారాయణ కేక వేశాడు

''ఇప్పుడు ఆ శ్రమంతా దేనికిగాని అటు కూర్చోండి చెబుతాను.''

''ఈ చీకట్లో పడి మీరు రావాలా? అబ్బాయిచేత కబురుచేస్తే కాకపోయిందా?''

''పడమటేపు వెళ్లి వస్తున్నాను దారిలోనేగదా యిల్లు, మాట్లాడిపోతే సరిపోతుందని పిల్చాను ''

ఇంతలోనే పంతులు పెద్దకొడుకు లాంతరు, చాప పట్టుకొచ్చాడు,

''లాంతరు అక్కర్లేదులే లోపలికి తీసుకు వెళ్ళు'', అన్నాడు మల్లయ్య. పంతులు అరుగుమీద చాప పరిచి కూర్చోమన్నాడు

''ఇప్పుడదంతా దేనికిగాని, ఈ ఒక్కమాట చెవినేసి పోదామని వచ్చాను. అవునంటే అవుననో, కాదంటే కాదనో చెప్పాలి ''

''ఊళ్ళో ఇంతమంది పెద్దలుంటే నేను చెప్పగలిగిందేమిటి?''

''లేరనా, ఉన్నారు. మనసు కుదరాలి కదా! సరేకాని, ఈ నెలరోజులూ .. మళ్లీ ఎవరిదగ్గరా అనకండి, మీ షావుకారుతో కూడా అనవద్దుసుమా!''

''నేను పుల్లయ్యగారి గుమాస్తా నన్న సంగతి మీకు తెలిసిందే కదా!''

''ఎక్కడి పంతులవయ్యా? ఒకళ్లజోలి మనకెందుకు పడుతుంది? ఎప్పుడన్నా ఇతరులవ్యవహారంలో నేను జోక్యం కలిగించుకొన్నట్లు విన్నావా?''

---

*జి వి. కృష్ణరావు*

''అప్పేప్పే' అది కాదు, నాసంగ తేదో చెప్పుకొంటున్నాను అంతే ''

''అసలు సంగతేమిటంటే బస్సు పర్మిట్టుకు పెట్టాను. అది పది పదిహేను రోజుల్లో వస్తుంది. ఆ రోడ్డున రూపాయలు పండుతాయంటే నమ్ము బస్సులుకూడా అమ్మకానికి సిద్ధంగా ఉన్నాయి. అయితే ఈ వ్యాపారం ముక్కూ మొగం నాకు తెలియదు. ఆ సంగతి నీకు తెలుసు ఎవర్నన్నా నమ్మితే వాడు నట్టేట ముంచితే ఏమి చేయును? అసలే నాకు పెద్ద అనుమానం నువ్వైతే అన్నివిధాలా సమర్థుడివి ఈదుకొస్తావు నీమీద ఉన్న నమ్మకం మా పిల్లలమీద కూడా లేదు పెట్టుబడి అంతా పెట్టుకొని లాభంలో పావలా వాటా నీ కిస్తాను ఇప్పుడు గిడుతున్న దానికంటె రెండు మూడు రెట్లు ఎక్కువగానే గిడుతుంది కాని తక్కువ గిట్టదు దీనికి ఏమంటావు? ఏదో ఒకటి తేల్చి చెప్పు ''

పంతులు సావధానంగా విన్నాడు. అతని మనస్సులో అనేక ఆలోచనలు స్ఫురించాయి. పుల్లయ్యగారు ఎటు లేదన్నా సంవత్సరానికి ఆరువందలదాకా ముట్ట జెబుతున్నాడు. మల్లయ్య చెప్పిన మాట బాగానే ఉన్నది ఈ రోజుల్లో అతడు చెప్పినదానికంటె ఎక్కువే గిట్టుబాటు అవుతుంది ఎందుకు ఒప్పుకోగూడదు? ఒప్పుకోకపోతే ఈ సంసారం ఈదే దెట్లా? ఏటేటా కుటుంబవ్యయం పెరుగుతున్నదే కాని తరగటం లేదు తనకు ఇలాంటి ఉపకారం చెయ్యటానికి ఈయనకు ఎందుకు బుద్ధిపుట్టినది? తా నెన్నడూ ఆయనకు ఆవగింజంతైనా సాయంచేసి ఎరగడు అంతమాత్రంచేత ఉపకారం చేయరాదని ఉన్నదా? లేదు కాని ఇన్ని కోట్ల జనాభా ఉంటే తనకే ఎందుకు చేయాలి? తనపై నమ్మకం కుదిరింది కాబట్టి చేస్తుండవచ్చును. తాను ఒక్కడేనా నమ్మకస్తుడు? తతిమ్మావాళ్లంతా దొంగలా? కాదు అయినప్పుడు ఇందులో ఆంతర్యమేదో ఉండాలి. ఏమి టది? ఏదో ఉందనుకొందాము. తాను ఒప్పుకొంటే నష్టమేమిటి? వ్యాపారం సరిగా సాగటం మొదలు పెట్టిన తరువాత తనను బయటికి పంపివవచ్చును అప్పుడు ఏమి చేస్తాడు? తొలగించటానికి వీలులేకుండా కంట్రాక్టు బిగించుకోవచ్చును కంట్రాక్టుకు కూడా అందని చిక్కులో పెట్టి బయటికి గెంటవచ్చును మానవుడికి ఆ మాత్రం తెంపు, సాహసం లేకపోతే ఎలా అభివృద్ధికి వస్తాడు? ఇంత వరకూ అవి ఒప్పుకోవచ్చు అయితే మరొక విషయం ఉన్నది తన తండ్రి, తాను ఇన్నేళ్లు పుల్లయ్యవద్ద పనిచేశారు అతడు తమ్ము కన్నులకు కప్పుకొంటున్నాడు. తాను గుమాస్తాగిరి నుంచి మానుకోవటంవల్ల ఆయనకేమైనా తాను వ్యక్తిగతంగా అన్యాయం చేసినవాడవుతాడా? తాను వ్యాపారం లోకి పోవటంవల్ల ఆయనకు తానేమి కష్టం కలిగిస్తున్నాడు? మరి ఆయనతో గూడా చెప్పవద్దని ఎందుకన్నాడు? ఇంకా పర్మిట్టు రావలసి ఉన్నది కనక పుల్లయ్యగారేమైనా అధికార్లను పట్టుకొని విఘాతంకలిగించవచ్చు నన్న దృష్టితో అని ఉండవచ్చును. కాక . .. ఫోర్జరీ వ్యవహారానికి మల్లయ్యకు ఏమైనా సంబంధం ఉన్నదా? నేరుగా ఎలాంటి సంబంధం లేదు. శేఖరం గారితో చుట్టరికంకూడా లేదు పార్టీ అభిమానాలు ఏవ్వాయా? వాటికి ఒక నీతి నియమం ఏడిస్తే ఊహించుకోవచ్చు ఏదైనా ఉంటే మల్లయ్యకు ఫోర్జరీ వ్యవహారంలోనే సంబంధం ఉండాలి. దాన్నిబట్టి పుల్లయ్యగారికి వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పించడటం కోసమని తనపై మల్లయ్యకు

ఈ లవ్యాపానురాగం కలిగి ఉంటుంది అంతేకాని తాను నమ్మకస్తుడనీ కాదు, సమర్థుడనీ కాదు తనకు బస్సుల వ్యవహారం బొత్తిగా తెలియదని తెలిసికూడా అడుగుతున్నాడంచే ఇదే కారణం కావాలి

అయితే పుల్లయ్యగారికి వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పటానికి సిద్ధమైతే మల్లయ్య చెప్పినదానికి ఒప్పుకోవచ్చు పుల్లయ్యగారు అన్యాయానికి దిగినప్పుడు తాను యధార్థం చెబితే తప్పు ఏమున్నది? చూస్తూ చూస్తూ అన్నెము పున్నెము కెరుగని ఒక వ్యక్తిని జైలుకు పంపిచటంకంటె దురాగత మేమవుంటుంది? అయితే ఇంతకాలంనుంచి తన్ను, తన కుటుంబాన్ని ఆదుకొంటున్న పుల్లయ్యగారికి అపకారం చేస్తాడా? పైగా ఆయన ఉద్దేశమేమిటో ఇంతవరకూ తేలలేదు రేపు ప్రొద్దుననే పోయి తనది తప్పని ఆయన ఒప్పుకోవచ్చును కేసు ఎత్తి వేసుకోవచ్చును. తొందరపడి ప్రతికూలపక్షాన చేరటం కాని, ధర్మాధర్మాలు నిర్ణయించటంకాని కూడదు. ఇంతకూ మల్లయ్యకు ఏమి చెప్పాలి?

''ఒక ముక్క చెప్పటానికి ఇంత ఆలోచనదేనికి పంతులూ?'' అన్నాడు మల్లయ్య

''ఆలోచించవలసినపనే ముందండి? కాకపోతే మంచిది ఎప్పుడా అని చూస్తున్నాను ''

''ఎప్పుడు మంచిదని నిశ్చయించారు?''

''నా నామ నక్షత్రానికి ఈ ఆరునెలల యేమాత్రం బాగా లేవు. ఎందులో చేయి పెట్టినా అంతవరకు మాడిపోతుంది ''

''ఎంత ఛాందసుడివయ్యా పంతులూ! నీలా మడిగట్టుకు కూర్చుంటే ఇక తిండి తినవలసిందే!'' మల్లయ్య వికటంగా నవ్వాడు

''మరేమి చెయ్యమంటారు? నా యిష్టమే అయితే ఎలాగో లాగు సర్దుకో వచ్చు మా నాన్నగారు ఊరుకోరు ''

''మనసు కుదిరితే అన్నీ సరిగానే ఉంటాయి మనసు కుదరనప్పుడు అన్నీ ఎదురే అల్లుడు వచ్చేదాకా అమావాస్య ఆగుతుందా? లక్ష్మి వస్తానంటే మోకాలొడ్డరాదు పంతులూ!''

''మీరు బాగు కోరి చెబుతున్నారు మరేమి చెయ్యను? తెలిసి తెలిసి చెడ్డరోజుల్లో దిగటం నా కేమాత్రం ఇష్టంలేదు మా నాన్నగారు అంతకన్నా ఒప్పుకోరు నమ్మి కావాలని చదువుకొన్న శాస్త్రాన్ని ఎవ్వడూ ధిక్కరించలేదు.''

''అంతేనా?''

''క్షమించండి ఈ ఆరునెలల పోయింతరువాత ఏ గడియన రమ్మంటే ఆ గడియలో వచ్చి వాల్తాను ''

''సరే వస్తా,''నంటూ మల్లయ్య పంతులు ఇంటి దగ్గర నుంచి బయలుదేరాడు ''పంతులంచే పంతులా? అన్నంలోని పలుగురాయి కాదూ!'' అనుకొన్నాడు

---

జి వి కృష్ణరావు

## .. ఎనిమిది

కోడెదూడ పాలుతాగి దొడ్డిలో గంతులు వేస్తున్నది లక్ష్మమ్మ వంటయింట్లో కత్తిపీటమీద కూర్చుని ఆలిచిప్పతో పొట్లకాయ గీరుతున్నది డాబాపోర్టికో పడకకుర్చీలో కూచుని పుల్లయ్య చుట్ట కాల్చుకొంటున్నాడు జగ్గారావు తాతయ్య కొని ఇచ్చిన బిగు లూదుతూ డమడమాలబండి యీడ్చుకొంటున్నాడు దొడ్డిలో నుంచి చెంగనాలు తీస్తున్న కోడెదూడ అరుపు పుల్లయ్యచెవిని పడ్డది. "సీతగాడు దూడను కట్టివేయటానికి మరిచిపోయాడల్లే ఉంది బజారున పడితే మళ్ళీ చిక్కులే!" అని అతడు ముఖం చిట్లించుకొన్నాడు తాను లేవటానికి బద్ధకించాడు కుర్చీలోనే కూర్చుని నోటిలోని చుట్ట బయటికి తీసి,

"నాన్నా, నాన్నా నిన్నేరా బాబు పిల్చేది!" అన్నాడు

"ఏమిటి తాతయ్యా?" జగ్గారావు రెండుచేతులు పెట్టుకొని ధీమాగా చూచాడు ఎడమచేతిలో డమడమాలబండి తాడున్నది కుడిచేతిలో బిగులున్నది ఆ మొండిమొల, ఆ పిరుదులు, ఆ రొమ్ము, పాలుగారే చెక్కిళ్ళు తాతకు పారవశ్యం కలిగించాయి గాలికి నల్లని ఉంగరాలజుట్టు కొంచెం కదులుతున్నది.

"బుజ్జాయి పారిపోతున్నది, కట్టివేసి రా నాన్నా!"

"బుజ్జాయినా, కట్టివేయాలా? నా నేమి చేస్తున్నానో కనిపించటంలా?"

తాత నవ్వుకొన్నాడు "తరువాత బండి తోలుకొద్దువుగానిలే పోయి కట్టేసిరా"

"తాతయ్యా, నీకు ఏల్లు వస్తున్న కొందికీ మతి పోతున్నట్టుందే! బుజ్జాయితొక్కితే నానే మవుతాను? అనిక్క లవో దివో మంతే చూల్లేను"

పుల్లయ్య ముఖంమీద ముడుతలు విరిసినై ఇంతలోనే లోపలినుంచి కోడలిగొంతు వినిపించింది.

"ఏమండి జగ్గారావుగారూ!"

మామూలుగా రంగమ్మకు కొడుకును 'బాబూ' అని పిలవటం పరిపాటి కోపం వస్తేనే పేరు పెట్టి పిలుస్తుంది. ఆమెకు సహనం ఎక్కువ. లక్ష్మమ్మకువలె నోటిచొరవ లేదు నిప్పులాంటి మనిషి తనవల్ల ఎలాంటి పొరపాటు రానీదు. అందువల్లనే ఆ యింట్లో లక్ష్మమ్మక్రింద నిభాయించగలిగింది. పుల్లయ్యకు కూడా ఆమె అంటే ఎంతో గౌరవం తల్లి పిలుపు వినగానే కుక్కిన పేనువలె బిగులు, బండి అక్కడే వదలి లోపలికి వెళ్ళాడు.

"ఎందుకమ్మా!"

"ఇదిగో ఇటు చూడు, ముఖం పైకెత్తవేం? ఇవాళ ఏమి చేశావ్" రంగమ్మ గదిమింది.

''ఏమి చేశావమ్మా!'' పిడికిళ్ళతో కళ్లు నులుముకొంటూ రాగం ప్రారంభించాడు

''ఈ ముడిముడి ఏడుపులు నాదగ్గర సాగవు నిజం చెప్పక పోతే తిత్తి తీస్తానే?''

చెంప పెట్టు తిన్నవాడివలె కెవ్వుమన్నాడు సగంకోసిన పొట్లకాయ పట్టుకొని లక్ష్మమ్మ మనుమడిదగ్గరికి వచ్చింది

''నీ కోపం మండిపోను! ఏం చేశావే కెవ్వుమన్నాడు?''

''ఇంకా ఏమన్నా చేస్తే కొంప ఉండేదా? నోరుముయ్, దొంగవెధవ!'' రంగమ్మ దగ్గర్లో ఉన్న చేంతాడు తీసుకొన్నాది గుడ్లెర్రజేసి కొడుకును చూచింది

''ఏమి చెయ్యడు! ఇవాళ ఈ పని చేసినవాడు రేపు మరొకటి చేస్తాడు మొక్కయి వంగనిది మ్రానై వంగుతుందా?

''నానేమి చేయలా నానమ్మా!''

''ఓరి వెధవ, పెట్టెలో పదిరూపాయలనోటు తీసి పచ్చి అబద్ద మాడుతున్నావా?'' రంగమ్మ చేంతాడు అవతల పారేసి చేతితో పిర్రమీద ఒకటి చరచింది జగ్గారావు బావురుమన్నాడు కుర్చీలో వెల్లకిలా పడుకొని పుల్లయ్య డాక్టర్లీలు లెక్క పెట్టటానికి ప్రయత్నిస్తున్నాడు

''వాడికి పదిరూపాయలనోటు తెలుసా, పాడా? పెట్టెలో అడుగున ఎక్కడో పడి వుంటుంది చూడు అయినా తాళం వెయ్యక ఎలా ఊరుకున్నావ్?'' అన్నది లక్ష్మమ్మ 37

''వీడిముద్ది గడ్డితింటుందని కలగన్నానా ఏమిటి? ఆ సంగతి తెలిస్తే ఏమి చేయాలో అదే చేసేదాన్ని ''

కొరివితో వాత పెట్టినట్లుగా పుల్లయ్య కుర్చీలో ఎగిరి పడ్డాడు. '' ఏమిచేశావో నిజం చెప్పు!'' రంగమ్మ మళ్ళీ ఒకటి చరచింది.

పుల్లయ్యకు ఆ దెబ్బ తనవీపుమీదే చరచినట్లయింది

''నాను తియ్యలేదమ్మా, కావలిస్తే లాగవుల్ని అడుగు!'' ఏడుస్తూనే జగ్గారావు చెప్పాడు

''అన్నెం పున్నెం ఎరుగనివాణ్ణే కూడా ఎందుకు లాగులావు? దేవుడు ఎంతటివాళ్ళనో ఎత్తుకుపోతాడు కాని నాకూ నీకూ చావులేదురా!'' మళ్ళీ ఒకటి చరచింది.

పుల్లయ్య రెండు చేతులతో ముఖం కప్పుకొన్నాడు

''నిజం చెబుతానుగా, అమ్మా, కొత్తకే! అమ్మా కొత్తకే! ఒళ్లు కందిపోతుంది!'' బాధతో జగ్గారావు చిందులు తొక్కాడు

''చెప్పు మరి!'' లక్ష్మమ్మ హెచ్చరించింది

''కోతయ్య కొట్లోబరానీలు కొనుక్కొన్నానే తాతయ్యా, తాతయ్యా, చచ్చిపోతున్నా ''

''నిజమేనా? ఎప్పుడు తెల్లారింది? ఎప్పుడు బరానీలు కొన్నావు?'' మళ్ళీ తల్లి ఒకటి చరచింది

''నిజమేనే అమ్మా! పోయి ఏమకో్కి, వత్తిదేనంతె పంపెయ్!'' ఎక్కి ఎక్కి ఏడుస్తున్నాడు ముక్కున చీమిడి కారుతున్నది

''నేను పోయి కోటయ్యను కనుక్కొస్తాగా! కొట్టకు '' పెద్దముత్తైదువు లక్ష్మమ్మ రుసరుస లాడుతూ కోమటి కోటయ్య కొట్టుకు బయలు దేరింది పుల్లయ్య హాల్లో చేతులు వెనక కట్టుకొని అటు యిటూ తిరగసాగాడు

రంగమ్మ చతికిలబడి ముఖం చేతులతో కప్పుకొని, ''అయ్యో భగవంతుడా! ఎంత రాత రాశావురా తండ్రీ మొగుడు కరవైనా కొడుకును చూచుకొని బ్రతుకుదామనుకొన్నానే! ఈ గుణాలమారివాడు ఎలా బతుకుతాడే తల్లీ! నాగొంతులో వాడేమి గంజిపోస్తాడే! ఆయనకిచ్చావు గాని చావు నా కివ్వలేదేమిరా భగవంతుడా! వీడితోనే నెట్లా వేగేదిరా! ఈ మాయదారి లోకాన్ని ఎలా సృష్టించావురా నాయనా! గొడ్రాలునైనా ఎందుకు చేశావు కావురా! నలుగురిచేత ఊయించుకోటానికి పుట్టాడే నయ్యో గొయ్యో చూచుకోక ఇంకా బ్రతికెందుకే!'' అని వైనవైనాలు పెట్టి మెల్లగా ఏడుస్తున్నది.

పుల్లయ్య కంపించి పోయాడు ఆమె దుఃఖానికి తానే కారణమనిపించింది అతనికి కళ్ళల్లో గిర్రున నీళ్లు తిరిగాయి తన్ను తాను మరచిపోయాడు చటుక్కున కోడలిదగ్గరికి వచ్చి, ''అమ్మా! ఏడవకు, తప్పంతా నాది మళ్ళీ చేయను ఈ పాదాలు సాక్షిగా చెబుతున్నాను,'' అని అమాంతం కోడలి కాళ్ళకు సాష్టాంగ ప్రణామం చేశాడు రంగమ్మ బిత్తరపోయింది అన్నేండ్ల మామగారు అలా తన కాళ్ళమీద పడేటప్పటికి కొయ్యబారిపోయింది తనకు తెలియకుండానే యేడుపు మాని చప్పున లేచి రెండడుగులు వెనుకకు వేసింది కళ్ళు మూసుకుని వగర్పులతో డొక్కలు ఎగరవేస్తున్న జగ్గారావు ఇదంతా చూడలేదు అతని లోకంలో అతను ఉన్నాడు

''మామయ్యా, మామాయ్యా!'' అని మాత్రమే రంగమ్మ నోటినుంచి వెలువడింది ఆ పిలుపుతో పుల్లయ్య మామూలు లోకంలో పడ్డాడు గబగబా లేచి వెళ్ళి, హాల్లోని కుర్చీలో కూలబడ్డాడు రంగమ్మ అలాగే నిలబడింది అది స్వప్నమో, వాస్తవమో అర్థం కాలేదు. మామగారి ప్రవర్తన అయోమయంగా కనిపించి అలాగే చూస్తూ నిలబడ్డది చెక్కిలిమీద అంతకుముందు జారిన కన్నీటి చారలు అలాగే ఉన్నాయి

''కోటయ్యగాడికి ఈ గడ్డమీద ఋణంతీరింది లేక పోతే అలా ఎందుకు చేస్తాడు?'' అంటూ లక్ష్మమ్మ వచ్చింది.

''ఏమిటి అత్తయ్యా! నిజంగా బరానీలు కొన్నాడటనా?''

''నిజమేనవే! బటానీ లియ్యమని పదిరూపాయల కాగితం తెచ్చాడట! మనం పంపించా మనుకొని అర్ధణా బటానీలిచ్చి మిగతా చిల్లర యిచ్చి పంపా నంటున్నాడు కోటయ్య కొడుకు లంతా వచ్చిరే, నాలుగు చేతిలో వేసి నోటు దాచుకొన్నాడు వీడి వూళ్లో ఇంకా ఉంటాడా అంట. ముసలయ్య ఏడి? ఇంతకుముందు ఇక్కడే ఉండెనే! ఎక్కడ పెత్తనాలకు పోయాడు?''

''ఎందుకు తొందరపడతావు అత్తయ్యా? ముందు నీ మనుమడి దగ్గర తేల్చుకోనీ ఏమిరా! కొటయ్య కొడుకు నీకు డబ్బు లిచ్చాడు కదూ?''

''డబ్బులా, ఎటానీలు కొనుక్కొన్నానుగా ''

''ఇంకా అనుమానమెందుకే. ఓ ముసలయ్యా, నిన్నే పిల్చేది.''

''ఆ,'' అని పుల్లయ్య మెల్లగా మూలిగినట్లుగా పలికాడు

''ఇవ్వాళ పది రూపాయలైంది రేపు వేలవుతుంది లే, లే, కచ్చేరి చావడికి పిలిపించి చెప్పుతో కొట్టిస్తే కాని తేలదు ఇంకా పడుకొన్నావేం లేవక?''

''మామయ్యకు ఒంట్లో సరిగా లేనట్లుంది. ఇంతకువముందే ఇక్కడ దాకా వచ్చి పడిపోయాడు. పాడు డబ్బు, తరువాత చూచుకోవచ్చు పోయి చూడు అత్తయ్యా!'' అన్నది.

లక్ష్మమ్మ కొంచెం ఆతురతతో హాలులోకి వచ్చి చూచింది భర్త బాగానే ఉన్నట్లు కనిపించాడు ''ఇంకా పీరం పెట్టుకున్నావే, పోయిరాక?''

ఉత్తరీయం వేసుకొని పుల్లయ్య మెల్లగా బయలుదేరాడు.

''ఇదిగో ఇటు చూడు పుల్లయ్యా!'' 

అతడు వెనక్కి తిరిగి చూచాడు ఏమీ కనపించలేదు ప్రక్కకు తిరిగి చూచాడు ఎవరూ కనిపించలా. ముందుకు చూచాడు. దూరాన ఎద్దు పోతూవుంది ఎద్దుకు మాటలు ఎలా వస్తాయి? మళ్ళీ సాగాడు '' ఇదిగో నీకే చెప్పేది! కొటయ్య కొడుకు పదిరూపాయలు అన్యాయంగా తీసుకున్నాడనేగా కచేరిచావడికి పిలిపించి చెప్పుతో కొట్టటానికి సిద్ధమవుతున్నావు? నువ్వు మాత్రం తక్కువచేసింది ఏముంది? చంద్రశేఖరానికై మార్వాడీవద్ద హామీ ఉన్నమాట అబద్ధమా? నువ్వే చెప్పు? అది వట్టి ఫోర్జరీ అంటున్నావా? నిన్ను చంద్రశేఖరం ఎందుకు చెప్పుతో కొట్టగూడదు? అసలు ఊళ్లో ఎందుకు ఉండనియ్యాలి? నీకు డబ్బు ఉంది కాబట్టి నీవేమైనా చెయ్యొచ్చు. కోటయ్యకు డబ్బులేదు. అందుకని చెప్పుతో కొడతానంటావా? ఇదేనా న్యాయం? ఇదేనా పెద్దరికం? చెప్పవేం? ఎంతకాలం ఈ ఆటలు సాగుతాయి?''

పుల్లయ్యకు ఈ మాటలు కర్ణకఠోరాలయ్యాయి ఏదో భూతం తనన్ను వెన్నాడుతున్నట్లనిపించింది. భయంతో చర చరా ముందుకు పోసాగాడు

''పుల్లయ్యగారు, పుల్లయ్యగారు!''

అతడు ఒక్కసారిగా కంపించి పోయాడు ఆ తత్తరపాటుతోనే ప్రక్కకు తిరిగి చూచాడు. ఆ సందులోనుంచి నలభై ఏళ్ళ కోటయ్య గిరజాలముడి జారిపోతుంటే రెండు చేతులతో సవరించుకొంటూ పరిగెత్తుకొని వస్తున్నాడు. గోచి చెంగు జారి పంచె కాళ్ళకు అడ్డంపడుతున్నది. పుల్లయ్య నిలబడ్డాడు.

---

జి వి కృష్ణరావు

''బాబూ పొరపాటయింది. పొద్దున చినబాబు పదిరూపాయల నోటు తెచ్చాడు  కాసిన బటానీలు పెట్టి తరువాత పంపిద్దామని నోటు తీసుకొని మావాడు దాచివుంచాడు  బేరంలో పడి మీనోటు వచ్చి యివ్వటానికి జాగుచేశాడు  అంతకుతప్ప మరేమీలేదు  ఇందులో ఏమన్నా తప్పు ఉంటే క్షమించండి  ఇదిగో నోటు!'' అని బొడ్లోనుంచి తీసి ఇచ్చాడు.

పుల్లయ్య నోటు పుచ్చుకొని వెనుకకు తిరిగాడు  అతడు పల్లెత్తుమాట అనలేదు  కోప చిహ్నాలుకూడా అతని ముఖంలో కనిపించలేదు. కోటయ్యకు మాత్రం మరీ భయం కలిగింది కిక్కురు మనకుండా వెళ్ళిపోయాడు

# ... తొమ్మిది .....

''సత్యనారాయణా! సబ్బు, నీళ్లు, తుండుగుడ్డ తెప్పించు!'' వాసుదేవశాస్త్రి రోగి మంచం దగ్గరనుంచి వస్తూ అన్నాడు వెనక బిళ్ళగోచి, ముందు కుచ్చిళ్లు వేలాడు తున్నవి. బుష్ షర్టుపై బుజాన స్టెతస్కోపు వేలాడు తున్నది

''సబ్బు లేదే!'' అన్నాడు పంతులు సత్యనారాయణ.

''సున్నిపిండీ, నీళ్ళన్నా తెప్పించు ''

సత్యనారాయణ పెద్ద కొడుకు సున్నిపిండి, నీళ్ళు, తుండు గుడ్డ తీసుకువచ్చాడు. శాస్త్రి చేతులు కడుక్కొని తుడుచుకొన్నాడు కురవాడు లోపలికి వెళ్ళిపోయాడు.

''అదృష్టవంతుడివి ఆదాలో పడబోతున్నావులే.'' అని నవ్వుతూ శాస్త్రి వీధి అరుగుమీద పరిచి ఉన్న చాపమీద చతికిలబడ్డాడు.

'' ఆదా ఏమిటి?'' పంతులు తెల్లబోయి అడిగాడు. శాస్త్రి ఆంతర్యం అతనికి తెలియక కాదు ఆ విషయం స్వయంగా ఊహించటం ఇష్టంలేదు. 41

''గింజలు కరువు గదా ఇక వెనక బడతాయిలే!'' శాస్త్రి వివరించాడు.

ప్రాణాలతో పరిహాస మాడుతున్నాడని కోపంవచ్చింది. తన లేమివల్లనేకదా ఆ మాట స్నేహితుడై ఉండికూడా అన గలిగాడని పంతులుకు తనమీద తనకే అసహ్యం కలిగింది.

''మీ శాస్త్రం కేవలం ఆదా మార్గాలే చెబుతుందా?'' వీధి రెండవ అరుగు ప్రక్కన నిలబడి పంతులు అడిగాడు.

''పిచ్చివాడా! ఎందుకు అంత కోపం? అటు కూర్చో చెబుతా.''

పంతులు అరుగుమీద కూర్చున్నాడు. శాస్త్రి మళ్ళీ అందుకొన్నాడు :

''మీ నాన్నకు ఎన్నేళ్ళు? ఎనభై దాటలా! ఇప్పుడు మందేమి పడుతుదంటా? ఇంతవరకూ చావు తప్పించుకొన్న వారెవరూ లేరు ముందేమన్నా తప్పించుకొంటారేమో తెలియదు. డబ్బు కరిగించి పోస్తే ఇంకా నాలుగు నాళ్లు బ్రతికించవచ్చునేమో నీదగ్గరా డబ్బు లేకపోయె. ఆ ముసలాయన మాత్రం ఇంకా సాధించవలసిందేమున్నది?''

''అయితే రోగిని చూడటానికి ఎందుకు వచ్చారు?''

''అదే నేనూ ఆలోచిస్తున్నది. అసలు వద్దామనుకోలేదు. మానివేద్దామనే. కాని పాడుడాక్టరుబుద్ధి ఊరుకో నిచ్చింది కాదు రోగికిలాగానే అతనికి కూడా ప్రాణాన్ని ఎలాగైనా నిలబెట్టాలనే ఉంటుంది. చివరిదాకా పోరాడుతూనే ఉంటాడు. అతని శాస్త్రం ఊరుకోనీదు

---

ఒది లలా ఉంచు మీనాన్నగారికి షయు పిల్లా జెల్లను అట్టే దగ్గరకు పోనీకు, ఆయన కోరినపన్లు పెట్టించు ఇంజక్షన్లు వగైరాలు నీవు భరించలేవు ఈసీసాలో మాత్రలు నాలుగుగంటల కొకసారి నాలుగేసి చొప్పున చేత్తో ముట్టుకోనక కాగితంలో వేసి యిస్తూ ఉండు. పంచదార మాత్రలని పిల్లలు తింటారేమో జాగ్రత్త!''

డ్రాము సీసా ఇకటి సంచిలోనుంచి తీసి యిచ్చాడు సత్యనారాయణ ఆ సీసా యింట్లో పెట్టిఎయుటకువచ్చాడు. శాస్త్రి సంచి పట్టుకొని బయలుదేరాడు వర్దన్నకోర్థి పంతులు అతనివెంట బయలుదేరాడు. దారిలో ఎవరు మాట్లాడలేదు కటిక చీకటి రోడ్లు పేరుకు కంకరరోడ్డేకాని అన్నీ గుంటలే. అన్ని గోతులే. కత్తెరరాళ్లు నిక్కపొడుచుకోని ఉన్నాయి ఆ రోడ్లన్నీ బాగా అలవాటైనవి కాబట్టి ఎదురుదెబ్బలు తప్పించుకోని పోతున్నారు ఎవరూ మాట్లాడలేదు

వాసుదేవశాస్త్రి విచిత్రవ్యక్తి. నైష్ఠిక కుటుంబంలో పుట్టాడు. తల్లితండ్రులకు కూతురైనా కోడుకైనా అతడు ఒక్కడే. ఎంతో గారాబంగా పెంచారు. అతడు ఆడింది ఆట, పాడింది పాట అయింది. తండ్రికి అంతగా ఇష్టంలేకపోయినా ఇంగ్లీషు చదువుకొన్నాడు. బి. ఏ పూర్తిచేసి తండ్రి వద్దని బ్రతిమాలినా ఉన్నది కాస్త ఊడ్చి ఎం.బి.బి. ఎస్ పూర్తిచేశాడు భార్య కాపరానికి వచ్చింది. ప్రాక్టీసు పెట్టడానికి డబ్బులేదు. కావాలంటే మామగారు సాయం చేసే వారే కాని ఒకరిని పోయి అడగటం అతనికి ఇష్టంలేదు. అసలు విషయం అదికాదు. వైద్యసౌకర్యం లేక అవస్థపడుతున్న  పేదప్రజలకు తోడ్పడాలని మొదటినుంచి ఉండేది ఇప్పుడు అవకాశం లభించింది. ఎందుకు సాధించగూడదన్న భావం కలిగింది.

అతడు గ్రామంలో పుట్టిపెరిగాడు గ్రామం లోని ఆస్తిపాస్తులు అమ్మి అతడు విద్యావంతుడయ్యాడు. కాబట్టి అతనినుండి కొంతసేవ కోరటానికి ఆ గ్రామనికి అధికారం ఉన్నట్లుగా భావించాడు అందువల్ల కొద్ది మందులతోనే స్వగ్రామం చేరాడు గ్రామాలకు సహజంగా ఉండే అనుమానంతోనే అతని స్వగ్రామం కూడా చూడ మొదలుపెట్టింది నిజంగా ఇతగాడు యం.బి.బి.యస్ చదివితే పల్లెటూళ్ళో ఎందుకుంటాడు? ఏ బస్తీలోనో ప్రాక్టీసు పెట్టుకుంటే ఎడాపెడా సంపాదించవచ్చునే! ఏదో మర్మం ఉండాలని నిశ్చయించింది. అందువల్ల కాస్త ఉన్నవాళ్లెవరూ అతనివద్దకు మందుకు వెళ్లేవారుకారు.

అతడు ఊళ్ళో ప్రాక్టీసు పెట్టినరెండు నెలలకు ఆచారిగారికి పరమరహస్యం తెలిసిపోయింది. వాసుదేవశాస్త్రి మెడికల్ కాలేజిలో చేరిన మాట వాస్తవమే కాన తోటి విద్యార్థినితో అక్రమంగా వ్యవహరించటంవల్ల మొదటిసంవత్సరంలోనే డిబార్ చేశారట అయిదేళ్ళు అతడు అక్కడ ఊరేగి వచ్చాడట. అంతేకాని వైద్యం గీద్యం ఏమి చదవలేదట ఈ వార్తను సత్యవ్రతులు శాస్త్రి చెవిని వేశారు అతడు కోపగించుకోలేదు. 'ఏమయ్య ఇలా అన్నావటగా' అని ఆచారిగారిని అడగలేదు తలడిగ్రీని ఎవరివద్ద చూపించలేదు.

ఊళ్ళల్లో సాధారణంగా కూలివాడి దగ్గరనుంచి షావుకారుదాక ఒకపరిపాటి ఉంది. కాస్త లేచి తిరుగుతూ ఉంటే దానిని జబ్బుకింద పరిగణించరు ప్రాణం గొంతులో గుటగుట లాడుతుంటేనో రోగి బాధ పడలేక పెడబొబ్బలు పెడుతుంటేనో రోగమున్నట్లు లేదా కనీసం

పద్ద రోజులైనావదుమెయ్యాలి రోగమున్నట్టుంటే నిదానమున్నా వినిపించాలి ఈ చెప్పిన నిదానాలు వినిపించుపోతే వ్యాధి కింద పడి ఎట్టబానికి వీలులేదు అందువల్ల వాగా ఉన్న వాళ్ళు బస్తీకివెళ్ళలారు లేనివాళ్ల ఆచారిగారివద్దకు వస్తారు

మొట్టమొదటి నాలుగు నెలలలో శాస్త్రికి కేసంటూ లేదు కాకపోతే అన్నిచోట్లు తిరిగి. అన్ని మందులు తిని, నోరు కాచి ఆశ వదలుకోనప్పు రోగులు ఒకరిద్దరు వచ్చారు. ఎక్కడా నయంకాని రోగాలు అతనివద్ద మాత్రం ఏమినయమౌతాయి? అతడు ధన్వంతరిదాడు స్పష్టంగా చెప్పివేశాడు ఉన్నదేదో అది కొంతత సదభిప్రాయం కలిగించింది ఇలా ఉండగా ఒక సంఘటన జరిగింది మల్లయ్యగారి పినతల్లికి బ్రెస్టుక్యాన్సర్ వచ్చింది బస్తీకి తీసికెళ్ళితే మొదటి సారి శస్త్ర చికిత్స చేశారు. కాని దోషం ఎక్కడో కొంత మిగిలి మళ్ళి నాలుగేళ్ళకు పెద్దనారింజకాయంత ప్రమాణమై కూర్చున్నది వెనక శస్త్రచికిత్స చేసిన డాక్టర్ వద్దకు తీసుకువెళ్ళితే 'లాభం లేదు పట్టణం తీసుకువెళ్ళు' ండని సలహా ఇచ్చాడు పట్టణం పోయినా ప్రయోజనం ఉండని ఇంటికి తీసుకువచ్చారు ఒకరోజు ఆచారిగారు ఏదో పని మీద వెళ్ళి ఆ రోగిని చూచాడు '' ఈమాత్రం భాగ్యానికి పట్టణం తీసుకు వెళ్లాలా? పదిహేను రోజుల్లో మటుమాయం చేస్తాను చూడండి. డాక్టర్లని పేరేగాని వాళ్లకు వైద్యం ఏమి తెలుసునంట!'' అన్నాడు ఆమె ఆశపడ్డది. చికిత్స ప్రారంభించమన్నాది. ఆచారిగారి పట్టీలు పడ్డమూడోరోజు కళ్లా మంటలు, పోట్లు, బాధపడలేక శాస్త్రి గారిని పిలిపించి చూపమని ప్రాధేయపడ్డది 43

శాస్త్రివస్తే ఆచారిగార్కి కోపం. రాకపోతే మల్లయ్యగారికి కోపం. బాధ అనేది రోగికి లేకుండా ఉన్నట్టయితే పోయిండేవాడు కాదేమో! కాని అవతల పడుతున్న నరకబాధను గూర్చి వినలేక నేరుగా బయలుదేరి రోగిని చూచాడు బ్రెస్టుక్యాన్సరు పాషాణపు పట్టి వుసి ఉన్నది. చర్మం మాత్రం చిట్లింది వెంటనే ఆ పట్టీలు తీసివేసి గాయన్ని మందునీళ్ళతో కడిగి ఉపశాంతికి మందేదో ఇచ్చాడు ''వెంటనే పట్టణం తీసుకు వెళ్ళండి అదృష్టముంటే బ్రతుకుతుంది లేకపోతే లేదు'' అని ఖండితంగా చెప్పివేశాడు. రోగి అవస్థచూచి సహించలేక శాస్త్రి గబగబా ఆచారిదగ్గరకు వెళ్ళాడు. ఆచారికి అర్థంకాక కళ్లు అప్పగించి చూస్తున్నాడు

''రోగిని చూచావా? ఆ కణితేమిటో ఎందువల్ల వచ్చిందో అర్థం చేసుకున్నావా? వుసవుస పాషాణంవేస్తె అయిపోయిందనుకొన్నావా? ఎక్కడ నేర్చుకొన్నావయ్యా ఈ వైద్యం;'' అని శాస్త్రి జాడింపులకు అందుకున్నాడు.

''ఓహో నీకు వైద్యం తెలుసే!''

''నాకు వైద్యం వచ్చో రాదో ఇప్పుడు దేనికి? రేపు కోర్టులో మల్లయ్యగారు కేసుపెట్టినప్పుడు తమవైద్యవైశారద్యం ఏమిటో చూపింతురుగాని!'' శాస్త్రి ఆటకుండా చర్రున ఇంటికివెళ్లాడు.

అతడు పోయిన అరగంటకు ఆవేశం దిగజారి ఆచారిగారు మాములు లోకంలోపడ్డారు. మల్లయ్యగారు కేసుపెడితే తనగతి ఏమవుతుంది? అందుకు ఆయన సమర్థుడు కూడా. మల్లయ్యగారితో శత్రుత్వమేకాక ఊళ్ళో ఉన్న కాస్తపేరుపోతుంది గడగడ వనికిపోయాడు. ఆ

రాత్రి మల్లయ్యగారి వాళ్ళు వేళ్ళు పట్టుకుని కేసు పెట్టనని ఒకనిచేత చేతిలో చేయి వేయించుకొని వచ్చాడు. శాస్త్రి కేసు పెడతాడేమో! చూస్తూ చూస్తూ లచ్చిన్ని ఎలా వదిలిపెడతాడు ? బతిమాలుకొన్నా, తాను చేసిన అపకారానికి ఊరుకొంటాడా? ఆ మరునాడే బస్తీకి వెళ్ళి ప్లీడర్ని అనుక్కుంటే కేసుపెట్టవచ్చునని జరిమానా పడవచ్చుననీ తేలింది. గత్యంతరం లేక ఆ రాత్రి చీకటి మాటున వెళ్లి శాస్త్రి కాళ్లమీద పడ్డాడు తెలిసీ తెలియని వైద్యం చేస్తే మర్యాదదక్కదని శాస్త్రి హెచ్చరించి పంపాడు.

ఈ సంగతి క్రమంగా మల్లయ్యగారి ద్వారా పాక్కింది అప్పటినుంచి శాస్త్రికి ప్రాక్టీసు పెరిగింది దీనికతోడు గడ్డుకేసులు నాలుగయిదు నయం చేశాడు దానితో ఊరంతకు ఆయన యం బి.బియస్ అని తెలిసింది. అయితే అతనికి డబ్బుప్రధానం కాదు. అందువలన ఉన్నవాళ్లదగ్గర ఉన్నట్టుగా తీసికొని పేదసాదలకు కొంత తోడ్పడుతూ వచ్చాడు. తనవద్ద ఎక్కువ తీసుకుంటున్నాడని కంటుగా ఉన్న మరొకరు లేకపోవటంవల్ల అతనిదగ్గరకు వెళ్లకతప్పలా.

కాస్త దారిలో పడ్డాననుకొంటూ ఉంటే శాస్త్రి ఆకస్మికంగా భార్య చనిపోయింది.

తరువాత ఎంతో మంది తమ పిల్లలను ఇస్తామని వచ్చారు. ముసలితనంలో ఉన్న తండ్రి, ''చేతులు కాల్చుకో లేవురా? మళ్ళీ పెళ్ళిచేసుకో''మని బ్రతిమాలాడు. ''ఈ ముసలితనంలో నాకు
44 దిక్కు లేకుండా చేస్తావా'' అని నిష్ఠురాలు ఆడాడు కాని లాభం లేకపోయింది. శాస్త్రి ఉద్దేశం ఎవరికి తెలియదు. చివరికి తండ్రి దిగులుతోనే చచ్చిపోయాడని ఊళ్ళోవాళ్లు అంటారు. కాదు గుండె జబ్బువల్ల చచ్చిపోయాడని శాస్త్రి చెబుతాడు.

ఇంతలో 1942 ఉద్యమం వచ్చింది. శాస్త్రి ఏమి చేయకపోయినా ప్రభుత్వం డిటెన్యూగా పట్టుకువెళ్ళింది. అక్కడ ఉండగా ఎలాంటి రాజకీయానుభవాలు గలిగినవో చెప్పలేము కాని అతని దృష్టిలో మాత్రం విపరీతమైన మార్పు వచ్చింది. కారాగారవాసమే ఆ పరిణామం కలిగించిందో, అప్పటి సహచరుల ప్రవర్తనతోనే విరక్తి కలిగిందో, చదివిన పుస్తకాలే అలా చేశాయో తెలియదు అక్కడా ఏ పుస్తకాలు చదివాడో తెలియదు. కాని హోమ్యో చదివి ఉండాలి. లేకపోతే జైలునుంచి వచ్చీ రావటంతోనే పంచదారమాత్రలు ఇస్తూ ఉండడు.

ఇప్పుడు వీలైనంతవరకు హోమ్యో పద్ధతీ అనుసరిస్తున్నాడు. కాని ఇదివరకున్న జాతీయ ఆవేశం., జాతీయ భావాలు లేవు. అధికారం లాభం దక్కకపోవటం కారణం కాదు. యం.యల్.ఏ గా నిలబడమని పార్టీ పెద్దలు స్వయంగా వచ్చి హెచ్చరించారు. అతడు నిరాకరించాడు. రాజకీయబాధిత సహాయక సభ్యులంతా అతనికి తెలిసిన వాళ్లే. నిజానికి అర్జీ పెట్టమని ఎంతో బలవంత పెట్టారు ''నాకు దేనికి? పిల్లలా, జెల్లలా? జానెడు పొట్ట, కావాలంటే మందుల సంచి ఉండనే ఉన్నది'' అని శాస్త్రి నవ్వాడు.

శాస్త్రి సత్యనారాయణతో కలిసి ఇంటికి వచ్చేటప్పటికి అరుగుమీద ఎవరో కూర్చున్నారు. చీకట్లో ముఖం కని పించక 'ఎవరది'? అని అడిగాడు.

''నేనేనండి డాక్టరుగారు.''

''నేనంచే?'' డాక్టరు తలుపుతీస్తూ అడిగాడు

''మల్లయ్యగారి అబ్బాయిని మా నాన్న మందుకు పంపిస్తే వచ్చాను ''

''లోపలికి వచ్చి ఆ కుర్చీలో కూర్చో సత్యనారాయణ మందు యిచ్చి ఇప్పుడే వస్తాను ''

సత్యనారాయణ హాల్లో కూర్చున్నాడు కుర్రవాడితో పక్కగదిలోనికి వెళుతూ '' ఏమిటిరా జబ్బు?'' అని డాక్టరుగారు అడిగారు. అన్ని మాటలు పంతులుకి వినిపిస్తూనే ఉన్నవి

''ఏమిలేదు ఒళ్లు తిమ్మిరిగా ఉన్నదంట ''

''అదేమిటిరా, నీకా మీ నాన్నకా?'' డాక్టరు నవ్వాడు

''అది కాదండి, పులకపులకగా ఉన్నదంట, ఆ మాట అనబోయి తిమ్మిరి తిమ్మిరి అన్నానులెండి తల గోడ్డళ్ళతో పగలేసినట్టుగా ఉన్నదంట ''

శాస్త్రి మందుకలుపుతూనే, ''సీసా తెచ్చుకున్నావా?'' అని అడిగాడు

గంగాధరం లాగు రెండు జేబులూ తడుపుకొన్నాడు ''అస్ పోయింది దాన్లోనైనా ఎద్దిలేదు ఏమిచేసేది? సరేకాని డాక్టరుగారు ఏదైనా సీసావుంటే యివ్వండి రేపు పొద్దున్నే తీసుకొస్తాను.''

''ఇట్లా ఎన్ని సీసాలయ్యాయో?''

''ఏమండోయ్! డాక్టరుగారు ఇటుచూడండి! నేనెప్పుడైనా సీసా తెస్తానని చెప్పి తేకుండా మానేశానూ?'' 45

''నువ్వు కాదులే. కాని........''

''ఎవడో బుద్ధితక్కువవాడు చేసి ఉంటాడు. అంతా అలాంటి వాళ్లయితే మీ రేమి మందులిస్తారు? మేమేమితీసుకెళ్లుతాము?''

డాక్టరు ఖాళీ సీసా ఒకటి చూచి మందుపోసి యిస్తూ ''ఈపూట సగం, రేపు పొద్దున సగం తాగమను. ఎలా ఉన్నదీ రేపు సాయంకాలం వచ్చి చెబుతావుగా?'' అని హెచ్చరించాడు

''అయితే ఈ మందు దేనికి? పారబోస్తా!''

''ఓరి పిడుగా మందు పారబోస్తానంటావేమిరా?''

''రేపు సాయంకాలం వచ్చి ఎలా ఉన్నది వచ్చి చెప్పమంటున్నారంటే నయం కాదనేగా. నయంకాని మందు దేనికి డాక్టరుగారు?''

''నువ్వురావద్దు. మీనాన్నే వస్తాడులే చెప్పు''.

గంగాధరం ఒకడుగు వేసి ఆగాడు మళ్ళీ వెళ్లబోయి డాక్టరు వైపు చూచాడు.

''ఏమిటిరా? ఇంట్లో ఇంకా ఎవరికన్నా మందు కావాలా ఏమిటి?''

''ఇదిగో డాక్టరుగారు పిసినిగొట్టుతనం కూడా పోవటానికి ఏమన్నా ఉంటే ఇందులోనే కాస్త కలిపి యియ్యండి పుణ్యముంటుంది.''

---

జి వి కృష్ణరావు

శాస్త్రికి అర్థం కాలేదు తనవైద్యాన్నే వెక్కిరిస్తున్నాడో, అమాయికంగా అడుగుతున్నాడో బోధపడలేదు కోపం తెచ్చుకొని " ఇవాళ ఇదన్నావు రేపొద్దున విషం పెడమంటావు ఉండు చెబులాను మీ నాన్నకి "

"ఎందుకండి కోపం! మొన్న స్కూల్లో మీరేకదాచెప్పింది. శరీరం బాగుంటేనే మనసు బాగుండేదని. లాగులూ చొక్కాలూ చిరిగిపోయినవి. కుయ్యో, మొర్రో అంటే వినడు మీరే చూడండి! సీసా లాగుజేబులో వేసుకొస్తే దారిలో ఎక్కడో పోయింది లాగు సరిగా ఉంటే సీసాపోయి ఉండేది కాదు గదండీ! ఇది ఒక్కటంటే ఇక్కటే కాదు కడుపార లాను తినడు మమ్మల్ని తిననీడు ఒంట్లో సరిగ్గా ఉంటే ఇలాంటి బుద్ధి వస్తుందంటారా మీరే చెప్పండి "

"లాగు చినుగులు గంగాధరం ముఖం చూచిన తరువాత డాక్టరు నవ్వకుండా ఉండలేకపోయాడు " అది పెద్ద జబ్బు నింపాదిగా కాని నయం కాదులే చీకట్లో పోగలవా? ఎవరినన్నా పంపించేదా?" అన్నాడు. " నాకేం ఆ భయం లేదు లెండి?" చీకట్లోనే యింటికి వెళ్లాడు.

శాస్త్రి హాల్లోకి వచ్చి " అంతా వింటున్నావా?" అని సత్యనారాయణను అడిగాడు. "వినకేం, వాడన్నదాంట్లో అబద్ధం నాకెక్కడా కనిపించలేదు" అన్నాడు శాస్త్రి నిట్టూర్చి "వాడిలో
46 నీకేమి కనిపించింది?" అన్నాడు.

"అమాయకత్వం"

"అంతేనా? వాడు పెద్దవాళ్ళు చెబుతున్నారని వినడు వాడికి తోచాలి. సహేతుకంగా కనిపించాలి అనుభవానికి తగలాలి అంతకు తప్ప నూరు చెప్పు, వెయ్యి చెప్పు నమ్మడు వాడికి సహేతుకంగా కనిపించిందో ఆ మాట పాటిస్తాడు చెప్పిన వాళ్ళను గౌరవిస్తాడు వాళ్ల నాన్న చెప్పేదానిమీద కించిత్తు కూడా నమ్మకం లేదు. అందువల్ల ఆయనమీద గౌరవంలేదు నేనువాడిని ఏమిచేశాను? పెట్టి పోషిస్తూన్నానా? కష్టసుఖాలకు అదుకొంటున్నానా? ఏమిలేదు. నామీద వాడి కున్న గురి,గౌరవం భక్తి వాళ్ళ తండ్రి మీద లేవు."

"నిజమే! కనిపిస్తూనే వుంది"

"వాడేకాదు సాధారణంగా మానవతత్త్వమే అలాంటిది. గుడ్డిగా నమ్మంటే బుద్ధివంతులు చెప్పారు వినమంటే మానవుడు వినడు. హేతువు అడుగుతాడు. సమంజసత్వం విచారిస్తాడు. అనుభవాన్ని పురస్కరించుకొని పరీక్షిస్తాడు. వీటన్నిటికీ నిలిచినదాన్ని గౌరవిస్తాడు. అనుసరించటానికి ప్రయత్నిస్తాడు అందువల్ల భక్తి విశ్వాసాలు లేవని, ఈ యుగాన్ని యిప్పటి సమాజాన్ని నిందించి లాభంలేదు నేను గొప్పవాణ్ణి మా సంప్రదాయాలు గొప్పవి అంటే ప్రయోజనంలేదు. నీ గొప్ప ఎక్కడుందో నీ సంప్రదాయాల విశిష్టత ఏమిటో చూపాలి ఉపపత్తులు చూపి ఆచరణలో సాధించాలి అలా కానివాడు మానవుడు ఆ గొప్పను, విశిష్టతను త్రోసివేస్తాడు త్రోసివేయకపోతే వాడు మానవుడే కాడు.

''ఈనాడు మన సమాజంలో జరుగుతున్న సంఘర్షణే ఇది శ్రుతి స్మృతి ఉర్థాలను ప్రశ్నిస్తున్నాడు అదేమి న్యాయమని అడుగుతున్నాడు అది ఈనాటి పరిస్థితులలో పనికిరాదు అంటున్నాడు కొత్తవి సృష్టించుకోవాలి అని ఆందోళన పడుతున్నాడు. ఒకపక్షం ఇలావాదిస్తూంటే మరోపక్షం దేశం జాతి, ప్రజానీకం అంటూ ఆవేశం ఎక్కిస్తున్నది! వ్యక్తిసముదాయాన్ని మించి జాతి, ప్రజానీకం సమాజం ఎక్కడున్నదో తెలియదు అధికసంఖ్యాకులు శ్రేయస్కరమైనదే ధర్మం. వారికి ఉపయోగిస్తేనే శాస్త్రం వారికి ఆనందమిస్తేనే కళ అని అంటున్నారు ధర్మమేదో శాస్త్రమేదో కళ ఏదో నాకు నేను, నీకు నీవు చెప్పుకోవటానికి వీలులేదు అధిక సంఖ్యాకులు ఏమను కొంటున్నారో దానిని బట్టి చెప్పుకోవాలి. ఈ తత్త్వంతో శివాలు ఎక్కిస్తున్నారు. ప్రజలు ''వివేకం ఉన్నది విచారించుకొందా''మని మరచిపోయి శరభ దస్సరభలు కొడుతున్నారు.

''ఈ పరిస్థితులలో మనవంటి అల్ప సంఖ్యాకులకు రెండే మార్గాలు ఉన్నాయి మన వ్యక్తిత్వం పూర్తిగా విడిచిపెట్టి అధికసంఖ్యాకులలో లీనమైపోవాలి. వీళ్ళు చెప్పేది వేదమని ఒప్పుకోవాలి ఆడింది ఆటగా పాడింది పాటగా ఆనందించాలి. లేదా సంకుచితస్వార్థాన్ని అధిగమించి సర్వమానవకోటికి అంటే ప్రతి ఒక్క మానవునికి శ్రేయస్కరమైన దర్మ మార్గాన్ని ప్రతిపించగలగాలి ఆ మార్గం సహేతుకంగా సమంజసం ఆచరణసాధ్యమని నిరూపించి నిత్యజీవితంలో ఆచరించి చూపాలి అందరికీ దీనిని అందుబాటులోకి తేవాలి అనాడు బుద్ధుని సిద్ధాంతాలు ఆసేతుహిమాచలమే కాక, ఖండఖండాంతరాలలో వ్యాపించిన వంటే ఇదే కారణం. నేడుఅలాంటి గురతరబాధ్యతే వివేకవంతులమీద ఉంది ఈ రెండూ జరగకపోతే మనం నామరూపాలు లేకుండా నాశనమై పోతాము ఇవి ఇప్పటి పరిస్థితులు

''అన్నట్టు ఈ ప్రస్తావన ఎందుకు వచ్చింది కారణమే కనిపించటంలేదు. కాని ఏదో ఉండి ఉండాలి పాడు మనస్సు కోతిలాగా యీ కొమ్మనుంచి ఆ కొమ్మకు ఆకొమ్మకు దూకుతూ ఉంటుంది ''

ప్రొద్దుపోయింది వస్తానని సత్యనారాయణ లేచి వెళ్ళాడు శాస్త్రి అతన్ని రోడ్డు వరకూ సాగనంపి వచ్చి ఆలోచిస్తూ కూర్చున్నాడు.

సత్యనారాయణ తన వెంట ఎందుకు వచ్చాడు? తండ్రి విషయం మాట్లాడివలసినది ఏమున్నది? చెప్పవలసినదేదో అతనికి ఇంటివద్దనే చెప్పాడు ఎదో చెప్పదలచే ఇంత దూరం వచ్చాడు. తనతో ఏమి మాట్లాడదలచాడు? పుల్లయ్య చంద్రశేఖరం వ్యవహారం మేమైనా చెప్పదలచాడా? అతనికి తెలియటానికి అవకాశమున్నదా? పుల్లయ్య లెక్కల వ్యవహారమంతా అతడే కదా చూస్తున్నాడి! అయినా ఇలాంటి వ్యవహారం సత్యనారాయణకు చెప్పి ఉంటాడని నమ్మకమేమిటి? ఒకవేళ ఆ వ్యవహారమే మాట్లాడటానికి వచ్చి ఉండవచ్చు. కాని తరువాత మనసు మార్చుకొని ఉండవచ్చును నా సలహా అతనికి కష్టం కలిగించి ఉంటుందా? కష్టం కలగటానికి అవసరమేమి కనిపించటంలేదు ఇష్టముంటే లనుసరిస్తాడు లేకపోతే మానివేస్తాడు.

అసలు పుల్లయ్య చంద్రశేఖరాలకు తగాదా ఎందుకు వచ్చినట్లు? ఇందులో ఎవరిది తప్పు? పుల్లయ్య మాట తప్పి వాదనటానికి మనస్కరించటంలేదు డబ్బు పోతుందన్న తహతహలవల్ల

ఎవర్తాంకు దిగుతున్నాడా? కాక వేషరామే మరాగితానికి ఒడిగట్టాడా? సత్యం ఎలా తెలుస్తుంది వాళ్లకు తప్ప ఇద్దరూ కోర్టుకు ఎక్కుతున్నారు. సాక్ష్యం కోసం గ్రామం మరీ అల్లకల్లోలమైపోతుంది కక్షలు రేగుతవి అశుభమూ శుభమూ తెలియనివాళ్ళు బలై పోయేవరకూ వస్తుందో ఏమో!

ఆపదలో ఉండిన 'కా' అని ఒకటి అరిస్తే ఉన్న పదివాకులు చేరుతవి. మానవులు అలాకాదు కష్టసుఖాలు పైనుంచి వచ్చిపడ్డవికావు అంతఃకలహాలకు గురియై చేతులార తెచ్చుకొంటున్నారు. పశుపక్ష్యాదులలో కనిపించే మైత్రి అన్నా వీళ్ళకు ఎందుకు ఉండదు? ఈ కలహాలు, కక్షలు ఎందుకు వస్తున్నవి? సహకారం, సహనం, సానుభూతి, సామరస్యం ఎందుకు కొరవడుతున్నవి? ఇవి లోపించిననాడు మానవత్వం మాత్రం ఉంటుందా? ఉండనీ ఉండకపోనీ తనకు ఈ సంగతి దేనికి! ఈ భావాలతో తాను ఒకదేవుణ్ణి సృష్టించటంలేదా? ఒకసారి పుట్టిన తరువాత ఈ దేవుడు ఊరుకొంటాడా? భక్త బృందాన్ని తయారుచేస్తాడు. దీన్ని పావులమీదకి పంపకం చేస్తాడు. ఈ ధర్మాధర్మ విచారం ప్రబోధం దేనికి? ప్రతివాళ్ళకు ఆలోచించుకోనే శక్తిలేదా? తాను వాళ్ళకన్న గొప్పవాడా? ఆ అహంకారం లేకపోతే ఈ సమస్యలన్నీ తన నెత్తిన ఎందుకు వేసుకోవాలి? తనకు ఉత్తమ మని తోచిందీ, తన అంతఃకరణం ఆదేశించినదీ చేస్తే సరిపోతుంది. అంతకు వినా ఉత్తమైనది మరొకటి కనబడుటలేదు.



ఆ రాత్రి కుక్కరులోని వంటకాలు అలాగే ఉండిపోయాయి.

... పది

పంతులు తన యింటి వద్దకు వచ్చేటప్పటికి వాకిటిముందు తారట్లాడుతూ ఎవరో వ్యక్తి కనిపించాడు చీకట్లో గుర్తు పట్టలేక నిదానంగా పరిశీలిస్తూ నిలబడ్డాడు

''పంతులుగారూ?''

'' ఆ ఎవరది?''

''నేనే, చంద్రశేఖరాన్ని''

''మీరా? రండి ఎంతసేపయింది వచ్చి?''

''ఒక అరగంట అయివుంటుంది. కాస్తబయటికి వెళ్ళు దాము వస్తారా?''

సత్యనారాయణ అతడు ఎందుకు రమ్మంటున్నాడో అర్థమయింది చీకట్లో అతనివెంట వెళ్లటం మంచిదా? ఒకవేళ పుల్లయ్య తమ యిద్దర్నీ చూస్తే ఏమనుకొంటాడు? పుల్లయ్య కాదు మరొక వ్యక్తి అయినా అనుమానించక తప్పదు. అసలు అనుమానించ వలసిన అవసరమేమున్నది? తాను అపమార్గం అనుసరిస్తేకదా! ఇంతవరకూ తాను అలాంటి పని ఏమీ చేయలేదు చేయాలన్న ఉద్దేశమూ లేదు. అయినప్పుడు తానెందుకు భయపడాలి! ఇంతరులకు భయపడుతూ ఎంతకాలం బ్రతుకుతాడు? పుల్లయ్య చూచి తనపై కత్తి గడితే? తాను తనకుటుంబం ఏమౌతుంది? ఇప్పుడు మాత్రం తమ్మి ఊరకపెట్టిపోషిస్తున్నాడా? ఈ చాకిరి మరొకచోట చేస్తే పొట్టగడువకపోతుందా!

సత్యనారాయణ చంద్రశేఖరం వెంట ఆ చీకట్లోనే నడుస్తున్నాడు ఊరి బయటకు వచ్చారు. అతనికి జంకు కలిగింది.

శేఖరంగారు దురుద్దేశంతో తన్ను ఊరిబయటికి తీసుకువస్తున్నాడేమో? తన్ను చంపితే! అతనికి వచ్చే ప్రయోజనమేమిటి? బ్రతికి ఉంటేనే అతనికి ఏమైనా ప్రయోజనం కలగవచ్చును. ప్రతిపని ప్రయోజనాపేక్షతో జరుగుతున్నదా? మొన్న చదువుకొంటున్న కుర్రాణ్ణి చంపి ఊరిబయటిబావిలో ఎందుకు పడేశారు? సరిగా విచారణ జరిగిన పాపాన కూడా పోలేదు. తనకూ అదే జరిగితే? పిరికితనం అలా అనిపిస్తున్నాది, అంతే

కాలవ వంతెన మీద శేఖరం కూర్చున్నాడు. సత్యనారయణ అతని ప్రక్కనే చేరాడు.

''పంతులుగారూ మీకు అన్నీ తెలుసు! ఒకరిచేత చెప్పించుకొనేవాళ్లు కాదు అయినా నా ఆందోళనకొందికి తీసుకువచ్చాను అన్యాయంగా నాకు తోడ్పడాలని కోరటంలేదు. నాదే అన్యాయమైతే మిమ్మల్ని చూడటానికి కూడా ధైర్యం ఉండేది కాదు కేవలనం ధర్మం చెప్పండని గుర్తుచేయటానికి తీసుకువచ్చాను.

శేఖరం సత్యనారాయణ వైపు చూచాడు అతడు మాట్లాడలేదు

''ఏమంటారు?'' శేఖరంగారు హెచ్చరించాడు

''శేఖరంగారు! మీరేమంటున్నారో నాకు అర్థం కావటంలేదు మీపై పుల్లయ్యగారు పోర్జరి కేసు పెట్టిన సంగతి మాత్రం నలుగురితో పాడు నేనూ విన్నాను సత్యమెంతో మీ ఉభయులకు తెలుసుకాని ఇతరులకు ఎలా తెలుస్తుంది? ధర్మమెప్పుడు ఓడిపోదు ఏనాటికైనా గెలిచి తీరుతుంది సత్యంతెలిసి ఉంటే చెప్పటం న్యాయం. దానికి ఎవరూ కాదనరు ''

''ఇదుగో ఇలా చూడండి; పుల్లయ్యగారి లెక్కలన్నీ మీరు చూస్తున్నారు నిజం మీకు తెలియదా? నామనస్సు లాగాలని చూస్తున్నారు అందులో తప్పేమిలేదు పంతులుగారు కాస్త ఆలోచించండి సమాజంలో లేశమైనా నీతి, నియమం సంస్కారం ఉన్నవంటే అవన్నీ మీ పూర్వులు పెట్టిన భిక్ష సంకుచితత్వం స్వార్థం అదిగమించి సమాజాన్ని యీ స్థాయికి తీసుకువచ్చారు ఏ ధర్మంకోసం సర్వసంగపరిత్యాగంచేసి తపస్సుచేశారో ఆదర్మాన్ని మీ కాళ్లక్రింద నలిపివేయకండి ధర్మం దానికది ఎన్నడూ నెగ్గదు మానవుడు తోడ్పడాలి సుప్రతిష్ఠం చేయాలి కేవలం నా కోసమని వేడు ధర్మప్రసక్తి తేవటంలేదు ఆస్తి అంతా ధ్వంసం చేసుకొన్నాను ఇవాళ ధర్మంకోసమని చెబితే ఎవడూ నమ్మతాడు లేదు, కేవలం కార్మికులరక్తం పిండి త్రాగటానికితలపెట్టాను యుగయుగాలనుండి వస్తున్న సంస్కారాన్ని కూకటివెళ్లతో పెకలించి వేయటానికి తలపెట్టాను ఆ ఘోరపాపమే బెడిసికొట్టిందేమో? అంతేకాని పసిపిల్లలు చేసిన పాపమేమిటి? తప్పేచేశానని
50 రేపు నాకు కారాగారవాసశిక్షవేస్తే వాళ్లగతి ఏమౌతుంది? వాళ్లకు నీళ్ళు పుడతాయా? కూలినాలి చేసుకొని అయినా జీవించటానికి అవకాశం ఉంటుందా? ఆడపిల్లలకు పెళ్ళిళ్ళు ఎలా అవుతాయి? నాకోసం కాదు ఆ పిల్లలు సగౌరవంగా బ్రతకటానికి మార్గం చూపించండి దీనికి ఎంతో త్యాగం చేయవలసి ఉంటుంది వాస్తవమే నేను కాదనను పుల్లయ్య మండిపడతాడు పగసాధించటానికి ప్రయత్నిస్తాడు కానిమీకు ఉన్న గౌరవాన్ని నాశనం చేయలేడు ఇప్పుడున్న జీవనోపాధి పోదు అతని దగ్గర కాకపోతే మరొకరిదగ్గర గుమస్తాగిరి చేస్తారు? నేరుగా నెడు మీకు ఏవిధమైనసాయం చేయలేను ఇదీ పరిస్థితి. ఈ సంగతి చెప్పి మీసహాయం పొందాలని వచ్చాను''

సత్యనారాయణ కొంతసేపటివరకు మాట్లాడలేదు ఆ మౌనం శేఖరానికి భయంకరంగా ఉంది అతని గుండెలు కొట్టుకొంటూ ఉన్నవి ప్రక్క చెట్లతోపులోనుంచి గుడ్లగూబ కూసింది

''శేఖరంగారు! ఏమిచెప్పమంటారు? మా పూర్వులు ఎప్పుడైనా ఏదైనా చేసి ఉంటే అపేక్షాబుద్ధి లేక స్వతంత్రులై చేయగలిగారు నేను ఆ స్థితిలో లేను నాకు క్షుత్పిపాసలున్నాయి. పైగా పరాధీనమైన బ్రతుకు ఇలాంటివాడు ధర్మాధర్మాలు నిర్ణయిస్తాడా? వట్టిది శేఖరంగారు వట్టిది మీలాంటివారే దీనికి సమర్థులు నావంటివారిల్లి ఏమౌతుంది? నేను చాలా సామాన్యుణ్ణి ఈనాటి స్థితిగతులు నాకు తెలియవు ఆలోచించుకొనే తాహతుకూడా లేదు ఎందుకు నన్నీ వ్యవహారంలోకి లాగుతారు? మంచిచెడ్డలేవో మీలాంటివాళ్ళు నిర్ణయిస్తారు ప్రయత్నించడానికైనా కొంత శక్తి సామర్థ్యాలు కావాలి అవికూడా ఉన్నట్టుగా తోచడంలేదు క్షమించండి శేఖరంగారూ! అంతవన్నా నేను చేయగలిగింది ఏమీ కనిపించటంలేదు ''

'' అంతేనా? మీరు నాస్థితిలో ఉన్నారనుకోండి అప్పుడేమిచేస్తారు?'' నిరుత్సాహంగా శేఖరం ప్రశ్నించాడు

---

''మీరు తప్పుచేశారని నేను అనలేదు అనబోను అనలేనుకూడా. నాపరిస్థితి మనవిచేశాను ''

కొంతసేపు ఎవరూ మాట్లాడలేదు చివరికి చంద్రశేఖరం తనకు తావం చెప్పుకొంటున్నట్లుగా అన్నాడు

''ఇంతవరకూ పొరపాటు పడ్డానన్నమట. మంచిచెడ్డలు ధర్మాధర్మాలు ఎవరికి వారు నిర్ణయించుకొని అనుష్ఠించే వనుకొన్నాను కాదు అవి సంఘం తేల్చవలసినవే ఏది ధర్మమో ఏది శాస్త్రమో సమాజమే తేల్చాలి అంటే ఉమ్మడిగా పశుబలం తేల్చవలసినదే నన్నమాట. ఎవరు ఎక్కువమందిని ఆకర్షించగలిగితే వారిదే శాస్త్రం వారిదే ధర్మం, కాబట్టి శాస్త్రాలు సిద్ధాంతాలు భావాలు డబ్బునుబట్టి ఉన్నాయంటే ఆశ్చర్యపడవలసిన దేముంది? పంతులుగారు సరిగానే చెప్పారు. ఏమండోయ్ మీ సలహా మరిచిపోలేను. అనవసరంగా మీకు లేనిపోని ప్రయాస కలిగించి ఇక్కడదాకా తీసుకువచ్చాను. క్షమించండి ఊళ్ళోకి బయలు దేరుతున్నారా?

శేఖరం లేచాడు. అతని వెంట సత్యనారాయణ బయలు దేరాడు. శేఖరం తన యింటిదారి పట్టాడు సత్యనారాయణ డాక్టరు దగ్గరకు పోదామని అటు కొంత దూరం వెళ్ళాడు. ఇప్పుడుపోయి అతని నిద్ర చెడగొట్టడం దేనికి? అతని అభిప్రాయమేమిటో ఇదివరకే తేల్చి చెప్పాడు కదా! ఈ సంగతి చెప్పినా అతడు కొత్తగా యిచ్చే సలహా ఏముంటుంది? తనకి మనస్సులో పుల్లయ్య కనిపించాడు. ''ఏమోయి పంతులూ, నీ తండ్రికి నీకూ ఇన్నేండ్లనుంచి తోడ్పడుతున్నానే! ఇంతకూ నువ్వు చేయబూనుకొన్నదేంటి? ప్రత్యర్థులతో జేరి నన్ను ధ్వంసం చేస్తావా? ఈ నీతివే నీ పిల్లలు నీపట్ల అవలంబిస్తే ఎలా ఉంటుంది? అసలు కుటుంబ జీవనం ఉంటుందా? నీ మాత్రం ధర్మదీక్ష ద్రోణుడికి లేదంటావా? అతని కన్న నీవు ఎందులో గొప్పవాడివి? కౌరవులు చేసేది అన్యాయమని అతనికి స్పష్టంగా తెలుసు. అతడు పాండవుల పక్షాన ఎందుకు చేరలేదు? ఏం పంతులు ! మాట్లాడవేం? న్యాయమంటే నల్లగా ఉంటుందో తెల్లగా ఉంటుందో నీకేమితెలుసు? నీ ఒక్కడివల్ల ఏమౌతుంది కనుక? అనవసరంగా తింటున్నకూడు పాడుచేసుకోకు. హామి నిజంగా ఇచ్చావో లేదో మా ఉభయులకే తెలుసు. కాని మరొకరికి తెలియాలన్న అవసరం లేదు. తెలిసి ఉండి సత్యం చెప్పలదని నిలవేసి నిన్ను ఎవరూ అడగలేదు అంతగా వస్తే నేను లేనా? ఊరక తగిలితే ఒకటి, నాకు తగిలితే మరొకటీనా? చేతనైతే ఆ ధర్మవిచారం నా దగ్గరవచ్చి సాగించు. అంతే కాని పిచ్చిపిచ్చిగా వ్యవహరించకు'' అని హెచ్చరించాడు.

నిజమే తానుతొందరపడటం దేనికి? పుల్లయ్య పొరపడి కేసు పెట్టివుండవచ్చును. దాన్ని యెత్తివేసుకోవటానికి ఇంకా అవకాశం ఉన్నది. అతడునిజంగా ఎత్తివేసుకొంటాడు కూడా? శేఖరంగారిని అనవసరంగా జైలుకి పంపి ఏవిధంగా లాభిస్తాడు? స్థితిగతులు చూచి చేయవలసిందేమైనా ఉంటే అప్పుడే చేయవచ్చును ఇప్పుడు తాను తొందరపడవలసిన అవసరమేముంది?

సత్యనారాయణ ఇంటికి వెళ్లాడు మంచం తన మామూలును మించి మరి కొంతసేపు మాత్రమే కిరకిరలాడింది.

---

జి.వి. కృష్ణరావు

## ..... పదకొండు .....

కేసు విచారణ సమీపిస్తున్నది. పుల్లయ్యకు ముందుకు పోవటానికి మనస్కరించటంలేదు వెనక్కు జారుకోటానికి మార్గం కనిపించటంలేదు ఒకసారి బోను ఎక్కితే ఎన్ని అబద్ధాలు ఆడవలసివస్తుందో? అతనికి కీళ్లనొప్పులు బయట పడ్డాయి వంగసీయపు, కూర్చోనీయవు అన్యాయానికి దిగితే ఏమవుతుంది?, ఈశ్వరుడు చూస్తూ ఊరుకొంటాడా? . అనుమానమే రోగం తాను అనవసరంగా ఉలిక్కిపడుతున్నాడు ఈరోగం ఇదివరకు ఏ తప్పుచేస్తే వచ్చింది? అసలు నోటీసు ఇచ్చినప్పుడే రావాలిగదా? తాను అనవసరంగా భయపడుతున్నాడు

పుల్లయ్యకు ఈ విచారంతో కొంత ఆందోళన కలిగింది ఇంతగా కలవరపడుతున్న తాను నిద్రలో కలవరిస్తాడేమో? ముసలిది వింటే ఏమౌతుంది? తన గౌరవం నిలుస్తుందా? కోడలికి చెప్పుతుంది. ఆమె ఏమనుకొంటుంది; తన కుటుంబంలో తాను తిరిగి తల ఎత్తుకొని తిరుగుతాడా? సీత రాముడు తన ముఖం చూస్తారా? అతడు వణకి పోయాడు నాటినుంచి

52 కంటికి కూరుకుకూడా దూరం కాసాగింది. ఒక వేళ కాస్త కునుకుతీసినా అందరు పడుకున్నా తరువాతనే పండుకొని అందరికన్నా ముందుగా లేచేవాడు ఎన్నాళ్ళని ఇలా సాగేటట్టు?

కేసు ఎత్తివేసుకొనే మార్గంలేదా? ఆలోచించాడు. చంద్రశేఖరం ఊరుకొంటాడా? అయిదు వేలు అతని ఎదావపోసింది చాలక పరువు నష్టం క్రింద ఎంత చెల్లించమంటాడో! ఈ బాధ ఎవరితో చెప్పుకొంటాడు?

ఒకరోజున పంతులు తండ్రి చనిపోయాడని విని పుల్లయ్య చూడవచ్చాడు సత్యనారాయణను, ఆ కుటుంబాన్ని ఓదార్చాడు నిజానికి తనకూ, ముసలిపంతులుకూ పెద్ద తేడా లేదు. కాకపోతే పన్నెండేళ్లు పెద్దవాడేమో. పుల్లయ్యకు భయం కలిగింది. తాను కూడా చావక తప్పదు. రేపే ఊడుతాడో ఎల్లుండే ఊడుతాడో ఈ మట్టి ఘటాలు శాశ్వతమా? ఆ రాత్రి మంచంలో పండుకొని దొర్లుతూ ఉన్నాడు. దగ్గర్లో చిన్న మంచం మీద లక్ష్మమ్మ పండుకొన్నది ఆమె నిద్రపోతున్నట్లు కనిపించలేదు.

"అమ్మీ అమ్మీ!"

"ఏమిటి"?

"ఏ క్షణంలోనైనా నా చావు తప్పదు గదా మనుషులు తప్పుడు పనులకు ఎందుకు దిగుతారో?"

"నిజమే ఈ గటాలు, ఆస్తిపాస్తులునిత్తెమన్నాట్లుగా చూస్తారు అదే అంతుపట్టకుండా ఉంది".

కొంచెం సేపు ఇద్దరూ మాట్లాడలేదు పుల్లయ్య నిట్టూర్చి అన్నాడు

''ఇదిగో అమ్మి! మనం తెలియకుండా యెన్ని పాపాలు చేస్తున్నామో? అట్లాంటప్పుడు యిది పుణ్యమని ఇది పాపమని ఎలా చెప్పటం?''

''చాల్లే ఎవరన్నా వింటే నవ్విపోతారు పాపం పుణ్యమెలా అవుతుంది? పుణ్యం పాపం ఎలా అవుతుంది? పగలు పగలే రాత్రి రాత్రే ఏళ్ళు పైబడ్డకొద్దికీ మతి పోతున్నట్లుంది''

బయట ఆ రాత్రి ఉరుములు, మెరుపులు జోరున వాన పుల్లయ్య మనస్సు ఆలోచిస్తునే ఉన్నది.

''సరేకాని అమ్మీ, ఒకడు పాపం చేసే చచ్చిపోతాడు నరకలోకంలో వాడు తగిన శిక్ష అనుభవిస్తాడు. బాగానే ఉన్నది. కాని ఆ పాపకర్మఫలం అన్నెము పున్నెము తెలియని ఇతరులు కూడా అనుభవిస్తున్నారే, ఎందువల్ల నంట? వీళ్లుకూడా వెనక జన్మలో పాపంచేసి ఉండాలి. అప్పుడు పాపమనేది ఒకడు చేసేది కాదు పదిమందికి సంబంధించినది కావాలి అంటే పాపపుణ్యాలు అనేవి యెవనికి వాడు ఒంటరిగా చేసేవి కావన్న మాటేగా 'అలాంటప్పుడు నీవు పుణ్యం చేయి పాపం చేయ్యకు' అని వ్యక్తులకు ఎందుకు చెబుతున్నారు? పాపి శిక్ష లనుభవించినా పాపకర్మ నశించటం లేదు. అయినప్పుడు స్వర్గనరకాలు దేనికి?''

''అన్నెం పున్నెం పొదుపు కుదుపు మనకు అంతుచిక్కుతాయా? ఎవరో అవతారపురుషులు చెప్పవలసిన మాటలు నీకు దేనికి?''



లక్ష్మమ్మ పక్కకు తిరిగి పడుకొన్నది.

పుల్లయ్య కన్నుమూశాడు చంద్రశేఖరం సంతతి చినిగిన గుడ్డలతో, మాసిన తలలతో, జోలెలతో సాక్షాత్కరించింది '' ఓరి దుర్మార్గుడా! ఎంతపని చేశావు! మా కొంప నిలువునా తీశావు అంతతో ఊరుకొన్నావా? మా నాన్నను జైలుకు పంపించావు. మా పరువు ప్రతిష్ఠలు మంటగలిపావు. సంఘంలో మాకు నీళ్ళుపుట్టకుండా చేశావు నీ మూలాన మాకీ గతి పట్టింది. అంతా నువ్వే చేశావు. ఈ పాపం ఊరికే పోతుందా? నీ కొడుకు కూతురు, కోడళ్ళు మాలాగే దిక్కులేని పక్షులై దేశమ్మ కాకులై అలో లక్ష్మణా అంటూ అంగలార్చి చావకుండా ఉంటారా? పసివాళ్ల ఉసురు ఊరకనే పోదు. ఇంత కింత అనుభవించి తీరుతావు తప్పదు, తప్పదు!'' అని శపిస్తున్నట్టు కనిపించింది గడగడలాడి పోయాడు. ముచ్చెమటలు పోసుకొచ్చాయి బాధతో మూలిగి మరొక పక్కకు తిరిగి పండుకొన్నాడు. మళ్ళీ కాస్త కునుకుపట్టింది కోర్టు విచారణ ప్రారంభమైంది. తన్ను ప్రమాణం చేసి యధార్థం చెప్పమని అధికారి అడిగాడు. కళ్ళు తిరిగి తాను బోనులోనే కుప్పనకూరగా కూలాడు దానితో పుల్లయ్య ఉలిక్కిపడి లేచాడు. లక్ష్మమ్మ గాఢనిద్రలో ఉంది. ఎంత పొద్దుపోయిందో? అన్నట్లు బయటికిపోతే మాత్రం ఏమితెలుస్తుంది? కారుమబ్బులు కమ్మి ఉంటాయి తనకు శిక్షపడి జైలులో ఉండివచ్చినా శేఖరం పడ్డబాధ పోతుందా? ములిది యెంత హాయిగా నిద్రపోతున్నది? వీళ్ళకు ఇంతనిద్ర యెలా వస్తుందో!

జి వి కృష్ణరావు

మరునాడు పొలం పోతుంటే పుల్లయ్యకు మల్లయ్య ఎదురయ్యాడు  మల్లయ్య నవ్వుతూ, " పొలందాకనా?" అని అడిగాడు  అతడు అవునని తల ఊపాడు  మల్లయ్యది అంతా నవ్వేనా? అతని కడుపులో ఎంతవిషం ఉంది! ఆ చంద్రశేఖరం కాక మల్లయ్య అయితే ఎంత బాగుండేది! అతనితో చేతులు కలిపి చూచినా అది ఒక అందమూ చందమే  బలాబలాలు తేలి ఉండేవి  అసలే చంద్రశేఖరం అర్భకుడు  ఇప్పుడు మరీ అడుగుజారి ఉన్నాడు  పైగా అక్రమమార్గం అవలంబించి సాధించబోతున్నాడు  ఇంతకన్నా ప్రపంచంలో నీచత్వమేమి ఉంటుంది? పుల్లయ్యకు తనమీద తనకే అసహ్యం కలిగి చుట్టను కొరికి తుప్పున ఊశాడు

ఆ రాత్రి అతనికి పులకరింత వచ్చింది  అది సన్నిపాతమే  తనకు చావు తప్పదు  తనపాపమే బెడిపి కొడుతున్నది. భగవంతుడు లేడూ మరి! మనుషుల కన్నులు మూయవచ్చును కాని అతని కన్నులెల్లా మూయటం? లాభంలేదు అన్నట్లు చీకట్లో ప్రొద్దుపోయిన తరువాత చంద్రశేఖరం పంతులు కలసి వస్తున్నారని పొట్టి రామయ్య చెప్పాడే! పంతుల్ని శేఖరం చేరదువ్వుతున్నాడు కామాలు! పంతులైనా అంత తెలివితక్కువవాడు కాదు  చూస్తూ చూస్తూ తన జీవితం నాశనం చేసుకొంటాడా? ఆ సంగతి నాతో చెప్పి ఉండవలసిందే? ఏ పుట్టలో ఏ పామున్నదో ఎవరుచూచారు? ఈ అవస్థఅంతా దేనికి? ముక్కుకు సూటిగాపోతే బాధేలేదు. ఈ అవస్థలంతాదేనికి వచ్చినట్లు? మాకోసమే కదా? పెనుగులాట! ఈ ఒక్కమాటకోసం ఇంత అన్యాయానికి ఎందుకు ఒడిగట్టాలి? తెల్లవారగానే ముసలిదానితో చెప్పివేస్తే తీరుపోతుంది  సాయంకాలం శేషగిరిదగ్గరకు వెళ్ళితే మిగతా వ్యవహారాన్ని అతగాడే చూచుకొంటాడు  ఎందుకు వచ్చిన లాయిలాసా?

పుల్లయ్యకు గుండెకుంపటి తీసివేసినట్లయి, " అమ్మయ్య!" అని నిట్టూర్చి హాయిగా నిద్రపోయాడు. కరకర పొద్దుపొడుస్తున్నది. పాలకోసం కోడెదూడ 'అంబా' అని అరుస్తూ ఉంది. అప్పటికి అతడు నిద్రలేవలేదు  లక్ష్మమ్మ గదివాకిట్లో నిలబడి ", ముసలయ్యా ముసలయ్యా! నిన్నే పిలిచేది" అంటూ లేపింది అతడు మరొక ప్రక్కకు తిరిగాడు  "నిన్నే పిలిచేది, ఎవరో నీకోసమొచ్చారు.!" కండ్లు నలుపుకొంటూ లేచి ఆవులించి " ఎవరది?" అని అడిగాడు"

" ఏమో దొడ్లో ఉన్నాడు "

పుల్లయ్య దొడ్లోకి వెళ్లగానే వీరయ్య కనిపించాడు. ఈ దరిద్రుడి కోసమేనా తానింత హడావుడిగా లేచివచ్చింది.

"ఏం వీరయ్య ప్రొద్దున్నే వచ్చావు?"

"ఆ ఏమున్నది ఒకమాట చెవిని వేసి పోదామని వచ్చాను."

"ఏమిటది?"

"మీరు కేసు పెట్టారుగా"

"అయితే . . ."

"మీకు ప్రతికూలంగా సాక్ష్యం చెప్పాను."

‘‘ఎవరన్నా చెప్పమంటున్నారా?’’

‘‘లేదు’’

పుల్లయ్య అనుమానించాడు ఎవరో వీరయ్యను డబ్బిచ్చి ఎక్కదోలుతున్నారు. తనవద్దకూడా గిట్టుబాటు చేసుకొవటానికే వచ్చి ఉంటాడు లేకపోతే ఈ మాట అతను తన చెవిని వేయవలసిన అవసరం లేదు

‘‘శేఖరం నీకు పొగాకు కొని పెడుతున్నాడా?’’

‘‘ఒకరు చెప్పమంటే చెప్పే ఘటం కాదు ఆ భగవంతుడే చెప్పమంటున్నాడు ’’

‘‘ఏమని’’

‘‘ఏమని ఏముంది? ఆనాడు మీతోపాటు మాధవయ్యగారి వెంట బస్తీకి వచ్చా.’’

‘‘ఏ రోజున?’’

‘‘హోమీ యిస్తూ సంతకం చేసిన రోజున ’’

పుల్లయ్య తేరిపారజూచాడు

‘‘నీకు మతి మళ్ళింది ఎందుకు వచ్చిన బెడద? కృష్ణా రామా అంటూ ఒకమూల కూర్చోక ’’

పుల్లయ్యకు ఏదో ఆలోచన తట్టింది ‘‘ నీకు మతి లేదు. సాక్ష్యానికి పనికిరావని చెప్తాను’’ 55
వీరయ్య వెళ్లిపోయాడు

‘‘ వీళ్లా నన్ను సాధించేవాళ్ళు! ఆపూటకు లేని దర్దమ్మలా నాకు చెప్పేవాళ్ళు! తప్పు చేస్తే దండించవలసిన వాడు భగవంతుడు కాని వీళ్ళెవరు మధ్య? కాదనివస్తే పుల్లయ్య తడాఖా ఏమిటో రుచి చూస్తారు?’’ అని మీసం మెలి పెట్టాడు.

ఆనాడు భోజనం వడ్డిస్తూ పుల్లయ్యతో లక్ష్మమ్మ అన్నది.‘‘ విన్నారూ, అమ్మాయమ్మ లలితగారింటికి చూచివద్దామని వెళ్ళిందట ఆవరలో ఉన్నదికదా అని పెద్దపిల్లల్నీ ఇద్దర్నీ ఆశ్రమంలో ఉంచుకుంటా నంటే అనరానిమాటలు అని పంపించిందట పెద్దలు చెబుతారే అలా ఉంది వ్యవహారం ’’

‘‘ నీకు ఎవరు చెప్పారు?’’

‘‘ ఆమె నిన్న మధ్యాహ్నం మనయింటికి వచ్చినప్పుడు చెప్పుకొని కంట తడిపెట్టింది. ఒకటేమిటి అమ్మాయమ్మను ఆమె చెల్లెల్ని ఏవేమో అన్నదట. ఏమీ అనకపోతే కంట తడిపెట్టుకుంటుందా?’’

పుల్లయ్య ఊ కొట్టాడే కాని మరేమి మాట్లాడలేదు అతడు ఆలోచించాడు తాను చేయవలసిన పని అమ్మాయమ్మే చేస్తుంది ఉన్నవి లేనివి కలిపించి చంద్రశేఖరాన్ని ఆ కుటుంబాన్ని ఎంత అల్లరిపాలుచేయాలో అంత చేస్తుంది ఇప్పుడే తాను మేలుకొంటే నలుగురికీ శేఖరంమీదనే అనుమానం కలుగుతుంది కాని తనమీద ఎవరికీ అపోహ కలగదు ఈ అవకాశం జారిపోనీయ రాదనుకొన్నాడు

---

జి వి. కృష్ణరావు

ఇది ఇలా ఉండగా ఎన్నడూ కేసురాని పెంచలరావుకు చంద్రశేఖరం వకాల్తా యిచ్చాడని పుకారు వచ్చింది బాగానే ఉన్నది "నోట్లో నాలుక లేనివాడా చంద్రశేఖరం కేసు గెలిపించేది?" చంద్రశేఖరం నిర్దోషిత్వం రుజువు చేయటమే కాక మాననష్టపరిహారం ఇప్పిస్తా నంటున్నాడని విన్నాడు కాగితాలమిల్లు మూలపడటానికికూడా తానే కారణమని చెప్పించటానికి చంద్రశేఖరం సాక్షులను సమకూర్చాడని పుల్లయ్యకు తెలిసింది.

పుల్లయ్య ఫక్కున నవ్వాడు. అతనికి ఎక్కడ లేని ఉత్సాహం వచ్చింది కాగితాలమిల్లు మూలబడటానికి తాను కారణమా? తప్పుడు సాక్ష్యం చెప్పటానికి సిగ్గెట్లా లేదు? మానాభిమానాలకు తిలోదకాలిచ్చినవాళ్ళు దేనికైనా సిద్ధమౌతారు రేపు ఒకణ్ణి చంపమన్నా చంపుతారు. ఇలాంటి వాళ్ళను చూస్తూ ఊరుకొంటే బ్రతకటానికి వీలవుతుందా? తప్పకుండా అంతు కనుక్కోవలసిందే.

పసుపు వ్యాపారంలో ఊళ్ళోవాళ్ళను పుల్లయ్య మోసం చేశాడనీ, సత్రానికి ధర్మకర్తగా ఉండి దానికింద ఉన్న ఏడెకరాల ఫలసాయం భుక్తపరచుకొన్నాడనీ, లేకపోతే మూడెకరాలవాడు డాబా కట్టించి ఏభైవేలు ఎలా తిప్పుతున్నాడనీ చంద్రశేఖరం ప్రచారం మొదలుపెట్టాడు. దీనితో పుల్లయ్యకు కారంరాచినట్లయింది తన తప్పు మరచిపోయి లోకమంతా తన్ను అన్యాయంగా ఎదుర్కొంటున్నదనీ, ఆత్మ రక్షణకు పూనుకోవటం విధ్యుక్తధర్మమనీ భావించసాగాడు. దీనితో అప్పటిదాకా ఉంటున్న జంకుగొంకులు సడలిపోయి ధైర్యం ఏర్పడింది

మనస్థిమితత్వం లభించగానే కీళ్ళునొప్పులు మటుమాయమై పోయాయి చంద్రశేఖరం ఏ యెత్తులు యెత్తుతాడా, తాను వేయవలసిన పైయెత్తులు యేమిటా అని ఆలోచించమొదలు పెట్టాడు. ఇప్పుడు అతని ప్రత్యర్థి చంద్రశేఖరం కాదు, అతని పక్షాన సాక్ష్యానికి తయారవుతున్నవాళ్ళు. వాళ్ళచరిత్ర అంతా జ్ఞప్తికి తెచ్చుకో మొదలు పెట్టాడు. వాళ్ళంతా లోగడ తనకు అపకారంచేసేవాళ్ళే. వాళ్ళందరిమీద కక్షసాధించటం అవసరం. పొట్టి రమణయ్యగాడు ప్రతి సంవత్సరం తనచేనిగట్టు నరుకుకొంటూనే ఉన్నాడు. మల్లయ్యగాడు చేలోకి బండి పోనీక నానా ఇబ్బంది పెడుతున్నాడు. తాను కొనటానికి సిద్ధమైన పసుపు కాసా ఒక అర్ధరూపాయి హెచ్చు పెట్టి తన పాతట్లో పోయించుకొన్నాడు. సరుకే ప్రధానమైతే అతనికి మరొకచోట దొరక్కపోయిందా? కాదు, తన్ను నష్టపరచటమే ప్రధానం కాని వాడు ఏ నక్షత్రాన పుట్టాడో ఒకళ్లు పచ్చగా ఉంటే కళ్ళార చూడలేడు కదా! వీడు వదిలితే ఊరికి ముప్పాతిక పీడవదుల్తుంది అసలు చంద్రశేఖరానికి 'కీ యిచ్చి' తిప్పుతున్నది వాడే కావాలి. అంతేకాని యీ అపరబుద్ధులు అతనికి పుట్టినవి కావు స్కూలు విషయంలో అలా ధ్వంసంచేస్తున్నాడు. పంచాయితీ బోర్డులో చేరి అలా చేస్తున్నాడు నసాళం పగిలేట్టుదెబ్బకొడితే కాని బుద్ధిరాదు ఊరు బాగుపడదు. ఈ వ్యవహారం అసలు చంద్రశేఖరానిదే కాదు. మూలసూత్రధారుడు మల్లయ్యగాడే ఇప్పుడు తప్ప మరొకసారి ఒంటరిగా చిక్కాలంటే చిక్కడు, ఈ వ్యవహారంలోనే తేల్చుకోవాలి

పుల్లయ్యకు పూర్తిగా చలితీరింది పంచ తప్పిదాలు చేయలేదు ఒక్కటిమాత్రం తాను చేశాడా! తాను ఇలాంటి పాపిష్టి లోకానికి ఎందుకు భయపడాలి? ఎవరికి భయపడాలి? ఇంకా తనమీద ఏమేమి బయలుదేరుతున్నవో జాగ్రత్తగా ఆరాతీస్తూ వచ్చాడు ఆరోపణలు వింటున్నకొద్దీ మనస్సు మరీ విరవిగుస్తూ వచ్చింది అసలు సంగతి మరచిపోవటానికి అవకాశం ఏర్పాడుతూ వచ్చింది ఒక రోజున విన్నాడు తాను, తన కొడుకు కమ్యూనిస్టులట తన కొడుకును అండర్ గ్రౌండులో దాచాడట! తాను అన్నివిధాల వాడికి సహాయం చేస్తున్నాడట! కమ్యూనిస్టు కాకపోతే గ్రామంలోనికి ఎందుకు రాడు? అని అంటున్నారు నూటికి నూరుపాళ్ళు తన కుటుంబం జాతీయవాదాన్ని బలపరుస్తున్నది. తనమనుమడిదగ్గర నుంచి కోడలుదాక అంతా ఖద్దరు కడుతున్నారే! తన కుటుంబమంతా కమ్యూనిస్టులా? తనకొడుకును పట్టిస్తారా? వీళ్ళను ఏమి చేస్తే పాపం తీరుతుంది?

పుల్లయ్యకు తనపై ఎలాంటి ఆరోపణలున్నట్లు తెలియని నాడు మనస్సు అదొకవిధంగా ఉండేది లోకమేదో అంటున్నదని కల్పించుకొనేవాడు తాను భార్యకు జంకి చంద్రశేఖరం మీద యీ అఘాయిత్యానికి దిగాడని అంటున్నట్లు భావించాడు తాను భార్యకుజంకి యీ పని చేస్తున్నాడా? అసలు తాను భార్యకు/జంకుతాడా? ఇంతకన్నా అబద్ధమేమి ఉంటుంది? వాళ్లకున్న గుణాలనే ఇతరులకు ఆరోపిస్తుంటారు. దుష్టులకు లోకమంతా దుష్టంగానే కనిపిస్తుంది కాని మరొక విధంగా ఎలా కనిపిస్తుంది? 57

ఈ విధంగా కొత్త కొత్త ఆరోపణలు తెలియకుండానే స్వయంగా కల్పించుకొంటూ సాక్షులను సమకూర్చుకొని పుల్లయ్య కేసు విచారణకు ఆయత్తమయ్యాడు

---

జి వి కృష్ణరావు

## .. పన్నెండు .....

''ఇప్పుడేం చెయ్యాలి?''

''భోజనం.''

''అంత ఎగతాళిగా ఉంది బ్రతుకు!''

''ఎగతాళేమిటి? తిండిలేక ఏడ్చేవాళ్లు ఏడుస్తూ ఉంటే నాకు తిండి అక్కరలేదని భీష్మించుకొని కూర్చుంటా వేమిటి నీ ఒక్కడివల్ల లోకం బాగుపడుతుందా! ఈ నాలుగురోజులు పోతే ఈ పట్టెడు మెతుకులయినా దొరుకుతాయని గుండెమీద చేయి వేసుకొని చెప్పు!''

''ఇప్పుడు ఆ గొడవంతా దేనికి? చూస్తూ అన్నెంపున్నెం తెలియని చంద్రశేఖరాన్ని జైలుకు పంపించవలసిందేనా లేదంటే ముసలివాణ్ణి పంపించాలి. ఎంతకాదనుకున్నా కన్నతండ్రి ఎత్తి పెంచాడు ఎలా పంపిచేటట్లు? ఈ వయస్సు అతడు జైల్లో ఎలా ఉంటాడు? మంచి పుగాకు లేకపోతే గడియ గడవదే! ఏ సంవత్సరమో రెండు సంవత్సరాలు పడితే ఎలాగు? అతనికి ఎలావున్నా కుటుంబం ఏమౌతుంది అమ్మ, అమ్మతోపాటు సీత మంచంపడుతారు. ఊళ్ళో నాకు మాత్రం గౌరవ ముంటుందా? ఫలానావారి అబ్బాయి అని అనరా? అప్పుడు ముఖం ఎక్కడ దాచుకొనేటట్లు?''

''అందుకనేగా ఈ గది సంపాదించింది! ఇక్కడ దాచుకోవచ్చు. మరేమీ ఫరవాలేదు ''

ఇలాంటి తర్కవితర్కాలలో బడి రామారావు కొట్టుకపోతున్నాడు. అతని చేతులకు క్యాంపుకాట్ అంచులు తగులుతున్నాయి. కాని మనస్సుకుమాత్రం ఏ దరీ దొరకటంలేదు

రామారావు పుల్లయ్య చిన్నకొడుకు కలకత్తా విశ్వవిద్యాలయంలో యం ఏ డిగ్రీ పుచ్చుకొన్నాడు అంతటితో సంతృప్తిపడి ఉద్యోగంలో ప్రవేశిస్తాడని తండ్రి ఆసించాడు కాని అతనికి మాత్రం విద్యాతృష్ణ తీరలేదు దేశంలోని స్థితి గతులు, అంతర్జాతీయ అవ్యవస్థ అతన్ని రెచ్చకొట్టాయి. ఆర్థిక రాజకీయ సాంస్కృతిక రంగాలలో మొలకలెత్తిన వాదాల మూలతత్త్వం తెలుసుకొందా మన్న జిజ్ఞాస కలిగింది. నాయకుల కేకలలో పడి కొట్టుకొనిపోక తనకు తాను ఆలోచించి మంచిచెడులు నిర్ణయించుకోవాలన్న తహతహలు ప్రబలమయ్యాయి తండ్రివద్దన్నా వినక మద్రాసులో ఉండి క్రమంగా తత్త్వశాస్త్ర విచారంలో పడ్డాడు. అతనికి అప్పుడే కళ్ళు తెరచుకొన్నట్లయింది వివిధరంగాలలో జరుగుతున్న వన్నీ అవకతవకలేననీ, ఇవి కొనసాగితే మానవునికిక అభ్యుదయం సిద్ధించటం కల్ల అని ధ్రువపడిపోయింది. స్వాతంత్ర్యపిపాస, సత్యాన్వేషణ అన్నవి మానవునికిక సహజ సిద్ధాలు ఈ రెంటిని పురస్కరించుకొనే మానవజీవితం దొర్లుతూ ఉంది ఈ రెండు ఇక్కధర్మంద్వారానే సాధ్యం ధర్మం లేనివాడు చక్రం ఊబిలో దిగబడిపోతుంది మానవుడు అధఃపతనం పొందుతాడు. ఈనాడు దేశం ఇంత అధోగతిలో ఉండటానికి కారణం ఇదేనని అటుడు పత్రికలలో వ్రాస్తూవచ్చాడు విద్యార్థిసభలలో విమర్శిస్తూవచ్చాడు

అలాంటి రామారావునునేడు ఆ సమస్య ఎదుర్కొన్నది మార్వాడి తండ్రి వ్రాసి ఉన్నట్లు చంద్రశేఖరానికి పోర్టరీ పుట్టిస్తే అతనిపై కేసు పెట్టాడని తల్లి లక్ష్మమ్మ వదినచేత తనకు ఉత్తరం వ్రాయించింది చూడగానే రామారావు విస్తుపోయాడు చంద్రశేఖరానికి అడ్డమున్నాని స్వయంగా తండ్రి తనతో చెప్పాడు. అలాంటప్పుడు చంద్రశేఖరం మీద కేసు పెట్టడంలో అర్థం కనిపించలేదు. తండ్రి ఇదివరకు తెలిపి నంతలో ఎలాంటి అన్యాయానికి ఒడికట్టలేదు ఇప్పుడు అలాంటి పనికి ఎందుకు దిగుతాడు? బహుశ ఆ సంగతి మరచిపోయి కేసుపెట్టి ఉండాలి అంతకు తప్ప మరోక కారణం ఉండటానికి వీలులేదు. ఆ దృష్టిలో రామారావు తండ్రికి ఉత్తరం వ్రాస్తూ చంద్రశేఖరానికి హామి యిచ్చిన సంగతి జ్ఞప్తికి తెచ్చాడు ఆ వుత్తరానికి సమాధానం తండ్రి వద్దనుంచి రావుకు నేడే చేరింది '' ఈ సంగతి నీకేమి తెలియదు కాబట్టి మెదలకుండా ఊరుకోవటం ఉత్తమం. ఇప్పట్లో నీవు ఇక్కడకు రావద్దని మీ అమ్మకూడా చెప్పమంటున్నది '' ఈ వాక్యమే రామారావు ప్రస్తుతస్థితికి కారణం అతనికిది ఆ క్రిందటి రోజున విద్యార్థుల సమావేశంలో తాను చెప్పిన ముక్కలు జ్ఞప్తికి వచ్చాయి; ''సోదరులారా! ధరలు ఈ నాడు పెచ్చుపెరిగి పోతున్నాయి. బుద్ధులు గడ్డిమేస్తున్నాయి దీనికి అంతకూ కారణమేమిటి? నాయకులలో ఉన్న అవినీతి. ఈ అవినీతి కొత్తగా పదవులు సంక్రమించిన తరువాత వచ్చినదనుకోవటం చాలపొరపాటు మొదటినుంచి వారు ప్రబోధిస్తూ వచ్చిన సిద్ధాంతాలలోనే ఉన్నది ఆ సిద్ధాంతాలు సిద్ధాంతాలుగా 3 ఉన్నంతకాలం మనకు వాటిలో ఉన్న అనర్థం బోధపడలేదు అవి కార్యరూపం దాల్చినప్పుడు ఉన్న కుళ్ళంతా బయటికి కనిపిస్తూనే ఉంది మొదటినుంచి రాజకీయ నాయకులు జాతియ స్వాతంత్ర్యం కోసం జాతీయ ఔన్నత్యంకోసం పోరాడండని జాతి పేరుతో సంఘం పేరుతో కొత్తదేవతను సృష్టించారు ఆ దేవతకు బలికావటం వ్యక్తిధర్మమని చెప్పారు నేడు మాత్రం వారు చేస్తున్నదేమిటి? ఆ జాతి ఔన్నత్యమే కోరుతున్నారు దానికొసమే కృషిచేస్తున్నారు ఇతర దేశాలపై ఆధారపడిన జాతి ఎప్పుడు గొప్పది కాదు. ఆహార పదార్థాలలో స్వయంసంపూర్ణత సాధించాలి అంటే దిగుమతులు పూర్తిగా నిషేధించాలి సైనికబలం పెంచాలి భారీ యంత్రసామాగ్రి సంపాదించటానికి ఎగుమతులు ఎక్కువ చేయాలి వ్యవసాయం ప్రధానమైన మన దేశం ఏమి ఎగుమతి చేయగలుగుతుంది? పొగాకు, జనపనార మొదలయిన వాణిజ్యపు పంటలే కదా! దేశంలోని పొలాలు కొంతభాగం ఈ పంటలకు వినియోగించటం జరిగింది ఫలితం తిండిగింజల కొరత మరీ అధికమయింది. ధరలు పెరిగాయి తిడిగింజల ధరలు పెరిగినప్పుడుమిగతా వస్తువుల ధరలు పెరుగక ఏమిచేస్తాయి? ధరలు పెరిగే అవకాశం కనిపిస్తున్నప్పుడు కొని నిల్వచేయటానికి, విపరీతలాభాలు సంపాదించటానికి ప్రయత్నిస్తాడు అలా చేయనివాడు అసమర్థుడు. తెలివి తక్కువ దద్దమ్మకావాలి డబ్బు, అధికారం ఎవరికి చేదు? అసలు మానవుణ్ణి ఆడిస్తున్నవి ఇవికావా? కాబట్టి మన నాయకుల సిద్ధాంతాలోనే లోటు ఉన్నది. జాతి అంతే వ్యక్తుల సముదాయాన్ని మించి ఎక్కడా లేదు వ్యక్తి సముదాయ అభ్యుదయమే జాతి అభ్యుదయం మానవజీవితం మానవ జీవితం కోసమే కాని పారలౌకికసిద్ధికోసం కాదు. ధర్మం ధర్మం కోసమే ఆధర్మమే మానవజీవితం తల్లి పిల్లవాణ్ణి ఎందుకు ప్రేమిస్తున్నది; రేపు పెరిగి పెద్దవాడై పోషిస్తాడని చేస్తున్నదా? లేదు ప్రేమించడమే ఆమె పరమార్థమనాలి అలా ప్రేమించటంలోనే

ఆత్మసిద్ధి ఆనందం ఉన్నాయని భావించి, అనుభవిస్తూ చేస్తూ ఉంది ధర్మానికి ఫలసిద్ధి పరమార్థం కాదు. ఈ ధర్మానికి మానవుని అంతః కరణమే పరమప్రమాణం ఈ అంతఃకరణం ఎప్పుడు వివేకచోదితం ఈనాటి దురవస్థ పోవాలంటే ప్రతి ఒక్కడు భీతిని, ధనకాంక్షను, అధికారాపేక్షను, పక్షపాతబుద్ధిని పరిత్యజించి ధర్మం అనుష్ఠించాలి ఇతరులు ఏమనుకొంటున్నారు? సామభూతి చూపుతున్నారా లేదా? పేరు పేపర్లో పడుతున్నదా లేదా అను జంకరాదు. ఈ అనుష్ఠానంలోనే ఆనందం ఉన్నదనుకొని చేసినప్పుడే వ్యక్తికి తద్వారా సమాజానికి అభ్యుదయం సిద్ధిస్తుంది అంతకు తప్పిన మరొక మార్గం లేదు ఇలా చేయకపోతే వర్తమానం నరకకూపం భవిష్యత్తు సందేహాస్పదం.''

ఇలా చెప్పిన తాను తిరిగి విద్యార్థుల ముఖం ఎలా చూస్తాడు? సిగ్గు లజ్జ, అభిమానం వదలి వాళ్ళదగ్గరకు వెళ్ళినా తన్ను గౌరవిస్తారా? వాళ్ళు గౌరవించినా గౌరవించక పోయినా తనమనస్సుకు శాంతి ఉంటుందా?

రామారావు లేచి ఆ చిన్న గదిలోనే పచారు ప్రారంభించాడు. సిగరెట్టు పై సిగరెట్టు వెలిగించాడు. గది అంతా పొగతో నిండిపోయింది మనస్సుమాత్రం ఏ ఒడ్డు పట్టక వచ్చింది తండ్రి వ్రాసిన ఉత్తరం మరొకసారి చదివాడు! '' ఈ సంగతి నీకేమి తెలియదు కాబట్టి మెదలకుండా ఊరకోవటం ఉత్తమం'' ఈ వాక్యాన్ని బట్టి చూస్తే తనతండ్రి చంద్రశేఖరం మీద కావలెనని కేసు పెడుతున్నట్లు స్పష్టమౌతున్నది. అలాంటప్పుడు తాను అసలు సంగతి జ్ఞప్తికి తెచ్చి మాత్రం ప్రయోజనమేమిటి? కాకపోతే తాను చంద్రశేఖరం పక్షాన సాక్ష్యం చెప్పాలి. చెబితే తన తండ్రికి కృష్ణజన్మస్థానం తప్పదు అంతా అల్లకల్లోలమైపోతుంది తిరిగితాను ఇంటికి వెళ్ళటానికి వీలులేదు తల్లి తన ముఖం చూడదు. సీతకు ఇంకా పెళ్లికావలసి ఉంది. ఈ రభస అంతా తెలిసిన తరువాత ఆమెను ఎవడు పెళ్ళిచేసుకుంటాడు? నిజానికి నిలబడితే ఇవన్నీ జరగవలసిందేనా? సత్యం, ధర్మం ఇంత ఘోరాలా? తాను ఎంత తేలికగా విమర్శించాడు ! మానవాభ్యుదయమే కదా ధర్మానికి పరమార్థం తాను మూగనోము పడితేనో! ఈ అనర్థాలన్నీ చంద్రశేఖరాన్ని అతని కుటుంబాన్ని ఆవరిస్తాయి

రామరావుకు ఎటూ పాలుపోలేదు ఇలాంటి దుర్భరదుస్థితి కనులారా చూచేకంటే మరణించటం మేలనుకొన్నాడు. మరణించినా జరిగే అన్యాయం జరగకమానదు అలాంటప్పుడు తన మరణం వల్ల ప్రయోజనమేమిటిఅని ఆలోచించాడు ఎలాగైనా సరే తండ్రికి చెప్పి నిజం ఒప్పించి కేసు ఎత్తివేయించుకొనేటట్లు చేయాలి అందుకు ఒప్పుకొనకపోతే ఫలం అనుభవిస్తాడు లంతకు తప్ప మరొక మార్గం లేదు వెంటనే బయలుదేరి పోవటం అవసరం. తాను బయలుదేరి రాకుండా ఉండటానికే' ఇప్పట్లో ఇక్కడికి నీవు రావద్దని మీ అమ్మకూడా చెప్పమంటున్న దని వ్రాశాడు మానవప్రయత్నం మాని చేసేదేమున్నది?

అతను క్యాంప్ కేట్ మడిచి సంచిలో పెట్టాడు. చిందరవందరగా పడి ఉన్న పుస్తకాలు పెట్టెలో పెట్టాడు గుడ్డపెట్టె తీసి సర్దసాగాడు. ఇంతలో గది ఎవరు తట్టినట్లయితలొత్తి'' ఎవరది?'' అని అడిగాడు సమాధానం రాలేదు గొళ్ళెంచప్పుడు మాత్రం వినిపించింది?

''ఎవరది? తలుపు తీసే ఉంది ''

'' అన్నాయ్!''

తలుపు మెల్లగా తెరుచుకొన్నది

''నువ్వా? ఎప్పుడు వచ్చావు?''

రామారావు పెట్టెవమాసి దానిమీద కూర్చోమని తాను కిటికీలో చతికిలబడ్డాడు. సీతగదిలోకివచ్చి నలుమూలలు పరకాయించి చూచి ''మూటముల్లె సర్దుతున్నట్లున్నది. గది మారుస్తున్నావా ఏమిటి? కొంపదీసి రేపు వస్తే కనిపించేవాడివే కాదన్నమాట!'' అన్నది

''నిలబడ్డావు దేనికి? కూర్చో ఇంటిదగ్గరనుంచి ఉత్తరం వచ్చిందా? అమ్మా, వదిన, జగ్గడు బాగున్నారటనా?''

''అంతా బాగానే ఉన్నారు. సరే కాని గది ఇంత తొందరలో మార్చవలసిన అవసరం ఏమి వచ్చింది?'' సీత పెట్టెమీదకూర్చుంటూ అడిగింది.

''గదిమారుస్తున్నానని ఎవరు చెప్పారు?''

''ఎక్కడికన్నా వెళ్ళుతున్నావా?''

రామారావు సిగరెట్టు ముట్టిస్తూ ఔనని తల ఊపాడు. 61

''ఎక్కడికి?''

''ఎక్కడకి వెళ్ళుతాను? ఇంటికి ''

''ఇంటికానిజమే? వట్టిది అబద్ధమాడుతున్నావు ఇటు తిరిగి చెప్పు. అన్నాయికి ఈ మధ్య అబద్ధాలు కూడా పట్టుపడుతున్నట్లున్నవే?''

''అబద్ధాలు యెవరికి పట్టుబడ్డాయో తెలుస్తూనే ఉన్నది''

''అన్నాయ్, నిజం చెప్పు! ఇంటికేనా? సంవత్సరం పైగా ఇంటిముఖం చూడని నువ్వు ఇవ్వాళ ఇంటికి వెళ్ళుతున్నావంటే ఎలా నమ్మేది?''

''నాన్నగారు ఉత్తరం వ్రాశారు ''

''ఏమని?''

రామారావు చెల్లెలి వంకా నిదానంగా చూస్తూ అన్నాడు.

''ఏమనేముంది? పెండ్లి నిశ్చయమైంది వెంటనే రావలసిందీ అని ''

''వట్టిది-వట్టిది నాకు వ్రాయందే.''

''పెండ్లి నిశ్చయించుకొన్నది నీకా, నాకా?''

''అయితే మాత్రం పిల్లను నేను చూడకుండా పెండ్లి జరుగుతుందా? మాటమాత్రం నాన్నగాని, అమ్మగాని నాకు వ్రాయకుండా ఉంటారా?''

‘‘పెండ్లి చేసుకొనబోతున్నది నేను. నీ కేమిటి సంబంధం? నాకిష్టమైనది, నేను చేసుకోబోతున్నాను. మధ్య నీ పెత్తనమేమిటి?

‘‘చూస్తాగా యెలా చేసుకొంటావో!’’

‘‘ఎలా చేసుకునేదేముంది? పురోహితుడు మంత్రాలు చదువుతాడు మూడుముళ్ళూ పడతాయి అంపకాలు అవుతాయి ఇంటికివస్తాం వాకిట్లో సీత హారతి పడుతుంది.’’

‘‘సీత అంటే చేయమన్నపనల్లా చేసేదాసిది కాదు.’’

‘‘నేనూ అదే అనుకొంటున్నాను’’

‘‘ఏమని?’’ సీత గద్దించింది.

‘‘దాసీది కాదు మంచి చెడ్డలు తెలుసు ఆత్మగౌరవం ఉన్నది దాన్ని నిలుపుకొని తీరుతుంది అవి.’’

‘‘ఇదంతా చూడగా చూడగా వేళాకోళంగా కనిపిస్తున్నది. నేనేవంటానో తెలుసుకుందామని అంటున్నావు. అన్నాయ్! నిజం చెప్పు! నిజమంటే మా వార్డెన్ కు చెప్పి వెంటనే నేను కూడా వస్తా!’’ సీత ఆర్ద్రనేత్రాలతో అన్నవంక చూచింది.

‘‘వట్టి పిచ్చిపిల్ల!’’

రామారావు నిట్టూర్చాడు. తండ్రిచేస్తూన్న అన్యాయం చెల్లెలికి చెప్పడమా లేదా అన్నసందేహం కలిగింది. చెప్పకపోతే నొచ్చుకుంటుంది చెప్పితే బాధపడుతుంది అనవసరముగా మరొకజీవిని ఎందుకు కష్టపెట్టాలి? ఏదో మాట చెప్పి పంపించవచ్చు కాని అది అతనికి ఇష్టంలేదు పైగా తన్ను సానుభూతితో అర్థంచేసుకునే వ్యక్తి ఒకరైనా ఉండాలని అతనికిక అనిపించింది అలాటి వ్యక్తి లేకపోతే వచ్చేనష్టమేమిటో అతనికి తెలియదు అందువల్ల ఉన్నది చెప్పి వేయటమే మంచిదేమో నని ఆలోచిస్తూ ఉన్నాడు. ఆసంగతి సీత పసిగట్టింది. లేచివెళ్ళి తలుపునిమురుతూ అడిగింది ‘‘ఎందుకు నా దగ్గర దాస్తావు? పరాయిదాన్నా? నమ్మరానిదాన్నా? అసలు సంగతేమిటో చెప్పవూ?’’

రామారావు మెల్లగా చెప్పాడు. ‘‘చంద్రశేఖరం ఫోర్జరీ చేయలేదు. నాన్న నిజంగా అతనికి హామీ ఉన్నాడు. ఆ సంగతి నాన్నే నోటిమీదుగా నాకు చెప్పాడు ఇప్పుడు నాన్న ఎందుకు కేసుపెడుతున్నాడో తెలియటంలేదు పొరబడి ఈ పనికి దిగటానికి వీలులేదు. నేను జ్ఞాపకం చేస్తూ ఉత్తరం రాశాను. ‘ఈసంగతి నీకేమి తెలియదు కాబట్టి మెదలకుండా ఊరుకోవటం ఉత్తమమం ఇప్పట్లో నీవు ఇక్కడకు రావద్దని మీ అమ్మకూడా చెప్పమంటున్నది’ అని సమాధానం వ్రాశాడు ఎలాగైనా సరే నాన్నచేత కేసు ఎత్తివేయించటం అవసరం కాలం గడచిపోతే అనుకుని లాభంలేదు’’

ఆ మాటలు వినగానే సీత పిడుగడిచినట్లైకూలబడ్డది కళ్ళుచూస్తూనే ఉన్నవి కాని ఏమీ కనిపించటంలేదు. అయిదునిమిషాలు అలాగే నిశ్శబ్దంగా గతించాయి రామారావు కూడా మాట్లాడలేదు.

‘‘అన్నాయ్!’’ గద్గద కంఠం పిలిచింది ఎడమచేతి చిటికెన వ్రేలు కడకంట జారిన అశ్రుకణాన్ని తొలగమీటింది.

"సీతా! నువ్వు అనపోయేమాట తెలుసు హామీవున్నట్లు నాన్న నాతో చెప్పించడం, నేను పొరపడుతున్నాను అని నీ సందేహం అంతేనా?"

సీత అవునని ఊపింది

"మొట్టమొదట నేనూ భ్రాంతిపడ్డానేమో నని ఆలోచించాను ఇందులో పొరబడలేదు. నాన్నమీద నాకు కోపం దేనికి? నువ్వే చెప్పు కోపం ఉంటే తనకు తెలియకుండానే నామనసు ఇలాంటిదాన్ని సృష్టించటానికి అవకాశం ఉన్నది కోపంలేదు. ఉంటే చంద్రశేఖరంపక్షాన సాక్ష్యం చెప్పి ఆయనను జైలుకు పంపించాలి ఆయననే జైలుకు పంపించాలని కలలోకూడా అనుకోవటంలేదు ఎలాగైనా అసలు ఈ కేసు ఎత్తి వేయించాలని ఆతురపడుతున్నాను. పైగా ఈ హామీ సంగతి అమ్మకు చెప్పవద్దనికూడా ఆనాడు నాతో స్పష్టంగా చెప్పాడు. ఆ మాట ఈ నాటికి చెవులలో గింగురు మంటూ ఉంది ఇది కూడా నా మనస్సు కల్పించిందేనంటావా? లేదు, సీతా! లేదు తండ్రిమీద నీకున్న భక్తి, నీ భావిజీవితం ఏమైపోతుందో నన్న భయం ఈ శంకను కలిగిస్తున్నాయి అంతకుతప్ప మరేమీ లేదు."

"అంతేనా!"

"అంతే ఇప్పుడు ఎలాగైనా కేసు ఎత్తివేయించటం ప్రధానం. అందుకోసమే ఈ ప్రయాణం. ఆ తరువాత ఎలాజరగివలసి ఉంటే అలా జరుగుతుంది శక్తికి మించివచ్చినప్పుడు ఎవ రేమి చేస్తారు? సీతా నువ్వేమి దిగులు పెట్టుకోకు అనవసరంగా మనస్సు చెరచుకొని చదువు పాడుచేసుకోకు. దిగులు పడితే వచ్చే ప్రయోజనస మేమన్నా ఉంటే దిగులు పడవచ్చు. అలాంటి ప్రయోజన మేమీ లేదు నేనే పోయి స్థితిగతులు తేలగానే ఉత్తరం వ్రాస్తాను బెంగపెట్టుకోకు."

సీత మెల్లగా లేచింది రామారావు బలవంతపెట్టి ముఖం, కాళ్ళు, చేతులు కడిగించి చెల్లెల్ని టాక్సీలో హాస్టలువద్ద దించి, తాను ఆనాడే మెయిలులో ఇంటికి బయలుదేరాడు.

..... పదమూడు . ...

''ఊరపొద్దన్నా కుంకలేదు. అప్పుడే నిద్ర ఎలా వస్తుందో మనిషికి!''

''ఏమిటి చెవికింద నసుగుడు! మెదలకుండా పడుకోక ''

''నానిద్ర కాస్తా కాజేసి గుర్రుమంటున్నారా? న్యాయమంటే అలా ఉండాలి?''

''నీకు కాదా చెప్పేది?''

''అబ్బబ్బ దోమలు. నన్నేమి చేయమంటారు?''

''గట్టిగా ముసుగుపెట్టుకొంటే సరి ''

''పోయించిన చెమట చాలదనా?''

''ఎవరు పోయించారట?''



''ఇటు చూచి మాట్లాడాలి. అటు తిరిగి అంటే ప్రయోజనం!''

''ఎలాగైనా నిద్ర చెడగొట్టటానికి యెత్తు ఎవరికి తెలియదంటావూ?. మనిషి అన్న తరువాత జ్ఞానం ఉండాలి.''

''అదేమిటండోయ్! ఛీ, పాడు యెలుకలు బ్రతికి ఉండగానే కొరుక్కుతినేట్టున్నాయి ''

''అదే రెండు కాళ్ళ ఎలుకలు!''

''నామాట వట్టిదైతే ఎదురుగానే ఉందిగా చూరు చూడండి ఒకటి, రెండు, పదిలసలు ఇల్లంతా ఎలుకలమయమేనట్లుంది, నిజంగా కొరుక్కుతినవుగందా?''

''అరే! ఇన్ని ఎక్కడినుంచి వచ్చాయి? విచిత్రంగా ఉందే ''

''మరేమనుకున్నారు! నదురు బెదురు ఉందేమో చూడండి మీదపడవుగదా కొంపదీసి!''

''సరే కాని పొగ చూరుకంపు కొడుతున్నదే!''

''మీకు అంతా వాసనే''

''కాదు, ఏదో వాసన వస్తూ ఉంది ''

''అవి దవడలు కటకటలాడిస్తూ ఉంటే. ఒళ్లు గత్తరపాడుస్తూ ఉంది కాస్త తోలండి!''

''రాణిగారు ఆజ్ఞ ఇచ్చిన తరువాత తప్పేది ఏముంది?''

''ఇస్ అబ్బా! ఇదేమిటి మళ్ళా మేళాం!''

''తోలమన్నావుగా? ఎక్కడో చూరుమీద ఉన్నవి ఎలా పోతాయి?''

''మీరు తోలవద్దు, పెట్టవద్దులే ఊరుకోండి పిల్లవాడు లేస్తాడు.''

''అంతా నీ యిష్టమేనా?''

''అబ్బబ్బ, అసలు బుద్ధితక్కువతనమంతా నాదే. నిద్రపోతున్నవాళ్ళను ఎందుకు లేపాలి?''

''అవి ఇంకా పోవటంలా?''

''అయ్యో అయ్యో! మంటలు, మంటలు!''

''అంతా వట్టిదే.''

''అయ్యో, అమ్మో! ఇల్లు . ఇల్లు...అంటుకొన్నది.. మీకే చెప్పేది.''

''సత్యనారాయణగారూ, సత్యనారాయణగారూ! కొంప ముట్టుకొన్నది. ఏమండోయ్! ఇంకేముంది? తలుపుతియ్యండి'' తన వాకిలి యెవరో దబీదబీ గుద్దుతున్నారు.

పద్మ సత్తువ కొందికీ సత్యనారాయణను ఒక త్రోపు తోసింది. అతడు అంతదూరాన పడ్డాడు. ''అయ్యో, నాబిడ్డ! నాబిడ్డ! అంటూ దూరంగా చిన్న మంచంమీద నిద్రపోతున్నవాణ్ణి చంకను వేసుకొని బయటకు దూకింది. వీధి తలుపు మోగుతునే ఉంది. మంటలు వడికప్పు అందుకొంటున్నాయి ఇల్లంతా పొగ కమ్మసాగింది. అప్పటికి సత్యనారాయణ బాహ్యజగత్తులో పడ్డాడు గబగబా పడవమటింటిలోకి పరిగెత్తాడు. పద్మకు భర్తకాని, పెద్ద కుర్రవాడు కాని కనిపించలేదు పెద్ద పెట్టున ఏడుస్తూ తలవాకిలి తీసి వాళ్ళ నిద్దరినీ కాపాడండని మొత్తుకోసాగింది. మూగిన పది మందీ ఒక్కసారిగా లోపలికి నెట్టుకువచ్చారు ఈ లోపున సత్యనారాయణ పెద్దకొడుకుతో ఇంట్లోనుంచి బయట పడ్డాడు. 65

ఈ గల్లంతుకు చుట్టుపట్ల ఇళ్ళవాళ్ళంతా మేలుకొన్నారు. పూరిళ్ళవాళ్ళు ఇంట్లో సామాన్లు తీసి దొడ్లో పడవేయసాగారు వచ్చిన వాళ్ళంతా శక్తివంచన లేకుండా ఆర్పటానికి ప్రయత్నించారు. కాని దగ్గర్లో నీళ్ళులేకపోవటం, పొగ చుట్టివేయటం వల్ల వాళ్ళేమీ చేయలేకపోయారు. కాకపోతే మంటలు ప్రక్కపూరిళ్ళకు ముట్టుకోకుండా ఆపగలిగారు.

పిల్లలు, భార్య, సత్యనారాయణ నివ్వెరపోయిచూస్తున్నారు.

''ఎలా ముట్టుకొన్నది?'' అని ఒక పెద్దమనిషి అడిగాడు.

''ఏమి చెప్పుకుంటే తీరుతుంది? మా కర్మ అలా నెట్టుకు వచ్చింది.'' అన్నాడు పంతులు.

పద్మ వెక్కివెక్కి ఏడవసాగింది. ''మామగారు పోయారని ఏడుస్తూ ఉన్న కంటితడన్నా ఆరలేదు. ఈ వడిసుట్టుకూడా వచ్చిపడ్డది. ఓరి భగవంతుడా! ఇంటి దారిద్ర్యం కూడా తెచ్చిపెట్టావా? మే మేమిపాపం చేశాము?''

''ఊరుకో అమ్మా, ఊరుకో, అయిపోయినదానికి ఏడ్చి లాభంలేదు. ఇంకా నయం, మీ నాలుగు ప్రాణాలయినా దక్కినాయి. లేకపోతే ఏముంది?'' అన్నది పొరుగు బాహ్మణి.

''ఎవరో దుర్మార్గులు కావాలని పెట్టినవనేకాని చేతప్పు వల్ల ముట్టుకోలేదు'' ఒక ముసలాయన అన్నాడు.

---

జి.వి. కృష్ణరావు

''ఎవరెందుకు పెడతారు? వంటలకి ఊళ్ళో పని ఏమున్నది వినక!'' మరొకరన్నారు

''నాకు ఎవరో చేసిన పనే. ఊళ్ళో బొత్తిగా హద్దుపద్దు లేకుండా పోతున్నది ఈ బుద్ధులతో తొందరగానే నాగుపడుతుందిలే చూడమ్మా అప్పుడే అయిందా! పిదపకాలం వస్తేనరి కుక్కమూతిపిందెలు పుడతాయి'' అన్నాడు ముసలాయన

ఇల్లు చల్లారిన తరువాత ఒక్కరొక్కరే వెళ్ళిపోయారు కావాలని ముట్టించారని కొందరూ, కాదు ఏదో పొరపాటు వల్ల జరిగిందని కొందరూ వాదించారు ఏది ఎలా జరిగినా, పంతులు ఇల్లుమాత్రం తగులబడిపోయింది. ప్రాణాలు, కట్టుకొన్న గుడ్డలు తప్ప మరేమీ మిగలలేదు.

ఆ రాత్రి కా రాత్రే యీ వార్త పుల్లయ్య విని ఆదరాబాదరా పరుగెత్తుకొని వచ్చి ఓదార్చాడు దిగులుపడవద్దనీ, తాను ఉండగా భయపడవలసిన పని లేదనీ హెచ్చరించాడు. ఇంతలోనే డాక్టరు కూడా వచ్చాడు. అంతా పక్కవాళ్ళు చెబితే విని నిట్టూర్చాడు

''సత్యనారాయణ! దిగులుపడి చేసేదేమున్నది? ప్రాణాలు దక్కాయి అదే పదివేలు. గొంతులో ఊపిరే ఉండాలిగాని ఇలాంటి ఇళ్ళు పది సంపాయించుకోవచ్చును. మా యింటికి వెళ్దాం పద! లేవమ్మా! లే! కష్టాలు ఎవరికైనా వచ్చేవే మీ యిష్టం వచ్చినంత కాలం మా యింట్లో ఉందురు కాని. సందేహం దేనికి?''



''ఈ నాలుగురోజులు పోతే ఇల్లు రాక ఏమి చేస్తుంది? లే పంతులూ లే!'' అని పుల్లయ్య హెచ్చరించాడు.

డాక్టరు మాట, పుల్లయ్య సలహా త్రోసివేయలేక పంతులు భార్యాపిల్లలతో అతని యింటికి వెళ్ళాడు.

# పద్నాలుగు

పంతులిల్లు తగలబడిన మూడోరోజున కుశాలయ్య పుల్లయ్య ఇంటికి వచ్చాడు  అప్పుడే పుల్లయ్య మట్టి కాళ్ళుకొంటూ పడకకుర్చీలో పండుకొన్నాడు  పంతులు ఎప్పటి చోట కూర్చుని పద్దులు ఏవో వ్రాస్తూ ఉన్నాడు

''ఏం కుశాలయ్యా, బొత్తిగా కనిపించటం మానేశావే!'' అని అతన్ని చూడగానే పుల్లయ్య పలకరించాడు

''పనులుకందా  కాస్త సందుదొరుకుతుందేమో వద్దామంటే పడకొచ్చింది '' కుశాలయ్య పరిచి ఉన్న చాప వదలి వట్టిగచ్చు మీద కూర్చున్నాడు

''చాపమీద కూర్చో! క్రింద దేనికి? భోజనం అయిందా?''

''ఆఁ, అయింది  ఏ పాటు తప్పినా  సాపాటు తప్పదు గందా! ఐతే పంతులుగారూ, మొన్న ఇల్లు కాలిపోయిందేపొరపాటు వల్ల జరిగిందా, లేక యెవ్వరైనా పెట్టేరందంటారా?''



''ఏమి చెప్పేది కుశాలయ్యా! ఇంతకూ కర్మ అలా నెట్టుకు వచ్చింది ''

''పులిమీద పుట్ర అన్నట్టుగా తండ్రిగారు కాలంచేసి నెల రోజులు కాకముందే యిదొకటి వచ్చిపడింది  ఇంతకూ రోజులు బాగున్నట్లు లేదు పంతులుగారు! తెలిసికూడా యెలా ఊరుకున్నారు? కాస్త శాంతిచేయించకోక పోయారా?''

''రోజులు బాగుండలేదని నాకు మాత్రం తెలుసా?''

''అదేమిటండీ, షావుకారు మల్లయ్యతో అన్నారంటగా! కచ్చేరి అరుగువద్ద ఆయన అన్నాడు ''

''అలాగా! ఆఁ ఆఁ, గుర్తుకు వచ్చింది. ఏదో మాటమీద అన్నాను. ఆయనకు ప్రతిదీ జ్ఞాపకమే నన్నమాట!''

''ఆఁ జ్ఞాపకం ఉండకేఁ! అవసరంవచ్చిన వన్నీ జ్ఞాపకం ఉంటాయి. అవసరంలేని వన్నీ అడుగున బడిపోతాయి  షావుకార్ల తరహాయే అంత ''

'' ఏదో విసరుతున్నావే. ఏమిటి సంగతి?''

''పంతులుగారూ! ఆనాడు గడ్డీ, మినుములు అమ్మితే వచ్చిన పైకం ఎంతండి? మీ చేతనేకదా లెక్క పెట్టించింది!''

''అవును  మూడు నూరు కాగితాలు, పద్దెనిమిది అయిదులు,పది ఒకట్లు  మొత్తం నాలుగువందలూ మల్లయ్య గారికి ఇవ్వాలని తీసుకువెళ్ళావు ''

''వెళ్లి ఆయనచేతుల్లో పోశాను 'తాళంచేతులు దగ్గర్లేవు సాయంకాలం వచ్చి నోటు తీసుకువెళ్ళు' మంటే పెద్దమనిషి కదా అని ఆ పాట తిరిగి వచ్చాను ఇవాళ పొద్దున్నే వడ్డీ తాలూకు పన్నెండు రూపాయలు పట్టుకెళ్ళి నోటు అడిగితే 'అసలు ఇవ్వందే నోటు ఎలావస్తుంది' అని అడిగాడు. ఇంకా మాట్లాడే దేముంది? నోరు మూసుకొని చక్కావచ్చా అంతలో ఉంది న్యాయం పంతులుగారు!''

''అంతపని చేశాడా?''

''లేదు. నేనే అబద్ధ మాడుతున్నాను గొడ్లకుమేత ఉంటుందా లేదా అనకుండా గడ్డి అమ్మినందుకు తగిన ప్రాయశ్చిత్తం జరిగింది జరగదూ మరి? వాటి ఉసురు ఊరికినే పోతుందా? ఎంతకు ఒడిగట్టాడు? చూస్తానుగా. నా ఉసురు తగలకుండా ఉంటుందీ? అతడు ఈ నాలుగువందలతో బాగుపడతాడూ? పైన దేవుడు లేడూ? అన్నీ చూస్తూనే ఉంటాడు.''

కుశాలయ్య మాట్లాడలేకపోయాడు. పంతులు పుల్లయ్య కొయ్యబొమ్మలై పోయారు

''పుల్లయ్యగారూ, అయిన దేదో అయింది. ఒకసారి మోసపోతాను గాని జీవితమంతా మోసపోను గందా! మల్లయ్యగారికి బాకీ ఉన్న దనిపించుకోవటం నా కేమీ యిష్టం లేదు అసలు బాకీపడటంకన్నా బుద్ధితక్కువ పని మరొకటి లేదు మీకు డబ్బు అవసరమే. పంతులుగారి ఇల్లు
68 వేయించాలంటే ఎటులేదన్నా వెయ్యిరూపాయలు కావాలి. అయినా నాకుకూడా ఈ కాస్తసాయం చేయండి నాలుగు వందలు ఇస్తే అతనిముఖాన పారవేసి వస్తాను ఈ నాలుగు వందలుకూడా నాకు అప్పుగా ఇవ్వవద్దు కోడెదూడ తల్లి ఉంది ఈనమోపిన గేద ఒకటి ఉంది నాకు మేపటానికి గడ్డి కూడా చాలదు. ఇప్పుడే తీసుకొచ్చి మీదొడ్లో కట్టి వేస్తాను.''

''అదేమిటి కుశాలయ్య అంతా మల్లయ్య లాంటి వాళ్లే ఉంటారా? నా కా భయం ఏమీ లేదు. నాలుగువందలూ తీసుకువెళ్ళు మెసలాయింపు ఉన్నప్పుడే ఇద్దువుగాని. అవునూ, గేదెనూ అట్టేపెట్టుకో.వాటిని దొడ్లో కట్టేస్తానంటే మాత్రం ఊరుకోను అరే జగ్గాయ్! అమ్మను అడిగి నాలుగువందలు పట్టుకురారా?'' పుల్లయ్య కేక వేశాడు. కుశాలయ్య లేచాడు.

''లేస్తున్నావే. డబ్బు తీసుకుపో ''

''అప్పువద్దు పుల్లయ్యగారు! ఆ మాత్రం నమ్మకం ఉంటే అదే చాలు.''

కుశాలయ్య బయలుదేరాడు.

''నీ మతమే నీదా? కాస్త ఆలోచించుకో! డబ్బు తీసుకు వెళ్ళి ఆవు గేదె అమ్మేదు పోగానే ఇచ్చివేయి. ఎవరు కాదన్నారు? నాకు వడ్డీకూడా ఇవ్వద్దులే.''

''గొడ్లను కట్టివేసుకుంటే నాకు డబ్బు ఇవ్వండి లేకపోతే నాకు వద్దు ''

''సరే నీ యిష్టం వచ్చినట్టే కానీ'' అంటూ జగ్గారావు పట్టుకు వచ్చిన నాలుగు కాగితాలు అతని కిచ్చాడు.

కుశాలయ్య పోయిందరువాత పుల్లయ్య పంతులుతో అన్నాడు.

''మల్లయ్య ఇంత దిగుల్బాజీపనికి ఎందుకు దిగినట్లు?''

''అదే విచిత్రంగా ఉంది ఇలాంటి పనులు నా యెరిగినంతలో ఎప్పుడూ చేయలేదు.''

''అయితే యిప్పుడు మల్లయ్య చంద్రశేఖరం జోస్తీగా ఉంటున్నారటగా?''

''నేను చూడలేదు, వినలేదు.''

''తెలుసుకోవటం అవసరం పంతులు లేకపోతే మనం దేశాలమీద పోవలసిందే?''

''అలాగే ప్రయత్నిస్తాను.''

తరువాత రెండు రోజులకు మల్లయ్య ముప్పై ఎకరాల గడ్డివామి తగలబడిపోయింది. పుల్లయ్య పంతుల్ని అడిగాడు

''కుశాలయ్య పనే అయి ఉంటుందని మల్లయ్యగారు అనుకొంటున్నారట. అనుకోవటమే కాదు ఒకరిద్దరిదగ్గర అన్నాడట. ఆ మాట విని కుశాలయ్య ఇవాళ వచ్చి అరుగువద్ద ఉండగావే ఆ రోజున తాను ఊళ్ళోనే లేననీ, బంధువులను చూడటానికి పోయాననీ రుజు విప్పించాడు. బిడ్డా గొడ్డూ ఉన్నవాడెవ్వడూ ఇలాంటి పని చేయడని చెడా బడా తిట్టాడట.''

''అబ్బెబ్బే! కుశాలయ్య ఎప్పుడూ అలాంటివాడు కాదు.పాపపుణ్యాలకు జంకే మనిషి. అతడు ఈ దౌర్భాగ్యపుపని చేస్తాండటే నమ్మటానికి వీల్లేదు.''



''అదే అయోమయంగా ఉంది ఏ దరిద్రుడు చేశాడీ పని?''

''లేదు పంతులూ! ఊరు పూర్తిగా కట్టుదప్పిపోయింది. ఎవర్నీ ఏమీ అనటానికి వీలులేదు. అంటే ఏ నిమిషాన ఎవరి కొంపకు నిప్పు పెడతారో! ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకుని బ్రతకాలసిన రోజులు వచ్చాయి కానీ, ఎంతవరకు జరగాలో, అంతవరకూ జరుగుతుంది.''

''ధర్మం లేనప్పుడు అంతగాక మరేముం'' దని, పంతులు నిట్టూర్చాడు.

జి వి. కృష్ణరావు

## .. పదిహేను .

ఒక రాత్రి వేళ డాక్టరు వాసుదేవశాస్త్రి లఘుశంక తీర్చుకొందామని తలుపుతీసుకొని బయటికి వచ్చాడు. వీధి అరుగు మీద ముసుగుపెట్టుకొని కూర్చున్న వ్యక్తి కనిపించాడు డాక్టరు గుండె దడదడ కొట్టుకొన్నది కాస్త సంబాళించుకొని ' ఎవ రది' అని అడిగాడు

"నేనండి దొరగారు, పోలాయిని." పోలయ్య లేచి నిలబడ్డాడు. చేతిలోని కర్ర జారిపడి మోగింది.

"ఇంకా మీకు ఏప్పటికి బుద్ధివస్తుంది!"

"ఎందుకు కోప్పడుతారు దొరగారు? నే నేం తప్పు చేశాను?"

"అదిగో ఆ మాదటే అనవద్దని ఎన్నిపార్లు చెప్పాను? ఎవరు దొర? నామోచేతి నీళ్లు తాగి బతుకుతున్నావా? నేను పోషిస్తున్నానా? నీ రెక్కలకష్టంతో బ్రతుకుతున్నావు. ఎవరి గొప్పతనం
70 వాళ్ళది. మళ్ళీ దొర అన్నావంటే అన్ని మందు నీళ్లు కూడా పొయ్యను తెలిసిందా?"

"అలవాటు చొప్పున వత్తది బాబు. ఈ రోజున పోవాలంటే పోద్దా?"

"పోలయ్యా!"

" ఏమి బాబు?"

"నిలుచున్నావు దేనికి? ఇటువచ్చి కూచో!"

" ఇక్కడ కూకుంటా లేండి."

"సరేగాని రెండు రోజులనుంచి ఇక్కడకు వచ్చి పండుకొంటున్నట్లున్నది?"

" ఇక్కడే పండుకొంటున్నానండీ!"

"పండుకోదలచినవాడివి చాప అడిగితే కాకపోయిందా?"

"నాపరాతి అరుగు చల్లగా ఉంటాది పైగా మిమ్మల్ని లేపాలి!"

"నిజం చెప్పు పోలయ్యా! పెళ్లాముతో పోట్లాడావా? లేక పాట్లో తగవు లేమైనా వచ్చాయా? ఎన్నడూ రానివాడివి ఇక్కడికివచ్చి ఎందుకు పండుకొన్నావు? ఊళ్ళోనే పండుకో దలచుకొంటే పెద్ద ఆసాముల అరుగులు చాలా ఉన్నాయే "

పోలయ్య మాట్లాడలేదు.

"మాట్లాడవేం? పాట్లోవాళ్లు ఎవళ్ళయినా కక్షకట్టారా?"

"పోలాయిమీదనా? పాట్లో నాయాళ్ళకు అంతదమ్ము లున్నాయా?" అతడు వెకిలిగా నవ్వాడు.

''మరి?''

'' ఊళ్ళో యెదవఎన్నికలు వచ్చాయ్ రోజూ యాడో ఒక చోట ఏదో ఒటి తగలబడుతోంది. అంచాత ఏ గడియన ఏమి జరుగుద్దో అని యీడకు వచ్చేసి పడుకొంటున్నాను బాబు?''

డాక్టరు పెద్దగా నవ్వాడు

''పోలయ్యా! నీవంటి వెర్రిమనిషి మళ్ళీపుట్టడు. నాయిల్లు తగలపెడితే ఏమి ఒరుగుతుంది?''

''అలా అనకండి బాబుగారూ! ఏమి వచ్చిపడద్దని ఇళ్లు, వాములు తగలెట్టుకొంటున్నారు? మొన్నగత్తే మొన్న ఆస్పెరం కాల్తా తగలపెట్టారా, వాళ్ళ ఒళ్ళో ఏమొచ్చిపడ్డది? కోపాలు, పార్టీలు అలా అనిపిస్తాయి బాబు!''

''మందులిచ్చి బ్రతికేవాడికి నా కేమిటోమ్ పార్టీలు? నామీద ఏమి సాధిస్తారు?''

''మీకు అలాంటి బుద్ధి ఉంటే ఈ పాడూళ్ళో యెందుకు పడుంటారు? మీ బుద్ధి అందరికీ ఉంటుందా? మీ లాంటివాళ్ళు యెక్కడున్నా ఒకరుంటారు. ఉన్నా మంచి తెలుసుకోలేదు. లోకమంతా తమకిమల్లే గడ్డితింటుందనుకొంటారు ఎందుకైనా మంచిది. ఆ....'' అతడు కిటుకివైపు చూచాడు



''సందేహం దేనికి? ఫరవాలేదు ''

''ఆఁ? ఏమీ లేదు ఆ పంతుల్ని తీసుకొచ్చి ఎందుకు ఇంట్లో పెట్టారు బాబు? తొందరగా అవతలకి పంపించెయ్యండి!''

''అదేమి పోలయ్యా! ఇల్లుపోయి అల్లాడుతూ ఉంటే నాలుగునాళ్ళు తలదాచుకోండని తీసుకువచ్చాను. ఇదికూడా తప్పేనా? ఇవాళ ఇది తప్పు అయితే రేపు ఊళ్ళో ఉండటం కూడా తప్పే అవుతుంది ఇలా చూస్తూ ఊరుకొంటే లాభం లేదు. అర్థమౌతున్నది పోలయ్యా! నీ మేలు ఎప్పుడూ మరచిపోను వేరే అనుకోక నువ్వు పోయి నీయింట్లో పడుకో. ఇక్కడ కాపలా వద్దు. ఎంత కాలం ఇలా బ్రతికేది?''

''మీకేం, మీరు మాబాగానే చెబుతారు పోతే మీ యిల్లే కాదు. మందులన్నీ పోతాయి. మాబీదాళ్లకు మరి దిక్కేమిటి? ఆనాడు అన్ని ముందునీళ్ళు పోశారు కాబట్టి మా ఇంటిది యిన్ని గంజినీళ్ళు కాసిపోత్తోంది. అది ఊడి ఉంటే గూనిగంపెడుపిల్లలు యామైపోయేవాళ్ళు? మీరే మన్నా అనండి. మెడబట్టుకు గెంటండి కాని రాత్రిళ్ల ఇక్కడనుంచి కదిలేది లేదు.''

''పోలయ్య, నీకే చెప్పేది వెళ్ళు ''

''మీరు నా గొంతుకోసినా, నేను వెళ్ళేది లేదు.''

''నీవు వెళ్ళందే నేను ఇంట్లోకి వెళ్ళను '' వాసుదేవశాస్త్రి అరుగుమీద చతికిలబడ్డాడు.

---

పోలయ్య అలాగే పావుగంటసేపు నిలబడ్డాడు  డాక్టరు కూర్చున్నపాటే కునుకుపాటు పడసాగాడు ''నేనే మొండి నంటే వా కన్నా జగమొండివే బాబూ'' అంటు పోలయ్య పంతుల్ని కేకవేసి ''డాక్టరుగారు బయటే పండుకొంటారట కాస్త పక్క బయటవేయం''డని చెప్పాడు వద్దు లెమ్మం టున్న కొందికీ పద్మ డాక్టరుకు పక్క బయటవేసి పోలయ్య హెచ్చరిక మీద లోపలిగడియవేసుకొని పండుకొన్నది  ఆ రాత్రి యిద్దరికీ ఆ వీధి అరుగుమీదనే గడిచింది  తెల్లవారు తుండగా పోలయ్య గుట్టుచప్పుడు కాకుండా వెళ్ళిపోయాడు.

ఆ నాటి దినపత్రిక తెరవగానే డాక్టరుకు తన ఊరి వార్త పెద్దశీర్షికతో కనిపించింది  ఆసక్తితో చదవ మొదలు పెట్టాడు.

హరిజనాశ్రమ కార్యదర్శిని అయిన శ్రీమతి అమ్మాయమ్మగారు ఇలా వ్రాస్తున్నారు ''గత పదిరోజులనుంచి ఈ ఊళ్లో కమ్యూనిష్టులు చెలరేగి ఇష్టంవచ్చినట్టు విధ్వంసక చర్యలు సాగిస్తున్నారు. ఇళ్ళకు, వాములకు నిప్పుపెట్టారు, పెడుతున్నారు  హరిజన ఉద్ధరణకోసం పాటుపడుతున్న ఆశ్రమానికి నిప్పుపెట్టారు  ఈ చర్య ఏమనవలెనో తెలియటం లేదు. నిన్న రాత్రి ఒక ఆసామియింటి పై దాడి చేసి ఉన్నడబ్బు అపహరించుకొని పారిపోయారు. ఇంతవరకు ఎటు లేదన్నా గ్రామం మొత్తంమీద లక్షరూపాయలవరకు నష్టపడింది  గ్రామస్థులు ఏ గడియకు ఏమి జరుగుతుందోనని హడలిపోతున్నారు  ప్రభుత్వం వారు  ఎందుకు ఉపేక్షాభావం వహిస్తున్నారో తెల్లియటంలేదు  వెంటనే మలబారు పోలీసు బలం పంపి బందోబస్తు యిప్పిస్తేగాని ప్రజానీకం బ్రతకలేదు  ప్రజాప్రభుత్వం తన బాధ్యతను తప్పక నిర్వహిస్తుందని ఆశిస్తున్నాను ''

ఈ వార్త చదువగానే శాస్త్రి విస్తుపోయాడు. ముందుకు వచ్చినవాళ్ళను త్వరగా పంపించివేసి తిన్నగా హరిజన ఆశ్రమానికి వెళ్ళాడు  అమ్మాయమ్మగారు ఆఫీసులో కూర్చుని ఏదో వ్రాసుకొంటున్నారు. డాక్టర్ను చూడగానే మందహాసంచేస్తూ ప్రక్కనున్న కుర్చీ చూపించి, ''దారితప్పి వచ్చినట్లున్నారే!'' అన్నది.

''లేదు  దారితప్పితిరిగేతీరిక కూడా లేదు. మీతో పనుండే వచ్చాను.''

''అలాగా  కబురుచేస్తే నేనే అటు వచ్చేదాన్నిగా.''

''మీకు మాత్రం తీరిక ఉందా ఏమిటి? ఎన్ని పనులో! అందులో ఆశ్రమం పాకలుకూడా పోయె ''

''అవునండి! దుర్మార్గులు రెండుపాకలు తగల బెట్టివేశారు  బొత్తిగా హద్దూ పద్దూ లేకుండా పోతున్నది ''

''అవునవును ''

''ఈ సంగతే పేపరకు కూడా వ్రాశాను  చూచారుగా?''

''చూడబట్టే మిమ్మల్ని ఒకసారి చూచి పోదా మని పించింది.''

''అలాగా! వ్రాయటం మంచిదైందికాదూ? అధికారులకు కూడా వేరే స్టేట్మెంటు పంపించాను ''

''మంచిపని చేశారు రోగం ఒక్కొన కనుక్కొన్నారు. మీ ఆలోచన చాలా గొప్పదిసుమా! గ్రామస్థులు ఇక మీ పేరు చెప్పుకొని బతకుతారు.''

అమ్మాయమ్మగారి బుద్ధి కూడా శరీరానికి ఏమాత్రం తీసిపోలేదు. నవ్వుతూ, ''నా దేమి ఉందిలెండి. ప్రజలకు ఉడతాభక్తిని సేవచేదామని వ్రాశాను'' అన్నది. తన మాటలు దున్నపోతుపై వర్షంగా పర్యవసించినందుకు డాక్టరు తన్ను తానే అసహ్యించుకొన్నాడు.

''సరేకాని ఇంతవరకు లక్షరూపాయల ఆస్తి నష్టపడ్డదా? వాగొడవలో పడి నేను చూడనేలేదుసుమా!''

''ఆఁ, ఎక్కడిదీ! అంతా పదివేలకు లోపున ఉంటుంది., కాస్త సంచలనం కలిగిద్దామని లక్షరూపాయల ఆస్తే నష్టపడ్డదని వ్రాశాను ''

''నిన్న ఏ ఆసామియింటి పైనా దాడి జరిగింది?''

అమ్మాయమ్మగారు తెల్లబోయింది అంతలోనే తెప్పరిల్లుకొని చిరచిరలాడుతూ, ''మీకు సమాధానం చెప్ప వలసిన అవసరం నా కేమాత్రం లేదు'' అన్నది.

''అది కాదు కేవలం తెలుసుకుందామని అడుగుతున్నాను. వేరే అనుకోకండి. మిమ్మ క్రాసుచేద్దామని రాలేదు చేద్దామన్నా మీరు చెప్పేవారు కార్రు. కమ్యూనిస్టులే చేస్తున్నారా? ఎవరు ఆ కమ్యూనిష్టులు? నాకు తెలిసినంతలో ఈ ఊళ్ళో ఇటీవలివరకూ అసలు రెండో పార్టీయే లేదే? బహుశః నావైద్యంలోపడి ఉన్నస్థితిగతులు గమనించకపోయి ఉండవచ్చును. ఎవరా కమ్యూనిష్టులు?'' 

''చంద్రశేఖరం మురా ఏమనుకొన్నారు?''

''చంద్రశేఖరం కమ్యూనిష్టా? ఎవరు చెప్పారు? ఏమిటి రుజావు? అతడే ఈ ఊళ్ళో దురంతాలకు కారణమా? అమ్మాయమ్మగారు! కాస్త ఆలోచించండి! అతడూ దేశం కోసం కారాగారవాసం అనుభవించివచ్చినవాడే! అతడు పేదసాదలను ఉద్ధరిద్దామని ఫ్యాక్టరీ పెట్టి నేటికి బుక్కాపకీరు అయ్యాడు. అతడు కమ్యూనిష్టా? ఒకవేళ అతని వల్ల పొరపాటేదైనా ఉంటే మందలించి చూడవలసిన బాధ్యత మనమీద ఉంది అప్పటికీ వినకపోతే అతని కర్మ అతను అనుభవించక తప్పదు. ఇంతవరకూ అలాంటి ప్రయత్నం మీరేమీ చేయలేదు. చేయకుండానే 'కమ్యూనిష్టు' అని ముద్రవేశారు. అది అలా ఉంచి మీలాంటి దేశభక్తురాండ్రు ఉన్న గ్రామంలో దుర్మార్గులున్నారంటే మీ కేమైనా గౌరవం ఉంటుందీ? మేము పట్టి చూట దద్దమ్మలం, మీరు వచ్చి చక్కదిద్ది పొండని అశక్తతను చాటటం కాదా! పైగా మలబారు పోలీసుబలం పంపించా లని కోరారే, ఆలోచించే యీ పని చేశారా? లేదు మీరు ఆలోచించలేదు పోలీసు జులుమంటే ఏమిటో అర్థం కాలేదు ప్రజల్లో ఎలాంటి అసహ్యత రగుల్కొంటుందో ఆలోచించలేదు. కేవలం ఉన్న

లధికారాన్ని నిలబెట్టుకోవటం కోసం అలా చేశారు ఇది కూడా మీరు చేయాలని చేయలేదు. అనుకోకుండా చేశారు ఈ పొరపాటు దిద్దుకొంటూ పత్రికకు ప్రకటన పంపించండి మీరు, నేను ఊళ్ళో పెద్దలు కలిసి పరిష్కరించటానికి ప్రయత్నిద్దాము మన సమస్యలను మనం పరిష్కరించుకోవాలి కాని, మధ్య వాళ్లెవరు? వారి సహాయం కోరటం మనకు గౌరవప్రదం కాదు శ్రేయస్కరం అంతకన్నా కాదు కాబట్టి సవరణ ప్రకటనను ఇవ్వాళే పంపించండి ’’

అమ్మాయమ్మగారు మాట్లాడలేదు

‘‘పొరపాట్లు అనేవి ఎవరికన్నా ఉంటాయి వాటిని గుర్తించి దిద్దుకోవటం పెద్దవాళ్ళ లక్షణం తరువాత మీ యిష్టం. చెప్పవలసిన బాధ్యత ఉన్నది కాబట్టి చెబుతున్నాను. వస్తానండి!’’ అంటూ ఆమెనుండి వచ్చే సమాధానం వినకుండానే డాక్టరు చెరచెర వెళ్ళిపోయాడు.

అమ్మాయమ్మగారు జేవురించిన ముఖంతో అమ్మవారిలాగా అలాగే కూర్చుని ఉంది.

# పదహారు

పొద్దు వాటారింది రచ్చబండవద్ద, లైబ్రరీవద్ద పేకాటలు చాలించి ఉత్తరీయాలు దులుపుకొని ఒళ్లు విరుచుకొని ఇంటి వద్ద పని పాటలు చూచుకోటానికి బయలుదేరుతున్నారు. చంద్రశేఖరం ఇంటికి బయలుదేరిన వాసుదేవశాస్త్రికి విద్యార్థుల గుంపు ఎదురైంది ఇంతలేసి వాళ్ళు, అంతలేసివాళ్ళు దాదాపు రెండు వందలమందిదాకా అట్టలు, జెండాలు పట్టుకొని నినాదాలు పెడుతూ వస్తున్నారు ఆ కేకలు దేనికో ముందుగా అర్థం కాలేదు ఆ రోజున సభ జరుగుతుందని కూడా తెలియదు అందువల్ల సంగతి సందర్భాలేమిటో తెలుసుకుందా మని వీధి ప్రక్కన నిలబడ్డాడు. మల్లయ్య కొడుకు గంగాధరం ముందు జెండా పట్టుకొని గొంతు చించుకొంటూ అరుస్తున్నాడు.

దేశ ద్రోహులు

అంతరించాలి.

గూండా చర్యలు

నశించాలి

విప్లవం

వర్థిల్లాలి.

ప్రజా ప్రభుత్వం

వర్థిల్లాలి.

మిగతావాళ్లు అంటున్నారు ఆ గుంపులో పుల్లయ్య మనుమడు జగ్గారావుకూడా కనిపించగానే డాక్టరు మనస్సు పరిపరివిధాల పోయింది ఏమిటి ఈ అన్యాయం కడుపార తిని ఆడుకోవలసిన కుర్రవాళ్ళే? ఏ దిగులు చింత లేకుండా చదువుకోవలసినవాళ్లే! బుద్ధులు పెరగకుండా పశువులుగా, యంత్రాలుగా ఎందుకు తయారుచేస్తున్నారు? వీళ్ళనని ప్రయోజన మేమిటి? ఇలా తయారైన జాతి సత్యం సాధిస్తుందా? స్వాతంత్ర్యం అనుభవిస్తుందా? లేదు. ఈ జాతికి ఇప్పట్లో ముక్తిలేదు'' అనుకొంటున్నాడు

''డాక్టరుగారూ! గుడివద్ద మీటింగుకు మీరు కూడా రావాలి'' అని మల్లయ్యకొడుకు కేకవేసి చెప్పాడు. విద్యార్థులు పోయింతరువాత శాస్త్రి నేరుగా చంద్రశేఖరం ఇంటికి వెళ్ళాడు. బయట చిన్నపిల్లలిద్దరు దుమ్ములో ఆడుకొంటున్నారు. నూనెముఖం యెరుగని జిబ్బితలలు, చినిగిపోయిన గుడ్డలు చూడగానే అది చంద్రశేఖరం ఇల్లు కాదేమో నని అనుమానించాడు కాని నిదానించి చూచింతరువాత అది అతని యిల్లేనన్న నమ్మకం కలిగింది ''మీ నాన్నగారున్నారా?''

''ఉన్నారు లోపలికి పదండి నాన్నగారూ, నాన్నగారూ! మీకోసం డాక్టరుగారు వచ్చారు'' అని పిల్ల కేక పెట్టింది

---

జి వి కృష్ణరావు

చంద్రశేఖరం చూచి, "డాక్టరుగారు దారితప్పి వచ్చినట్లున్నారే! రండి" అని పిలిచి చేయిలేని కుర్చీ చూపించాడు శాస్త్రి జేబుగుడ్డతో ముఖంతుడుచుకొంటూ కూర్చుని చంద్రశేఖరం వంక ఎగాదిగా చూచాడు శరీరం చిక్కి నల్లకప్పు వేసి ఉంది. వెంట్రుకలు తెల్లబారి ఉన్నాయి

"అలా చూస్తారేమి? కాస్త చిక్కిపోయాను అంతే ఈ మిల్లు గొడవ. ఫోర్జరీకేసు మనశ్శాంతి లేదు పుల్లయ్య గారి పుణ్యమా అంటూ పసిపాప ఈ మధ్యనే పోయింది."

"అలాగా, ఏమిటి జబ్బు? నాకు కబురన్నా చేయలేదే?"

"ఏమో, మీసంగతికూడా ఆ సమయానికి స్ఫురించలేదు అయినా మీరుమాత్రం ఏమి చేస్తారు? శరీరం వ్యాధికైతే మందిస్తారు కాని, మనోవ్యాధికి మందే మిస్తారు? అయినదేదో అయిపోయింది ఇప్పుడు అనుకొని ప్రయోజన మేమిటి?"

"పసిపాప రోగంవచ్చిపోయినా పుల్లయ్యేనా కారణం?" అని డాక్టరు మనసులో అనుకొన్నాడు

"జీవితం అన్నాక కష్టసుఖా లుండకతప్పదు. బుద్ధిమంతులు సర్దుకుపోవాలి సరేగాని ఉత్తరీయం వేసుకో, వెళ్ళుదాము"

"ఎక్కడికి?" ఆశ్చర్యంతో చంద్రశేఖరం అడిగాడు



"పనిమీద బయలుదేరి వెళ్లుతున్నపుడు ఈ అడ్డు ప్రశ్నలు పనికిరావు, లే"

"ఎక్కడికో, ఏమి పనో తెలియకుండా బయలుదేరనా? బాగుంది అయినా ఈనాడు నావల్ల కావలసినపని ఉందంటే మరీ ఆశ్చర్యంగా ఉంది"

"ఆశ్చర్య మేముంది? నీ వల్లనే నాకు సహాయం కావాలి. బయలుదేరు"

"వేళాకోళమా?"

"వాసుదేవశాస్త్రి ఎప్పుడైనా వేళాకోళంచేసేమనిషి అని విన్నావా? నాసంగతి నీకు తెలియని దే ముంది? పుల్లయ్య గారివద్దకు ఒకసారి వెళ్ళివద్దాము లే"

"పుల్లయ్య వద్దకా?" శేఖరం విస్తుపోయాడు

"అవును అక్కడికే"

పుల్లయ్య పంపితే తనవద్దకు డాక్టరు రాయబారం వచ్చాడని శేఖరానికి వెంటనే అనుమానం కలిగింది "కోర్టులో తననేరం రుజువైతే శిక్షపడుతుందని పంపించి ఉంటాడు లేకపోతే రాయబారం పంపించవలసిన అవసర మేముంది? బెట్టు సరిగా ఎలాగైనా బయట పడదామని పంపించి ఉంటాడు ఆ పప్పులు నా దగ్గర ఎందుకు ఉడుకుతాయి? శేఖరం అంటే అంత తేలిగ్గా పడి ఉన్నా డనుకొన్నాడు కామాలు?" అను కొన్నాడు

"డాక్టరుగారూ! మీరు చాల పొరపడుతున్నారు నేను అతనిదగ్గరకు వెళ్ళవలసిన కర్మం నాకు పట్టలేదు నావల్ల తప్పు ఉంటే మీరు చెప్పినట్లు ఆయనతో ప్రాధేయపడటం ధర్మం పాపపని చేసి నా మిల్లు, నావ్యాపారం, నా ఆస్తి, నా ప్రతిష్ఠ అంతా ధ్వంసంచేసింది అతను, నేను కాదు"

''ఇదిగో చంద్రశేఖరం! ఇటు చూడు నీవు చదువుకున్నవాడివి సంస్కార మున్నవాడివి ఇంతో అంతో ప్రజాసేవ చేశావు ఇంకా చేతనైనంతవరకూ చేస్తావు. కొంచెం విశాల దృష్టితో చూడు. తప్పు నీది అని కాని, పుల్లయ్య దని కాని చెప్పటం లేదు అతడు పంపితే నేను రాలేదు. అసలు నే నిక్కడికి వచ్చినసంగతికూడా అతనికి తెలియదు. ఇదంతా ఎందుకు చెబుతున్నా నంటే ఉన్నస్థితిగతులు చెప్పడానికే, మీ ఉభయుల్లో ఎవరిని మోసగించినా నాకు వచ్చే ప్రయోజనమేమిటి? అయినా ఈ ప్రయాసంతా దేనికన్న సందేహం కలగటం సహజమే, మరొక వ్యవహారం అయితే నేను వచ్చేవాణ్ణి కాదు చెప్పితే అర్థం చేసుకోగల మనుషులని వచ్చాను మీకు, పుల్లయ్యగారికి కలతలురావటమేమిటి, ఈ ఊరంతా ఆగం కావట మేమిటి? ఇందులో అర్థమున్నదా? వేలకొలది కిమ్మత్తుచేసే వాములు, సంస్థలు తగులబడిపోతున్నాయే దీనివల్ల మీకుగాని పుల్లయ్యగారికి గాని లాభం కలుగుతున్నదా? లేదు మధ్య అమాయికులు, పేదలు నష్టపడుతున్నారు. ఏగడియను ఏమి జరుగుతుందో అని అల్లాడిపోతున్నారు. ఈ ఘోర దురంతాలన్నీ నీవు చెయించావని నకాని, ఆ పుల్లయ్య చేయించాడని కాని ఉద్దేశం కాదు. నిజానికి నీకుగానీ, ఆయనకు గానీ ఏమీ తెలియదు ఆ సంగతి నాకు తెలుసు. మీ ఉభయులకూ తెలుసు. ఇలాంటి రాక్షసకృత్యాలకు మీరు ఎన్నడూ ఒప్పుకోరు అయినా జరుగుతూనే ఉన్నాయి ఎలా జరుగుతున్నాయి? మీ తగాదాను ఆసరా చేసుకొని దుర్మార్గులు కాదుఅజ్ఞానులు ఈ పని చేస్తున్నారు. ఇలాంటిదానికి మీలాంటి వాళ్ళు ఎప్పుడూ తావు ఇవ్వగూడదు ఇవ్వరు కూడా అది అలా ఉంచి కక్షలవల్ల ప్రయోజన మేమిటి? ఒండొరులకు హానిచేసుకోవటంకన్నా వచ్చే దేముంది? కాబట్టి నీలాంటి బుద్ధిమంతులు పగ తుడిచి వేయటానికి ఎప్పుడూ వెనుకంజవేయరాదు ఎవరివల్ల అయితే నేమి తప్పు జరిగింది. దాన్ని దిద్దుకోటానికి ఇంకా అవకాశం ఉంది ఎందుకు దిద్దుకోగూడదు? నీవు తప్పుచేయనపుడు చక్క బరచుకొనే ధైర్యం, సాహసం నీకే ఎక్కువ ఉంటుంది. కాంప్లెక్సులతో బాధపడవలసిన అవసరం లేదు పుల్లయ్యగారి దగ్గరకు వెళ్ళుదాము గతం మఱచి పొమ్మందాము. కాదంటాడా? ముక్కాలు మున్వీసం కాదనడు అంటే సంగతి తేలిపోతుందిగా? లే, బయలుదేరు.''

''బయలుదేరవలసిందేనా?''

''ఇంకా సందేహం దేనికి?''

''మరి మారువాడికి ఇవ్వవలసిన అయిదువేలు ఎవరిస్తారు?''

వాసుదేవశాస్త్రికి ఈ అంశమే అసలు మనస్సుకు తట్టలేదు. అవును. ఆ మొత్తం ఎవరిచ్చుకోవాలి? చిక్కేవచ్చింది. అతడు కాసేపు ఆలోచించాడు.

''ఎవరిచ్చుకొనే దేముంది? పుల్లయ్యనే ఇచ్చుకోమని అడుగుదాము.''

''అతన్ని మళ్ళీ యాచించేదా? డాక్టరుగారూ! అసంభవం చాలు ఒకసారి పూచీయిచ్చి ఘింతవరకూ ముంచాడు ఆ ప్రాయశ్చిత్తం చాలు జన్మజన్మాలకు అతడు చేసిన ఘనకార్యం మరచిపోలేను మళ్ళీ యిప్పుడు వచ్చి డబ్బు ఇచ్చుకో వలసిందని దేబిరించేదా? అది నావల్ల కాదు. అంత విశ్వాసఘాతుకుణ్ణి ఊరకనే వదలిపెడలా ననుకోవటం కల్ల అతడే వచ్చి కాళ్ళమీద పడ్డా,

ఇప్పుడు నాకుటుంబం నేను ఇన్ని అవస్థలు పడి ఇంత అవమానంపాలైన తరువాత రాజీకువరదు ముమ్మాటికీ కుదరదు ''

''శేఖరం! నామాట విను పెద్దవాణ్ణో, చిన్నవాణ్ణో చెబుతున్నాను ఒకసారి కోర్టుకెక్కితే ఆడే అబద్దాలకు, చెప్పించే తప్పుడు సాక్ష్యాలకు అంతు ఉండదు అది అలా ఉంచి న్యాయస్థానానికి చెవులేగాని కళ్ళు లేవు. ఆ తప్పుడు సాక్ష్యాలను బట్టే తీర్పు చెబుతుంది ఎందుకు వచ్చిన లాయిలాసా? నామాట విను, అతడైనా జైలుకు పోవాలి నీవైనా జైలుకు పోవాలి, మీలో ఎవరైనా అసలు ఎందుకు జైలుకు పోవాలి? ఉభయులు హాయిగా స్వేచ్ఛగా ఎందుకు బ్రతకరాదు? ఉన్న అవకాశాన్ని పోగొట్టకు.''

''నా కింత డబ్బు ఉంది. నా కేమిటిఅని పుల్లయ్యగారు అనుకొంటూ ఉండాలి. అతగాడికి ముంతనీరు, చిప్పతిండి తప్పటం కల్ల అలా రాసి ఉంటే మనమేమి చేస్తాము డ్యాక్టరు గారు?''

''కేవలం తప్పుచేయకపోతే పరులను ఉదారంగా క్షమించాలి. కాని ఇంత దారుణంగా వ్యవహరించరాదు. కాబట్టి అతడు ఫోర్జరీచేస్తే చేసి ఉండవచ్చునేమో'' అని శాస్త్రికి అనుమానం కలిగింది. అయినా చేసే దేమీ కనిపించక లేచి బయలుదేరాడు

''డ్యాక్టరుగారు! ఇది కేవలం మా ఉభయులమధ్య వచ్చిన తగాదా కాదు. అలాంటిదైతే ఎలాగో సర్దుకొనేవాణ్ణి. అలాంటిది కాదు. వేలకొలదిగాఉన్న కార్మికలోకానికి సంబంధించిన సమస్య వాళ్ళనోటి కాడకూడు తీశాడు.''

''అవును ఇవాళ నాకు కడుపునొప్పి వచ్చినా సామాజిక సమస్యే, రోగం వచ్చి మూలబడినా సామాజికసమస్యే! తనవ్యక్తిగత సమస్యలను ఏకైకంగా ఎదుర్కొని పరిష్కరించుకొనే దమ్ములు లేక ప్రతి వాడు వాటిని సమాజానికి అంట గడుతున్నాడు సామాజిక సమస్యలంటున్నాడు సమాజంకోసం తాను త్యాగంచేస్తున్నా నంటున్నాడు. నలుగురినీ రెచ్చగొడుతున్నాడు దానితో వివేకాన్ని చంపి ఉద్రేకానికి నాగస్వరం పడుతున్నాడు.''

''మీ రెంత పురెక్కించినా పుల్లయ్యగారు అనుకొంటున్నట్లు నేను ఏకాకిని కాను అంతవరకూ అదృష్టవంతుణ్ణే ''

''ఇలాంటి వాణ్ణే ఇంకా ఎందుకు దయదలచాలి?'' అనుకొని శేఖరానికి సమాధాన మిచ్చాడు

''అవును, తెలిసింది కార్మికసంఘం తిరిగి నెలకొల్పి ఉపన్యాసాలిస్తున్నావటగా?''

''షావుకార్లనందర్నీ కట్టుకొని కూలీలను ఏడిపించటానికి తయారవుతున్నప్పుడు ఏమి చెయ్యాలి?''

శాస్త్రి అతని సమాధానం వినకముందేవెళ్ళిపోయాడు తన అనుమానం కాదని త్రోసివేసి ఎన్ని హితోపదేశాలు చేసినా మానవునికి రుచించవు ప్రాణాలుపోతున్నా ఆమోదించడు. శాస్త్రి మాటలు చంద్రశేఖరానికి తలదూరలేదంటే విడ్డూర మేముంది?

శాస్త్రి వెళ్ళిపోయినతరువాత కూడా శేఖరం అలాగే కూర్చున్నాడు మళ్ళీ ఒకసారి డాక్టరన్న మాటలు మనోవీధిలో ప్రతి ధ్వనించాయి అతడు చెప్పినట్లు తనవ్యక్తిగతసమస్యను సామాజిక సమస్యను చేశానేమో నని కలవరపడ్డాడు దీన్ని మరచిపోవటానికి అతని బుద్ధి శాస్త్రిలో దోషాలు వెదక మొదలు పెట్టింది ''శాస్త్రి బ్రాహ్మడు బ్రాహ్మలంతా విప్లవ ద్రోహులే వర్ణవ్యవస్థ యధాతధంగా ఉంచి తాము పెత్తనం కొనసాగించటానికి ప్రయత్నిస్తారు. కాబట్టి శాస్త్రి కూడా విప్లవ ద్రోహి ఈ సమాజం ఇలాగే ఉంటానికి ప్రయత్నిస్తున్నాడు. అలాంటివాణ్ణి ధిక్కరించి తాను విప్లవానికి తోడ్పడుతున్నాడేకాని అక్రమమార్గం త్రొక్కటంలేదు. ధనవంతులంతా తనమీద కుట్రలు పన్ని కూలీలను వేధించుకుతినడానికి ఎలాగైనా జైలుకు పంపాలని చూస్తున్నారు. తాను వాళ్ళ ధనమదాంధతకు, కిరాతకకృత్యాలకు బలి అవుతున్నాడు. అయినా కూలీలకోసం త్యాగంచేయటంకంటె మరొక వీరోచితకృత్య మేముంది?'' ఈ భావంతో తాను లోగడ వారికి చేసిన అపకారం మరచిపోయాడు ఎక్కడ లేని దాక్షిణ్యం పుట్టుకొచ్చింది. వాళ్ళు సోదరులు. వాళ్ళ కోసమే తాను ఇప్పుడు ఇన్ని చెరలకు లోనవుతున్నాడు

ఇంతకూ శాస్త్రి కూడా షావుకార్లతో షరీకు అవుతున్నా డన్నమాట! కార్మికులు కాస్త తీరికగా ఉండటానికి కూడా అతనికి ఇష్టం లేదన్నమాట! శేఖరం పెదవికొరికాడు ఈ సంగతి కార్మికులకు చెప్పాలి. పుల్లయ్య ఎంతమంది దేవుళ్ళకు మొక్కినా, ఎంత మంది బ్రాహ్మలక్కు 79
సంతర్పణచేసినా జైలు మాత్రం తప్పదు ఎటుతిరిగీ కేసు విచారణ ప్రారంభం రేపు లేదు ఎల్లుండేకదా!

జి.వి కృష్ణరావు

# . పదిహేడు . .

ఊళ్ళో బయలుదేరిన అరాజకత్వంతో పుల్లయ్యకు పూర్తిగా జంకుగొంకులు తీరిపోయాయి అన్నెం పున్నెం ఎరుగని అనపంతులిల్లు తగలపెట్టారు రెక్కలకష్టంతో జీవిస్తూ ఉన్న ధర్మరాజులాంటి కుశాలయ్యచేత అన్యాయంగా నాలుగుఎందలు కక్కించారు సంసారం గడుపుతున్న అతని ఆవును అమ్మించారు మల్లయ్యవామిని తగలబెట్టించాడని అపవాదు వేశారు. చూస్తూ ఊరుకొంటే ఇంకా యెన్ని అన్యయాలైనా చేయిస్తారు ఈ అక్రమాలన్నీ పోయి ఊరు ఎప్పటిమాదిరిగా ఉండాలంటే తానీ కేసులో నెగ్గటం అవసరం ఈ విజయం కేవలం తనది కాదు ఊరిది, ధర్మానిది. తాను గెలిస్తేనే ఊరికి శాంతి, ప్రజలకు హాయి ఈ కేసు నిజంగా ప్రజలది ప్రజలకోసం సంఘంకోసం తాను ఈనాడు త్యాగంచేస్తున్నాడు. ఈ కేసు ఓడిపోతే మల్లయ్యకూ, మల్లయ్య పార్టీవాళ్ళకూ, దురంతాలకూ పట్టపగ్గాలు ఉండవు తన ఆస్తిపోయినా కుటుంబం అగచాట్లపాలైనా, తన ప్రాణాలు పోయినా కేసు నెగ్గించితీరాలి. ఓడిపోతే అమాయిక ప్రజకు మళ్ళీ నిలువనీడ దొరకుతుందా?

ఈ ఆలోచనలతో పుల్లయ్యకు ఎక్కడలేని ఉత్సాహం వచ్చింది కోర్టులో ఏమి అడుగుతారో తానేమి చెప్పాలో ఆలోచించుకో సాగాడు. తాను ఫిర్యాదినన్న సంగతి మరచిపోయి ముద్దాయిననుకొని ఎలా చెప్పాలో ఆలోచించ మొదలు పెట్టాడు. కోర్టుకు కావలసిన కాగితాలు సర్దసాగాడు. సాక్ష్యం సిద్ధపరుచుకొన్నాడు. మాధవయ్య భార్యదగ్గరకు వెళ్లి, ''పుల్లయ్యగారు చంద్రశేఖరం గారికి మార్వాడీవద్ద హామీ ఉన్నట్లు నా భర్త ఎప్పుడూ చెప్పలేదు'' అని వాఙ్మూలం పుచ్చుకొన్నాడు దానిని తాను కోర్టులో చదివి వినిపించినప్పుడు షావుకారు మల్లయ్య ముఖంలో నెత్తురుచుక్క అనేది ఉండదు. మాధవయ్యభార్య స్వయంగా వాఙ్మూలం ఇచ్చినప్పుడు వీరయ్య చెప్పే సాక్ష్యం దమ్మిడీకి కొరగాకుండా పోతుంది అసలు ఈ వీరయ్యను రెచ్చగొట్టింది ఈ పీనుగుల మల్లయ్యే అయి ఉండాలి. వాడికి డబ్బిచ్చి ఉంటాడు వీళ్ళకు కావలసింది న్యాయంకాదు నావినాశనం. నా పార్టీ నాశనం కావాలి లోకం ఎంత అన్యాయానికి ఒడిగడుతున్నది?

సాయంకాలం అయింది. పుల్లయ్య పొలంవేపు వెళ్ళాడు జగ్గారావు డమడమాలబండి యింటిముందు ఈడ్చుకొంటూ ఉండగా గుర్రబండి వచ్చి వాకిలివద్ద ఆగింది రామారావు బండిలోనుంచి దిగి పెట్టె డాబాలో పెట్టమని బండివాడికి చెప్పాడు జగ్గారావు తనబండి నక్కడే వదలి ఉత్సాహంతో ఒక్కగంతున ఇంట్లోపడి, ''బాబాయొచ్చాలే, బాబాయొచ్చాలో'' అని కేకపేట్టాడు. '' ఇదిగో కాళ్ళకు నీళ్ళు తీసుకొని వెళ్లియివ్వరూ!'' అని తల్లి కేకవేస్తున్నా వినకుండా మళ్ళీ పినతండ్రివద్దకు వచ్చిపడ్డాడు రామారావు అతన్ని ఎత్తుకొని జేబులోనుంచి పర్సుతీసి బండివాడికి బాడుగ యిచ్చి పంపివేశాడు ఇంతలోనే రంగమ్మ కాళ్ళకు నీళ్ళు పట్టుకు వచ్చింది జగ్గారావు, రామారావు జేబుతడువుతూ ''నా కేమి పట్టుకువచ్చావ్ బాబాయి!'' అని అడిగాడు

'వా' తప్పు అత్తయ్య బాగుందేమో కనుక్కో! తల్లి మందలించింది.

''మొన్నేగా అత్తయ్య ఎల్లి. బాగుండక ఏం చేత్తుందిలే నా కేమి తెచ్చావో చెప్పవే?''

''గొలుసులు, కొరడా'' రామారావు నవ్వాడు

''దేనికి?''

''అల్లరి ఎక్కువైంది. అందుకని గొలుసులు చేతికి తగిలించటం, కొరడాతో నాలుగు ఉదుకటం ''

''అబ్బొబ్బే! నాకు వద్దు. నువ్వే ఉంచుకో లేకపోతే తాతయ్యకు అత్తిపెత్తు.''

''ఏమిటిరా జగ్గా! బొత్తిగా చిన్నా పెద్దా లేకుండా మాట్లాడుతున్నావు!'' తల్లి కసిరింది.

''నా కాళ్లకు చేతులకు సంకెళ్లేత్తానంతాలా మరి! ఆనిక్క తాతయ్యను లాపీ ఎవరికి బేడీలు పలతయ్యో తేలుద్దిగా?''

''తాతయ్య నా కెందుకు బేడీలు వేస్తాడ్రా?''

''ఎందుకా? ఇంతికాలం ఉందమంతే ఉందక పాలిపోతుంతే బేడీలు వేయలూ మరి?''

''వాడిమాటల కేమిలే! నువ్వు కాళ్లు కడుక్కో..'' రంగమ్మమరిదిని హెచ్చరించి నీళ్ళు పక్కనే పెట్టిలోపలికి పోయింది. 

''దిగు బాబు, కాళ్ళు కడుక్కోందాం ''

''ఏమి తెచ్చావో ముందు చెప్పాలి.''

''ఏమి తెచ్చానని చెప్పనూ?''

''తెచ్చిందేదో అదే.''

''ఇప్పుడు దేనికి అనక యిస్తాగా ''

కాళ్లు కడుక్కొన్న తరువాత రామారావును, జగ్గారావు సందులోకి లాక్కువెళ్ళాడు. లక్ష్మమ్మ వెనుకదొడ్లో మంచం వాల్చి పక్కవేసి 'కూర్చోరా' అని తాను గడప పక్కగా కూర్చున్నది.

''ఏమిరా అంత చిక్కిపోయావు? తిండీ తిప్పలు సరిగా అమరటం లేదా ఏమిటి? పట్నం వద్దో మొర్రో అంటే వినవు అక్కడనుంచి కదలనంటావు. ఇంటివద్ద లక్షణంగా కాలుమీద కాలేసుకొని మహారాజులాగా కూర్చోవచ్చునే ఎందుకొచ్చిన తిప్పలురా అవి?''

''చదివే చదువు ఏమి కావాలి?''

''చదువూ చట్టుబండలూ? ఉద్యోగాలా, పాడా? ఇళ్ళూ వళ్ళూ గుల్ల చేసుకోవటమేగా.''

''నాన్న ఏడీ?''

''పొలంవెళ్లే వెళ్ళాడు కామాలు!''

---

జి.వి. కృష్ణరావు

లక్ష్మమ్మ కుటుంబంకథ చెప్పుకువచ్చింది. నిష్కారణంగా ఊరంతా ముసలయ్యను ఆడిపోసుకొంటున్నారనీ, ఊరు ఊరుగా లేదని, పంతులిల్లు తగులబెట్టారనీ, రెండురోజుల క్రితమే దొడ్లో రథమంటి ఎద్దు వట్టి పుణ్యానికి చచ్చిపోయిందనీ, అప్పటినుంచి ముసలయ్యమనస్సు సరిగా ఉండటం లేదనీ, కేసు విచారణ రేపేననీ ఏకరువుపెడుతే ఉంచే అతడు విని ఊకొడుతున్నాడు. ఇంతలో పుల్లయ్య దొడ్లోకి వచ్చాడు. అతనికి కొడుకుమఖం కనిపించగానే గుండెలు అవిసిపోయినయ్. అంతలోనే తెప్పరిల్లుకొన్నాడు. కోపంతో కొంత తీక్షణత వహించాడు. కొడుకును పలకరించకుండానే వంట యింటి వైపు, వెళ్ళి ''అమ్మాయ్ నీళ్ళుతోడు'' అని హెచ్చరించి, ఎంతసేపైంది వచ్చి? అని మనుమణ్ణి అడిగాడు. తండ్రి వాలకం రామారావు చూస్తూ మెదలకుండా ఊరుకొన్నాడు. ''నీవు అటు ఎళ్ళావు. బాబాయి యిటు వచ్చాలు. సరేగాని తాతయ్యా బాబాయి నా కేమి తెచ్చాలో చెప్పు?'' అన్నాడు జగ్గారావు.

''వాడు నీకూ నాకు తెచ్చేదేమిటిరా తిప్పలు గాక.''

''అమ్మాతిప్పలంతే ఏమితే. తినేవా, ఆలుకొనేవా?''

''ఆహా! మొదలు పెట్టా మళ్ళీని?'' కొడుకును వెనకవేసుకొని లక్ష్మమ్మ భర్తను కసిరింది.

తండ్రీ కొడుకులు మాటామంతీ లేకుండానే స్నానాలు భోజనాలు ముగించారు. అంతకుముందే జగ్గారావు నిద్రపోయాడు. పుల్లయ్య డాబాముందుగదిలోకి పోయి కుర్చీలో కూర్చున్నాడు. అత్తా కోడళ్లు వంటయింట్లో భోజనం చేస్తుండగా రామారావు తండ్రి కూర్చున్న గదిలోకి వెళ్లి నిలబడ్డాడు. కొంతసేపు ఎవరు మాట్లాడలేదు. చివరికి పుల్లయ్య పలకరించాడు.

''డబ్బు కావలసివచ్చిందా? రేపు పంతుల్ని అడిగి నేను చెప్పానని తీసుకువెళ్లు.''

రామారావుకు చుర్రుమన్నది. తనకు లంచమిచ్చి నోరుకట్టివేయుదలచాడా, లేక పసిపిల్లవాడులే అంత మిఠాయి పెడితే ఊరుకొంటాడు అనుకొన్నాడా?

''అవసరం లేదు.''

కొడుకు గొంతు వినగానే పుల్లయ్యకు గుండె గతుక్కుమన్నది. కొంతసేపు మాట్లాడలేకపోయాడు. ఎలాగో తెమల్చుకొని అసలు ప్రస్తావన తానే తెచ్చాడు.

''మతిలేని వ్రాతలు ఏమిటి వ్రాశావు?''

''చంద్రశేఖరం సంగతేనా? ఆనాడు ' ఆయనకు అడ్డం ఉన్నానురా' అని చెప్పావు నాన్నా! సరిగ్గా ఆ రోజు నానే యం. ఏ. రిజల్ట్సు వచ్చాయి. నే నింకా చదువుకోవాలి. మద్రాసు పోతానని చెప్పాను. వద్దని చెబుతూ ఈ సంగతి చెప్పావు. మరచిపోయావేమో సరిగా జ్ఞాపకం తెచ్చుకో. అమ్మతోకూడా అనవద్దని చెప్పావు. ఆ మాటలు ఇప్పటికీ చెవుల్లో మెదలుతూనే ఉన్నాయి. ఇప్పుడైనా జ్ఞాపకం రావటంలేదా?''

''నీవు కలగన్న విషయాలు నాకెలా జ్ఞాపకంవస్తాయి?'' పుల్లయ్య నవ్వాడు. తండ్రి తనమీద ధాముధూములు చేస్తాడనుకొన్నాడు. కాని ఇంత ప్రశాంతంగా మాట్లాడుతాడని రామారావు అనుకోలేదు. దాంతో వెంటనే సమాధానం చెప్పలేకపోయాడు. కాసేపు గడిచింది.

''చంద్రశేఖరంగారు అన్నెం పున్నెం ఎరగరు అనవసరంగా అతన్ని ఎందుకు కోర్టు కీడుస్తారు? మీ రెందుకు శ్రమపడుతారు? కేసు ఎత్తివేసుకోండి అది ఉభయులకు శ్రేయస్కరం.''

''వెనకటికి గ్రుడ్డువచ్చి పిల్లను వెక్కిరించిందట తెలియని వ్యవహారాల్లో తలదూర్చక, నీ చదువు సంధ్య లేమిటో నువ్వు చూచుకో ''

''కేవలం పాపం ఒడిగట్టుకుంటారు ఇది ఏ మాత్రం మంచిది కాదు. కేసు ఎత్తి వేసుకోండి ''

''నువ్వు చెప్పావని రేపు కూడు గుడ్డాకూడా మానెయ్యాలి అంతేనా?''

''అన్యాయ దౌర్జన్యాలు కూడు గుడ్డలు కావు.''

''ఇంతకూ నేను మహాపాపిని రాక్షసాగ్రేసర చక్రవర్తిని అంతేగానువ్వనేది? నీకు పురి ఎక్కించిందెవరు?''

రామారావు కోపంతో వణికిపోయాడు

''అంటే మీ ఉద్దేశ్యం?''

''నీ తండ్రికి ప్రతికూలంగా బోనెక్కి కోర్టులో సాక్ష్యం చెబుతావన్నమాట?''

''కేసు ఎత్తివేసుకుంటే అందాకా ఎందుకు వస్తుంది?''

పుల్లయ్య చద్రువ కుర్చీలోనించి లేచి పళ్లు పటపట కొరుకుతూ జుట్టుపట్టుకొని; ''తిన్నగా పట్నం పో. లేకపోతే ఏమిజరుగుతుందో తెలుసా!'' అని అటూ ఇటూ ఊపి దూరంగా ఒక్కనెట్టు నెట్టి చురచుర చూచాడు.

రామారావు చలించలేదు

''కేసు ఎత్తివేసుకో నాన్నా!''

''ఛీ, నీముఖం చూస్తేనే పాపం చుట్టుకొంటుంది. ఇక్కడ నుంచి వెళ్ళిపోతావా లేదా?'' ప్రక్కనున్న కుర్చీ అమాంతం పైకెత్తాడు.

రామారావు శరీరం అతనికి తెలియకుండానే బయటికి నడిచింది హాల్లో చిరునవ్వు లొలుకుతూ నిద్రపోతున్న జగ్గా రావు ముఖం అతన్ని పరిహసిస్తున్నట్లు కనిపించింది. తాను మెదలకుండా ఊరుకుంటే కోర్టు శేఖరాన్ని జైలుకు పంపుతుంది. అతని పిల్లలు భార్యా దిక్కులేనివాళ్ళు అవుతారు. నానా అగచాట్లపాలవుతారు వాటన్నిటికి తానే కారణం అవుతాడు. తన మూలంగా ఒక నిండుకుటుంబం ధ్వంసమై పోతుంది ఇతరులకు మేలుచేయకపోగా చేతులార తాను హాని చేయబోతున్నాడు

ఈ సమయంలో కాలుజారితే తన జీవతమంతా వ్యర్థం అలా చేస్తే తన తండ్రే ముందు ముందు పురుగును చూచినట్టు చూడడా? తండ్రి మొండికెత్తినప్పుడు ఏమిచేయాలి? ప్రతి పక్షాన సాక్ష్యం చెప్పటంకన్నా మార్గంలేదా? రామారావు ఆలోచించాడు తండ్రిని ఎలాగైనా కేసు

శేఖరాన్నే పంపించటం ఉపసరం అది అలా ఉంచి ఈ కేసులో జోక్యం కలిగించుకోపటంవల్ల కొడుకుకు వచ్చి పడ్డోపడెది ఏమీ లేదు అతడు తండ్రికి ప్రతికూలంగా సాక్ష్యం చెప్పకపోతే ఎందుకు చెప్పలే దని నిగ్గతీసి అడిగేవాళ్ళు లేరు. చెప్పాడా భర్త జైలుకుపోవలసివస్తుంది. వీడు తండ్రిని జైలుకు పంపిస్తాడా? దేనికోసం? ధర్మంకోసమా? కన్నతల్లిదండ్రులను కాదని త్రోసివేసేది ధర్మం ఎట్లా అవుతుంది? పైగా శేఖరం మీద కేసు పెట్టించింది ఆమె కాదా! ఆమె ఆనాడు అంత పట్టుపట్టి రిజిస్టరునోటీసు ఇప్పించకపోతే భర్త ఊరుకొనేవాడు కాదా! ఆమెకోసమై అతడు నిలబడ్డప్పుడు ఈనాడు ద్రోహం చేస్తుందా? లేదు. అలా జరగటానికి వీలులేదు. తండ్రి అన్నట్లు కొడుకు అపోహపడ్డాడు కల్పనకావించుకొన్నాడు కల గన్నాడు. అదే నిజమనుకొంటున్నాడు అంతేకాని మరేమీ లేదు.

ఇష్టం లేని విషయాలు మానవుడు ఎన్నడూ నమ్మడు. వాటిని కేవలం అపోహలుగా, అసత్యాలుగా, కల్పనాసౌధాలుగా పరిగణిస్తాడు. లక్ష్మమ్మ కూడా అంతే చేసింది. కొడుకు చెప్పినది వాస్తవం కాదని నిర్ధారించుకొన్నది తెల్లవారు జామున లేచి వెళ్ళి కొడుకుమంచంమీద కూర్చొని తల నిమురుతూ, ''రాముడూ, నువ్వు నిజంగా పొరపాటుపడ్డావు. అయిన దేదో అయిపోయింది నువ్వు వెంటనే ఇక్కడనుంచి వెళ్ళిపో ఆరునెల్లదాకా మళ్ళీ ఈ చాయలకు రాకు, చిన్నదాన్నో పెద్దదాన్నో చెపుతున్నా విను. మీనాన్న అడిగితే నేను చెబుతానులే వెళ్ళిపో'' అన్నది.



''నువ్వుకూడా వెళ్ళిపొమ్మంటున్నావా?'' నిమురుతున్న తల్లి చేయి అవతలకు నెట్టివేశాడు

లక్ష్మమ్మ చప్పున మంచంమీదనుంచి లేచి వెళ్ళిపోయింది.

''నీనిద్ర పాడుగాను, లేవవేమే! ఎళ్ళున తెల్లవారవస్తుంటే'' అని కోడల్ని కసిరి లేపింది.

రామారావుకు తల్లిమీద జాలి కలిగింది. ''వట్టి అమాయికపు మనిషి'' అనుకొన్నాడు ''అదుగో జాగ్రత్త! కాలు జారుతున్నది మళ్ళీ వ్యామోహంలో పడుతున్నావు రామూ! అని అంతరాత్మ బోధించింది. ''అలా ఎన్నటికీ జరగదు. జరగటానికి వీలులేదు. నేను అందరిలాంటి వాణ్ణి కాను. ఆరు మూడయ్యేది, మిన్ను విరిగి మీదపడేది రామారావు వెనుకంజవేయుడు. అంతే'' అతడు సంకల్పించుకొన్నాడు.

---

జి.వి కృష్ణరావు

# . . . పద్దెనిమిది

ఏ యింటిమీద ఏ కాకి వాలుతున్నదో కనిపెట్టి ఉండే షావుకారు మల్లయ్య రామారావురాకను ముందుగనే తెలుసుకొన్నాడంటే ఆశ్చర్యపడవలసిన పనిలేదు సంవత్సరన్నర పైచిలుకునుంచి ఇంటిముఖం చూడకుండా ఉంటున్న రామారావు ఇవాళ ఎందుకు ఊడిపడ్డాడు? ఈ పని ఏ నెల రెండునెల్లక్రితమో కాక ఇప్పుడు – అందులో తీరా విచారణ ప్రారంభం కానున్న సమయంలో ఎందుకు జరగాలి? కాబట్టి అతని రాకకు, విచారణకు ఏదో సంబంధం ఉండాలి. ఏమై ఉంటుంది? అసలు ఎలా తెలుస్తుంది? పంతులుద్వారా తెలుసుకుందామా అంటే కొరకరానికొయ్య. పైగా అసలుకే మోసం రావచ్చును. ఇక ఆ యింటిగుట్టు ఈశ్వరుడికైనా తెలియదు. అందుకనే పుల్లయ్య ఎన్ని ఆటలైనా ఆడుతున్నాడు. ఏమైనా సాగించుకొంటున్నాడు.

ఇంతకూ రామారావు ఎందుకు వచ్చాడు? ఈ సంగతి యెలా తెలుస్తుంది? ప్రొద్దున్నే లేచి ముఖంకడుక్కొంటున్న మల్లయ్యకు ఇదే విషమసమస్య అయింది. మనస్సు యెంత చించుకొన్నా అంతు పట్టలేదు. కాని పుల్లయ్యను సాధించటానికి మాత్రం అపూర్వమైన ఉపాయం తోచింది. దానితో అతనికి లక్షరూపాయలు తలవని తలంపుగా దొరికినట్లయింది. పుల్లయ్యనుసాధించాలంటే రామారావుద్వారానే సాధించాలి. దానితోగాని అతడు అంకెకు రాడు ఈ దెబ్బతో గాని అమీతుమీ తేలదు. ముఖసమ్మార్జనం ముగించి మల్లయ్య తుండుగుడ్డ బుజాన వేసుకొని హరిజన శ్రమానికి వెళ్ళాడు

కూలివాడు ఏతాము ఎత్తుతున్నాడు. అమ్మాయమ్మ పైట కొంగు రొంట దోపి నీరు జాలుచేస్తూఉంది. అతడు నేరుగా ఆమెదగ్గరకు వెళ్ళాడు.

''ఏమి అన్నయ్యా, పొద్దున్నే ఇటు వచ్చావు?'' కుశల ప్రశ్న రూపకంగా ఆమె పలకరించింది.

''ఆఁ ఏమీ లేదమ్మా! పొలంనుంచి వస్తూ ఆశ్రమంలో పాకలు తగలబడిన వంటే చూచిపోదామని వచ్చాను.'' సత్యం అన్నది మల్లయ్య పుట్టిన తరువాతనే పుట్టింది

''అదిగో ఆ కమురుకుపోయిన గుంజలు కనిపించటంలా, ఆ రెండు పాకలు తగలబెట్టారు ''

''ఎవడికి పోయేరోగం వచ్చిందో – నలుగురికీ ఉపయోగపడే సంస్థ అని ఐనా చూడకుండా పెట్టాడే అంతు ఏమైనా చిక్కిందా?''

''ఒక్కటే చిక్కటం! ఇంకానయం, పెంకుటిపాకతోసహా అంతా తుడుచుకుపోవలసింది. ఏదో చప్పున మేలుకోబట్టే, పదిమంది పిల్లలు చేతికింద ఉన్నారు కాబట్టే అదైనా దక్కింది.''

''గుంజలైనా పనికివస్తాయా?''

''లాభంలేదు మాద్దువుగాని రా'' లంటూ ఆమె కాలువ నీళ్ళలో చేతులు కడుక్కొని పాలు తగలబడ్డచోటికి అతన్ని తీసుకువెళ్ళింది పొగబారి ఉన్న గుంజల్ని కాలితో తన్ని చూచి, ''ఇవికూడా పనికిరావు మళ్ళీ మొత్తం మొదలెత్తుకోవలసిందే ఈ రోజుల్లో మళ్ళీ వేయాలంటే చాల అవుతుంది ''

''మీలాంటివాళ్ళు అండగా నిలుస్తుండబట్టి బండి సాగిపోతున్నది కాని లేకపోతే మాటలా?'' ఆమె మాటతో మాట కలిపింది

''ఊరిమీద కావలసిన పనులుగాని ఒకరిద్దరివల్ల ఏమౌతాయి? నలుగురికీ కావలసినవి కాబట్టి నావంతు కావలసిన తాటాకు అంతా ఇస్తాను ఎప్పుడు కావలసివస్తే అప్పుడు మా తోపుకు గమళ్ళవాళ్ళను పంపించి కొట్టించు.''

''అన్నయ్యా! నువ్వే అలా అంటే ఎలా? వాసాలు, దూలాలు, ఖాళీ గుంజలు వగయిరా కావాలంటే నాలుగు వేల దాకా కాదా? పొరుగూళ్ళకు పోతే వసూలు చేసుకురావచ్చుగాని నాకేమీ ఇష్టంలేదు ఆశ్రమం మనఊళ్ళో ఉంది. మనం కట్టాము బరువో భారమో అదంతా మనం మోయాలి గాని పరాయివాళ్ళను దేవురించట మేమిటి? ఊరికి ఇంకా ప్రతిష్ఠ ఉంటుందా?''

''ఇవ్వగలిగితే బాగానే ఉంటుంది. నిజానికి ఒక లక్ష రూపాయలు ఇద్దామని ఊహ ఎక్కడనుంచి తెచ్చి యిచ్చేట్లు?''

''డబ్బు వద్దులే, పదితాళ్ళు ఇవ్వు, నిన్ను అధికంగా కోరి నొప్పించదలచలేదు ''

''కాలువదిలించుకొంటే మెడకూ, మెడ వదలించుకొంటే కాలికి లంకె వేస్తుంటే ఏమి చేయను? అసలు ఇటుకల్లే రావటమే పొరపాటు ''

''ఎంతమాట అన్నావు! నా సంగతి నీకు, నీసంగతి నాకు తెలియబట్టి సరిపోయింది కొత్తవాళ్ళు వింటే ఏమనుకొంటారు?''

''ఏమన్నా అనుకోనీ, వస్తా'' అంటూ మల్లయ్య బయలుదేరాడు. గేటుదాక సాగనంపిరావటానికి అమ్మాయమ్మగారు అతనివెనుక బయలుదేరింది. నాలుగడుగులు ముందుకు వేసింతరువాత మల్లయ్య మళ్ళీ అందుకొన్నాడు.

''సరే తంటాలుపడి మళ్ళీ పాకలు వేయిస్తావు నిన్నచేసిన పని రేపు చేయరని నమ్మకమేమిటి? అప్పుడు ఎవరిదగ్గర భిక్షమెత్తేటట్లు? ఒకసారి కాకపోతే రెండుసార్లు సాయం చేస్తారుకాని, ఎల్లకాలం ఎవరూ సాయంచేయలేరు కదా!''

''అదే గుండె పీకుతున్నది ఈ కమ్యూనిస్టుల్ని బయట ఉండనిచ్చినంతకాలం గుండెల్లో గాలమే!''

''అదే నేనూ చెప్పవచ్చింది. అన్నట్టు రామారావు ఊళ్ళోకి వచ్చాడు. తెలుసుగా వాడిసంగతి?

---

జి.వి. కృష్ణరావు

''తెలియకేం, తెలుసు ఉద్దండపిండం!''

''ఏదో ఒక పిండం ఇంతవరకూ ఊరు నిప్పులో తగలడుతున్నది ఇక నిప్పులేకుండానే తగలడుతుంది.''

''అంతేనా?''

''అంతేగాక మరేమనుకున్నావు? వాడిసంగతి నీ కింకా తెలియనట్లున్నది ఒక బొక్కలో పెడితే పదిబొక్కల్లో తేలుతాడు శక్తిఉంటే వాణ్ణిముందు జైల్లో తోయించే ఉపాయం చూడు లేకపోతే నువ్వు నీ ఆశ్రమం ఎలాఉండాలో అలాగే ఉంటారు వాడు పత్రికల్లో రాస్తున్నదంతా ఏమనుకొన్నా? నిన్నూ, నీ ఆశ్రమాన్ని గూర్చేకదా! ఏమన్నా చేయగలిగితే ఇవాళే చూడు నీకూ నాకూ ఊరికీ అంతకూ ఉపకారమే ''

''అదెంత భాగ్యం? అసలు అతని ఆచూకీకోసం పోలీసులు అయిదారునెల్లనుంచి నన్ను అడుగుతూ ఉంటే ఊరుకొన్నాను. ఇక ఊరుకొంటానా? ఇవాళ సాయంకాలంలోగా పట్టివ్వకపోతే నన్ను పేరున పిలవవద్దు ''

వచ్చినపని సానుకూలమైనందుకు సంతోషంతో మల్లయ్య వెళ్ళిపోయాడు. అయితే నాలుగువందలరూపాయల తాళ్లు తాటాకు దానిఏదాన పోయాలిసివచ్చిందేమిరా అని విచారించకపోలేదు డబ్బురూపంగా ఇవ్వటం లేదుగదా అన్న సంతృప్తిమాత్రం కలిగింది అసలు ఏ నాల్గైదు వేలు అన్నా కళ్ళు జూడకుండా ఒప్పుకోవటం తన వ్యవహారదక్షతే నని సంతోషపడ్డాడు

అమ్మాయమ్మగారికి ఆశ్రమం ఉండటం అవసరం ఆశ్రమం లేకపోతే ఆమె బ్రతకటమే అనవసరం. తనబ్రతుకు కోసమే ఆశ్రమాన్ని సృష్టించింది దానివల్ల నలుగురికీ మేలు జరుగుతున్నదనుకొంటున్నది ఆశ్రమంకోసం ఏమైనా చేయాలి ఇప్పుడు మల్లయ్యకు ఈపని చేసి పెడితే ఈ నాలుగు వందలూ వస్తాయి అంతకన్నా మరొక విశేషం ఉన్నది డాక్టరు చిన్నా పెద్దా తారతమ్యం చూడకుండా తన్ను ఆవాళ అలా అడిగిపోయాడు. అతనికి తనసంగతి ఏమిటో రుచి చూపటం అవసరం వాసుదేవశాస్త్రి పుల్లయ్యప్రాపకం కోసం పంతుల్ని తన ఇంట్లో తీసుకువచ్చి పెట్టాడు. లేకపోతే అతన్నే ఇంట్లో ఎందుకు పెట్టుకోవాలి; ఊళ్ళో ఎందరి ఇళ్ళు కాలిపోలేదు? వాళ్ళందర్ని రమ్మన్నాడా? పోనీ, సహాయం చేశాడా? లేదు కేవలం పుల్లయ్య ప్రాపకంకోసమే చేశాడు. అతనికి పుల్లయ్యప్రాపకం సంపాయించవలసిన అవసరంకూడా ఉంది. రాజీ కుదురుద్దామని పోతే చంద్రశేఖరం తిక్క చక్కగా కుదిర్చాడు ఆ కోపం తీర్చుకోటానికి పుల్లయ్యనం దువ్వుతున్నాడు. పుల్లయ్యకొడుకును పోలీసులకు పట్టిస్తే డాక్టరుకు తలగొట్టినట్లవుతుంది మళ్ళీ పిలిపిత్తిరికాయలాగా తనవద్ద ఎగరడు.

ఆమె ఇంకా లోతుగా ఆలోచించింది ఈ పనివల్ల ఇంకా ఎక్కువలాభం ఉండటానికి వీలవుతుందేమోనని చూచింది కవి ఒక సన్నివేశంనుంచి ఎంతవరకు రసం పిండటానికి వీలవుతుందో అంతవరకు పిండాలని చూస్తాడు ఆమెకూడ ఆ దృష్టితోనే చూచింది. పుల్లయ్యవద్ద కూడా డబ్బు గుంజటానికి తీసుకోవలసిన చర్యలన్నీ తీసుకొని నేరుగా పుల్లయ్య ఇంటి వద్దకు వెళ్ళింది

అతడు ప్రయాణసన్నాహంలో ఉన్నాడు "ఎక్కడికో బయలుదేరుతున్నట్లున్నదే!" అంటూ ఆమె కుర్చీలో కూర్చున్నది "రేపేకదా విచారణ, అందుకని బయలుదేరుతున్నాను."

"అన్నట్లు అసలుసంగతే మరచిపోయాను. రామారావు వచ్చాడటగా"

పుల్లయ్య కొంత ఉలిక్కిపడి ఆ సంగతి బయటికి కనపడనీయకుండా "ఎవరన్నారు?" అని అడిగాడు

"ఊరన్న తరువాత తెలియకుండా ఉంటుందా?"

"ఎందుకు తెలియదులే వాడితో పని ఏమిటి?"

"ఆఁ ఏమీలేదు రెండేళ్ళక్రిందట ఎప్పుడో వచ్చాడా – ఒకసారి చూచిపోదామని."

"వాణ్ణి చూదామని వచ్చావా? వింతగా ఉన్నదే!"

"వింతేమున్నది? మీవాడు చూస్తుండగా గొప్పవాడై కూర్చున్నాడు. ఎందుకైనా దర్శనంచేసుకోవటం మంచిది కదా!"

"ఏమి చేశాడేమిటి?" తండ్రి కలవరపడుతూ అడిగాడు

"పోలీసువాళ్లగుట్టుమట్లు మనకేం తెలుస్తాయి బాబాయి?"

"నాకు అంతా అయోమయంగా కనిపిస్తున్నది గొప్ప వాడై కూర్చున్నాడన్నావు. పోలీసువాళ్ళగుట్టుమట్లు నా కేం తెలుస్తాయంటున్నావు. చూడగా చూడగా కొంపమీదికి ఏదో తెచ్చినట్లే ఉన్నాడు" 89

"అలాగే కనిపిస్తున్నది"

"వీడు సంవత్సరన్నరగా పట్నంలో తిష్ఠవేసి కొంపంతా గుల్లచేసి చేసినపని ఇదా? ఛీ, నా కడుపున చెడబుట్టాడు, వంశానికీ జాతికీ చీడపురుగైనాడు. మళ్ళీ నలుగురిలో తల యెత్తకుండా చేశాడు ఇలాంటివాళ్ళను ఇంట్లో గడియసేపు ఉండనీను. పోలీసులు ఎప్పుడు వస్తారు? ఇప్పుడే వస్తే యెంత బాగుండును? స్వయంగా పట్టి అప్పగిస్తానే! ఇప్పుడు తప్పితే మళ్ళీ చేతికి చిక్కుతాడా?"

"బహుశా రాత్రికి వస్తారేమో..."

"అయితే మంచిదే నేను దగ్గరుండి పట్టిస్తేనే బాగుండును. కాని అమ్మాయీ! నీ వెరుగనిదేముంది? నేను దగ్గరుండి ఈ పని చేయిస్తే ముసల్ది లబ్బున నాయెదానబడి ఏడుస్తుంది. ఇక బ్రతికినంతకాలం నన్ను సాధిస్తూనే ఉంటుంది. ఇదంతా ఈ వయస్సులో ఎక్కడ పడేది? అందుకని ఇప్పుడే వెళ్లుతాను పైగా రేపు ఎటు తిరిగి కేసు ఉందికదా! పోలీసువాళ్ళను వాళ్లపని వాళ్ళను చేసుకుపొమ్మను అంతకన్నా నేను చేయగలిగింది ఏ మున్నది?"

పుల్లయ్య తన కొడుకును స్వయంగా పట్టి పోలీసులకు అప్పగించటానికికూడా సిద్ధమౌతాడని కలలో కూడా అమ్మాయమ్మగారు ఊహించలేకపోయింది. ఎందుకు దీనికి ఒప్పుకుంటున్నాడో? బహుశః కారణం అర్థంకాలేదేమో? తరువాత తన పీక పట్టుకొంటే ఏమి చేస్తుంది?

---

జి వి కృష్ణరావు

''పోలీసులు రాముడికోసం ఎందుకు తిరుగుతున్నారో తెలుసా?''

''ఎందు కే మున్నది? కమ్యూనిస్టుల్లో చేరి ఇప్పుడ మనూళ్ళో చేస్తున్నట్లే చేస్తున్నాడు కామాలు! పవిత్ర భారతదేశానికి, గాంధీజీ జన్మించిన దేశానికి ఎంత కర్మం పట్టింది? వీళ్ళను రావురావు అంటే పాపం చుట్టుకొంటుంది దైవం, ధర్మం, పాపం, పుణ్యం అంటూ లేనప్పుడు-దోపిడీలు దొంగతనాలు, హత్యలు సాగిస్తూ ఉన్నప్పుడు చూస్తూ ఊరుకోవటం ఎలా? లేదు. లాభం లేదు. కన్నకడుపని చూస్తే రేపు గొంతుమీద కాలువేసి తొక్కుతాడు అమ్మాయి! పట్టుకుపోతే ఎలాగు అన్న విచారం ఈ ఒక్కమాటతో తీరిపోయింది నీకు ఇక సందేహం అవసరం లేదు. మనవాళ్ళువాడే అని జాలిపడవద్దు వీడిని అండ చూచుకొనే వాళ్ళు అలా చెలరేగుతున్నారు. బయట ఉండి ఇలాంటి ఘోరకృత్యాలు చేసేబదులు అక్కడైనా డిటెన్యూగా పడి ఉంటాడు. ఉండనీ. అది మేలుకాదూ? నువ్వే చెప్పు ''

''భారతదేశంలోని తల్లిదండ్రులంతా ఇలా ఉంటే ఎంత బాగుండును? ఇన్ని సమస్యలుంటాయా? జాతి మహోన్నత దశ పొందదా?' అనుకొన్నది అమ్మాయమ్మగారు పుల్లయ్యమీద ఎక్కడలేని గౌరవం కలిగింది

''నువ్వు చెప్పినట్టు డిటెన్యూగా పట్టుకెలితే బాగుండును కాని ఏదో క్రిమినల్ కేసులో ఇరికిస్తారేమోనని అనుమానం బాబాయి! ఆనిక అనుకొని లాభమేమిటి?''

''ఆపి దొంగలంజా! ఇంతకూ డబ్బు తెమ్మంటావు! ఈ సంగతి ఇందాకనే ఏడిస్తే కాకపోయిందా! ఈ కంఠశోష తప్పేదికదా! సరేకానీ, నువ్వొకందుకు అడిగితే నేనొకందుకు ఇస్తున్నాను పానకాలరాయుడు లాగా మింగటానికి కూచున్నావు. ఇప్పుడిచ్చినా రేపు ఇంతకింత కక్కించకపోతే నేను పుల్లయ్యనేనా?'' అనుకొన్నాడు.

''ఈ అయిదు వందలతో సర్ది ఎలాగైనా క్రిమినల్ కేసులో ఇరికించకుండా డిటెన్యూగా మాత్రం పట్టుకెళ్ళేట్టు చూడు.''

''ఈ రోజుల్లో డబ్బుకు విలువలేకుండా పోయింది. పని అవుతుందా అని భయం ''

''మన బుద్ధుల్లో మెతక ఎప్పుడేర్పడిందో అప్పుడే అన్ని విలువలూ పోయాయి ఎలాగైనా కానీ, మళ్ళీ నేను వచ్చేటప్పటికి వాణ్ణి ఇక్కడ లేకుండా మాత్రం పంపించు తరువాత నీయిష్టం.''

అయిదు నోట్లూ చేతిలో వేసుకొని అమ్మాయమ్మ వెళ్ళిపోయింది ఆవిడ అటుపోగానే వస్తున్న ఏడుపు దిగమింగుకుంటూ ఎన్నడూ ఎదుటపడని రంగమ్మ, ''మావయ్యా!'' అంటూ వచ్చింది. పుల్లయ్య బిత్తరపోయాడు. నోటివెంట మాట రాలేదు. చివరికి అడిగాడు:.

''కొంపతీసి గోడవెనక ఉండి అంతా విన్నావా ఏమిటి?'' రంగమ్మ తల ఊపింది

''సరే, ఇంకాయేం? ఊరుకున్నావే? శోకాలు తియ్యి ఊరూ వాడా పోగుచెయ్యి! అబ్బెబ్బె! నీలక్షణం ఏమీ బాగుండలేదు ఇంటికోడలువైన తరువాత ఇప్పుడు ఏడవక పోతే ఎప్పుడు ఏడుస్తావ్? చూచినవాళ్ళయినా ఏమనుకొంటారు? నువ్వు రాగం తియ్యి మీఅత్త శ్రుతి పెడుతుంది లేదంటావా, నువ్వు శ్రుతిపెట్టు, మీఅత్త రాగం తీస్తుంది అంతేకదా వరస!''

ఈ మాటల్తో రంగమ్మ దిమ్మెరపోయింది తన మామతత్త్వం విచిత్రంగా తోచింది జనా మరదిమీద వాత్సల్యం కొలదీ, ''మామయ్యా?'' అని జాలిగా ప్రార్థించింది

''అందుకనే ఆడ పెత్తనం తంబిదొరతనం అన్నారు, ఏమిటే అమ్మాయి నీ ఉద్దేశ్యం? రాముడు నా బిడ్డ కాదా? ఎవరిబిడ్డమీద ఎవరికి ప్రేమలేకుండా పోతుంది? నీకు జగ్గాయిమీద ప్రేమలేకుండా పోయిందీ? ఇక నువ్వు చెప్పవచ్చిం దేమిటి? వాణ్ణి పోలీసులకు పట్టివ్వవద్దనే కదా! ఆ సంగతి నాకు తెలియదంటావా? అనవసరంగా కంగారు పడకు జరుగుతున్నదానిని చూస్తూ ఊరుకో మీ అత్తకు చెప్పేవు? తెలిసిందా?''

పుల్లయ్య చిన్న పెట్టె, చేతికర్ర పుచ్చుకొని ప్రయాణమై వెళ్ళాడు రంగమ్మకు ఇదంతా అయోమయంగా కనిపించింది, తన మామ అలా ఎందుకు చేస్తున్నాడో బోధపడలా అతడు హెచ్చరించినట్లు మెదలకుండా ఊరుకొని మరదిని పోలీసులకు అప్పగించటమేనా? ఇందులో రహస్యమేమి ఉంటుంది? ఒకవేళ రహస్యమే ఉన్నదనుకొన్నా, అతడు తనకు ఎందుకు చెప్పలేదు? నమ్మకం లేకనా? అంతడబ్బు తనవద్ద దాయటానికి పంపిస్తాడే! ఆ మాత్రం నమ్మకంలేదనటానికి ఎలా వీలు? ఆమెకు ఎటూ పాలుపోలా చూస్తూ చూస్తూ మరదిని పోలీసులకు అప్పగించటమా? ఆమె అందుకు సహించలేకపోయింది కొడుకును పిలిచి, ''బాబాయి ఎక్కడున్నా వెదకి వెంటనె పట్టుకురావాలి నేను అర్జెంటుగా రమ్మన్నానని చెప్పి లాక్కురా. తెలిసిందా ఇక్కడున్నట్టు రావాలి'' అని చెప్పి పంపించింది. అతడు అక్కడా యిక్కడా తిరిగి చివరికి డాబాలో కూర్చుని ఉంటే పట్టుకొచ్చాడు



''పిలిపించావు దేనికమ్మా?''

''నువ్వు ఇక్కడనుంచి వెంటనే వెళ్ళిపోవా లబ్బాయి!''

''నువ్వుకూడా అలాగే అంటున్నావా?''

''నువ్వు ఇక్కడ ఉండటం కష్టమని కాదు ఎప్పుడో రెండేళ్ళక్రిందటే వెళ్ళి ఈనాటికి వచ్చావు నిన్నుచూస్తే జగ్గడికికూడా పంచప్రాణాలు లేచివస్తాయి అలాంటప్పుడు నిన్ను వెళ్ళమంటున్నానంటే నీ మంచికోసమే. క్షణంసేపు ఆలస్యం చేశావో మళ్ళీ కళ్ళారచూచే అవకాశం ఉంటుందో లేదో ఎలా చెప్పగలను? ఇంతకుముందే మామయ్య అమ్మాయమ్మగారు మాట్లాడుతుంటే విన్నాను ఇవ్వాళ పోలీసులు నీకోసం వస్తారట మామయ్య వాళ్ళకు అప్పగించుమని చెప్పి మరి వెళ్ళిపోయాడు ఇదంతా ఏమిటో అర్థం కావటంలేదు బాబూ! నువ్వు వెంటనే వెళ్ళిపో.''

''నాన్నే నన్ను పోలీసువాళ్ళకు పట్టిస్తున్నాడా?''

''అవును, అదే అర్థం కావటం లేదు ''

''దీనికిగూడా దిగాడన్నమాట!''

జి వి. కృష్ణరావు

''అంటే?''

''ఏమీలేదు నేను ఇక్కడ లేకపోవటం నాన్నకు అవసరం అందుకోసం నన్ను పట్టిస్తున్నాడు అంతకన్నా ఏమీలేదు.''

''నువ్వేదో అంటున్నావు. మామయ్య ఏమిటో లంటున్నాడు అసలు సంగతేమిటో అర్థం కావటంలేదు ''

''క్షమించు. నీకు నామీద ఉన్న విశ్వాసంలో సగమైనా నేను నీకు చూపించలేకపోవటం ఘోరం, అయినా ఏమి చేస్తాను? ఇప్పుడు చెప్పి ప్రయోజనం లేదు సరే నాసంగతేమిటో తొందరగా తేల్చుకోవాలి. మళ్ళీ వచ్చినప్పుడు అంతా చెబుతా ''

రామారావు గబగబా ఇంటివద్దనుంచి నేరుగా డాక్టరు ఇంటికి వెళ్ళాడు. ఆ ఊళ్ళో అతనికి ఆత్మీయుడు అతడొక్కడే డాక్టరుకుకూడా అతనంటే అభిమానం

''డాక్టర్ సాబ్, డాక్టర్ సాబ్!''

మందులకు వచ్చినవాళ్ళనందర్నీ పంపించివేసి అప్పుడే శాస్త్రి కుర్చీలో నడుంవాల్చాడు.

 కేక వినిపించగానే 'ఎవరది' అని లేచి చూచి ''నువ్వటయ్యా! ఎప్పుడు వచ్చావు? అటు కూర్చో'' అని ప్రక్కన ఉన్న కుర్చీ చూపించాడు.

''రాత్రి వచ్చాను. మీసాయం కావాలి.''

''ఏమిటది?''

''ఇవాళ పోలీసులు నన్ను పట్టుకెళ్ళటానికి వస్తున్నారు ''

''నిన్నా? ఎందుకు? వాళ్ళకేమైనా మతులుపోయాయా?''

''నేను కమ్యూనిస్టునని డిటెన్యూగా పట్టుకెళ్ళిపోతున్నారు. మీ రెలాగైనా పట్టుకుపోకుండా ఆపించాలి ''

''విచిత్రంగా ఉందే? కమ్యూనిస్టువా? ఎలా తేల్చారు?''

''మానాన్నగారు, అమ్మాయమ్మగారు స్పష్టంగా చెబుతూ ఉంటే తేలకపోవటమేముంది? పది పదిహేనురోజులు ఆపిస్తే తరువాత వాళ్లు అండమాన్లకు పంపినా పోతాను.''

''ఇప్పుడు అండమాన్లకు పంపటంలేదు కాబట్టి, పోతానంటావా?''

''సరేగాని ప్రస్తుతం వాళ్ళు పట్టుకెళ్ళకుండా ఉండేమార్గం చూడు ''

''వాళ్ళు పట్టుకెళ్ళే మాటయితే యీ పదిహేను రోజుల తరువాత విడిపించే భారం నాది ''

''ఇంఎపా ఆపించలేనంటావు ''

''నీకు తెలియని దేమిటయ్యా! వాళ్ళధర్మం వాళ్లని చెయ్యకుండా చేయాలంటే ఏ పైరవీ ఉంచమో మరొక అక్రమమార్గమో తొక్కాలిగదా! అలా చెయ్యటం నీ కిష్టమేనా? ఇష్టమంటే చెయ్యను అని చెప్పలేను కాని ఆలోచించవలసి ఉంటుంది ''

''అంతేనా, అన్యాయంగా కొంతమంది వ్యక్తులజీవితాలు విచ్ఛిన్నం కావాలసిందేనా? ఇంతగా ప్రేగులు త్రెంచుకోవటం వ్యర్థమేనా? చూడగా చూడగా పురుషప్రయత్నానికి ఆవల 'విధి' అనేది ఒకటి ఉన్నదేమో ననిపిస్తున్నది డాక్టరుగారూ!''

''అసలు సంగతేమిటో చెప్పక అంగలార్చితే ప్రయోజనమేమిటయ్యా!''

''నింపాదిమీద మీకే తెలుస్తుంది ఇప్పుడు చెప్పటం ఏమంత మంచిదికాదు. నేను భోజనంచేసి పోలీసులు వస్తే ఇక్కడకు రమ్మని చెప్పి వస్తాను. ఇక్కడే ఉంటారుకాదూ?'' అని అడిగి రామారావు ఇంటికి వెళ్ళాడు.

''ఏదో సుడిగుండంలో చిక్కుకొన్నట్లున్నాడు!'' డాక్టరు జాలిపడ్డాడు.



---

జి.వి. కృష్ణరావు

# పందొమ్మిది

వెనుకటికవులు వద్యపాదం పూర్తికాకపోతే ఎలమిన్, ధరిణిన్, చూడన్ అనీ, యతిస్థానంలో అయితే దీవ్యత్, ఝంఝత్ స్ఫాయత్ వగైరాలు వాడుతూ ఉండేవారు నేడు రాజకీయ నాయకులు సాంఘిక సమస్యలను పరిష్కరించ లేకపోయినప్పుడు ఆర్డినెన్సులు, అరెస్టులు, లాటీచార్జీలు, నిర్బంధాలు ప్రయోగిస్తున్నారు రెండూ అసమర్థతనే వ్యక్తంచేస్తాయి కళాధర్మాన్ని బట్టి మొదటిది, జీవితధర్మాన్నిబట్టి రెండవది దూష్యం విజ్ఞులకు రెండూ సహించరానివే ఐతే రెండోది మాత్రం మరీ దుర్భరం ఎందుకంటే మొదటిదాన్నుంచి తప్పించుకోవచ్చు ఇష్టంలేనప్పుడు పుస్తకాన్ని విసురు పుచ్చుకొని అవతల పారేస్తాము. రెండోది అలా కాదు ఇష్టంకాని ప్రభుత్వాన్ని వదల్చుకోవటం ప్రాణాంతకమే కాని మరొకటి కాదు అయితే ప్రజాస్వామిక దేశాల్లో ఇష్టంకాని ప్రభుత్వాలను వదలించుకోవచ్చును గదా అనిపించవచ్చును కాని ఇటీవలి చరిత్ర చూస్తే అదంతా దుర్భ్రమలాగా కనిపిస్తున్నది

94

అనుకొన్నట్టుగా రామారావుకోసం పోలీసులు వచ్చారు. అప్పుడు అతడు డాక్టరు ఇంటివద్దనే ఉన్నాడు తాను ఇంటికి పోతే ఏడుపులు మొత్తుకోళ్ళు ప్రారంభమౌతాయి ఈ మేళంకూడా దేనికి? తనపెట్టె ఇంటివద్దనుంచి తెప్పించి పెడితే ఇక్కడనుంచి వెళ్ళిపోతానని డాక్టరును కోరాడు అతడు పంతులు పెద్దకొడుకును పంపి పెట్టె తెప్పించాడు పోలీసులు తొందరచేసి రామారావును కారులో ఎక్కించుకొన్నారు రామారావు ఏమీ చెప్పలేదు డాక్టరు అంతకన్నా అడగలేకపోయాడు తీరా కారు వెళ్ళబోతూ ఉండగా ''మీ నాన్నగారికి ఏమీ చెప్పమంటావయ్యా?'' అన్నాడు ''ఆఁ, ఏమున్నది చెప్పటానికి? ఈసారి ఏదో ఒక పదవి ఖాయమని చెప్పండి'' అన్నాడు రామరావు అతని గొంతులో అణుమాత్రం కంపమైనా కనిపించలేదు డాక్టరు విస్తుపోయాడు. కారు దుమ్ము రేపుకొంటూ పోయింది

పోలీసువాళ్ళు వెళ్ళిపోయేటంతవరకూ డాక్టరు ఉత్సాహంగానే ఉన్నాడు. వారి కారు వెళ్ళిపోయిందో లేదో, అతనికి లోకమంతా నిష్పచ్చరంగా కనిపించింది అతనికి అప్పుడు దిగులు ఎందుకు కలుగుతున్నదో అర్థం కాలేదు మనస్సు పిచ్చెత్తినట్లయి ఆ చీకట్లోనే బజారున పడ్డాడు ఊళ్ళో నాలుగుబజార్లు తిరిగాడు అక్కడనుంచి ఊరి పొలిమేరదాక రోడ్డునబడి పోయాడు అక్కడికిపోయినతరువాత తాను ఎందుకు బయలుదేరినట్లు, ఎక్కడికి బయలుదేరినట్లు అన్న ప్రశ్న తొలకరించింది. వెంటనే తిరుగుముఖమై ఇంటికి వచ్చాడు అప్పటికి ఊరంతా గాఢనిద్రలో మునిగి ఉంది రోజూ రాత్రి తనయింటివద్ద వీధిఅరుగుమీద ముసుగు పెట్టుకొని కూర్చుని ఉండే పోలయ్య కనిపించలా. ఎందుకు రాలేదబ్బా! బద్ధకించేవాడు కాదే! వాణ్ణికూడా పోలీసులు పట్టుకుపోయారా?

అలా జరిగి ఉండదు ఇంటివద్ద ఏమైనా ఇబ్బంది వచ్చిందేమో? పాపం చూసి వస్తాను. ఒకవేళ బద్ధకించి పండుకొన్నాడేమో! నేను పోయి అనవసరంగా లేవగొట్టటమౌతుంది. అది కాదు. ఊళ్ళో ప్రముఖులంతా బస్తీకి దయచేసిన సంగతి కనిపెట్టాడు ఇక ఇబ్బంది ఉండదులే అన్న ఉద్దేశంతోనే వాడు రాలేదు ''

అతనికి అరుగుమీద వేసిఉన్న పక్క కనిపించింది కాళ్ళు కడుక్కోకుండా పండుకోవటమెలా? నిద్రపోయేవాళ్ళను లేపాలి ఎందుకు వచ్చిన తిప్పలులే అని పోయి పక్కమీద కూర్చోగానే దిండుకూ గోడకూ మధ్య వీధిలో వాళ్ళకు కనిపించకుండా తన వెండిమర చెంబులో నీళ్లు పెట్టి ఉన్నాయి అంత శ్రద్ధ చూపించినందుకు అతనికి తెలియని సంతృప్తి కలిగింది. కాళ్ళు కడుక్కొని, మంచినీళ్ళు త్రాగి ప్రక్కమీద నడుం వాల్చాడు

ఆకాశంలో చంద్రుడు మసకమసకగా కనిపిస్తున్నాడు చుట్టూ మేఘాలు మూగుతున్నాయి. చుక్కలు మాటుపడిపోతున్నాయి అది అంతా తన జీవితంలాగానే కనిపించింది. తాను ఇన్నేళ్లనుంచి ఏమి చేశాడు? వైద్యం చదివాడు జైళ్ళకు వెళ్ళాడు మళ్ళీ పెళ్లి మానుకొన్నాడు. మందులిస్తున్నాడు. ఈ కృషి అంతా దేనికి? ఇలాంటి సామాజిక వ్యవస్థను ఏర్పరచటానికేనా తానింత ప్రయాసపడ్డది? ఈ ప్రభుత్వాలతో తనపని తానుచేసుకొనిపోవటానికి ఏమి అవకాశమున్నది? అన్నెము పున్నెము తెలియని రామారావునే పట్టుకుపోయారే అతడు ఏమి చేశాడు? నీతి, నియమం, సమాజ అభ్యుదయం వీటికోసమే కదా అతడూ పాటుపడుతున్నది అతన్ని పట్టుకొనిపోయిన వాళ్ళు తన్ను ఎందుకు పట్టుకుపోరు? తన్ను పట్టుకుపోవటానికి వీలులేదు. తాను రాజకీయబాధితుడు. పదవులలో ఉన్నవాళ్ళంతా తన సహచరులే పైగా పట్టుకువెళ్ళటానికి కారణం చూపించాలిగదా! ఏమి కారణం చూపిస్తారు? పిచ్చి డాక్టరు బాబు! చాలా అపోహపడుతున్నావు. నీకేమి కొమ్ములు తిరగలేదు. నీచేతిలో ఎన్ని ఓట్లున్నయ్యో చెప్పు లేదా యెంత డబ్బున్నదో చెప్పు. నీమాట వినేవాడే ఉంటే ఈ ఊళ్ళో ఇంత అరాజకత్వం ఎందుకు ప్రబలుతుంది? నీమాట వినటానికి చెవులు తెగినవాడు ఒకడుకూడా లేడు. పెళ్ళి చేసుకొని ఉన్నట్లయితే కనీసం పెళ్ళాం ఓటైనా ఒకటి ఉండేది బ్రహ్మచారివి కాబట్టి అదికూడా లేదు. డబ్బుసంగతి సరేసరి నీమందుసీసాలన్నీ తిప్పి తిప్పి అమ్మితే యెంత వస్తుందంటా! అంతేనా? పరపతి లేదా? ఏదీ పరపతి? నిర్బంధం కనీసం ఈ పదిరోజులన్నా ఆపించమని రామారావు కాళ్ళావేళ్లాబడి ప్రార్థిస్తే ఏమి చేయగలిగావు? అతడు మంచివాడని తెలుసు. తప్పుచేయలేదని తెలుసు. పదిహేను రోజులైన తర్వాత గట్టిగా మాటప్రకారం అప్పగించవచ్చునవీ తెలుసు అయినా ఏమీ చేయలేక చూస్తూ ఊరుకొన్నావు అంత సత్తా ఉంటే ఇప్పుడైనా మించిపోయినదేమున్నది? అతన్ని పోయి విడిపించు ఎందుకు డాక్టరుబాబు ఈ భ్రమ! నీవల్ల ఏమీ కాదు నీఅంత అసమర్థుడు మరొకడు ఉండనూ ఉండడు నీధర్మం, నీ సిద్ధాంతం దేనికి? నాలుక గీసుకోనుకూడ పనికిరావు చేతనైతే అధికారంతో డబ్బు గాని, డబ్బుతో అధికారంగాని సంపాదించు అప్పుడే ఏమన్నా జీవితం చరితార్థం కావటానికి వీలు చిక్కుతుంది. అంతకుతప్ప

మరేమీ మార్గం లేదు అంతేనా? నావృత్తినిర్వహణలో నాకు ఆత్మసంతృప్తి లేదా? చరితార్థత లేదా? పొరపాటు ఒక్క ప్రాణాన్ని రక్షిస్తే, ఒక గడ్డురోగాన్ని నయంచేస్తే, ఇందులో గొప్పతనం ఆనందం లేదంటావు ఈ అధికారం, డబ్బుఉన్నవాళ్ళకు అది లభిస్తుందా? కల్ల ముమ్మాటికీ కల్ల

''డాక్టరుసాబ్! ఇది హృదయపూర్వకంగా చెబుతున్న మాటేనా? ఇంతకాలంనుంచి ఎన్ని పైసల ఆనందం అనుభవించావో చెప్పు నీకు చుట్టుపట్ల కనిపించే సంకుచితబుద్ధులు, దరిద్రులు, గతానుగతికంగా మార్పులేక దుర్భరంగా సాగిపోతున్నరోజులు ఆనంద మిస్తున్నవి కదూ! రోజూ వచ్చే కేసులు ఆ తలనొప్పి, కడుపునొప్పి, దగ్గు, జ్వరం, విరేచనాలు, అంతేకదా! కాక మరేమన్నా ఉన్నదా? ఈ నరకకూపంలో నుంచి ఎప్పుడు బయటపడదామా అని లోలోన బాధపడటం లేదా? ఎందుకు ఆత్మవంచన చేసుకుంటా?

''యూ ఇడియట్!''

నేను చెప్పింది నిజమేనన్నమాట లేకపోతే అంతకోపం రావలసిన అవసరం లేదే!

డాక్టరు ఆవులించి ప్రక్కకు ఒత్తిగిల్లాడు.. తనకేమిటి తగలుతున్నది! మెత్తగా ఉన్నదే ఏమీలేదు ఏదో కలగంటున్నాడు ఛా, కలగాదు ఊర్పులు చెంపకు తాకుతున్నాయి తనరొమ్ము పీడితమౌతూ ఉంది



కాసేపుకునికింతరువాత మెలకువ వచ్చింది వాస్తవప్రపంచంలో పడ్డాడు ఏమిటి ఇదంతా? నిజమే! ఛా, కాదు. అంతా వట్టిది. తాను యోచించినది, తాకినది, అనుభవించినది అంతావట్టిది కేవలం కలగన్నాడు అంతే! కాని ఆడది, అందులో అతని భార్య అలా చేస్తుందా? అసంభవం. తాను నిజంగా కలే కన్నాడు నిజంగా ఫ్రాయిడియన్ ఎనాలిసిస్ సరిపోతూనే ఉంది ఆమె అందమైన దనటంలో సందేహం లేదుకదా! అతనిపట్ల ఉన్న స్నేహంవల్ల ఆమె అందమైన దన్న సంగతే మనస్సులోకి రాకుండా చేశాడు నిగూఢంగా ఉన్న ఆ కోరికనే ఇప్పుడు ఈ కల రూపంతో తీర్చుకొన్నాడు అయితే అతని ప్రస్తావనన్నా నిన్న పగలు వచ్చి ఉండాలి. అదికూడా వచ్చినట్లే ఉంది కాబట్టి ఇది కేవలం కల అంతకుతప్పు మరేమీలేదు ఆమె అలాంటిది కాదు. తాను అలాంటివాడూ కాడు. అయితే మరి అతని వ్యాధిసంగతి ఏమిటి? ఆ సంగతి స్పష్టంగా ఆమెనోట విన్నట్లుందే కల అయితే ఇది ఎలా సంభవం? అనుమానించవలసివస్తున్నది అది తనమనస్సు కల్పించిందే ఎందుకు కాగూడదు? కేవలం కల్పనే అయితే అతనికి ఆ వ్యాధి ఉండగూడదు ఆ వ్యాధి ఉంటే కల కాదు, కలకాదని నిర్ధారణగా ఎలా చెబుతాడు? కలలోని విషయాలు, యధార్థసంఘటనలు యాదృచ్ఛికంగా ఒకటి కారాదని నియమమేమున్నది? ఏది ఎలా ఉన్నా వ్యాధి ఉంటే అనుమానించవలసిందే అయినా తేలుతుందిగదా! మళ్ళీ నిద్ర పట్టింది

తెల్లవారింది మామూలుగా పెందలాడే లేచే డాక్టరు ఆ ఉదయాన ఇంకా నిద్రపోతున్నాడు ఎద్మ అరుగులు ఊడవటానికి వచ్చింది ''ఒరే లచ్చాయి! డాక్టరుగార్ని లెమ్మనురా ప్రొద్దెక్కుతూ ఉంది'' అని అంటూ ఉండగానే అతనికి మెలకువ వచ్చి లేచాడు కళ్ళ నిద్రమత్తు వదలలేదు

''డాక్టరుగారికి రాత్రి సరిగా నిద్ర లేనట్లుంది ప్రక్క తీసుకు వెళ్ళి లోన వెయ్యి

పిల్లవాడు పక్క లోనకు తీసుకువెళ్ళాడు డాక్టరు క్రీగంట పద్మను చూచాడు వాకిలిలోపల ఓరగా నిలబడి తలవంచుకొన్నది లతడు బద్దకంగా లోపలికి వెళ్ళి పండుకొన్నాడు. మెలకువ వస్తూనే ఉన్నది కాని లేవటానికి బుద్ధి పుట్టక ముసుగుతన్ని అలాగే పడుకొన్నాడు.

గడియారం టంగుటంగున ఎనిమిదిగంటలు కొట్టింది ఎవరో నలుగురైదుగురు మందుకొస్తే సత్యనారాయణ పెద్ద కొడుకు ''డాక్టరుగారికి సుస్తీగా ఉన్నట్లుంది లేవలేదు సాయంకాలం రండి'' అని పంపించివేశాడు ఆ మాటలు శాస్త్రికి వినపిస్తూనే ఉన్నవి. అతడు కదలకుండా అలాగే పడుకొన్నాడు ''కాఫీ తయారవుతున్నది లేచి మొఖం కడుక్కోమని చెప్పరా'' అని పద్మ కొడుకును హెచ్చరించింది ''ఇవాళ తొందరగా స్కూలుకు వెళ్ళాలి నాకు అన్నం పెట్టు'' అన్నాడు కుర్రాడు. ''డాక్టరు గారిని లేపిరా. ఈలోగా వడ్డిస్తాను '' డాక్టరుగారూ! మీరు లేవాలి తప్పదు లేకపోతే మా అమ్మ నాకు అన్నం పెట్టేటట్లు లేదు'' అంటూ డాక్టరును హెచ్చరించి వెళ్ళాడు.

శాస్త్రి ముఖంకడుక్కొని వచ్చి కుర్చీలో కూర్చుని దగ్గర టేబులుమీద ఆవిరికొడుతున్న కాఫీ కప్పును అలాగే చూస్తూ ఉన్నాడు కుర్రాడు భోజనంచేసి పుస్తకాలు పట్టుకొని వచ్చాడు

''ఏమిటండి డాక్టరుగారూ! కాఫీకప్పువంక అలా చూస్తున్నారు?''

''ఆ ఏమీలేదు రాత్రికల్లో కనిపించిన కప్పు ఇదేనా అని ''

''ఏమిటిరా అది?'' అప్పుడే వచ్చి తలుపువద్ద నిలబడ్డ పద్మ అడిగింది.

''రాత్రి డాక్టరుగారికి కల్లో కాఫీకప్పు కనిపించిందంట!''

''కనిపిస్తే?''

''అది ఇదేనా- అని డాక్టరుగారు ఆలోచిస్తున్నారు. ఈ కప్పు రాత్రి అంతా అలమరలో ఉంటే మీకలలోకి ఎలా వచ్చింది?''

''అదేరా నేనూ ఆలోచిస్తున్నది ''

''నీ తెలివి తెల్లారినట్లే ఉందిగాని బడికిపో.''

''ఉండవే! మీకు ఎలాంటి కప్పు కనిపించింది?''

''చక్కగా కుదిరిగ్గా వెచ్చగా ఉంది దానినిండా కాఫీ. ఆ కాఫీతో చరచర నానోటిదగ్గరకు వచ్చి 'తాగుతావా లేదా?' అని కూర్చున్నది ''

''గమ్మత్తుగా ఉందే! వస్తే ఏమి చేశారు?''

''పో! నువ్వు ఇక్కడకు రావద్దు ఎవరో శ్రమపడి దాచుకొంటే వాళ్ళని కాదని నావద్దకు వస్తావేమిటి? అని అవతలకు నెట్టా.''

''నెట్టితే కప్పు క్రిందబడి ఎప్పలు కాలా?''

''లేదురా, నెట్టినకొందికి ఎచ్చి మీద పడ్డది నాకు కోపం వచ్చి దబీదబీ క్రింద వేసిపాదాను పాదినా వదల్లేదు సరిగదా - ఆ కాఫీ అన్నీ నాచేత త్రాగించింది ''

జి వి కృష్ణరావు

''కాఫీయే కదా త్రాగడానికి మీకు అంత శ్రమ దేనికి?''

''కాఫీకి హోమ్యోపతికి చుక్కఎదుర్రా, ఎట్లా తాగేది?''

''కల్లోకూడా పడదా?''

''ఏమాత్రం పడదు ''

''నువ్వు స్కూలుకు పో పడకపోతే విరుగుడు వేసుకుంటారులే!'' పద్మ కుర్రవాణ్ణి కసరింది కుర్రవాడు స్కూలుకు పరుగెత్తాడు.

''నిజంగా కల వచ్చిందా, లేదా అని సందేహం!'' డాక్టరు ఆమెవంక జాగ్రత్తగా చూస్తూ అన్నాడు

''మీకు కల వచ్చిందో లేదో నా కెలా తెలుస్తుంది?'' అని చురచుర అతనివంక చూచి వెళ్ళిపోయింది.

డాక్టరు ఆచూపుతో అదిరిపోయాడు కాసేపటికి రొమ్ము కుంపటి తొలగినట్లయి నిట్టూర్చాడు దగ్గరున్న కాఫీకప్పు అందుకొని త్రాగుతూ, ''అంతే కల వట్టి కల!'' అనుకొన్నాడు

నాడు తొమ్మిదిగింటలకే పుల్లయ్య కోర్టుకు బయలుదేరాడు. తాను చెప్పవలసినదంతా ప్లీడరుగారివద్ద క్రిందటి సాయంకాలమే పారం చెప్పుకొన్నాడు ఇప్పుడు భయంలేదు. కాని విచారణ ఎప్పుడు ప్రారంభమౌతుందా అన్న తహతహలు మాత్రం హెచ్చాయి. ''వీడి తస్సాదియ్యా! ఈ పీనుగుల మల్లయ్యకూడా ఇక్కడే తగలడ్డాడే! ఈకేసు తనదికదా! తనకన్నా ముందు తగల్డాడు. వీడిపెద్దలు ఏమి చెరబోయారని? ఎప్పుడు శవం పారేస్తారా, ఎప్పుడు పీక్కుతిందామా అని రాబందులు పాట్లో చెట్లవద్ద కాపేసుకు కూర్చుంటాయి అవే వీళ్ళకన్నా నయం ''

''ఏమి మామా, హడావుడిగా వెళ్ళుతున్నావు కోర్టు వద్దకేనా?''

''ఎన్ని గుండెలతో పలకరిస్తున్నాడో చూడు? ఆ నవ్వంతా విషమే కదా! నిలువెల్లా విషమైతే నవ్వు విషంకాక ఏమౌతుంది? సిగ్గు లజ్జాభిమానాలు విడిస్తేసరి.'' అనుకొని, ''ఎప్పుడొచ్చావు?'' అని అడిగాడు

''పొద్దున్నేనే. ఎడ్లకు ఉలవలు లేవు కొందామని వచ్చా, తీరా ఇక్కడకు వచ్చింతరువాత మీకేసు విచారణ అని తెలిసింది. వచ్చినవాళ్ళం ఎటులిరిగీ వచ్చామనుకుందా, కాస్త వినిపోదామని బయలుదేరాను '' 

''సరే కాఫీనీళ్లు త్రాగిపోదాము రా ''

''ఇంతకుముందే త్రాగాను ''

''ఏం ఫరవాలేదు బెట్టుసరి పోక, రా అల్లుణ్ణి మర్యాద చేయకపోతే రేపటినుంచి ఊళ్ళో టమటమా వెయ్యవూ?''

పుల్లయ్య, మల్లయ్య చెయ్యిపట్టుకొని ప్రక్కనే ఉన్న కాఫీహోటలులోకి వెళ్ళి పెసరట్లకు ఆర్డరిచ్చాడు మల్లయ్యకు ముసలాడిముఖంలో ఉత్సాహం కనిపించింది ''మనస్సు ఎలాగైనా కాస్త చెరిస్తేకాని కోర్టులో తబ్బిబ్బు పడదు. ఏమిచేస్తే మనస్సు చికాకుపడుతుంది?'' మల్లయ్య మనస్సు శరవేగంతో ఆలోచించింది

''అయితే మామా, విన్నావా సంగతి? అయినా నీకు తెలియకుండా ఉంటుందటలే. నిన్నా ఇవ్వాళ మనూరివాళ్లు ఎంతమంది రాలేదు!'' మల్లయ్య శల్యసార్థ్యం మొదలు పెట్టాడు.

''ఏమిటదీ! నిన్నా ఇవ్వాళలోగా ఏమి జరిగిందేమిటి? నాకు తెలియలేదే, ఎవడికొంపకన్నా నిప్పు పెట్టారా ఏమిటి?''

''ఇంతకూ తెలియదన్నమాట! నిన్న పోలీసులు వచ్చి మీవాణ్ణే పట్టుకెళ్ళారు. డాక్టరు ఇంటివద్ద మాట్లాడుతుంటే ఉన్నవాణ్ణి ఉన్నట్లే పట్టుకెళ్ళారు గుడ్డలు తెచ్చుకుంటానంటే

వీలులేదన్నారు పంతులుకొడుకును పంపించి డాక్టరు పెట్టె తెప్పించి ఇచ్చాడట అపర్ణ తుర్రున కారులో ఎక్కించుకు వెళ్ళారు రాత్రి మాయింట ఎసరే పెట్టలేదు "బాబాయ్, బాబాయ్!" అని మనుమడు ఒకటే ఏడుపట ఇక మా అత్త సంగతి చెప్పనే అక్కరలేదు తెల్లవారైనా లేచిందో లేదో?" అట్లు వచ్చాయి ప్లయ్య మాట్లాడలేదు మల్లయ్య ప్లేటు దగ్గరకు లాక్కొని ముక్కతుంచి నోట్లో పెట్టుకొంటూ –

"పోలీసువాళ్ళపని బొత్తిగా అన్యాయంగా ఉంది మామా! రామారావును పట్టుకెళ్ళారంటే ఏమనాలి? వాడు ఒకడిజోలికి వచ్చేవాడా, పెట్టేవాడా? తన చదువేమో, తానేమో! అంత మంచివాడు, అంత చదువుకొన్నవాడు ఈ చుట్టుప్రక్క గ్రామాల్లోనే లేడని డాక్టరుగారు అంటాడు వాడు ఏమి కానిపని చేశాడు? ఇళ్ళు, వాములు తగలబెట్టాడా? అలాంటి పనులు చేసినవాళ్ళంతా మహారాజుల్లాగా తిరుగుతున్నారు వాళ్లనేమీ చేయలేరు నోట్లో నాలుకలేనివాళ్ళను పట్టుకు పోతున్నారు ఇవ్వాళ వాణ్ణి పట్టుకుపోయినవాళ్లు రేపు మనలను పట్టుకపోరని నమ్మక మేమిటి మామా!"

"వాడికర్మ అలా ఉంది! అందరికర్మ అలాగే ఎందుకుంటుంది? ఐనా అందర్నీ పట్టుకుపోయి వాళ్ళుమాత్రం ఏమి చేస్తారు? లేదు నేను మొదటినుంచీ మొత్తుకొంటూనే ఉన్నా, "ఒరే మన కీ పనులు లాకీ కాదురా! చెట్టుకొట్టి మీద ఎందుకు వేసుకుంటావు? ఒక మూల కూచోరా, నిన్ను అడిగే వాళ్లుండరు' అన్నా వింటేనా? చేతులార తెచ్చుకొన్నాడు చేసుకొన్నవాళ్ళకు చేసుకొన్నంత మహదేవ, మనమేమి చేస్తాము?"

"అదేమిటి మామా! నువ్వుకూడా అలా మాట్లాడితే? ఎంత లేదన్నా కన్నకడుపు గదా! ఇవ్వాళ తెగ్గోసుకొంటే పోతుందా!"

"వాడు నాబిడ్డే అయితే అలా ఎందుకు చేస్తాడు? వట్టి భ్రమ. వాడు కొడుకూ కాదు, నేను తండ్రినీ కాను, నాకడుపున పుట్టినవాడే అయితే ఇళ్లూ వాకిళ్లూ తగలబెట్టి, లూటీలు, హత్యలు సాగించే కమ్యూనిస్టులతో ఎందుకు చేరుతాడు? వంశాన్ని, జాతిని ఎందుకు లప్రతిష్ఠపాలు చేస్తాడు?"

"ఏదో కుర్రతనం. ఎరక్క ఏదో చేశాడే అనుకో, అంత మాత్రాన నువ్వుకూడా అధికార్లలాగా కోపగించుకొంటే ఎలాగ చెప్పు? ఏదో చెప్పి సర్దుకుపోవాలిగాని."

"సర్దుకుపోవటమా? కల్ల, ముమ్మాటికి కల్ల. ఏ ముఖం పెట్టుకొని నాయకులదగ్గరకు పోయేది! నువ్వుకూడా సిఫార్సుకు వచ్చావా అంటే ప్రాణాలు ఏమవుతాయి? అనుభవించవలసిందేదో అనుభవిస్తాడు. తినే ఋణం, చూచే ఋణం ఉంటే తిరిగివస్తాడు. లేకపోతే అంతటితోనే పోతాడు చెట్టులాగా పెరిగి, చేతికి అక్కరకు వచ్చిన పెద్దవాణ్ణి దేవుడు ఎత్తుకుపోతే ఏమి చేశాను? ఇదీ అంతేననుకుంటా అనుకోక చేసే దేమున్నది? ఈశ్వరేచ్ఛ ఎలా ఉందో అలాగే జరుగుతుంది మానవుడు చేయగలిగినది ఏముంది?"

కాఫీ ముగించి ఇద్దరూ కోర్టువైపు బయలుదేరారు వేదాంతం చెబుతున్నాడే ఏమిట్రా విశేషం? "ఓరి వెధవా! నేను పిల్చింపాను ఇప్పటికైనా నా సంగతి తెలిసింపా అనుకొంటావు దేనికి?

ఇదరంతా నీ ప్రతాపమే?'' అని వెక్కిరింపా? నేను పట్టించానని ఎలా తెలుస్తుంది? పరమాపపుల క్కూడా తెలియటానికి వీల్లేదు అనుమానించటానికైనా అవకాశం ఎక్కడ? లప్పే లేదు. అనుమానించటానికైనా అవకాశం ఎక్కడ? అప్పే లేదు నానీడను చూచి నేను ఉలిక్కి పడుతున్నాను. ఇంతకు తన అంతుమాత్రం చిక్కనిచ్చాడు కాడు అబ్బబ్బ! యీ ముసలాడు అంత తేలిక అయితే ఊరంతా ఒక కొలికికి తెస్తాడా? కాని ఎప్పుడో ఒకప్పుడు చిక్కకపోతాడా'' అనుకొంటూ మల్లయ్య వెనకనడిచాడు.

''మామా! చూచావా! అడుగో నీ ప్రత్యర్థి చంద్రశేఖరం ప్రతిఅంతా అమ్ముడు పోయింది. ముఖం పీక్కుపోయింది నడుము వంగబడ్డది ముసలాడి తడాఖా అంటే ఏమిటో రుచి చూపిస్తున్నావు ''

''నేను చేసిందేమిటిరా? పైన ఈశ్వరుడు లేడా? క్రింద ధర్మం లేదా? ఎవడి అన్యాయం వాణ్ణే బెడిసికొడుతుంది, అంతేకాని మనవల్ల అయ్యేపనులేమున్నాయి?''

పుల్లయ్య మాట్లాడకుండా పోయి కోర్టువరండాలో ఒక ప్రక్కన కూర్చున్నాడు. అమ్మాయమ్మగారుకూడా అక్కడ ప్రత్యక్షమైంది ''తప్పంతా చంద్రశేఖరానిదే శిక్షపడకతప్పదు. పడినప్పుడు లతనికుటుంబానికి ఎలా తోడ్పడాలి?'' అని ఆలోచిస్తూ ఉంది. ఆమెది నిజంగా 101
జాలిగుండె అందుకనేగా ఆశ్రమం పెట్టి నడుపుతున్నది. అలాంటివాళ్ళకు తోడ్పడకపోతే తన ఆశ్రమం దేనికి? శేఖరం ఇలాంటి తప్పుడు పని ఎందుకు చేశాడు? తండ్రిమట్టుకు తండ్రి లోకుల్ని కొట్టి ఆస్తి ప్రోగుచేయలేదా? ఆ చెడుబాకీ గుణాలే కొడుక్కు సంక్రమించాయి. అంతెకిన్నా మరేమున్నది? ఎలాగైనా అతనికుటుంబానికి తోడ్పడాలి. ఎలా తోడ్పడటం? పిల్లల్లో ఒకర్ని దగ్గరకుతీసి పెంచటం ఉత్తమం మరి వాడికి తండ్రి గుణాలు సంక్రమిస్తేనో? అమ్మాయమ్మగారికి ఆ ఆలోచనే తోచలేదు. అవును, ఆమె తప్పేముంది? ఇష్టంలేని విషయాలను మరచిపోవటానికి యత్నిస్తాము

ఇంతలోనే కోర్టు పుల్లయ్యను పిలిచింది శేఖరం, అమ్మాయమ్మగారు, మల్లయ్య లోపలికి వెళ్ళారు పుల్లయ్య గుండెలు దడదడకొట్టుకొన్నాయి. తాను 'చంద్రశేఖరానికి ఎన్నడూ ఏ విషయంలోనూ హామీయిస్తూ ఎలాంటి పత్రం మీద సంతకం చేసి ఎరుగను! అని పచ్చిఅబద్ధం చెప్పాలి ''ఇప్పటికైనా మించిపోయింది లేదు నీవు పిల్లలుగలవాడివి. ఎందుకు అన్యాయానికి ఒడిగడుతా ఇక్కడినుంచి ఇటే తిరిగిపో చుట్టుపట్ల ఎరిగిన వాళ్ళుకూడా ఎవరూ లేరు నీతి, ప్రతిష్ఠ కాపాడుకో నీ ఊరిని ఉరాచకం చెయ్యకు ఎందుకు శాపనార్థాలు పెట్టించుకొంటూ? బ్రతికిన నాలుగురోజులైనా సరిగ్గా బ్రతకాలి. ఇక్కడే ఎల్లకాలం ఉట్టిగట్టుకొని వ్రేలాడవు. ఎప్పుడ్ నిజంగా మంచివాడివి ఇంతవరకూ నువ్వు ఎవడికీ అపకారం చేసి ఎరగవు. ఆఖ్ని తీరిన ఈ వయస్సులో ఈ నరక కూపంలో ఎందుకు పడటం? అదుగో నీకాళ్ళు వెనక్కడుగులూనే ఉంచి.

---

జి వి. కృష్ణరావు

నువ్వు డబ్బో నలుగురిలాంటి మర్యాదస్థుడివి కావు ఇప్పుడు ఈ పనిచేశావా పుల్లయ్యవనా, నీకు-
తేవా ఏమి ఉంటుంది? నీ ఐదువేలు నష్టార్జితమే – కాదని యెవరంటారు? కాని సమయం వచ్చి
పోయింది. ఇంతవరకు వ్యాపారంలో అలాంటి అయిదువేలు ఎన్ని అవతల పారేయలేదు?
పుల్లయ్యా! ఇప్పటికైనా మించిపోలేదు. వెనక్కు తిరిగిపో'' అని అంతరాత్మ మొత్తుకొన్నది.
''ఆయితే సత్రం ఆస్తి కాజేశావా? పుల్లయ్యవామి తగలవెట్టించావా? శేఖరంమిల్లును నువ్వే ధ్వంసంచేశావా?'' అని మనస్సు హెచ్చరించింది అమాంతం చంద్రశేఖరాన్ని గుద్ది చంపేద్దామన్నంత కోపం వచ్చింది. ''ఉండు, ఉండు! అప్పుడే అయిందా నీపని. ఇల్లు అలకగానే పండగ అవుతుందా?'' అనుకొని కోర్టులోకి వెళ్ళాడు అతనికి జడ్జి ముఖం కనిపించింది ప్రతిపక్ష న్యాయవాదిని చూడగానే పుల్లయ్యకు జంకు పూర్తిగా దిగజారిపోయింది. బోనెక్కి ప్రమాణంచేసి ప్రశ్నలకు సమాధానం చెప్పటానికి సిద్ధమయ్యాడు.

''హోటలులో హామీపత్రంమీద సంతకంచేసి యిచ్చారని చంద్రశేఖరంగారు అంటున్నారు నిజమేకాదూ?'' ప్రతిపక్ష న్యాయవాది అడిగాడు

''అతనికి నేనే పత్రంమీదా సంతకం చేసి ఇవ్వలేదు ''

శేఖరం కోపంతో పండ్లునూరాడు. ప్రతిపక్షన్యాయవాది తనగుమస్తాదగ్గరనుంచి కాగితం తీసి –

''ఈ కాగితం చూడండి. ఇది మీ సంతకం కాదా? బహుశా మరచిపోయారేమో జ్ఞాపకం తెచ్చుకోండి'' అన్నాడు.

''చూడ నవసరంలేదు. నేను ఏమి చేశానో నాకు తెలుసు'' అంటూ కాగితం పక్కబల్ల మీద పడవేశాడు.

''అన్నట్లు మీ కిప్పుడు ఎంత వయస్సు?''

''మళ్ళీ పెళ్ళి చేసుకొని పిల్లల్ని కనే వయస్సు దాటిపోలేదు.''

''ఇప్పుడా సంగతి దేనికిలెండి! చంద్రశేఖరంగారు తమకు హామీ ఉండవలసిందని మిమ్మ యెప్పుడైనా అడిగాడా?''

''చాలమంది అడిగారు. ఆ పేర్లన్నీ ఎక్కడ జ్ఞాపకముంటాయి?''

పుల్లయ్య బోను దిగి వచ్చాడు. అతనికి శేఖరం వికటహాసం వినిపించింది '' ఎందుకు ఎగిరిపడతావులే? ముందున్నది ముసల్ల పండగ,'' అనుకొంటూ పక్కకుపోయి కూర్చున్నాడు తరువాత వీరయ్య సాక్ష్యం చెప్పాడు తాను మాధవయ్యగారివద్ద కొంత కాలం జీతానికి కుదిరాననీ మాధవయ్యగారు హామీపత్రంమీద సంతకం చేసినట్లు చెప్పాడనీ చెప్పాడు పుల్లయ్యగారు జేబులోనుంచి కాగితం తీసి తన అడ్వకేటుకు ఇచ్చాడు అతడు చూచి, ''ఐతే హామీపత్రం ఇంకా

ఆరునెల్లకు పుడుతుందనగా నీవు మాధవయ్యగారిచ్చిన జీతం సరిపుచ్చుకొని యెక్కడికో వెళ్ళి, ఆయన చనిపోయిన సంవత్సరానికి తిరిగి మా గ్రామానికి వచ్చావని మాధవయ్యగారిభార్య లిఖితపూర్వకంగా చెబుతున్నది దీనికి మీరేమంటారు?'' అని ప్రశ్నించాడు.

''చూచారా నా దెబ్బ' అన్నట్లుగా పుల్లయ్య – మల్లయ్య వంక చూచాడు. మల్లయ్యముఖం ముడచుకుపోయింది వీరయ్యకు మళ్లీ నోటివెంట మాట రాలేదు. బోను దిగి అదే పోకగా పోయాడు కేసు వాయిదా పడ్డది బయటికి వెళ్ళుతుండగా శేఖరం ఎదురుపడ్డాడు. ''ఇల్లు అలకగానే పండగకాలేదు చూచుకో నిన్నే నేను జైలుకు పంపించకపోతే నా పేరు చంద్రశేఖరం గాదు,'' అని పండ్లునూరాడు దానిపై మాటమీదమాట వచ్చి కొట్లాట జరగటానికి సిద్ధమైంది ప్రక్కన ఉన్నవాళ్ళు చంద్రశేఖరాన్ని లాక్కు వెళ్ళారు పుల్లయ్య చిరునవ్వుతో మీసాలు దువ్వుకొంటూ వెళ్ళిపోయాడు



జి వి కృష్ణరావు

# ... ఇరవై ఒకటి ...

కారుచీకటి ఇలకోళ్ళ ఈలలు. దేశంలోని నీతివృత్తంవలె ఆకాశాన అక్కడక్కడ ఒక నక్షత్రం ధాన్యసంచయన అధికారుల వదలి వచ్చిన పేదరైతుల ఇండ్లవలె రచ్చబండ, కచేరిచావడి, లైబ్రరీ అరుగులు నిరశనబాధాపీడితజీవాల మూలుగులవలె కుక్కల మొరుగులు సమాజంలోని వివేకవంతులవలె అరుదుగా మినుకు మినుకు మంటున్న తిల్లికలు ప్రపంచ భవితవ్యంవలె అంధతమసం

పుల్లయ్యగారిదొడ్లో మెల్లనిగొంతులు వినిపిస్తున్నవి

''ఛీ పాడుకుక్క ఇంటిముందు ఏడుస్తూ ఉంది అవతలికి కొట్టిరా,'' అన్నాడు భార్యతో సుబ్బడు

''అదే పోతదిలే'' అన్నది రామి.



''మనిషికి అంత భయం పనికిరాదు ''

''బయ్యం లేకపోతే పోయి దాన్ని ఆ సంతకు తోలి రారాదూ?''

''పెద్దదొర పోయినప్పుడుకూడా కుక్కలు ఇలాగే ఏడిచాయే ''

''ఉసురు పోద్దని ముందుగా వాటి కెట్టా తెలుసో?''

''యములాళ్ళు వాటికి కనిపిస్తారంటే ''

''మనకళ్ళుకు ఎందుకు కనిపిచ్చరు?''

''పాపాలు చేసినోళ్ళకి – మని కెలా కనిపిత్తారే పిచ్చి మొగమా!''

''లచ్చమ్మ అప్పుడప్పుడు నోరెట్టుకు అరిచినా మనసు చాలా మంచిదే.''

''ఏమో నబ్బ! బతికి బట్ట కట్టిందాక నమ్మకం లేదు పాపం పుల్లయ్యగారిని అన్ని వడిసుట్లు ఒకేతూరే సుట్టుకొన్నందుకు చెప్పాలి. ఎద్దు అలా చచ్చిందా! కోర్టులో కేసా! కొడుకును అట్టాపట్టుకు పోయారా! పాపం సగం ఈ దిగుల్తోనే మంచం పట్టింది ''

''పాపం! కళ్ళారా బిడ్డల్ని చూసుకోటానికన్నా నోసుకోలా ఆ తల్లి ఆ కూతురైనా దగ్గరుంటే కొంత నయంగా ఉండేది ''

''ఇయ్యాల పొద్దున్నే అమ్మాయికి దొర తంతిపంపిచ్చాట్ట రేపో ఎల్లుండో వత్తది అయినా ఏ మాటకు ఆ మాట చెప్పుకోవాలి. పాపం రంగమ్మగారుందే సకలం చేత్తున్నది, కన్నబిడ్డమాత్రం అంతకన్నా ఏమి చేత్తది! అబ్బబ్బ! పాడుకుక్క కొట్టిరావయ్యా పున్నెముంటుంది నేనుకూడా వత్తావద ''

''వద్దులే'' అంటూ సుబ్బుడు కర్ర పుచ్చుకొని ఎయలుదేరాడు

''దారిలో కట్లుగొయ్య లుండాయి బద్రం పద్దావంటే నేను చాకిరిచెయ్యలేను,'' అని రామి హెచ్చరించింది. సుబ్బుడు బయటికి పోయి కుక్కను తరిమి వచ్చాడు

''డాబాలో ఏంటో తిరుగుతుండాదే దెయ్యమేమో?''

''అమ్మో! దెయ్యమే! అయితే నే నిక్కడ పడుకోను. అక్కడే పడుకుంటాను.''

''ఎర్రిమొగమా యింత బయ్యమైతే ఎలాగే? దెయ్యం కాదు దేవర కాదు. నన్ను చంపెయ్యకు!'' సుబ్బుడికి కనిపించింది పుల్లయ్య. అతడు ఆతురతతో డాబా వరండాలో అటూ యిటూ తిరుగుతున్నాడు. ఇంతలోనే డాక్టరు బయటికి వచ్చాడు.

''ఎలా ఉంది?'' ఆతురతతో పుల్లయ్య అడిగాడు.

''జ్వరతీవ్రతతప్ప మరే అవలక్షణాలు లేవు. భయపడకండి.''

''ప్రమాదం లేదు కదా!''

''ఏమీ లేదు నేను చెబుతున్నాను గదా! అనవసరంగా ఆందోళన పడక పండుకోండి మందు కోడలిచేతికి ఇచ్చివచ్చాను సరే నేను వెళ్ళివచ్చేదా?'' 

''అంతా మీదయ, ఆ భగవంతుడి దయ?''

''అదిగో మళ్ళీ హైరానవుతారు!''

''రావటం రావటమే ఇంత ఊబద్రంగా రావటం, నెత్తురు కక్కుకోవటం, కలవరింతలు చూడగా నా మనస్సు మనస్సులో లేకుండాపోతున్నది మీరుమాత్రం పరవాలేదంటారు ''

''పుల్లయ్యగారు, నామీద మీకు నమ్మకంలేదా? ఇంతకు మీ ఆందోళన అలా అనిపిస్తున్నది తప్ప మరేమీ లేదు జగ్గణ్ణి ఆ గదిలోకి వెళ్ళనీయకండి సరే ఉదయం వచ్చి చూచిపోతాగా.''

''ఒరే సుబ్బుడూ! డాక్టరుగారిసంచి తీసుకువెళ్లి ఇంటిదగ్గర ఇచ్చిరారా.''

''వాడినిద్ర చెడగొట్టడం దేనికిలే.''

డాక్టరు వెళ్ళిపోయాడు వెనుక చేతులు కట్టుకొని పుల్లయ్య వరండాలో అలాగే పచార్లు చేస్తున్నాడు. ''మళ్ళీ పలవరిస్తూఉంది మామాయ్యా!'' అంటూ కోడలు వచ్చి హెచ్చరించింది ''ఏమీ ఫరవాలేదు డాక్టరుగారు కూడా చెప్పి వెళ్ళారు నువ్వు వెళ్ళిపండుకో ఎంతసేపని మేలుకొంటావు? అనవసరంగా నువ్వుకూడా ఆరోగ్యం చెడగొట్టుకోకు'' అని ఆమెను ఎంపివేశాడు అతని మనస్సులో దేవుళ్ళూనే ఉంది తాను అన్యాయంగా శేఖరంమీద కేసుపెట్టాడు అది ఊరకే పోతుందా? ఆ అన్యాయమే బెడిసికొట్టింది లేకపోతే తన ఎద్దు చచ్చిఉండదు

లసకొడుకును పోలీసువాళ్ళు పట్టుకొని వెళ్ళి ఉండరు భార్యకు ఇలా అమాంతము ముంచుకొని వచ్చి ఉండదు మానవుల్ని వంచించగలంగాని దేవుణ్ణి ఎలా వంచిస్తాము? ఎప్పుడు కనిపెడుతూనే ఉంటాడు భార్య చనిపోతే తనగతి ఏమౌతుంది? కొడుకు, పిల్ల ఏమౌతారు? భార్య అండగా నిలవబట్టే సంసారం ఈ స్థితికి వచ్చింది ఆమె పోతే ఎక్కడ దక్కడ చితికిపోదా? ఆమె బ్రతికితేనే సంసారం సుఖం ఎలాగైనా ఈ గండం గడిస్తే, తనభార్యను బ్రతికిస్తే తప్పకుండా తిరుపతి వెంకటేశ్వరునికి నిలువుదోపిడి ఇస్తానని మొక్కుకున్నాడు

అసలు ఆ ముదనష్టపు కేసు లేకపోతే తాను తనకుటుంబం ఎంతసుఖంగా బ్రతికేది! మనస్సు ఎంత హాయిగా ఉండేది! అనవసరంగా ఆ దరిద్రుడికి హామీ ఉండటమే లేనిపోనీ చిక్కులు తెచ్చిపెట్టింది. అసలు తనభార్య ఊడుతుందేమో? ఆపాదమస్తకం కంపించిపోయాడు ఆ స్థితిని ఊహించుకోటానికే పూర్తిగా భయపడిపోయాడు ఎలాగైనా ఆ గండం గడిచి గట్టెక్కితే! .. ఎలా గడుస్తుంది? అదే అతనికి తోచలా.

# ఇరవై రెండు

విచారణ ప్రారంభమైన మరునాటి తెల్లవారుజామునే శేఖరం భార్య లలిత లేచింది ఒళ్ళు విరుచుకు పోతున్నది ఇంట్లో పనిమనిషి లేదు నిన్నటిచాకిరిబడలిక ఇంకా పోలేదు కళ్ళు మూరుకొనిపోతున్నవి రాత్రంతా పిల్లల ఏడ్పులు ఆయన సరే సరి పలవరించినవాడు కలవరించినట్టుగానే ఉన్నాడు ఓపిక చేసుకొని మెల్లగా లేచి వెళ్ళి లాంతరు పెద్దది ఇంకా పీడకలలు బాధిస్తున్నాయి కాబోలు! ఆమె జాలిగా అతని ముఖంలోకి చూచింది ఆ మీసంలో లక్కడక్కడ తెల్లవెంట్రుకలు కనిపించాయి పాడు కేసు ఏ విషమ ఘడియల్లో వచ్చిందో మనిషిని పిల్చి పిప్పి చేస్తున్నది పచ్చగా నున్నగా ఉండే మనిషి నల్లకప్పు వేసి పీనుగలాగా అయిపోతున్నాడు. తన కర్మ కాకపోతే ఎందుకు రావాలి? పండువంటి సంసారం ఇలా ఎందుకు కావాలి? ఒక లాగుడా, జూదమా, చెడు తిరగటమా? ఏ దురభ్యాసం ఉంటే ఇది దాపురించింది? తన నుదుటి గీత!

లాంతరుతో వంటయింట్లోకి వెళ్ళింది లేవగానే కాఫీ యిస్తే భర్త సంతోషిస్తాడని పొయ్యి రాజేసింది అంతలోనే ''ఏమేవ్'' అని పెద్దకేక వినిపించింది ''ఆ అరుపుకు పిల్లలు లేస్తారని తెలియదూ? ఎందుకంత రణకేక పెడతాడు?'' అని అనుకొంటూ హాల్లోకి వెళ్ళి అడిగింది. 107

''అది కాదే, వీరయ్య మనం పిలవకుండా పెట్టకుండా తనంతట తాను సాక్ష్యం చెప్పటానికి ఎందుకు వచ్చాడో తెలుసా?''

''ఏమిటి అంటారు?'' విచారణను గూర్చి మాటాడుతున్నాడన్న సంగతి బోధపడక అడిగింది

''వీరయ్య వచ్చి మనకు ఎందుకు సాక్ష్యం చెప్పాడో తెలుసా? తప్పుడు సాక్ష్యమని ఒక పక్క కనిపిస్తూనే ఉన్నది ''

''ఎందుకు చెప్పాడంటారు?''

''పుల్లయ్య వాడిని మేపాడు మల్లయ్య, పుల్లయ్యతో సలీకయ్యాడు ''

''మల్లయ్య సలీకయ్యాడా?''

''మరేమనుకొన్నా? కొంపలార్పేవాడైతే నమ్మకంలో గొంతుకొయ్యటానికి సిద్ధమయ్యాడు. నా పక్కన ఉన్నట్టే ఉండి ఇంతపని చేశాడు నిజంగా వీరయ్య సాక్ష్యంతో నా మీద అనుమానం బలపడేటట్లు చేశాడు ''

''ఇదంతా నిజమేనా?''

''ఇంకా అనుమానమా?''

''ఎంత దుర్మార్గానికి ఒడిగడుతారు!'' లలిత మళ్ళీ వస్తానంటు దొడ్లోకి వెళ్ళి అయిదు నిమిషాలకు కాఫీ కప్పు పట్టుకొని తిరిగి వచ్చింది ముఖాన చిరుచెమటలు చేయి వణకి కాఫీ సాసరులో వొలికిపోతున్నది శేఖరం అది గమనించనే లేదు

''గుండె గబుక్కుమన్నది ఇంతవరకు ఆ దడ పోలేదు'' అన్నది

''ఏమిటి?''

''దొడ్డి వాకిలి తీశాను నల్లగా కనిపిస్తే పై ప్రాణాలు పైనేపోయాయి ఇలా చూదును గందా ఎల్లమంద నిన్న సాయంకాలం వస్తే 'వారు లేరు. ఉదయానే ఉంటా' రని చెప్పాను వాడు అప్పటినుంచి అక్కడనే కూర్చున్నట్లున్నాడు ఎంతచెప్పినా వదలటంలేదు మిమ్మల్ని చూడందే వెళ్ళడట.''

''రామచంద్ర! కళ్ళు సరిగా ఇంకా తెరవనే లేదు. ఈ శనేశ్వరుడు యెక్కడ దాపురించాడు! ఎలాగైనా పంపెయ్యలేవూ?'' అని భార్యవంక దీనంగా చూచాడు

ఎల్లమంద కూలీ నాలీ చేసుకొని ఎలాగైతేనేం యాభైనాలుగేళ్ళు వచ్చేటప్పటికి నాలుగువందలు వెనకేసుకొన్నాడు. ఈ నాలుగేళ్ళనుంచి చలిజ్వరంతో మూలపడ్డాడు జవసత్వాలు ఉడిగాయి పెళ్ళాం గూడా రోగాల కుంపటి కులాసా ఉంటే కూలికి పోతాడు లేకపోతే

పండుకొంటాడు అతడు ఎక్కువ వడ్డీ వస్తుందన్న ఆశతో నాలుగు వందలూ శేఖరంవద్ద పెట్టాడు అతని జీవిత సర్వస్వం ఆ నాలుగు వందలే ఇప్పుడు కాళ్ళుచేతులు పడిపోయాయి ఆ నాలుగు వందలు వస్తే కద్దు! లేకపోతే లేదు శేఖరం చితికిపోయాడన్న సంగతి తెలియగానే అతనికి శేఖరం ఇంటిచుట్టూ తిరగటమే పని అయింది చిక్కి శల్యావశిష్టంగా ఉన్న ఎల్లమంద కళ్ళు చూడటమంటే శేఖరానికి అమితభయం ఒక్క ఎల్లమందే కాదు, బాకీదారులంతా రేపుమాపు ఇంటిచుట్టూ తిరిగి పోతూనే ఉన్నారు రూపాయికి పావలాలు తగలేస్తే చాలురా భగవంతుడా అని కొంతమంది చూస్తున్నారు ''తెచ్చుకు తినగానే సరా? పశువు తింటున్నది పోగేసుకొని నువ్వు తింటావా''ని కొంతమంది తిట్టిపోతున్నారు ''డబ్బు కక్కించకపోతే మా మీసాలు గొరిగించుకోమా'' అని కొందరు శాబ్దికడుతున్నారు కన్నీళ్ళ పర్యంతమై ఇంటిచుట్టూ కొంతమంది ప్రదక్షిణాలు చేసి పోతున్నారు

ఎల్లమంద మాట వినగానే శేఖరానిక కాళ్ళు చేతులు తేలిపోయాయి కాఫీ రుచించలేదు త్రాగకుండానే కప్పు భార్య చేతికిచ్చాడు

''త్రాగలేదేం?''

''త్రాగనిచ్చేట్లున్నావా ఏమిటి?

''నే నేం చేశానండి?''

''వాణ్ణే నా మీదికి పంపడం చెయ్యకపోతే పుల్లయ్యదగ్గరకు పంపకపోయావా?''

అతని అవస్థ కనిపెట్టి లలిత పిమ్మనకుండా కాఫీకప్పు తీసుకొని దొడ్లోకి వెళ్ళిపోయింది

విచారణ ప్రారంభమైనది మొదలు శేఖరానికి నిప్పుల మీద దొర్లుతున్నట్లుగా ఉంది లోకమంతా ఏకమై తనమీద కుట్ర సాగిస్తున్నదనీ, ఫోర్జరీకేసు అందులో అంగమనీ భావించసాగాడు కుట్రలేకపోతే మిల్లు దెబ్బతిని ఉండేది కాదు. ఇన్ని అప్పులు అయ్యేవికావు తనవల్ల ఆవగింజ పొరపాటైనా లేదని, కేవలం నిర్దోషినని రుజువు చేయటానికి ప్రయత్నిస్తూ వచ్చాడు సమయాసమయాలు, పాత్రాతాపాత్రతలు చూచకుండా ఈ ప్రస్తావనే తెచ్చేవాడు దానితో అతనిపట్ల సానుభూతి ఏర్పడటానికి మారుగా అనుమానం ఎక్కువైంది తన పతనానికి కుట్రే కారణమని అనుకోవటం, దానిని వీలైనంత వరకు చెప్పుకోవటంవల్ల మనశ్శాంతి కలిగింది అంతేకాని ''మిల్లు నిర్వహణలో తెలివితక్కువపని జరిగింది నామూలాన ఇన్ని కుటుంబాలు చితికిపోతున్నాయే, వీళ్ళకు నా ముఖం ఎలా చూపించేది?'' అన్న దిగులు, విచారం పూర్తిగా నశించాయి

తీర్పు చెప్పే రోజులు దగ్గరకు వస్తున్నాయి తనకు శిక్ష పడుతుందేమో నన్నదానికంటే తనపై ఎలాంటి కుట్ర జరగలేదని రుజువవుతుందేమోనన్న భయం అధికం కాసాగింది. పొరపాటున భార్య ఎన్నడైనా అలాంటికుట్ర జరగటంలేదని సూచనప్రాయంగా అన్నా మండి పడేవాడు. తన భార్య కూడా వాళ్ళతో సలీకవుతున్నదని చికాకు పడేవాడు ఏ స్వల్ప విషయంలో పుల్లయ్యకు అనుకూలంగా మాట్లాడినా సహించేవాడు కాడు దుస్తంత్రం సాగుతున్నది అని అనుకొంటేనే తాను కార్మికులపక్షాన పోట్లాడుతున్నాననీ, వారంతా తనపక్షమేననీ భావించటానికి వీలవుతుంది అప్పుడు తనజీవితం మహత్తర ఆదర్శసాధనకు ఆహుతి అవుతున్నట్టుగా ఎంచుకొని ఆనందం పొందటానికి వీలవుతుంది కుట్రలేదంటే ఎలా?

భార్య దొడ్లోనుంచి తిరిగి వచ్చింది

''ఎల్లమందను పంపించివేశావా?'' శేఖరం అడిగాడు.

''ఆఁ ఈ పూటకు సాగనంపేటప్పటికి పెద్దలు దిగివచ్చారు.''

శేఖరం నిట్టూర్చి బల్లవద్దకూర్చుని వ్యాసం ప్రారంభించాడు కార్మికులచేత రోజుకు ఎనిమిదిగంటలచొప్పున పని చేయించటంలో మిల్లుయజమానిగా తనకు కలిగిన అనుభవాలు వివరించసాగాడు రోజుకు పదిగంటలచొప్పున పనిచేయిస్తే ఎక్కువ ఉత్పత్తి అవుతుందని అనుకోవటం చాల పొరపాటు మితిమీరి పనిచేయిస్తే అలసటతో కార్మికుడు అధికంగా ఉత్పత్తి చేయగలిగింది ఏమీ ఉండదు. ఉత్సాహంలేక మెల్లగా పనిచేస్తాడు ఉత్పత్తి అలాగే ఉంటుంది కాని పెరగదు పైగా ఎక్కువ కాలం ఉండటంవల్ల అలసట, ప్రమత్తత అధికమై ప్రమాదాలు అధికంగా జరగటానికి అవకాశం ఎక్కువ ఉన్నది తీరిక ఉంటే మానవుడు చెడిపోతాడు దురభ్యాసాలు అధికమైపోతాయి అందువల్ల విధి విరామం లేకుండా పనిచేయించటం అవసరమనేవాళ్ళకు నేను చెప్పగలిగింది ఏమీ లేదు మా మిల్లులో పనిచేయవలసినకాలం తగ్గించినప్పటికీ ఉత్పత్తి మిగతా మిల్లులకు దేనికి తీసిపోలేదు లయితే ఎందుకు దెబ్బ తిన్నది అంటే దానికి కారణాలు వేరు'' అని వ్రాశాడు దీనితో పెట్టుబడి దారులకుట్రను బయట పెడుతున్నాననీ, కార్మిక సానుభూతి సంపాదిస్తున్నాననీ, తన నిర్దోషిత్వం వ్యక్తమౌతున్నదనీ భావించాడు

జి వి కృష్ణరావు

## .. ఇరవై మూడు ....

ఆనాడు ఆకాశంలో మేఘాలు ఎన్నికలకు తయారవుతున్న రాజకీయపక్షాలవలె గర్జిస్తున్నవి లలిత పంచలో నిల్చుని బయటికి చూస్తూవుంది ''నేను చూస్తానే అమ్మా! నేను చూస్తా'' అంటూ తల్లిపైకి రుచిరవర్ణపూర్ణమైన లతపై కర్రులు చాస్తున్న గోవత్సాలవలె ఆడపిల్లలిద్దరు ఎగబ్రాకుతున్నారు

ఇంతలో గేటువద్ద చిరపరిచితమైన దగ్గు వినిపించింది ఆమె హృదయం కలతపడ్డది ఆ వస్తున్నది తనతండ్రి అతడు వచ్చినప్పుడల్లా ఆమెకడుపు చుమ్మలుచుట్టుకొనిపోతున్నది అతడు దగ్గుకొంటూవస్తాడు. వచ్చినప్పుడల్లా ఆమె పంచలో అక్కడే ఉంటుంది. రాగానే ఎదురు వెళ్లుతుంది ఆ రాకను గమనించకుండా తన్ను కావులించుకునే మనుమరాండ్రను మెల్లగా ప్రక్కకు నెట్టి అతడు అక్కడ ఉన్న కుర్చీలో కూలబడతాడు. పిల్లలకు కూడా ఆ చర్య వింతగా ఉంటుంది

ఆ రోజున ఆయాసపడుతూ చేతికర్ర కాళ్ళమధ్య పెట్టుకుని వణుకుతన్న చేతులతో పిడిపట్టుకొన్నాడు



''ఇవ్వాళ కూడా ఇంటివద్ద లేడా?''

''లేరు నాన్నా!''

''ఎప్పుడూ ఈ వేళకు ఇంటివద్దనే ఉండే వాడుగా?''

అతనికి డెబ్బయియేళ్లు దాటాయి ఆజానుబాహువు తెల్లని గడ్డం, నీరుకావి ఉత్తరీయం నెరసిన కనుబొమలు ముడిపడ్డవి ''దగ్గు ఎలా ఉంది నాన్నా!''

''దగ్గుకేం బాగానే ఉంది మీ ఆయన పుణ్యమా అంటూ రేపో ఎల్లుండో ఇల్లు వేలం వేస్తారు మీ అన్న నైజాము పోతానంటున్నాడు రోజులు ఎలా గడవాలో తెలియటం లేదు వాడితోనన్నా పోవాలి లేకపోతే బిచ్చమైనా ఎత్తుకోవాలి.''

''నాన్నా, నాన్నా!''

లలిత తండ్రికాళ్ళకు చుట్టుకొని ఆవురుమన్నది కూతురు కన్నీరు తండ్రిపాదాలు కడుగుతున్నది తండ్రి మెల్లగా నవ్వాడు చేతిలోల కర్ర వణకింది తల కంపించింది

''అయితే ఇవాళకూడా కార్మికులమీటింగు పెట్టాడన్న మాట!'' విషాదంగా నవ్వుతూ అడిగాడు

''లేదు'' డగ్గుత్తికతో చెప్పింది

''ముసలివాణ్ణి! నా కేమీ తెలియకి అడుగుతాను దారి తెన్ను లేనివాళ్ళే ప్రపంచాన్ని ఉద్ధరిస్తారా? తానేపిదా వాళ్లడబ్బు కాజేసి దిక్కులేని పక్షుల్ని చేసింది! వాళ్ళను చూట్టానికి ముఖం ఎలా చెల్లింది? వాళ్ళకు ఏమని చెబుతాడు?''

లలిత మాటాడలేదు ఒక నిట్టూర్పు వదలింది

''ఆ కార్మికులతత్త్వంకూడా విచిత్రమే ఎంతడబ్బు కాజేసినా ఇబ్బంది లేదు తిండి ఉన్నా లేకపోయినా వీధుల్లో తిరిగి అరవటానికి నాలుగు పాలికేకలు చిక్కితే చాలునట్లుంది.''

''నైజాము పోవటం లేదుకదా!''

''కడపటిసారి యిచ్చిన వెయ్యి రూపాయలైనా ఇస్తే పోను అసలు పదిహేనురోజుల్లోనే ఇచ్చివేస్తానన్నాడు ''

''ఇచ్చి వేద్దామనే భావంతోనే ఆయన అలా చెప్పారు ''

''అదే మాకొంపతీసింది ఈ నాటికి మమ్మల్ని దేశమ్మ కాకుల్ని చేసింది ఇవాళ దిక్కేమిటి? చేతిలో నాలుగు రాళ్ళు ఉన్నప్పుడు అంతా రమ్మన్నవాళ్ళే ఇవ్వాళ ఏరీ?'' లలిత మాట్లాడలేకపోయింది. గుడ్లలోనీరు గుడ్లలోనే కుక్కుకొన్నది వృద్ధు నోరుతుడుచుకొన్నాడు.

''అమ్మాయి! కాస్త నామాట చెవిని పట్టించుకో. నీవు, నీ పిల్లలు వచ్చివేయండి. నైజాము బయలుదేరితే దారిలోనే చచ్చిపోతాను. పొలంమీద కాస్తో కూస్తో రాకపోదు. నా అన్నవాళ్ళు దగ్గరలేకుండా పొలం పరాయివాళ్ళకు అప్పగించి కాననిగంతల్లో పడి ఉండేదా? వచ్చి నాదగ్గరే ఉండు. ఇంతకూ చెప్పినమాట వినబడ్డదా?''

లలిత మాటాడలేదు. తండ్రివంక దీనంగా చూచింది రాలేనని శిరఃకంపనతో సూచించింది లోగడలో వలెనే అతడు మండిపడ్డాడు ''మళ్ళీ నీ గుమ్మం తొక్కితే ఒట్టు'' అని వెళ్ళాడు తిరిగి అతనిగొంతు గేటుదగ్గర వినిపించింది లలిత లేచి చూచింది తండ్రి గేటులో నిలబడి తిరిగి చూస్తున్నాడు 113

'' ఆలోచించుకొన్నావా? ఇదే కడసారిగా చెబుతున్నాను.''

రాలేనని తలఊపి లలిత లోపల కుర్చీలో కూలబడి ఏడ్చింది. ''భర్తను వదలిపెట్టి పోవటమా? అసంభవం కష్టమో సుఖమో అతనితో పంచుకోవాలి కాని, లోకులు అన్నంతా చేయటమా!''

శేఖరం ఇంటికి వచ్చాడు. కార్మికులు వచ్చేనెల ఒకటవ తేదీన ఊరేగింపు జరపటానికి నిర్ణయించుకొన్నారనీ, పుల్లయ్య ఇంటిమీదుగానే వెళ్ళుతారేమోనని తనకు అనుమానం కలుగుతున్నదనీ భార్యకు చెప్పాడు. ఆ గొంతులో ఆమెకు ఎంతో అసంతృప్తి కనిపించింది

''ఈ బుద్ధి మీకు పుట్టలేదు కదా!'' లలిత అడిగింది,

''ఆఁ, నేనే వాళ్ళను రేపెట్టాను! వాళ్ళకు తలకాయలు లేవు.''

''ఎలాగైనా ఆపించండి!''

''ఇందులో నా కేమిటి సంబంధం? వాళ్ళ కష్టనిష్ఠూరాలు వాళ్ళు చెప్పుకొంటూ ఉంటే నేనెందుకు జోక్యం ఏలిగించుకోవాలి? పుల్లయ్య మొదలైన షావుకార్లమీద వాళ్ళకున్న అక్కసును వాళ్లు వెళ్ళబోసుకుంటూ ఉంటే నేను ఏమని మందలించేది?''

---

జి వి. కృష్ణరావు

‘‘మీరుమాత్రం తక్కువతిన్నారని ఎవరనుకుంటున్నారులే!’’ లలిత ఇంటిలోపలికి వెళ్ళింది

భర్తను ఈ సమయంలో ద్వేషించటం ఆమెకు మరీ బాధ కలిగించింది లోకమంతా ఎదురై అతన్ని తూలనాడుతున్నది సర్వనాశనంచేయాలని చూస్తున్నది. అందుకు చేతులారా భర్త తోడ్పడుతున్నాడు. తానుకూడా ఆ లోకంతో చేరి భర్తను అవమానిస్తుందా? బాధపెడుతుందా? దాని కోసమేనా తాను అతని అర్థాంగి అయింది? కష్ట కాలంలో అతనికి తాను కాకపోతే మరెవరున్నారు?

ఒకనాడు నోటీసు వచ్చింది. ఫ్యాక్టరీ, ఇల్లు వేలంపడ్డవి వారం రోజులలోగా ఇల్లు ఖాళీచేయాలి. లలిత విధిలేక అద్దె కొంపకోసం బయలుదేరింది. మా యిల్లు ఖాళీలేదంటే మా యిల్లు ఖాళీలేదని అన్నవాళ్ళేకాని అనని వాళ్ళు లేరు. పైగా ఎలాంటిసంసారానికి ఎలాంటిచిక్కులు వచ్చినవమ్మా అని ఎదుట సానుభూతి చూపించి, ముఖం తిప్పగానే ‘‘అంతే కావాల్సి, ఉన్నప్పుడు జాగ్రత్త ఉంటే? ఆనాడు మనం కనిపించామా, మనమాటలు వినిపించాయా?’’ అని కొందరన్నారు. ‘‘ఎద్దల్లే మొగుణ్ణి పెట్టుకొని ఇల్లు వెదకటానికి తను బయలుదేరిందే’’ అని ఒకమ్మ ప్రక్క ఆవిడతో అన్నది. ‘‘ఏరి కోరి చేసుకొన్నది. ఆ రోజున వర్ధని పాపం ఆ ముసలాడు నెత్తీ నోరూ కొట్టుకొని చెబితే విన్నదీ? దానికి శాస్తి గావాలిలే’’ అని మరొకతె అన్నది ‘‘ఈ దరిద్రులను చేరిస్తే ఆ శని మనకుకూడా చుట్టుకొంటుందేమో!’’ అని మరొక యిల్లాలు అన్నది. ఇవన్నీ లలితచెవిన పడుతూనే ఉన్నవి. ఆమె యింటికిపోయి కుర్చీలో కూలబడి ఏడ్చింది

ఏడ్పుమాత్రం ప్రయోజనమేమున్నది? ఆ ఊళ్ళోనే ఒక ఆసామిచావిడి ఖాళీగా ఉంది. ఒకప్పుడు అతని కిచ్చి తన్ను పెండ్లి చేయాలని తండ్రి అనుకొన్నాడు. కాని తాను యిష్టపడకపోవటంవల్ల ఆ సంబంధం ఆగిపోయింది. లలిత పోయి అతన్ని చావడి ఇమ్మని ఎలా దేవురిస్తుంధి? తన ప్రాణాలు ఎందుకుపోలేదో ఆమెకు అర్థంకాలేదు. చివరికి విధిలేక చావడి కోసం అడిగింది. అతడు ఒప్పుకొన్నాడు. అది ఊరు రెండో చివర ఉన్నది

ఒకరోజు తెల్లవారుజామున పెద్దలోగిలినుంచి సామానుతో బండి కదిలింది సామానుమీద పెద్దపిల్లలు ఇద్దరూ కూర్చున్నారు. మూడోవాణ్ణి చంకనెత్తుకొని లలిత బండివెనుకనే నడిచింది. శేఖరం జేబులో చేతులు పెట్టుకొని తలవంచి కొంత ఎడంగా బయలుదేరాడు. బండి గమ్యస్థానానికి చేరుకొన్నది

అది పూరిచావడి. మూడేగదులు. తలవంచుకొని లోపలికి వెళ్ళటానికి అలవాటు లేని లలిత నిటారుగా వెళ్ళింది వాసం టంగున పాడుచుకొని చిల్లి పడ్డది లోన బూజు గోడలనిండా చెద అదంతా బాగుచేసి వాసయోగ్యంచేసేటప్పటికి లలితకు అమ్మ జ్ఞాపకం వచ్చింది. ఇంతకంటే ఘోరం మరొకటి జరిగింది. దినవెచ్చాలకోసం ఆ చావడి ఆసామిని బదులు అడుగవలసి వచ్చింది. భూదేవి తన్ను ఒక్కసారిగా ఎందుకు మ్రింగివేయలేదో లలితకు అర్థంకాలేదు ఇదంతా దేనికి జరుగుతున్నది? భర్తేకదా కారణం. అతనిమీద ఆమెకు చిర్రుబుర్రులు అధికమయ్యాయి. అసలు భార్యాభర్తలు మాటాడుకోవడమే అరుదైపోయింది పొరపాటున ఎప్పుడన్నా మాట్లాడుకొన్నా ఒండొరులమీద యీష్టపడటంతప్ప మరొకటి జరగలేదు

. ఇరవై నాలుగు .. ..

మానవతత్త్వం మరీ విచిత్రం అణువును భేదించవచ్చును చంద్రలోకానికి వెళ్ళిరావచ్చు అచటి స్థితిగతులు ఇలా ఉన్నాయని తేల్చి వేయవచ్చు మానవశరీరాన్ని ముక్కలు ముక్కలుగా కోసి తిరిగి కుట్టి బ్రతికించవచ్చు కాని ఈ పనులన్నీ చేయగలిగిన ఆ మనస్సు అంతుమాత్రం తేల్చుకోలేము. దాని శక్తిసామర్థ్యాలను ఊహించలేము దాని శక్తిసామర్థ్యాలను ఊహించలేము ఇంతకుతప్ప మరేమీలేదని గిరిగీసి చెప్పలేము

ముఖ్యంగా డాక్టరు సంగతే తీసుకోండి లక్ష్మమ్మ సంధిలో పలవరించినమాటలు విన్నాడు. అతనికి మనస్తత్వశాస్త్రం తెలియనిది కాదు అతనిమనస్సు ద్రోహచింత కలిగింది కాదు అయినా ''తమ్ముడూ శేఖరం, నన్నేమైనా చెయ్యి, నిప్పుల్లో వేసి కాల్చు. నరకంలో త్రోసి మాడ్చు. ఆ శిక్ష అనుభవిస్తా అంతేకాని రాముడు ఏమీ ఎరుగడు సీత అంతకన్నా ఎరుగదు'', అని లక్ష్మమ్మ ఒకసారి కలవరించింది మరొకసారి, ''ఎందుకు చూస్తారు? ఆ సంకెళ్ళు నాకే వేయండి. నన్నే జైలుకు తీసుకెళ్ళండి'' అన్నది ''మీకు దణ్ణాలు పెడతాను. ఆ కర్రలు అవతల పారేయండి. నా బిడ్డలు ఏమీ ఎరుగరు ఆయనకు కూడా ఇది ఇష్టంలేదు'' అని పెద్దగా ఏడ్చింది ''రాముణ్ణి పట్టుకెళ్ళకండి. మీకు నీతిన్యాయాలు లేవు. దయాదాక్షిణ్యాలు లేవు వీడు నిజానికి నిలబడ్డాడు నన్నే పట్టుకెళ్ళండి'' అని ఒకసారి కెవ్వు మన్నది

ఈ పలవరింతలన్నీ సమన్వయించుకొంటే డాక్టరుకు సత్యం బోధపడి ఉండేది నిజానికి ఆ తెలివితేటలు ఉన్నాయి కాని అతనికి తెలియకుండానే తన రాజీప్రయత్నాల వైఫల్యం ఒక దోషంగా తయారై కూర్చున్నది నిజంగా తప్పు చేయని వాడైతే చంద్రశేఖరం పుల్లయ్య చేసిన కీడు మరచి రాజీకి ఒప్పుకొని ఉండేవాడు. కాని అతడు ఒప్పుకొనలేదంటే అతడు తప్పు చేసి ఉండాలి. ఈ అభిప్రాయం మనస్సులో నాటుకుపోయింది. తాను నిష్పాక్షికంగా వ్యవహరిస్తున్నాడు కాబట్టి తనమాట నెగ్గటం అవసరం అంటే ధర్మం నెగ్గటమే నన్న భావం లోపల పనిచేస్తూ ఉంది అందువల్ల శాస్త్రి లక్ష్మమ్మ పలవరింతలు సరిగా సమన్వయించుకోలేకపోయాడు పైగా అలా జరుగుతుందేమో నని ఆందోళనపడుతున్నదని అతడు భావించాడు అంతేకాదు. ఆమెమనస్సు చాల మెత్తనిది ఇతరులకు ఏమాత్రం నొప్పి తగిలినా నొచ్చుకొంటుందనుకొన్నాడు. లోకమంతా ఇలా ఉంటే స్వర్గమై పోదా అని లోలోన మెచ్చుకొన్నాడు.

ఆ పలవరింతలు డాక్టరు విన్నాడని తెలిసినప్పుడు పుల్లయ్యకు ముఖాన నెత్తురుచుక్క లేదు నేరుగా అతనికి ముఖం చూపించటానికి సాహసించలేకపోయాడు అతడు వస్తున్నాడనగానే ఎటోఒకటు పోయేవాడు ఒకవేళ యింట్లో ఉండగానే వస్తే చల్లగా దొడ్లోకి జారుకొనేవాడు ఈ ప్రవర్తనను బట్టి అయినా డాక్టరు ఊహించి ఉండవలసింది. కాని దానిని బుద్ధిలోనికే ఎక్కనీయలేదు.

ఒకరోజున రోగికి ఎక్కువగా ఉంది పుల్లయ్య రోగిమంచంవద్దనే ఉన్నాడు సరిగా ఆ సమయానికి డాక్టరు వచ్చాడు పుల్లయ్య చిన్నవాడిమలె బావురు మన్నాడు ఇప్పటికీ అతనికీ అర్థంకాలేదు భార్యకు విషమంగా ఉన్నదని దుఃఖపడుతున్నా డనుకొన్నాడే కాని, తాను చేసిన తప్పుపనికి తనముఖం చూడలేక అవురవుంటున్నాడని ఊహించలేకపోయాడు "పెద్దవాడివి నువ్వే అలాగైతే ఇంట్లో ఆడవాళ్లసంగతి ఏమి కావాలి? ఏం ఫరవాలేదు నామాట వినండి రోగం కోర్సు ఈ రెండు రోజులే ఉంది తరువాత జ్వరం తగ్గిపోతుంది ఆ పిల్లను చూడండి పోయి ఓదార్చటానికి బదులు మీరే వావురు మంటే ఎలా? ఏం ప్రమాదం లేదు నాదీ పూచి" అని ఓదార్చాడు అప్పటినుంచి పుల్లయ్యమీద జాలి ఎక్కువైంది జాలితో అతను నిర్దోషి అన్న మొండినమ్మకం ఏర్పడింది ఎలాగైనా రోగిని కాపాడాలన్న పట్టుదల కలిగింది ఆమె మనోవ్యాధి కుదిరితేగాని శరీరవ్యాధి వెనుక పట్టదు ప్రాణరక్షణకోసమైన ఆమె మనశ్శల్యాన్ని తీసివేయాలి ముందు తనకు ఆమె నిర్దోషిణి అన్న దృఢవిశ్వాసం కలుగకపోతే ఆమెదిగులు ఎలా తొలగించకలుగుతాడు?

పుల్లయ్య, అతని భార్య కేవలం నిరపరాధులన్న నమ్మకం డాక్టరుకు ఏర్పడింది మరునాడు ఉదయాన వచ్చినప్పుడు పుల్లయ్యను చాటుకు తీసుకువెళ్ళి, "శేఖరం ఏ దోషమూ ఎరుగడనీ, తప్పంతా నీదేననీ, రామారావును కూడా నీవే పోలీసులకు పట్టించావనీ రోగి దిగులుపడుతున్న" దన్నాడు. డాక్టరుకు అంతా తెలుసన్నమాట. తెలిసి ఉండి కూడా తన్ను, తన భార్యను అంత గౌరవంగా చూస్తున్నాడు తనముఖాన ఎందుకు ఊయలేదు? పుల్లయ్యకు ప్రపంచమంతా గిరున తిరిగిపోయింది భూమి క్రుంగిపోతున్నట్లనిపించింది అతడు తలవంచుకొని తనధోరణిలోనే చెప్పుకొని పోతున్నాడు కాని పుల్లయ్యముఖంఎంక చూడలేదు, "అదంతా ఆమెఅనుమానం, భయం తప్ప మరేమీ లేదు నీవు నిర్దోషి వన్న సంగతి నాకు తెలుసు, లోకానికి తెలుసు ఈ సంగతి ఆమెకు చెబుతాను ఇంకా ఇతరులచేత కూడా చెప్పించటం అవసరం లేకపోతే లోపలిదిగులు పోదు. ఆ దిగులు, ఆందోళన దిగజారకపోతే జ్వరం వెనుకాడదు" అని చెప్పాడు

డాక్టరు చెప్పినట్లు చేశాడు. కూతురు సీతకూడా చెప్పింది ఒకరోజున అమ్మాయమ్మగారు చూచిపోవటానికి వచ్చి పోలీసులే వచ్చి లేనిపోని అనుమానంతో రామారావును పట్టుకెళ్ళారనీ త్వరలోనే విడుదలచేస్తారనీ చెప్పింది డాక్టరు అబద్ధంచెప్పేవాడు కాడు. అన్యాయంచేసేవాడు కాడు అన్యాయం ఎక్కడ జరుగుతున్నా ప్రతిఘటించితీరులాడు. నిజంగా తనభర్త అన్యాయానికి ఒడిగడితే ఈ గడపతొక్కేవాడా? ఈ మాట చెప్పేవాడా? తనభర్తవల్ల దోషంలేదు. పసికుంక రాముడే పొరపడ్డాడు అనవసరంగా వాణ్ణే పోలీసులే పట్టుకెళ్ళారు కాని తండ్రి పట్టివ్వలేదు అమ్మాయమ్మగారు కూడా అలాగే ఎందుకు చెబుతుంది? తాను పొరపాటుపడ్డది అన్యాయంగా తనభర్తకు లేనిపోని పాపం అంటగట్టింది ఇంత కాలం అతనితో కాపురంచేసిన తానే అలా అపార్థం చేసుకొంటూ ఉంటే ఆయన ఎంత బాధపడుతున్నాడో!

"అమ్మా మీనాన్న ఏడి?" హీనస్వరంతో సీతను అడిగింది పుల్లయ్య తప్పుచేసిన పిల్లవాడిలా మెల్లగా వెళ్ళి ఆమె మంచంవద్ద కూర్చున్నాడు సీత, రంగమ్మా ఇద్దరూ గదిలోనుంచి వెళ్ళిపోయారు

''నేను చాల పెద్ద తప్పుచేశాను తెలిసిపోని అన్యాయం మీకు అంటగట్టాను. మీరు అలాంటివాళ్ళు కాదని అనుకుంటూనే పొరపడ్డాను క్షమించరూ!'' అన్నది కన్నులవెంట జలజల అశ్రుబిందువులు రాలాయి. పుల్లయ్యకు బాకుతో పొడిచినట్లయింది మాట్లాడలేకపోయాడు. ''నాకు తెలుసుగా. మీకు నామీద కోపం లేదు వాడిమీద అంతకన్నా లేదు. వాణ్ణి ఎప్పుడు విడిపించుకొస్తారు? పాడు డబ్బు. వాడు రావాలే కాని ఎంతపోతే ఏమిపోయింది? ఇంకా నేనన్నా డబ్బుపోయిందని జంకుతా గాని మీరు ఏమాత్రం వెనకాడరు'' అన్నది

''అందుకోసమే చూస్తున్నా నమ్మీ! వాడు అక్కడల్లాడుతుంటే నాకూ ఎలాగో ఉంది. ఇదిగో తొందరగానే విడుదల చేస్తారని చెబుతున్నారు'' అన్నాడు మెల్లగా భార్య కన్నీరు తుడిచాడు. పక్క సరించాడు జారిపోయిన దుప్పటి సరిగ్గా కప్పాడు

లక్ష్మమ్మకు తరువాత కొద్దిరోజులకే పథ్యం పెట్టారు సరిగా లేచి తిరిగే ఓపిక రాలేదు పడక కుర్చీ కిటికీవద్ద వేయించుకొని కూర్చొని గలుగుతున్నది. ఇప్పుడు జగ్గడి మకాము ఆ గదిలోనే. మనమడి ఆటపాటలతో రోజులు గడుపుతున్నది.

సంవత్సరమే కొడుక్కూ కూతురికీ పెళ్ళిచేయాలనీ వాళ్ల సంసారాలు వాళ్ళు దిద్దుకొంటూ ఉంటే చూచాలనీ లక్ష్మమ్మ కోరుకొంటున్నది అనవసరంగా తానుగాభరాపడ్డది. దీనికి అంతకూ మూలం ఆ చంద్రశేఖరమే ఎటు తిరిగి అతనికి శిక్షపడకతప్పదంటున్నారు. రోగం అలాగే కుదరాలి! అనవసరంగా పండువంటి సంసారానికి ఎన్ని ఇబ్బందులు తెచ్చిపెట్టాడు! ఇప్పుడు వాడి ప్రస్తావన దేనికి? జీవితం ఎంత సుఖంగా ఉన్నది! తనకు అలాంటి భర్తను, బిడ్డలను, కోడలిని ప్రసాదించినందుకు లక్ష్మమ్మ లోలోన ఈశ్వరుడికి నమస్కరిస్తూ వచ్చింది మరో జన్మలోనైనా తన కింతకన్నా సుఖం అవసరం లేదనుకొన్నది



జి వి కృష్ణరావు

. ఇరవై ఐదు . .

లలిత తండ్రీ తమ్ముడూ ఇల్లూ వాకిలి పొలంపుట్ర అమ్మిబాకీలు తీర్చుకొని నైజాం బయలుదేరి పోయేరోజు సమీపిస్తున్నది ఆ మరునాడే తెల్లవారుజామున లేచి వెళ్ళి సర్దవలసిన వస్తువులు సర్దుదామని యదాలాపనగా పండుకొన్నది తెల్లవారుజామున నాలుగు గంటలకు ఎవరో వచ్చి తలుపుతట్టగానే లేచింది. తమ్ముడు కనిపించాడు బెడ్‌లైటు గ్రుడ్డివెలుగులో వెలవెలపోతున్న ముఖం కనిపించింది.

"నాన్న .... నాన్న. . " అన్నాడు అంతకు తప్ప అతని నోటివెంట మరొక మాట రాలేదు. బయట అలాగే నిలబడి పోయాడు.

"లోపలికి రావేంరా? నాన్నకేం?"

తమ్ముడు వెంటనే సమాధానం చెప్పలేకపోయాడు కాళ్ళీడ్చుకొంటూ లోపలికి వెళ్ళి నేలమీద చతికిలబడ్డాడు. సంగతి కనుక్కోటానికికూడా భయపడి లలిత అలాగే నిలబడిపోయింది. ఏమి చెబుతాడా అని కళ్ళు అప్పగించి చూస్తూ ఊరుకొన్నది అతడు చెప్పలేక చెప్పాడు "నిన్నటి
118 సాయంకాలంనుండి నాన్న కనిపించలేదు. ఊరంతా వెదకాను కనపించినవాళ్ళనల్లా అడిగాను అంతా మాకు తెలియదంటే మాకు తెలియదన్నారు పొలాలు పోయి వెదకాను కనిపించలేదు బావులు చెరువులు వెదకాను. చివరికి చావట్లో మచ్చుపైన వెన్నుగాడినుంచి వేలాడుతున్నాడు "

చంద్రశేఖరం ప్రొద్దెక్కిన తరువాత లేచి ముఖం కడుక్కొని చూస్తే లలిత పిచ్చిచూపులు చూస్తూ కూర్చుని ఉంది పొయ్యిలో పిల్లి లేవలేదు. "అలా ఉన్నావేం? ఏమి జరిగిందేమిటి?" అని అడిగాడు "ఏమీ లే"దని లలిత జవాబు చెప్పి ఊరుకొన్నది.

ఆనాడు కూడా లలిత చచ్చినట్లు ఇంటిపనంతా చేసుకోవలసి వచ్చింది పెద్ద పిల్ల బడికిపోవాలి చిన్న వాళ్ళను ఇద్దర్నీ కనిపెట్టి ఉండాలి. తూర్పువైపుకు వెళ్ళి మజ్జిగ పోయించుకొని రావాలి. దక్షిణంవైపుకు వెళ్లి రెండుబిందెలు మంచి నీళ్లు పట్టుకు రావాలి ఈ పనులు చేస్తున్నంతసేపు లలితకు తనతండ్రి తనవెంట వస్తున్నట్లే తోచింది తరతరాలనుంచి వస్తున్న ఊరూ, ఇల్లూ విడిచిపెట్టి పోలేక తండ్రి నిండుప్రాణాలు తీసుకొన్నాడు చావిట్లో వెన్నుగాడినుంచి వేలాడుతున్నట్లుగా తండ్రి కన్నులకు పొడకట్టాడు చిన్నప్పుడు ఆ చావిట్లోనే తాను దాగురుమూత లాడింది. ఆ మచ్చుమీదనే అమ్మ కొట్టినప్పుడు, అయ్య కోపపడినప్పుడు అలిగి దాగుకొన్నది. "ఈ తప్పంతా నీదే వాణ్ణి ఎందుకు పెళ్లి చేసుకున్నా? దానివల్లే ఈ గతి పట్టింది" అంటున్నట్లుగా ఆమె చెవుల్లో మ్రోగింది. అడుగు ఆమడైపోయింది.

ఈ వార్త శేఖరానికి తెలియగానే కుప్పనకూరగా కూలాడు రెండుచేతులతో ముఖం కప్పుకొన్నాడు. మామ ఎదురై "దీనికి అంతకూ నువ్వే కారణం!" అన్నట్లుగా తోచింది కెవ్వు మన్నాడు.

''ఎలా, దీనిక అంతకూ కారణం నేనే ఈ భారం నేనే మోయలేను ఆదుకోవూ?''

ఆమె మాట్లాడలేకపోయింది ఆ మధ్యాహ్నం లతడు ఇంటికి వచ్చి చూచేటప్పటికి లలిత నట్టింట కూర్చుని పిచ్చిచూపులు చూస్తున్నది పిల్లవాడు పైటకొంగు పట్టుకొని, ''అమ్మా అమ్మా'' అని పిలుస్తూ ఏడుస్తున్నాడు ఆమె ఉలకలేదు శేఖరాన్ని కూడా ఆ పిచ్చితోనే చూచింది తన్ను చూచి భయపడుతున్నదో అసహ్యించుకొంటున్నదో అతనికి అర్థం కాలేదు నిజానికి దీనికి తానే కారణమన్న సంగతి అతనికి తెలుసు ''ఉన్నది చాలక ఈ నిందకూడా నానెత్తిమీదనే వెయ్యాలనుకొంటున్న''దని అనుకొన్నాడు అతనికి చికాకు కలిగింది ఈ అగచాట్లకు లలితే కొంత కారణ మన్నట్లు భావించసాగాడు

ఒకరంటే ఒకరికి భయంకలిగి ఎడపెడగా ఉంటూవచ్చారు అన్యోన్యానురాగంతో సంవత్సరాలు గడపిన దంపతులను నాటి దారిద్ర్యం, పాడుబడ్డ కొంప, ఆ సంఘటన ఒండొరులకు దూరంచేసింది లలిత పిల్లవానికోసమని పాలు పొయ్యిమీద వేసి ముందు కూర్చుని చూస్తూనే ఉన్నది ఉరి పోసుకొని వ్రేలాడుతున్న తండ్రి కనిపించాడు పిల్లలతో వచ్చెయ్యమన్న మాటలు ఆమె చెవులలో గింగురుమన్నవి భయంతో కంపించి పోయి నిలువుగుడ్లు వేసింది. పొయ్యిమీద పాలు పొంగు తున్నవి ఆమెను గూర్చే తండ్రి ఆందోళనపడుతూ వచ్చాడు అలాంటితండ్రి మరణానికి తానే కారకురాలైంది



పాలు పొంగిపోతున్నవి లలితకు ఆపొంగులే కనిపించలేదు క్రింద భూమి క్రుంగి పోతున్నట్లనిపించింది ఏదో భయంకర హస్తాలు తన్ను లాక్కొని పోవటానికి వస్తున్నట్లు కనిపించి ఆపాదమస్తకం వణకిపోయింది ఆత్మరక్షణకోసం తెలియకుండానే ప్రయత్నించసాగింది

అసలు ఆస్తిపోవటమే వచ్చింది నిజంగా తన భర్తకు ఏ పాపమూ తెలియకపోతే తండ్రి తనవద్ద చెప్పిన ధర్మపన్నాలు ప్రత్యర్థులకు చెప్పి ఉండవచ్చు శేఖరం నిరపరాధిత్వంలో ఆమెకు రక్షణ కనిపించింది. అతడు నిర్దోషి కాకతప్పదు.

ఆనాడు శేఖరం మామగారి యింటికి వెళ్లాడు. వెళ్ళటానికి కాళ్లురాక లలిత ఇంటిలోనే చతికిలబడ్డది. శేఖరంకూడా తీరా చావడివద్దకుపోయి వ్రేలాడుతున్న మామదేహం చూడలేక వెనుకకు తిరిగివచ్చాడు. అతడు వచ్చేటప్పటికి లలిత చేతులతో ముఖం కప్పుకొని ముంజేతులు బల్లమీద ఆనించి కుర్చీలో కూలబడిఉన్నది.

''పిల్ల లెక్కడ?'' క్రిందికి చూస్తూ శేఖరం అడిగాడు

''పంపించివేశాను.'' ఆ గొంతులో నిస్పృహ ధ్వనించింది.

అతనికి ఘోర అనుమానం కలిగి ప్రక్కగదితడిక నెట్టి చూచాడు అక్కడకూడా పిల్లల కనిపించలేదు '' ఎక్కడకు పంపించావు?''

''మీమేనత్తకు కబురుచేస్తే వచ్చి ఇంతకుముందే తీసుకువెళ్ళింది ''

శేఖరం భార్యవంక అలాగే చూస్తూ నిలబడ్డాడు

---

జి వి కృష్ణరావు

''మీకైనా కొంత ఊరట కలుగుతుందని పంపించాను ''

లతడు మాటాడలేదు

ఆ రాత్రి పడకగది బావురుమన్నది పిల్లల మంచాలు వాల్చకుండా అలాగే ఉన్నాయి లలిత భయంతో అభిముఖంగా తిరిగి భర్తకు దగ్గరలో వేరే పక్క మీద పండుకొన్నది అతని నిరపరాధిత్వాన్ని ఆశ్రయించింది. అతనికి అండగా నిలిచి అతనిపట్ల తనకున్న భక్తివిశ్వాసాలు వ్యక్తం చేయాలని అభిలషించింది అయినా మాటాడలేదు నిర్దాక్షిణ్యంగా మాట్లాడటం ఇష్టంలేదు సాంత్వనవాక్యాలు చెప్పలేకపోయింది ఆ ప్రశాంతత అంతకంతకూ దుర్భరమైపోయింది పిల్లల పలవరింతలు లేవు పక్కలమీద మెదలుతున్న జాడలేదు ఉచ్ఛ్వాస నిశ్వాసాలు లేవు వాళ్ళు కప్పుకొనే దుప్పట్లు సవరించవలసిన అవసరం అంతకన్నా లేదు ఆ ప్రశాంతతవల్లను, ఇటీవల ఇరువురిమధ్య వచ్చిన పొరపొచ్చాలవల్లను ఆత్మావలోకనంలో పడ్డారు ఇరువురకు ఉరిపోసుకొని వ్రేలాడుతున్న వృద్ధుని శరీరం గోచరించింది.

శేఖరం మంచంమీద పండుకొని భార్యవంక చూస్తున్నాడు అసలు పండుకోటానికే లలిత భయపడ్డది పిల్లలకోసమని మళ్ళా ఇల్లు నలుమూలలూ వెదకింది.

''కనీసం ఈసారైనా నావల్ల తప్పు లేదు అయితే ఏమి లాభం? ఈ అభాండం కూడా నానెత్తిమీదనే వేస్తుంది'' అనుకొన్నాడు శేఖరం.

ఎలాగైతేనేమి, చివరికి లలిత అతని ప్రక్కమీదికి చేరుకొన్నది చేతులు తలక్రింద పెట్టుకొని వెన్నెలగాడివంక చూస్తున్నది. తాను నిద్రపోయిన తరువాత ఆమె ఎలాంటి అఘాయిత్యానికి పూనుకొంటుందో? మంచానికి దాపుననే చిన్న లాంతరు వెలుగుతున్నది దానిని ఆర్పివేయటానికి అతడు సాహసించలేకపోయాడు.

''లాంతరు పెద్ద జేయరా?'' ఇంకా వెన్నెలగాడివంక చూస్తూనే లలిత అన్నది

చిట్టచివరికి అతడు లాంతరు పూర్తిగా తీసివేశాడు కిటికీలో నుంచి వెన్నెల వస్తూ ఉన్నది ఇద్దరూ ఆ వెలుతురువైపే చూస్తున్నారు. పిల్లలను సర్దవలసిన అవసరం ఎవరికీ లేదు అందువల్ల అలాగే పండుకొని చూస్తున్నారు. లలితకు తండ్రి కడసారిగా భర్తనుగూర్చి చెప్పిన మాటలు స్ఫురించాయి. ''అప్పుడే నాకష్టాలు చెప్పుకొని ఉంటే బాగుండేది చేయి జారిపోయినతరువాత ఇప్పుడు ఏడ్చి ప్రయోజన మేమిటి? గతం తిరిగిరాదు అసలు నేనేమి చేశాను?''

''శేఖరానికి మామవద్ద తుదిసారిగా వెయ్యి రూపాయిలు పుచ్చుకొన్నప్పటి ఘట్టం కన్నులకు పొడకట్టింది తాను అబద్ధాలు చెప్పాడు మామను ప్రోత్సహించాడు ఆ మాటలు తాను నమ్మాడు. తన ఆదర్శాలు నేగ్గేలాగే కనిపిస్తున్నవి వాటిని ఈనాడూ నమ్ముతున్నాడు. వాటిపర్యవసాన మేమిటి? అతడు కంపించిపోయాడు అతనివిచారం లలిత చూచింది దానితో ఆమెదుఃఖం పొంగిపొరలింది ''ఇది వారి తప్పా?'' ఆ పక్షంలో తానుకూడా అపరాధినే ''కాదు తప్పువారిది కాదు. ఎవరిదీ కాదు. ఆయన నిర్దోషి కాకతప్పదు ''

ఆమె చేయి చాచింది అతడు పట్టుకొన్నాడు ''ప్రేమించినప్పుడు పెండ్లిచేసుకోవటం తప్పా?'' అనుకొన్నది వెనుకటి సుఖజీవితం జ్ఞప్తికి తెచ్చుకొన్నది. దానితో తన నిర్దోషిత్వం రుజువై పోయింది కాని ఉరి పెట్టుకొని వ్రేలాడుతున్న తండ్రి ఆక్షేపిస్తున్నట్లు కనిపించి వణకిపోయింది. భర్తచేయి గట్టిగా పుచ్చుకొన్నది దానితో ఇరువురికీ కొంతవరకు మనసు దిటవుపడ్డది. ఒండొరులను గూర్చి ఆలోచించ మొదలుపెట్టారు సానుభూతి కలిగింది తమదుఃస్థితి అర్థంచేసుకోగలిగారు

''నీస్థితి మరీ దుర్భరం'' అని శేఖరం భార్యకై వాపోయాడు.

''మీ స్థితి తలచుకొంటే కడుపు చెరువైపోతున్నది'' అన్నది భార్య.

''నేను మగవాణ్ణి పైగా చచ్చిపోయింది మీ నాన్న'' అన్నాడు శేఖరం

ఈ మాటతో తండ్రిశవం కన్నులకు పొడికట్టి ఆమె కంపించిపోయింది. భర్త నిర్దోషిత్వం క్రింద తలదాచుకోతలచింది. అతనిని అనుకొన్నది. ఆమెకు అతడు తన దుష్టుటి కప్పాడు. ''అతడు ఇలా చేయకపోతే ఇదంతా జరిగిఉండేది కాదు'' అన్నది. ఆమె ఉద్దేశం శేఖరానికి అర్థమైంది. పుల్లయ్య మొదలైనవాళ్లలో అధర్మం మూర్తీభవించింది ఆ షావుకార్లలో పాపం పలుకుతున్నది. తాము న్యాయం కోసం సత్యంకోసం పోట్లాడుతున్నట్లు తోచింది. ముఖ్యంగా భార్యనోట ఈ మాట విన్నప్పుడు శేఖరానికి ఎంతో ఉత్సాహం కలిగింది

కొంత సేపటికి లలిత మెల్లగా అన్నది, ''బహుశా మాధవయ్య భార్యను ఒత్తిడిచేసి ఆ వాఙ్మూలం ఇప్పించి ఉంటాడు '' 

''అంతే'' అన్నాడు శేఖరం

''పాపం! కార్మికులకు ఈ అగచాట్లు తప్పవు ''

''వ్యవహారాలు ఇలా ఉంటే మరి ఎలా తప్పుతాయి?'' భార్య అందుకొన్నది.

శేఖరానికి ఈ మాట ఉత్సాహం కలిగించింది లోగడ తాను ఈ మాట అంటేనే లలిత కసురుకొన్నది. నేడు ఆమె నోటిమీదుగానే ఇన్నిమాటలు వస్తున్నవి ఆమెకు కూడా భర్తభావాలలో సంపూర్ణ విశ్వాసం కలిగింది

''కార్మికులభీమాలు మొదలైనవి ప్రవేశపెడితే బాగుండేది'' అన్నది.

''అవును ఆ అవకాశాలు ఇప్పుడు లేవు.''

''మిల్లు సాగితే కార్మికులు బాగుండేవాళ్లు కాదూ?''

''ఎంతోనా. షావుకార్లు గూడుపుఠాణీ సాగించి అంతా ధ్వంసంచేశారు.''

''ఇప్పటిదాకా నాకు వాళ్ళకిరాతకం తెలియలేదు. ఎంత దుర్మార్గులు! తోటివాళ్లు పచ్చగా ఉంటే కళ్ళల్లో నిప్పులు పోసుకొంటారు. మిమ్మల్ని అర్థం చేసుకోలేక పోయాను. నన్ను క్షమించరూ?''

''క్షమించటానికేముంది! నింపాదిగా నీకే అంతా అర్థమౌతుంది'' అన్నాడు.

ఒండొరులలో అపారవిశ్వాసం ఏర్పడింది లోకమంతా తప్పుడు త్రోవన పోతున్నది ఇద్దరూ ఏకీభవించి అన్యాయాన్ని ఎదుర్కొనితీరాలి

---

జి వి కృష్ణరావు

## . ఇరవై ఆరు .

డాక్టరు స్నానాదికం తీర్చుకొని కాఫీతాగి మందుల సంచి సర్దుతున్నాడు ఇంతలోనే 'డాక్టరుగారు. డాక్టరుగారు!'' అని వగర్చుకొంటూ ఒకరిద్దరు పరుగెత్తుకు వచ్చారు అతడు బిత్తరపోయి అలాగే నిలబడ్డాడు అలసటతో రొప్పుతూ ''మరే, మరే'' అంటున్నాడు తప్ప మరొకమాట చెప్పలేదు రెండవవాడు అసలే మాట్లాడలేకపోయాడు ''ఏమిటిరా సంగతి, చెప్పవేంరా?'' డాక్టరు మల్లయ్య కొడుకుభుజం పట్టుకొని ఊపాడు. ఎలాగో తెమల్చుకొని మొదలుపెట్టాడు ''పాటకజనమంతా జెండాలు పుచ్చుకొని అరుచుకొంటూ ఊళ్ళోకి వచ్చారు పుల్లయ్యగారి చావడివద్దకు రాగానే నిలబడి పెద్దకేకలు పెట్టారు వాళ్ళగిత్త బెదరి తాడుతెంపుకొని జనంమీద పడ్డది ఒక కుర్రవాణ్ణి డొక్కలో కుమ్మింది ఆ కుమ్మటం కుమ్మటం పేగులు బయటికొచ్చాయి. మరొక ముసలాణ్ణి తొక్కింది ఇంతలోనే పోలయ్య బాణాకర్ర తీసుకొని గిత్తను ఎక్కడ కొట్టాడో ఏమో గింగిరాలు తిరిగి పడ్డది, అన్ని వందలమందిలో ఒక్కడుంటే
122 ఒట్టు ఎక్కడాళ్లు అక్కడ పారిపోయారు.''

సత్యనారాయణను కేక వేసి డాక్టరు పిల్లలతో పుల్లయ్య చావడివద్దకు పరిగెత్తాడు పిల్లవాడు స్పృహతప్పి పడి ఉన్నాడు రక్తం కారుతూ ఉంది. ముసలివాడు కూర్చుని లేవలేక మూలుగుతున్నాడు గిత్తవద్ద పెద్దబడితె పుచ్చుకొని పుల్లయ్య ఆపాదమస్తకం కోపంతో వణకిపోతూ ఎవడు వచ్చినా చంపివేద్దామన్న దృష్టితో అటూ ఇటూ పచారులు చేస్తున్నాడు డాక్టరు పిల్లవాణ్ణి సరియైనపాటున ఎత్తుకొని, ముసలివాణ్ణి ఎలాగైనా ఇంటివద్దకు తీసుకురండని హెచ్చరించి బయలుదేరాడు

సత్యనారాయణ పుల్లయ్యదగ్గరకు పోవటానికి భయపడ్డాడు. అతడు ఈ జగత్తులో లేడు ఎవరు దగ్గరకు వెళ్ళినా ఆ బడితె నెత్తిమీదపడక తప్పదు పుల్లయ్యతత్త్వం అతనికి తెలుసు సత్యనారాయణకూడా గిత్తవైపు తిరిగి చూస్తూ అలాగే నిలబడ్డాడు. అదేమి చిత్రమో ఆ ప్రాంతంలో మానవసంచారం లేదు. రెండుబార్ల ప్రొద్దెక్కింది. ఇంతలో కట్టగారు పెయ్య కట్టుత్రాడుతో పరుగెత్తుకొనివస్తున్నది. సత్యనారాయణ నడివీధిలో అలాగే నిలబడి ఉన్నాడు వెనుక కుశాలయ్య అరుచుకొంటూ వస్తున్నాడు

''పెయ్య వస్తున్నది, పంతులుగారూ తప్పుకోండి!'' అని పుల్లయ్య అన్నాడు సత్యనారాయణ ప్రక్కకు తప్పుకొంటూన్నాడు ''తల ఇసిరేది కాదు. పట్టుకోండి పంతులుగారూ! పట్టుకోండి?'' అని కుశాలయ్య కేకవేసి చెప్పాడు. పంతులు పెయ్యతాడు పట్టుకొన్నాడు ఇంతలోనే కుశాలయ్య దగ్గరకు వచ్చి పెయ్యతాడు పట్టుకొని చచ్చిపడివున్న గిత్తవంక చూస్తూ ''దుర్మార్గులు ఎంతపని చేశారు! చూస్తూ చూస్తూ నిండుజీవం తీశారే!'' అన్నాడు

''లవుసు మరాలయ్యా, మానవుడు చెయ్యరాని పని చేశారు'' అన్నాడు

''ఎంతసేపు దాన్ని ఇక్కడ ఉంచటం  ఇప్పుడే యీ పెయ్యను కట్టేసి మనుషుల్ని పిల్చుకొస్తాను'' అని చెప్పి మరాలయ్య తన పెయ్యను ఇంటిముందు కట్టివేసి, రామయ్యను ఇంకా నలుగురు రైతులను పిల్చుకువచ్చాడు  దొడ్లోకి తీసుకు వెళ్ళిమాత్రం ప్రయోజనమేముంది? వెంటనే తీసుకువెళ్ళి పాతివేసి రావటం అవసరమని నిర్ణయించారు  చావట్లో నుంచి పుల్లయ్యగారి పెద్దెడ్ల జత కట్టుకొని బండి తోలుకువచ్చారు  ఇంతలోనే ఊళ్ళోజనం పోగైంది  గిత్తశవాన్ని బండిమీదికి ఎక్కించి బయలుదేరారు. ఇంతలో రామయ్య గిత్తను ఊళ్లో ఊరేగించి పొలం తీసుకెళ్ళదామన్నాడు క్రమంగా దానితో అంతా ఊరేగించాలంటే ఊరేగించాలన్నారు  మరొకాయన ఊళ్ళో సన్నాయిమేళం పిల్చుకొని వచ్చాడు.

బండిబయలుదేరేటప్పటికి ఒక మల్లయ్య, బ్రాహ్మణులు, కోమట్లు తప్ప మిగతావారంతా పోగయ్యారు  వాకిలి వాకిలి ముందు బండి ఆగుతూ వచ్చింది  ప్రతియింటిముందు కడవ రెండు కడవలు వారపోసి పసుపుకుంకుమ తెచ్చి గిత్తమీద పోశారు  ఉన్నవాళ్లు పత్తిగింజలు పోశారు. ఊరేగింపు సాంతమై అంత్యక్రియ ముగిసేటప్పటికి సాయంకాలమైంది  అంతవరకు పుల్లయ్య అక్కడే ఉన్నాడు  సత్యనారాయణ మాత్రం బండిబయలుదేరగానే ఇంటికివచ్చి స్నానం చేసి పడుకొన్నాడు.

ఆ సంఘటనతో ఊళ్ళోవాళ్ళంతా పాటకజనంమీద మండిపడ్డారు  పుల్లయ్యమిద అందరికీ సానుభూతికలిగింది  వీళ్ళు శ్రుతిమించి రాగానపడుతున్నారు  అలుసు దొరకబట్టే కదా దొమ్మీగా ఊళ్ళోకి వచ్చిపడ్డది! ఈనాడు ఈ పనిచేసినవాళ్లు రేపు ఏ పని చెయ్యరు? ఊళ్లో కట్టుడి లేకపోబట్టే ఇలాంటిది జరుగుతున్న'' దని కొందరన్నారు  పితపకాలం వచ్చింది  పితపబుద్ధులు పుడుతున్నా'' యని ముసలివాళ్ళు అన్నారు  అంతేకాని పిల్లవాడు బ్రతికాడా చచ్చాడా అని కాని, ముసలివాడు ఏ మయ్యాడా అని కాని అడిగినవాళ్ళు లేరు. పోయి డాక్టర్ని కనుక్కొన్నవాళ్ళు అంతకన్నా లేరు



ఆ నాటిరాత్రి పొద్దుపోయినతరువాత డాక్టరు ఇంటి తలుపు తట్టారు  ''ఎవరది?'' అంటూ శాస్త్రి తలుపు తెరిచాడు. ఆ చీకట్లో నిలబడ్డవ్యక్తిని పరకాయించి చూచాడు

''నువ్వా! – ఎంత దుర్మార్గుడివిరా!''

''నేను బతకటమే పాపం జరగదు  అసలు ఊరేగింపు వద్దురా మొర్రో అని మొత్తుకోటమేంటి? పాట్లో వాళ్ళంతా పట్టుపట్టి నన్ను లాక్కురాటమేంటి? పుల్లయ్య దొరగారి చావిడికాడికి రాంగానే శివమెక్కి గల్లంతుగా అరవటమేంటి? తాడు తెంచుకొని అది జనంమీద పడటమేంటి? అది నా పిల్లోడి డొక్కలోనే కుమ్మట మేంటి? రగతం నాకళ్ళబడటమేంటి? అంతమంది ఉంటే నే పోయి కొట్టటమేంటి? అది చావటమేంటి? నాకర్మ దొరగారు. నేను బతకటమే తప్పు... అసలు నాకు చావు ఎందుకు రాలేదు? మీరన్నట్టు నేను నిజంగా దుర్మార్గుణ్ణే బాబు!''

పోలయ్య ఇలా అంటాడని డాక్టరు ఎప్పుడూ అనుకోలేదు. నిజానికి ఈ పరిస్థితులన్నీ అతనిమనస్సుకే తట్టలేదు. ఇంతవరకూ పిల్లవాడికి అంతప్రమాదమైన గాయంతగిలి మేజర్ ఆపరేషన్

చేస్తూ ఉండేవాడు రాకపోయాడని కోపగించుకొన్నాడు అతనిమాటలవల్ల ఇప్పుడు బోధపడింది ఊళ్ళో వాళ్ళు పోలయ్య కనిపిస్తే ప్రాణాలతో వదలరు

''అక్కడ దేనికి? ఇటు లోపలికి రా!'' ఆందోళనతో పోలయ్యను లోపలికి లాక్కువెళ్ళాడు

''ఎలా ఉంది దొరగారు?''

శాస్త్రి పోలయ్యకు నిద్రపోతున్న కొడుకును చూపించాడు ''ప్రమాదముమాత్రం గడచింది ఈ ఇరవై రోజులు జాగ్రత్తగా చూడాలి కదలనివ్వగూడదు'' అని చెప్పాడు

''ఆ ముసలాడో?''

''కొద్దిగా దెబ్బలు తగిలాయి పెద్ద ప్రమాదమేమీ జరగలేదు ఉదయానే పంపించివేశానే! చూడలేదా?'' ''అసలు నేను పాటిలోకే వెళ్ళలేదు.''

''ఇక జరగవలసిందేమిటి?''

''ఇదే తొయ్యడం లేదు.''

''నిన్న ఊరేగింపు ప్రారంభించిన పెద్దల్ని అడగక పోయావా?''

124 ''అన్నీ తెలిసిన మీలాంటి దొరలే అట్టాఅంటే మాలాంటి పీదోళ్లు ఏం కావాలి?'' పోలయ్య గొంతు జీరపోయింది

''చాలా తెలివితక్కువ పని జరిగింది ప్రశాంతంగా పోతే పోయేది. ఇప్పుడు చూడు ఎలా ముంచుకువచ్చిందో! మాట్లాడటానికి ఎక్కడైనా సందున్నదీ!''

''కాస్త మీలాంటి దొర లుండబట్టే మాలాంటోళ్ళకు బతుకులు తెల్లారుతున్నాయ్.''

''ఇంతకూ నన్నేమి చెయ్యమంటావా? ఆ ఊరేగింపు సాగించేటప్పుడే ఈ మాత్రం ఆలోచన ఉంటే!''

''అప్పుడే వద్దని చెప్పాను దొరగారు ఇంటేనా! నలుగుర్నీ కాదని ఎట్టా బతికేట్టు చెప్పండి? మళ్ళీ పాట్లో ఉండటానికి వీలవుద్దా దొరా?''

డాక్టరు ఆలోచించాడు. కుర్చీలోంచి లేచి ఒకటి రెండు సార్లు అటూ ఇటూ పచారుచేశాడు.

''అయితే నువ్వు వెంటనే ఆయనవద్దకు వెళ్ళి కాళ్ళు పుచ్చుకో.''

''పుల్లయ్యగారి దగ్గరికా?'' విస్తుపోయి అడిగాడు పోలయ్య

''అవును అతనివద్దకే అంతకుతప్ప మార్గం కనుపించటం లేదు ఈ లగావా ఇంతటితో సమసిపోవాలంటే అంతే అయితే అతడు ఎంతవరకు ఒప్పుకొంటాడా అన్నది కూడా సందేహమే ఊళ్ళో ఇంత అల్లరిచేశారు అతని ఎద్దును చంపి వేశారు అతనుమాత్రం ఊరుకొంటాడా?''

పోలయ్య మాట్లాడలేదు ''నువ్వు ఇక్కడే ఉండు నేను ఇప్పుడే వస్తాను'' అని చెప్పి డాక్టరు ఉత్తరీయంవేసుకొని వెళ్ళాడు అతడు అక్కడే కూర్చున్నాడు. మనస్సుమాత్రం ఆలోచిస్తూనే ఉన్నది భవితవ్యం అంధకారబంధురంగా కనిపించింది. తాను ఒక్కడే అయితే ఫరవాలేదు. పెళ్ళాము, పిల్లలు. అది రోగాలకొంపిది పిల్లలు ఎక్కివచ్చినవాళ్ళు కారు ఇప్పుడిప్పుడే కాస్త చేతికి కాలికి అందివస్తున్న పెద్దవాడికి ఈ గతి పట్టింది. ఇలాంటి సంసారం ఎలా ఒడ్డుపడుతుంది? తన్ను జైలుకు పంపితే వాళ్ళగతి ఏమౌతుంది? ఆలోచిస్తున్న కొలది మతిపోయేటట్లు కనిపించింది. అందుకని కళ్లు కట్టిగా మూసుకొన్నాడు చచ్చిపడ్డ గిత్త ఒకవైపు, ప్రేగులు వెళ్ళుకొచ్చిన పెద్దకొడుకు మరొకవైపు కనిపించారు ఒళ్ళంతా చెమటలు పోసుకొచ్చాయి లాభం లేదని కళ్ళు తెరచాడు. ''బగమంతుడా! ఎంత గతొచ్చిపడ్డది!'' అనుకొన్నాడు. లేచి ఆ హాల్లో ఒకటి రెండుసార్లు పచార్లు చేశాడు. ఇంతలో కొడుకు మూలుగు, పలవరింతలు వినిపించాయి. ఉలిక్కిపడి అంతలోనే తెప్పరిల్లుకొన్నాడు. ''తెల్లవారు జాముకైనా డాకటేరుగారు వచ్చేనా?'' అనుకొంటూ ఆవలించాడు ఇంతలోనే తలుపులు నెట్టుకొని శాస్త్రి తిరిగి వచ్చాడు.

''ఏమైంది కావటానికి? తన గిత్త ఎటులేదన్నా ఆరువందలు చేస్తుంది. ఆ ఆరువందలు ఇవ్వాలట, లేదా నువ్వు ఈ ఊళ్ళో మళ్ళీ కనిపించగూడదట!'' డాక్టరు నిట్టూర్చాడు.

''ఆరొందలుంటే ఈ సంగాలు, ఈ ఊరేగింపులు దేనికి దొరగారు?'' 125

''అదే నేనూ చెప్పాను.''

''ఇక నాసంగతి అంటారా? ఈ ఊళ్ళో పుట్టాను. ఈ ఊళ్ళో పెరిగాను. మంచిగా పొట్టకోసం యాడ కెళ్లినా పరవాలేదు ఊళ్ళో ఇంత జరిగింతరవాత యాడ ఉండనిత్తారు ధొరగారు? ఎద్దలవారి పోలిగాడని తరిమికొట్టరా? ఏ ఆసామి నన్ను మళ్ళీ జీతానికి పెట్టుకుంటాడు? నాకు చేతనైంది ఎగసాయంతప్ప మరోటి లేదు ఇంతవిందె నెత్తి వేసుకొని పనిపాటలు లేక ఏ దేశం తిరిగేది బాబు? మీరే చెప్పండి నాయం?''

''ఏమని చెప్పమంటావ్, విశ్వాసంకూడా ఉంచకుండా ఆ ఆసామి అంత ఖండితంగా మాట్లాడుతుంటే? లాభంలేదు. నా శక్తికొలది ప్రయత్నం చేశాను వినవప్పుడు నేనేంచేసేది?''

పోలయ్య కాసేపు మాటాడలేదు.

''ఇక ఏం జరగాల దొరగారు?''

''అదే పాలుపోవటం లేదు సరే! నువ్వే ఒకసారి పుల్లయ్యను చూడు. అప్పటికీ కాదంటే జరగవలసిందేదో జరుగుతుంది. నీపిల్లవాడికి వచ్చిన ఇబ్బంది ఏమీ లేదు వాడి కోసం దిగులు పెట్టుకోకు ''

''మీలాటి మారాజులు నూటికి కోటికి ఓరు ఉండఎట్టే మాలాంటోళ్లు ఇలా ఎటుఎటున్నాం బాబు వస్తా'' అంటూ రెండుచేతులెత్తి నమస్కరించి పోలయ్య వెళ్ళిపోయాడు

''జంతువులనైనా దేవుడిలాగ కొలుచుకుంటాము కాని మానవుడు తోటిమానవుణ్ణి సహించలేడు'' అని డాక్టరు నిట్టూర్చాడు

మరునాడు డాక్టరు నిద్రమంచంనుంచి లేచి లేవకముందే ఒక కుర్రవాడు వచ్చి పున్నయ్య చావుబ్రతుకుల్లో ఉన్నాడనీ, రోగి ఎలాగైనా డాక్టరును చూడగోరుతున్నాడనీ చెప్పాడు ఆదరాబాదరా అతడు మందుసంచి పట్టుకొని బయలుదేరాడు

పున్నయ్య మూడు నెలలనుంచి మంచాన తీసుకొంటున్నాడు అతనిరోగం నయంకాదని డాక్టరుకు తెలుసు. ఆ సంగతి బయటికి చెప్పలేదు. పున్నయ్యభార్య అది ఊహించలేకపోలేదు వయసు మీరింది చేతిలో ఎర్రని ఏగాని లేదు డాక్టరు ఉచితంగా చికిత్స చేయగలవాడేకాని మందులుకూడా ఎక్కడ కొనివ్వగలడు? అందువల్ల తాను చేయగలిగినంతవరకూ సపర్యచేస్తూ దేవుడిమీద భారంవేసి ఊరివెలుపల ఉన్న పుల్లయ్యగారి పూరిచావట్లో రోజులు గడుపుతూ ఉంది

పుల్లయ్యగారి ఊరిలోని చావడిమీదుగానే డాక్టరు పోవాలి అతడు పోతూ దొడ్డివైపు చూచాడు పుల్లయ్య పడిపోయిన కూరగాయ మొక్కలు లేవనెత్తి తిన్నగా కడుతున్నాడు

''ఇవాళ మీరు శ్రమపడుతున్నారే! జీతగాడు రాలేదా యేమిటి?''

''ఆc, శ్రమేమి ఉన్నది? రైతు అన్న తరువాత నిక్కుపోతే వ్యవసాయం ఏం చేస్తాడు? మట్టి పేడ పిసకగలిగితేనే వ్యవసాయం ''

''అందుకే కులవృత్తికి సాటిలేదు గువ్వలచెన్నా అన్నారు '' శాస్త్రి నవ్వుతూ వెళ్ళాడు

పున్నయ్య ఇంటిదగ్గరకు వెళ్ళగానే ఏడుపు వినిపించింది. చెప్పుల అలికిడి విని పున్నయ్యభార్య పైటకొంగుతో కళ్ళు ముక్కు తుడుచుకొని వచ్చి డాక్టర్ని లోపలికి తీసుకువెళ్ళింది. మంచంప్రక్కనే వేసివున్న పీటమీద కూర్చుని అతను రోగిని చూచాడు. హంస ఇంకా ఎంతోసేపు నిలుపదు. రోగి ఇంకా తెలివిలోనే ఉన్నాడు డాక్టర్ని గుర్తుపట్టి ఎక్కడో నూతిలో నుండి మాట్లాడుతున్నట్లుగా ప్రారంభించాడు. అతడు చెవి దగ్గర పెట్టి వింటున్నాడు.

''డాక్టరుగారూ! ఎటుతిరిగి చచ్చిపోతున్నాను ఇప్పుడుకూడ అబద్ధం చెప్పలేను. ఈ ఒక్కమాట మీచెవిని వేయటానికి ప్రాణాలు కొట్టుకొంటున్నాయి నిజంగా పుల్లయ్యగారు శేఖరానికి హామీ ఉన్నాడు సాక్షిసంతకాలు జరుగుతుంటేనేను ప్రక్కనే ఉన్నాను. తీరా ఇవాళ నిజం చెప్పవలసివస్తే నోరు మూసుకుని కూర్చున్నాను నాకు మళ్ళీ పుట్టగతులుంటాయా? లేదు, ఇంతపాపిని భగవంతుడు కనికరించడు.''

శాస్త్రి స్తబ్ధుడై అంతలోనే తెప్పరిల్లుకొన్నాడు

''ఏమీ దిగులుపడకు భగవంతునికి తెలియనివి ఏమున్నాయి గనుక! అయినా ఇప్పుడుమాత్రం మునిగిపోయినదేమున్నది? మీముసలిది ఈ సంగతి రేపు కోర్టులో చెప్పవచ్చునే!''

పున్నయ్య దగ్గుతెరలోనుంచి ఎలాగో సందుచేసుకొని "చెబితే తల దాచుకోటానికి నీడగూడా దొరకదు, వెళ్ళరు బాబో!" అన్నాడు శాస్త్రికి ఏమీ తోచలేదు. ఎలాగో తనమేవైనట్లు రోగికి ఊరటకల్పించి కన్ని తులసినీరు పోసి ఇంటికి బయలుదేరాడు.

అతనికి అంతా అయోమయంగా కనిపించింది ప్రపంచమంతా పాపభూయిష్ఠమేనా? ప్రతివాడు అధర్మంచేయక బతకలేడా? అయితే ఈ జీవితం, ఈ ప్రపంచం దేనికి? ఎవరు తరించటానికి? ఎందుకేర్పడ్డది? దీనికి అర్థ మేమిటి? ఇలానే ఉండటం జగత్తు ధర్మమా? ఇదే లక్షణమైతే బ్రతుకు నిరర్థకం. అసలు ఎందుకు బ్రతకాలి?

అసలు పొరపడుతున్నానేమో? పున్నయ్య చెప్పింది కేవలం పలవరింతమాత్రమేమో? కాదు. స్పృహలో ఉండే చెప్పాడు అందులో సందేహములేదు అయితే పుల్లయ్య మానవునికి ఆదర్శం అయినా ఇతరులతప్పొప్పులను నిర్ణయించటానికి నేనెవణ్ణి ? అలాంటిపనికి దిగితే నరక కూపంలో పడకతప్పదు ఎంతవరకూ ఇతరులు చెప్పేది సావకాశంగా విని నా అంతఃకరణ చెప్పినట్లు నడుచుకోవటంకంటే మార్గమేముంది? అంతే ననుకొంటూ నిట్టూర్చాడు

## . . . ఇరవై ఏడు . .

ఊళ్ళో ఇళ్ళు, వాకిళ్ళు, వాములు తగలబెట్టటం ఆరంభమైన దగ్గరనుంచి మల్లయ్యకు బెదరు ప్రారంభమైనది అతడెన్నడూ కక్షలు అలా పర్యవసిస్తా యనుకోలేదు దహనక్రియ సాగిపోతే విపరీతంగా నష్టపడేది అతనే కాని మరొకడు కాదు త్రాడు బొంగరం లేనివాళ్ళగుడిసెలు ఎన్ని తగలబడితే తన వామికి సాటి అవుతుందని అతడు అంచనాలు కట్ట ప్రారంభించాడు దీనితో అది గిట్టుబాటు కాని వ్యవహారమని బోధపడసాగింది దీనికితోడు చంద్రశేఖరం పాటకజనాన్ని షావుకార్ల మీదికి రెచ్చగొట్టసాగాడు షావుకార్లంటే ఆ ఊళ్ళో తాను, పుల్లయ్య కదా! పరోక్షంగా అంతతోడ్పడుతున్నా ఆ దుర్మార్గుడికి ఏ కోశానా విశ్వాసంలేకపోతున్నది అయినప్పుడు తాను యెందుకు తోడ్పడాలి?.

ఇది ఇలాఉంటే కూలిని పెంచాలంటూ పాటిలో జనమంతా ఊరిమీద వచ్చిపడ్డది ఏనాడైనా వాళ్ళు ఊరినడిబొడ్డుకు రావటానికి అసలు దమ్ములున్నాయా? వచ్చి గిత్తనిండు ప్రాణాలు

తీస్తారా? ఇవాళ ఈ పనిచేసినవాళ్ళు రేపు ఏ పనిచేయరు? ఊరుకొని లాభంలేదు పైగా నిన్నటి సంఘటనతో ఊరంతా ఏకమైపోయింది. తమకు కూలివల్ల నష్టం అలాఉంచి ఊళ్లో మళ్ళీ పలికేవాడు ఉండడు. కాబట్టి కూలినాలిజనాన్ని అణగగొట్టాలన్నా, ఊళ్లో ప్రాపకం సంపాదించుకోవాలన్నా తాను మెదలకుండా ఊరుకోవటానికి వీల్లేదు

మల్లయ్య నేరుగా హరిజనాశ్రమానికి వెళ్ళాడు అమ్మాయమ్మగారు కూడా ఇలాంటి స్థితిలోనే ఉన్నది క్రిందటిరోజున జరిగిన సంఘటనతో అదిరిపోయింది కూలివాళ్ళను ఎక్కడ ఉంచాలో అక్కడ ఉంచితేకాని తనకూ తన ఆశ్రమానికి రక్షణలేదని భావిస్తున్నది ఇద్దరూ కూడబలుకుకొన్నారు అమ్మాయమ్మగారు మల్లయ్యను వెంటబెట్టుకొని మంత్రిని సందర్శించి కమ్యూనిస్టులవల్ల ఊరెలా ఆకులు మేస్తున్నదో చెప్పి పోలీసుబలాన్ని వెంటనే పంపించకపోతే తమ ప్రాణాలు దక్కవని చెప్పింది. మల్లయ్య అదంతా అక్షరాల నిజమని చెప్పాడు

తరువాత మలబారు స్పెషల్ పోలీసుబలం ఊళ్ళో దిగటానికి ఎన్నో రోజులు పట్టలేదు దిగుతున్నదని కొంత ముందుగానే పాక్కింది ఆ సాయంకాలానికి పాట్లో రెండుకాళ్ళ జీవి ఒక్కటీ మిగలలేదు ఎక్కడి వక్కడ వదలి పొరుగూళ్ళకు పారిపోయారు పోలీసుబలం వచ్చీ రావటంతోనే పల్లెలు రెంటిని చుట్టివేసి ఇల్లిల్లూ గాలించింది. ఎక్కడా ఏమీ కనిపించలేదు కనిపించలేదన్న కక్ష కనిపించిన బానలమీద, చట్లమీద విజృంభించింది ఒక ఇంటివద్ద చూడావు అధికారాన్ని గుర్తించక ఎగిరిపడితే కాల్చి వేశారు పోలీసు అధికారాన్ని ధిక్కరించినప్పుడు శిక్షపడక ఎలా ఉంటుంది! పోలయ్య ఇంటివద్దకు బందోబస్తుతో వెళ్ళారు తలుపు గడేసి ఉంది బయట గొళ్ళెం పెట్టలేదు నెట్టినా తెరచుకోవటం లేదు

''ఎవరో లోపల ఉండారురా!''

''లేకపోతే తలుపు ఎందుకు రాదు?''

''అదే నేనూ అనేది! పోయి ఈ సారి గట్టిగా నెట్టు!''

''ఇందాక నేను నెట్టాను. ఈ సారి నువ్వు నెట్టు నాకన్న బలవంతుడివిగా.''

''అంత భయం వుంటే స్పెషల్ పోలీసు వెట్లా అయ్యావంట!

పోలీసు నెట్టాడు తలుపు కదలలేదు అనుమానం మరీ యెక్కువైంది తప్పకుండా ఎవడో లోపల గొళ్ళెం పెట్టుకొని ఉండాలి

''తలుపులు తీస్తారా లేదా? వన్ . . టూ త్రీ'' గాలిలోకి తుపాకి ప్రేలింది. తలుపుమాత్రం కదలలేదు మరి నలుగురు పోలీసులు గుమిగూడారు. మూపులు మోటించి బలవంతాన నెట్టి బొక్కబోరలుగా పడ్డారు. తీరా చూస్తే తలుపుకు అడ్డంపడ్డ మంచపుపట్టె విరిగి ఊడుకొన్నది. మచ్చుమీద అలికిడి వినిపించింది దానిమీదకూడ గాలిస్తే పది కమ్యూనిష్టు ఎలుక పిల్లలు బయటికి పారిపోయాయి

ఆ రాత్రి పోలీసుబలం పల్లెలోనే మకాము వేసింది దొరికిన ఒకటి రెండు గొర్రెపొట్టేళ్ళతో రాత్రి భోజనాలు పూర్తి అయ్యాయి పల్లె నలుప్రక్కల తగిన కాపలాలు నియమించి అధికారి అనువుగా ఉన్న యింట్లో పండుకొన్నాడు సన్నపాటి తుంపర ఈదురుగాలి 129

''ఈ గొడవలేకపోతే హాయిగా బారకాసుల్లో వెచ్చగా పండుకొని ఉందుముగదా!''

''ఏ గొడవ లేకపోతే నిన్ను మేపటం దేనికిరా!''

''సరేకాని ఒక్క ఆడ పురుగునన్నా వదలిపెట్టి పోలేదేమిరా!''

''అదేరా విచిత్రంగా ఉంది అసలు మనం వత్తుండామని ఈళ్ళకు యెలా తెలిసింది అంట?''

''అరె నిప్పుదెగ్గర కొత్తుంటే ఏమౌర్ది? సెగకొట్టదూ! అంతే మన దళం ఒత్తుండదంటే అదలే!''

''ఎవరో పోతుండారురా!''

''ఆడదిరా మనవాడికోసమే బయలుదేరింది?'' నవ్వులు. నాట్‌సిక్స్ వందగజాలు వెళ్ళింతరువాత పోతున్నది ఆవు పెయ్య అని గుర్తు పట్టి నాలుగు బండబూతులు తిట్టాడు కోపం కొందికీ దాన్ని ఊరివైపు మరొక వంద గజాలు తరిమి కొట్టాడు ఇంతలోనే రోడ్డుప్రక్కన గాజులచప్పుడు విన్నట్లయింది చీకట్లోకి తేరిపారిజూస్తూ నిలబడ్డాడు. నీళ్ళు గుమ్మరించి ఎవతో రోడ్డు ఎక్కుతున్నట్టు కనిపించింది. అతడు వెనగ్గా వెళ్ళి అమాంతం మీదపడ్డాడు. ఆ వేగానికి ఇద్దరూ క్రింద పడ్డారు. రెండవవ్యక్తి అరవటానికి ప్రయత్నించింది. అతడు నోరుమాత్రం గట్టిగా మూశాడు ఇంతలో తళుక్కుమని ఒక్క మెరుపు మెరసింది ఒకరిముఖం ఒకరికి కనిపించింది.

లాభంలేదని టోపీవిబట్టి తెలుసుకొని చేతులెత్తి దణ్ణంపెట్టి ఊరుకొన్నది. పశువు విశ్వంభించి పశ్చాత్తీర్చుకొని తతిమ్మావాళ్ళను పిల్చాడు పైశాచికకృత్యం జరిగిపోయింది ఆ వ్యక్తి కదలలేదు వాళ్ళలో ఒకడికి అనుమానం కలిగింది. నిదానంగా పరికిస్తే చచ్చిపోయినట్లు తేలింది ఒకరిద్దరు ముఖం మూసుకొన్నారు. చివరికి నలుగురు కలిసి మోసుకువెళ్ళి ప్రక్కనఉన్న చెరువులో పారవేశారు.

తెల్లవారినతరువాత ఊరంతా గుప్పు మన్నది అయితే బయటికి అనటానికి చెప్పుకోటానికి ఎవరికీ దమ్ములు లేవు. శవాన్ని డాక్టరుపరీక్షచేసినతరువాత బంధువులు దహన సంస్కారంచేశాడు. శాస్త్రి పళ్ళు పటపటకొరకగలగడం తప్ప మరేమీ చెయలేకపోయాడు ఆ మధ్యాహ్నం కుశాలయ్య డాక్టరువద్దకు వచ్చి, ''పొలాల్లోని పశువులు నీరూ మేత లేక అల్లాడిపోతున్నాయి వాటిని ఏడిపించుకొని తింటే గ్రామానికి ఏమాత్రం మంచిది కాదు ఎలాగైనా పోలీసు వాళ్ళకు చెప్పి – విప్ప తరుమటానికైనా అవకాశం యిప్పించండి''. అని జంకుతూ జంకుతూ అడిగాడు.

''అయితే కుశాలయ్యా, ఇంతకూ వాళ్ళను నేనే ఊళ్లోకి పిల్చుకువచ్చానంటావా ఏమిటి?

''రామ, రామ! అన్నంతినేవాడెవడంటాడండి ఆమాట! పెద్దలు మీలాంటివాళ్ళు చెబితే వీలవుతుందేమోనని అంతకు తప్ప మరేమీ లేదు ''



కుశాలయ్యమీద చిరాకుపడ్డందుకు డాక్టరు నొచ్చుకొన్నాడు.

''పెద్దల పెద్దరికం మీలాంటి పెద్దమనుషులదగ్గర కాని అడవిజంతువుల దగ్గర ఏమి పనికొస్తుందయ్యా!''

కుశాలయ్య మాట్లాడలేకపోయాడు. దిగులుపడి అలాగే నిలుచున్నాడు.

''అయినా పుల్లయ్య మల్లయ్యగార్లచేత అమ్మాయమ్మగారిచేత ఏమన్నా చెప్పిస్తే ప్రయోజన ముంటుందేమో చూడరాదు?''

''చెబితే వాళ్ళుముగ్గురిలో ఎవరూ మాట్లాడలేదు. ఏమంటే ఏమి తమ కొంప ముంచుకువస్తుందో నన్నట్టు ఊరుకొన్నారు. ఎలాగైనా పశువుల్ని పలుపులిప్పి తగిలేసినా బాగుండును. ఏదీ చీమదూరే సందైనా కనిపిస్తేనా?''

డాక్టరు అప్పుడే వెళ్ళి మిలిటరీ పోలీసు ఉద్యోగితో మాట్లాడటానికి ప్రయత్నించాడు. కాని లాభంలేక తిరిగి వచ్చాడు. ఆ రాత్రి రామయ్య, గవరయ్య, ఇంకా పదిమంది కుర్రకారును వెంట వేసుకొని కుశాలయ్య ఎలాగో మిగిలి ఉన్న పశువులను విప్పి తగిలారు అది పసికట్టి పోలీసులు వెంట బడితే ఎలాగో ఊళ్ళోవచ్చిపడ్డారు. ఆ సంఘటనతో ఉద్యోగి కోపం ఊరిమీదికి మళ్ళింది మరునాడు ఉదయం బలగాన్ని ఊరిమీదికి పంపకంచేశాడు దొరికిన వాళ్ళను దొరికినట్లుగా ఆడ మగ భేదం లేకుండా దిమోలులతో వీధుల వెంట నడిపించుకొని వెళ్ళి ఊరినడిగడ్డన ఉన్న గాంధీజి విగ్రహానికి మొక్కించారు. ఊళ్లో అందరికీ భగ్గున మండింది. అవతల తుపాకులున్నవి ఏమి చేయాలో బోధపడలేదు.

డాక్టరు మాత్రం సహించలేకపోయాడు, పంతులు, పద్మ వారిస్తున్నా విదిలించుకొని వీధిలోకి వచ్చాడు తలిసి వెనుక మరెవరు వస్తున్నారో లేదో చూడలేదు చకచకా వెళ్ళి గాంధీజీ విగ్రహం దాపులలో నిలబడి ఉన్న ఉద్యోగిని చెడ బడ తిట్టాడు ''మీరు మనుషులా పశువులా? అన్నం వస్త్రం తెలియని ప్రజలను పీక్కు తినమనా మిమ్మల్ని ఇక్కడికి తోలింది? గాంధీజీని గౌరవించే పద్ధతి ఇదేనా? ప్రభుత్వానికి తెలిస్తే మీ ఉద్యోగా లేమౌతాయ్?'' అని ఇంగ్లీషు మొదలెట్టాడు. ''షటప్ యూ ఫూల్!'' అంటూ చేతికొందికి లాగికొట్టబోయి అధికారి గింగిరాలు తిరిగి ఆవతలపడ్డాడు డాక్టరు బిత్తరపోయి ప్రక్కకు తిరిగిచూస్తే పోలయ్య కనిపించాడు అతడు అలా చూస్తూ ఉండగానే పోలీసులు పైన పడ్డారు. తరువాత ఏమి జరిగిందో తెలియదు. తిరిగి తెలివి వచ్చి చూచేటప్పటికి తన యింట్లో ఉన్నాడు. ఎంతోమంది జనం కనిపిస్తున్నారు. కన్ను చెదిరిందా లేక కలగంటున్నానా అని పరిశీలించాడు కల కాదు కన్ను చెదరటం కాదు తలమీద కట్టు చేతికి తగిలింది వెంటనే ఉద్యోగివద్ద జరిగిన సంఘటన జ్ఞప్తికి వొచ్చి, ''పోలయ్యా!'' అన్నాడు. ''దుర్మార్గులు చంపివేశారు!'' అన్నాడు పంతులు

''చంపివేశారు!''

డాక్టరుకంటినుంచి రెండు అశ్రుబిందువులు రాలాయి అంతా తలలువంచుకొన్నారు కొంతసేపటికి మల్లయ్య కొడుకు లేచి, ''చూస్తూ ఉంటే వీళ్ళు ఇలాగే చేస్తూ ఉంటారు ఇవ్వాళ వాళ్ళ అంతు తేల్చాలిసిందే. మీ పెద్దాళ్ళకు అంత మగసిరిలేకపోతే చూస్తూ ఊరుకోండి మా కుర్రాళ్ళమే అయిసా పయిసా తేలుస్తాము'' అన్నాడు ''బాగా, అన్నావురా అబ్బాయి! చిన్నోడివి అయితే యేం – ఇంకా చూస్తారు దేనికిరా బయలుదేరక!'' అన్నాడు కుశాలయ్య 131

అంతా లేచి బయలుదేరటానికి సిద్ధమవుతున్నారు

''అంగడి! ఏమి చేదామని? మీకు బొత్తిగా మతుల్లేవు. అందుకనే ప్రభుత్వం వేపుకుతింటున్నది ఆ కనిపిస్తున్న వందలమందే కదా అని భ్రాంతిపడుతున్నారేమో? వాళ్ళకేమైనా జరిగిందా రేప్రొద్దున రెజిమెంటు దిగుతుంది. ఇక్కడ ఇళ్ళు కాదుగదా బూడిదగూడా మిగులదు. కష్టమో, నిష్ఠురమో ఈ నాలుగురోజులంటే నాలుగు రోజులు కళ్ళు మూసుకోండి. అప్పటికీ కాకపోతే ఆ తరువాత సంగతి చూచుకొందాము అరే మల్లయ్యగారి అబ్బాయి! నీకేరా చెప్పేది. అప్పుడే నీకు మీసాలుగూడా వస్తున్నాయే! నేను చూడలేదు కుశాలయ్యా! కాస్త దీపం పైకెత్తు!''

మల్లయ్యకొడుకు సిగ్గుతో తలవంచుకొన్నాడు

''చెప్పిందేదో తెలిసిందా? మీ పిల్లలు ఏమన్నా చేసేరు ఈ నాలుగురోజులు కాస్త జాగ్రత్తగా బ్రతకండి ఎక్కడవాళ్ళు అక్కడ జాగ్రత్తగా సర్దుకోండి

చప్పుడు కాకుండా సర్దుకొన్నారు భార్య ఒకటి రెండు సార్లు హెచ్చరించగా సత్యనారాయణగూడా వెళ్ళి పండుకొన్నాడు పద్మ చూస్తూఉండగానే డాక్టరు చెక్కిళ్ళమీద కన్నీరు కారుతున్నది పద్మ అతని నొసలు తాకిచూచింది. జ్వరం కనిపించలేదు

---

జి వి కృష్ణరావు

''బాధగా ఉన్నదా?''

లేదని తల ఊపాడు

''మరేమిటి?''

''ఏమీలేదు కులం ఏదైనా గుణం ప్రధానం ఆ పోలయ్య ఉన్నాడే వాడు నన్ను ఎప్పుడూ 'దొరగారూ దొరగారూ' అని పిలుస్తూ ఉండేవాడు నేను కోపగించుకొనేవాణ్ణి ఆ కాసేపు సరిగానే పిల్చి మళ్ళీ వచ్చినప్పుడు దొరగారు అంటూ ఉండేవాడు ఎప్పుడో ఒకసారి వాడిభార్యకు రోగంవస్తే నాలుగు మాత్ర లిచ్చాను అప్పటినుంచి నామీద ఎంతోగురి ఈ మధ్య ఊళ్ళో తగులబెట్టుకోటాలు ప్రారంభమై ఊరంతా గల్లంతుగా ఉన్న రోజుల్లో తన పెళ్ళాము, బిడ్డలను వదలి నా యింటికి కాపలాకాయటం మొదలెట్టాడు వద్దు పోరా అని పట్టుపట్టినా వినలా వాడికోసమనే ఆ రోజుల్లో నేను వీధి అరుగుమీద పండుకొన్నాను ''

''మాకెవ్వరికీ తెలియదే ''

''ఎలా తెలుస్తుంది? అలాంటివాడు మొన్న ఊరేగింపులో విధిలేక పాల్గొన్నాడు కూలి పెంచమని కోరటం తప్పని ఎవరనగలరు? వాడికర్మం మూడి పుల్లయ్య గిత్త బెదిరి, పేగులు వెళ్లుకొచ్చేట్టు కుమ్మింది వాడు నిండు ప్రాణం తీస్తూఉంటే ఊరుకోలేక పోయాడు దెబ్బతో గిత్త గింగిరాలు తిరిగి పడ్డది వాడు దానికి ఎంతో నొచ్చుకొన్నాడు. నాడు ఊళ్లో వారికి గిత్తచావు కనిపించిందేకాని పిల్లవాడు కనిపించలా. ఈనాడు అన్ని పశువుల్ని, అంతమంది మానవుల్ని ఏడిపిస్తున్నారే, ఎలా చూస్తూ ఊరుకొన్నారు? పోలయ్యమాత్రం ఊరుకోలేదు గ్రామం కనిపెట్టుకొనే ఉన్నాడు నన్ను కొడితేమాత్రం వాడికేమి పోయింది? పైగా గిత్తను చంపినందుకు కోపపడ్డ నన్ను రక్షించవలసిన పని అతని కేమున్నది? నా కోసం – తాను నమ్మిన వ్యక్తి కోసం తన నిండు ప్రాణాలు బలియిచ్చాడు. అతడే లేకపోతే నిజంగా నేను ఎక్కడ ఉండేవాణ్ణి? నిజంగా దొర ఎవరు! తన్ను దొర అనిపించుకోవటానికే కాబోలు, చీటికిమాటికి దొరగారు దొరగారు అని పిల్చేవాడు. ఈ సంగతి నా కేమి తెలుసు? పిచ్చివాణ్ణయి అప్పుడు చీవాట్లు పెట్టాను.''

''ఊరుకోండి, తలచుకొని ఏమి ప్రయోజనం? మీ రిద్దరూ దొరలే!''

''లేదు, పద్మా! అతడే దొరై నన్ను సేవకుణ్ణి చేసి వేశాడు వాణ్ణి ఈ జన్మలో మరచిపోలేను.''

''ఇక నిద్రపోండి ''

డాక్టరు ముఖంమీద రెండుకన్నీటిబొట్లు పడ్డాయి అతడు విస్తుపోయి పద్మముఖంలోనికి చూచాడు ఆమె చప్పున ముఖంతిప్పుకొన్నది

తెల్లవారుజామున డాక్టరు ''సత్యనారాయణ, సత్యనారాయణ!'' అని పిలిచాడు. గాఢనిద్రలో ఉన్న సత్యనారాయణ పలకలేదు ఇప్పుడే పిలుస్తానని పద్మ కుర్చీలో నుంచి లేచి వెళ్ళింది అయితే పద్మ నిద్రపోలేదు ఆశ్చర్యచకితుడయ్యాడు తనకోసం ఆమె ఎందుకు మేలుకోవాలి? తనమూలంగా ఇతరులు ఎందుకు కష్టపడాలి? పాపం ఇతరులకు కష్టాలువస్తే పద్మ సహించలేదు.

ఉసలు సాధారణంగా ఆడవాళ్ళ హృదయమే అలాంటిది! తాము చూస్తుండగా ఏ కాస్త నొప్పి తగిలినా చప్పున కంట తడిపెడతారు

''పిల్చారా?'' అంటూ సత్యనారాయణ వచ్చాడు.

''అం, పని ఉంది. ఆ డ్రాయరు తీసి నా లెటర్ పాడ్ అందుకొని నేను చెప్పేది వ్రాయి. గొలుసుకట్టు వ్రాసేవు నేను వ్రాస్తే బాగుండును కాని చేయి కదలనీయటం లేదు.''

''లేవకండి. ఇక చెప్పండి.॥ కాగితం కలం పుచ్చుకొని సత్యనారాయణ డాక్టరువంక చూస్తున్నాడు కలం పుచ్చుకొని సత్యనారాయణ డాక్టరువంకచూస్తున్నాడు అతడు ప్రారంభించాడు

''మాననీయులైన మంత్రిగారికి,

1942 లో డిటెన్యూగా ఉంటున్నప్పుడు మీకు ఒక సెలమేట్ అంటూ ఉండేవాడు – బహుశా జ్ఞాపకంలేదేమో? కొంచెం పొడుగ్గా ఉంటాడు పలకరించినా అట్టే పలుకకుండా, ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ ఉండేవాడు. ఆ రోజుల్లో మీరు ఉబ్బసంతో బాధపడుతూ ఉండేవారు. ఆ మూగనోమే మీకు మందిచ్చింది. ఇప్పుడైనా జ్ఞాపకం వస్తున్నాడా? పోనీ బయటికి విడుదలై వచ్చింతరువాత లతన్ని యం. యల్. ఏ గా నిలబడవలసిందని యెంతగానో చెప్పారు. మీ మాట వినలేదన్న కారణంతో అతనితో మాట్లాడటంకూడా మానివేశారు ఇప్పుడయినా గుర్తుకు వచ్చిందా? రాకపోతే పోనీ,

మీరు మా ఊరికి మలబార్ పోలీసుదళాన్ని పంపించారు కారణం లేకుండానే పంపించి ఉండరని నానమ్మకం. మీ హృదయం ఎలాంటిదో నాకు తెలుసు ఇక్కడనుంచి మీకు రిపోర్టు వచ్చి ఉంటుంది. అందులో సందేహం లేదు కాని ముందు కాస్త విచారణ జరిపి ఉండవలసింది అల్లరికి బాధ్యులని తోచినవాళ్ళను అరెస్టుచేసి కోర్టులో విచారించి నిజంగా నేరస్థులైతే శిక్షించవలసింది అలాంటిది ఇంతవరకు ఏమీ జరగలేదు జరిగినపొరపాటుకు నాలుగు వేల జనాభాను హింసించ డం అన్యాయం ఎప్పుడో జలియన్ వాలాబాగ్ దురంతాలు జరిగిన పని విన్నంతమాత్రాననే భారతదేశం అట్టుడికినట్టు ఉడికిపోయింది ఇప్పుడు ఈనాడు మాకళ్ళముందు జరుగుతున్నది చూస్తున్నప్పుడు అదంతా అబద్ధమనిపిస్తున్నది. బహుశః ఈ వ్రాస్తున్నది కమ్యూనిస్టని అనుమానంకలుగు తున్నదేమో! దీనికి నేనేమి చేయగలను? నేనే కమ్యూనిస్టునైతే ఈ ఊళ్ళో నాలుగువేల జనాభాయే కాదు, గ్రామములోని ప్రజానీకమంతా కమ్యూనిస్టు లేమో! ఆ లెక్కలో మీరు కూడా ఈ మధ్యలో మారకుండా ఉంటే – కమ్యూనిస్టు లేమో!

అసలు ఈ కమ్యూనిస్టులు ఎక్కడనుంచి ఊడిపడ్డారు? వాళ్ళకు ఎన్నేసి తలలు ఉంటాయి? ఎన్ని గజాల కోరలుంటాయి? బహుశః మీకు కోపం కలుగవచ్చును సత్య మెప్పుడూ శ్రవణకఠోరమే. తెలియక అడుగుతాను పశువులను నీరుమేతలకు విడవకుండా రోజులతరబడి ఉంచటం, గుడ్డలు విప్పించి దిసమొలతో గాంధీజి విగ్రహానికి మొక్కించటం, ఒంటరిగా చిక్కిన ఆడదాన్ని మానభంగం చేసి ఎంపి జలాశయంలో పడవేయటం, ఇంట్లో పండుకొన్న వాళ్ళను

వేప్రకొళ్ళి డి.ఓ.పి.యు.ఎ వాళ్ళివేయటం, అసమ్మతి ప్రాదించిన వాళ్ళను ఎమ్.ఎల్.లో ముస్సాం తెకుంచా విరగదస్నటం ఎలాంటి చర్యలు కమ్యూనిస్టు చర్యలు కావా? ఇంతవరకు ఇలాంటివే కమ్యూనిస్టు చర్యలనుకొంటున్నాను పొరపాటు పడ్డానా?

అరాజకం, అధర్మం, హింసా, దౌర్జన్యాలు ప్రతివాడు ద్వేషిస్తాడు నిరోధనకు కాయశక్తులా తోడ్పడుతాడు. కాని వాటిని నిర్మూలించటానికి అవే మార్గాలు కావు మార్గాలున్న పక్షంలో కమ్యూనిస్టులకూ ప్రస్తుత ప్రభుత్వానికీ తేడా ఉండదు అంతమాత్రంచేత అరాజకత్వం మొదలైన వాటిని చేస్తూ ఊరుకోవాలని ఎవరూ చెప్పరు కావలసిన సిబ్బంది ఉంది న్యాయస్థానాలు ఉన్నవి చట్టం ఉన్నది దోషులని దృఢంగా తేలినప్పుడు వాళ్ళను కోర్టుముందు పెట్టండి అదే తేలుస్తుంది అదే ప్రజాస్వామికం. అదే న్యాయం

ఇంతకూ ఈ ఊళ్ళో నాకు తెలిసినంతలో కమ్యూనిస్టులేడు. ఊళ్ళో బయలుదేరిన కలతలవల్లనే ఇటీవల కొన్ని దౌర్జన్యాలు జరిగినవి. వీటిని ప్రభుత్వం విచారించి కోర్టు ద్వారా వెంటనే తగినచర్య తీసుకొని ఉంటే స్థితిగతులు ఇంతవరకు వచ్చి ఉండేవి కావు ఇప్పుడైనా అలాంటిదానికి అవకాశం ఉన్నది. వెంటనే మీరు స్వయంగా వచ్చి విచారించి పోవటం మేలు. మీరికి లేనిపక్షంలో పెద్ద అధికారిని పంపించి ముందుగా స్పెషల్ పోలీసుబలాన్ని ఇక్కడనుంచి తరలించటం అవసరం మీరు జోక్యం కలిగించుకోవటానికి వీలులేదు అంటే ఆమాట చెప్పండి ప్రజలున్నారు పత్రికలున్నవి లనవసరంగా స్థితిగతులను విషమింపచేసి పార్టీ ప్రాపకం సంపాదించటం నాఉద్దేశం కాదు

ఈ ఉత్తరం స్వయంగా వ్రాయలేకపోతున్నానంటే స్థితి గతులు మీకు అర్థం కావచ్చును చిత్తగించవలెను.''

సత్యనారాయణ వ్రాత ముగించి కాగితం కలం డాక్టరు చేతి కిచ్చాడు. అతడు ఎలాగో సంతకం చేశాడు.

ఆనాటి సాయంకాలంలోగా ఆ మహజర్ పైన వెయ్యి సంతకాలు చేయించుకొని పట్టణం బయలుదేరి వెళ్ళిపోయాడు పోతూ పోతూ బస్తీనుంచి శాస్త్రికి ఆప్తమిత్రుడైన డాక్టరును పంపించాడు.

అతడు వచ్చి శాస్త్రికి తన కారులో తీసుకొని వెళ్ళటానికి ప్రయత్నించాడు, కాని శాస్త్రి ఒప్పుకోలేదు విధిలేక అక్కడనే కట్టుకట్టి ఇయ్యవలసిన మందులు పద్మకు యిచ్చాడు. కాస్త స్వస్థత చిక్కేదాక అక్కడే కొత్త డాక్టరు ఉండాలని చూచినా బస్తీ ప్రాక్టీసు దెబ్బతింటుంది అది అలా ఉంచి రోగులను ఇబ్బంది పెట్టటం ఏ మాత్రం మంచిది కాదు పొమ్మని శాస్త్రి బలవంతపెట్టాడు. కారున్నదిగా అంతగా అయితే నాలుగురోజుల కొకసారి వచ్చి చూచిపొమ్మని హెచ్చరించాడు

తరువాత కొలదిరోజుల్లోనే స్పెషల్ పోలీసుదళం అక్కడ నుంచి మకాము ఎత్తివేసింది. శాస్త్రి మెల్లగా ఇంట్లో కాస్త ఇటు అటు తిరుగుతున్నాడు.

## ఇరవై ఎనిమిది ..

మలబారు స్పెషల్ పోలీసులతోపాటు వేసంగి వెళ్ళిపోయింది. అసలు ఊరికి తిప్పలుతెచ్చింది చంద్రశేఖరమేననీ, అతడు లేవగొట్టటంవల్లనే పాటకజనం ఊళ్ళోకి రావటం, గిత్త చావటం, స్పెషల్‌పోలీసు దిగటం జరిగిందనీ, దానివల్ల అందరికీ కష్టాలు వచ్చినవనీ, ఎప్పుడైనా మూకఉమ్మడిగా కక్షలు బయలుదేరితే ఇలాంటిఘోరాలే జరుగుతాయనీ ఊళ్ళో రైతులు భావించ మొదలు పెట్టారు ''పుల్లయ్య చంద్రశేఖరం కేసు వాళ్ళ ఉభయులకు సంబంధించిందే ముఖ్యంగా చంద్రశేఖరంప్రవర్తన ఊరికి శ్రేయస్కరం కాదు'' అని అతనిపట్ల సానుభూతి చూపటం మానుకొన్నారు చంద్రశేఖరానికి తోడ్పడటమంటే కూలీలతో తగాదా కొని తెచ్చుకోవటమే నని భయపడ్డారు ఇక పాటకజనం పోలీసుదెబ్బతో హడలిపోయింది శేఖరంమాటలు వింటే అసలుకే మోసంతప్ప ప్రయోజనం లేదని జారుకొన్నది. ఈ విధంగా శేఖరం ఒంటరిగాడయ్యాడు.

''మళ్ళీ విచారణకు గడువు సమీపిస్తున్నది శేఖరానికి మరొకసాయం లేదే అన్న భీతి పెరుగుతూ వచ్చింది అతనికి సాక్ష్యం కావాలి ఊళ్ళోని సాక్షులమీద ఆధారపడి లాభం లేదు 135
అందరూ తనమీద కక్షకట్టారన్న అనుమానం అతనికి బలపడిపోయింది.

రాత్రి పండుకొన్నప్పుడు ఆలోచించాడు ఆలోచించిన కొలది హామీపత్రంమీద సంతకం హోటల్లోనే జరిగిందని రూఢి అయిపోయింది హోటలుగదిలో తాను, పుల్లయ్య, మాధవయ్య కూర్చుని కాఫీ తాగుతూ చుట్టలు ముట్టించినట్టు జ్ఞాపకం వచ్చింది జ్ఞాపకం రావటమేమిటి, కన్నులముందు ఈనాడు జరుగుతున్నట్లు కనిపిస్తూంటే! అవిగో గొంతులు పుల్లయ్య మిల్లుగొట్టంవలె పొగవదులుతున్నాడు. అప్పుడున్నది ముగ్గురేనా? కాదు, మరొకరుకూడా అక్కడ ఉండి ఉండాలి శేఖరానికి అది అవసరం. అందువల్ల ఉన్నాడని గట్టిగా నమ్మాడు ఆ నాలుగోమనిషి ఎవరు? ఒక రోజున ఈ సంగతి లలితకు చెప్పాడు. ఆమెకు ఎక్కడలేని సంతోషం వచ్చింది. గట్టిగా ఆలోచించండని ప్రోత్సహించింది. శేఖరం అదేయావలో ఉన్నాడు. చివరికి నాగేంద్రం ఉన్నాడేమో నన్న అనుమానం కలిగింది తప్పకుండా ఆ నాలుగోమనిషి అతడే భార్యకు చెప్పాడు ఆమె పరమానాందం పొందింది చచ్చిపోయిన మనిషి తిరిగి బ్రతికివచ్చినట్లయింది ''ఆయనది ఏ ఊరు? ఏమి చేస్తున్నాడు?'' అని అడిగింది తనకు మొదటి నుంచీ అతడు సహాధ్యాయి అతడు పొగాకు వ్యాపారంలో ఉన్నాడని చెప్పాడు ''అయితే ఇంకా తటపటాయింపులు దేనికి? సాక్ష్యం వేసుకోండి'' అని చెప్పింది ''ఇప్పుడు ఇంగ్లాండులో ఉన్నాడు ఎలా వస్తాడు?'' అని భార్యకు వినిపించేటట్టు అనుకొన్నాడు ఈ సంగతి తనకు వ్రాసిన ఉత్తరాలలో పేర్కొని ఉండాలి ఉత్తరాలకట్టలు విప్పి చూచాడు భార్యనుకూడ చూడమన్నాడు ఆమెకు కూడా కనిపించలేదు

''ఇదిగో వాటపరిసు ఈ కట్టలోనే ఉంయింది అనవసరంగా నీకు శ్రమ యిచ్చాను నువ్వుపోయి పని చూసుకో నేను వెదకుతాలే'' అని ఆ ఉత్తరాలకట్టతో రెండవగదిలోకి వెళ్ళి తలుపువేసుకొని శేఖరం కూర్చున్నాడు ఆ ఉత్తరాలు చూడటంలోనే నిమగ్నుడయ్యాడు

అన్ని పనులకూ లలితే తిరుగుతూ వచ్చింది చివరికి ఒక రోజున సాయంకాలం ''లలితా, లలితా!'' అంటూ శేఖరం గదితలుపు తెరచుకొని బయటికి వచ్చాడు ''దొరికిందా?'' అన్నది. ''ఇదిగో! ఇదిగో! అతడు వ్రాసిందే స్వయంగా వ్రాశాడు ఇదిగో సంతకం చూడు'' అంటూ ఉత్తరం ఒకటి భార్యచేతికి ఇచ్చాడు ఆతురతతో కంపిస్తున్న చేతులతో కాగితం పట్టుకొని జీరపోతున్న గొంతుతో గబగబా చదివింది రెండు సంవత్సరాలనాడు హోటలుగదిలో జరిగిన సంగతులు సవిస్తరంగా చెప్పివున్నాయి. లలిత సంతోషం పట్టలేక పోయింది దగ్గరలో ఉన్న పిల్లవాణ్ణి గట్టిగా ముద్దు పెట్టుకొన్నది.'' నా దొరబాబు, ఆస్తి లేకపోతే ఏం? పేరుప్రతిష్ఠలు ఉంటే చాలు'' అన్నది కాని ఎందుకో ఉత్తరం మళ్ళీ ఒకసారి తెరచి చూచింది. ఆపాదమస్తకం కంపించిపోయింది ఆ దస్తూరిలో భర్త వ్రాతపోలిక కొంత పొడకట్టి అతనివంక చూచింది కాని మాట్లాడలేకపోయింది ''ఇది కోర్టులో దాఖలుచేస్తే చాలు. ఇకవేరే సాక్ష్యాలు గీక్ష్యాలు అవసరం లే'' దని అతడు అన్నాడు నిజమేనంటూ లలిత కూలబడిపోయింది ''భగవంతుడా! ఎన్ని కష్టాలు తెచ్చి పెట్టావురా!'' అనుకొన్నది. జాగత్తంతా ఆమెకన్నులముందు గిర్రున తిరుగుతూ ఉంది భర్త ప్రతిచర్య అనుమానాస్పదంగా, పాపపంకిలంగా కనిపించసాగింది, అది దుర్భరం అతడు నిరపరాధి నిరపరాధి అయితీరాలి ఆమె ఉత్తరం తిరిగి చూడదలచలేదు చూడవలసిన పనే లేదు చూడదు మెల్లగా నవ్వుతూ ఆ కాగితం భర్తకు అందించింది. అత్యంతభద్రంగా దాచమన్నది కేసులో కొంతవరకు తోడ్పడవచ్చునన్నది.

ఆ రాత్రి భర్తతో ప్రాధేయపడ్డది. ''పత్రికలకు వ్రాయకండి అమ్మాయమ్మగారు, శాస్త్రిగారు మనపట్ల ఎలా ప్రవర్తించారో ఎందుకు వ్రాస్తారు? దానివల్ల మనకు మనం లోకువచేసుకోవటమే కాని మరి ప్రయోజన మేముంది!'' అన్నది. ''అది కాదు, అందరికీ తెలియటం అవసరం, ముఖ్యంగా న్యాయాధికారికి తెలియటం ఎందుకైనా మంచి'' దని శేఖరం భార్యకు సర్ది చెప్పాడు. లలిత మళ్ళీ ఆ విషయం ఎత్తలేదు.

# . . . ఇరవైతొమ్మిది . . .

రామారావును ప్రభుత్వం నేరుగా డిటెన్యూ క్యాంపుకు పంపించింది. వచ్చీ రావటంతోనే సెల్ మేట్ అతని పుస్తకాలు తిరగవేశాడు. జాన్ డ్యూయీ, బెర్ట్రాండ్ రస్సెల్, వైట్ హెడ్, అరవిందుడు, పాపర్, మానర్ హీం, లాస్కీ, క్రోచే మొదలైనవాళ్ళ పుస్తకాలు కనిపించాయి.

''మీరు కమ్యూనిస్టు సభ్యులా?'' అతడు అడిగాడు.

''కాదు,'' రామారావు ముక్తసరిగా సమాధానం చెప్పాడు.

''ఆ సంగతి మీ పుస్తకాలే చెబుతున్నాయి అయితే మిమ్మల్ని ఇక్కడకు ఎందుకు తీసుకువచ్చారు?

''అదే నాకు తెలియటం లేదు. బహుశః ఏమీ చేయటం లేదన్న కోపంతో నన్నిక్కడికి పించారేమో?''

''మీ పేరు రామారావేగా?''

''అవును మీకెలా తెలుసు?''

''తిమ్మన్న పేరు ఒకళ్ళు చెప్పాలా?''

రామారావు దిగ్భ్రాంతుడయ్యాడు తాను వచ్చి ఎంతోసేపు కాలేదు. తనమీద ఆ వ్యక్తికి అంత అవ్యాజానురాగం కలగటం ఆశ్చర్యం కలిగించింది అతడు ఎరిగిన వ్యక్తేమోనని జాగ్రత్తగా చూచాడు జ్ఞాపకం రాలేదు అసలు ఎన్నడూ చూచినట్లే లేదు. ఆ ప్రవర్తన అంతకన్నా బోధ పడలేదు అయినా మనిషి తరహాయే అంతేనేమో! అనవసరంగా కోపం తెప్పించటం దేనికి? తరువాత నొచ్చుకోవటం దేనికి? అని ఊరుకొన్నాడు.

అతడు కొంచెంసేపు ఉండి మళ్ళీ అందుకొన్నాడు.

''మీవాళ్ళు అధికారులకు ఎంత ముట్టజెప్పారు?''

రామారావుకు తలా తోక అంతుపట్టలేదు

''అంటే?''

''డిటెన్యూగా పట్టుకెళ్ళటానికి ఇప్పుడు కూడా అర్థం కాలేదా?''

''లేదు. నాది వట్టి నల్లరేగడిమట్టి మరి కొంచెం వివరంగా అడిగితే మీకుతూహలాన్ని తీర్చగలనేమో.''

''క్రిమినల్ కేసు మానివేసి డిటెన్యూగా పట్టుకెళ్ళటానికి?''

''మరి అలా అడిగితే మీకే శ్రమ లేకుండా చెప్పేవాణ్ణేగా!'' రామారావు పెద్దగా నవ్వాడు.

---

జి.వి. కృష్ణరావు

''ఇష్టంవుడు చెప్పవచ్చునుగా ''

''పదివేలు.''

''పదివేలా! నవ్వికీలు కాదు నిజం చెప్పు ''

''ఉరిశిక్ష తప్పించుకోటానికి పదివేలు పోతేమాత్రం ఏమి పోయింది? అందులో మానాన్నకు మిగిలివున్న కొడుకును నే నొక్కణ్ణే రెండు లక్షల రూపాయల ఆస్తి ఉంది పదివేలు ఒక లెక్కా!''

''ఏమి చేశావేమిటి?''

''ఓ, ఒక భారతం ఉంది వినటానికి ఓపిక ఉంటే చెబుతా ''

''వినాలనే కదా అడుగుతున్నది?''

రామారావు ప్రారంభించాడు :–

నేను పట్నంలో చదువుతున్నాను అది కథాప్రారంభం నాటి సంగతి ట్రిప్లికేన్‌లో ఉంటూ ఉండేవాణ్ణి ఏ వీధి ఏ నెంబరు అని అడిగితే ప్రయోజనం లేదు. నాగదికి ఎదురుగా రెండంతస్తుల పెద్దమేడ ఒకటి ఉంది. అది ఒక చెట్టియారుది అతడూ, అతని కొడుకూ, కోడలు, ఒకపనిమనిషి మాత్రం ఆ మేడలో ఉంటున్నారు. మేడ అంత పెద్దదైనా రెండో వాళ్ళకు అద్దె కివ్వలేదు.

138 తండ్రికి 70 సంవత్సరాలు దాకా ఉంటాయి. కొడుక్కి 50 సంవత్సరాలు రెండో పెండ్లి చేసుకొన్నాడు అతనిది ఏ వ్యాపారమో తెలియదు కాని నెలకు ఇరవై రోజులు ప్రయాణంలో ఉండేవాడు. తండ్రి ఇల్లు కనిపెట్టుకొని ఉండేవాడు కాదు, కోడలిని భద్రంగా చూస్తూ ఉండేవాడు

అమ్మాళ్ చిన్నది. ఇరవై, ఇరవై రెండేళ్లు దాటీ దాటని వయస్సు వెనుక ఎలాంటి బాదర బందర, చీకు చింత, పిల్లా పీచు లేదు. నాకంటే ఇంకొక బెత్తెడు ఎత్తుగా,, ఎత్తుకు దగ్గ పుష్టిగా ఉంటుంది. అప్సరస అని చెప్పను గాని అందంగా ఉంటుంది. కనీసం నాకళ్ళకైనా ఆమె అందకత్తె ఆమెను ఒకసారి చూడటం తటస్థించింది. నా మనస్సులో కొంత కలత బయలుదేరింది అనుకొన్నా – ఎందుకంటే, ముందు వేసుకొన్న పుస్తకంలో అక్షరాలు కనిపించటం మానివేశాయి. బజారుకు వెళ్ళితే చాలసార్లు కారుక్రింద పడిపోయే ప్రమాదం తటస్థించింది కాని ప్రతిసారి రవ్వంతలో తప్పించుకోవటం జరిగింది. ఎంతకాలం ఇలా ప్రమాదాలకు గురికాను! స్థితి గతులు ఇలా సాగకూడ దనుకున్నాను. కాని ఏమి ప్రయోజనం? ఆమెతో పరిచయం ఎలా ఏర్పడుతుంది? ముసలి దయ్యం కన్నార్పకుండా, ఎప్పుడూ కాచుకొనే కూర్చుంటున్నాడు ఏ గూటిలో పక్షి ఆ గూటిలోనే ఉండవలసివచ్చింది.

ఆ రాత్రి నిద్రపట్టలేదు రెండవ ఆట సినిమాకు వెళ్ళాను వెళ్ళానన్న మాటేకాని తెరమీద బొమ్మలు కనిపిస్తేనా? ఎలాగో ఆట పూర్తి అయినతరువాత కాలినడకనే రూము వద్దకు చేరాను. కాని లోపలికి పోవటం ఇష్టంలేదు. కాళ్లు అమ్మాళ్ ఇంటివైపు చేరవేశాయి మెల్లగా గేటుతీసి మళ్ళా యధాప్రకారంగా చేరవేసి దొడ్డిపక్కకు చేరాను ముందు బాల్కనీ ఉన్నది బాల్కనీ ప్రక్కనే ఆమె

కీలుబొమ్మలు

గది అది మాత్రం తెలుసు బాల్కనీమీదను స్తంభానికి అంటిపెట్టుకొని పూలతీగ దృఢంగా అల్లుకొని ఉన్నది ఆ తీగల సాయంతో ఎలాగో బాల్కనీమిదికి చేరి, మెల్లగా గది వద్దకు వెళ్ళాను అదృష్టమో, దురదృష్టమో బాగుండి తలుపు ఊరకే చేరవేసి ఉంది మెల్లగా నెట్టుకొని లోపల ప్రవేశించాను

**అది** మొదలు మా యిద్దరకు సంబంధం ఏర్పడింది. చెట్టియార్ టూరులో ఉన్నప్పుడు రాత్రులు నాకు ఆ గదిలోనే గడిచేవి ఒకసారి నే నాగదిలో ఉండగా ముసలి వాడికి ఎందుకు అనుమానంతట్టిందో వచ్చాడు నన్ను చూడగానే ఎక్కడలేని కోపం వచ్చింది నాకు భయంతో కాళ్ళు వణికి పోతున్నవి అయోమయస్థితిలో పడి అలాగే నిలబడ్డాను అతడు చేతికఱ్ఱతో నెత్తిమీద ఒకటి పెట్టాడు తరువాత ఎప్పుడో మెలకువ వచ్చినప్పుడు చూస్తే గదిలో పడి ఉన్నాను తప్పించుకొనే మార్గం ఏమీ కనిపించలేదు నేను పట్నం ఎందుకు వచ్చాను? ఈ దుఃస్థితి ఏమిటి? రేపు నలుగురిలో ఎలా తిరిగేది? ఇంటివద్ద అడిగితే ఏమి చెప్పాలి? ఆలోచిస్తూ అక్కడే పండుకొన్నాను ఒక రాత్రివేళ తలుపు తెరుస్తున్న చప్పుడు వినిపించి లేచి కూర్చున్నాను. అమ్మాళ్ చీకట్లో తడువుకొంటూవచ్చి నాప్రక్కన కూర్చున్నది నా ఆశ్చర్యానికి మితిలేదు. తెప్పరిల్లుకొని అడిగాను నదురుబెదరు వచ్చినప్పుడు కావలసినమనిషి చనిపోతే ఎంత తేలిక! ఎలా చచ్చాడని అడిగాను ''చచ్చాడు అంతే'' నున్నది నేను ఊహించుకొన్నా భయంతో ''ఇక జరగవలసింది ఏమిటి?'' అని అడిగాను ''అంత్యక్రియలు అవికూడా అతడు రాక ముందే జరగాలి'' అన్నది ''ఊళ్ళో బంధువులు కాని, మిత్రులు కాని లేరా?'' ఆతురతకొలది అడిగాను ''ఆ భయమేమీ అవసరం లేదు'' అని అభయ మిచ్చింది.

మరునాటి ప్రొద్దున్న ముసలివాడికి దహనసంస్కారం యథోచితంగా జరిగిపోయింది వయసుమీరినవాడు కావటం చేత బంధువులు కాని, మిత్రులు కాని, శత్రువులు కాని లేకపోవటంచేత ఎవరికీ ఎలాంటిఅనుమానం కలుగలేదు చెట్టియార్ ఎంతదూరంలో ఉన్నాడో ఏమి చేస్తున్నాడో తెలియదు అతడు రాకుండానే అమ్మాళ్ జరుపవలసిన క్రియలన్నీ జరిపించింది నాకు ఆశ్చర్యంకలిగి అలాగే కళ్ళు పెట్టుకొని చూస్తూవచ్చాను

కర్మ పూర్తి అయిన తరువాత నామకాము ఆ పెద్దమేడలోనే. నా ఆహార విహార పానీయాలన్నీ అక్కడే! ఇరుగు పొరుగులు గుసగుసలు ప్రారంభించారు అయినా మహాపట్టణంలో ఎవరిజోలి ఎవరికి కావాలి? నెలరోజులు అంతలోనే దొర్లిపోయాయి.

ఆ రోజు రాత్రి మహానందంలో ఉన్నాము. ఇంతలోనే పైకివచ్చే మెట్లమీద జోడుచప్పుడు వినిపించింది!

''తలుపులు వేయలేదా?''

''అన్నిటితాళాలు అతనిదగ్గర ఉన్నవి ''

ఉలిక్కిపడి లేచి గబగబ దోవతి కట్టుకొన్నాను వంకెకు తగిలించిన చొక్కా వేసుకొన్నాను నాహడావుడి చూచి అమ్మాళ్ నెమ్మదిగా నవ్వింది తలుపుగడియ చప్పుడు కాకుండా వేసింది

జి వి. కృష్ణరావు

బాల్కనీవైపున కున్న తలుపు మెల్లగా తెరచి నన్ను పూలకుండీల వెనకాల గుమురుమాయిన కూర్చోబెట్టి పోయి మంచంమీద పడుకొన్నది గదిలో చీమ చిటుక్కుమన్నా నాకు వినిపిస్తూనే ఉన్నది.

అతడు తలుపుదగ్గరకు వచ్చి ఆగాడు అతడు బిగపట్టి బిగపట్టి పీల్చేగాలి చప్పుడుకూడా వినిపిస్తున్నది. కొంతసేపున్న తరువాత అతడు తలుపుతట్టాడు

''ఎవరు?'' అమ్మాళ్ అప్పుడే నిద్రనుంచి మేలుకొన్నట్లుగా అడిగింది

''నేను, తలుపుతియ్యి ''

''నేనంటే?''

''నేను. తెలియటంలేదా? తలుపు తియ్యవేఁ?''

అమ్మాళ్ లేచి గట్టిగా ఆవలించి ఒళ్లు పెట పెట విరుచుకొన్నది. అదికూడా నాకు వినిపిస్తున్నది. ఆమె తలుపు తెరచింది. అతడు బహుశః గది నలుమూలలా చూచి ఉంటాడు. దక్షిణపు వైపున కున్న కిటికీతలుపులు తీసి బయటికి చూచాడు

''ఎందుకు కిటికీవెనుక చూస్తావ్? ఎవణ్ణీ తీసుకొచ్చి అక్కడ దాయలేదు ''

140 ''ఏమిటి అంటున్నావ్?''

''ఏమీలేదు ''

''ముసలాడు ఎన్నిరోజులైంది చనిపోయి?''

''ఇరవైరోజులు.''

''ఏమిటి జబ్బు?''

''ఏమీలేదు ఉదయాన లేచి చూస్తే మంచంలో చచ్చిపడి ఉన్నాడు.''

''అలాగా మాయగా ఉందే!''

''ఏమిటి మాయ? ముసలివాళ్ళు ఎంతకాలం బ్రతుకుతారు?''

''ఓహో! వ్యవహారం మీరినట్లుంది. కాస్త ఒళ్ళు దగ్గర పెట్టుకొని మాటాడు పోయి కాళ్ళకు నీళ్ళు తీసుకురా.''

''ఒళ్లు ఎవరు దగ్గరుంచుకోవాలో తెలుస్తూనే ఉన్నది.''

అమ్మాళ్ లోపలి వాకిలిగుండా బయలుదేరి వచ్చి నన్ను హెచ్చరించి తిరిగి వెళ్ళి నీళ్ళు తెచ్చింది

''ఈ రెండో పక్క ఎవరికి?'' అతడు రూక్షణంగా అడిగాడు

''ఎవరికేముంది?'' తమరికే. దొరలు ఎప్పుడు దిగుతారో మరి?'' నిబ్బరంగా సమాధానం చెబుతున్నది.

''ఇదేమిటి?''

''కనిపించటంలేదా? అండర్ వేర్ నాదే ''

''దానిసంగతే ఇరుగుపొరుగు అంటున్నది ''

''ఏమి అంటున్నా రేమిటి?''

''ఎందుకు అంతతొందరపడతావు? ఏవి ఎప్పటికి తేలాలో అప్పుడే తేలుతాయి.''

''ఎప్పుడో దేనికి? ఇప్పుడే తేల్చివేస్తే సరిపోతుంది ఎవరితో ఉంటున్నావని చెవికొరికా రేమిటి?''

''ఇల్లు అలకగానే పండుగ అవుతుందా? కాస్త గుర్రాన్ని కట్టివేయి.''

''ఎప్పుడో దేనికి? ఇప్పుడే తేల్చు రామూ, రామూ!'' నన్ను చెయ్యిపట్టుకొని లాక్కొని వెళ్లింది అతడు స్తంభించి మంచందగ్గరలో ఉన్న కుర్చీలో కూలబడ్డాడు. ఇంత తెగిస్తుందని అతడు అనుకోలేదు. నిర్ఘాంతపోయి చూస్తూ ఉన్నాడు.

''ఇదిగో వచ్చాడు. ఇంకెవరు కావాలి? అతన్నే అడుగు. చూస్తా వెందుకు?'' అతడు మాట్లాడలేదు అమ్మాళ్ మంచంమీద వ్రాలి దొర్లుతూ కడుపుబ్బ నవ్వుతూ ఉంది. కాసేపటికి తెప్పరిల్లుకొని,'' రామూ! రా. అక్కడ దేనికి? ఎవరో ఏమిటో అనుకొంటే విన్నాడట. వినటం దేనికి! కళ్లార చూస్తేపోతుంది రా'' అంటూ చేతులు చాచింది. తుపాను రేగినప్పటి సరస్సువలె ఉన్నది నాకు రెండో ప్రపంచమే కనపించలేదు గాఢాలింగనంలో పొదివి ప్రక్కకు తిప్పివున్న చెక్కిలి ముద్దు పెట్టుకొన్నాను. ఇంతలో ఆమె రెండో చెంప ఛేళ్ళు మన్నది. నన్ను మెల్లగా పక్కకు నెట్టింది. ఆమెవముఖం జేవురించింది. పెదవులు చలిస్తున్నవి. కన్నులు నిప్పులు గ్రక్కుతున్నవి. గాఢనిశ్వాసాలతో రొమ్ము ఉబుకుతున్నది చువ్వవలె చివుక్కున మంచంమీదునుంచి లేచి పైటకొంగు తిప్ప గట్టిగా రొంట దోపింది.

''ఏది మళ్ళీ!''

అతడు అదరిపోయాడు స్థితిగతులు రెప్పపాటులో అర్థం చేసుకొన్నాడు. లోపలి వాకిలివైపుకు వెళ్ళబోయేలోపున అమ్మాళ్ తలుపులు మూసి గడియవేసింది. అతడు బాల్కనీవాకిలివైపు పోయి గడియ తీస్తున్నాడు ఆమె అమాంతం ఎగిరి రెండుచేతులతో గొంతు గట్టిగాపట్టుకొని నొక్కుతూవుంది భార్య అలా చేస్తుందని కలలోకూడా అతడు ఊహించలేదు. చేతులు పిడికిలిస్తున్నవేతప్ప ఆత్మ రక్షణకు యత్నించలేదు ఆమె అతన్ని క్రిందపడవైచి గొంతు నొక్కుతూ నన్ను పిలిచింది. నేను ఎగిరి అతని రొమ్ముమీద కూర్చుని రెండు మోకాళ్ళతో అతని రెండుచేతులు నొక్కి పట్టా. నన్ను చూడగానే ముంజేతులతో నాజుట్టుపట్టుకొని పళ్ళతో నాగొంతు నొక్కివేస్తున్నాడు. రెండు నిమిషాలుంటే ఈ కథ ఎవరు చెప్పేవాళ్ళో? కాని అమ్మాళ్ ఇనుప సుత్తితో మాడుమీద పెట్టిన దెబ్బతో నాగొంతు వదలి అతనితల క్రిందకు వాలిపోయింది. నేను లేచాను ఆ ఆయాసం పడకుతూ ఆమెవంక చూచాను ఆ కిద్దెరమోపులతో నాబెదరు మాయమైపోయింది

---

జి వి కృష్ణరావు

ఇరువురము ఆ శవాన్ని జాగ్రత్తగా తీసుకువెళ్ళి దొడ్లో పెంటపోగు ప్రక్కన పూడ్చి వేశాము చెత్తా చెదారంతో తవ్వినమట్టి కనపడకుండా కప్పాము గాలికి లేచిపోకుండా రాళ్లు రప్పలు పడవేశాము.

తిరిగి వచ్చిన తరువాత గదిలోను, మెట్లమీద, ఇంట్లోను వున్న రక్తపు మరకలు కనిపించకుండా నీళ్ళు పోసి కడిగి గుడ్డతో తుడిచివేసింది అప్పటికి నాలుగు కావస్తున్నది పోయి పండుకొన్నాము నాలుగురోజులు గడిచిపోయాయి తరువాత పోలీసులు ఎలా పసికట్టారో పసికట్టారు తరువాత ఇక్కడికి వచ్చాను.

''ఇదంతా నిజమే?'' ఆశ్చర్యపడుతూ సెల్‌మేట్ రామారావును అడిగాడు.

''రచయితలు వ్రాసేది నిజమైతే ఇదీ నిజమే?''

''అయితే నువ్వు మాతో ఉండటానికి వీలులేదు తెలిసిందా?''

''అలాగా! ప్రభుత్వం ఇక్కడ తెచ్చి పడవేసిందే మరి!''

''ఆ పప్పు లేమీ ఉడకవు. క్రిమినల్ మాతో ఉండటానికి వీలులేదు మేము రాజకీయ నిర్బంధితులము ముందుగా పెట్టెబేడా సర్దుకో.''

''అలాగే ఎక్కడకు పొమ్మంటే అక్కడికే పోతాను నా దేముంది?''



సెల్‌మేట్ తలిమ్మా డిటెన్యూలతో మంతనాలు జరిపాడు ఆ కేంద్రంలో అలజడి బయలుదేరింది రామారావు అది గమనించి నవ్వుకొన్నాడు అతన్ని ఎవరూ పలకరించటం లేదు ఎవరివల్ల ఎలాంటి సహాయమూ జరగటంలేదు. అతడు కూడా అలాగే ఉంటున్నాడు ఈ ప్రవర్తన తలిమ్మా వాళ్ళకి మరీకోపం కలిగించింది పై అధికారికి మహజర్ పెట్టారు రామారావు క్రిమినల్ కాని, పొలిటికల్ ప్రిజనరే కాదు అలాటివాణ్ణి తమలో ఉంచటమంటే తమ్ము అగౌరవించటమే అతన్ని మరొక జైలుకు పంపితే తప్ప తాము హంగర్‌స్ట్రయిక్ ప్రారంభింస్తామని విస్పష్టంగా చెప్పివేశారు జైలులో అల్లరి ప్రారంభమయ్యేటట్లు కనిపించింది. జైలు అధికారి ఒక రోజున రామారావుగదికి పరుగెత్తుకు వచ్చాడు

''అయితే నువ్వు క్రిమినల్‌వా?''

'' అయితే ప్రభుత్వం విచారించి శిక్ష వేయవచ్చునుగదా! ఈ చర్చంతా దేనికి?''

''మీ రాజకీయ ఖైదీలతో వచ్చిన చిక్కే యిది మీ మాట వినకపోతే మీతో పేచీ, వింటే పై అధికారులతో పేచీ. ఎందుకు వచ్చినబాధ?'' నిన్ను ప్రత్యేకపు బ్లాకుకు పంపుతాను.''

''అక్కడ ఈ గొడవరాదా?''

''అక్కడ ఎవరూ ఉండరు.''

''అంటే సాలిటరీ కన్‌ఫైన్‌మెంటు ఇస్తారా?''

''ఇన్ని వందలమంది గోలచేస్తుంటే ఏమి చేయాలి?''

''అయితే ధర్మం తలకాయలసంఖ్యమీద ఆధారపడి ఉన్నదన్నమాట!''

"నీతో వాదించి లాభంలేదు సర్దుకోవలసిన పమన్నా ఉంటే ముందుగానే సర్దుకో!"
అధికారి వెళ్ళిపోయాడు రామారావుకు ఏకాంతవాసశిక్ష ప్రాప్తించింది ఒకటి రెండు రోజులు తోటిడిటెన్యూల బారినుండి బయటబడ్డానని సంతోషించాడు కాని ఒంటరిగా ఎంతకాలం ఉండేటట్లు? కొన్ని రోజులు పుస్తకాలతో గడిపాడు కాని తరువాత గడియ ఒక యుగంగా కనిపించసాగింది! ఎలాగైనా ఆ నరకం నుంచి బయటపడాలన్న వాంఛ అతనికి తెలియకుండానే మనస్సులో మెదలుతూ వచ్చింది దీనితో అతని సంకల్పం కొంత సడలింది. నిజంగా తనతండ్రి శేఖరానికి హామీ ఉండలేదేమో! తండ్రి తనతో ఆనాడు చెప్పినది అబద్ధమేమో! అసలు తనతో తండ్రి ఆమాట అన్నట్లు తానే కలవరిస్తున్నాడేమో? తాను కలవరిస్తున్నాడని సీత అన్నది లక్ష్మమ్మ అన్నది. నిజానికి అబద్ధమాడవలసినపనేమున్నది? తండ్రి కోసమని ఇతరులకు అబద్ధంచెబితే చెప్పవచ్చును కాని తనకు చెప్పవలసిన అవసరమేమున్నది! తండ్రికోసమైతే "ఎక్కడా ఈ సంగతి ఎత్తకు" అని చెప్పి ఉండవచ్చునుగదా! అలా చేయలేదు "కలవరిస్తున్నావు" అని సీత అన్నది. ఆమాట అనమని ఆమె తల్లికి చెప్పటానికి అవకాశం లేదు. తాను ఇలా అంటాడని సీతకు ఎలా తెలుసు? తల్లికి అంతకన్నా వీలులేదు అయినా ఆమెకూడా సరిగా అదేమాట అన్నది. తండ్రికూడా తుచా తప్పకుండా అలాగే అన్నాడు ఇంతమంది కూడ బలుకుకొని అనటానికి అవకాశమేది? తానే పొరపడ్డాడేమో!

రామారావు కంపించిపోయాడు తనది పొరపాటే ఇంతవరకు తాను చేసినదంతా కుటుంబద్రోహం తనపాట్లన్నీ నిరర్ధకం. ఈ ఏకాంతవాసశిక్ష దేనికి? అయితే తానింతవరకు ఏదో ఊహించుకొని ఏమో చేస్తున్నాడా? ఇది ఒప్పుకోటానికి అతనిమనస్సు సమ్మతించలేదు. అతనికి సత్యనారాయణ సంగతి అప్పుడే స్ఫురించింది ఇంటి లెక్కలన్నీ అతనికి తెలుసు. చంద్రశేఖరం విషయంకూడా అతనికి తెలియకుండా ఉండదు. అతన్ని కనుక్కొంటే ఎప్పుడో తేలిఉండేది! ఈ సంగతి అప్పుడు ఎందుకు స్ఫురించలేదు? అతనికి ఆశ్చర్యం కలిగింది. 

ఇప్పుడైనా తేల్చుకోవచ్చునుగదా అనుకొన్నాడు. వెంటనే తనకు ఆ విషయాన్ని గూర్చి తెలియజేయవలసిందని కోరుతూ ఉత్తరం వ్రాసి పోస్టులో వేయించగలిగాడు ఉత్తరం చేయిదాటిపోయిన తరువాత అతనికి అనుమానం కలిగింది. సత్యనారాయణ తండ్రివద్ద గుమస్తా. నిజం తెలిసి ఉన్నా చెప్పాలని నియమమేమిటి? చెప్పాడని తెలిస్తే తండ్రి ఉద్యోగంలో ఉండనిస్తాడా! లేదు, లాభంలేదు. చెల్లెలు, తల్లికూడా తండ్రిపైగల పక్షపాతంతో అలా చెప్పారు స్పష్టంగా కనిపిస్తూనే ఉంది. మానవహృదయం ఎంత దుర్బలం! ఎలాంటి అబద్ధమైనా ఒకటికి పదిసార్లు ఒకరికి ఇద్దరు చెబితే నిజమని నమ్ముతుంది రేప్ ఆఫ్ ది మాసెస్‌లో చపాట్కిన్ ఇదేగదా వివరించింది. ఒకవేళ ఇందరు చెబుతున్నదీ నిజమనుకొన్నా తండ్రి తనతో అలాగే చెప్పినట్లు ఎందుకు జ్ఞాపకమున్నది? ఆయనమీద తనకేమి పగ? తండ్రి తనతో ఆనాడు అబద్ధం చెప్పాడా? చెప్పవలసిన అవసరం లేదు. ఇంతకూ సత్యనారాయణగారికి ఉత్తరం వ్రాయకుండా ఉంటేనే బాగుండేది అనవసరంగా కుటుంబవ్యవహారాలు నలుగురిలో పడవేయటం ఏమంత బాగున్నది? అయినా చేయిజారి పోయినతరువాత అనుకొని ప్రయోజన మేమిటి? అయినా ఆయన ఏమి వ్రాస్తాడో చూడాలి అనుకొన్నాడు

---

జి వి కృష్ణరావు

ఆసుపత్రిలో జనసంఖ్య ఎక్కువగానే ఉన్నది విసుగుకొనకుండా అతడు అందరికీ మందులిచ్చి పంపివేశాడు మల్లయ్యకొడుకు ఒక మూల మునగదీసుకొని కూర్చుని ఉన్నాడు శాస్త్రి గమనించకుండా పడకకుర్చీలో పండుకొని సిగరెట్టు వెలిగించాడు

''ఏమండోయ్ డాక్టరుగారు! నన్ను మరచిపోయినట్టున్నారే! ఏమిటండి న్యాయం? ముందువచ్చిన వాణ్ణి నేను నన్ను ఇలాగే అట్టిపెట్టారు!''

''నిన్ను కనబడకుండా ఆ బీరువామూల కూర్చోమన్నానురా? సరే ఇటురా ఏమిటిరా రోగం?''

ఇంతలోనే పద్మ చిన్నపిల్లవాణ్ణి చంకనవేసుకు వచ్చింది డాక్టరు వెంటనే లేచి ప్రక్కన ఉన్న ఎత్తి చూపించాడు. ఆమె నలువైపులా చూస్తూ సందేహించింది 'ఎవరూ లేరులే' కూర్చోమని హెచ్చరించాడు ''నన్ను పంపరా?'' అంటూ మల్లయ్య కొడుకు తన్ను జ్ఞాపకం చేసుకొన్నాడు అతన్ని ప్రక్క గదిలోకి తీసుకువెళ్ళాడు. గదిలో జరుగుతున్న సంభాషణ పద్మకు వినిపిస్తూనే ఉన్నది

''అసలు మనుషులు ఎందుకు పుడతారండి!''

''మాటలు మహావస్తున్నాయ్, ఏమిటిరా సంగతి?''

''నిన్న శేఖరంగారికి మూడేళ్ళుశిక్ష వేశారట!''

''ఎవరూ అనుకొన్నవాళ్ళు లేరే?'' అని డాక్టరు విస్తుపోయాడు. అంతలోనే అందుకొని, ''ఇప్పుడు ఆ సంగతి నీకెందుకు? నీబాధ ఏమిటో చెప్పరాదా?'' అన్నాడు అతని గొంతులో కర్కశత్వం కనిపించింది

''రాత్రిళ్ళు దగ్గుతో ఊపిరి సలపటం లేదు ప్రాణాలుపోతే బాగుండుననిపిస్తున్నది డాక్టరుగారు!''

''ఛా. అవాచ్యాలు పేలుతావు! లొడితెడు లేవు. ఎన్నో చూడవలసి ఉంది ఈ ఋద్ధి ఏమిటి?''

''బ్రతికిమాత్రం చేసే దేమున్నది?''

''నోరు ముయ్! సుఖంగా తిని చదువుకో. హాయిగా ఆడుకో పిచ్చిపిచ్చి వేషాలు వేయకు మానవుడు సాధించలేనిది ఈ ప్రపంచంలో ఏదీ లేదు. పెద్దవాడివైన తరువాత అన్నీ నీకే తెలుస్తాయి, చొక్కా పైకెత్తి గాలి 'గట్టిగా పీల్చి విడువు . వెనక్కు తిరుగు. సరే రేపు వస్తూ నీరుడు సీసాలో పట్టుకురా రక్తం పరీక్షకు పంపించాలి. మీ నాన్న నడిగి నేను చెప్పానని పదిరూపాయలు పట్టుకురా రేపు ఎల్లుండి అంటాడేమో – గట్టిగా చెప్పి తీసుకురా. ఈ మాత్ర రాత్రికి వేసుకో దిగులు పడకు నేను ఉన్నాగా పో ''

తలుపు తెరచుకొని మల్లయ్య కొడుకు బయటికి వచ్చాడు పద్మ పిల్లవాణ్ణి తీసుకొని లోనికి వెళ్ళింది

''కొత్త యిల్లు ఎలా ఉంది?'' డాక్టరు అడిగాడు

''ఎలా ఉంటుంది, బాగానే ఉంది '' తలవంచి ఆమె జవాబు చెప్పింది

''సత్యనారాయణ ఎక్కడా కనిపించటంలేదే!''

''ఇంట్లో నుంచి కదలటం లేదు ''

''ఏం, ఒంట్లో బాగుండలేదా? అయితే నాకు ఎందుకు కబురు చేయలేదు!'' డాక్టరు విసుగుకొన్నాడు

''ఏమో చెప్పినా వినిపించుకొన్నట్లు లేదు ''

''ఎప్పుడూ ఇంతే తీరా రోగం ముదరబెట్టుకొని వచ్చి నన్ను వేధిస్తుంటారు '' డాక్టరు పిల్లవాణ్ణి అందుకొని టేబిలు మీద కూర్చోబెట్టి పొట్ట ఒత్తి చూచాడు స్టెతస్కోపుతో గుండె పరీక్షించాడు డాక్టరు కుర్రవాణ్ణి వెక్కిరించాడు వాడు మళ్ళీ వెక్కిరించాడు పద్మ చూస్తూ ఉంది.

''వీడి కేమీ జబ్బు లేదు ఎందుకు తీసుకువచ్చా?''

''వాడికి కాదు'' తలవంచుకొని కాలిబొటనవ్రేలితో నేల గీరుతున్నది.

''నీకా?'' ఆశ్చర్యపడి అడిగాడు



పద్మకు కొంచెం ఒళ్ళు వచ్చింది అరచేతులు, పాదాలు మనోజ్ఞమైన అరుణిమ ఒలకబోస్తున్నవి శరీరం సజీవసువర్ణచ్ఛాయలు విరజిమ్ముతున్నది. కన్నులలో ఒక అపూర్వ కాంతి గోచరిస్తున్నది

''ఏమిటి జబ్బు?''

''తిండి సహించటం లేదు నోట ఒకటే నీరు''

డాక్టరు హెచ్చరికమీద ఆమె బల్లమీద పండుకొన్నది. అతడు పరీక్ష చేసి నవ్వుతూ, ''మందు అవసరం లేదు రెండు మూడునెలలు పోతే అవే సర్దుకొంటవి.''

''అంతేనా?'' నిస్పృహతో అడిగింది

''అరేకిష్టాయ్! నీకు చెల్లెలుకావాలా తమ్ముడు కావాలా?''

''నాకు మా అమ్మే కావాలి?'' అన్నాడు కుర్రాడు.

''అరే భడవా, మీ అమ్మ ఉంటుందిలే చెల్లెలు కావాలా? తమ్ముడు కావాలా?''

''ఇంకెవరూ వద్దు మా అమ్మే కావాలి ''

''ఛా. తప్పు!'' డాక్టరు నవ్వుతూ మెల్లగా పిల్లవాడి బుగ్గ మీద చిటికవేశాడు.

పద్మ ముఖం ప్రక్కకు తిప్పుకొన్నది డాక్టరుకు దుష్యంతుణ్ణి స్మరిస్తున్న శకుంతల జ్ఞాపకంవచ్చింది బహుశ ఆమె ఇంత అందంగా ఉండదేమో అనుకొన్నాడు శకుంతలకు గర్భంమీద ఆ చిన్న పుట్టుమచ్చ లేమ ఉంటే కాళిదాసు వదలిపెడతాడా?

---

జి వి కృష్ణరావు

''నిజమే నంటారు?''

''సందేహ మేమున్నది?''

''డాక్టరుగారు .. ఇది నిజం కావటానికి వీల్లేదు. నిజం కాగూడదు '' పద్మ టేబిలుమీదనుంచి దిగింది.

డాక్టరు మాట్లాడలేకపోయాడు

''నా కిష్టంలేదు. ఆ మాత్రం సహాయంచేయలేరు? అసలే లేని సంసారం పైగా మరొక కానుపా?''

''సత్యనారాయణను కూడా కనుక్కొని తరువాత ఆలోచిస్తాను.''

''వారికి తెలియదు. తెలియగూడదు ''

డాక్టరు ఉలిక్కి పడ్డాడు. పద్మను నఖశిఖపర్యంతం తేరిపార చూచాడు ఆమెముఖం ఎర్రబడ్డది. కన్నులనుంచి అశ్రువులు రాలుతున్నాయి. అతడు కలగంటున్నాడనుకొన్నాడు. పద్మ అలా చేస్తుందని అతడు ఊహించలేదు. ఆనాడు తన్ను చురచురచూచినకళ్లు జ్ఞప్తికి వచ్చాయి అలాంటి పద్మ చేస్తుందా? అసంభవం తన విదానం తప్పు కావాలి అది తప్పైతే తన శాస్త్రం బూటకం. తా నింతకాలం నుంచి చేస్తున్నది వైద్యం కాదు గారడి, లోకవంచన ఇందులో దేనిని

 నమ్మాలి?

కృష్ణుడు డాక్టరు స్టెతస్కోపు రుద్దుకొంటూ ముందరి హాల్లోకి వెళ్ళాడు పద్మ అమాంతం శాస్త్రికాళ్ళమీద పడ్డది. ''డాక్టరుగారు, పెద్దపొరపాటు జరిగింది చేయరాని తప్పుచేసినమాట వాస్తవం. నిజంగా ఆయనముఖం కాని మీముఖం కాని చూడవలసింది కాదు కాని నిజంగా నాది మొండి ప్రాణం. కాకపోతే పదిహేను రోజులక్రితమే పోవలసింది ఇంత అవమానంపాలు కావలసి ఉంటే, మీకు ఇంత నీచంగా కనిపించవలసి ఉంటే ఎందుకు పోతుంది; రాత్రి బావివద్దకు వెళ్ళాను కాని ''అమ్మా, అమ్మా'' అని ఇద్దరు పిల్లలూ అవురుమంటున్నట్లు తోచింది. వాళ్ళకోసం తిరిగి రావాలనిపించింది. కాని హృదయం ఇష్టపడలేదు. గట్టు మీదికి ఎక్కాను. బావిలో మీముఖం కనిపించింది. 'వద్దు. పో అతడు ఉన్నాడు. అతనిహృదయం మెత్తనిది. తప్పకుండా ఆదుకొంటాడు. మార్గం చూపిస్తాడు.' అని వినిపించింది. అప్పుడే సందేహం కలిగింది. అతడు నిప్పు నిప్పు ఒకటే అతనివద్ద ఆగుతుంది. ప్రజ్వలిస్తుంది. ఈ పాపకూపం ప్రయోజనం లేదనుకున్నాను. కాని ఆ నీళ్ళలో కనిపించిన బింబం మోసంచేసింది. ఇంత జరుగుతుందని అనుకోలేదు డాక్టరుగారు! నాకు మీరేమీ చేయవద్దు. చేయాలని అంత కన్నా కోరను కాని ఇదిమాత్రం ఈ రోజుకు మరచిపోండి. అసలు నేనిక్కడికి రాలేదనే అనుకోండి. ఈ ఒక్కటి చాలు. ఈ మాటమాత్రం ఇవ్వండి. అంతకన్నా నా కిక కావలసింది లేదు డాక్టరుగారు డాక్టరుగారు, మట్లాడరేమి? ఈ మాత్రం కూడా చేయలేరా?''

డాక్టరు మాట్లాడలేదు ఆమె లేచింది. ముఖం పైట కొంగుతో కందేటట్లు తుడుచుకొన్నది ''అరే కృష్ణా! వెళ్ళుదాము రారా'' అని గబగబా గదివైపు బయలుదేరింది.

''ఏ పద్మ, ఆగు!''

ఆమె వినిపించుకోకుండా పోతున్నది  అతడు ఒక్క గంతులో తలుపునకు అడ్డంగా నిలబడ్డాడు  ఆమె చురచుర చూచింది

''ఏమిటి మీ ఉద్దేశం?'' అన్నది

''నీ ఉద్దేశం?''

''ఏమున్నది? 'ఏయ్ నీ పెళ్ళాం చూడు ఏమి చేసిందో?'' అని ఆయనను పిల్చుకువచ్చి అప్పగించటమే కదా నేను చేయగలిగిన ఘనకార్యం! నేను ఎంత ధర్మాత్ముణ్ణి! నిండు సంసారం ధ్వంసమైపోతేయేం, నిండు ప్రాణాలు బలియైతేనేం? ధర్మం నెగ్గుతుంది  నలుగురిలో నాగొప్పతనం చాటుకోవచ్చు  వీరుడిలాగా రొమ్ము విరుచుక తిరుగవచ్చు. అంతకన్నా వీరుడిలాగా రొమ్ము విరుచుక తిరుగవచ్చు  అంతకన్నా ఏమి కావాలి? ఇంతవరకు చేసిన మేలు చాలు. మీకే చెబుతున్నది ''

''మాటలు జాగ్రత్తగా రానీయ్! ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసా?''

''తెలియకేం, తెలుసు  సంసారాలుతీసేవాడితో మాట్లాడుతున్నాను.''

''ఎవరిసంసారం తీశాను?'' అతడు పండ్లు పటపటకొరికాడు

''నాసంసారం తీసింది ఎవరు? నువ్వు కాదూ? లేకపోతే ఈ గతి ఎందుకు వచ్చింది?'' 

డాక్టరు నత్తువకొందికి చెంపపెట్టు పెట్టాడు  ఆమె ప్రక్కన ఉన్న తలుపునకు కరచుకొన్నది. చెంప బురబుర పొంగింది  అతనికోపం ఆ ప్రయత్నంతో దిగజారిపోయింది. కూలబడ్డాడు

''నిజమేనా?'' దీనంగా అడిగాడు.

పద్మ తలుపు దగ్గరకువైచి వెళ్ళి కుర్చీలో కూర్చున్నది.

''నన్ను ఇంతకంటె కత్తితో పొడిస్తే ఎంత బాగుంటుంది.? ఇదంతా అబద్ధం నన్ను చూస్తే నీకు అసూయ. నిర్మలంగా ఉండటం నీ కిష్టంలేదు. అందుకనే నీతోపాటు నన్ను నరకానికి లాగుతున్నావు  అంతేకాదు  ఇంతకు ముందన్నది. అబద్ధం నన్ను ఉడికించటానికి అన్నావు  నే నేమంటానో అని చూస్తున్నావు. అంతే, మరేమీ లేదు అసలు ఏ గొడవ లేదు. అంతేకాదు, అంతేకాదు'' డాక్టరు చేతులు ఆమె పాదాలను స్పృశిస్తున్నవి. ఆమె చేతులు అతని క్రాపు దువ్వుతున్నవి.

''ఇదంతా కలే అయితే యెంత బాగుండును?''

''కల కాదా? నేనేగా దీని కంతకూ కారణం?

''ఇంకా మీకు నామీద అనుమానమే. ఎలా నమ్మించేది? పోనీ నేనే మీమీద అభాండాలు వేస్తున్నాను. మీరన్నట్లు నాతోపాటు మిమ్మకూడా నరకానికి ఈడుస్తున్నావు. నేను చెప్పినదంతా అబద్ధం. సరే, మరచిపోండి  నాబ్రతుకు ఎటు తిరిగి బ్రద్దలైంది  మీబ్రతుకు కూడా ఎందుకు పాడు చేయాలి? మీసుఖాన్ని ఎందుకు ధ్వంసం చేయాలి? నలుగురిలో మిమ్మ ఎందుకు ఈడవాలి? నాదే తప్పు  నేనే పొరపాటుచేశాను. మీ రేమీ ఎరుగరు  నిజంగా ఎరుగరు  డాక్టరుగారు!

---

మీరైతే సుఖంగా బ్రతకండి మీధర్మం వర్ధిల్లుతుంది సరే పోయి వస్తాను పులిపిరిమాత్రం క్షేమకారి కాదు ఎప్పటికైనా ఇలానే ముప్పుతెస్తుంది '' డాక్టరుకు గది కనిపించలేదు పద్మ లంతకన్నా కనపించలేదు నిలబడబోయి ప్రక్కకు తూలాడు పద్మ పట్టుకొనకపోతే పడిపోయేవాడే ఆమె మెల్లిగా క్రింద పండుకోబెట్టింది

''అయితే నీతో చెప్పిన కాఫీకప్పు కల వట్టిది కాదు ''

''కాదు.''

అయిదు నిమిషాలు గడచిపోయాయి పద్మ బయలుదేరటానికి ఆయత్తమైపోంది

''పద్మా, పద్మా!'' అతడు మెల్లగా లేచి ఆమెచేతులు పట్టుకొన్నాడు ఆమె తలవంచుకొని అలాగే నిలబడ్డది.

''తొందరపడకు. నన్ను ఆలోచించుకొనీ ఇవాళ, రేపు మాత్రం మాట ఇవ్వు చాలు నాకు ఇంకా ఏమీ అవసరం లేదు అంతకన్నా నిన్ను ఏమీ అడుగను ముమ్మాటికి అడుగను మాట్లాడవేం! అవును ఈ నీచునితో మాట్లాడటం తప్పు. ఇంతవరకూ జరిగింది చాలు ఇంకా దేనికి? అలా కాదు ఈ ఒక్క కోర్కె మన్నించు చేతిలో చేయి వేయి '' అతడు దీనంగా చూస్తూ చేయిచాచాడు ఆమె చేతిలో చేయివేసి ముఖంచూడకుండా తిన్నగా పిల్లవాణ్ణి తీసుకొని వెళ్ళిపోయింది.



డాక్టరు మెల్లగా వచ్చి హాల్లో కుర్చీలో కూలబడ్డాడు అతనికన్నులకు సత్యనారాయణ రూపం పొడకట్టింది ''నమ్మినందుకు ఇంత మిత్రద్రోహం చేస్తావా? నన్ను నా పిల్లల్ని నాభార్యను, సంసారాన్ని ధ్వంసం చేస్తావా!'' అని అంటున్నట్లు కనిపించింది. ఊరంతా నవ్వుతున్నట్లు తోచింది అమ్మామ్మ బారలుచాస్తూ, ''ఎప్పుడైనా వీళ్ళు ఇంతే పై వేషాలకు, నోటిమాటలకు ప్రజలు మోసపోతారు ఇలాంటివాళ్ళను జాగ్రత్తగా కనిపెట్టి ఉండాలి ఆ పద్మ ఏమో అనుకొన్నా కొవ్వు ఎక్కి చేతులారా పండువంటి సంసారం పాడుచేసింది ఇద్దరుపిల్లలున్నారే దానికి ఈ పుండు పుట్టినందుకు అనుకోవాలి ఇంతకూ ఆ పంతులుకొంప నిలువునా తీసింది డాక్టర్ దీనికేనా పంతుల్ని యింటికి చేరదీసింది? ఇలాంటి వాడివి అనుకొంటే నీకొంపలో అడుగు పెట్టేవాడా?'' అంటున్నట్లు కనిపించింది పుల్లయ్యవ్యవహారం మెరపు మెరసినట్లయింది అతడు ముసిముసి నవ్వులు నవ్వుతున్నాడు ''ఏమిటి డాక్టరు? ఏమిటి విశేషాలు? నన్నేదో అనుమానిస్తుంటివే? శేఖరాన్ని, అతనికుటుంబాన్ని అన్యాయంచేసి అయిదువేలు అపహరించి అతన్ని జైలుకు పంపానని అనుకొంటూ ఉంటివే. నీవుమాత్రం ఏమిచేశా? పద్మ ప్రాణాలు తీస్తున్నావు పంతులు పిల్లలకు తల్లి లేకుండా చేస్తున్నావు అతని గౌరవమర్యాదలు ఊచముట్టుగా హరిస్తున్నావు అతడుకూడా ఈ అవమానం పట్టలేక చచ్చిపోతాడేమో? అంటే, రెండునిండు ప్రాణాలు తీస్తున్నావు నువ్వుమాత్రం నాకన్న తక్కువచేసింది ఏమున్నది? నేనెన్నడూ నీలాగా ధర్మమూర్తినని చెప్పుకోలేదు అలాంటి ఉద్దేశం నాకెన్నడూ లేదు అయితే నేను తెలిసిచేశానా అంటావు అంతేగా? తెలిసిచేసినా, తెలియక చేసినా పర్యవసాన మేమిటో చెప్పరాదా? నాకన్నా నీవల్ల తక్కువ జరిగిన దేమున్నది?'' పకపక నవ్వులు వినిపించినట్లయింది డాక్టరు కుర్చీలో నుంచి ఎగిరిపడ్డాడు

అతనికి లోకమంతా అంధకారబంధురంగా కనిపించింది. తాను సంకల్పించిన తపస్సు భగ్నమైపోయింది. తన ఆశయాలు నిర్మూలనమైనవి. ఇంకా తాను బ్రతకటం దేనికి? మల్లయ్య కొడుకు అన్నమాట ఎంత నిజం! ఈ నీచపు బ్రతుకుకన్నా మరణం మేలుకదా! అతడు మెల్లిగాలేచి వెళ్లి తలవాకిలితలుపు గడియవేశాడు. బీరువామీద ఉన్న నూలుతాడు ఉచ్చువేసి దూలానికి బిగించాడు. వీధి అరుగుమీద ఉన్న కిటికీలు రెండూ తెరచి ఉన్నాయి. చప్పుడుకాకుండా వెళ్ళి ఆ రెండుతలుపులు వేశాడు. దొడ్డివైపు కిటికీలు, తలుపులు వేసి ఉండటంవల్ల హాలంతా కటికచీకటికోవ అయింది. త్రాడు ఎక్కడున్నదో కనిపించటంలేదు. పైగా తాను చనిపోయినతరువాత దాన్ని తీసివేయటానికి మార్గమేమిటి? చచ్చికూడా పొరుగువాళ్ళకు హానిచేయటం దేనికి? అతడు దొడ్డివాకిలి తీసివచ్చాడు. కుర్చీ తెచ్చి ఉచ్చు క్రిందవేసి దాని మీదకి ఎక్కి ఉరి సరిపోతుందో లేదో చూచాడు. సరిగా సరిపోతుంది. అంతలోనే జ్ఞాపకం వచ్చింది. ఉరిపోసుకొని చావటం దారుణం. ప్రాణాలు వెంటనే పోవు. గంటలు పట్టవచ్చును. పైగా చూచినవాళ్ళకు ఆ రూపం ఘోరంగా ఉంటుంది. తాను డాక్టరై ఉండి ఆ వికృతపుచావు ఎందుకు చావాలి? అంతకన్న అతిసులభమైన మార్గ మున్నదిగా. అతడు గబగబ దూలానికి వేసిన ఉరిత్రాడు ఊడతీసి ఎప్పటిచోట వేశాడు. కుర్చీ యథాస్థానంలో ఉంచి సింహద్వారం వీధివైపు కిటికీలు తీశాడు. తిరిగి వచ్చి బీరువాలో ఎక్కడో లోపల భద్రంగా దాచిన విషం పట్టుకొని వచ్చి కుర్చీలో కూర్చున్నాడు. నోట్లో వేసుకుందామని పైకెత్తాడు. మనోవీధిలో పరుగెత్తుకొని వస్తున్న పద్మ ప్రత్యక్షమైంది. పిల్లలు ఇద్దరూ 149 చెరియొక చేయి పట్టుకొని ఊడిగిలబడి ఏడుస్తున్నారు. ఆమె వినిపించుకొనటంలేదు. ''డాక్టర్ డాక్టర్! నాగతి ఏమిటి? నీదారి నువ్వు చూచుకుంటున్నావా? ఇంతకుముందు ఏమి చెప్పా? నన్ను నమ్మించి పంపి ఇప్పుడు ఈ పని చేస్తున్నావా? అంతా ద్రోహమేనా? ఇలాంటివాడి పని కలలో కూడా అనుకోలేదు'' అన్నట్లు వినిపించింది. అతడు వణకి పోయాడు. మెల్లగా లేచి విషం ఎప్పటిచోట పెట్టి దాచాడు. తలుపు తాళం వేసి బయలుదేరాడు.

కాళ్ళు నడుస్తున్నవి. పైన మూగఎండ. దారిలో ఎవరో పలుకరించారు.

''యాడకండి డాక్టరుగారు, ఈ యెండలో బయలుదేరారు? బండి దొరకలేదా? అప్పలసామిబండి ఇప్పుడే ఊళ్లోకి వెళ్ళింది. ఈ నీడన నుంచోండి. ఇప్పుడే పంపిస్తాను.''

శాస్త్రి మళ్ళీ ప్రపంచంలో పడ్డాడు. ఆ పలుకరించిన కుశాలయ్య చెమటోడ్చుకొంటూ ఆ ఎండలోపడి బస్తీనుంచి ఏదో సరుకు తెచ్చుకొంటున్నాడు. ఆ జీవితం ఎంత ధన్యం! తానింత చదివి, ఇంతజ్ఞానం సంపాదించి చేస్తున్న దేమిటి? పాపపంకంలో దొర్లుతున్నాడు. ఛీ ఛీ! ఈ చదువులు, ఈ విజ్ఞానం ఇందుకే పనికివస్తున్నాయా? అతనిపాదధూళి దాల్చటానికి కూడా తనకు అర్హత లేదు. ఎంతడబ్బు ఉంటే ఏం? ఎంత అధికారం ఉంటే ఏం? ఎంత సంస్కారం ఉంటే ఏం? తనలాంటివాళ్లు అతనిపాదోదకానికికూడా యోగ్యులు కారు.

''వద్దులే కుశాలు! అప్పలస్వామిని పంపించకు'' అని తల వంచుకుని పోతున్నాడు. తాను బస్తీవైపు పోతున్నానని అతనికి అప్పుడు తెలిసింది. ఎందుకు పోతున్నాడు? అక్కడ చేసేది ఏమిటి? అతనికి అర్థం కాలేదు. అలాగే పోయిన్నాడు.

జి.వి. కృష్ణరావు

తాను చనిపోతేనో? ఇంతవరకూ ఏమీ ఎరుగని వంతులుకు ఇలా విప్పి చెప్పాలమౌతుంది తెలిస్తే పద్మను బ్రతకనిస్తాడా? ఏ సంస్కారము వేరు ఆ తప్పు క్షమించలేదు ఆమెను నిలువునా చీల్చివేస్తాడు ఆత్మహత్యకు గూడా పాల్పడవచ్చును అప్పుడు ఆ పిల్లల గతి ఏమౌతుంది? ఆస్తిం గతులను ఊహించలేకపోయాడు. అతడు పాల్పడక పోవచ్చును కాని ఇకమీదైనా సుఖంగా ఉంటారనటానికి అవకాశం కనపించలేదు. పద్మకు జీవితమంతా దుర్భరమైపోతుంది. అలా జరగరాదు. బ్రతికుండగా అది సహించలేడు

నేరుగా సత్యనారాయణ దగ్గరకు వెళ్ళి జరిగినదంతా చెప్పి క్షమించమని కోరితేనో? అతడు క్షమించగలడా? తన్ను ఏమీ చేయలేడు తాను ఆ ఊరినుంచి వెళ్ళిపోతా నని చెప్పినా పద్మను క్షమించలేడు ఆమె జీవితమంతా నరక కూపమై పోతుంది. అలాకాక ఆమెను వివాహంచేసుకొంటేనో? ఆపక్షంలో తాను ఊళ్ళో ఉండటానికి వీలులేదు. మిగిలిన పిల్లలను ఇద్దర్నీ కూడా తీసుకొని వెళ్ళవలసి వస్తుంది అప్పుడు తన కింతవరకు లక్ష్యంగా ఉన్న సాంఘిక సేవకు స్వస్తి చెప్పాలి. కొత్తరకమైన జీవయాత్రకు అలవడాలి అది ఐనా కొంతవరకు నయమేకదా! ఊళ్ళోవాళ్లు ఏమైనా అనుకొనీ ఒకటి చెప్పి మరొకటిచేసే కపట కలుషితజీవితంకన్న మేలు కదా! అంతే! అంతకన్నా వేరుమార్గం లేదు



అతనినడక మందగించింది

అయితే పద్మ ఒప్పుకోవాలి సాహసించాలి ఆ పని చేస్తుందా? ఆ ఉద్దేశమే ఉంటే భ్రూణహత్యకు సిద్ధమౌతుందా? లేదు తన్ను ప్రేమించటం లేదు ఆ రాత్రి ఉద్రేకంతో ఏదో పొరపాటు చేసింది అందుకనే తన చాయల కన్నా రాలేదు. మరునాడు అలా చేసింది తరువాత కాదు తన్ను పోలీసలు కొట్టినవాడు ఏడ్చింది. నిజంగా తనమీద ప్రేమలేకపోతే ఎందుకు ఏడుస్తుంది? జాలి కావచ్చును. కాదనటానికి తార్కాణ మేమిటి? లేదు తనమీద ఆమెకు అభిమానం లేదు ఆశ, అనురాగం ఉన్నవి. లేకపోతే తనవద్దకు వచ్చి ఉండదు. స్థితిగతులు వివరించి తన సహాయం ఆపేక్షించి ఉండదు.

అతడు చెట్టునీడను నిల్చాడు. దిగజారుతున్న చెమటను తుడుచుకొన్నాడు. ఫర్లాంగురాయి ఉంటే దానిమీద కూర్చున్నాడు.

ఆమె తనతో రావటానికి ఇష్టపడదేమో! అప్పుడేమి చెయ్యాలి? ఆమె కోరినట్లే చేయాలి తానుమాత్రం ఆ ఊళ్లో ఉండటానికి వీలులేదు. తాను తిరిగి గ్రామస్థులముఖం చూడలేడు. అది దుర్భర మనిపించింది ముందుగానే ఎలా తేలుతుంది? ఆమెతో తేల్చుకొనే జరుగవలసినది నిర్ణయించుకోవచ్చు.

డాక్టరు ఇంటికి తిరిగి వచ్చాడు. ఆ యెండదెబ్బకు సొమ్మసిల్లి పండుకొన్నాడు ఆ సాయంకాలం మందుకు వచ్చిన వాళ్లు రిక్తహస్తాలతో తిరిగిపోయారు. డాక్టరుకు సుస్తీగా ఉండటం అన్నేండ్లలోను అది మూడోసారి. కుశల ప్రశ్నలను వేయటానికి వచ్చినవాళ్ళను ఎలాగో వదల్చుకొని తలుపు వేసుకొని పండుకొన్నాడు. ఆ రాత్రి నిద్రలేదు

మరునాడు యథాప్రకారం అతడు రోగులకు మందిచ్చాడు. వారికి కళ్ళలో ఎరుపుతప్ప మరేమీ కనిపించలేదు రోగులు వెళ్ళిపోయినతరువాత నాలుగు మెతుకులు ఎంగిలిపడి వేచి పుస్తకం ముందువేసుకొని కూర్చున్నాడు మనస్సుమాత్రం చదువుతున్న విషయంమీద నిలవటంలేదు లలితకి శేఖరం కుటుంబం జ్ఞప్తికివచ్చింది తాను నిన్ననే వెళ్ళి చూచిరావలసింది. ఎంతపొరపాటు జరిగింది! ఆమెకు ఆ ఊళ్ళో తనకుమల్లేనే నా అన్నవాళ్ళు లేరు తండ్రి ఉంటే అలా చనిపోయాడు. తమ్ముడుంటే నైజాము వెళ్ళాడు ఎవరు పలకరిస్తారు? ఎవరు ఓదారుస్తారు? లలిత చేసిన పాప మేమిటి? నిజానికి శేఖరం కూడా తప్పు చేయలేదేమో ననిపిస్తున్నది ప్రపంచములో ఏనాటికైనా ధర్మం గెలుస్తుందని నమ్మటమేమిటి? లేదు కేవలం అంధవిశ్వాసం, కేవలం బలమే గెలుస్తుంది ఆ బలం దేహబలమో, ధనబలమో, సంఘ బలమో తప్ప ధర్మబలం కాదు. ఛీ, ప్రపంచంకంటె మరొక నరకం ఉన్నదనుకోవడం పొరపాటు

అతడు ఆ ఎండలోనే నేరుగా శేఖరం ఇంటికి వెళ్ళాడు లలిత మంచంలో పండుకొన్నది. కూతురు మంచంవద్ద కూర్చున్నది అతడు వెళ్ళగానే లలిత వెక్కి వెక్కి ఏడ్చింది అతనికి కూడా కళ్ళవెంట నీళ్ళు తిరిగాయి కాని ముఖం తిప్పుకొన్నాడు ఎలాగో ఆమెను ఓదార్చటానికి ప్రయత్నించాడు, వస్తూ, వస్తూ ''అమ్మాయి, నీకు ఏమి అవసరమైనా పిల్లను పంపించు సందేహించకు. నీ తండ్రివేరు, నేను వేరు కాదు. అయినా నేను ఊళ్ళో ఉన్నంతవరకు తప్పక వచ్చి పోతూ ఉంటాలే'' అని బయలుదేరాడు. మానవులు ఒండొరులను ఇలా ఎందుకు పాడుచుకొంటారో అర్థంకాలేదు ఇలాంటి ప్రపంచంలో తాను చేయగలిగింది ఏమున్నది! చేసినా అది ఎంతవరకు ఫలిస్తుంది? ఏనాటికైనా మానవులు విముక్తి పొందుతారా? 151

తనసంగతి మరచిపోవడం డాక్టరుకు అవసరం ఈ అవకాశాన్ని వినియోగించుకొని తన ఆందోళనను విచారాన్ని విస్మరించటానికి ప్రయత్నించాడు దానికి ఈ సాంత్వనక్రియ కొంత తోడ్పడిందనే చెప్పాలి మళ్ళీ నాలుగింటికి హాస్పటల్‌లో కూర్చున్నాడు. ఒంటరిగా కూర్చోవటం అతనికి దుర్భరమైనందున వచ్చిన వాళ్ళతో బాతాఖానీ సాగించాడు అదంతా రోగులకు సహజంగానే కనిపించింది. కాని కొత్తదనమేమీ కనిపించలేదు

చీకటిపడింది. లాంతరు వెలిగించి హాలులలో లొక్కానికి తగిలించాడు. పద్మకు పెట్టినగడువు ఆ పూటతో సరి తాను వస్తానని కాని, ఆమెను రమ్మని కాని చెప్పినట్లు గుర్తులేదు ఎంత పొరపాటు జరిగింది! తాను సత్యనారాయణ ఇంటికి పోతేనో? అనవసరంగా అనుమానానికి హేతువవుతుంది ఆమె వస్తుందా? ఏమో? అతనికి ఎటూ తోచలేదు. చీమ చిటుక్కుమన్నా ఉలిక్కిపడి తలుపువైపు చూస్తూ కూర్చున్నాడు. ఎప్పుడు నిద్రపట్టిందో తెలియదు ఉలికిపడి చూస్తే ఎదుట పద్మ కనిపించింది

''ఎంతసేపయింది వచ్చి?''

''ఇప్పుడే''

''నిలుచున్నావే, అటు కూర్చో '' డాక్టరు కుర్చీలో నుంచి లేచాడు ఆమెను అక్కడ కూర్చోబెట్టాడు రెండు నిమిషాలు ఎవరూ మాట్లాడలేదు చివరకు శాస్త్రి గొంకుతూ ప్రారంభించాడు

---

జి వి కృష్ణరావు

''సత్యనారాయణ దగ్గరకు నేనే స్వయంగా వెళ్ళి తప్పు చేశానని చెబుతాను ఎందుకు భయపడతావు? నేను చెప్పేదంతా విను 'పద్మ నీతో ఉండటం అసంభవం నన్ను ప్రేమిస్తూ ఉంది అక్షరాలు సరిగాలేవు అలాంటప్పుడుపద్మవల్ల నీవు పొందే సుఖమేమిటి? నీవు ఒప్పుకొంటే వేంమిద్దరం ఏ పట్టణానికో వెళ్ళిపోతాము నీకు సుఖంగానే ఉంటుంది పద్మకు సుఖంగా ఉంటుంది' అంటాను ఏమంటావు?''

పద్మ మాట్లాడలేదు. బిత్తరపోయి చూస్తూ ఉన్నది

''అయితే నామీద నీకేమాత్రం ప్రేమలేదు కేవలం నిమిత్తమాత్రంగా ఉపయోగపడ్డాను అంతేగా?''

''లేదు మీమీద ఎంత గౌరవమున్నదో, ఎంత ఇష్టమో ఎలా చూపించగలను! వట్టిమాటలతో ఎలా తేలుతుంది?'' ఆమె కంట తడిపెట్టింది

''ఉంటే దీనికి అభ్యంతరం ఏమిటి?''

''ఆయన ఒప్పుకోలేరు గొంతులో ఊపిరి ఉండగా అంగీకరించరు అమాంతం గొంతు నులిమివేస్తారు అదికూడా బాధ లేదు కాని ఆయన కూడా చనిపోతారు. అది సహించలేను, పిల్లలు దిక్కులేనివాళ్లు అవుతారు.''



''అయితే అసలు చెప్పనేవద్దు. రాత్రికి బయలుదేరు వెళ్ళిపోయింతరువాత ఉత్తరం వ్రాస్తాను ''

''పిల్లలో?''

''పిల్లలతో సహా బయలుదేరు ''

పద్మ మాట్లాడలేదు ఆ మౌనంలోని ప్రతిలిప్త డాక్టరుకు బ్రహ్మకల్పంగా కనిపించింది చివరికి అన్నది :-

''వద్దు. నేను ఆ పని చేయలేను. తలచుకొంటే గుండెలు పగిలిపోతున్నాయి. నేను వస్తే ఆయన బ్రతుకు ఏమౌతుంది? చీకటి గుయ్యారమౌతుంది. నలుగురిలోనూ నావల్ల ఆయన నగుబాటుపాలవుతారు. ముందు పోనిచ్చి వెనుక అమ్మలక్కలు ఆడిపోసుకొంటారు ఆయన మనస్సు నాకు తెలుసు ఆ అవమానం ఆయన భరించలేరు. ఏమయ్యో గొయ్యో చూచుకుంటారు నన్ను మాత్రం లోకం ఊరుకొంటుందా? 'ఇద్దరిని కన్నతరువాతకూడా ఆ పంతుల్ని అన్యాయంచేసి లేచిపోయింది. దాని బ్రతుకు బొగ్గులుగాను – సిగ్గా సెరమా' అంటుంది వెళ్ళినచోటమాత్రం ఏమంటారు? లేచివచ్చిందిరా అంటారు. అప్పుడు నా బ్రతుకు బజారుపాలే కదా! డాక్టరు! నన్నిలాగే బ్రతకనీ నాకా సాహసంలేదు ''

శాస్త్రి కనుబొమ్మలు ముడిపడ్డాయి. నిశితంగా పద్మవంక చూచాడు చప్పున లేచి మందుల బీరువా వద్దకు వెళ్ళి ఏదో మందు తీసుకువచ్చి మాట్లాడకుండా ఆమెకు ఇచ్చాడు ఆమె అలాగే నిలబడ్డది

‘‘కావలసినది వచ్చిందిగా పో త్వరగా పో!’’ అతడు గిరుక్కున మళ్ళాడు.

‘‘కోపమా?’’

‘‘ఎందుకూ? అసలు కోపగించుకోటానికి నాకేమి అధికారమున్నది? నీజీవితాన్ని నీయిష్టం వచ్చినట్లు మలచుకొంటున్నావు కాదనటానికి నేనెవణ్ణి? పో పద్మా! పో. నీ మగడు, నీవు, నీ పిల్లలూ సుఖంగా ఉండండి అంతకన్నా నేను చేయగలిగింది ఏమున్నది? ఆశించగలిగిన దేమున్నది? మిమ్మల్ని కన్న భరతవర్షం ధన్యం మీకు మార్గదర్శకులైన సీతారాములు ధన్యులు! పో, పద్మా! పో నా ఇల్లు నరకకూపం నాహృదయం పాప పంకిలం ఇంక ఇక్కడ ఉండవద్దు. పో.’’

అతనికన్నులు నిప్పులు కురుస్తున్నాయి అతనిపలుకుల్లో కత్తులు ఎరుగుతున్నవి. పద్మ నిలబడ లేకపోయింది. ఆమెను నెట్టివేసి దబేలున తలుపు వేసుకొన్నాడు. కస్తూరి పేరు చెప్పుకొని గబ్బిలాల పెంటలో పొరలాడే జాతికా తానింతకాలం హృదయం పిండిపోస్తున్నది! తన్ను తాను అసహ్యించుకొన్నాడు ఆ కూపంలో తాను మరొక క్షణం బ్రతకటం దుర్భర మనిపించింది. వెంటవే అతడు గబ గబ హోల్డాలు సర్దాడు అప్పలస్వామిబండి పిలిచింది. ఆ రాత్రికి రాత్రే అతడు వెళ్ళిపోయాడు.

మరునాడు మందుకు వచ్చినవారు ఆసుపత్రి తాళంవేసి ఉంటే చూచి ఆశ్చర్యపోయారు. 153
డాక్టరు ఎక్కడికి వెళ్ళాడంటే ఎక్కడకు వెళ్ళాడని ఒకరిని ఒకరుఅడిగారు. చివరికి పట్టణం బండికి వెళ్ళాడని అప్పలస్వామి చెప్పాడు ఊరంతా ఈ సంగతే చెప్పుకొన్నది. అయితే డాక్టరు ఎందుకు వెళ్ళాడో ఒక్కడికీ అర్థం కాలేదు. అసలు అర్థం కూడా కాదు.

---

జి.వి. కృష్ణరావు

# . . ముప్పై ఒకటి .

సత్యనారాయణ చంద్రశేఖరానికి శిక్ష పడేటంతవరకు పుల్లయ్య అలాంటి దురాగతానికి ఒడికడతాడని అనుకోలేదు. తుది నిమిషంవరకూ కేసు ఎత్తివేసుకొంటాడనే అనుకొన్నాడు కాని యిలా జరుగుతుందని కలలోకూడా ఊహించలేకపోయాడు ఆనాడు చంద్రశేఖరం వచ్చి తన్ను బ్రతిమాలినప్పుడు పుల్లయ్యమీద ఉన్న విశ్వాసం కొలదీ బూకరించడం తప్ప అతనికి వేరే దురుద్దేశం లేదు. తీరా కోర్టు శిక్షచెప్పి పోలీసులు అతన్ని తీసుకొనిపోతున్నప్పుడు లోలోన కుమిలి పోయాడు తెలిసి తెలిసి అన్యాయంగా అతనికి సంకెళ్ళు వేయిస్తున్నాననీ, అతనికుటుంబాన్ని ఘోరయాతనలపాలు చేస్తున్నాననీ ఆందోళనపడ్డాడు

అప్పటిదాకా పుల్లయ్య చంద్రశేఖరాల తగాదా భారత యుద్ధంలాంటిది అనుకొన్నాడు తనది ద్రోణాచార్యుల పాత్రకు సదృశంగా ఉంటుంది అనుకొన్నాడు. అయితే కేవలం అధర్మం నెగ్గుతుందని ఊహించలేకపోయాడు. అసలు ద్రోణుడు పర్యవసానం చూడకుండా గతించాడు తానో కేవలం అధర్మవిజయం చూస్తున్నాడు ఇలాంటి అవస్థ వస్తుందని అనుమానించలేకపోయాడు దానితో తాను బ్రతికి ఉండటమే అసహ్యంగా కనిపించింది ఇంకా ఉండిమాత్రం తాను సాధించగలిగిన పురుషార్థమేమి ఉంది? కాకపోతే ఇలాంటి పాపకార్యాలకు మరి కొన్నిటికి తోడ్పడటమౌతుంది.

అతడు పుల్లయ్య ఇంటివద్దకు వెళ్ళటం మానివేశాడు ఎందుకు రావటంలేదని పుల్లయ్య కూడా కబురు చేయలేదు. దానితో కాలిన నారసం గుండెలో దిగినట్లయింది బజారులో ఎవరు నవ్వుతూ కనిపించినా తన్ను జూచి నవ్వుతున్నారనే అనుకొన్నాడు. నలుగురు కూడి రచ్చబండవద్దకాని, లైబ్రరీవద్ద కాని ఏమి చెప్పుకొంటున్నా తన అన్యాయాన్ని గూర్చే అనుకొంటున్నారనుకొన్నాడు. ఎప్పుడు కాస్త కునుకుపట్టినా శేఖరం కనిపించి, ''ఏం పంతులూ! ఇంత పని చేస్తావా? ఇంత అన్యాయానికి ఒడికడుతావా? ఈ సంకెళ్లు నువ్వు వేయించినవి. జైలు అధికారులు నడుము విరగదంతున్నారే, ఇదీ నీపుణ్యమే. ఇటు చూడు, లలిత మంచం పట్టింది. పిల్లలు జీబురుతలలతో ఏడుస్తూ ఇంటింట బిచ్చమెత్తుకొంటున్నారు ఇది నీ నోటి చలువ కాదు?'' పంతులు అదిరిపడి లేచేవాడు. పద్మ అడిగేది. అతడు ఏమీ లేదనేవాడు

ముప్పైఏళ్లు నిండీ నిండని పంతులతల నెరసిపోవ మొదలెట్టింది అతనికి డాక్టరు నాటి రాత్రి చెప్పిన మాటలు జ్ఞప్తికి వచ్చాయి. ''పంతులూ, కాలం మారింది. వివేకవిహితంగా నడుచుకొన్నప్పుడే మనం సంఘంలో బ్రతకగలం లేకపోతే నామరూపాలు లేకుండా నాశనం కావలసివస్తుంది. పుల్లయ్య పక్షాన చేరినందుకే తనకొంప తగలబెట్టారుతాను డాక్టరు ఆశ్రయాన బ్రతకవలసివచ్చింది. పుల్లయ్య ఇల్లు కట్టించిపెట్టి తాను తీర్చుకొనవలసిన ఋణాన్ని అధికంచేశాడు

అంటే అతని పాపపుణ్యాలలో తనభాగం తన యిష్టం లేకుండా పంచుకొన్నాడు. ఎప్పుడు ఈ బంధ విముక్తి? పుల్లయ్యవద్ద గుమస్తా గిరిమానుకొంటాడు తరువాత ఏమి చేయాలి? ఊళ్ళో ధనికులు అంతకన్నా తక్కువ చేస్తున్నది ఏమున్నది? ఒక పక్షంలో పుల్లయ్యే మెరుగు అసలు ఈ పాపకూపంలో నుండి బయటపడాలంటే ఊళ్ళో ఉద్యోగం మానివేయాలి మానివేస్తే కుటుంబం ఎలా గుడుస్తుంది? ఊళ్ళోనుంచి లేచి బస్తీకి వెళ్ళితేనో! అక్కడకు వెళ్ళి తాను చేయగలిగింది. ఏమున్నది? తనకు డిగ్రీ లేదు. ఈ కాలానికి తగినవృత్తులు ఏవీ తెలియవు. ఎలా బ్రతకటం? అతనికి మార్గం తోచలేదు నారుపోసిన వాడు నీరుపోయక పోడన్న సామెత అర్ధరహితంగా కనిపించసాగింది.

భర్త దిగులు పద్మ గుర్తించకపోలేదు కాని తన దురవస్థలో తాను కొట్టుకుపోతూ సాయపడలేకపోయింది. అసలు సుఖంగా ఉన్నవాడు కష్టపడుతున్నవారిపట్ల సానుభూతి చూపించగలడుకాని, కష్టంలో ఉన్నవాడు కష్టపడుతున్న వానిని కనికరించలేడు. పైపెచ్చు పరస్పర ద్వేషం పెరుగుతుంది పద్మా సత్యనారాయణల విషయంలో కూడా ఈ సంఘటనలే జరుగుతూ వచ్చాయి ''వడ్లు మరకు వేయించుకొనిరాకపోతే ఎలా జరుగుతుంది?'' అని పద్మ భర్త వినేటట్లుగా ఒకసారి పెద్దకుర్రవాడితో అన్నది ''ఆ చెప్పేదేదో నాతో చెప్పరాదా!'' అని పంతులు విసుగుకొన్నాడు.



మరొకరోజున పెద్దకుర్రవాడు జీతంకట్టకపోతే స్కూల్లో తనపేరు తీసివేస్తారని తల్లితో చెప్పాడు '' ఏమి ముంచుకుపోలేదు నువ్వుకూడా చేతులు ముందేసుకొని మహారాజు లాగా కూర్చోవచ్చు '' అన్నది అరుగుమీద కూర్చుని ఉన్న సత్యనారాయణ ఈ మాట విని భార్యవంక కొరకొర చూచాడు ఇంకొకరోజున కూరగాయలమనిషి బాకీ ఉన్న అర్ధరూపాయి ఇస్తేగాని వీలులేదని కూర్చున్నాడు. ''రేపు వచ్చినప్పుడిస్తానులే బాపులు!'' అని అతన్ని సాగనంపి ''ఈ పిల్లల్ని చూచి ఈ కాపురంలో నిప్పు పెట్టవలసి వస్తున్నది. లేకపోతే ఊళ్ళో బావో నుయ్యో లేకపోలేదు'' అని భర్తకు వినపడేటట్లు విసుగుకొన్నది.

పంతులు ఇంట్లో కూర్చోలేక లైబ్రరీవద్దకు బయలుదేరాడు దారిలో పోస్టుమన్ ఎదురై ఉత్తరం ఇచ్చాడు. అతడు ఆతురతతో విప్పి చూచాడు. రామారావు వ్రాశాడు. ఒకటికి రెండుసార్లు ఆ ఉత్తరం చదువుకొన్నాడు. ఇంతవరకూ శేఖరం వ్యవహారంలో యధార్ధం శేఖరానికి, పుల్లయ్యకు, తనకూ తప్ప మరొకరికి తెలియదనుకొన్నాడు ఇప్పుడు ఉత్తరాన్ని బట్టి చూస్తే రామారావుకు కూడా తెలిసి ఉన్నట్లు కనిపిస్తున్నది వాస్తవం తెలుపవలసిందని వ్రాస్తున్నాడు. తాను నలుగురికి ఇలా తేలిక అవుతానని అతడు ఇంతవరకూ ఊహించుకోలేదు. ఇక తన బ్రతుకు ఏమిటి? నిజంగా రామారావు తనకంటే పదేళ్ళు చిన్నవాడు. ఆ కేసు నెగ్గటంవల్ల లాభించేది అతని తండ్రికి అతడు అయినా మమకారం లేకుండా ధర్మపక్షపాతంతో ఏకైకంగా నిలబడ్డాడు. శేఖరానికి సాక్ష్యంచెబుతాడన్న భయంతోనే పుల్లయ్య కొడుకును పోలీసులకు అప్పగించి ఉంటాడు. లేకపోతే ఊళ్ళో అతన్ని అరెస్టు చేయించవలసిన అవసరం ఎవరికి ఉన్నది? పైగా ఒకరి జోలికి వచ్చే మనిషికాదే! తప్పకుండా

పుల్లయ్యే పనే అయి ఉండాలి ఎంత దుర్మార్గానికి ఒడికట్టాడు! అలాంటి వ్యక్తికి తాను తోడ్పడ్డాడు తాను గట్టిగా నిలబడి ఉంటే పుల్లయ్య ఆపని చేసి ఉండేవాడేనా? లేదు ఎన్నడూ అలా జరిగి ఉండేది కాదు తాను కేవలం పూర్వపు మైత్రిని, పొట్టను చూచుకొని మూగనోముపట్టాడు నిరపరాధికి దారుణశిక్ష పడుతూవుంటే, అతని కుటుంబం నాన దురవస్థల పాలవుతూ ఉంటే చూస్తూ ఊరుకొన్నాడు. ఇక ఇప్పుడు చేయగలిగినది ఏమున్నది? ఇంతకూ రామారావుకు ఏమని జవాబు వ్రాయాలి? శేఖరానికి పుల్లయ్య హామీ ఉన్నమాట నిజమేనని వ్రాయాలా? వట్టిదేనని వ్రాయాలా? ఆ విషయం తనకు తెలియదని వ్రాయాలా? అసలు మెదలకుండా ఊరుకోవాలా? తండ్రికే వ్రాసి తెలుసుకోమనాలా? పుల్లయ్యకే ఉత్తరం ఇచ్చి, సమాధాన మిచ్చేభారం అతనిమీదనే వేయాలా? ఈ ఆరింటిలో కర్తవ్యమేది అని ఆలోచించటంతో లైబ్రరీవద్దనే అతనికి ప్రొద్దుక్రుంకింది చీకటిపడ్డ తరువాత పెద్దకొడుకు వెదకుకొంటూ వచ్చి సత్యనారాయణను ఇంటికి పిల్చుకొని వెళ్ళాడు

తనమాటవల్లనే మనస్సు నొచ్చుకొని భర్త నాటి ఉదయం భోజనం మానుకొన్నాడని పద్మ బాధపడ్డది అనవసరంగా చీకాకుపరచానే అని తన్ను తాను తిట్టుకొన్నది ప్రొద్దు పోయిన తరువాత అతనివద్దకు వెళ్ళి చేతితో తల నిమురుతూ, ''జుట్టు అంతా తెల్లబడిపోతున్నది చెక్కిళ్ళు గుంటలు పడ్డాయి కళ్లు పీక్కొనిపోతున్నవి. ఏదో పాడుదిగులు పట్టుకొన్నట్లుంది నాకు చెప్పరూ?'' అని అడిగింది

''నాకు దిగులు! ఎందుకూ, హాయిగాతిని తిరగలేక నా?'' వాసాలవంక చూస్తూ మెల్లగా నవ్వాడు.

''ఈ మాటలు నిజంగా గుండెల్లోనుంచి వస్తున్నవా? లేదు ఇక్కట్లణించే నాకు తెలుసు ''

''ఊఁ, వదలు ''

''పుల్లయ్యగారివద్ద మానుకొన్నారా ఏమిటి?''

''ఎవరాన్నరు?''

''ఈ పదిరోజులనుంచి వెళ్ళకపోతే అనుకొంటున్నా. ఆయన వద్దన్నాడా, లేక మీరే మానివేశారా?''

''రెండూ జరగలేదు ''

''అమ్మయ్య!'' పద్మ నిట్టూర్చింది

''నోరు మట్టికంపు కొడుతున్నదే . .. ఇలారా! నీకే చెప్పేది . . ఏమిటది?''

''ఏ మున్నది?'' పద్మముఖం వెల వెల పోయింది

''నిజం చెప్పు!'' అతడు పళ్లు పటపట కొరికాడు.

''ఇంత అనుమానమైతే ''

''ఉనుమానమే తప్ప నిజం కాదంటావు ''

పద్మను జుట్టుపట్టుకుని గబగబా దొడ్లోకి ఈడ్చుకువెళ్లాడు అక్కడ దేంతాడు కనిపిస్తే మడతవేసి సత్తువకొలది బాదుతున్నాడు ఆమె కయ్యికయ్యిమనక దెబ్బలు తింటూనే ఉంది ఆమె ఏడవకపోవటం అతనికోపాన్ని మరీ రెచ్చకొట్టింది అతడు అలాగే కొట్టాడు క్రిందపడిపోయింది కాని, పల్లెత్తు మాట అనలేదు చేయి పడిపోయేదాకా అలాగే బాదాడు రొప్పుతూ అలాగే పదినిమిషాలు చూస్తూ నిలబడ్డాడు. తన మీద తనకే అసహ్యం వేసి అతడు తుప్పున ఉమ్మివేసి ఇంట్లో నుంచి వెళ్ళిపోయాడు

తరువాత కొన్ని గంటలకు పద్మకు స్పృహ వచ్చింది లేవబోయి తూలిపడింది ఇంతవరకూ వస్తుందని అనుకోలేదు డాక్టరు అన్న మాటలు జ్ఞప్తికివచ్చి కన్నీరు కార్చింది ఇప్పుడు ఆమెకొకటే దిగులు భర్త ఎలాంటి అఘాయిత్యానికి పాల్పడతాడో? అప్పుడు తనపిల్లలగతి ఏమౌతుంది? తానేమౌతుంది? తన్ను, తనపిల్లలను పురుగులను చూచినట్టు చూడరా? ఆ స్థితి గతులను ఊహించుకోవటానికే భయపడ్డది ఎలాగో లేచి వెళ్ళి దాచిఉంచిన మందుత్రాగి చాపమీద పండుకొన్నది ప్రాణాలు పోతే ఎంత బాగుండు ననుకొన్నది పక్కకు కుదరక అలాగే దొర్లుతున్నది

పంతులు తిన్నగా రోడ్డున బడ్డాడు ఎక్కడికి పోవాలో ఏమి చేయాలో అతనికి తెలియదు అలాగే పోతున్నాడు కాలువ తగిలింది పడవమీద లాంతర్లు మినుకుమినుకు మంటున్నాయి అవికూడా తనపాలిట శత్రువులై కూర్చున్నవి ప్రకృతి అంతా తన్ను హింసించటానికి కుట్ర 157
పన్నుతున్న దనుకొన్నాడు కాలువప్రక్క రోడ్డువెంట గబగబా నడిచాడు అదేమి చిత్రమో ప్రతి ఫర్లాంగుకు ఒక పడవ కనిపించింది అతనికళ్ళకే అలా కనిపిస్తున్నవో లేక నిజంగా అలాగే ఉన్నవో అతనికి తెలియదు అతడు పరుగెత్తసాగాడు. కొంతదూరం పోయినతరువాత ఆయాసం వచ్చి ఆగాడు. ''పంతులూ. పంతులు! నీవంటి పిచ్చివాడు మరొకడుండడు శాస్త్రి చూడు. ఈ బాధలుంటవనే పెండ్లి మానుకొన్నాడు' ఎంత సుఖపడుతున్నాడో చూడు నలుగురికీ చేతనైన మేలుచేస్తున్నాడు ఊళ్ళోవాళ్ళంతా నెత్తిన పెట్టి కొల్చుకొంటున్నారు జన్మ అంటే అతనిది జన్మ!'' అతడు ఉలిక్కిపడి చూచాడు ఎవరూ కనుపించలేదు చుట్టూ తిరిగి చూచాడు పైనున్న చెట్టుకొమ్మమీదికి చూచాడు ఎవరూ కనిపించలేదు. ''ఆ యేడు పేదో ఎదుటికొచ్చి యేడిస్తే బాగుండును. ఎవరు పిచ్చివాళ్ళో తేలుతుంది. శాస్త్రిగాడుకూడా ఒక మనిషేనా ఛా!'' ఆమాటలే తన్ను అంటున్నట్లు తోచింది అతడు మండిపడ్డాడు. కంకరగుట్టలో నుంచి రాయి తీసుకొని గిరాటు పెట్టాడు అది చెట్టు మొదలు తాకి టాప్పుమన్నది. వెక్కిరిస్తున్నట్లు వినిపించింది అతనికి ఎక్కడ లేని భయం పలిగి మళ్ళీ పరుగెత్తాడు. ఆయాసం వచ్చి మళ్ళీ ఆగాడు. ''నిజంగా నీవు పిచ్చివాడవే సందేహం లేదు పంతులూ!'' అన్న వికటహాసం తిరిగి వినిపించింది ''నన్ను పిచ్చివాడనేవాళ్ళే పిచ్చివాళ్ళు ఇలాగైనా పిచ్చి వాణ్ణిచేయాలనుకుంటున్నారేమో? చాలా పొరపడుతున్నారు అలాంటిది ఎన్నడూ జరుగదు సత్యనారాయణ అంటే అంత తేలిక కాదు'' అని గద్దించి చెప్పాడు. మళ్ళీ వికటహాసం వినిపించింది ''వాగండి, వాగండి! ఇష్టంవచ్చినట్లు వాగండి నేను పిచ్చివాణ్ణయితేగా ఉలికిపడటానికి?'' అంటూ మెల్లగా సాగారాడు

జి వి కృష్ణరావు

ఆ రాత్రే వస్తీకి చేరాడు తెల్లవార్లూ వీధులన్నీ తిరిగి తిరిగి ఒక ఇంటిగుమ్మంలో గోడకు చేరగిలబడ్డాడు తెల్లవారుతుండగా ఆ ఇంటి పనిమనిషి అరుగు ఊడుస్తూ ఉంది అతడు గుడ్డలు దులుపుకొంటూ బయలుదేరాడు ఆ రోజంతా బజార్లు పట్టుకొని తిరుగుతూనే ఉన్నాడు

ఆ సాయంకాలం ఖాళీబండి తోలుకొనిపోతూ ఉన్న అప్పలస్వామి పంతుల్ని బజారులో చూచి, ''ఇంటికి వస్తారా?'' అని అడిగాడు అతడు తల ఊపాడు ఆ రాత్రి అతన్ని లైబ్రరీవద్ద దించి అప్పలస్వామి బండి ఇంటికి తోలుకువెళ్ళాడు పంతులు నేరుగా పంచలోకి వెళ్ళి చీకటికోనలో ఒక ప్రక్కన తలక్రింద చేయిపెట్టుకొని పండుకొన్నాడు ఎప్పుడు కునుకుపట్టిందో తెలియదు అతనికి మెలకువ వచ్చేటప్పటికి భోజనాలు చేసివచ్చి మాట్లాడుకొంటున్నారు

''డాక్టరుగారు ఏమైనట్లు?''

''ఏమో విచిత్రంగా ఉంది. ఈ పదిరోజులనుంచి కనిపించటంలేదు. ఆసుపత్రిచుట్టూ ఊరంతా తిరిగిపోతూ ఉంది.''

''ఆయన ఎక్కడికీ వెళ్ళేవాడు కాదే! వెళ్ళినా ఆ సాయంకాలానికో మరునాటి ప్రొద్దుటికో తిరిగి వచ్చేవాడు. పంతులు కేమైనా చెప్పాడేమో కనుక్కో లేదా?''



''ఆ పంతులుకూడా ఇవాళ అయిపులేదు. ఆయనకోసం పెద్దకొడుకు తిరుగుతున్నాడు ''

''ఇదంతా మాయగా ఉన్నది. పంతులుకూడా పోయాడా?''

''ఏదైనా పనిమీద వెళ్ళాడేమో?''

''పనిమీద వెళ్ళితే కొడుకు వెదకవలసిన పనేముంది?''

''విడ్డూరంగానే ఉంది ముందు డాక్టరు, తరువాత పంతులు. ఐనా పాపం పండిందిలే అమ్మకు అబ్బకు పుట్టినవాడెవ్వడూ ఈ ఊళ్లో ఉండడు అంత పచ్చికలి అయిపోయింది ''

''నీకు ఎప్పుడూ ఉన్న రోగమేరా. తాతలనాడుతప్ప ఇప్పుడు ధర్మమే లేదంటావు అసలు పంతులు ఎందుకు పోయాడో తెలుసా?''

''తెలిస్తే చెప్పరాదా?''

''పెళ్ళాంతో పోట్లాడిపోయా డంటున్నారు.''

''పట్టేది ముప్పాటికి పట్టేది పంతులు, పంతులు భార్య చాలమంచివాళ్ళు ఇంతప్పటినుంచి పంతుల్ని ఎరుగుదును ఆమెనూ ఎరుగుదును ఆ సంసారం చూస్తూ ఉంటే ముద్దొస్తుంటుంది ''

''అయితే ఎందుకు వెళ్ళాడు?''

''ఊళ్లో పాపం బ్రద్దలైతే ఎవడుంటాడు?''

''ఇంతకు నువ్వు ఎప్పుడు బయలుదేరుతున్నా? ముందుగా చెబితే మా వదినె జాగ్రత్త పడుతుంది.''

''పోరా యిఎవ్వన్నాసి!''

''నువ్వు వెయ్యి చెప్పు లక్ష చెప్పు ఏదో జరిగింది అందుకే డాక్టరు వెళ్ళిపోయాడు పంతులు కనిపించటంలేదు. ఏది ఎలా ఉన్నా పాపం పంతులు పిల్లలు, భార్యా ఏమి కావాలి?''

''మనమనస్సులు ఎలా ఉంటే లోకంకూడా అలాగే కనిపిస్తుంది అంతకుతప్ప మరేమీ లేదు ''

అర్థరాత్రాన సన్న గొంతుకలో –

*అంతా సంశయమే శరీరఘటనంబంతా విచారంబె లో*
*నంతా దుఃఖపరంపరార్జిత మె మేనంతా భయభ్రాంత మే*
*యంతా నంతశరీరశోషణమె దుర్వ్యాపారమే దేహికిన్*
*జింత న్నిన్ను దలంచి పొందరు నరుల్ శ్రీ కాళహస్తీశ్వరా!*

*రోసిం దేటిది రోత లేటివి మనోరోగస్థుడై దేహి తా*
*బూసిం దేటిది పూత లేటివి మదాపూతంబు లీ దేహముల్*
*మూసిం దేటిది మూతలేటివి సదా మూఢత్వమే కాని తా*
*జేసిం దేటిది చేత లేటివి వృథా శ్రీ కాళహస్తీశ్వరా!*

159

*ఆలంచు న్మెడగట్టి దానికి సపత్య శ్రేణి గల్పించి త*
*ద్బాలవ్రాతము నిచ్చిపుచ్చుకొను సంబంధంబు గావించి యా*
*మాలార్కంబున బాంధవం బనెడి ప్రేమం గొందరం ద్రిప్పగా*
*సీలన్సీల యమర్చిన ట్లొనగితో శ్రీ కాళహస్తీశ్వరా!*

శ్రీ కాళహస్తీశ్వరా శతకం పద్యాలు లైబ్రరీప్రక్క యిళ్ళ వాళ్ళకు వినిపించాయి. మరునాడు ప్రొద్దున సత్యనారాయణ పెద్దకొడుకు వచ్చి తండ్రిదగ్గర నిలబడ్డాడు

*అంతా మిథ్య తలంచి చూచిన నరుండట్లౌ టెరింగిన్ సదా*
*కాంతల్ పుత్త్రులు నర్థమున్ దనువు నిక్కం బంచు మోహార్ణవ*
*భ్రాంతిజెంది చరింపగాని పరమార్థంబైన నీయందు దా*
*జింతాకంతయు జింతనిల్పడుగదా శ్రీ కాళహస్తీశ్వరా!*

అని రాగయుక్తంగా పంతులు ఒక పద్యం చదివాడు కుర్రవాడు బిత్తరపోయి చూస్తున్నాడు.

''ఎందుకురా అలా చూస్తావు? నీలాగానే నాకు రెండు కాళ్లు, రెండుచేతులు, ఒక ముక్కు ఉన్నాయి. నీకు జుట్టు ఉంది. నాకు జుట్టు ఉంది అంతేకదా! మ రెందుకు అలా చూస్తావు? పో, పో!''

''నాన్నా, నాన్నా!'' కుర్రవాడి కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగినాయి

---

జి వి కృష్ణరావు

‘‘ఎవరు నాన్న! ప్చ్ ప్చ్ ప్చ్ మాయలో పడుతున్నావు అదికాదు ఈ కార్యప్రపంచమంతా మిథ్య కెవలం మిథ్య ’’

*పటువద్రజ్జు భుజంగవద్రజతవిభ్రాంతిస్ఫురచ్ఛుక్తివ*
*ద్ఘటవచ్చంద్రశిలాజపాకుసుమరుక్సాంగత్యవత్తంచు వా*
*క్పటిమల్ నేర్తురు చిత్సుఖం బనుభవింపన్ లేక దుర్మేధసుల్*
*చిటుకన్నం దలపోయజాతు రథముల్ శ్రీ కాళహస్తీశ్వరా!*

చొప్పు వేస్తున్న కుశాలయ్య ఆగి, ‘‘నిజమేనండి పంతులు గారు, నిజమే పాపం పిల్లవాడు మీకోసం అలాగే నిలుచున్నాడు ఇక ఇంటికి పదండి’’ అన్నాడు చీట్ల ఆటకూడా మధ్యలో ఆగింది వాళ్ళుకూడా అదేమాట అన్నారు

‘‘అదిగో మళ్ళీ మాయలో పడుతున్నారు. ఇల్లనీ, వాకిలనీ, నాదనీ, నీదనీ అనుకోవటం ఉన్నదే వట్టి మోహం ఈ మోహంలో చిక్కుకున్న వాడికి మోక్షం ఎక్కడిది? ముందు దానిని మొదలంట నరికివేస్తే కాని లాభంలేదు, అన్నాడు పంతులు ఇంతలోనే పుల్లయ్య వచ్చాడు అతన్ని చూచీచూడకముందే:

160 *ఒకరిం జంపి పదస్థులై బ్రతుక దా మొక్కొక్క రూపాంతు రే*
*లొకొ తా మెన్నడు జావరో తమకు బోవో సంపదల్ పుత్త్ర మి*
*త్ర కళత్రాదులతోడ నిత్యసుఖమందం గందురో యున్న వా*
*రికి లేదో మృతి యెన్నడుం గటగటా శ్రీ కాళహస్తీశ్వరా!*

అని సత్యనారాయణ పాడాడు పుల్లయ్య నవ్వుతూ, ‘‘ఏమయ్యా పంతులు! నీవు చాలా మంచివాడవుకాని లేలే, ఇంటివద్ద అల్లాడిపోతున్నారు ఎందుకు ఏడిపిస్తావు! వెళుదాం రా’’ అని చేయిపట్టుకొన్నాడు సత్యనారాయణ అలాగే కూర్చున్నాడు కుశాలయ్య చొప్పు, నార ప్రక్కనే వదలివచ్చి రెండవరెక్క పట్టుకొన్నాడు పంతులు విధిలేక ఇంటికి వెళ్ళాడు

ఆనాడు లైబ్రరీవద్ద పంతుల్ని గూర్చి, డాక్టర్ని గూర్చి చర్చించారు డాక్టరు ఎందుకు వెళ్ళిపోయాడో, పంతులు మనస్తిమితత్వం ఎందుకు పోయిందో ఏమాత్రం తేలలేదు కాని, అందరిమనసులు నొచ్చుకొన్నవి

## . ముప్పై రెండు ....

అమ్మామ్మగారు రొప్పుకొంటూ మెల్లగా తన స్థూలకాయాన్ని హరిజనాశ్రమం నుంచి ఆ సాయంకాలం మల్లయ్యగారింటికి చేరవేసేటప్పటికి పెద్దబుతలపునకు వచ్చారు. ఇంట్లో మల్లయ్య కొడుకు కనిపించి తీసుకువెళ్ళి గదిలో కుర్చీ చూపించాడు. కొంగుతో చెమటపముఖం తుడుచుకొంటూ, ''మీ నాన్న లోపల ఏమి చేస్తున్నాడురా?'' అన్నది. ఇటీవల ఆమె అంటే అతనికి మంట ఎలాగైనా తనతండ్రిని చూడనీయకుండా ఆమెను వచ్చినదారిపట్టిస్తే రోగం కుదురుతుందనుకొన్నాడు అంతకన్న లాను ఆమెను ఏమి సాధించగలడు?

''అయ్యో, ఇంతకుముందే పొలంవెళ్లాడే!'' అన్నాడు. అమ్మామ్మగారు నిలువునా నీరైంది. ఆమెముఖం చూచి అతడు లోలోన సంతోషించాడు

''ఒక గంటలో రాడూ? ఆమె లేవటానికి బద్ధకిస్తూ అడిగింది.

''వచ్చేటప్పటికి ఏ ఎనిమిదో తొమ్మిదో కాకుండా ఉంటుందా? ఇంకా ఏదో పనికూడా ఉందన్నాడు '' 16

ఆమె అతనివంక చూచింది మల్లయ్య వచ్చాడు.

''ఏమిరా, మీ నాన్న పొలం వెళ్ళాడంటివే?''

మల్లయ్య తనకొడుకుచేసిన ఆటకాయతనం వెంటనే గ్రహించాడు.

''బయలుదేరినవాణ్ణే కొడవలి పట్టుకు వెళ్ళుదామని తిరిగి వచ్చాను. నీవుపోయి జీతగాణ్ణి ఆవుకు కుడితి పెట్టమని చెప్పిదగ్గరుండి ఎడ్లకు మేతవేయించు.''

ఆవు కుడితి తాగదు ఎడ్లను బయటకట్టివేసి మేత వేసింది అంతకుముందే. తన్ను అక్కడనుంచి తరిమివేయటానికి అలా చెబుతున్నాడని అతను ముఖం ముడుచుకొని వెళ్ళిపోయాడు.

''దారితప్పివచ్చినట్లుందే?'' మల్లయ్య పలకరించాడు.

''కాదు పనుండే వచ్చాను.'' అతడు 'ఏమిటాపని చెప్పరాదా?'' అన్నట్లుగా చూచాడు.

''ఆc ఏమున్నది! ఇటీవల జరిగిన సంఘటనలు. వీటితో మన ఊరు శాశ్వతకీర్తిని సంపాదించింది.''

''ఏరోజుకు ఎలా రాసిపెట్టి ఉందో అలా జరుగుతుంది మనం వద్దన్నా కావాలన్నా మానుతుందా?'' మల్లయ్య నిట్టూర్చాడు

''నిజానికి అంతే అనుకో. చంద్రశేఖరం అలా చేస్తాడని అనుకొన్నామా? పిల్లలను ఆశ్రమానికి పంపించమన్న నేరానికే గదా నామీద, నా ఆశ్రమంమీద పత్రికల్లో అన్ని లవాకులు చెవాకులు వ్రాసింది కేసులో తటస్థంగా ఉన్నారనే కదా మీమీద అలా వ్రాసింది?''

---

జి.వి. కృష్ణరావు

''ఇంతకూ చంద్రశేఖరం దురదృష్టవంతుడే కాకుంటే యిన్ని కడగళ్ళు రావు''

''ఇంకా పుల్లయ్యమీద కక్షపోలేదు లేకపోతే యిలా మాట్లాడ''దని అమ్మాయమ్మగారు పసికట్టేంది.

''నిజమే. ముగ్గురు పిల్లలు, ఆవిడ, నా అనేవాళ్లు మరెవరూ లేరు చేతిలో డబ్బున్నా ఉన్నదా అంటే అదీ లేదు ఆ సంసారం ఎలా గడవాలో ఆ భగవంతుడికే తెలియాలి. ఆసలు శేఖరం మంచిచెడ్డలను నిర్ణయించటానికి మన మెవ్వరం? కాని సమాజం అన్నతరువాత చిన్నా పెద్దా, వరుసా మర్యాదా ఉండాలి. అలాకాక అతనిలాగా వ్యవహరిస్తే ఎలా? మనబోటివాళ్ళకు తల ఎత్తుక ి తిరగటానికి వీలవుతుందా? మీసంగతిమట్టుకు మీ సంగతే చూడండి ఆ కేసులో పాపపుణ్యాలు ఏమైనా ఎరుగుదురా? మీవామి తగలబెట్టించారు అంతతో ఆగారా? పాటకజనాన్ని రెచ్చగొట్టి ఊరిమీదికి పంపించారు. ఇంత అన్యాయం ఎక్కడైనా ఉందా? ఆ పోలీసులు వచ్చారు కాబట్టి సరిపోయింది కాని, లేకపోతే మనం ఊళ్ళో ఉండేవనా? కాస్త మనలో పొరపొచ్చాలు ఉండబట్టే కదా ఇంతవని జరిగింది? మల్లయ్య గారూ! వేరే అనుకోవద్దు మీరుకూడా ఆలోచించి చూడండి పుల్లయ్యగారి బ్రతుకు బజారులో పెట్టారుకాని తక్కువ చేశారా? ఆయనగుమాస్తా ఇల్లు తగలబెట్టారు. గిత్తను చంపివేశారు ఎన్ని అభాండాలు వేయాలో అన్నీ వేశారు! ఆ ఇల్లాలు లక్ష్మమ్మ

 మంచంపట్టింది అందుకేగా! నిజానికి అన్నివిధాల నష్టపడ్డది పుల్లయ్యగారేగా! ఆయన మంచివాడు అయినా కాకపోయినా, ఊళ్ళో పెద్ద తల కాయలు రెండూ కలవకపోతేమాత్రం ఆస్తులు దక్కవు ప్రాణాలు అంతకన్నా దక్కవు మీరే ఆలోచించండి ''

మల్లయ్య ఊఁ కొడుతూ మీసం ఎడమచేత్తో సవరించుకొన్నాడు అమ్మాయమ్మ మళ్ళీ అందుకొన్నది.

''పాతకక్షలు మరచిపోయి రాజీపడటానికి ఇంతకంటె మంచి అవకాశం మరొకప్పుడు దొరకదు. ఊళ్ళో మీ గౌరవ ప్రతిష్ఠలు నిలబెట్టుకోవాలన్నా, ఆయన మర్యాద కాపాడుకోవాలన్నా ఇదే అదను.''

''మీ ఉద్దేశమేమిటో తెలియటం లేదు.'' మల్లయ్య అమ్మాయమ్మ గారివంక ఎగాదిగా చూచాడు.

తనప్రయత్నాలకు ఆటంక మేదన్నా వస్తే మల్లయ్య వల్లనే వస్తుందని ఆమెకు తెలుసు అందుకనే ముందుగా అతనివద్దకు వచ్చింది

''నేను చెప్పేది పొంతం విని తరువాత చెప్పండి ఇవాళ ఊళ్ళో అల్లరిపాలై ఉన్నది పుల్లయ్యగారు. ఇవాళ మనం నలుగురం కలిసి గౌరవిస్తే ఆయన మనమాట త్రోసిపారవేయలేడు దానితో ఎన్నిపనులైనా జరుగుతాయి. ఇంత వరకు మిడిసిపడుతున్న పాటకజనం తదితరులకు పాఠం నేర్పినట్టవుతుంది అది అలా ఉండగా త్వరలోనే ఎన్నికలు రాబోతున్నవి మన గ్రామస్థుడే రేపు శాసనసభ్యుడైతే ఎంత బాగుంటుందో చూడండి. ఏ పనులైనా చేయించుకో వచ్చును అప్పుడు

మెచ్చుకునేట్లు ప్రాంతంలో మన గ్రామం మిన్నగా ఉండటానికి వీలవుతుంది అలా జరగాలంటే అలాంటి పెద్దవ్యక్తి మనతో ఉండాలి అది మనం సాధిస్తే వచ్చేది కాని దానంతట అది రాదు ఈ సన్మానం అందుకు తోడ్పడుతుంది. పుల్లయ్యగారు శాసనసభ్యులైతే మీరు పంచాయితీ బోర్డు ప్రెసిడెంటు, స్కూలు సెక్రటరీ కావచ్చును దీనికి పుల్లయ్యగారు ఒప్పుకోనక ఏమి చేస్తారు? ఈ పద్ధతి బాగుండ లేదా?''

మల్లయ్య ఆలోచించాడు ఊళ్ళో తనకత్తికి ఎదురులేక పోవటమే తనకు కావలసింది పుల్లయ్యను శాసనసభకు పంపిస్తే ఊరివ్యవహారాలన్నీ తనకు వదలివేయక తప్పదు దానికన్నా పాటకజనాన్ని కట్టుదిట్టంలో ఉంచటం అవసరం ఊళ్ళో పార్టీలు ఉంటే అది అసంభవం అది అలా ఉంచి ఇవాళ తాను పుల్లయ్యను సాధించగలిగినది ఏమున్నది? కోర్టులో కేసు నెగ్గి కూర్చున్నది ఊరంతా అతన్ని ధర్మాత్ముడంటున్నది కూలినాలిజనంకూడా అతడంటే భయభక్తులతో ప్రవర్తిస్తున్నది తనసంగతి ఏమిటి? వామికి వామి పోయింది దాదాపు రెండువేలుదాకా అమ్మాయమ్మకు దర్శించుకొన్నాడు పైగా వచ్చిన ఎద్దడులకు అన్నిటికి తానే కారణ మన్నట్లుగా గ్రామం చూస్తున్నది ఇలాంటి సమయంలో తాను చేయగలిగినదిమాత్ర మేమున్నది? పుల్లయ్య సన్మానంలో పాల్గొంటే తనవంక తేరిచూడటానికి ఎవడికి మళ్ళీ దమ్ములుండవు

''ఇంతకూ మీ రేమీ తలపెట్టారో చెప్పలేదు'' అన్నాడు మల్లయ్య 163

''ఆఁ, ఏమున్నది? ఆశ్రమవార్షికోత్సవం జరుపుతూ ఆ సందర్భంలోనే పుల్లయ్య గారిఛాయాచిత్రం మంత్రిగారిచేత ఆవిష్కరింపజేసి టీ పార్టీ ఏర్పాటుచేదామని ఉంది ''

అమ్మగారిజాతరలో అధ్యక్షుని ఊరేగింపు లెమ్మనుకొని, ''బాగానే ఉంది. కాని డబ్బో?'' అన్నాడు.

''మీలాంటివాళ్ళు నలుగురూ నాలుగుచేతులు వేస్తే చాలదా?''

''ఓహో, నామెడకే మళ్ళీ కడుతున్నావా? అయితే ఇక నా వల్ల దమ్మిడీకూడా ముట్టదు.''

''అంత భయపడతారు దేనికి? అయినా పాకలకు రెండు వేలదాకా ముట్టజెప్పినప్పుడు కాస్తాకూస్తకు మిమ్మల్ని అడుగుతానటండీ!'' అమ్మాయమ్మగారు నవ్వింది. అంతటితో రక్షించా ననుకొన్నాడు ''మరి మంత్రిగారికి ఎవరు దండవేసి సన్మాన పత్రం సమర్పిస్తారు?''

''మంత్రిగారికి, పుల్లయ్యగారికి మీరే దండలువేసి సన్మాన పత్రాలు సమర్పించాలి ''

''నేను కాదులే మరెవ్వరినైనా చూడండి ''

''అలా కాదు. మీరే చెయ్యాలి లేకపోతే చేసే ప్రయత్నమంతా వ్యర్థమే ''

కాసేపు బ్రతిమాలించుకొని మల్లయ్య ఒప్పుకొన్నాడు. అమ్మాయమ్మగారికి గుండెబరువు దించివేసినట్లయినది మల్లయ్య ఒప్పుకొన్న తరువాత అడ్డమేమున్నది?

ఆ రోజున పుల్లయ్య ఇంట్లో కూర్చుని పేరుకొని ఉన్న లెక్కలు సరిచూచుకొంటున్నాడు పంటలు వస్తూ ఉంటే ఆ బాధ ఉండేది కాదు కాని అతనికి పూర్తిగా మనస్సు చెడిపోయింది

---

జి వి కృష్ణరావు

దానికి కారణమేమిటో బోధపడలేదు చంద్రశేఖరం వ్యవహారం అయితే ఆ పని ఎప్పుడో జరిగి ఉండవలసింది కదా! ఇంట్లో ఏమైనా జరిగిందా అంటే అదీ అతనికి కనిపించలేదు పద్మలాంటి 'అనుకూలవతియైన' యిల్లాలు మరొకతె ఉండదు మరి యీ మనశ్చాంచల్యం ఎందుకు కలిగింది? డాక్టరు ఊళ్ళో ఉంటే ఎంత బాగుండేది? అతడు సమయానికి లేకుండా పోవాలా? ఎన్నడూ బయటికి కదలేవాడు కాదు ఎందుకు వెళ్ళాడు? ఎక్కడికి వెళ్ళాడు? ఊరి వ్యవహారాలు గిట్టక 'జే పరమేశ్వరా' అన్నాడా? బహుశా అంతే కావచ్చునేమో! అదే నిజమైతే తానేకాదు, ఊరంత చచ్చి గీపెడుతున్నా మందు దొరకదు డబ్బు పోస్తేమాత్రం ఆ శ్రద్ధాసక్తులు ఎక్కడనుంచి వస్తవి! పదకొండూ నాలుగు పదిహేను, పదిహేను ఏడు ఇరవై రెండు, పాపం పంతులు పని అన్యాయమై పోతుంది కాస్త ఆదుకొకపోతే ఆ కుటుంబానికి దిక్కేమిటి?

పుల్లయ్యకు ఆ కొలది మాసాలకు జుట్టు పూర్తిగా నెరసి పోయింది గదిలోనుంచి లోపలికి వెళ్ళిరాగానే రత్తి మొగుడు చచ్చిపోయాడని రంగమ్మ చెప్పింది

''ఏమిటి రోగం?''

''రోగ మేమున్నది! అన్నం తింటూ తింటూనే పడిపోయాడు పాపం!''

అతడు దొడ్లోకి పోయి చచ్చి పడిఉన్న సుబ్బణ్ణి చూచి కంపించి పోయాడు పాడుఘటాలు
164 ఇంతే కదా అనుకొన్నాడు దహనసంస్కారానికి ఏర్పాటుచేసి అక్కడనుంచి తిన్నగా పున్నయ్య పెళ్ళాము ఉంటున్న పాకదగ్గరకు వెళ్ళాడు ఆమె తల దాచుకోటానికి నీడకూడా పోతున్నదని భయపడ్డది కాని అతడు ఆమెను లేచిపొమ్మన లేదు పైగా 'ఊరుబయట ఎందుకు అవస్థ పడతావు? సుబ్బడు ఉంటున్న గది ఖాళీ అయింది ఈ పదిరోజులుపోనిచ్చి అందులోకి వచ్చి ఉండ'మన్నాడు ఆమె బిత్తరపోయి చూచింది లోలోన తిరుపతి వెంకన్నకు మొక్కింది

పుల్లయ్య తా నిప్పుడేదో ఘనకార్యంచేశాననుకోలేదు. తాను చేయగలిగినపని చేశాననుకొన్నాడు అంతమాత్రాన పున్నయ్య సంగతి అతనికి తెలియలేదనుకోటానికి వీలులేదు కాస్త చంద్రశేఖరంవైపు ఊగిసలాడా డన్న సంగతి గ్రహించకపోలేదు బహుశా డబ్బుకు ఆశపడి ఉంటాడు ఇంతకూ ప్రలోభం అలాంటిది లెమ్మనుకొన్నాడు అయినా చచ్చిన వాడిమీద పగ దేనికి? అసలు ఆ ప్రస్తావనే అనవసరమని భావించాడు.

అతడు అక్కడనుంచి వెళ్ళి కాలువగట్టుమీద కూర్చున్నాడు. గట్టుమీద గడ్డిలోనుంచి కప్ప ఒకటి కాలువలోకి దూకింది తా నిప్పుడు గండంగడచి బయటపడ్డాడు. అప్పుడు కంటినిండ నిద్ర ఎరగడు ఇక రొమ్ముమీద చేయివేసుకొని నిద్రపోవచ్చును తన్ను మరి కదిలించేవాడు ఉండడు పరులు లేనకు అన్న విధాలా అపకారంచేయాలని చూచారు పత్రికలలో ఇష్టంవచ్చినట్లు వ్రాశారు కొడుకును తనమీదికి ఉసికొల్పజూచారు ఇవన్నీ వాడికి తెలియవు నల్లనివన్నీ నీళ్ళు, తెల్లనివన్నీ పాలు అనుకొంటాడు ఈ సంగతులన్నీ వాడి చెవిని పడకపోవటమే మంచిది అన్నట్లు డాక్టరు వాడి విడుదలకోసం యత్నించాడే! ఇంతవరకు ఎందుకు రాలేదు? అదే విచిత్రంగా ఉంది మరొకసారి వాడిసంగతి ఏమిటో కనుక్కోవాలి ముసలిది కూడా వాణ్ణి చూడ్డానికి ఆరాటపడుతున్నది

అయితే ఇప్పటికీ ఒకటి తలచుకొంటే నవ్వు వస్తున్నది ఒకప్పుడు తాను నిర్దోషి నాసేమో నన్న శంక ఉండేది ఎంత విచిత్రం! ఇప్పుడు జ్ఞప్తికి వస్తున్నది హోటలుగదిలో ఉండగా తనకు హోమీ ఉండవలసిన దని శేఖరం అడిగాడు అయితే సంతకాలు హోటల్లో జరిగాయా? అంతపన్నా పచ్చి అబద్ధం ఏమి ఉంటుంది? ముసలిది మొదటినుంచి మొత్తుకొంటూనే ఉన్నది తనది మెత్తని మనస్సు అందువల్లనే తాను హోమీ ఉన్నానని శేఖరం చెబితే నమ్మాడు అతడు అంత దుర్మార్గుడని తనకు తెలియదులే

ఇన్నాళ్ళకు గ్రామంలో తిరిగి శాంతి నెలకొన్నది మళ్ళీ కార్మికుల ఎద్దడి ఉండదు తనమీద బయలుదేరిన అపవాదుల్లో కొన్నైనా ఇరుగుపొరుగులు నమ్ముతుండాలి. నమ్మనీ, తాను ఉన్నాడు, తన పొలం ఉన్నది. ఎవ రేమనుకొంటే తన కేమి?

శేఖరంకుటుంబానికి ఇక్కట్లు వచ్చాయి. తీర్పు చెప్పినప్పటినుంచీ భార్య మంచంపట్టిందంటున్నారు. పట్టకేమి చేసుంది? భర్త నట్టేటముంచిపోతే? ఎవరికర్మకు ఎవరు కర్తలు?

పుల్లయ్య ఇంటికి తిరిగివచ్చేటప్పటికి అమ్మాయమ్మగారు హాల్లో కూర్చుని ఉంది. గ్రామం తనకు టీపార్టీ ఇవ్వటానికి సంకల్పించిందనీ, హరిజనాశ్రమం వార్షికోత్సవ సందర్భంలో మంత్రిగారు తన ఛాయాచిత్రాన్ని ఆవిష్కరించటానికి అంగీకరించారనీ ఆమె చెప్పింది. 16

''నాకా, టీపార్టీయా?'' పుల్లయ్య నవ్వాడు తనచెవులను తాను నమ్మలేకపోయాడు.

''మీకు ఎప్పుడు వీలుపడుతుంది?'' అమ్మాయమ్మ అడిగింది.

అయితే నిజమే నన్నమాట! పుల్లయ్య ఆలోచించాడు.

''దొడ్లో శవం బయటికి వెళ్ళిందో లేదో టీపార్టీలకు వచ్చేదా?'' అతడు అన్నాడు లక్ష్మమ్మకు ఆశ్చర్యం కలిగింది కావాలని సన్మానం చేయబోతుంటే యిదేమి టనుకొన్నది. లప్పుడు పట్టుబట్టి లాభం లేదని ఆమెకు తెలుసు.

అమ్మాయమ్మగారు వెళ్ళిపోతూ ఆశ్చర్యపడ్డది. ఇంత గౌరవం తలపెడితే కృతజ్ఞతన్నా సూచించలేదు ఎంత గర్వమో మనిషి కని విస్తుపోయింది.

జి వి. కృష్ణారావు

..... వయిపై వయాడం ..

హరిజనాశ్రమం కోలాహలంగా ఉన్నది. ఆవరణ మంతటా పందిరి ఒక ప్రక్కన పెద్దవేదిక హైస్కూలు విద్యార్థులు, ఆశ్రమ విద్యార్థులు గ్రామంలోని యువకులు అలంకరణ క్రియలో నిమగ్నులై ఉన్నారు. మరొక ప్రక్కన నియుక్తులైన కూలీలు కొబ్బరిమట్టలు, అరటి స్తంభాలు పాతి బాదులకు అంటగడుతున్నారు. పాకలన్నిటికీ వెల్ల వేయిస్తున్నారు. అమ్మాయమ్మకు గడియ తీరిక దొరకటం లేదు. ఒకప్రక్క పసూలు కావలసిన చందాలకు కుర్రవాళ్ళను పంపిస్తున్నది మరొకప్రక్క నృత్య నాటిక రిహార్సలుకు హాజరై, 'అది అలా ఉండాలి, ఇది ఇలా ఉండాలి ఇక్కడ ఇలా చేస్తే బాగుంటుంది,' అని సలహా యిస్తున్నది మరొక ప్రక్కన తేవటానికి మరచిపోయివచ్చిన దండలు వగైరాలకు మనిషిని బస్తీకి పంపిస్తున్నది అన్నట్టు ఊరేగింపు ఉన్నదికదా! మేళము లేకుండా ఎలా జరుగుతుంది? కోటప్పనువచ్చి ఒకసారి మాటాడిపోవలసిందని దగ్గరలో నిలుచున్న కుశాలయ్యకు పురమాయించింది. మైక్, లౌడుస్పీకర్లు కూడా కావాలి. మరొకరిని అందుకోసం
166 బస్తీకి తరిమింది.

ఎవరో ప్రక్కవాళ్ళతో మాట్లాడుతూ, లలితమ్మ ఇంకా కోలుకోలేదని చెబుతూ ఉంటే ఆమె విన్నది. ఎంత మతిమరుపు! లలితమ్మ స్థితి కనుక్కొని పరామర్శించకుండా ఉత్సవాలలో పాల్గొనటానికి మనస్కరించలేదు ఇష్టపడితే కొన్ని రోజులు ఆమెను, ఆమెపిల్లను ఆశ్రమంలో ఉంచుకొందా మన్న మహాశయంతో అమ్మాయమ్మ మెల్లగా లలిత ఉంటున్న పూరిచావడివైపు బయలుదేరింది.

తీరా అక్కడికి పోయేటప్పటికి తలుపు వేసి ఉన్నది బయట బావిదగ్గర ఒకపిల్ల నీళ్ళు తోడుతున్నది. బహుశః లలితమ్మ పెద్దకూతురై ఉంటుంది.

''లలితమ్మ ఎక్కడ?''

''ఇంట్లో.'' ముక్తసరిగా ఆ పిల్ల జవాబు చెప్పింది.

''నేను వచ్చా నని చెబుతావా?''

''నేనంటే?''

''పోయి అమ్మాయమ్మగారు వచ్చిందని చెప్పు. ఆమెకు తెలుసులే ''

పిల్ల లోపలికివెళ్ళి కాసేపటికి తిరిగివచ్చి, ''మాట్లాడేస్థితిలో లేను. మీమేలు మరచిపోను'' అని చెప్పమన్నదని చెప్పింది.

''ఇక ఏమి చేయదలచుకొన్నది?''

''ఏమో మరి.''

ఉమ్మాయమ్మ కన్నీళ్ళపర్యంతమైనది ''ఈ టీపార్టీ సన్మానాలు బహుశా లలితకు కష్టం కలిగించి ఉంటాయి కష్టం కలిగిస్తే ఏమి చేస్తాం? తప్పు తప్పే న్యాయాన్ని గౌరవించవద్దా'' అనుకొంటూ తిరిగి ఆశ్రమానికి వెళ్ళింది

మరునాటి ఉదయాన ఆనందభైరవి వినిపిస్తున్నది ఆశ్రమంవైపు వచ్చేవార్లకు వెళ్ళేవార్లకు ఎడతెరపి లేదు లలిత మెల్లగా వచ్చి కుటీరంవయుంగిట కటికనేలమీద చతికిలబడ్డది. సంస్కారశూన్యమైన కురులు రేగి గాలికి ఊగులాడుతున్నవి. ప్రక్క బావివద్ద అంట్లు ముందువేసుకొని పెద్దకూతురు తోముతున్నది

''అమ్మా, అక్కడ ఇవాళ ఉత్సవమటే?''

లలిత మాట్లాడలేదు శూన్యదృష్టితో చూస్తున్నది

''అంట్లు తోమిన తరువాత చెల్లాయిని తీసుకుని అక్కడికి వెళ్ళి వస్తానే,''

''అయ్యో పిచ్చితల్లి! మనకు ఆరాత కూడానా?'' పైట కొంగు చాటుచేసుకొని కన్నీరుతుడుచుకోవాలని ప్రయత్నించింది. ఎంత దిగమింగాలనుకొన్నా ఏడుపు ఆగలేదు. పిల్ల బిత్తరపోయి ఆ వెలిబూడిద చేతులతోనే వచ్చి తల్లిని కావలించుకొంది.

''అమ్మా పోనులే. నిజంగా పోనుగా. తెలియక అన్నాలే. ఎందుకు ఏడుస్తా?'' పిల్ల బ్రతిమాలింది ఎలాగో కొంతసేపటికి తెప్పరిల్లుకొన్నది. 

''ఆశ్రమంలో ఇవాళ ఏమి జరుగుతున్నదే?'' పిల్ల కాసేపు ఉన్న తరువాత అడిగింది

''ధర్మానికి పట్టం గడుతున్నారు ''

పిల్లకు అర్థంకాలేదు. తల్లివంక అలాగే చూస్తూ నిలబడ్డది ఆమె మోచేయి తొడమీద మోపి అరచేత చెక్కిలి చేర్చి ఆలోచిస్తున్నది అనారోగ్యంతో చిక్కిపోయిన శరీరం, దిగులుతో వెలవెలపోతున్న ముఖం, పీకుకొనిపోయిన కళ్ళు. ''ఈ పిల్లలను ఎలా ఈదుకు రావాలి? ఏమి చేయాలి? నాలుగుపొట్టలు ఎలా నిండుతాయి? ఇప్పుడు ఆ సంగతి విచారించి ప్రయోజనం లేదు మతికూడా పోతుంది. ఆ కర్మగూడా చుట్టుకుంటే పిల్లలను చూచుకొనే అవకాశం గూడా ఉండదు.''

ఆ క్రిందటిరోజే భర్తదగ్గరనుంచి ఉత్తరం వచ్చింది. హైకోర్టుకు అపీలు చేయటానికి ప్రయత్నిస్తున్నానని వ్రాశాడు లలితకు అతనిలో ఇక ఏమాత్రం నమ్మకంలేదు, భర్త నిర్దోషి కాడు తన కా సంగతి ముందుగానే చెప్పిఉంటే! తన్ను కూడా అతడు నమ్మలేదు. తనతండ్రి మొదటినుంచి మొత్తుకొంటూనే ఉన్నాడు. అదంతా అక్షరాల నిజం ముసలి తండ్రికి ఎంత దుర్గతి పుట్టింది?

''అలా నిలుచున్నా వేమే? తొందరగా అంట్లు కానిచ్చి రెండుగింజలు పొయ్యిమీద వేస్తే తమ్ముడికి పెట్టవచ్చు ''

పిల్ల అంట్లు పూర్తి చేస్తున్నది ఇంతలోనే బ్యాండుమేళం దగ్గరకు వస్తున్నది హైస్కూలు విద్యార్థులు, ఆశ్రమవాసులు, మువ్వన్నె జెండాలు పట్టుకొని, 'మహాత్మాగాంధీకి జై, జవహర్‌లాల్

నెహ్రూకు జై, మంత్రిగారికి జై, పుల్లయ్య గారికి జై' అంటూ నినాదా లిచ్చుకొంటూ వస్తున్నారు ముందు వెనుక పోలీసు ఉద్యోగస్తుల కార్లు, మధ్య మంత్రికారు మంత్రిగారిప్రక్కన పుల్లయ్య కూర్చుని ఉన్నాడు ఆ యిద్దరి మెడలలో నూలుదండలు, పూదండలు నిండిఉన్నాయి కుటీరందగ్గరకు కారురాగానే లలిత నిలబడ్డది ఆమెకు పుల్లయ్య నిండువిగ్రహం కనిపించగానే చటుక్కున లేచి రెండుచేతులెత్తి నమస్కరిస్తూ నిలబడ్డది తల్లిని చూచి పిల్లకూడా చిట్టిచేతులతో నమస్కరించింది ఆ కోలాహలంలో ఆ రెండు ప్రాణుల భంగిమలు ఎవరు చూచారో ఎవరు చూడలేదో తెలియదు. కాని పుల్లయ్యమాత్రం చూచాడు ముఖం తిప్పుకొన్నాడు మంత్రిగారికి కూడా ఆ దృశ్యం కంటబడ్డది. 'పుల్లయ్యగారు నిజంగా ధర్మమూర్తి – ధన్యజీవి' అనుకొన్నాడు సిగ్గుపడి ముఖంతిప్పుకొని ఉంటాడని నిశ్చయించుకొన్నాడు

కార్లు సాగిపోతున్నవి. పుల్లయ్యలో మాత్రం అంత ఉత్సాహం కనిపించలేదు తనకు గౌరవం తలపెట్టటంలో ఉద్దేశం అర్థం కాలేదు మల్లయ్యకూడా ఇందుకు పూనుకోవటం విచిత్రంగా ఉన్నది అతనికడుపులో ఏమున్నదో ఆ బ్రహ్మదేవుడికే తెలియాలి ఏది ఎలా ఉన్నా ఇది వేళాకోళం కావటానికే వీల్లేదు మంత్రిగారిని వేళాకోళం చేయటానికి ఎవరికి దమ్ములున్నవి? అతడు ఆశ్రమం గేటువైపు చూచాడు. ఎన్నికార్లు! ఎన్ని కార్లు! ఎన్ని సూట్లు! ఎన్ని గాంధి టోపీలు! ఇందరిలో
168 సన్మానం పొందటం సామాన్యమా! తనలో ఏదో విశేషం ఉండాలి లేకపోతే ఇలా గౌరవించటానికి లోకం గ్రుడ్డిదా? చంద్రశేఖరం విషయంలో తప్పు తనదేమోనన్న శంక ఉండేది నిజంగా తప్పు తనదే అయితే ఇలా సత్కరిస్తారా? లేదు అతనిదే తప్పు తాను పీసం కూడా ధర్మం తప్పలేదు ఆ సంగతి కోర్టు తెలుసుకొన్నది. ప్రజలు నేడు తనకు జేజేలు కొడుతున్నారు.

కార్లు ఆశ్రమ ఆవరణం ప్రవేశించాయి అమ్మాయమ్మ, మల్లయ్య మొదలైన పెద్దలు ఎదుర్కొనిచ్చి మంత్రిని, పుల్లయ్యను వేదికమీదికి తీసుకువెళ్లారు జయజయధ్వనులతో పందిరి దద్దరిల్లింది. జాతీయపతాకాలు రెపరెపకొట్టుకొంటున్నవి. లౌడ్‌స్పీకర్లు 'జనగణమన అధినాయక' అన్న జాతీయ గీతాన్ని దిక్కులనింపుతున్నవి సోడాలు కిళ్లీలు రాలేదని అమ్మాయమ్మ చిరాకుతో కుర్రవాణ్ణి ఊళ్లో కొట్టువద్దకు తరిమింది ఎక్కడ ఏ పొరపాటు జరుగుతుందోనన్న ఆందోళనతో పందిరి నలుమూలల తిరిగింది తిరిగినట్లుగానే ఉంది వస్తున్న పెద్దలను ఎవ్వరిని ఎక్కడ కూర్చోబెట్టాలో హైస్కూలు అధ్యాపకులకు హెచ్చరించి పంపుతున్నది. ఇంకా ఏమైనా మరచిపోలేదుగదా అని ఆలోచించింది అన్నట్లు ఆశ్రమంవార్షిక నివేదిక కాపీలు ఎక్కడున్నవి? ఆఫీసు గదిలో ఎక్కడో ఉండాలి చూడమని విద్యార్థిని పంపించి చెమటతుడుచుకొంటూ వేదికవద్దకు వెళ్లింది

# యిరవై నాలుగు

ప్రొద్దున్నే రైలు దిగి బండి కట్టించుకొని రామారావు స్వగ్రామం బయలుదేరాడు బండివాడు గుర్రాన్ని హుషారుగా పోనిస్తున్నాడు ఇంతలోనే పేవుమెంటుమీద తీరికగా ఆలోచించుకొంటూ పోతున్న డాక్టరు కనిపించాడు బండివాణ్ణి గుర్రాన్ని ఆపమని చెప్పి డాక్టరు కోసం కేక వేశాడు. అతడు వినిపించుకోకుండానే పోతున్నాడు

''డాక్టరుగారు, డాక్టరుగారు!'' రామారావు చప్పట్లు చరిచాడు.

శాస్త్రి తలవంచుకొని నడుస్తూనే ఉన్నాడు అతడు చెరచెర నడిచివెళ్ళి బుజంమీద చేయివేశాడు శాస్త్రి ఉలిక్కిపడి చూచాడు.

''నువ్వటయ్యా! ఎప్పుడువచ్చావేమిటి?''

''ఇప్పుడే బండిదిగి వస్తున్నా ఇక్కడున్నారేం?''

''వెనకటిరోజుల్లో వానప్రస్థ, సన్యాస ఆశ్రమాలు పుచ్చుకొంటే ఎక్కడబడితే అక్కడ అరణ్యాలు ఉండేవి ఇప్పటి సన్యాసులు మరేమి చెయ్యాలి? ఇలాంటిబస్తీలే శరణ్యాలుగా కనిపిస్తున్నవి'' 169

''అంటే?. ఊళ్ళో ఇప్పుడు ఉండటంలేదా ఏమిటి?''

లేదన్నట్లు డాక్టరు తల ఊపాడు

''ఎంతకాలంనుంచి?'' విస్తుపోయి అడిగాడు.

''పదిహేను, ఇరవైరోజులు అవుతున్నది.''

''ఎందుకని అక్కడనుంచి వచ్చేశారు? ఇప్పుడు ఎక్కడుంటున్నారు? ఏమి చేస్తున్నారు?''

''కేర్ ఆఫ్ రోడ్స్ అండ్ పేవ్‌మెంట్స్, చేసే ఉద్యోగమంటావా, చూస్తూనే ఉన్నావుగా.''

''నన్ను వెక్కిరిస్తున్నారా ఏమిటి?''

''వాస్తవం చెబుతున్నా వేళాకోళమే నటయ్యా!''

రామారావు ఆశ్చర్యపడ్డాడు డాక్టరు ఇలా రావటానికి కారణం బోధపడలేదు.

''ఇంతకూ నేను నక్కనుతొక్కి వచ్చాను. ఇక్కడ మీరు కనిపించారు కాబట్టి సరిపోయింది లేకపోతే ఇన్ని వందల మైళ్ళు ప్రయాణం దండగ అయ్యేది.''

''అ దేమిటి?

''మీకోసమనే వస్తున్నాను. లేకపోతే ఆ ఊళ్ళో నాకేమి పని?''

---

జి.వి. కృష్ణరావు

డాక్టరు రామారావుపంక తేరిపార జూచాడు ''పుట్టింది ఆ ఊళ్లో పెరిగింది ఆ ఊళ్లో ఆస్తిపాస్తులు ఉన్నవి అక్కడ ఇవాళ మీనాన్నగారికి సన్మానం జరుగుతున్నది ఇక ఎనిలేక ఎలాపోతుంది?''

''మానాన్నకు సన్మానమా? ఎవరు? ఎందుకు?''

''అవును మీ నాన్నగారికే మంత్రిగారు ఇవాళ ఆయన చిత్రపటావిష్కరణ జరుపుతున్నారు గ్రామమంతా తలపెట్టి చేయిస్తున్నది అలా చూస్తావేం?''

రామారావు తెల్లబోయాడు కొంతసేపటివరకూ నోటి వెంట మాటలేదు

''అయితే డాక్టరుగారు, మీలాంటివాళ్ళు ఉండే ఇలాంటివి జరుపుతున్నారన్నమాట!''

ఇంతలో బండివాడు రామారావును కేకవేశాడు. బండిని దగ్గరలో ఉన్న స్టాండువద్ద ఆపిఉంచమని హెచ్చరించి డాక్టరు, తాను దావులో ఉన్న కాఫీ హోటలులోకి వెళ్ళి ఒక మూల కూర్చొని కాఫీకి ఆర్డరిచ్చాడు.

''పెరోల్‌మీద వస్తున్నావా?'' డాక్టరు అడిగాడు

''లేదు. నిర్నిబంధంగానే వదలిపెట్టారు నేరుగా మీదగ్గరకు వస్తున్నాను.''



''నా దగ్గరకా? ఏమిటి విశేషం?''

''ఇంతకూ చంద్రశేఖరం కేసు ఏమైంది?''

''ఏమైన దేమున్నది? మూడు సంవత్సరాలు శిక్షపడ్డది.''

''చంద్రశేఖరానికే?''

''ఆఁ!''

''డాక్టరుగారు, డాక్టరుగారు! అతన్ని ఎలాగైనా విడిపించాలి. తప్పదు ఏమైనాసరే. నామాట వినండి. లెండి!''

రామారావు లేచి డాక్టరు చేయి పట్టుకొన్నాడు.

''అసంభవం. ఎప్పుడో చేయిదాటిపోయింది. ఇప్పుడు ఎవరు ఎంతగా కాళ్ళో తొక్కుకున్నా ప్రయోజనం లేదు ''

''అంతేనా, అంతేనా? నిర్దోషి మూడేళ్ళు ఆ కారాగారవాసం అనుభవించవలసిందేనా? అశుభము శుభమూ ఎరుగని ఒక అమాయక కుటుంబం సమూలనాశనం కావలసిందేనా? ఇంత అన్యాయం జరుగుతూ ఉంటే చూస్తూ ఊరు కొంటారా? శేఖరం జైల్లో అల్లాడుతూఉంటే తిండికోసం అతని భార్య, పిల్లలు అలమటిస్తూ ఉంటే ముప్పూట తింటూ త్రేపుతూ ఉంటారా? దోషిని మూపుల కెత్తుకొని ఓం బీబీలుకొడుతూ ఊంటారా! డాక్టర్, డాక్టర్ సత్యంకోసం ధర్మంకోసం నిలడబడుతా వనుకొన్నాను. అన్యాయాన్ని రొమ్మువొడ్డి ప్రతిఘటిస్తావనుకొన్నాను ఇలాంటిపాపపుకూటికి ఆశపడులావనుకోలేదు డాక్టరు జాజ్వల్యమానమైన శిఖిశిఖ అనుకొన్నాను

అవును తప్పంతా నాదే నీవల్ల తప్పేమున్నది? నేను ధర్మమూర్తినని చెప్పుకొన్నావా? సత్యన్యాయాలకోసం ప్రాణాలనైనా బలియిస్తానని చెప్పుకొన్నావా? లేదు. నీవు నలుగురులాంటి వాడివే. బురదలో పొర్లుతూ స్వర్గంలో ఉంటున్నా వనుకొంటున్నావు అంతే, నాదే తప్పు ఆదర్శమూర్తివనీ, సత్యసంధుడవనీ, అధర్మనిరాసకుడ వనీ ఆశించటం నాదే తప్పు. లోకానుభవం లేక పొరపడ్డాను. క్షమించడి డాక్టరుగారూ! క్షమించండి. పొరపాటున ఏమైనా దురుసుమాటలన్నానేమో మరచిపోండి. వస్తాను ''

రామారావు లేచి టేబిలుమీదనే కాఫీ వదలి గబగబా బిల్లు చెల్లించి బయటికి బయలుదేరాడు. డాక్టరు వెంట వెళ్ళి బలవంతాన తిరిగి తీసుకొని వచ్చి ఎప్పటిచోట కూర్చోబెట్టాడు కాఫీహోటల్లోని జనం ఈ ప్రవర్తనను వింతగా చూస్తున్నది

''వట్టి ఆవేశాలవల్ల ఏమిటి ప్రయోజనం నలుగురూ చూచి నవ్వటం తప్ప? అప్పుడె నలుగురూ చూస్తున్నారు. ఆ కాఫీ తాగు బయటికి వెళ్ళింతరువాత ఏమైనా మాటాడుకోవచ్చు'' అని మెల్లగా హెచ్చరించాడు. రామారావు ఒక గుక్కలో కాఫీతాగి మూతితుడుచుకొన్నాడు ఇద్దరూ బయటికి వచ్చారు.

''దోషమంతా మానాన్నదే చంద్రశేఖరం ఫోర్జరీ చేయలేదు అతనివల్ల తప్పులేదు. మా నాన్నే దురాగతానికి ఒడికట్టాడు నేను ఎదురుతిరిగాను చంద్రశేఖరానికి సాక్ష్యం చెబుతానని పోలీసులకు పట్టించాడు.''

''అంతా నిజమే నన్నమాట!'' డాక్టరు విచారంతో నిట్టూర్చాడు

రామారావుకు ఆశ్చర్యం కలిగింది

''మీకెలా తెలుసు ?''

''లక్ష్మమ్మకు సన్నిపాత జ్వరం వచ్చిన సంగతి, సంధిలో ఆమె పలవరించిన విషయాలు వివరించాడు. నాడు నిజం ఊహించుకోలేక ఆమె గుండె దిగులు ఎలా మాన్పాడో చెప్పాడు. తరువాత పున్నయ్య చనిపోతూ అన్న మాటలు చెప్పాడు. ''అప్పుడుమీ నాన్నే దోషి అని గట్టిగా నమ్మలేదు. కాని అనుమానం మాత్రం ఉన్నది. ఇప్పుడది రూఢి అవుతున్నది.''

''ఇప్పుడిక ఏమిపీలులేదా?'' ఆతురతతో రామారావు అడిగాడు.

''ఏమీ లాభం లేదు అపీలు గడువు కూడా దాటిపోయి ఉంటుంది. అసలు నువ్వు ఆనాడే నాకీ సంగతి ఎందుకు చెప్పలేదు?''

ఈ ప్రశ్నకు ఏమి జవాబు చెప్పాలో రామారావుకు అర్థంకాలేదు. నిజంగా డాక్టరుకే చెప్పి ఉంటే శేఖరానికి ఈ శిక్ష పడకపోను. నిజంగా దోషి తానే. తనమీద తనకే అసహ్యం వేసింది. దుర్బలత తలచుకొనగానే కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి

''ఎలాగైనా మా నాన్నను ఒప్పించి కేసు ఎత్తివేయించాలని చూచా. కాని ఆయన ఇలా చేస్తాడనుకో లేదు. పోలీసులు వచ్చినప్పుడైనా మీతో చెప్పి ఉంటే ఇంత అన్యాయం జరిగి ఉండేది కాదు. ముమ్మాటికీ జరిగి ఉండేది కాదు ''

---

జి వి. కృష్ణరావు

''తరువాతనైనా ఎందుకు ఉత్తరం వ్రాయలేదు?''

''వ్రాశాను ప్రయోజనం లేకపోయింది ''

'' ఎవరికి? నాకా?''

''కాదు సత్యనారాయణగారికి వ్రాశాను. అతనివద్ద నుంచి జవాబయినా లేదు ''

డాక్టరు మాట్లాడలేదు. కొంతసేపటికి నిట్టూర్చి, ''అరయంగా కర్ణుడీల్గె నార్వురచేతన్'' అన్నాడు రామారావు మాటాడలేదు ప్రశాంతత దుర్భర మనిపించింది

'' ఇక జరగవలసిందేమిటి?'' అని శాస్త్రి అడిగాడు.

'' డాక్టరుబాబు! ఈ సన్మానం జరగటానికి వీలులేదు నా గొంతులో ప్రాణాలుండగా జరగనీను చూస్తూచూస్తూ హృదయం లేని రాక్షసుడికి, ధర్మమంటే లెక్కించని పాపికి, జేజేలుకొట్టి సత్కరిస్తూ ఉంటే ఆమోదింటమేనా? దుర్భరం ముక్కు మూసుకొంటే మూడు గడియలు పట్టదు లేదు, ఇప్పుడే వెళ్ళి ఆ నిండు సభలో బతుకంతా కడిగి పెడతాను ఊరుకోను కొడితే కొట్టనీ. చంపితే చంపనీ. నేను మాత్రం ఇక సహించను ఇదివరకే కుటుంబ గౌరవరక్షణ కోసమని చాల అన్యాయం చేశాను నిజం చెబితే సహించలేని తలిదండ్రులను వాత్సల్యం లేకుండా పోలీసులకు పట్టిచ్చిన తండ్రిని ఎందుకు గౌరవించాలి? లేదు తప్పు ఎవడు చేసినా తప్పే తండ్రి చేయనీ, నాయకుడు చేయనీ, దేవుడు చేయనీ తప్పే అంతఃకరణం చెప్పినట్లు నడుచుకోలేనప్పుడు ఈ ఆస్తి పాస్తులు, భోగభాగ్యాలు దేనికి? ఈ జీవితం దేనికి?''

డాక్టరు ఆపినా ఆగకుండా రామారావు చెరచెరా నడిచి వెళ్ళి బండి ఎక్కి పోనిమ్మన్నాడు తుది నిమిషంలో ఏమనుకొన్నాడో ఏమో డాక్టరుకూడా పోతున్న బండిలోకి ఎగిరి దుమికాడు

బండి బస్తీదాటి రోడ్డున జోరుగా పోతున్నది. కొంత సేపటికి డాక్టరు మెల్లగా ప్రారంభించాడు.

'' ఏ రాముూ ! నేను చెప్పేదికూడా కొంత విని నీ యిష్టం వచ్చినట్లు చేయి నాకిప్పుడు ఏన్నేళ్ళు ఉన్నాయి? ముప్పై అయిదు దాటింది. అంటే ఈ ముప్పై అయిదేళ్ళలో పల్లెటూరి సంపర్కంతోనే గడిచింది. ముఖ్యంగా ప్రాక్టీసు పెట్టిన ఈ పది సంవత్సరాలలోను గ్రామ జీవనంలో మునిగి తేలుతున్నాను డాక్టరును అయి అంతో ఇంతో ప్రాక్టీసు సంపాదించిన తరువాత గ్రామస్థులు నలుగురితో కొంత పరిచయమేర్పడకుండా ఉండదు. ఇవ్వాళ నువ్వుపోయి సభలో జరిగిందంతా చెబుతానంటావు. చెబితే ఏమి జరుగుతుందో తెలుసా? అసలు ఆలోచించావా? మధ్యలోనే దించివేస్తారు. పిచ్చివాడి కింద జమకడతారు. అప్పుడు నీ సత్యంవల్ల ప్రయోజన మేమిటి? అలాంటప్పుడు నీవు సత్యం చెప్పే ఒక్కటే చెప్పకా ఒకటే నీ అంతఃకరణ నీకు ఎలా చెబుతున్నారో వాళ్ళ అంతఃకరణ వాళ్ళకు అలాగే చెప్తుతున్నది ఇన్నేళ్ళు వాళ్ళలో పడి కొట్టుకొన్నానే, నేనెందుకు అక్కణ్ణుంచి పారిపోయి వచ్చాను? ఆలోచించావా?''

''మీరు అక్కడనుంచి పారిపోయి వచ్చారా? ఎవరా దుర్మార్గులు మిమ్ము తరిమివేసింది?''

'' అవును నేనే పారిపోయి వచ్చాను ప్రత్యేకంగా ఏ ఒక్కరూ తరిమారని చెప్పలేను. అక్కడి స్థితిగతులన్నీ అలా చేశాయి. క్షణం బ్రతకడం కష్టమనిపించి నేనే వచ్చేశాను ''

'' ఏమి జరిగిందేమిటి?'' రామారావు డాక్టరువంక చూచాడు అతడు మాటాడలేదు

''చెప్పరూ, నా మీద అంత నమ్మకంలేదా?'' అంటూ ప్రాధేయపడ్డాడు. అతని మనస్సు నొప్పించటం డాక్టరుకు ఇష్టం లేకపోయింది.

''చంద్రశేఖరం కేసు లాంటిదే మరొకటి జరిగింది. తప్పు సవరించుకొని జీవితాలు సక్రమంగా నడపటానికి ప్రయత్నించాను లాభం లేకపోయింది దానితో విరక్తి కలిగింది. ఇన్ని సంవత్సరాలనుంచి ఏ ఆదర్శంకోసం పల్లెటూళ్ళో పడి ఉన్నానో ఆ ఆదర్శం ధ్వంసమైపోయింది. ఇంకా ఎందుకు బ్రతకాలో అర్థం కాలేదు ఈ పదిహేనురోజులనుంచి అదే ఆలోచిస్తున్నాను. రామూ! నీలో కూడా నా తత్త్వమే కనిపిస్తున్నది. అందువల్లనే అంతదూరం చెప్పవలసి వస్తున్నది. నా అనుభవం నీకేమైనా పనికి వస్తుందేమో ఆలోచించు. ఈనాటి గ్రామాలు కేవలం మురికికూపాలు అసత్యం అధర్మం వాటికి ఆలంబనాలు డబ్బు, అధికారం, అజ్ఞానం వాటి కులదేవతలు ప్రాచీన ధర్మాల పేరుచెప్పుకొని పాపపంకంలో పొరలాడటం వాటికి సరదా! ఆ సంగతి వాటికి తెలుసు అదే మరీ ఘోరం తెలియకపోతే ఏనాటికైనా తెలపటానికి అవకాశం ఉన్నది కాని తెలిసి తెలిసి 173
చేస్తున్నప్పుడు ఎన్ని జీవితాలు ధ్వంసమై ఏమిటి ప్రయోజనం? ఆ అంటురోగానికి నిజంగా మందులేదు నయం చేయటానికి పోయిన డాక్టరు కూడా దానికి బలి కావాలి లేదా అక్కడనుంచి పారిపోయి రావాలి. ఇందులో అతిశయోక్తి లేదన్న సంగతి నీకూ తెలుసు. బస్తీలు మాత్రం అలాంటివి కావా అంటావేమో? వాటికి కూడా ఈనాడు డబ్బు, అధికారం, అజ్ఞానం ఆరాధ్యదేవతలే. కాదనను. కాని ఒకటి ఉన్నది. నీవుకూడా అలాచేస్తే కాని వీలులేదని అనుశాసించటం లేదు ఆ మాత్రం స్వాతంత్ర్యం ఈనాటికీ ఇస్తున్నవి రేపటి సంగతి ఎలా ఉంటుందో చెప్పలేను కాని ఇవాళ నీ ఆదర్శాల ప్రకారం బస్తీలో నడుచుకొనవచ్చు అవి ఇతర జీవితాలకు ప్రతిబంధకాలైతే తప్ప ఎలాంటి ఆటంకాలు కల్పించవు మాస్‌హిస్టీరియా, మూకతత్త్వం అంతలేదు సహేతుకంగా స్థితిగతులను వివరించి చెబితే వింటారు. ఆచరించక పోవచ్చును అది వేరే సంగతి ఇవాళ కాకపోతే రేపైనా ఆచరణకు రావచ్చునన్న ఆశ అయినా ఉంటున్నది. అది మేలు కాదా? అందుకోసమే బస్తీలోనే ఉందామనుకొంటున్నాను ''

''ఏ బండి ఆపు! డాక్టరు దిగి వెళ్ళుతారట ఆపవయ్యా ఆపు నీకే చెప్పేది?'' రామారావు బండివాణ్ణి కసురుకొన్నాడు. బండి ఆగింది

''పోనివయ్యా, పోనీ, ఊళ్ళో కాస్త పని ఉన్నదిలే!'' డాక్టరు హెచ్చరిక మీద బండి మళ్ళీ సాగింది.

''అవును నీకు కోపం రావటం సహజమే, గ్రామంలో పుట్టి గ్రామంలో పెరిగి గ్రామం డబ్బుతో విద్యాబుద్ధులు సంపాదించి గ్రామాలను చీడపురుగులుగా చూస్తూ ఉంటే ఏ గ్రామస్థుడికి

కోపం రాదు? రామూ, నిన్నేమీ అనలేను నీవు చదువుకొన్నవాడివి అర్థం చేసుకోగలవన్న ఉద్దేశంతో అలా అన్నా ముప్పై అయిదు సంవత్సరాల జీవితంలో నాకు కలిగిన అనుభవాన్ని చెప్పాను నా అంతఃకరణం చెప్పినట్లు నేను నడుచుకోవచ్చా? దానికి కూడా అధికారం లేదంటావా? నిన్ను గ్రామంనుంచి వచ్చి వేయమని చెప్పటం లేదు. నీ అనుభవం ఎలా ఉండబోతున్నదో ముందుగానే ఎలా చెప్పగలను? నీయిష్టం వచ్చినట్లు చెయ్యి. నేను కాదు కూడదంటే అప్పుడను ''

''వెనుక ఒక రాజు పాలు కావాలంటే నేనొక్కణ్ణే కదా నీళ్ళు పోస్తున్నది ఇబ్బంది ఏమిటి అనుకొన్నాడట ఒక వర్తకుడు!''

''నా అనుభవాన్ని కాదని నన్ను నమ్మించలేవు. వివేకానికి ఎప్పుడు అది మార్గం కాదు. నిజంగా నన్ను నమ్మించటమే నీ ఉద్దేశం అయితే నా అనుభవాన్ని ఒప్పుకొని ఏయే కారణాలవల్ల అలా కలిగిందో వివరించి అది నీవు చెప్పేవిశాల అనుభవంతో ఎలా సమన్వయం పొందుతుందో చూపాలి.''

''అది మీకు కూడా అన్వయిస్తుంది.''

''అందుకేగదా నిన్ను అనుశాసించనిది. లేకపోతే కత్తి గొంతుమీద పెట్టి చేయించక పోయానా?''

రామారావు మాట్లాడలేదు. ఇష్టం లేక ముఖం చిట్లించుకొన్నాడు ఒకప్పుడు డాక్టరును అర్థం చేసుకొన్నాననుకొన్నాడు. కాని ఇప్పుడు అతని తత్త్వం బోధపడలేదని అర్థం చేసుకొన్నాడు.

## . . పదిహేను . . . .

ఉదయం వార్షికోత్సవం ముగిసిన తరువాత సాయంకాలం మళ్ళీ మూడు గంటలకు సన్మానసభ ప్రారంభమైంది వేదిక మీద మంత్రిగారు, పుల్లయ్య ఆసీనులయ్యారు వేదిక ప్రక్కన గోడలమీద ప్రముఖ రాజకీయ నాయకుల చిత్రపటాలు వేలాడుతున్నవి. వేదికకు రెండుప్రక్కల జాతీయపతాకలు ఎగురుతున్నవి. ముందున్న మైక్ జాతీయ గీతం, ఆంధ్రదేశ సంకీర్తనం ఆలాపిస్తూ ఉన్నది ముందువరుసలో జిల్లా అధికారులు, ఇరుగుపొరుగు ఊళ్లనుంచి వచ్చిన పెద్దలు, ఆ వెనుక ఊళ్లోని పెద్దలు, రైతులు, వారి వెనుక బాలబాలికలు, మరొకప్రక్కన స్త్రీలు కూర్చున్నారు. అమ్మాయమ్మగారి హెచ్చరికపై మల్లయ్య వేదిక మీద పెద్దలనిద్దరినీ పుష్పమాలాలంకృతులను చేశాడు కరతాళ ధ్వనులు చెలరేగాయి. అమ్మాయమ్మగారు ఒక ప్రక్కనుంచి వేదిక మీదికి ఎక్కి నాటి సభా ప్రాముఖ్యాన్ని వివరిస్తూ ప్రారంభించింది

''అధ్యక్ష, సోదరీ సోదరులారా!

ఇవాళ ఒక అపూర్వ శుభదినమనటంలో సందేహం ఏ మాత్రం లేదు ఎందుకంటే ఇంతకాలం మనమధ్య నిగూఢ నిక్షిప్తమై ఉన్న ఒక మహా తేజాన్ని దర్శించి అర్పించే మహా భాగ్యం లభిస్తూ ఉంది సాధారణంగా మనకు ముఖ్యంగా గ్రామస్థులకు ఒక నమ్మకం ఉన్నది మహావ్యక్తి పుట్టినపుడు ఒక నూతన తార కనిపించటమో, ఇతర శుభనిమిత్తాలు గోచరించటమో జరుగుతుందని మన విశ్వాసం. అయితే ఇది కలియుగం కావటంవల్ల నేమి, మరే ఇతర కారణంవల్ల నైతే నేమి అలాంటి శుభనిమిత్తాలు కనిపించటంలేదు దేశభక్తులు ఉద్భవించటం లేదనుకోవటం పొరపాటు. ఇందుకు మన జాతీయ ఉద్యమమే తార్కాణం చరిత్రలో మున్నెన్నడూ ఎరుగని మహాత్యాగాలు చేసినవారు, అహింసా వీరధనులు బయలు దేరారు. వారివల్లనే ఈనాడు సంపూర్ణ స్వాతంత్ర్యం అనుభవిస్తున్నాము. కాబట్టి అలాంటి మహావ్యక్తులను గుర్తించి వారి అడుగుజాడల నడవటం మన విధి. మామూలుగా మనమధ్య నిత్యం కలిసిమెలిసి తిరిగే మహావ్యక్తిని గమనించటం, గౌరవించడం మహాకష్టం అనక తప్పదు. కొండలు దరంగా ఉంటేగాని నున్నగా కనిపించవు. మన పుల్లయ్యగారినే తీసుకోండి. మనిషి కాస్త పొడగరి. నెరసిన మీసాలు, మామూలు ఖద్దరు దుస్తులు. ఇలాంటివాళ్ళు ఎంతమంది లేరు? ఏమిటి వీరిలో విశేషం? ఈ ప్రశ్నలు కలగటం సహజం. ఊళ్ళో వాళ్ళందరికీ ఆయన గుణగణాలు కొంతవరకు తెలిసే ఉండాలి కాని బయటివారికి తెలియక పోవచ్చును. ఈయన పైకి ఎంత మామూలుగా కనిపించినా ధర్మమూర్తి. ఆ ధర్మం కోసం ఎన్ని అవాంతరాలు రానీ, ఎన్ని కష్టాలు ఎదుర్కోనీ అణుమాత్రం కూడా వెనుకంజ వేయరు. ఇందుకు చంద్రశేఖరం వ్యవహారమే నిదర్శనం అయిదువేలు వీరికి ఒక లెక్క లోనివి కావు కాని ఫోర్జరీ క్షంతవ్యం కాదు అందుకోసం ఏకాకిగా ఎదుర్కొని పోరాడారు. ఏది ధర్మమో కోర్టు

నిరూపించింది. పశువుల మీది ప్రీతి ఎంత గొప్పదో పాటకజనం ఊళ్లో గోలచేసి గిత్తను చంపినప్పుడు స్పష్టంగా వ్యక్తమైంది ఏకాకి అయినా బాణాకర్ర పట్టుకొని బజారులోకి దూకారు ఎక్కడ దుండగీండ్రు అక్కడ గప్‌చిప్ కన్నెర్ర చేసి కర్ర పట్టుకొని నిలబడ్డ ఆనాటి పుల్లయ్యగారిని చూచి ఉండవలసినది ఈ పుల్లయ్యగారేనా నాడు హుంకరించింది అనిపిస్తుంది అంతమాత్రంచేత పేదసాదలమీద పాటకజనం మీద ఆయనకు ద్వేషమనికాని, కూలి పెంచటం ఇష్టం లేదనికాని భావించరాదు. చావడి ఊరక ఉండటం దేనికని కార్మిక దంపతులను ఇరువురిని ఉచితంగా ఉండనిచ్చారు. వాళ్ళ కష్టనిష్ఠూరాలకు ఆదుకొంటూ వచ్చారు వాళ్ళు అతని పనిపాటలలో తిరుగుతూ ఉన్నందుకు ఉండనిచ్చారను కోవటం పొరపాటు వాళ్లిద్దరూ అవిటివాళ్ళు అయినా పోషిస్తూ వచ్చారు నిన్నగాక మొన్ననే సుబ్బడు చనిపోతే తన సొంత ఖర్చుమీద అంత్యక్రియలు జరిపించారు ఆనాడే ''మీకు సన్మానం ఏర్పాటు చేస్తున్నాము మీకు ఎప్పుడు వీలవుతుంది?'' అని నేనడిగితే ఏమన్నారో తెలుసునా? 'దొడ్లో శవాన్ని పెట్టుకొని సన్మానాలకు తయారయ్యేదా?' అన్నారు.

176 ''అంతకన్నా మరీ విచిత్రమైన సంఘటన ఒకటి ఉన్నది కొడుకు రామారావు కమ్యూనిష్టు అన్న అనుమానంతో ప్రభుత్వం పట్టుకోవటానికి పోలీసులను పంపిస్తున్నది వీరికి తెలిసింది వీరు ఏమి చేశారో తెలుసా? 'ఛీ వాడు నా కడుపున చెడబుట్టాడు దేశానికి కాని కొడుకు, కొడుకుకాడు వాడు ఇవాళ రేపు ఊళ్ళోనే ఉంటాడు తప్పకుండా పట్టుకొని వెళ్ళమనండి మళ్ళీ నలుగురిలో ముఖం ఎలా ఎత్తుకొనేది?' అన్నారు. ఇది ఆంధ్రదేశానికే కాదు, యావద్భారతానికి ఆదర్శప్రాయం అందరూ ఇలాంటి తండ్రులే ఐతే దేశ ద్రోహులకు చోటెక్కడ? అరాజకానికి తావెక్కడ? ఇలాంటి దేశభక్తి, త్యాగం ఎందరిలో ఉన్నాయి? వీరినికాక నేడు భారతం ఎవరిని గౌరవించగలదు? ఇలాటి మహాధర్మస్వరూపుని, దయార్ద్ర హృదయుని, మహాదేశభక్తుని గౌరవించటానికి అవకాశం లభించినందుకు మనమెంతో ధన్యులం. ఈ ఉదాత్త చరిత్రులు పూర్ణాయుషం జీవించి మనకు మార్గదర్శకులుగా ఉండాలని మీ అందరి తరుపున పరమేశ్వరుని ప్రార్థిస్తూ వీరి ఛాయాచిత్రాన్ని అమాత్యశేఖరులు ఆవిష్కరించాలని కోరుతున్నాను.''

అమ్మాయమ్మగారు ఉపన్యాసం ముగించగానే కరతాళ ధ్వనులు చెలరేగాయి ఊళ్ళోనిరైతులు, యువకులు ''సర్దార్ పుల్లయ్యగారికి జై'' అని పెద్దపెట్టున జయజయ ధ్వనులు చేశారు హర్షధ్వనులు మధ్య మంత్రిగారు లేచారు. వెంటనే ప్రశాంతత నెలకొన్నది

''మహాజనులారా! ఈ పుల్లయ్యగారిని గూర్చి తెలుసుకొనే భాగ్యం, ఛాయా చిత్రపటాన్ని ఆవిష్కరించే అదృష్టం, మిమ్ము సందర్శించే అవకాశం లభించినందుకు ఎంతో సంతోషిస్తున్నాను ఈనాడు దేశాన్ని ఎన్నోక్లిష్టసమస్యలు ఎదుర్కొంటున్నవి ఒక ప్రక్క కార్మికుల సమ్మెలు, మరొక ప్రక్క క్షామభీతి, మరొకప్రక్క దేశద్రోహులైన కమ్యూనిష్టుల దురాగతాలు సాగుతున్నవి ఇవన్నీ

పరిష్కారమై అభ్యుదయం సిద్ధించాలంటే ప్రభుత్వానికి ప్రజా సహకారం అవసరం. ప్రభుత్వమే సర్వం చక్కబెట్టుకొంటుంది సుఖించటమే మనవంతు అనుకోవటం పొరపాటు. 'యథారాజా తథా ప్రజా' అన్న సామెత మనకు ఒకటి ఉన్నది అది రాచరికం ఉన్న రోజుల్లోని మాట. ఇది ప్రజాస్వామిక యుగం అందువల్ల 'యథా ప్రజా తథారాజా' అంటే సరిపోతుంది. అంటే ప్రజలు ఎలా ఉంటే ప్రభుత్వము అలాగే ఉంటుంది. కాబట్టి ఈనాడు మనకు పుల్లయ్యగారిలాంటి ధర్మవీరులు, కర్మవీరులు, దేశభక్తి ప్రపూర్ణులు కావాలి. మీలో ప్రతి ఒక్కరు వీరిలాగా వ్యవహరిస్తూ భారతాభ్యుదయానికి తోడ్పడతారని ఆశిస్తున్నాను మీ జయజయ ధ్వనులను బట్టి చూస్తే సర్దార్ బిరుదం పుల్లయ్యగారికి ఇవ్వటం అభిమతమైనట్లు కనిపిస్తున్నది. మీ ఇష్టప్రకారం వీరు ఇకనుంచి సర్దార్ బిరుదాంకితులు '' మంత్రిగారు ఇలా ప్రసంగించి చిత్రపటాన్ని ఆవిష్కరించారు.

మళ్ళీ 'మంత్రిగారికి జై, సర్దార్ పుల్లయ్యగారికి జై' అన్న జేజే ధ్వనులు మిన్నుముట్టాయి. కలకల ధ్వనులమధ్య అందుకొని, '' ఇంకా ఈ సందర్భంలో మాట్లాడదలచుకొన్నవారు మాట్లాడ వచ్చును.'' అని మంత్రి అధ్యక్షుని హోదాలో హెచ్చరించాడు. సందడి తగ్గింది. మీరు మాట్లాడాలంటే మీరు మాట్లాడాలన్న గుసగుసలు బయలుదేరాయి. ఆ సమయంలో కుంటుకొంటూ డాక్టరు వేదిక వద్దకు వచ్చాడు. గ్రామస్థులు మరొకసారి, '' డాక్టరుగారికి జై? డాక్టరుగారికి జై,'' అని కేకలు పెట్టారు

''ఏమయ్యా. ఊళ్ళోలేవటగా. ఎక్కడనుంచి ఊడిపడ్డా?'' అని మెల్లగా మంత్రి ప్రశ్నించాడు. ''ఇంతకుముందే వచ్చా''నని చెబుతూ అతడు వేదిక ఎక్కి ప్రారంభించాడు. 

''మహాశయులారా, ఇంతకు పూర్వం మాట్లాడిన పెద్దల కంటె నేను చెప్పగలిగిన విశేషం ఏమీలేదు అయినా మందులిచ్చి పొట్టబోసుకొనే నాబోటివాడికి రోగలక్షణాలు, చికిత్సా విధానం తెలియటానికి వీలున్నదే గాని ధర్మాధర్మాలు, మంచిచెడ్డలు, ఉదాత్తతామదాత్తతలు వాకేమి తెలుసు? అయితే పుల్లయ్య గారిని చాల సంవత్సరాలనుంచి ఎరుగుదును. ఆయన సంగతి ఈ గ్రామస్థులందరికీ తెలిసిందే అయితే నేను చెప్పదలచింది ఒకటే ముక్క. ఈనాడు ఆయనకు సన్మానం చేస్తున్నారంటే సంతోషిస్తున్న వాళ్ళలో నేను ఒకణ్ణి ఎందుకంటే ప్రజలు మంచి చెడ్డలేవో పరిశీలిస్తున్నారు. ఇది ముదావహమే అది అలా ఉంచి మరొక చిన్న విషయం పేర్కొనవలసి ఉన్నది. మానవుడు అన్న తరువాత మానవుడే కాని దివ్యపురుషుడు కాడు. పొరపడటం, తప్పుచేయటం ఎలాంటి వాడికైనా తప్పదు. ఇది అనుభవం మీదచెబుతున్న మాట ఎందుకంటేవెనుక బ్రిటీషు ప్రభుత్వం ఎడమకాలు విరుగగొట్టింది ఇటీవల కుడికాలును మంత్రిగారు విరగగొట్టారు. క్షమించాలి. కాదు, ప్రభుత్వం విరగగొట్టింది ఏదో నేను తప్పుచేసి ఉంటాను. అందుకోసమే ఈ పని జరిగింది. ఇలాంటి పొరపాటులు తప్పవు. ఇటీవల జరిగిన ఊరి కేసులో చంద్రశేఖరానిది తప్పని కోర్టు నిర్ణయించింది. అంతేకాని అతని భార్య పిల్లలు దోషులని నిర్ణయించలేదు. నేడు ఆ కుటుంబం దిక్కులేనిదై పోయింది లలిత ఇల్లు వెడలని ఇల్లాలు ముగ్గురు పిల్లలు కసుగందులు. పొట్ట పోసుకోగలిగిన శక్తి వారిలో ఎవరికీ లేదు. కాబట్టి ఈ కుటుంబానికి తోడ్పడటం మానవధర్మం. సర్దార్ పుల్లయ్య గారు తదితరులు విశాలహృదయులనే నా నమ్మకం.

---

జి.వి. కృష్ణరావు

సామాజిక సంబంధం ఉన్నదేమోనన్న అనుమానంతో ఇందరి మధ్య చెప్పవలసి వస్తున్నది నేడు ఈ ఊళ్ళో నుంచి ప్రాక్టీసు మానుకొని పోతున్నాను ఇక్కడ పిత్రార్జితమైన ఇల్లు ఒకటి ఉంది నా అనేవాళ్లు మరెవరూ నాకు లేరన్న సంగతి ఊరి పెద్దలకు లందరికీ తెలుసు అది అలా ఉంచి కీర్తిశేషుడైన పోలయ్య ఇటీవల తన ప్రాణాలొడ్డి నన్ను కాపాడాడు అతడా పని చేయకుంటే నేను ఇప్పుడు ఎక్కడ ఉండేవాణ్ణి? ఆస్తిపాస్తులు, గౌరవ మర్యాదలు బలివ్వ వచ్చును కాని మరొక వ్యక్తి రక్షణకు ప్రాణాలు అర్పించటం సామాన్యం కాదు. అతడు అలాంటి మహాత్యాగం చేశాడు అతని ఋణాన్ని ఎలా తీర్చుకొంటాను? అసంభవం ఈనాడు అతని కుటుంబం ఆశ్రయం లేక అల్లాడుతున్నది అందువల్ల నా యిల్లు అతని పుత్రపౌత్రానికి చెందాలని కోరుతున్నాను. ఇదిగో రిజిస్టర్డు దస్తావేజు హరిజనోద్యమంలో కృషిచేస్తున్న అమ్మాయమ్మగారు, గ్రామ జనోద్ధరణానికి కంకణం కట్టుకొన్న చిరంజీవి రామారావు ఈ దస్తావేజుతో సంక్రమిస్తున్న హక్కులను పోలయ్య కుటుంబం అనుభవించటానికి తోడ్పడాలని అర్థిస్తున్నాను ఈ గ్రామస్థులందరికీ ఇదే నమస్కారం.''

కేకలు వేస్తున్నా డాక్టరు వేదిక దిగి చేతిలో ఉన్న దస్తావేజును ముందు వరుసలో కూర్చున్న అమ్మాయమ్మగారి చేతికిచ్చి కుంటుకొంటూ వెళ్ళుతున్నాడు కుశాలయ్య ఎక్కడ నుంచో గబగబా వచ్చి డాక్టరు చేయి పుచ్చుకొన్నాడు సభలో కొలది అలజడి బయలుదేరింది అధ్యక్షుడు లేచి 'ఆ మాట్లాడే దేమిటో ఒకరి తరువాత ఒకరు వేదిక నుంచి మాట్లాడితే బాగుంటుం' దని హెచ్చరించాడు. కుశాలయ్య జంకుతూ జంకుతూ వేదిక ఎక్కి, ''డాక్టరుగారు తమయిల్లు ఎవరికిచ్చుకొన్నా ఇబ్బందిలేదు కాని వారు మాత్రం వెళ్ళటానికి వీలులేదు వారు ఈ ఊళ్ళోనే ఉండాలని గ్రామస్థులు కోరుతున్నారు. డాక్టరుగారు మా కోరిక మన్నించాలి '' అని దిగాడు డాక్టరు మళ్ళీ వేదిక ఎక్కి తనపట్ల గ్రామస్థులకున్న ఆదరాభిమానాలకు కృతజ్ఞత వెల్లడించి తాను కారణాంతరాల వల్ల ఊళ్ళో ఉండటానికి వీల్లేదని కచ్చితంగా చెప్పి వెళ్ళాడు.

మళ్ళా సభలో గుసగుసలు బయలుదేరాయి. అధ్యక్షుని హెచ్చరిక మీద అవన్నీ త్వరలో సమసిపోయాయి. పుల్లయ్య లేచి సన్మానానికి కృతజ్ఞత వెల్లడించి ఇలా అన్నాడు: ''డాక్టరు గారి సేవ అనన్యం. ఆయన అహోరాత్రాల కృషికి గ్రామం ఎంతో ఋణపడ్డది. వారు ఊళ్ళో ఉండాలని గ్రామస్థులంతా ఏకగ్రీవంగా కోరుతున్నారు వారు తమ ఇప్పటి ఇంటిలోనే ఉంటూ గ్రామానికి తోడ్పడటం అందరికీ అభీష్టం అంచేత పోలయ్య కుటుంబానికి వేరే యిల్లూ స్థలం గ్రామస్థులంతా ఇవ్వటానికి సిద్ధంగా ఉన్నారు. ఇప్పుడైనా వచ్చి వారు తమ సమ్మతి సూచించాలని కోరుతున్నాను ''

అనగానే డాక్టరు వెనుకనుంచి తాను వెళ్ళిపోక తప్పదని తేల్చివేసి చెప్పాడు. మళ్ళీ పుల్లయ్య ప్రారంభించాడు.–

''డాక్టరుగారు అలా సంకల్పించుకొన్నప్పుడు చేయగలిగినది ఏమున్నది? అదంతా మనదురదృష్టం. పోతే వారు మరొక మంచి విషయం పేర్కొన్నారు. తప్పు చేసింది చంద్రశేఖరం

కాని లతని కుటుంబంకాదు. పాపం ఆ ఇల్లాలు దిక్కులేక అల్లాడుతున్నది ఆ నాలుగు జీవితాలు ఎలా తెల్లవారాలి? కాబట్టి మనమంతా చందావేసుకొని ఆ కుటుంబానికి తోడ్పడటం అవసరం. నా మట్టుకు నేను అయిదువందల రూపాయలు ఇస్తున్నాను.''

సభ అంతా హర్షధ్వనులతో నిండిపోయింది కొంతమంది పుల్లయ్య దాతృత్వాన్ని మెచ్చుకొన్నారు మరికొందరు, ''మనిషి అంటే అలా ఉండాలి. ఎన్ని పగలున్నా అంతలో మరచిపోయి తోడ్పడగలిగే వాళ్ళు ఎంతమంది ఉన్నారు?'' అని ప్రశంసించారు. దానికి అమ్మాయమ్మగారు కూడా సంతోషించి చందాలకు విజ్ఞప్తిచేసింది. మొత్తంమీద వెయ్యి రూపాయలదాకా చందాలు పడ్డాయి.

తరువాత ఫలహార కార్యక్రమం ముగిసింది ఆ పిమ్మట కార్యక్రమం ప్రకారం ఆశ్రమ విద్యార్థుల నృత్యనాటిక ప్రారంభమైనది. అందులో నిద్రాణుడైన కర్షకుడు నాయిక ప్రబోధంతో మేల్కొని అజ్ఞానబంధాలు త్రెంచుకొని భీష్మించుకొన్న ప్రకృతిని ప్రసన్నం చేసుకొని ప్రతిఘటిస్తున్న మరుభూమిని సాధించి పైరులు పెంచి పంటలు పండించి ధాన్యం ప్రజలకు పంచిపెట్టటం అభినీతమైంది సభ్యుల హర్షధ్వానాలతో సభ సమాప్తమైనది విజయ సంతోషాన్ని పట్టలేక అమ్మాయమ్మగారు ఆనందాశ్రువులు రాల్చింది

డాక్టరు ఇంటితలుపు తెరచి లాంతరు వెలిగించి ఒక్కటొక్కటే సర్దసాగాడు దేవతార్చన పేటిక, సగం పగిలి మాసిపోయిన చెక్కద్దం చూడగానే తల్లి దండ్రులు జ్ఞప్తికి వచ్చారు ''ఎంత గారాబంగా పెంచితే ఏమిలాభం? ఎలా జరగాలో అలాగే జరుగుతుంది'' అని అంటున్నట్లు కనిపించారు ''నాకేమి, హాయిగా బ్రతుకుతున్నాను'' అని లోలోన సమాధానం చెప్పుకొన్నాడు. పెట్టె తెరవగానే పట్టుచీరలో ఎండి గలగల మంటున్న మొగలిరేకులు కనిపించాయి అతడు కళ్ళకు అద్దుకొన్నాడు ''వసూ, క్షమించు. నేనెన్నడూ నీకు ద్రోహం చేస్తాననుకోలేదు. చేయాలన్న దుర్బుద్ధి లేకుండానే అది జరిగిపోయింది ఆ సంగతి నీకూ తెలుసు నీవు నన్ను తప్పక క్షమిస్తావని నాకు తెలుసు. నీ హృదయమేకదా నాకీ వ్రతం ఉపదేశించింది?'' అనుకొన్నాడు అన్నీ పెట్టెలోకి సర్ది తాళంవేశాడు. తరువాత మందుసీసాలు జాజిపెట్టెలలోకి ఎక్కించి బిగించాడు. శస్త్రచికిత్సా పరికరాలు ఒకపెట్టెలోను, పుస్తకాలను మరి నాలుగు పెట్టెలలోను సర్దాడు వంటసామాగ్రి గోతానికి ఎత్తి కుట్టివేశాడు పరుపు చుట్ట చుట్టి త్రాటితో బిగించాడు ఇంతలో అలికిడి వినిపించింది. లేని ఉత్సాహం తెచ్చుకొని ప్రక్కకు తిరిగి చూశాడు 

''ఏమిరా ఏంపనిమీదవచ్చావు? మీనాన్నకు మందులో విషమేమైనా కలిపి ఇవ్వాలా ఏమిటి?'' డాక్టరు నవ్వాడు.

''మీరు ఊళ్ళోనుంచి వెళ్ళిపోతున్నారటగా!'' దగ్గుత్తికతో మల్లయ్య కొడుకు అడిగాడు.

''ఎవరు చెప్పారురా పచ్చిఅబద్ధాలు?''

''అదేం, అన్నీ సర్దుతూ ఉంటే!''

డాక్టరు మాట్లాడక తనపని సాగిస్తున్నాడు.

---

జి వి కృష్ణరావు

''డాక్టరుగారు వెళ్ళకండి, వేమేమి పాపంచేశాము? మీరుంటారనీ, ఊరెంతో బాగుపడుతుందనీ, ఏవేవో జరుగుతాయనీ అనుకొంటూ ఉంటే వెళ్ళిపోతారా? మాకలలన్నీ ధ్వంసంచేసి మమ్మల్ని చీకట్లో వదలిపోతారా? ఇలా చేసే వాళ్ళు అసలు ఇక్కడ ఎందుకుండాలి? ఆనాడే బస్తీకి వెళ్ళితే కాకపోయిందా!'' ముక్కు చీదుకొని అతడు గబగబా వెళ్ళి పోతున్న అలికిడి వినిపించింది అతడు ఒకగంతున పోయి మల్లయ్య కొడుకునుపట్టుకొని ఇంట్లోకి తీసుకు వచ్చాడు

''అరే ఇటు చూడు. నీకు గూడా నామీద కోపమైతే ఎలాగురా! నీవు చెప్పినట్టే ఉండటానికి నిశ్చయించుకొంటాననుకో, రేపు ప్రొద్దుటికి దైవవశాత్తు చచ్చిపోతాను అప్పుడు కూడా చావుర్దని గొంతుమీద కూర్చుంటావా ఏమిటి?''

''అంతేనా''

''ఇక్కడ ఉండటమంటే మానసికంగా చావటమే అవుతుంది. అప్పుడు ఉండీ ఒకటే, ఊడీ ఒకటే. నీవే చెప్పు. జీవచ్ఛవంలాగా ఇక్కడేపడి ఉండమంటావా లేక మరొక చోటికి వెళ్ళి బ్రతకమంటావా?''

''నాకు తెలుసుగా నీ హృదయం బంగారం. అయితే ఏళ్ళు వచ్చిన కొందికి మారిమారి యీ విషవాతావరణంలో మసిబొగ్గు కావచ్చు. ఆ ప్రమాదం తప్పించుకోవాలంటే నాకు తెలిసినంతలో రెండే విషయాలున్నాయి. సత్యాన్వేషణ, స్వాతంత్ర్య సముపార్జన ఈ రెండే ముఖ్యాలు ఏనాడు ఇవి అంతరిస్తాయో ఆనాడు మానవుడు మానవుడు కాడు, పశువు అవుతాడు నామీద గౌరవముంటే ఇదిజ్ఞాపకముంచుకో, నేనిక చెప్పగలిగింది ఏమీలేదు చేయగలిగింది అంతకన్నా లేదు.''

''వస్తాను డాక్టరుగారు,'' అంటూ అతడు నమస్కరించి వెళ్ళిపోయాడు డాక్టరుగారు కాసేపు ఆలోచిస్తూ కూర్చుని తిరిగి మిగిలిన వస్తువులు సర్దసాగాడు. గోడగడియారం టంగున తొమ్మిది కొట్టింది? ఎత్తుపీట వేసుకొని అతడు ఆ గడియారం తీసి పెట్టెలో సర్దుకొన్నాడు ఇంతలో తల వాకిలి తలుపు కిర్రుమన్నది. అతడు తిరిగి చూడకుండానే ''ఎవరది?'' అన్నాడు

''నేను.''

''నేనంటే?''

''చచ్చి పడి ఉన్నవాళ్ళను తన్నటం మీవంటి పెద్దలకు యోగ్యం కాదేమో!''

''గర్భస్రావానికి ఒడిగట్టినప్పుడే మా పెద్దరికం పోయింది. ఇప్పుడెలా వస్తుంది!''

''అయితే యమధర్మరాజు పతితుల కెన్నటికీ నివృత్తి కల్పించదన్నమాట!''

''ఏమో ఆ సంగతి సత్యనారాయణగారిని అడిగి తెలుసుకోవాలి.''

''అడిగి చెబితే మీ మేలు జన్మజన్మాల మరచిపోలేను ''

''ఇంట్లో ఉన్నవారిని అడిగి తెలుసుకోవటం కష్టమా?''

''ఆ భాగ్యానికి నోచుకొంటే మీచేత ఇన్ని అనిపించుకోవటం దేనికి?''

''అతడు యింటికి రావటం లేదా?''

''అప్పుడప్పుడు వస్తున్నారు.''

''అయితే మాట్లాడటంలేదా?''

. . . . . .

''ఇప్పుడెక్కడున్నాడు?''

''బహుశా లైబ్రరీ అరుగుమీద పాడుతూ ఉండాలి.''

డాక్టరు చప్పున అభిముఖంగా తిరిగి, ''అయితే పద్మా, అతనికి మనస్సు సరిలేదా?'' అని అడిగాడు లేదని ఆమె శిరఃకంపంతో సూచించింది

''ఎన్నాళ్ళనుంచి?''

''మీరు వెళ్లినప్పటినుంచి.''

అతడు మాట్లాడలేదు.

''మీరు ఈ ఊరినుంచి వెళ్లి పోతున్నారటగా?''

''ఆఁ''

''నా మీది కోపమేకదా కారణం?''

''నీమీదనా? కోపమా!''

''మరి దేనికి వెళ్ళిపోతున్నారు?''

''నీమీద కోపంవల్లనే వెళ్ళిపోతున్నాను. పోవద్దని చెప్పటానికేనా వచ్చింది?''

''లేదు మీతో లేచి వస్తానని చెప్పటానికి నన్ను తీసుకువెళ్ళరూ?''

''పద్మా, నా తత్త్వమేమిటో నీకు తెలుసు. నీతత్త్వమేమిటో నాకూ తెలుసు. బెబ్బులుల స్వభావం మారుతుందేమో కాని మన యిద్దరి స్వభావం మారదు. అది తెలిసి ఉండికూడా ఒకరిమనస్సు నొకరు నొప్పించుకోవటం వల్ల ప్రయోజన మేమిటో బోధపడటం లేదు. నీకేమి కావాలో తేల్చి చెప్పరాదా? చేతనైతే చేస్తాను, లేకపోతే నా వల్లగాదని చెబుతాను. పైన ఇంకా ఎన్నో సర్దుకోవలసి ఉన్నాయి.''

''మీకంత కష్టం కలిగించటం దేనికి? వస్తాను. సెలవు ఎప్పుడైనా మనస్సు ప్రశాంతంగా ఉన్నప్పుడు పద్మలాంటి ఒక వ్యక్తి సాంఘికాచారాగ్నులలో శిక్ష అనుభవిస్తున్నదని మాత్రం జ్ఞాపక ముంచుకోండి ఇక నేనంటారా? పతితురాలను. మీలాంటి ఉత్తమ చరిత్రులను స్మరించటానికి గూడా యోగ్యతలేదు.'' ఆమె బయలుదేరింది.

''పద్మా! కాస్త ఆగు అసలు రాకుండా ఉంటేనే సంతోషించేవాణ్ణి కాని వచ్చావు. వచ్చినదానివి వచ్చినపని చెప్పకుండా పోవటం కేవలం మనస్సును క్షోభపెట్టటమే అదే నీ ఇష్టమైతే వెళ్లు లేదా ఉద్దేశమేమిటో చెప్పు.''

''చెప్పమంటారా?''

''చెప్పమనే కదా కోరుతున్నది!''

''వారి మనస్థిమితత్వానికి ఏదైనా మార్గం చెప్పండి లేకపోతే ఎవరిదగ్గర చికిత్స పొందమంటారో చెబితే చాలు ఇంతకంటే మరేమీ నా కవసరం లేదు ''

డాక్టరు కాసేపు ఆలోచించాడు చెవి నలుపుకొన్నాడు.

''రెండు మూడు నెలలు చూడు ఏ మందూ ఇవ్వవద్దు నయమైతే దానంతట అదే నయమౌతుంది ముస్లాతిక మూడుపాళ్ళు నయమౌతుందనే నా నమ్మిక. నీవు మాత్రం చాల శాంతంగా ఎలాంటి కష్టం కలిగించకుండా ఎన్ని ఇబ్బందులకైనా ఓర్చుకోవాలి. ఆ తరువాతకూడా నయం కాకపోతే ఏ చికిత్సవల్ల ప్రయోజనం లేదు.''

తలుపువద్దనే అతనికి ఎదురుగా సాష్టాంగపడి నమస్కరించి చటుక్కున లేచి వెళ్ళింది డాక్టరు కాసేపు నిర్విణ్ణుడై చూచాడు. అతడు లేచి తలుపు తాళం వేసి తిన్నగా కుశాలయ్య ఇంటికి వెళ్ళాడు. ఆ రాత్రివేళనే అతన్ని లేపి సామాను బస్తీకి తోలటానికి రెండు బాడుగబండ్లు మాట్లాడి అప్పుడే తోలించుకొని రమ్మన్నాడు అప్పలస్వామిని లేపి ''ఊరికి పోవాలి. బండి తోలుకుర'మ్మని తిరిగి ఇంటికి వచ్చాడు. వీధి అరుగుమీద ఎవరో కనిపించారు

''ఎవరది? రామారావ్!''



''అవును, నేనేనండి డాక్టర్గుగారూ!''

''ఇంటికి వెళ్ళావా లేదా?''

''ఇల్లా, ఎక్కడ?''

''ఏమిటి అలా మాటాడుతున్నావు? ఇంతలోనే ఏమి ముంచుకు రాలేదు గదా?''

''డాక్టరుగారు, ఇందాక బండిలో ఏమో అన్నాను. క్షమించండి. మీరు చెప్పింది అక్షరాల నిజం ఈ పాప కూపంలో క్షణంకూడా బ్రతకటం కష్టం.''

''ఏమి జరిగిందేమిటి?'' డాక్టరుకుతూహలంతో అడిగాడు.

''మీరు పోలయ్య కుటుంబానికి వ్రాసియిచ్చిన యిల్లు తిరిగి అయిదు వేలిచ్చి వ్రాయించుకొన్నారు. ఇంకా ఈ ఊళ్ళో ఎవడేమి చేస్తాడు? ఎక్కడో అమెరికాలో నీగ్రోలను ఏదో చేస్తున్నారని, దక్షిణాఫ్రికాలో భారతీయులమీదవెలివాడ చట్టం రుద్దుతున్నారని ఏడుస్తారు దేనికో? ఇవ్వాళ ఇక్కడ జరిగిందేమిటి? భారత పవిత్ర ధర్మం నెలకొల్పారు!''

''అమ్మయ్య అంతేగదా, బ్రతికాను ఇంకా ఎవరి ప్రాణాలమీదికి వచ్చిందోనని భయపడ్డాను.''

''ఇంత జరిగిం తరువాత ప్రాణాలు మాత్రం దేనికి డాక్టరు గారు? ఇలా చేయటానికేనా మీరు ఇల్లు వ్రాసి ఇచ్చింది?''

''దానికేమి గాని, వ్రాయించుకొన్న దెవరు?''

సర్దార్ పుల్లయ్య ''

''ఇంకా నయం పోలయ్య గుడిసెమీద పడి ఆ నిర్భాగ్యులను చావమోదలేదు అందుకు సంతోషించు అయితే ఇంత వరకూ ఆచూకీలోనే ఉన్నావన్నమాట! ఇక ఇంటికి వెళ్ళు పడిలేచిన మీ అమ్మ కలవరిస్తుంటుంది నా మాట విను ''

ఆ బాంధవ్యమంతా యీ వ్రాతకోతలతోనే అంతరించింది ఒకసారి మీకు కనిపించి పోదామని వచ్చాను మరి సెలవు ''

రామారావు రణపెంకె అని తెలుసు చేసేదిలేక, '' ఇదిగో రామారావు! నేనూ వస్తున్నా,'' అని ఆపాడు ఇంతలో అప్పలస్వామి, కుశాలయ్య బళ్ళుతోలుకు వచ్చారు పక్క-చుట్ట మాత్రం జట్కా-బండిలో డాక్టరు పెట్టించాడు ఇంట్లో ఉన్న సామాను రెండెడ్లబండి కెత్తుకొని తాళం వేసి చెవులు అమ్మాయమ్మగారికి అప్పగించి బస్తీకి రావలసినదని కుశాలయ్యకు చెప్పాడు రామారావు, డాక్టరు గుర్రపుబండిలో ఎక్కి ఆ రాత్రే బయలుదేరారు.

సర్దార్ పుల్లయ్య సన్మానం స్వీకరించి పనులు తెమల్చుకొని ఇంటికి చేరుకోనేటప్పటికి పదిగంటలైంది రంగమ్మ, జగ్గారావు నిద్రపోతున్నారు. లక్ష్మమ్మ మాత్రం మేలుకొని ఉంది అతడు కాళ్ళు కడుక్కొని పండుకొన్నాడు రామారావు ఊళ్ళోకి వచ్చిన సంగతి ఆవిడకు తెలియదు అతడూ చెప్పలేదు మగని సన్మానానికి సంతోషిస్తూ, ''ధర్మమే జయిస్తుంది ఇది లోకానికి ఆదర్శప్రాయం '' అన్నది ''నిజమే, సత్యం, ధర్మం కాకపోతే మరేమి జయిస్తుంది?'' అన్నాడు



ఆ రాత్రి లైబ్రరీ అరుగుమీద పండుకొని ఉన్న సత్యనారాయణ మధుర కంఠం విప్పి పాడాడు :-

*యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత!*
*అభ్యుత్థాన మధర్మస్య తదా త్మానం సృజామ్యహమ్*
*పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్*
*ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే.*

---

జి వి కృష్ణరావు

# అ వ తా రి క

బీజం · బృహత్కథనుంచి
దోహదం   థామస్‌మాన్‌వల్ల
చిత్రణ, దృక్పథం రచయితవి

# జఘన సుందరి

''ఎంతసేపు?''

''ఇంకా ఎంతసేపు?'' నిట్టూర్పు గాజుల గలగలలు

''ఏమి చేస్తున్నాడో ?''

''నా కెలా తెలుస్తుంది నందా?'' అన్నది సుందరి పులకలు మొలకలెత్తించే కలకంఠంతో.

నందుడు బండితొట్లో కూర్చుని ఎడ్ల కొమ్ముల సందుగుండా చూస్తున్నాడు అప్పుడప్పుడూ చూడనట్టుగా చూస్తువున్న సుందరి చూపులు నందుని వీపుమీద, కండలు తీరి ఉన్న బుజాలమీద గిలిగింతలు పెడుతున్నాయి, అతడు భయపడుతున్నది కాస్తా జరిగింది ఆవిడ పేరున పిలిచి ''నా కెలా తెలుస్తుంది '' అన్నది. ''అతడేం చేస్తూన్నాడు'' అంటే సరిపోయేది. అలా అనలేదు. ''కృష్ణశర్మ ఏంచేస్తున్నాడు?'' అని అడిగింది. ''నాకూ విడ్డూరంగానే ఉంది. నావైపు తిరిగి నువ్వు అడగకపోతే నేను నిన్ను అడిగేదాన్ని.'' 187

నందుడికి ఆశ్చర్యం కలిగింది. కృష్ణశర్మ ఆలస్యం చేయటమేకాదు అతని భార్య వ్యర్థపదాలు కూడ వాడుతూ ఉంది ''అనవసర ప్రసంగంలోకి దిగుతానేమో? నోరుజారి పేరున పిలుస్తానేమో. ఈ కంఠంలో ఏమి మ్రోగుతుందో?'' ఈ భావాలు అతనిని మాట్లాడనీ లేదు.

కొంతసేపటికి ఆవిడే ప్రారంభించింది.

''ఇదిగో నువ్వు పోయి ఆయనగారు ఎక్కడున్నారో చూచిరా. తపస్సమాధిలో ఉంటే ఆచేతులతో ఒక్కసారి కుదిలించి మత్తుమలిపి మరీ లాక్కొని రావాలి ఇక్కడెంతసేపు కూర్చునేటట్లు? ఆయనకు క్రిందు మీదలు తెలియటం లేదు. ఎంత పొద్దెక్కింది? ఎంత పొద్దెక్కింది? అసలు దారి తప్పటంతోనే బోలెడు ఆలస్యమైంది, పైగా ఇదొకటి. మా అమ్మా నాన్నావాళ్లు నాకోసం ఎంతగా కాళ్ళు తొక్కుకుంటున్నారో! ఆ దేవాలయంలో కూచొని యీ ప్రపంచాన్నే మరచి పోయినట్లుంది. కాస్త మందలించి తీసుకురా, అతనికన్నా నీవు బలవంతుడివి కదా!''

''ఓ, ఇప్పుడే తీసుకొస్తాను. కానీ, బలంతో అవసరమేముంటుందిలే. ప్రొద్దెక్కుతున్న సంగతిని ఒకసారి జ్ఞాపకం చేస్తే చాలు. అతడే త్వరపడి వస్తాడు. అసలు దారితప్పడానికి నేనే కారణమనుకో. నేనేవెళ్ళి తీసికొద్దామనుకొంటున్నా. కాని, ఒకతెవే యీ బండిలో కూచోటం కష్టమేమోనని సందేహించా అయినా ఎంతసేపు పడు తుందిలే.'' అని నందుడు పగ్గాలు తొట్లో పడేసి కిందికి దిగి దేవాలయంవైపు బయలు దేరాడు.

దారిపక్కనే చిన్న కొండ ఉంది. పైకివెళ్లిపోవటానికి మెట్లున్నాయి, అతడు చరచరా ఒక అయిదు నిమిషాలు మెట్లెక్కేటప్పటికి చదునైన ప్రదేశం కనిపించింది ముందు కొయ్యధ్వజస్తంభం. దానికెదురుగా ఆ కొండలో మలిచిన దేవాలయం. ద్వారానికి ఇరుప్రక్కలా రాతిలో చెక్కిన సింహాలు కరవవస్తూ ఉన్నాయి. అతడు లోపలికి వెళ్లాడు.

ఆ ప్రదేశ వైశాల్యం ప్రశాంతత అతనిని ఒకసారి చుట్టూ కలామెలా చూచేటట్టు చేశాయి ఏ శిల్పుల ఉలులు ఎన్నేళ్లు తపస్సు చేశాయో! గోడలమీద ప్రతిమలు ఒకటా రెండా! మానవుల శల్యాలు, కంకాళాలు, స్వేదబిందువులు, అశ్రుకణాలు, రక్తస్రవంతులు, కామ క్రోధ మద మాత్సర్యాలు, నైరాశ్యం, కామినీ కాముకుల వియోగం, రసాభాస, దారిద్ర్యం, జఠరాగ్ని, వార్థక్యం, రోగం, మృత్యువు ఒకటేమిటి జీవితమంతా అక్కడ ఒక్కసారి ప్రత్యక్షమౌతూవుంది. నందునిగుండె ఒక్కసారి జల్లుమంది ఎన్నడూ అతడు జీవితాన్ని గూర్చి సమగ్రంగా ఆలోచించలేదు. కలలో కూడ అతనికి కనిపించలేదు

అతడు గర్భగుడివైపు సాగాడు. అతనికి పాతాళలోకానికి వెళ్లుతున్నట్లయింది మళ్ళీ అతడు మెట్లు దిగుతున్నాడు. కాలు జారింది అతని చేతులు అతనికి తెలియకుండానే ముందున్న విగ్రహాన్ని ఆదుకొన్నాయి నెత్తురు వాసనలతో అతని తల దిమ్ముమంది దిగాలుపడి ముందుకు చూచాడు



రెండు నిలువుల భీకర విగ్రహం ధేవాలయంలోకి వచ్చే వెలుగునంతా లాగుకొని ప్రకాశిస్తూ ఉంది కాళి! ఆ నాలుక – వేలాడుతున్న ఆ నాలుక – ఎంత భయంకరంగా ఉంది? పీల్చిన పచ్చినెత్తురు బొట్లు ఆ నాలుక నుంచి జారుతున్నాయా? వక్షస్సు అంతా రక్తమే తొడలంతా రక్తమే ఆ పాదాలు – ఆ అరుణారుణ పాదాలు – అదంతా పారాణా? ఆ రక్తంపారాణి ఆ మృదుపాదాలకు? ఎంత క్రౌర్యం! ఎంత కాఠిన్యం ! ఎన్నిశిరస్సులు నుజ్జునుజ్జైమేదో మాంసాలను వెళ్లగ్రక్కాయో! ఆ శిరస్సులలోని కనులు దేవీ పాదస్పర్శకు పారవశ్యంపొంది ముకుళించాయా?

అదేమిటి? ఎముకలు – పుర్రెలు – తెగిన కాళ్లు చేతులు అలంకారాలా? ఢమరుకం, శంఖం, చక్రం, ఖడ్గం, కుంతం, ధనస్సు, ఒకటి, రెండు, నాలుగు, ఎనిమిది. పది, ఇరవై, ముప్పై, వేయికి పైగా ఉన్నాయి. ఆ చేతిలోనిది కపాలపాత్రేనా; ఘోరం!

అతనికళ్ళు గిర్రున తిరిగాయి. ప్రక్కకు తిరిగాడు. తెగి ఉన్న మేకల తలలు రక్తాన్ని ఇంకా ఓడుస్తూనే వున్నాయా. అతని హృదయం దడ దడా కొట్టుకోసాగింది. కళ్ళు భయంతో వెదికాయి ఎవరికోసం?

ఒక్కసారిగా వెర్రికేక పెట్టాడు. రెండుచేతులతో విగ్రహాన్ని గట్టిగా కావులించుకొన్నాడు అతని స్నేహితుని మొండె మొకచోట, తల మరొకచోట పడివున్నాయి. అతని కన్నులు గట్టిగా మూసుకుపోయాయి అతిప్రయత్నం మీద మళ్ళీ కన్నులు తెరుచుకొన్నాయి. శరీరం ఒక్కసారి కంపించిపోయింది పెదవులు మాత్రం మిత్రుని కోసం అస్పష్టంగా పలవరించాయి మిత్రుని కళేబరం దగ్గరకు వెళ్ళటానికి ప్రయత్నించాడు. కాని, కాళ్లు సాగితేనా? మిత్రుని తలదగ్గరకు పోవాలో

మొండెందగ్గరకు పోవాలో అతనికి తోచలేదు దేన్ని కౌగిలించుకొని ఏడవాలో తెలియని అయోమయ స్థితిలో పడ్డాడు. చిట్ట చివరకు తలదగ్గర చతికిలపడ్డాడు అతని కన్నీళ్ళు మిత్రుని శిరస్సును తడుపుతూ ఉన్నాయి అతని చేతులు మొండాన్ని స్పృశించాయి కాసేపు తలవైపు కాసేపు మొండెంవైపు చూచాడు.

''ఎంతపని కొడిగట్టావు! చేతులార నిండు ప్రాణాలను తీసుకోటానికి ఎలా సాహసించావు? ఎంతపని చేశావు? ఈ కర్మ నీ కెందుకువచ్చింది? నిన్నెవరూ ప్రోత్సహించలేదే? ఎంత చులకనగా ఎంత తేలిగ్గా ప్రాణాలు తీసుకొన్నావు? ఇంతవరకు నీ ప్రతిభను మెచ్చుకుంటూ వచ్చాను. ఇప్పుడు నీ శరీరాన్ని కూడా మెచ్చు కోవాలి. ఇలాంటి కార్యాన్ని ఎవరు చేయగలరు?

''ఇంతపనికి తలపడ్డావంటే నీ హృదయంలో ఎంతటి దారుణ సంగ్రామం జరిగిందో! ఔదార్య నైరాశ్యాలు హృదయంలో ఎంతటి ప్రళయ తాండవం చెయ్యకపోతే యీ పనికి పూనుకుంటావు? ఘోరం ఘోరం!

''నిజం చెప్పు : నా వల్ల దోషమేమన్నా ఉందా? నా చేతలేకాక, నా బ్రతుకే నీ మృతికి కారణమైందా? నీవు ఆలోచించినట్లే ఆలోచిస్తే ముఖ్యంగా నేను సజీవంగా ఉండటమే దోషమేమో ననిపిస్తూ ఉంది. మానవుడు తనచర్యలను మానుకోవచ్చు. అంతకన్న అతడు ఏమిచేయగలడు?

''సాధ్యమైనంతవరకు మాట్లాడకుండానే ఊరుకొన్నాను. అనవసరంగా ఒక్క మాటకూడా మాట్లాడ లేదు. ఆమెతో మాట్లాడినప్పుడుకూడ పేరెత్తిమాట్లాడ లేదే! నాకు నా అంతరాత్మే సాక్షి.

మరెవ్వరూ లేరు. నీయందు ఆమెకు అసంతృప్తి, కోపం కలిగి నప్పుడుకూడా అవహాశాన్ని వినియోగించుకొని ఆమె మనస్సు విరచటానికి ప్రయత్నించలేదు అసలు నేను జీవించడమే దోషమైనప్పుడు నేనెన్నిచెప్తే మాత్రం ప్రయోజన మేముంది ఆనాడే అరణ్యానికివెళ్లి తపస్సు చేసుకోవలసింది. నీతో చెప్పకుండానే వెళ్ళిపోవలసింది. ఇలా తపస్సుకు వెళ్ళి పోకుండా ఉండటం తప్పే నేను ఒప్పుకుంటాను, కాని నీవు మాట మాత్రం అని ఉండగూడదా? నేను తప్పకుండా అరణ్యానికి వెళ్ళిపోయేవాణ్ణి కదా! ఇలా చేతులార తలను ఖండించుకోకముందు నాతో చూచాయిగా న్నా ఎందుకనలేదు? మనం పరస్పరం ఎన్నిసార్లు హృదయాలను విప్పుకొని మాట్లాడలేదు? ఒకసారి కాకపోతే ఒకసారైనా హెచ్చరించి ఉండగూడదా? ఇప్పుడంతా మించిపోయింది చడిచప్పుడు లేకుండా ఘోరంగా చెయ్యవలసినంత పనీ చేశావు. నువ్వుచూపినదారి ఉండనేవుంది సత్తువలేని నీ చేతులు చేసిన పనిని బలిష్ఠమైన నా చేతులు చెయ్యలేవా. నా చేతులు చెయ్యలేవని నీవు అనుకొని ఉండవు. నిన్ను విడిచి బ్రతుకలేననికూడా నేను చాలాసార్లు నీకు చెప్పాను

''తెలిసి తెలిసి ఇంత దారుణకృత్యానికి తలపడ్డావు. నేనేమి తప్పుచేశాను? ఆనాడు వివిక్త ప్రదేశంలో ఆ నది ఒడ్డున ఉన్న దేవాలయం దగ్గర ఆమె నగ్న శరీరాన్ని చూచాను. అది తప్పా? ఆ పని నువ్వూ చేశావు నాకు వికారం కలిగినమాట నిజమే. నీవు మందలించావు కూడ. అయితే నువ్వు మాత్రం – నీ మందలింపులోనే నీ హృదయం ఖంగున మోగింది.

మళ్ళీ ఆమెముఖాన్ని చూచాను. చప్పున జ్ఞప్తికి వచ్చింది నగ్నంగా ఉండటంవల్ల ఆమెను వెంటనే గుర్తించలేకపోయాను. ఆమె పేరు సుందరి. చంద్రవర్మ కూతురు పెళ్ళికాలేదు మా మేనమామల

ఊరే. అప్పుడే నీతో చెప్పాను. ఒక నోముకు ఆమె ఉయ్యాల ఊగవలసి వచ్చింది. అప్పుడు నేను ఆ ఊళ్ళోనేవున్నా, ఆమెకు వరసైన వాళ్ళంతా ఆమెను ఆకాశాన్ని తన్నేట్లు ఊపాలని నన్ను పట్టుపట్టారు. ఈ చేతులతోనే రెండు తాళ్ళకు వేసిన ఆమె ఉయ్యాలను గట్టిగా ఊపాను. ఎంత ఎత్తుపోయింది! కెవ్వుమని అరిచింది. నిజంగా భయపడిందేమో లేక నన్ను ఉలికించాలను కుందో! మరి నేను వినిపించుకోలేదు. ప్రక్కవాళ్ళు నన్ను ఊరుకోనిస్తేనా, నేను ఊపు ఎక్కువచేశాను నాలుగయిదు ఊపులయ్యాయి. ఐదో ఊపుకు ఉసి తెచ్చుకోటానికి కాలుముడిచి రయ్యని వెనక్కి వచ్చినప్పుడు ఆ అందెలకాలుతో ఝల్లున ఒక్క తన్ను తన్నింది ఆ తన్నుతో నేను చతికిలబడ్డాను. ఆ కథంతా నీతో చెప్పాను నీలో నా పట్ల ఈర్ష్య, అసూయ క్రమక్రమంగా అభివృద్ధి చెందాయి కామాలు. నాకెలా తెలుస్తుంది? ఈ సంగతంతా నాకు తోచనేలేదు. స్నేహితుడవని దాచకుండా చెప్పాను. అవును, ఆ అమ్మాయిని నీవు పెళ్లిచేసుకొంటావని నేను కలగన్నానా? ఆనాడు ఆ నగ్నశరీరాన్ని చూసి వికృతి పొందితే తప్పని నన్ను మందలించావు. సౌందర్యాన్ని నిర్లిప్తతతో ఆస్వాదించాలన్నావు. దానిని బట్టి నీవు ఈర్ష్యపడుతున్నావని ఎలా అనుకోను?

''తరువాత కొన్ని రోజులకు వచ్చి ఈ తపన భరించలేను నాకు చితిని పేర్చిపెట్టు. ఆ అగ్నిజ్వాలలో ప్రాణాలు విడుస్తాను ఈ తపనకంటే అగ్నిజ్వాలలే చల్లగా ఉంటాయి'' అన్నావు, నిన్ను అనేక విధాల బుజ్జగించాను, ప్రాధేయపడ్డాను, ఎన్నో చెప్పాను, అప్పుడు బయట పెట్టావు ఈ సుందరి నాకు కావాలన్నావు.

''నేను నిన్నేమీ అనలేదు. నా ఈర్ష్యను, నా ప్రేమను నా అహంతను – సర్వం నీకోసం త్యాగం చేసాను. నా ముక్కును పగలదన్నిన ఆ సుందరిని నీకు పెండ్లి చేశాను. ఇదంతా నీకు తెలిసిందే. నామీద నీకు ఈర్ష్యదేనికి? కోపందేనికి? నాతప్పు ఏముంది?

''ఆమెను ప్రేమించానంటావా? నీవు ఆమెను ఎరుగక ముందు. నీవు పెళ్లి చేసుకోకముందు నేను ఆమెను ప్రేమించి ఉండవచ్చును. కాని మీకు దాంపత్యమేర్పడింతరువాత నేనామెను కాంక్షింపలేదు. నాకోర్కెలన్నిటినీ ఒక్కసారి చంపుకున్నాను. నీ శిరస్సుతోడు, కలలోకూడ మీకు పెళ్లి అయిన తరువాత ఆమెను తలవ లేదు. ముమ్మాటికీ తలవలేదు. ఇక నాతప్పు ఏమిటి?

''ఈమెతో ఊళ్ళోకివెళ్ళితే లోకం ఏమంటుంది? సుందరి కోసం నేను నిన్ను చంపానంటుంది. ఇలాంటి లోకానికి నా మొగమెలా చూపించేది. అసలు హృదయంలో ఏమూలనైనా ఇలాంటి కోర్కె లవలేశమైనా ఉంటే యిలాంటి నిందను భరించవచ్చును. నాకే యిది దుర్భరమైనప్పుడు నేనెలా భరించేది? అసలు నీకోసం, నీ సాన్నిధ్యంకోసం కదా నేనింత చేసింది? నీవు లేక నేను బ్రతక లేను. బ్రతకలేనని నీతో చెప్పాను. సరే, నీవు చూపించిన దారి నాకు ఉండనే ఉంది, నేనూ నీతోనే వస్తాను.''

నందుడు అప్పుడే బిగుసుకుపోతున్న కృష్ణశర్మ చేతిలో నుంచి కత్తి తీసుకొని తల నరుకు కున్నాడు. మొండెం మిత్రుని మొండెం మీదపడింది. తల ఎగిరి దూరంగా పడి కొట్టుకుంటూవుంది. చిమ్మన గొట్టంతో చిమ్మినట్టుగా రక్తం ఎగజిమ్మి వడియలు కట్టసాగింది.

బండిలో కూర్చున్న సుందరికి నిమిష నిమిషమూ దుర్భరమౌతూ వచ్చింది. అంతకు ముందు

నందుని విషన్నా చూస్తూ ఉండేది ఇప్పుడు అదికూడలేదు అందువల్ల నిమిషాలు యుగాలుగా గడిచిపోసాగాయి మామూలు ప్రమాదాలలో ఏదైనా ఒకటి జరిగివుంటుందేమోనని ఆమె అనుకున్నది కాని, కంఠాలు తెగి ఉంటాయన్న ఊహే ఆమెకు తట్టలేదు. అసలు ఆభావమే ఆమె భావనకు అతీతం విసుగుదలతో సుందరి బండి ఒసికర్రను ఒక తన్ను తన్నింది. అవి ఎడ్లు కాబట్టినెమరు వేస్తూ చెట్టునీడన కాలు కదలించకుండా అలాగే నుంచున్నాయి.

''అబ్బబ్బ! యీ మగవాళ్ళంతా ఒకటే ఒకటేమచ్చు ఎవరినీ నమ్మటానికి వీలులేదు ఒకాయన దేనికి వెళ్ళాడో తెలీదు ఇంతవరకూ అంతులేదు. ఆయనకోసం మరొకరిని పంపితే, లతని అయిపే లేదు ఈ చెట్లమధ్య యిలా ఒంటరిగా తగలడాలి ఎండ చుర్రుమంటూ ఉంది ఇంత ఆలస్యం దేనికయినట్టు? నాకు ఒక కారణంకూడ కనిపించటం లేదు. ఇద్దరూ పోయినచోటే కట్టగట్టుకుని కూర్చున్నారు. వాళ్ళిద్దరూ కుర్లాడుకుంటున్నా రేమో? అతగాడు ప్రార్ధన చేసుకోవాలని ఉంటాడు. ''కాదు నువ్వు బయలుదేరితేనే కాని వీలులేదు.'' అని నందుడు పట్టుపట్టి ఉండాలి. ఆయన కూర్చున్న చోటనుంచి కదలి ఉండడు. గట్టిగా పట్టుకుంటే, ఎక్కడ ఎముకలు ఊడి వస్తాయో నన్న భయంతో నందుడు బుజ్జగిస్తూ ఉండి ఉండాలి లేకపోతే, ఆ యినుపదుక్కల అతడు ఆయన్ని ఒక్కసారిగా యీ బండిలో కుదేసి ఉండడూ? నిజంగా ఆలా చేసి ఉంటే ఎంత బాగుండేది?

''మీ యిద్దరిరోగం కుదర్చాలంటే, యీ బండిని నేను తోలుకెళ్ళొచ్చు, మొగుడుకాని, బంధువు కాని వెంటలేకుండా వెళ్లితే, అంతా ఏడుస్తారు ఊరంతా గొల్లుమంటుంది తనప్రష్టి ము ిగినట్టు, లేకపోతే ఆపనేచేసేదాన్ని, ఇక చేసేదేముంది. బిక్కు బిక్కు మంటూ ఇక్కడ కూర్చునే దానికంటే వాళ్లేమి చేస్తున్నారో చూచిరావటం మేలు. బహుశా ఇద్దరి మధ్య తగాదా ఏదో వచ్చి ఉంటుంది? అందువల్లనే అక్కడ పోట్లాడు కొంటూ ఉండాలి. నేను పోయి యిద్దరినీ సర్ది తీసురావటమే మెరుగుగా కనిపిస్తూ ఉంది '' 191

సుందరి బండిదిగి దేవాలయంవైపు సాగింది. సెలయేరు క్రిందికి ప్రవహించినట్లు ఆమె కొండపై కెక్కింది పదిహేను నిమషాలలో భయానక దృశ్యం ఆ విశాల నేత్రాలకు ఒక్కసారిగా పొడకట్టింది.

కన్నులు తిరిగిపోయాయి. దిక్కులు కనిపించలేదు. అసలు ఏమీ కనుపించకా లేదు. ఒక్కసారి కూలి పోయింది కూలపడినా ప్రయోజనం లేకపోయింది ఆ ఘోరదృశ్యం ఆమెకోసం అలాగే ఉంది ఆమెకు స్పృహ వచ్చింది మళ్లీ స్పృహతప్పి పడిపోవటానికి ప్రయత్నించింది కాని, ఆమె శరీరం ఎంత అందమైనదో అంత ఆరోగ్యవంతమైనది. అందువల్ల, స్పృహతప్పి పడిపోవటానికి వీలులేకపోయింది అలాగేపడి ముంగురులను రెండు చేతులతో లాగుకొంటూ ఆ రెండు కళేబరాలనీ, రక్తపు మడుగుల్నీ స్తంభించిపోయి చూస్తూ ఉంది.

''భగవాన్, ఇద్దరూ చనిపోయారు! ఇంకేముంది? సర్వనాశనం! నా భర్త – అగ్ని సాక్షిగా నన్ను స్వీకరించిన ఆ శిరస్సు, మొండెం – నా కృష్ణ శర్మ మరణించాడు అతని మొండెం ప్రధానం కాకపోవచ్చు. కాని నా హృదయంలో కామబీజాన్ని నాకుజ్ఞప్తి ఉన్నంత నాటింది ఆ శరీరమే, అతడు అంతరించాడు. నా భర్త అంతరించాడు. అడుగో నందుడు! ఆనడు నా ఉయ్యాలను ఎంత గట్టి ఊపాడు? నాటి

సంగతి తెలుసుకొంటేనే గుండె జల్లుమంటుంది ఎంత గట్టిచేతులు! చేతులు కావు, ఇనపదుక్కలు, ఆనాడు నిర్దాక్షిణ్యంగా ముక్కు బద్దలయ్యేటట్లు తన్నాను, మానవుడు, కిక్కురు మనలేదు అప్పుడు కాకపోతే తరువాతనైనా. . ఇప్పుడతని చేతుల బలాన్ని సౌందర్యాన్నీ తడవి చూడ గలను కాని అతడు బ్రతికి ఉండగా తాకటానికి వీలు లేక పోయింది ఇప్పుడు ఈ రక్తము, మృత్యువు స్పృశించనీకుండా చేస్తున్నాయి ఒక కారణంవల్ల వీరు ఒకరి నొకరు పొడుచుకొని చచ్చి ఉంటారు . అయితే, కత్తి ఒకటే కనిపిస్తూ ఉందే! ఒక కత్తితో ఇద్దరు ఎలా పోరాడి చస్తారు? క్రిష్ణశర్మ తన ఒళ్లు తానే మరచిన కోపంతో నందుడి తల నరికి ఉంటాడు. తరువాత నందుడు .. లేదు అలా జరగదు నందుడే ముందు మిత్రుని పొడిచిన తరువాత...కాదు, కాదు ఆలోచించి కూడ ప్రయోజనం లేదు ఇద్దరూ పశుప్రాయులుగా ప్రవర్తించారు ఒకరికీ నేనున్నానన్న సంగతికూడ తోచలేదు. కాక ..నా వల్లనే! నాకోసమే యిలాంటి ఘోరానికి తలపడ్డారేమో! ఈ మాట అనుకుంటేనే నా శరీరం కంపించి పోతూ ఉంది తమకోసమై నన్ను గూర్చి పొడుచుకు చచ్చారు కాని, నాకోసమై వీరు పొడుచుకు చావలేదు నే నేమైపోతానో, నాగతి యేమవుతుందో కాస్త కాక పోతే కాస్తయినా ఆలోచించారా? లేదు, ఒకరికి కాక పోతే ఒకరికైనా ఆలోచనపోలేదు ఇప్పుడు ఏమి చెయ్యను? విధవనై నా జీవితాన్నంతా ఎలా గడిపేది. ప్రతి అడ్డమైన ముండా సరిగా చూడకపోతే, అతడు చచ్చి పోయాడంటుంది కామాలే? ఈ సూటీపోటీలన్నీ నేనెలా భరాయించేది? ఒక వేళ వీటి నన్నిటినీ భరాయింతామన్నా, నేనొక్క తెనే ఆటు పుట్టింటికి గాని, ఇటు అత్తవారింటికిగాని పోతే ఏమంటారు? ఉన్నది ఒక కత్తి, చచ్చింది ఇద్దరు తప్పకుండా మూడో మనిషి ఉంటేగాని, ఇద్దరు ఒక కత్తితో చావటానికి వీలులేదు ఆ మూడోమనిషిని నేను అవుతాను. మొగుణ్ని, మిత్రుణ్నీ నేను చంపానంటారు. నిజంగా నేను చంపక పోయినా, అలాగే కనిపిస్తూ ఉంది. ఏపాపం ఎరగక పోయినా యీ నిందను మొయ్యాలి. కాని అబద్దాలాడితే . వీలుంది, అయితే మాత్రం.. ఉట్టికి నాలుగు సేర్లు తెగించిన తరువాత నేను జీవించి ఏమి చేసేటట్లు? అన్నీ అయినతరువాత యీ ప్రాణాలు దేనికి? లాభం లేదు. విళ్లు చూపిందే మార్గం లయితే, యీ కత్తిని యీ వణుకుతున్న చేతులతో ఎలా పట్టుకోనేది? ఈ అందమైన శరీరాన్ని చేతులారా ఎలా నాశనం చేసుకోనేది? లేదు, లేదు అభ్యంతరం లేదు మళ్లీ ఈ హృదయంలో బీజాలు మొలకెత్తి బాధపడకుండా తప్పుతుంది.''

సుందరి గుండెనిబ్బరంతో గబగబా మెట్లెక్కి గుడివెలుపలికి వచ్చింది దేవాలయం ముందర చెట్టు కనిపించింది. దాని కల్లుకొని ప్రాకుతున్న తీగలను ఒక్కటొక్కటిగా తెంపి వాటి నన్నిటినీ కలిపి ఉచ్చువేసి ఆ చెట్టు కొమ్మకు వేలాడదీసింది. ఆ ఉచ్చులో తల దూర్చి బిగించుకొని ఆ మీదట సుందరి వేలాడబడింది

ఇంతలో కఠోరంగా కాళీకంఠం సుందరి చెవుల్లో గింగురుమంది.

''ఓసి కోతీ! నా చేతులమీదుగా యిచ్చిన యీ మనోహర దేహాన్ని నాశనం చెయ్యటానికి నీ కేమీ అధికారముంది? వారిద్దరూ నాకోసం తమ దేహాలను బలియిచ్చారు నువ్వేమి చేస్తున్నావ్? వట్టి వుడియంగా నిందు ప్రాణాలను తీసుకోటానికి ప్రయత్నిస్తున్నావు, ఇలా మూడు శరీరాలు ఇక్కడ

జ్వరపీడితుల్లాగా చచ్చిపడి ఉంటే, ప్రాకృతలోకం ఏమను కొంటుంది? ఈ సృష్టి సాగటం ఇష్టంలేదని. అందరూ మరణించాలని నేను కోరుతున్నానని భావిస్తుంది. కొంతమంది మూఢులు బ్రతుకనేది తరతరాలనుంచి వస్తున్న అంటురోగమంటున్నారు చచ్చి విముక్తి పొందటం మంచిదని దుష్ప్రచారం సాగిస్తున్నారు దీనిని ఏమాత్రం సహించను ఉచ్చులోనుంచి తలను తీస్తావా లేక ఒళ్లు ఊనం చెయ్యమంటావా?''

సుందరి ఏడ్చింది.

''తల్లీ! నీ యాజ్ఞ శిరసావహిస్తాను నిన్ను కాదనటానికి ఎవరికి సాధ్యపడుతుంది? అయినా ఒకటి మనవి చేసుకొంటాను నా దుస్థితి సర్వజ్ఞురాలవైన నీకు తెలిసే ఉంటుంది మళ్లీ చెప్పాలా? ఈ యిద్దరు చనిపోయిన తరువాత నేనెలా బ్రతికేది? లోకాన్ని ఎలా చూసేది విధవనైబ్రతకలేను నిద్ర లేవగానే నా ముఖం చూచే ప్రతివాడు ప్రతి ఆడదీ (అదికూడ ఒక రోజుకి నాలాగే కావచ్చు అయినా పెళపెళా తిట్టిపోస్తుందే) అటు ఏడు తరాలు, ఇటు ఏడు తరాలు చెడతిడుతుంది. నిజంగా ఆ తిట్లే తగిలితే ఇక నీ సృష్టి ఏముంటుంది?

''వాళ్ళిద్దరూ ఎందుకు చచ్చారు? నిజం చెప్పు. నా కన్నీ తెలుసు ఈ సంగతి మాత్రం మరచిపోకు.''

''నాకోసం యిద్దరూ పోట్లాడుకొని ఒక కత్తితో పొడుచుకొని చచ్చారు చచ్చినవాళ్లు నాకన్నిలా చేసిపోయ్యారు '' 

''ఇలా ఒక్క అడది మాత్రమే మాట్లాడ గలుగుతుంది తమ పవిత్ర హృదయాలను వారు నాకు సమర్పించారు. ఇంతకూ వారు నాకు ఎందుకు బలి అయ్యారు?''

సుందరి ఏడుపు ఆపుకోలేక పోయింది వెక్కి వెక్కి ఏడుస్తూనే యిలా ప్రారంభించింది –

''తల్లీ నా తప్పును ఒప్పుకుంటాను. అయితే ఆ తప్పును నేను అనివార్యంగా చెయ్యవలసి వచ్చింది చెయ్యకుండా ఉండటానికి వీల్లేకుండా పోయింది. ప్రతి ఆడదీ అలా చెయ్యక తప్పదేమో? నా తప్పును సమర్థించుకోటానికి నా దోషాన్ని స్త్రీ జాతి కంతకూ అంటగట్టటానికి ప్రయత్నించటం లేదు అయినా నేను ప్రత్యేకంగా చెప్పటం దేనికి? సర్వజ్ఞురాలవు. నీకు తెలియని దేముంది?

''నా తండ్రియింట్లో నేను మల్లెమొగ్గలాగా ఏదిగాను. అప్పుడు నాకే పాపాలు తెలియవు పెండ్లి అయింది. నా హృదయంలో ఒక కొత్త ఉద్వేగం బయలుదేరింది. నా నాళనాళంలోను, నరనరంలోను అవ్యక్త అనిర్వచనీయ సుఖాకాంక్ష, ఆతురత కలిగింది అనిర్వచనీయమైన ఒక నూతన స్పర్శసుఖానికి నా త్వగింద్రియం అలవాటు పడింది. అప్పటి ఉద్వేగంతో ఎప్పుడూ తాను ఉక్కిరి బిక్కిరి అవుతూ ఉండాలని నా హృదయం కొట్టుకుంటూ ఉంటుంది. ఇప్పుడు మళ్ళీ పూర్వపు అమాయిక జీవనం గడపాలంటే, ఒకసారి రుచిమూచి మానుకోవటమంటే ఎవరికి సాధ్యమౌతుంది? తల్లీ! మానవ దౌర్బల్యం నీకు తెలియాదా?

''మొదట్లో నాకు స్త్రీ పురుష ప్రకృతిభేదం తెలీదు మగవాళ్ళంటే దోవతులు కట్టుకొంటారనీ,

ఆడవాళ్ళయితే లంగాలు తొడుక్కుంటారనీ మాత్రం తెలుసు. అంతకన్నా నా మనస్సు మరొక విషయాన్ని ఎరుగదు. ఈ సంగతి నీకు తెలిసే ఉంటుంది. విశాలవక్షాలను గాని, అందమైన మీసకట్టుల్ని గాని చూడాలన్న కోర్కె నాకు కలుగలేదు. వాటిల్లో నా బొమ్మ పొత్తికలలో నాకు కనుపించిన నగమందమైనా అప్పుడు నాకు కనిపించలేదు. వాటిని చూచినప్పుడు సిగ్గుపడటం తెలీదు. అసలు సిగ్గంటే ఎలా ఉంటుందో నా కర్థమయ్యేదికాదు. అప్పుడు నా మనస్సు పసి మల్లెమొగ్గలాగా ఉండేది.

"ఒకరోజున నేను చేసిన వ్రతానికి ఉయ్యాల ఊగవలసి వచ్చింది. మా బంధువులలో వరసైనవాళ్ళు ఒక యువకుణ్ణి లాక్కువచ్చి నన్ను ఊపమన్నారు. అతడు వచ్చి నా ఉయ్యాల త్రాళ్ళను పట్టుకుని పోతవిగ్రహం లాగా నిలబడ్డాడు. అతడే నందుడు. ఇనపదుక్కల లాంటి చేతులతో సత్తువకొలదీ నన్ను ఊపాడు. నా ప్రాణాల్లో ప్రాణాలు లేవు. ఆకాశాన్ని తన్నేటంత ఎత్తుకి పోయాను. కళ్ళు మూసుకొని ఉయ్యాల తాళ్లను గట్టిగా పట్టుకొన్నాను. రెండు ఊపులు అయ్యేటప్పటికి నాకు భయం తీరింది. నందుడి మీద కోపం వచ్చింది. వాళ్ళు ఎంత హుషారుచేస్తే మాత్రం? అంత గట్టిగా ఊపుతాడా? పడితే యేమైపోయేదాన్ని? మళ్లీ నా ఉయ్యాల వెనుకకు వచ్చినప్పుడు కాలికొంది కీ తన్నాను. అతడు కాబట్టి చలికిలబడ్డాడు. మరొకడైతేనా? పాపం, రక్తం కాలువలు కట్టింది. ఎంతదెబ్బ తగలకపోతే నా అందె ఘల్లుమంటుంది?

"అతని రక్తం చూచేటప్పటికి నాకు జాలివేసింది. వేళాకోళానికి పెద్ద ఊపు వేస్తే మాత్రం తన్నాలా? అందులో అలా రక్తం కారేటట్లు? నాకు బాధకలిగింది. నాలో నేను పశ్చాత్తాపపడ్డాను. అతని ముఖం మళ్ళీ చూట్టానికి సిగ్గేసింది. అసలు సిగ్గుపడటానికి అదే మొదలేమో? నాకు జ్ఞాపకం లేదు. "పొరపాటున కాలు తగిలింది; క్షమించు." అతన్ని అడుగుదా మనుకొన్నాను, కాని అడగలేకపోయాను. ఆ రోజునుంచీ అతడంటే జాలి భయం కలిగాయి. అతడి ముక్కు ఎలావుందో తెలుసుకోవాలని ఉండేది కాని సాహసించి అడగలేకపోయేదాన్ని.

"ఆనాటిరాత్రినుంచి నాకు కొత్తకలలు వచ్చేవి. నీకు తెలియని దేముంది. ఈ మానవప్రకృతికి అతీతురాలివి. ఒకసారిపాడుగాటి దుడ్డుకర్రతీసుకుని నందుడు నా ఒళ్ళంతా ముక్కజన్నకండెల్ని కొట్టినట్లుగా ఊచంచేసినట్లు కల వచ్చేది. అదేమిచిత్రమో, నాశరీరం గుగుర్పొడిచేది. మరొక రోజున తన రెండుపాదాలతో నా ఒళ్ళంతా కసి బిసి తొక్కినట్లయ్యేది. నాకు బాధ ఉండేది కాదు. నేను గొంతుదాటి బయటకురాని నవ్వు నవ్వేదాన్ని. నా శరీర మంతా చెమటముద్ద అయ్యేది. నా చేతుల్ని తొడల సందున బిగుచుకుని పండుకొనేదాన్ని. అప్పటి సౌఖ్యం అనిర్వాచ్యంగా, అనూహ్యంగా, అవ్యక్తంగా ఉండేది.

"ఆ స్వప్నసుఖానికి నేనెంతో ఆశించేదాన్ని. మళ్ళా నిద్రపోతే, అలాంటి స్వప్నం వస్తుందేమోనని అవస్థ పడేదాన్ని. అసలు నిద్రపట్టేదేకాదు, పట్టినా, అలాంటి కలలు వచ్చేవేకావు. అలాంటి అనుభూతి కలిగేదేకాదు.

"ఇలా ఒకటి రెండు సంవత్సరాలు గడిచాయి. నందుడు మళ్ళా ఒకసారి మా ఇంటికివచ్చి, నన్ను తన మిత్రునికిచ్చి పెండ్లి చేయవలసిందని మానాన్నను అడిగాడు. మానాన్న కూడా ఒప్పుకొన్నాడు

నాతో నా పెండ్లి సంగతి కూడ ఎవరూ చెప్పలేదు. ఆరోజు వచ్చింది. పెండ్లి జరుగుతూ ఉంది నా భర్త నాతో అగ్నికి ప్రదక్షిణంచేసి నన్ను తన అర్ధాంగిగా స్వీకరిస్తూ ఉన్నాడు నందుడు అక్కడే మార్పుని ఆనందిస్తూ ఉన్నాడు.

''పెండ్లయి అత్తవారింటికి వెళ్ళుతున్నప్పుడు కూడ అతడు మావెంట వచ్చాడు. తరువాత ప్రతిరోజు అతడు కనిపిస్తూ ఉండేవాడు.

''దేవీ, నీవు త్రిలోక శాసనివి. సృష్టిస్థితిలయాలు నీవల్ల సాగుతూ ఉంటాయి ఏజీవి హృదయంలో ఎప్పుడెప్పుడు ఏయేభావాలు వస్తూ పోతూ ఉంటాయో, ప్రాణుల తత్వమేమిటో నీకు కూలంకషంగా తెలుసు. అలాంటప్పుడు మానవ ప్రకృతి సమగ్రంగా నీకు తెలియటంలో ఆశ్చర్యమేముంది? అందులో అత్యల్పురాలినైన నా హృదయ వేదనలు తెలిసే ఉంటాయి నీకు తెలిసి ఉన్నప్పటికి యాధార్థాన్ని చెప్పమన్నావు.

''నా సంగతి పూర్ణంగా తెలిసి ఉన్నవాళ్లకైనా నా హృదయాంతర భావాలను చెప్పలేను ఎప్పటికీ చెప్పలేను దీనికిసిగ్గు ఒక కారణం. సిగ్గువిడిచి నేను చెబుతాననుకో మానవుడికి ఎంత విశాలభావమున్నా, ఎంత సానుభూతివున్నా, ఎంత దమనశక్తివున్నా నిర్వికారంగా ఉండలేడు మానవసహజాలైన వాసనలు అతని తీర్పును మలినీభూతం చేస్తాయి. నాకు న్యాయం కలగదు.

''నీ వంటేనో అలాకాదు నిర్గుణవు సృష్టిస్థితిలయ కారకురాలవు నీకడ సిగ్గుపడవలసిన పనిలేదు. 195
ఎందుకంటే నీకడ చెప్పుకోవటమంటే, నా హృదయానికి నేను చెప్పుకున్నట్లుగా ఉంటుంది పైగా మానవత్వాన్ని సృష్టించింది నీవే అందువల్ల, నాపట్ల సానుభూతి కలిగి నిర్వికారంగా తీర్పుచెప్పగలవు మరొకటికూడా ఉంది. నా హృదయభావాన్ని ఎవరికో ఒకరికి చెప్పుకుంటేనేగాని కొంత ఆత్మశాంతి లభించదు.

''ఈ కారణాలన్నిటివల్లా జరిగిన కథంతా కొంచెం కూడా దాచకుండా చెప్పుకుంటున్నాను అసలు నీకు తెలియకుండానేనెలా దాచగలను?

''కృష్ణశర్మతో నాకు దాంపత్యం ప్రారంభమైంది. నిరంతరం అతని ముఖంచూడాలనిపిస్తూ ఉండేది సన్నగా, పొడుగ్గా, కోటేరులాగా ఉండే ఆ ముక్కు, బ్రహ్మవర్చసమొలికే ఆ ఫాలం ప్రశాంతి గాంభీర్యాలను వెదజల్లే ఆ కళ్లు, స్వచ్ఛంగా ఉచ్చరించే ఆ ఎర్రని పెదవులు. ఎంతసేపు చూచినా తనివితీరేదికాదు ఆ ముఖం నిరంతరం నా దగ్గరనే ఉండాలనిపించేది. సాయంకాలం స్నానం చేసి అద్దం ఏమూలనో దాచి, వీధి అరుగుమీద నందునితో పిచ్చాపాటిగా మాట్లాడుతూవుండే నా నాథుణ్ణి లోనికిపిలిచేదాన్ని. ఆయన గదిలోపలికివచ్చి ''పిలిచావా? దేనికి?'' అని, అడిగేవాడు. ''అద్దమేమన్నా చూచారా?'' అని అడిగేదాన్ని, ''నాకు కనిపించలేదే'' అని ఆయన అనేవారు. ''బొట్టు పెట్టుకోవాలి'' అనేదాన్ని ఆయన అద్దంకోసం వెతికేవారు. నేను ఎక్కడో దాచిన అద్దం ఆయనకెలా కనిపిస్తుంది? ''కనిపించకపోతే కనిపించక పోయింది. ఎలాగో ఓలాగ బొట్టు పెట్టుకొంటాను. మీరు దిద్దండి'' అనేదాన్ని, ఆయన దిద్దటానికి పూనుకొనేవారు. ఆయన దృష్టి బొట్టుమీద ఉండేది ఆయన దాన్ని దిద్దుతున్నంతకాలం ఆయన ముఖంలోకి కన్నార్పకుండా చూస్తూ ఉండేదాన్ని, ఆయన

సరిగాదిద్ది ఊం అనబోయేసరికి, నేను కదిలేదాన్ని బొట్టులో వంకరపోయేది. ''పట్టి పసిపిల్లవైపోతున్నావు. కాస్త కదలకుండా నుంచోలేవూ'' అని ఆయన నన్ను అనుకొని ఒకచేత్తో నా గడ్డం కదలకుండా పట్టుకొని బొట్టును మళ్ళీ దిద్దుతూ వుండేవారు. అంతసేపు నేను రెప్పవేయకుండా ఆయన ముఖంలోకి చూచేదాన్ని. నా శరీరం పులకరించేది.

''ఆ ముఖంమంటే అంత ప్రాణప్రదంగా ఉండేది.''

''ఆయన నాలో నిద్రాణమై ఉన్న యౌవనజ్వాలను ప్రజ్వలింపజేశారు నేను దీనిని కాదనలేను ఈ నూతన అనుభూతి ప్రపంచంలోకి ఆయనే నాకు మార్గం చూపించారు. కాని, ప్రజ్వరిల్లిన కాంక్షకు సంతృప్తి కలగలేదో. లేక అవధిఅంటూ లేకపోయిందో నేను చెప్పలేను ఆయన నా రొమ్ములపై తలపెట్టుకొని నిద్రపోతూవుంటే, నా హృదయం బావురు మంటూవుండేది ఆ సన్నని ఎర్రపెదవుల్ని ముద్దుపెట్టుకొనేదాన్ని, కాని ఆయన దుర్బల శరీరాన్ని చూస్తే నాకు జాలి కలిగేది. నా పశుకాంక్ష చూస్తే నాకే అసహ్యం వేసేది. ఆయనకు నేనుతగనేమో ననిపించేది కాని నందు డప్పు డెందుకో జ్ఞప్తికి వచ్చేవాడు

''కాని నేనూ సామాన్య స్త్రీనే అసలు యీ సౌఖ్యం నా అనుభవంలోకి రాకుండా ఉంటే బాగుండేది కాని ఒకసారి చవిచూచి మరిచిపొమ్మంటే ఎలా సాధ్యమౌతుంది? ఏ కొలది



రోజులంటేనో భరించవచ్చును కాని నెలలపర్యంతంగా భరించాలంటే?''

''ఇలా అవస్థపడే నాకు బలిష్ఠ బాహువులతో విశాలవక్షంతో నందుడు ప్రతిరోజు మాయింట్లో ప్రత్యక్షమౌతూ ఉండేవాడు అతన్ని చూస్తే నా హృదయం ఆర్రులుచాచేది నా కోర్కెలు వందిల్లెక్కేవి నా శరీరం మంచమెక్కేది. దాంపత్య ధర్మానికి నా హృదయం ద్రోహం తలపెట్టింది. నందుడే నా భర్తలయితే, నా కాంక్షా శిఖరాలకు నన్ను చేర్చడా? అని నా మనస్సు, శరీరం ఉవ్విళ్ళూరేవి.''

''నందుడు నాకు కనిపించకుండా ఉన్నా బాగుండేది. కాని నా భర్తకతడూ, అతనికి నా భర్తా కావాలి, ఒక క్షణంకూడా వారు ఒకరి నొకరు విడిచి ఉండరు నేను పగలంతా నందుని చూట్టం రాత్రంతా అతన్నిగూర్చి కలలుగనటం జరిగేది. ఎంత మనస్సు మార్చుకొందామన్నా నందునిగూర్చి కలలు గంటూ ఉండేదాన్ని, ఎంత తీవ్రంగా అతన్ని గూర్చి తలవనైనా తలవగూడదని పగలనుకొంటానో, అతన్నిగూర్చి రాత్రి అంత అధికంగా కలలువస్తూ వుండేవి అసలు నిద్రఅనేది లేకుండా చేసి ఉన్నట్లయితే నామనః ప్రవృత్తిలో వికృతికలిగేది కాదేమో?''

''నిద్రను ఆస్కారంచేసుకుని నామనోవికృతి విజృంభించి జాగ్రదవస్థలోకూడా మెల్లాడసాగింది పద్దనుకొన్నానందుని విశాలవక్షాన్ని చూచేదాన్ని. నా మనస్సు అతని కటితటాన్ని నాజఘనంతో పోల్చేది నాశరీరం గగుర్పొడిచేది. అతని చేయి పొరపాటున తగిలతే నా ఒళ్ళు పారవశ్యం పొందేది రోజు రోజుకీ నా కన్నులు నందునిలో కొత్త అందాన్ని కనిపెట్టి వాడుతూవచ్చేవి ''

''రాత్రింతలు నా భర్త కౌగిలించుకొంటే లోలోపల దుఃఖంతో కొంత వెలవెల పోయేదాన్ని, ''నందుడైతే ఎంత బాగుండేది!'' అని అనుకొనేదాన్ని, అతన్ని చూడాలన్న కోర్కెలో ఎళ్ళుమూసు

క్షోనేదాన్ని నాలో ఉద్రేకం పెచ్చుపెరిగిపోయినప్పుడు నేను కాంక్షిస్తున్న నందుని పేరు ఉచ్చరించకుండా ఉండలేకపోయాను. తన చేతుల్లో ఉండిదాంపత్య ధర్మాలను విచ్ఛిన్నం చేస్తున్నానని నా భర్త గుర్తించాడేమో! నిద్రలో తరచు కలవరిస్తూ వచ్చాను. అలా కలవరించినప్పుడు ఎప్పుడో ఒక సారి నా హృదయంలోనిదంతా వెళ్ళగ్రక్కి ఉంటాను. నా భర్త విచారాన్ని బట్టి యిలా జరిగి ఉంటుందని ఊహించాను. పైగా అలా కలవరించినప్పటినుంచి నా భర్త నా దగ్గరకు రావటంలేదు అప్పటినుంచి ఇప్పటివరకూ ఒక సారికూడా నన్ను స్పృశించలేదు. నందుడయినా నన్ను ఒక సారికూడ తాకలేదు. అంతమాత్రం చేతనే అతనిలో కామం రేకెత్తలేదనటానికి వీలులేదు. తప్పకుండా అతనికి కామోద్వేగం కలిగింటుంది. కాని, స్నేహితుని కోసం అతడు కామాన్ని చంపుకొని ఉంటాడు. నేనైనా లొంగేదాన్నికాను అంతశ్శత్రువులకు లొంగి నందుడు నన్ను సమీపించి ఉన్నట్లయితే, నా నాథునికోసం నేను తప్పకుండా అతన్ని తిరస్కరించేదాన్ని, ఇందులో ఏ మాత్రం సందేహంలేదు.''

''ఇలాంటి పరిస్థితిలో మేము ముగ్గురం మా నాన్న గారింటికి బయలు దేరాం. క్రిందటిరాత్రి కటికచీకట్లో దారితప్పాము. ఇవ్వాళ ఉదయాన మళ్లీ దారి కనుక్కొని వస్తూ ఉన్నాం దారిలో నీ ఆలయం కనిపించింది. నా నాథుడు నిన్ను దర్శించి పూజచేసుకొని త్వరలో వస్తానని వచ్చాడు. నీ ఆలయంలోకి వచ్చి యింతపని చేశాడు నైరాశ్యంతో నేను సుఖపడిపోతానని యింతటి ఘోరానికి దిగాడు తలకీ మొండానికీ వియోగం కలిపించాడు ఇదంతా యదార్థం. నిజం చెప్పటానికి సాహసించినందుకు దేవీ! క్షమించు. అతడు నీకోసం బలికాలేదు. కేవలం నాకోసం, అతని మిత్రుని కోసం తాను బలిఅయ్యాడు నందుడూ నేనూ సంసార సుఖం పొందాలని అతడు ఆశించాడు. తరువాత అతని కోసం నందుడు వెతుకుకొంటూవచ్చాడు అతనికి ఈ దృశ్యం కనిపించింది ఇలాంటి త్యాగఫలాన్ని స్వీకరించటానికి అతడు ఆమోదించ లేదు. అసలు ఏ మాత్రం సహించలేకపోయాడు. కన్నుల పండువైన తన దేహాన్ని తలనుండి వేరుచేసి నిరుపయోగం చేసి వేశాడు. తల నుండి విడిపడ్డ అతని మొండెం ఎంత నిరుపయోగమై పోయిందో, తలతో ఉన్న నా శరీరం, నా బ్రతుకూ అంత నిరుపయోగమైపోయింది అవును, నా నాథుడూ, ఆయన మిత్రుడూ, ఇద్దరూ గతించిన తరువాత నాకీ జీవితమెందుకు? ఇలాంటి దుర్గతి నాకెందుకు పట్టాలి? ఇదంతా పూర్వజన్మ సంచితం కాబోలు! ఇలాంటప్పుడు నేను దేనికి బ్రతకాలి.''

కాళీకంఠం గర్జించింది. ఆ గర్జన క్రోధ పూర్వకమో జుగుప్సాపూర్వకమో అందులో ఏ భావమున్నదో తెలీదు. సుందరికి మాత్రం కోపిస్తూ ఉన్నట్లు కనిపించింది.

''నిజంగా కోతివి. ఇంకొకళ్ళయితే నిన్నుచూచి నవ్వటమో అసహ్యించు కోవటమో కోపించటమో ఇంకా ఏమన్నా చేయటమో జరిగేది నేను నిర్గుణను, కాబట్టి నేనేమీ చెయ్యను – చెయ్యగూడదు. నీలో నిరంతరం ప్రజ్వలిస్తూ ఉన్న కామం నీ కళ్లకు నందునిలో అతని అవయవాల్లో వైఖరిలో అనంత సౌందర్యాన్ని చూపెట్టింది నా సృష్టిలో అలాంటి నందులు అతని తలదన్నినవాళ్లు ఎన్ని కోట్లమంది లేరు? అయితే పైత్యించిన నీకళ్లకు మాత్రం కనిపించరు ''–

''ఈ ప్రకృతి నా సృష్టి చిత్రాతి చిత్రంగా గంభీరంగా ఉంటుంది మానవుడు నిజంగా ఆలోచిస్తే,

అగమ్యగోచరంగా ఉంటుంది మానవుణ్ణి చూస్తే, ఎన్నో వికారాలు కలుగుతాయి. నాకు మాత్రం ఎలాంటిదీ కలుగదనుకో, నీ మట్టుకు నీకు నందుని జబ్బలలో పుష్టీలలో, వక్షంలో, తొడలలో, పాదాలలో ఎంత పైత్యం కనిపించింది? సాలీడు తనచుట్టూ గూడల్లు కొన్నట్లు నీవు - నీవే కాదు - ప్రాణికోటి అంతా ఊహాతంతువులను అల్లుకొని పోతుంది ఈ అల్లికే నీవు నిజమంటావు అందరినీ నమ్మమంటావు. అంతటితో ఊరుకుంటే నయమే. నన్ను కూడా - ఈ సృష్టి స్థితిలయ కారణభూతురాలైన నన్ను కూడ - నమ్మమంటావు త్రుటిలో నశించే ఈ యెముకలు మాంసం చర్మం అందాల కుప్ప అనీ ఇంకా ఏవేవో పేర్లుపెట్టి ఆత్మవంచన చేసుకుంటావు

''ఇంతటితో ఊరుకుంటే నయమే. పైగా ధర్మ పన్నాలు కూడా చెప్పమస్తున్నావు. ఈ ధర్మపన్నాలు నీకెవరు చెప్పారు? మానవుడు చెప్పేది. నా కంట గట్టేది, నేను వాడికి ప్రత్యక్షమై చెప్పానట! ఎప్పుడో? నా సృష్టి వీడికి బోధిస్తుందట! వీడికి శాస్త్రం చెబుతున్నదట! వీడి అహంకారం అజ్ఞానం చూస్తే మరొకజీవి నవ్వుతాడు సర్వజ్ఞురాలను నిర్గుణను ఐన నేను నిర్వకారంగా ఉంటాను. వీడిని తికమకలు పెట్టటానికి గుడ్డివెలుగులాంటి అల్పజ్ఞానాన్ని యిచ్చాను దీన్ని చూచి వీడు పొందే అహంకారం ఇంతా అంతా కాదు. ఆ గుడ్డివెలుగు భ్రాంతిని పెంపొందించటానికి పనికి వస్తున్నదే కాని జ్ఞానానికి ఎలా వినియోగపడుతున్నదో వీడికే అర్థం కావాలి.

'' ఏమన్నావు? నీ భర్త నా కోసం ఆత్మార్పణం చెయ్యలేదూ? కేవలం నీ సుఖంకోసం ప్రాణత్యాగం చేశాడూ! నీ సుఖంకోసమే ఉద్దేశించి చేసినవాడైతే నా గుళ్లోకి వచ్చి వాడెందుకు చావాలి? అంతకుముందే ఎందుకు చావలేదు? నిన్ను తృప్తిపరచటానికన్నా బలం లేని, మనస్థైర్యం లేని శర్మ, ఆత్మహత్య మహాపాపమని తెలిసిన విజ్ఞుడు, చేతులారా తన తలను ఎలా ఖండించుకొన్నాడు? అతనికోసం నందుడు తన ప్రాణాలను సమర్పించాడూ? నీకు ఎంత అహంకారముంది! నా సృష్టి రహస్యమంతా నీ కర్థమై పోయినట్లుందే! తానెందుకు చనిపోయాడో నీ మగనికే తెలీదే! ఇకముందు ఇలాంటి పిచ్చిమాటలు నా దగ్గరనేవు? అనేక కారణాలుంటాయి నా చర్యలు అంతతేలికగా అర్థంకావు.

''నా సృష్టి అంతా కార్యకారణభావానికి అతీతం నేనూ అంతే. అందువల్ల ఒక క్రమమంటూ ఉండాలంటాను. అందులో వివాహమనేది అవిచ్ఛిన్నంగా సాగాలి. నా ప్రకృతిలో సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని అనుగ్రహిస్తే, నా సృష్టే తలక్రిందు లవుతుంది.''

''ఇంతకూ నీ నాథుని ప్రాణాలను, అతని మిత్రుని ప్రాణాలను స్వీకరించటం నాకాటే యిష్టంలేదు. వాళ్ళను బ్రతికిస్తే, ఇక ముందైనా సరిగా వ్యవహరిస్తావా.''

కన్నీళ్ళు గుండా నవ్వుతూ సుందరి ఆతురతతో అంది! ''దేవీ త్రిలోకజననీ! నిజంగా నీవు అలా చేయగలిగితే, నా నాథుణ్ణి, మిత్రుణ్ణి మళ్ళీ యథాప్రకారంగా బ్రతికించ గలిగితే నిన్ను ఎంతగా చెప్పుకొంటాను! ఎంతగా కీర్తిస్తాను! నిజంగా నా కలల్ని పూర్తిగా మరచిపోతాను. నానాథునికి ఇకముందు ఎలాంటి కష్టాన్ని కలిగించను. నీ చరణాలుబట్టి శపథంచేసి చెప్పుతున్నాను. నిజంగా నీవు మళ్ళీ వారిని యథాప్రకారంగా చేయగలిగితే, నా యావజ్జీవం, త్రికరణశుద్ధిగా నీకు కృతజ్ఞురాలినౌతాను. ముప్పూట నీకు - నిజంగా నీవు ఆరగిస్తే - నై వేద్యం నివేదనచేస్తాను. ఇంతకుముందు నీ ఆలయంలో

నిలుచున్నప్పుడు మృత్యువు వన్నా మరొకటి నీ సాన్నిధ్యాన నిలవలేమనుకున్నా, కాని, నిజంగా ఇకమీదట సుఖతరంగా జీవించటానికి వారిని పునరుజ్జీవింప జేయగలిగిన శక్తి నీకుంటే, ఎంత బాగుంటుంది?''

కాళీ కంఠం గర్జించింది. ''ఏమన్నావు? నాకు శక్తి ఉంటే? నిజంగా నేను చేయగలిగితే చేసేదా? సృష్టిస్థితి లయకారకురాలైన నాకు శక్తిలేదూ? ఇలాంటి శక్తిని అనేక పర్యాయాలు ప్రకటించాను. నీ ముఖం చూచి యీ శక్తిని ఇప్పుడు ప్రకటించబోవటం లేదు. ఆ యిద్దరి యందున్న జాలివల్ల వాళ్లను బ్రతికిస్తున్నా. నేను చెప్పే మాటలను జాగ్రత్తగా విను. ఆ ఉరి తీసివేసుకొని నా గర్భగుళ్లోకి వెళ్లు అక్కడ మూర్ఛపోవటం గాని, యేడవటం కాని, ఏ మాత్రం పనికిరాదు. జుట్టుపట్టుకొని తలలను మొండాల కంటించు. అక్కడున్న కత్తితో రెండుసార్లు తెగినచోట స్పృసించి, మూడుసార్లు నా పేరు జపించు. యువకులిద్దరూ మళ్లీ బ్రతుకుతారు. తెలిసిందా? తలలను మొండాల కంటించాలని నీకు ఆతురతా ఎక్కువౌతుంది కాని, తొందరపడి వెంటనే తలలను మొండాలకు చేర్చకు కారిన రక్తం మళ్లీ శరీరాలలోనికి వెళ్లాలి. త్వరగా పో! జాగ్రత్తగా విన్నావా? తొందర్లో ముఖాలను వీపులవైపు ఉండేటట్లు అంటించి వాళ్లను నగుబాటు పాలుచేసేవు, జాగ్రత్త! రేపటి ఉదయందాకా ఊరుకున్నావా, ప్రయోజనం లేదు పో! త్వరగా పో!''

సుందరి ఉరి తీసి వేసుకొని మాట్లాడుకూడా మాట్లాడ లేదు. ఆఖరికి దేవికి నమస్కారంకూడా చేయ్యలేదు. ఆ అనంత సంతోషావేశంతో ఆ చీరకట్టుతో ఎంత వేగంగా పరుగెత్తటానికి వీలుందో అంతవేగంగా దేవి గర్భగుళ్లోకి పరుగెత్తింది భయంకర కాళీ విగ్రహంముందు నెమ్మదిగా రెండుతలలను రెండు మొండాల దగ్గరకు చేర్చింది పాము బుసకొట్టినట్లుగా రక్తం రెండు మొండాలలోకి తిరిగి బుస్సుమంటూ ప్రవహించింది. కత్తితో ఒక్కొక్క శవాన్ని రెండుసార్లు స్పృసించి మూడుసార్లు ''కాళీకి జై'' అని సుందరి సంతోషం వల్ల కలిగిన గాద్గద్యంతో అరిచింది ఇద్దరు యువకులు ఎలాంటి మచ్చా లేకుండ బ్రతికిలేచారు. ఇద్దరు ఆమెను చూచిన తరువాత తమ్ము తాము చూచుకున్నారు ఇలా తమ్ము తాము చూచుకునేటప్పుడు ఒకళ్ళ నొకళ్లు చూచుకున్నారు. తమ్ము తాము చూచుకోటానికి అసలు ఒకళ్ల నొకళ్లను చూచుకోవలసి వచ్చింది.

సుందరీ, ఏం చేశావు? ఏమి జరిగింది? నీ ఆతురతతో ఏం జరిగేటట్లు చేశావు? నీ ఆతురతతో ఒకరి తల మరొకరికి అంటించావు నందుని మొండాన్నే కృష్ణశర్మ అనటానికి వీలుంటే, కృష్ణశర్మ కంటించావు కృష్ణశర్మ తలను నందునికి అంటించావు. అంటే, నీ ముందు ఇప్పుడున్నది. నీనాధుడు. మిత్రుడుకాదు, నాధమిత్రుడు మిత్రనాధుడు.

ఆతురతవల్ల ఎంతమార్పు జరిగింది భర్త మొండెం మీద నందుని శిరస్సు; నందుని మొండెం మీద భర్త శిరస్సు ఉత్సాహ ఆ వేగంతో వేసిన కేకతో దేవాలయం మారు మ్రోగింది నందుడు (తలనుబట్టి నిర్ణయింప వలసి వస్తే) తన పూర్వ బలిష్ఠదేహానికి బదులుగా వచ్చిన దుర్బలదేహాన్ని తడుపుకున్నాడు. కృష్ణశర్మ కొత్తగా లభించిన బలిష్ఠదేహాన్ని చూచుకొని గుర్తించలేక, కొంత తబ్బిబ్బయ్యాడు సుందరి నందుని దగ్గరనుంచి కృష్ణశర్మ దగ్గరకు. కృష్ణశర్మ దగ్గరనుంచి, నందుని దగ్గరకు వెళ్లింది ఇరువురూ బ్రతికినందుకు సంతోషం. తలలు మారినందుకు దుఃఖం కలిగాయి

కృష్ణశర్మను కావులించుకో బోయింది కాని, అతని దేహం క్రొత్తగా కనిపించటంవల్లా ప్రత్యేకనందు డుండటంవల్లా ఆగింది. నందునివైపు వెళ్ళింది. ముఖం కొత్త అయి ఆగింది ఇరువురి మధ్య చలికిల బడింది

''క్షమించు శర్మా! క్షమించు.'' అంది సుందరి. ఆమె కన్నులు మళ్లీ నందునివైపు తిరిగాయి ''నందా, క్షమించాలి, మీరు క్షమించలేకపోతే'' సుందరి గాద్గద్యంవల్ల మాట్లాడలేకపోయింది వ్యక్తికి తలా మొండెమూ ముఖ్యమైనప్పటికి ఆమెతలకే ప్రాముఖ్య మిచ్చింది తలలనుబట్టే పేరుపెట్టిపిలిచింది. ''మీరిద్దరు నన్ను క్షమించాలి. నన్నెలాంటి దుర్దశలోపెట్టారో మరొకసారి ఊహించుకోండి. రెండుతలలు తెగి పడి ఉన్నాయి నా కళ్ళకు ఒక్కసారిగి బయర్లుకమ్మాయి. బహి: ప్రపంచమే కనిపించలేదు, నా సంగతే నాకు గోచరించలేదు. ఆ దుఃఖావేగంలో నా కుత్తుకను నేను మలిమివేసుకుంటున్నాను. ఆ సమయంలో కాళీ గర్జనం వినిపించింది ఇంద్రియాలు సంపూర్ణంగా నా స్వాధీనం తప్పిపోయాయి. నేను నిజంగా దేవి ఆజ్ఞను సరిగా నిర్వహించే స్థితిలో కూడా లేను. నా కన్నుల ముందుట మూడులోకాలు తిరుగుతున్నట్టున్నాయి. ఏ చేతిలో ఏ తల ఉందో నాకు తెలీదు. నిజంగా నాకు తెలీదు. ప్రవమాద పడకుండా ఉంటానికి ఎంత అవకాశ ముందో ప్రమాదపడటానికి కూడా అంత అవకాశం ఉంది. తుదకు ఇలా పరిణమించింది మీరు ఇలా దక్కారు. దేవి చెప్పేటప్పుడు కూడా ''మొగాలు వెనకకు తిప్పి చేర్చేవు సుమా'' అని హెచ్చరించిందేకాని, ఇలాంటి తప్పు చేసేవు సుమా అని హెచ్చరించలేదు. అలా చెప్పివుంటే యిలాంటిది జరిగి ఉండేది కాదు. దీంట్లో దేవి దోషంకూడా వుంది. ఏమంటారు? పలకరేం? ఇలా తారుమారై మళ్లా బ్రతకటం మీకిష్టంలేదా? నిజం చెప్పండి. నేను చేసింది తప్పని కోపమా? చెప్పరేం? అలా అయితే ఇదివరకున్న మార్గమే శరణ్యం. ఉరిపెట్టుకుంటే క్షణంలో తేలిపోతుంది ఎవరికీ పనికిరాక దేనికి బ్రతకటం?... నన్ను క్షమిస్తారా? విధివల్ల జరిగిన దీనికి తృప్తిపడి ఏర్పడిన నూతన స్థితిగతులకు అనుగుణంగా మన ముగ్గురిమధ్య ఉన్న సంబంధాలను మళ్లీ చక్కబరచు కుందా మంటారా? పూర్వజీవితం కంటే మారిపోయిన ఇప్పటి జీవితం బాగుండదా? పూర్వం అసంతృప్తికరంగా వున్న సంబంధాలనే మళ్లా అనుభవించాలని కోరుతున్నారా? మాట్లాడవేం శర్మా? నీవు కూడ మూకీభావం వహిస్తావా నందా?''

ఇద్దరు యువకులూ వంగి తమ కాళ్ళకు చుట్టుకొని వున్న సుందరిని చెరొకరెక్కపట్టుకొని లేవ నెత్తారు ముగ్గురూ కొంతసేపు విస్తుపోయి-ఒకళ్ళ నొకళ్ళు చూచుకున్నారు. తలలనుబట్టి సుందరి ఎవరు ఎవరైనదీ నిర్ణయించింది ఇది మాత్రం సహజసంగా ఉంది. ఎందుకంటే ''నేను నీవు'' అనేభావాలు తలనుబట్టి ఉంటాయి కాని, మొండాలను బట్టి ఉండవు. దుర్బలమైన కృష్ణశర్మ మొండెంమీద ఉన్న నందుని శిరస్సు తాను నందుడని భావించింది కృష్ణశర్మ శిరస్సుకూడ అలాగే ఎంచింది రెండో విషయం – ఇరువురూ సుందరిని కోపగించుకో లేదు ఆమె పిలిచినట్టుగానే పలికారు. ఇరువురూ తమ తమకు కలిగిన మార్పులకు సంతోషించారు.

శర్మ యిలా అన్నాడు! ''తనకిప్పుడు ప్రాప్తించిన దుర్బల దేహాన్ని గూర్చి నందుడు బాధపడపోతే

మాత్రం ప్రపంచంలో అందరికంటే నేను అదృష్టవంతుణ్ణి. నేను ఎప్పుడూ చక్కని బలిష్టదేహం ఉంటే ఎంతబాగుంటుంది అని వాపోయేవాణ్ణి. ఇన్నాళ్ళకు నా కోరికనెరవేరింది. ఇప్పుడు నా దండచేతుల్ని నా భుజాలను తడువుకుని నా కాళ్ళ వంకకు చూచుకుంటూవుంటే నాకు అపారసంతోషం కలుగుతూ ఉంది. నా యీ నూతన దేహాన్ని బలాన్ని చూచుకొంటే మునుపటిలాగా తల వంచుకోవాల్సొ వంగటంలేదు. ఇప్పుడు ఎంతో ఆత్మసంతృప్తి, విశ్వాసం కలుగుతున్నాయి. ఇలాంటి బలిష్ఠ దేహంకోసం. సుందర విగ్రహం కోసం నా హృదయం వెదికేది. ఆరాటపడేది. ఇప్పుడో అలాంటి కాంక్ష, జిగీష, కలవరింత ఒక్క సారిగా ఎగిరిపోయాయి. నా హృదయం అంతర్ముఖమై నా చేతులు నా దేహాన్ని తడివి చూచుకుంటే చాలు. ఎంత ఆనందం కలుగుతుంది? అందులో నాకెంత సంతృప్తి కలుగుతుంది? ఇదివరకు దేవికైతే పరితపించే వాణ్నో అది నాకు లభించింది. సుందరీ! పూర్వం కంటే ఇకముందు నీకెక్కువ సుఖం చేకూర్చుగలుగ బోతున్నందుకు ఎంతో సంతోషిస్తున్నాను. ఈ విచిత్ర సంఘటనకు నా హృదయం గంతులువేస్తూ వుంది.''

''ఇది వరకు నాదైన ఆ దేహాన్ని యిప్పుడు నీదేననటానికి నా కేమీ అభ్యంతరం లేదు. నాకు ఆ దేహం చాలాకాలం ఉంది. ఇలా మార్చినందుకు నిన్ను (సుందరితో) ఏ మాత్రం కోపించను. పైగా నాకు మేలు చేకూర్చావు పూర్వం అలాంటి నువ్వలాంటి దేహం కావాలని ఉవ్విళ్లూరుతూ ఉండేవాణ్ణి అందుకనే శర్మ అంటె ఆదరం. అభిమానం, గౌరవం, ఎప్పుడూ అతని సన్నిధిలో ఉండాలని కోరుతూ ఉండేవాణ్ణి, నా మొద్దు శరీరం తనపాలిట పడిందే అని శర్మ అసహ్యించుకోక పోవటం నాకు ఉత్సాహకరంగా వుంది. ఈ సంఘటనవల్ల మా యిరువురి స్నేహం భగ్నం కానందుకు సంతోషిస్తున్నాను. కాని మనభవిష్యత్తును. యింత తెలిగ్గా తేల్చి వేస్తున్నందుకు నా హృదయం త్రొక్కిస లాడుతూవుంది. ఆశ్చర్యం నిరుత్సాహం కలుతున్నాయి. ఇప్పుడు మిగిలింది ఒకటే పెద్ద సమస్య. అతడొకవిధంగా ఊహిస్తున్నాడు. నేను ఇంకొవిధంగా భావిస్తున్నాను.'' అన్నాడు నందుడు. 

''ఏమిటి, ఏమిటి?'' అని అడిగాడు ఒకసారిగా సుందరీ శర్మలు.

''ఏమిటా, నాకు శరీరం ముఖ్యం పెండ్లిలో శరీరం ముఖ్యం. ఎందుకంటే పిల్లలు శరీరంవల్ల కలుగుతారు కాని తలవల్ల కలగరు. అందుకనే సంతానాన్ని తనూజ తనూభవ ఔరస మొదలైన శబ్దాలతో పిలుస్తారు సుందరీ గర్భస్థపిండానికి నేనే తండ్రని ఇలాంటి విషయాన్ని ఎవరు ఎలా కాదనగలరు?'' అన్నాడు నందుడు.

'' ఆ! ఏమి మాట్లాడుతున్నావో కొంచెం వొళ్ళు దగ్గరుంచుకొని మరి మాట్లాడు. నందడి మేనా?'' అన్నాడు శర్మ. అతనికి తెలియకుండానే చెయ్యి లేచింది. పూర్వ దేహమైతే శాంతంతో ఆ చేతులు తొడల ప్రక్కన వ్రేలాడుతుండేవి.

''నేను నందుణ్ణే. ఈ పరిణీత దేహం నాదని చెప్పుకోటానికి, నేను నందుణ్ణేనని చెప్పుకోటానికీ ఎంత అధికారముందో, యీ జగదేక సుందరి నా భార్య అనీ, ఆమె గర్భస్థపిండానికి నేను తండ్రినని చెప్పుకోటానికి అంత అధికారముంది '' అన్నాడు.

''అలాగా? యిప్పటి నీ దేహం నాదై, సుందరి [illegible] ఉ[illegible]మాది నేనెంత

గట్టిగా చెప్పుకో లేకపోయానే నిజానికి సుందరి ప్రేమించింది యిప్పటి నీ దేహాన్ని కాదు. కేవలం యీ నా దేహాన్నే నిద్రలో కలవరించినప్పుడు యీ సంగతి నాకు తెలిసింది. ఇలాటి విషయాలను గూర్చి నా చేత మాట్లాడించటం ఏమాత్రం భావ్యంకాదు నీ శరీరాన్ని చూచుకొని నీవే నేనైనట్లుగా యింతగట్టిగా మాట్లాడుతున్నావంటే ఆశ్చర్యం కలుగుతూ వుంది. నిజంగా నీవు చెపుతున్నట్లు నీవుసుందరి భర్తవైన శర్మవైతే, నేను నందునైతే పూర్వంలాగా ఉండేదేకాని మార్పు ఏమి వచ్చేదికాదు సుందరి చేతుల మీదుగా తలలు మొదట మారటమే విచిత్ర సంగటన. దీనికి మన తలలు సంతోషిస్తున్నాయి. వీటన్నిటికంటే కూడా సుందరికి కలుగనున్న మహత్తర సుఖాన్ని ఎంచి మనం యింత అధికంగా సంతోషిస్తున్నాము. నీవు మాత్రంనీ పరిణీత దేహాన్ని పురస్కరించుకొని నీవే సుందరి భర్తవనీ, నేను కేవలం స్నేహితుడను మాత్రమే ననీ చెబుతున్నావు నీకు ఎంత అహంకారముంది? ఆమె సౌఖ్యాన్ని గూర్చి కించిత్తు కూడ ఆలోచించడం లేదు '' అన్నాడు శర్మ.

''నీవు చెప్పినట్టుగా ఆవిడ ఎంతో సుఖపడుతుంది! అవును నీ నూతనదేహంతో అపార సుఖం పొందుతుంది కాదు? నిజమే. నేను అహంకారినని నిందించావు. నిజానికి ఎవరు అహంకారులో తెలుస్తూనే ఉంది. సుందరికి తెలియటం లేదా? అసలు నే నొకటి చెబుతూ వుంటే, నీ వొకటి కల్పించుకుంటున్నావు. ఇప్పుడు నాకున్న యీ వివాహిత దేహాన్ని గూర్చి మాట్లాడటం లేదు. మనిషిని నిర్ణయించేది ఏదని నీవు చెబుతున్నావో ఆ తలను గూర్చే, నన్ను నందుని చేస్తున్న యీ తలను గూర్చే చెబుతున్నాను పైగా, సుందరియందు నీకున్న ఆసక్తీ, ఆమె సుఖాన్ని కోరేబుద్ధీ నాకు లోపమకోవటం చాల పొరపాటు, నీవు గుళ్ళోకి వెళ్ళిన తరువాత తన మధురకంఠంతో, సిగ్గిల్లుతూ ఉన్న ఆ జగన్మోహన కంఠంతో నన్ను పలకరించింది. నా గొంతుకూడ ఆమెలాగానే అసహజమార్దవంతో పలుకుతుందేమోనని భయపడ్డాను ఆమె నా ముఖాన్ని, నా కన్నుల్ని తనివితీరని చూపులతో చూచింది. పోదామనందా అని పిలిచింది అప్పుడు నాకిదంతా అనవసరంగా కనిపించింది. దీనిలో ఎంత అంతరార్థముందో యిప్పుడు బోధపడుతూవుంది. దీనివల్ల సుందరి ప్రేమించింది నా తలనే కాని; ఎందుకూ పనికిరాని నా పూర్వశరీరాన్ని కాదు. అప్పుడు ఆవిడతో చాల ముక్తసరిగా జవాబు ఇచ్చాను. ఆమెను పేరున పిలువలేదు. నా కన్నులు నా హృదయాన్ని ఆమెకు తెలియజేయకుండా చేయటానికి నా చూపుల్ని క్రిందకి ప్రసరింపజేశాను. ఇదంతా నీ స్నేహం కోసం నీ వివాహితస్థితికోసం చేశాను. ఎప్పుడు నాకు సుందరి అంత ఆప్యాయంగా అంత ఆకలితో చూచిన కన్నులూ ముఖమే కాక, భర్తృదేహంకూడ నాకు ప్రాప్తించింది. నా స్థితి గతులన్నీ సంపూర్ణంగా సుందరికి అనుకూలంగా పరిణమించాయి. ముఖ్యంగా సుందరి కోరుకుంటున్నట్లుగా జరిగింది. అన్నిటికంటె సుందరి సుఖమే మనకు ముఖ్యమైతే నేను చెప్తుతున్న దానికంటే మరొక గత్యంతరంలేదు.''

శర్మ నిష్ఠురంగా అందుకొన్నాడు! ''కలలోనైనా నీవిలా మాట్లాడు తావని అనుకోలేదు. నా శరీరం నీకు వచ్చినందుకు సిగ్గుపడుతావనుకున్నాను. కాని ఇలా కాసేపు తల ముఖ్యమనీ, కాసేపు శరీరం ముఖ్యమనీ చెబుతావను కోలేదు. ఇదివరకు ఎంతఅణకువగా, వినయంగా ఉండేవాడివి! ఇంతలో ఎంత మార్పువచ్చింది! ఎంత గీర్వణం పోతున్నావు! ఒక్కసారిగా సుందరికి సుఖమియ్య

కలిగింది నేనేనంటున్నావు నిజానికి నేను మాత్రమే సుఖమియగలను ఎవ్వరు ఎలా మాట్లాడినా ప్రయోజన మేముంది? వ్యర్థ ప్రసంగం తప్ప, సుందరి ఇక్కడే ఉందిగా, తనభర్త ఎవరో, తనకు ఎవరివల్ల సుఖందక్కుతుందో అదేనిర్ణయించుకుంటుంది ''

సుందరి ఆశ్చర్యచకితయై వారిద్దరి ముఖాలుచూచింది. నిర్ణయించుకోలేక, తన నిర్ణయాన్ని చెప్పలేక, తన ముఖాన్ని చేతులతో కప్పుకొని ఏడ్చింది.

''నేను నిర్ణయించలేను నేను కేవలం అబలను నేను నిర్ణయించలేను. ఈ దుర్ఘట విషయాన్ని నా మీద ఎందుకు వేస్తారు? నేను చేసిన తప్పుకు చాలసిగ్గుపడ్డాను, మొదట్లో ఇదంతా చాలా స్వల్పంగా కనిపించింది మొదట్లో మీరూసంతోషించారు. అందువల్ల నేను కూడ సంతోషించాను, మీ మాటలతో నా మనస్సు స్తంభించి పోయింది. నా హృదయం ముక్కలుముక్కలై పోయింది. శర్మా! నీవు చెప్పిన మాటల్లో అర్థం లేక పోలేదు అసలు సందేహింపవలసిన పనికూడాలేదు. నీ ముఖలక్షణాలున్న భర్తతో గాని నేను యింటికి పోవటానికి వీల్లేదు. నందుడు చెప్పిన దానిమీదకూడ నాకు సానుభూతి లేకపోలేదు అతని శరీరం అతని తల లేకుండా ఎంత శోచనీయంగా ఉందో ఇప్పటికీ నా కన్నులకు కట్టినట్టుగానేవుంది. నేను ప్రేమ పూర్వకంగా పిలిచింది. అతని తలే అయి ఉంటుంది. తలే నా భర్తో, మొండెమే నా భర్తో నేను తేల్చుకోలేను. నిజానికి అది నాశక్తికి మించిన విషయం అలాంటప్పుడు ఈ రెండిలో ఏదినాకు సుఖప్రదమో నేనెలా చెప్పుకోగలను? నన్ను బాధించకండి. ఈ సమస్యను నేను పరిష్కరించలేను. మీలో ఎవరు నా భర్తో నేను తీర్పు చెప్పలేను.'' 

రెండు నిమిషాలు ఎవరూ మాట్లాడలేకపోయారు. కొంతసేపటికి నందుడు ఇలాప్రారంభించాడు ''స్థితిగతులు ఇలా వున్నప్పుడు, సుందరితన భర్త ఎవరో చెప్పలేనప్పుడు మధ్యవర్తి తప్ప మరొకరు ఈ విషయాన్ని తేల్చటానికి వీల్లేదే ఇక్కడికి దగ్గరలో దమనమహర్షి ఉన్నాడు తన సర్వం సన్యసించి ఇంద్రియాలనన్నిటినీ సంపూర్ణంగా స్వాధీనం చేసుకొని తపస్సు చేసుకుంటున్నాడు. ఆయనకు ఇహలోక చింత ఏదీ లేదు. ఆయన దగ్గరకు వెళ్ళితే తప్పకుండా న్యాయం జరుగుతుంది. సుందరి సౌఖ్యవిషయమై అతన్ని తీర్పు చెప్పమందాము. మీరు ఇద్దరూ ఒప్పుకుంటే అతడు తీర్పు చెబుతాడు. ఆ తీర్పునుబట్టి నడుచుకుందాము. మీ కిష్టమేనా?''

''నిజమే, నందుడు చెప్పినది బాగున్నది. మనం వెంటనే బయలుదేరి అక్కడకు వెళ్లుదాము.'' అంది సుందరి – తాను నిర్ణ యించవలసిన బాధ తప్పినదన్న సంతోషంతో.

''నిజమే, ఇది మన అంతరాత్మలు తేల్చుకోవలసిన సమస్యకాదు బయటివారు నిర్ణయించాలి. ఆ మహర్షి వాక్యాన్ని నేను శిరసావహిస్తాను.'' అన్నాడు శర్మ.

వెంటనే ముగ్గురూ దేవాలయంనుంచి బయలుదేరి బండిదగ్గరకు వచ్చారు. అయితే, బండి ఎవ్వరు తోలాలన్న సమస్య వచ్చింది నిజానికి దారి ఎరిగివున్నవాడు నందుడు. కాని, అతనిచేతులు పూర్వంలాగ బలిష్ఠంగా లేవు ఎద్దు ఎటుపడితే అటు లాక్కొని పోవచ్చును. అందువల్ల శర్మ తొట్లోకూర్చొని పగ్గాలు పట్టుకున్నాడు. నందుడు సుందరి దగ్గర కూర్చొని స్నేహితుడికి దారి చూపిస్తూ ఉన్నాడు.

శర్మ : ''ఎంత దూరమో?''

సుందరి : అసలు ఈ ఆశ్రమానికి అవతల అరణ్యం తప్ప, మరెవ్వరూ లేరన్నాడే ఆ ఋషి.

నందుడు ఈ ఋషికి ముందు కనిపించిన ఋషి కూడ అలాగే అన్నాడు ఆయినా, మరొక ఋషి మనకు ఎలా కనిపించాడు?

శర్మ ఇలా అబద్ధాలు చెబితే, వీరికి ఒరిగేదేముంది?

సుందరి · ఏమో ఈ ఋషి పత్నులు లేకపోతే, మనం ఎప్పుడో వెనక్కు తిరిగిపోవలసివచ్చేది ఇంత ఘోరతపస్సు చేస్తున్నా, ఈర్ష్య వదలనట్లు కనిపిస్తూ ఉంది ప్రపంచంలో తమకన్నా ఘోరతపస్సు చేస్తున్నవారే లేరనీ, తాము లోకోత్తరులమనీ భావిస్తున్నట్లుంది. ఎంత తపస్సుచేసినా మగవాళ్ళకున్న స్వార్థం ఎక్కడకుపోతుంది? ఇంకొక ఋషి ఉన్నాడంటే ఇంతకంటగింపు దేనికి? వారి గొప్పతనాన్ని ఎవరు పంచుకో బోతున్నారు?

నందుడు . మహాత్ములకు ఇలాంటి దోషాలను అంటగట్టటం తప్పు. ఇంద్రియ దమనం కోసం వార హోరాత్రాలు తపస్సు చేస్తూవుంటారు అందువల్ల ఇరుగుపొరుగున ఇతరులు ఉన్నదీ, లేనిదీ ఎలా తెలుస్తుంది? ఈ సంగతి తెలియదంటేనే వారు ఎంత తీవ్రతపస్సు చేస్తూ ఉన్నారో స్పష్టమవుతూ వుంది



శర్మ : ఇప్పుడు ఆ గొడవంతా దేనికి? ఇదివరకు ఇక్కడికి వచ్చానన్నావుగదా, దమనమహర్షి ఆశ్రమం ఎక్కడుందో నీకు తెలీదా?

నందుడు : నేను వచ్చి చాలకాలమైంది. పైగా అప్పటి ఋతువువేరు, అందువల్ల చెట్లు, తీగలు గుర్తుపట్టటానికి వీల్లేకుండా ఉన్నాయి. పైగా దేహం కూడా మారింది అందువల్ల మరీ గుర్తుపట్టలేకుండా ఉన్నా.

ముగ్గురూ కాలినడకన వెళ్ళుతున్నారు. ఆ చెట్ల మధ్యగా బండిపోదు. పైగా ఆశ్రమపథాలలో బండిమీద ప్రయాణం అపచారంగా కనిపించింది అందువల్ల బండిని ఆశ్రమాలకు వెలుపల వదిలేసి బయలుదేరారు మూడు రోజులనుంచీ ప్రయాణం సాగుతూ ఉంది.

''ఆ తెల్లపీమ ఏమిటి?'' అంది సుందరి.

మిగతా యిద్దరూ తేరిపార చూచారు. ఇంకా సూర్యోదయం కాలేదు. చలిగాలి వీస్తూ ఉంది ''పుష్పవిశేషం, ఒకదినును పువ్వు అయి ఉంటుంది.'' అన్నాడు తెలుగు నిఘంటువులాగా శర్మ.

నందుడు ( తేరిపార జూచి) మహర్షి, మహర్షి!

సుందరి · ఈ చలికాలంలో అందులో తలబంటి నీళ్ళలో మహర్షి ఏం చేస్తూ ఉంటాడు?

నందుడు తపస్సు.

సుందరి : అదేమి తపస్సు? పుండువంటి చన్నీళ్ళలోనా?

శర్మ · అలా చెయ్యకపోతే తపస్సు ఎలా అవుతుంది?

''దమనమహర్షి దమనమహర్షి!'' అన్నాడు జాగ్రత్తగా చూస్తున్న నందుడు.

''అమ్మయ్య! ఎన్నిరోజులకు చేరుకున్నాము.'' అంటూ సుందరి నిట్టూర్చింది

''ఈ సరస్సు ఒడ్డున కూచుందాము. తపస్సు ముగించు కొని ఆయన ఇలాగే వస్తాడు.'' అంటూ నందుడు తన అలవాటుప్రకారం గొంతుకు కూర్చోబోయాడు, కాని అతని కొత్తకాళ్లు పద్మాసనం వేశాయి దీనినంతా చూస్తూ ఉన్న సుందరికళ్లు నవ్వాయి శర్మ బాసీపెట్టు వెయ్యాలనుకున్నాడు. కాని అతనికాళ్లు గొంతుకు కూర్చున్నాయి

''ఆయన తపస్సునుంచి యెప్పుడు లేస్తాడో?'' అంది సుందరి

''ఎప్పుడు లేచినాతప్పేదేముంది?'' అన్నాడు నందుడు.

దమన మహర్షి ఆ వుండువంటి నీళ్ళలో అలాగే కదలకుండా నిల్చున్నాడు. వచ్చిన వారిని చూడటం వల్లనో, చూడకపోవటంవల్లనో మహర్షి కదలలేదు. ఒక గంటసేపు ముగ్గురూ అలాగే కూర్చున్నారు తరువాత కొంతసేపటికి దమనమహర్షి తపస్సు చాలించి నీటిమీద అటూ యిటూ పోతూ ఉన్న విడి తామరాకు ఒకటి పుచ్చుకొని ఒడ్డుకు చేరుకున్నాడు.

బిత్తరపోయి కళ్ళప్పగించి చూస్తున్న సుందరి ''అదేమిటి అలా ఊడుస్తూ ఉంది! తామరాకుతో ఊడిస్తే ఎక్కడన్నా పాచివస్తుందా? ఆ మాత్రమన్నా తెలియదేం?'' అన్నది.



నందుడు : అలా అంటావేమిటి? వారే దమనమహర్షులు అరిషడ్వర్గాలను స్వాధీన పరచుకొన్న లోకోత్తర పురుషులు

సుందరి : అన్నట్లు మా ఊరి వైద్యుడు జ్ఞాపకం వస్తూన్నాడు

నందుడు దేనికి?

సుందరి : ప్రాణం పోయినా జ్వరం కట్టిందన్నాడు.

నందుడు (కొరకొరచూస్తూ) అతనికీ, ఈ ఋషికీ పోలికేమిటి?

సుందరి · లేకేం, అది ఎముకలగూడో మనిషో నువ్వు చెప్పేదాకా తెలియకపోయె ఇంద్రియాలన్నీ వాడి వత్తలై ఉడిగిపోయిన తరువాత ఇంద్రియాలను దమించటమేమిటి?

శర్మ . ఎందుకలా తామరపాకుతో ఊడుస్తాడు?

నందుడు ఆత్మవత్సర్వ భూతాని యః పశ్యతిసపండితః'' అనే వాక్యాన్ని మరచిపోయావా? తన కాళ్ళ క్రింద క్రిమికీటకాదులు నలిగి చస్తాయన్న భయంతో వాటికి నొప్పి తగలకుండా తామరపాకుతో ఊడుస్తున్నాడు.

సంస్కృత వాక్యమెన్నడూ ఎఋఖత: వెడలని నందుడు ఇప్పుడు సంస్కృత వాక్యాన్ని ఉదాహరించాడు. ఇది సుందరికి ఆశ్చర్యం కలిగించింది. ఆమె మనస్సులో ఏమి భావాలు పరుగెత్తాయో ఒక నిట్టూర్పు విడిచింది ఇంత విపరీత ప్రకృతి గల ఋషులు తనకు న్యాయం కలిగిస్తారా అన్న సందేహం కలిగిందేమో!

"ఎవరక్కడ? నరవాసన! పొండి దూరంగా వెళ్ళిపొండి! ఈ నిర్జనారణ్యంలో మీ కేమిపని? మా తపస్సు చెడగొట్టటానికి వచ్చారా? పొండి. పొండి!" అన్నాడు దమనుడు.

ఆపాదమస్తకం అతడు దిగంబరి. చర్మం ఎముకలూ తప్ప మరేమీ లేదు. అతని దేహం సుందరికి వికృతం కలిగించక పోయినా భయం కలిగించింది.

"మహాత్మా, క్షమించాలి. మీ గొప్పతనాన్ని విని స్వయంగా చూచి జన్మతరింప జేసుకొందామని వచ్చాము. మాంసకలుషితమైన యీ శరీరం సాగిస్తున్న జీవయాత్రలో కొన్ని చిక్కులు వచ్చాయి ఇంద్రియాలను జయించిన మీరు మా సమస్య పరిష్కరించ గలరని కొండంత ఆశపెట్టుకొని వచ్చాము మీ తపస్సుకు విఘ్నం కలిగించాలని రాలేదు దయ ఉంచి ఒకసారి జ్ఞప్తికి తెచ్చుకోండి. ఒకసారి మీ ఆశ్రమానికి వచ్చి మీ దర్శనం చేసుకొని వెళ్ళాను." అన్నాడు నందుడు. సుందరీ శర్మలు పక్కన నిలబడ్డారు.

"ఆఁ. ఎక్కడో చూచినట్లుంది నీముఖం మాత్రం గుర్తుకువస్తూ ఉంది. నీ శరీరం చాల మన్నితంగా మారినట్లుంది. మా ఆశ్రమానికి వచ్చిన ఫలితం ఊరికేనే పోతుందా?"

"మీ ఆశ్రమానికి రావటంవల్ల ఎంతో పుణ్యం లభించింది. కాని ఈ శరీరం మాత్రం ఇలా మారటానికి వేరే కారణముంది అందువల్లనే మేము ముగ్గురం ఇక్కడికి రావలసివచ్చింది. మాకిప్పుడు ఒక సమస్య ఏర్పడ్డది. ఇది మాకు తేలలేదు మీ వంటి తపస్సంపన్నులు, ఇంద్రియాతీతులు మా చిక్కును తీరుస్తారని వచ్చాము. దయతో మా కథంతా విని మీరు తీర్పు చెప్పండి. మీ నిర్ణయాన్ని శిరసావహిస్తాము" అన్నాడు నందుడు

"తథాస్తు! మొదట్లో మిమ్మల్ని ఇక్కడ నుంచి తరిమివెయ్యాలన్న భావం మాకు కలిగింది కాని ఆలోచించగా అదికూడ ఒక విధమైన కామంగా తోచింది కామాన్ని జయించటం మా ఆదర్శం. అందువల్ల మిమ్మల్ని తరిమివెయ్యటం మంచిదికాదని తరువాత పొడకట్టింది. అసలు జీవితానికి భయపడి ఇలా చేస్తున్నానేమో అనికూడ తోస్తూ ఉంది ఇలాంటిది కేవలం పిరికితనమౌతుంది. పైగా కామాన్ని సంపూర్ణంగా జయించడంకూడా కాదు పైగా మీలో ఒక స్త్రీ కూడా ఉన్నట్లుంది. అవునా? మా యింద్రియాలకు, మాకు మాత్రం కాదుసుమా? విశాల నేత్రాలు. సన్నవి పెదవులు, పీనస్తనాలు, విశాల జఘనం కనిపిస్తూ ఉన్నాయి. పాపపంకిలమైన మానవజీవితం మాకు తెలియనిది కాదు. మానుదౌర్బల్యాన్ని మేము గుర్తించక పోలేదు ఆ పెదవులను ముద్దుపెట్టుకోటానికి ఆ చన్నులను పుణకటానికీ. ఇంకా ఇంకా ఏదేదో చేయటానికి నీచమానవుడు ఎంత ఆలమటించిపోతాడు? దాన్ని ఆనందమంటాడు. ఆనందానికీ, తుచ్ఛసుఖానికీ ఎంతభేదముందో ఆ అవివేకికి ఏమితెలుసు? మూర్ఖుడు!

సుందరి లజ్జాక్రోధాలతో క్రుంగిపోయింది.

దమనమహర్షి మళ్ళీ ప్రారంభించాడు –

"మీ మగవాళ్లు ఇద్దరేవచ్చి ఉన్నట్లయితే, మా ఆశ్రమ వాటినుంచి మిమ్మల్ని తరిమివేసి

ఉండేవాళ్ళం కాని మీతో ఒక స్త్రీ వచ్చింది. అందువల్ల మిమ్మల్ని మేము తరిమివేయదలచుకోలేము దీనినిబట్టి మా మనస్సు ఆడదాన్ని చూచి మెత్తబడిందని అనుకోగూడదు. మానవుడికి ఆడదాన్ని చూస్తే మనస్సు చలిస్తుంది. చూడకుండా ఉన్నప్పుడు మనస్సును కట్టివేసుకోవటం అంత పెద్ద విషయంకాదు తొడమీద స్త్రీ ఉన్నప్పుడే మనస్సు చిక్కబట్టుకోవడం గొప్ప, అందుకోసమే మిమ్మల్నందర్నీ మా ఆశ్రమానికి పిలుస్తూ ఉన్నాము.''

మహర్షి ముగ్గురి ముఖాలు చూచాడు సుందరి ముఖంలో అతని కేమి కనిపించిందో చటుక్కున అన్నాడు:- ''ఓసి పిచ్చిపిల్లా! భయపడకు. వాయుభక్షణకే సంకోచించే మేము నిన్ను భక్షించములే! రా ఎందుకలా జంకుతావు? ఇదిగో కుటీరం ''

నలుగురూ కుటీరంవైపు బయలుదేరారు. మళ్ళీ మహర్షి సాగించాడు -

''ఈ కుటీరాన్ని కూడ ఈ తుచ్ఛమైనశరీరాన్ని రక్షించుకోటానికి నిర్మించుకోలేదు మేము ఆరుగాలము ఆరుబయట పండుకుంటాము అయితే కుటీరం దేనికి అన్న ప్రశ్నవస్తుంది. దాన్ని కేవలం కంద మూలాదులను ఉంచటానికి నిర్మించాము. వీటినికూడ తినము కందమూలాదులు లేనప్పుడు వాయుభక్షణ చేయక ఏమిచేస్తాడు? అది జఠరాగ్నిని జయించటంకాదు. కందమూల ఫలాదులు అందుబాటులో ఉన్నప్పుడు కూడ వాటిని విసర్జించి వాయుభక్షణ చెయ్యాలి అప్పుడే కామాన్ని జయించినట్లవుతుంది. కుటీరానికిపదండి ఫలాలిస్తాను, తిందురుకాని, మేము వాయుభక్షణ చేస్తూ ఉంటాము.'' 207

సుందరి ఎందువల్లనో నిట్టూర్పు విడిచింది, నంద, శర్మలు చెవులు దోరబెట్టుకుని వింటున్నారు.

''తరువాత మీరు చెప్పేకథను సావధానంగా వింటాము. మాకు వినే దమ్ములు లేవని అంటానికి ఎవరికీ వీలుండదు. కామ దూరులమైనమేము, కామాలను అనుభవించక పోయినా, ఆవిషయ జిజ్ఞాస, అంటే కామం, మాకు కలుగవచ్చును. అందువల్ల ఆ భావాన్ని, ఆ జిజ్ఞాసను పూర్తిగా త్రుంచివెయ్యాలి.

''అయితే మా ధైర్య మేమయ్యేటట్లు? అన్న ప్రశ్న రావచ్చు. కందమూల ఫలాదువట్ల ఎలా వ్యవహరిస్తున్నామో, యీ విషయాలలోగూడా అంతే. అయితే కందమూల ఫలాదులను తినకపోయినా, వాటి కమ్మని వాసనపీల్చి సంతృప్తి పడటంకోసం వాటిని సంపాదిస్తున్నామన్న సందేహం మాకు కలుగకపోలేదు. అయిన దానికి మా సమాధానం లేక పోలేదు వాటిని చూడటంవల్ల తినాలన్న తీవ్రకామం కలుగుతూ ఉంటుంది. ఇలాంటి తీవ్రకామాన్నే మేము జయిస్తూ ఉన్నాము అందువల్ల ఉన్న సందేహం తీరింది.

''కామోద్రేకం కలిగించే యీమెను కుటీరానికి తీసుకువెళ్లుతున్నామంటే, యీమె అందం చూచి ఆనందించాలన్న కామమైనా కలగటం లేదా అని అనవచ్చు నిజమే. ఈమె అందాన్ని చూట్టంవల్ల తన దానిని చేసుకోవాలన్న కామం బయలుదేరుతుంది. అలాంటి దానిని జయిస్తున్నాము అలాంటి అవకాశం కోసమే మిమ్మల్ని ఆశ్రమానికి పిలుస్తూ ఉన్నాము ఫలాదులు మీ కివ్వదలచాము. అయితే మీరు తింటూ ఉంటే, మేము ఆనందించటం లేదా? అదికూడా కామం కాదా? అంటే, నిజమే.

మీరు భుజిస్తూ ఉంటే, మేము ఆనందించటం జరుగుతుంది. ఇక్కడ ధర్మసూక్ష్మమొకటి ఉంది. మీరు యోగ్యులుగా కనిపిస్తూ ఉన్నారు. కాబట్టి మిమ్మల్ని మా శిష్యకోటిగా భావించి చెబుతూ ఉన్నాము. అహంకారాదులను వదలి ఋషులు బ్రహ్మైక్యం పొందాలి. మీరు భుజిస్తూ ఉంటే, మాకు ఎలా ఆనందం కలుగుతూ ఉందో తెలుసుకోవాలి. తింటున్న మీ భావాన్ని మేము పొందాలి. అంటే మమత్వం పోయి, అంటే అహంకారాదులు పోయి మీలో ఐక్యమౌతున్నామన్నమాట. అంటే ఆత్మను తెలుసుకోగలుగుతున్నాము. ఇలాంటి శక్తిని పెంపొందించుకొని అద్వైతసిద్ధిని పొందుతున్నామన్నమాట.

''ఇదంతా మీకు అగమ్యగోచరంగా ఉంటుంది. అసలు తత్త్వస్వరూపమే అలాంటిది. శారీరక, మానసిక, ఆధ్యాత్మిక కామ ఇచ్ఛాదులు తిలతండుల న్యాయంగా కలిసి ఉంటాయి. ఎలాంటివారికైనా విభజించటమనేది చాల కష్టసాధ్యం.

''ఏది ఎలా ఉన్నా, ధైర్యముండాలి. మీ ముగ్గురూ మా కుటీరానికి రండి. మీ కథంతా సావధానంగా విని తీర్పుచెబుతాము. ఈ నిర్ణయం మాత్రం నిష్కామంగా చెబుతాము. ఇలా చెప్పటం కూడ కుతూహలం ఉండి కాదుసుమా!''

నందుడు ''నేను చెప్పలేదా?'' అన్నట్లు శర్మవైపు చూచాడు. నిజమేనన్నట్లు శర్మ నందునివైపు చూచాడు. సుందరి సిగ్గు దొంతరతోనే తలవంచుకొని వారి వెంట నడిచింది.

రెండు నిమిషాల్లో నలుగురూ ఒక వృద్ధ కదంబ తరవు దగ్గరకు వచ్చారు. ఆ చెట్టు మొదట్లో పెద్ద తొఱ్ఱవుంది. ఆ తొఱ్ఱే దమనుడి కుటీరం. తామరపాకుతో ఊడ్చి ముగ్గుర్నీ ముంగిట కూర్చోబెట్టి లోపలికివెళ్లి ఫలాలు తెచ్చి యిచ్చి పద్మాసనం వేసుకుని కూర్చున్నాడు. నడిచిన కథంతా పూసగుచ్చినట్టు చెప్పవలసిన బాధ్యత శర్మమీద పడింది.

కాళి ఆలయంలో జరిగిన ఘట్టాన్ని ఎత్తుకొని చెప్తేతే సరిపోయేదేకాని, కృష్ణశర్మ తన బాల్యం నుంచీ జరిగిన కథంగా చెప్పాడు. అతడు చెబుతున్నంతకాలం సిగ్గుతో సుందరి తలవంచుకొన్నది. శర్మ తమ కథను చక్కగా చెప్పటం వల్ల సుందరీ నందులకు ఆనందం కలిగింది. వెనకటి ఘట్టాలన్నీ మళ్లీ కన్నులకు కట్టినట్లు కనిపించాయి. దమన మహర్షికి ఏమనిపించిందో చెప్పటం కష్టం. అతడు జితేంద్రియుడు కదా!

''ఇదీ జరిగిన కథ. సుందరి ఎవరి భార్య? తాము సెలవివ్వాలి. మీ తీర్పును బట్టి నడుచుకొంటాము.'' అన్నాడు శర్మ.

''చిత్తం. సెలవివ్వండి.'' అన్నాడు నందుడు. దమనుడి నిర్ణయంకోసం క్రీగంట చూస్తూ ఉంది సుందరి.

దమనుడు నిట్టూర్చి ఇలా అన్నాడు: – ''మీ కథంతా వింటూ ఉంటే, మాకు పంచాగ్నుల మధ్య తపస్సు చేసుకోటమే తేలికనిపిస్తూ ఉంది. కథ వింటున్నంతకాలం మా మనస్సు చీకాకు పడింది. గంగామృత్తిక ఆపాదమస్తకం ఒత్తుగా పూసుకొన్నాం కాబట్టి మా వికారం మీకు తెలియటం లేదు.

కాని, మిమ్మల్ని చూస్తే జాలికలుగుతూ ఉంది తుచ్ఛ ఇంద్రియాలకు లోబడి గానుగఎద్దులాగ ఎలా తిరుగుతున్నారో ఆలోచించారా? ఈ ఇంద్రియ సుఖాలను వదులుకోలేరా? ఎంతకాలం ఇలా ఎండమావి వంటి సుఖం కోసం ప్రాకులాడుతారు? ఆ సుఖం మా పెద్దం కానిదికాదు. కామం కళ్ళుపొరదట్టి – ఆ ఎర్ర పెదవుల్లో ఏముందనో – ఆ చక్రస్తనాలలో, ఆ చుబుకాలలో ఏముంది? ఆ జఘనం విశాలంగా ఉంటే ఏ మొరిగింది? అని తతనితంబాలంటారు కాబోలు! ఎన్ని పాట్లు పడతారు? ఆ అల్పకాల సుఖంకోసం పరస్పరోద్రేకాలను పెంపొందించుకొంటూ ఉంటారు. ఇదంతా నేనెరుగకపోలేదు.''

సుందరి చప్పున పెడముఖం పెట్టుకొంది శపిస్తాడన్న భయంకూడా ఆమెకు కలుగలేదు

''ఈ విషయం మాకూ తెలుసు దయవుంచి మీ నిర్ణయాన్ని చెప్పండి! సుందరి ఎవరి భార్య?'' అని అడిగాడు నందుడు ''నేను చెప్పిన దానిని బట్టి నా నిర్ణయమేమిటో తేలిపోయింది. తేలిపోయిన విషయాన్ని గూర్చి తీర్పు చెప్పమనటం నాకు ఆశ్చర్యం కలిగిస్తూ ఉంది స్నేహితుని మస్తకం ఎవరి భుజాలమీద ఉందో సుందరి వారిది. పాణిగ్రహణం కరగ్రహణంతో జరుగుతుంది అంటే సుందరి కరగ్రహణం చేసిన చేయికలవారిదే సుందరి.'' అన్నాడు దమనుడు.

కూర్చున్న నందుడు ఉత్సాహంతో ఒక్కసారిగా నిలబడ్డాడు సుందరీ శర్మలు తలలు వంచుకొని అలాగే ఉన్నారు.

''కాని నా నిర్ణయం అప్పుడే తేలలేదు నేను చెప్పినదంతా ఉపక్రమణికే. కాసేపు ఆగు '' అంటూ దమనుడు లోపలికివెళ్ళి పారుటాకులతో నిర్మించిన పొడుగాటి చొక్కాను తీసుకొచ్చాడు. ఈ చొక్కా నేనొ తానా?'' అలాగే అవయవాలన్నీ వివాహితాలు కావచ్చుకాని అన్నిటిలో శిరస్సు ప్రధానం అందుకనే దీన్ని ఉత్తమాంగం అన్నారు. అందువల్ల భర్త్ప శిరస్కుడైన వానిదే సుందరి'' అన్నాడు దమనుడు

సుందరీ శర్మలు సంతోషంతో ఒకరిముఖం ఒకరు చూచుకొన్నారు

''మీరు మొదట్లో ఇంకోవిధంగా చెప్పారే?'' అన్నాడు నందుడు నిరుత్సాహంతో.

''నేను తేల్చి తుదికి చెప్పినదే నా నిర్ణయం ''

దమనమహర్షి చెప్పినట్లు నడుచుకొంటామని చెప్పింది తానే కనుక నందుడు నోరెత్తలేకపోయాడు. పైగా, అతడు చెప్పిన కారణాన్ని కాదనలేక పోయాడు ముగ్గురూ దమనమహర్షికి నమస్కరించి సెలవు తీసుకొని బయలుదేరారు ముగ్గురు కొంతదూరం కలిసిపోయారు ఈ లోగా ఎవ్వరూ మాట్లాడలేదు, కొంతదూరం పోయిన తరువాత ''ఇక సెలవు తీసుకొంటాను. నిర్జనారణ్యానికి వెళ్ళి తపస్సు చేసుకొంటాను. ఇలా తపస్సుకు వెళ్లాలని చిన్నప్పటినుంచీ ఎంతో ఉవ్విళ్లూరుతూ ఉండేవాణ్ణి '' అన్నాడు నందుడు నెమ్మదిగా దీనికి సుందరీ శర్మ లిద్దరూ కాదని మందలించలేక పోయారు మొదట్లో కొంతకష్టం వేసినా, చివరికి ఒప్పుకున్నారు. శర్మ నందుని భుజంతట్టి '' ఈ శరీరాన్ని అతిగా తపింపజేసేవు. శరీరముంచేగదా తపస్సు సాగటం '' అని శర్మ కొంత జాలిగా అన్నాడు

''నా సంగతి నాకు తెలుసులే.'' అని విదిలించుకొన్నాడు నందుడు

సుందరి అతన్ని అనునయించబోయింది. కాని ప్రయోజనం లేకపోయింది. శర్మ కొంత వెనక ఉండగా నందునితో మెల్లగా అంది. నీవు విచార పడవద్దు పూర్వం నీదైనశరీరాన్ని ఆ కంఠపాదం చాల జాగ్రత్తగా చూచుకొంటాను. ఎంతో అప్యాయంగా చూచుకొంటాను. పూజిస్తాను. నీ సంతోషానికి కృతజ్ఞత తెలుపుతా

''ఆ సత్కారాలన్నీ నాకే చేరుతాయిగదూ?'' అని పుల్లవిరుపుమాట అన్నాడు.

''అప్పుడప్పుడూ నీ తలనుగూర్చి కూడ కలలు కంటూ ఉంటాను.'' అని కూడా అని చూచింది.

''అవన్నీ నా అనుభవానికి అతీతం.'' అన్నాడు నిరుత్సాహంగా నందుడు.

ఇరుపక్షాలు చీలిపోయాయి. ఇద్దరొక ప్రక్కగాను, ఒకరు మరొక ప్రక్కగాను బయలుదేరారు నందుడు కొంచెందూరం పోయింతరువాత సుందరి అతని దగ్గరకు పరుగెత్తికొని వెళ్ళి ''ఏది ఎలా ఉన్నా, యిప్పటి యీ నా శరీరమే నాకు తెలిసినంతట్లో. మొట్టమొదటిసారి ప్రేమంటే, ఏమిటో బోధించింది. ఆ ఎములగూడు ఏమి తీర్పుచెప్పినా, నీ వల్లనే నాకు గర్భమేర్పడింది.'' అన్న మూడు ముక్కలు అతని చెవిన వేసి తిరిగి శర్మ దగ్గరకు వెళ్ళింది.



సుందరి శర్మతో పుట్టింటికి వచ్చింది. వారితోపాటు నందుడు కూడా వచ్చి ఉన్నట్లయితే ఊళ్ళోవాళ్ళు విడ్డూరపడి ఉండేవాళ్లు, ఎన్నో ప్రశ్నలు వేసి ఉండేవాళ్లు. ఎన్నో గుసగుసలు బయలుదేరి ఉండేవి. కాని, నందుడు మాత్రం వారి వెంటరాలేదు అందువల్ల శర్మలో వచ్చిన మార్పు అతని బంధువులకు కాని, ఊళ్లోవాళ్లకు కాని పట్టివ్వలేదు. అలాంటప్పుడు అసలు అతడు శర్మకాడన్న సందేహం ఎలా కలుగుతుంది?

మనమిత్రుడో, బంధువో, లేక చిరపరిచితుడో పూర్వ శిరస్సుతో మన గదిలోకి వస్తాడనుకోండి. అతని శరీరంలో ఎన్ని మార్పులున్నా. అతని గొంతులో ఎంత వ్యత్యాసమున్నా అతన్ని మనం వెంటనేగుర్తిస్తాము, పలుకరిస్తాము. మనకు ఆశ్చర్యం కలిగినా, వచ్చిన మార్పులనుగూర్చి ప్రశ్నించినా, అతనితో మనం పూర్వంలాగానే మెలగుతాము.

శర్మవిషయంలో కూడా ఇంతే జరిగింది.

ఇక్కడ మరొకవిషయాన్ని మరచిపోగూడదు. శర్మను ఆ ఊరివారు పెండ్లి సందర్భంలోనే చూచారు. పెండ్లి ఆయిన తరువాత 18 మాసాలకుగాను మళ్లీ అతన్ని చూడటానికి ఇదే మొదలు. పెండ్లికి ముందు సన్నగా, గాలికిపడిపోయేట్లుండే వ్యక్తులు పెండ్లి అయింతరువాత అంటే పునస్సంధానం జరిగింతరువాత చప్పున తేలటం కద్దు. త్వరగా గుర్తు పట్టరానంత లావు కావటం కొత్తకాదు

శర్మలోని మార్పుకుకూడా ఇదే కారణమని ఊళ్లో వాళ్లు అనుకొని ఉండవచ్చును

ఏది ఎలావున్నా శర్మను గుర్తు పట్టకపోవటం కాని, జరిగిన కథను తెలుసుకోవాలన్నంత కుతూహలం రేకెత్తటం కాని జరగలేదు.

సుందరీ శర్మలు ఇంటికి వచ్చేటప్పటికి మసక చీకటి పడింది. ఎన్నాళ్ళకో వచ్చిన అల్లుని, కన్న కుతుర్నీ చూచుకొని అత్తమామలు ఎంతో సంతోషించారు ఎన్నో కుశలప్రశ్నలు వెయ్యటం మొదలెట్టారు. శర్మ తల్లిదండ్రుల ఆరోగ్యం దగ్గరనుంచి పెండ్లినాడు అరణమిచ్చిన ఆవుసంగతి వరకు అడిగారు. శర్మ అన్నిటికీ సమాధానమిచ్చాడు. సంభాషణ జరిగి జరిగి అరణపు ఆవుమీద సాగుతూ ఉంది. సుందరీ, అత్తవింటూ ఉన్నారు. మామ అన్నాడు–

"అది ఎంతకులం గలదనుకొన్నావు?"

"అందుకు సందేహమా? ఎంతో సాధువులే." అన్నాడు శర్మ.

"సరిగా అమ్మాయి గుణాలే దాని" వని అత్త కూతురు ముఖం చూసుకొని మురిసిపోయింది

"ఏమో! ఆ సంగతి మీ అమ్మా కూతుళ్ళకే తెలియాలి "

"పోట్లమారిదైతే అయ్యగారి సంగతి తెలిసివుండేది " అని సుందరి చిర్నవ్వు నవ్వింది.

"పోట్లమారిదా? పసిపిల్లలు దగ్గరకు వెళ్ళినా ఏమనదు. మంచి జీరగలది. ఎంత డబ్బుపోసినా మళ్ళీ అలాంటిది దొరుకుతుందా?" అన్నాడు మామ

"నిజమే పాలు ఎంత బాగా ఇచ్చేదనుకున్నావు! ఒకనాడు కూడా కాలు కదిపిన పాపానపోలేదు. ఈ మధ్యనే కట్టింది" అని శర్మ భార్యవైపు చూచాడు సుందరి కన్నులు సిగ్గు తొడిగాయి,

"అమ్మా! పొద్దుపోలా! ఆయన ఎంతో దూరం నుంచి నడిచివచ్చారు. ఆకలి అవుతూవుండాలి "

"నన్ను వంకపెట్టుకోటం దేనికి? నీకే ఆకలి అవుతుందని చెప్పరాదు?" అన్నాడు శర్మ.

"నాయనా! లే ప్రొద్దుపోయింది పట్టుబట్టకట్టుకో" అంటూ అత్త లోపలికి పోయింది.

"స్నానం చెయ్యాలి" అంటూ శర్మ భార్య వెనుక ఇంట్లోకి వెళ్ళాడు, మామమాత్రం అరుగుతో సహా అలాగే దిగడ్డాడు.

అంగవస్త్రం కట్టుకొని శర్మ బావిదగ్గరకు వెళ్లాడు అతడు గిలకమీద తాడువేసి పెద్దచెంబు బావిలోకి వదలి మునిగిం తరువాత లాగాడు ఒక్కసారిగా చెంబు వచ్చి గిలకకు కొట్టుకొని నీళ్ళన్నీ చిందిపోయాయి. బరువుగా ఉందనుకొని తేలిక పెట్టైను ఎత్తితే ఏమిజరుగుతుందో శర్మకుకూడ అదేవని జరిగింది అంతే, నడుముమాత్రము పట్టుకుపోలేదన్న మాటేగాని అంత అవస్థా జరిగింది. అతనికే ఆశ్చర్యం కలిగింది ఏలాగైతేనేం అతడు స్నానం చేశాడు.

సుందరి ఏదో సాకుచెప్పి తానే స్వయంగా భర్తకు వేరుగా వడ్డనకు పూనుకొన్నది. శర్మవచ్చి కూర్చున్నాడు అన్నం వడ్డించిన సుందరి భర్తవంక చూచి మెల్లగా నవ్వింది.

"ఎందుకు నవ్వుతున్నావు?"

"ఆఁ, ఏమీలేదు."

శర్మ అటూ, యిటూ చూచాడు ఏమీ కనిపించలా, తన్ను తాను చూచుకొన్నాడు. ఏమీ కనపడలేదు. " ఎందుకు నవ్వుతున్నావు?" అని భార్యను మళ్ళీ అడిగాడు

''శూద్రుడిలాగా అలో గొంతుక కూర్చుంటే నవ్వువచ్చింది.''

''ఓహో, ఇంతేకదా,'' అని బాసిపెట్టువేసుకొని ఆపోశనపట్టి భోజనం చేస్తూ ఉన్నాడు సుందరి భర్తవంక చూస్తూ ఉంది.

''మజ్జిగ''

''అన్నం తెమ్మంటారా?''

''అక్కర్లేదు''

ఆమె పాలువడ్డించి పెరట్లోకి వెళ్లింది శర్మ భోజనం చేసి భార్యను పిలిచాడు ఉత్తరాపోశనకు నీళ్ళు లేవు కామాలనుకుని మంచినీళ్లు తెచ్చి చెంబులో పొయ్యబోయింది చెంబునిండా నీళ్లున్నాయి.

''ఎందుకు పిలిచారు?''

''అన్నం కావాలి.''

''ఇందాక వడ్డిస్తానంటే వద్దంటిరే.'' అని ఆమె నవ్వింది.

''ఇందాక సరిపోతుందనుకున్నాను, చాలలేదు, నవ్వటం దేనికి? ఆకలి దాచుకుంటారా? నాకు తెలియదులే.'' అని సిగ్గుతో ముఖం వంచుకున్నాడు.



సుందరి మళ్ళీ అన్నం పాలు వడ్డించింది. అతడు భోజనం చేసి, లేచాడు.

తరువాత ఇంట్లో భోజనాలు ముగిశాయి సుందరి తల్లికి అత్తవారింటి సంగతులు, తన ఇరుగుపొరుగున ఉన్న బ్రాహ్మణ్యం సంగతి చెప్పింది తన స్నేహితురాండ్రు ఎవరెవరు ఎలా ఉండేది, ఎవరెవరు అత్తవారింటికి వెళ్ళినది కాన్పుకు ఎవరెవరు పుట్టింటికి వచ్చిందీ, ఎవరెవరికి మనుములు వస్తున్నదీ పూస గుచ్చినట్లు చెబుతూ తల్లికి తన అత్తవారి ఊరు ఒకసారి కన్నులకు పొడకట్టేటట్లు వర్ణించింది. ఇంతలో గదిలో చదువుకుంటున్న భర్త మంచి నీళ్ళని పిలిచాడు.

''సరే, ప్రొద్దుపోయింది ఆయనకు మంచి నీరు తీసుకెళ్లు'' అని తల్లి లేచి వంట యిల్లుసర్ద సాగింది సుందరి మాత్రం లేవకుండానే ఇంకా కబుర్లు చెబుతూ కూర్చుంది '' ఎప్పుడున్న సంగతులే కదా, ఆయనకు మంచినీళ్లు తీసుకెళ్లుదూ'' అని తల్లి మరొకసారి హెచ్చరించింది.

సుందరి బద్ధకంగా, తల్లిమాటలను తీసివేయలేని దానికి మల్లే లేచి మంచినీళ్ళ చెంబుతో భర్తగదిలోకి వెళ్ళింది అతడు ముసుగుపెట్టుకొని నిద్రపోతూ ఉన్నాడు.

''ఇప్పుడేకదా, మంచినీళ్ళన్నది అంతలోనే నిద్రపోయారా!'' అంటూ ఆమె చెంబు మంచం క్రింద పెట్టింది భర్త ఉచ్ఛ్వాస నిశ్వాసాల అసమత చూచి

''ఈ దొంగ నిద్రలు ఎప్పటినుంచో?'' అంది.

అతడు మాట్లాడలేదు. సుందరి బల్లమీద కూర్చొని వెండి పళ్ళెంలో ఉన్న తమలపాకులను తీసుకొని కవటాకులను ఏరి వాటిని శుభ్రంగా మంచి గుడ్డతో తుడిచింది ఒక్కొక్క ఆకే తీసుకొని జాగ్రత్తగా వెనుక భాగంలోని తెల్లపొరను అత్యంత సూక్ష్మమైన ఈనెలతో సహా తీసివేసింది. ప్రతిదానికి

సరిపోయిన మంచి సున్నంరాసి వక్క-పొడి పోసి చిలుకలు చుట్టి "ఇదిగోనండి తాంబూలం" అంది. అతడు మాట్లాడలేదు "పాపం! మంచి నిద్రపట్టింది" అంటూ సుందరి ఎడమచేత్తో శర్మ ముక్కు గట్టిగా పట్టుకుంది అతడు నోరు తెరవక తప్పలేదు ఆ అవకాశం తీసుకుని కుడిచేతిలోని ఆకు మడుపులను నోటిలోకుక్కింది. అతడు సుందరి వేళ్ళు పట్టుకొన్నాడు.

"అబ్బబ్బ, ఏమిటండి?" సుందరి ఒక్కసారి మంచం ప్రక్కన చతికిలబడింది.

"ఏమిటేమిటి?" అంటూ శర్మ పండుకున్న వాడల్లా ఒక్కసారిగా లేచికూర్చున్నాడు. ఈ మాత్రానికే తన భార్య ఎన్నడూ ఇంత బాధ పడలేదు.

"వదలండి పుణ్యముంటుంది"

"ఈ మాత్రానికేనా?" భార్య ముఖంలోకి చూచాడు. సుందరి కన్నులు దాదాపు చెమ్మగిల్లాయి.

"మీ కలాగే ఉంటుంది."

ఆతడు చెయ్యివదిలాడు. ఆమెలేచి వేళ్ళు ఊదుకొంటూ సవరించుకోసాగింది.

"పాపం, ఎంత నొప్పెత్తాయి! నే నూదుతాను ఇలా యివ్వు."

"వద్దులెండి. మనసంగతి ఎవరెరుగనిదిలే." అంటూ చెయ్యి వెనకదాచుకొంది.

"అబ్బే! నేనేమీ చెయ్యను" అంటూ శర్మ ఆమె చేతిని తీసుకొని చూచాడు. అ సన్నటివేలిమి శలాకలు కొలిమిలో పెట్టి ఎర్రగా కాల్చినట్లుగా ఉన్నాయి

"నిజంగానే కందిపోయాయే"

"లేదు పాపం! చాల సుతిమెత్తని వారైతిరి."

"నేను మొరటువాణ్ణా?"

"లేదు ఈ ముక్కు ఎంత సన్నమో, మీరు అంతే" నంటూ ముక్కు పట్టుకులాగింది.

"నాముక్కుకేం?"

"పెండ్లప్పుడే ఈ ముక్కు చూచి ఉండాలిసింది."

"ఏమిచేసేదానివి?"

"ఎవతె పెండ్లిచేసుకొనేది? అందులో ఈ ముక్కు చూచింతరువాతనా?" అంటూ మళ్ళీ సుందరి అతని ముక్కు పట్టుకొంది. శర్మ ఆమె చెయ్యిపట్టుకొని మెల్లగా లాగాడు అమాంతంగా సుందరి మంచం మీదికి వచ్చి పడింది

"మోటు సరసాలను పోనిమ్మరుగా?" అంటూ అతని కంఠానికి చేతులు పెనవేసి "ఇక నన్నేం చేస్తారు?" అంది.

"ఏమి చేస్తానా, ఈతడవ నెడితే ఒకమ్మాయి వాకిలి దగ్గరకుపోయి పడుతుంది.

"అబ్బే, ఆ అబ్బాయికి సాధ్యంకాదు" అంటూ సుందరి గట్టిగా కావులించుకుంది.

శర్మ పాదుగాటివేయి తలమీద నుంచి మెల్లగా జడ మీదుగా వెళ్ళింది. అతని వేళ్ళు పిరుదులమీదికి ప్రాకాయి. జడకొన తగలలేదు.

సుందరి తన జడకొసను అతని చేతికి అందించింది చెక్కిలికి గిలగింతలు పెడుతున్న ఎదురు రొమ్ముపై రోమాల గుండా ఆ మెత్తని సన్నటి వ్రేళ్ళు ప్రాకుతూవున్నాయి.

''విచిత్రం.'' అని సుందరి ఆకస్మికంగా అంది

''ఏమిటి?''

''మీ ఒళ్ళు,''

''ఏం; చేతులు అలా వణుకుతున్నాయేమిటి?''

''అబ్బే లేదు.... కాని మీ శరీరం...''

''ఎలా వుంది?''

'' ... ఏదోగా ....పోనిద్దురూ''

''ఎలావుంది! చెప్పవూ?'' ముద్దుతో ప్రాధేయపడుతూ అడిగాడు.

''ఆ!..... ఏమిలేదు ..... కొత్తగా ఉంది.''



''మీ అమ్మా నాన్నావాళ్ళుకూడ అలాగే అనుకున్నారా?''

''మీకు కాస్త వొళ్ళు వచ్చిందనుకున్నారు''

''అంతేనా''

''అంతే''

''పాపం నందుడు యీ చీకట్లో అధ్వానపు అడవిలో ఏమి చేస్తున్నాడో?''

''నువ్వేగా అతన్ని అడవికి పంపించింది?''

''నేనా?''

''మరెవ్వరంటా?''

'' ఆ కాళికాదేవి సంకల్పమే''

'' ఆ జగజ్జనని నిన్ను తలలు మార్చమందా ఏమిటి?

''మార్చమందని నేనంటున్నానా? ఆ తొందరలో పొరపాటు జరిగింది.''

''నందునికి చెప్పినట్లు చెబుతావే? ఈ దేహం కావాలని నీవు కోరలేదు?''

''ఛీ, మాట్లాడకండి. ఎవరన్నా వింటే నిజమనుకొనేరు''

''ఈ దేహాన్ని గూర్చి నువ్వు ఎన్ని సార్లు నిద్రలో కలవరించలేదు? నీకు నువ్వు చెయ్యాలనుకొనే చేశావు?''

సుందరి ముఖం ఎర్రబడింది దీపపువెలుగులో అతనికి మార్పు కనిపించలేదు.

''దేవిపాదాల సాక్షిగా చెబుతున్నా, నేను చెయ్యాలని చేయ్యలేదు.'' ఆమె గొంతులో గాద్గద్యం కనిపించింది

ఇంత నిష్ఠురంగా అన్నందుకు శర్మ నొచ్చుకొన్నాడు. ఆమెనుచూచి జాలివడ్డాడు ఆమె ముఖాన్ని తనచేతుల్లోకి తీసుకొని ముద్దెట్టుకున్నాడు.

''కేవలం నువ్వు చేశావని చెప్పటానికి వీల్లేదు దీనికి దేవికూడ బాధ్యురాలే. తలలు మార్చేవు సుమా. అని ఒకమాట అని ఉంటే సరిపోయేది ''

''అయితే ఈ మార్పు మీకు ఇష్టం లేదన్నమాట.'' అన్నది ముక్కు చీదుకుంటూ.

''లేకేం, కాని ఆ మహర్షి అంత నిష్కామంగా తీర్పుచెప్పబట్టిసరిపోయింది. లేకపోతే యీ అమృతపు ముద్దు నాకుదక్కేదా?''

ఫణాఫలకం భూధరాన్ని నులిమి వెయ్యాలని చూచింది.

''ఆ ఋషి నిష్కాముడనీ, స్వార్థరహితుడనీ మీ మగవాళ్లు మురుసుకోవలసిందే'' ఆవరిస్తూ ఉన్న చేతిని మెల్లగా తీసివేసింది

''అతనికి కామమూ, స్వార్థమూనా?''

''మీకు కనిపించలా?''

''తప్పు, అలా అనకూడదు '' ఫణాఫలకం తిరిగి భూధర శిఖరాన్ని అధిరోహించింది

''అయితే మొదట్లో ఒక విధంగాను, తరువాత మరొక విధంగాను ఎందుకు తీర్పు చెప్పాలి?''

''రెండు తీర్పులు చెప్పలేదే?''

''మీకు అంతా ఒకటిగానే కనిపిస్తుంది. ఉండండి చెప్పనియ్య రేం?''

''నాకేమీ తెలియటం లేదు ''

''ఎదుటి మనిషిని నలిపివెయ్యటం తప్ప మరొకటి తెలుస్తుందా? అతని మాటలన్నీ మీకు జ్ఞాపకమున్నాయనుకొంటాను స్త్రీలను చూస్తే కామం కలుగుతుందనీ, అలా తీవ్రంగా కలిగే కామాన్ని అణచుకోవటమే గొప్పనీ అన్నాడు. నన్ను చూచినప్పుడు కలిగిన వికారాన్ని అణచుకోవటంకోసం పాణిగ్రహణం చేసిన చెయ్యి ఉన్నవారికేనేను భార్య నౌతానన్నాడు కాని, వెంటనే తన వికారాన్ని గుర్తించి అసలు తీర్పు చెప్పాడు, అప్పుడుకూడ అతడు నేనుగా భావించుకొని మరి తీర్పు చెప్పాడు. ఇదంతా నిష్కామమే కాదూ?''

''ఇంతకూ ఆయన నందునికి అన్యాయం చేసే ఉంటాడా?''

''అన్యాయం చేశాడని చెప్పానా?''

''సకామకర్మం ఏమవుతుంది అన్యాయం కాక?''

''అయితే మీరిప్పుడు అన్యాం చేస్తున్నారు పసిపిల్లను చేసి ఇలా చేస్తారా? అబ్బబ్బ! వదలండి. ఎముకలు కూడ దక్కేటట్లు లేవు ''

''నిజంగా అన్యాయమే''

''సకామంగా చేసినా, నిష్కామంగా చేసినా సమాజానికి అనర్థకం కలిగించనిపని అన్యాయం కాదు అబ్బా, ఉండండి... వినిపించుకోరేం? కాస్తగాలి పీల్చుకోనీండి ''

''అన్యాయం కాదుగా''

''మీ వేళాకోళాలు మానుతార లేక...'' గాజులు గల్లుమన్నాయి

భూమి గుండ్రంగా లేదనీ, తామరమొగ్గలు చిన్నవనీ కాదంబిని పువ్వులు వర్షించదనీ, వాసంతీలత చెమరదనీ, శర్మకప్పుడే తోచింది విశ్వవిశ్వంభరుని విలయం ఎలా తనలో లీనంచేసుకో గలుగుతూ ఉంటుందో అతనికి అవగతం కాలేదు

త్రియామతారకలు అర్ధనిమీలతా లయ్యాయి. మేఘాలు చిక్కుచీరయ్యాయి. నిశ్వాసపవనాలు స్వైరికి వెడలాయి. ముకుళిత కమలదళాల మీద హేమబిందువులు మెరుస్తూవున్నాయి.

ప్రతిరేయీ ఇలాగే గాఢంగా విశ్వసించినా, విశ్వసించకపోయినా నాకు ఈ సుందరికథ వ్రాసేబాధ కాని, మీకు వినేబాధకాని వుండేదికాదు. కాని అలా జరగలేదు.

216 తరువాత జరిగిన సంఘటనలు అర్థం చేసుకోవాలంటే చాల చిక్కులున్నాయి. ఎందుకంటే ఈ సంఘటనలు ఎప్పుడు జరిగాయంటేనేను చెప్పలేను. ఆ సుందరికాని, శర్మకాని మరొకరుకాని అంతకన్నా చెప్పలేరు పైగా వీటిని అర్థంచేసుకోవటంలో పెద్దచిక్కువుంది ఒక్క సంఘటన ఒక్కొక్కరికి ఒక్కొక్క విధంగా అర్థమౌతూ ఉంటుంది. వాటినిబట్టి ఒక్కొక్కరి భావాలు ప్రవర్తనలు మారుతూ ఉంటాయి. ఇలా జరిగినప్పుడు స్థితిగతులు మరీ క్లిష్టాలవుతాయి వీటిని అర్థమయ్యేటట్లు చెయ్యాలంటే ఎవరికి సాధ్యపడుతుంది?

శర్మకు నందుని దేహం లభించింది. దమనమహర్షి శిరస్సే ప్రధానమని చెప్పినా, ''నేను'' ''నా'' అన్న భావాలలో మార్పు లేకపోయినా, అసలు మార్పు ఉండదని ఎవరూ చెప్పలేరు ఆరోగ్యస్థితిలో ఉన్నప్పటి భావాలకూ, జబ్బుస్థితిలో ఉన్నప్పటి భావాలకూ, ఎంత తేడా ఉంటుందో మనకు తెలిసిందే. అంటే మనస్సుకూ శరీరానికి పరస్పర సంబంధంవుంది మనస్సుకు శరీరం మీద పెత్తనం లేకపోలేదు. కాని శరీరం మన పోలీసుల లాఠీచార్జి లాగా, బ్రిటిష్ రాజకీయతంత్రంలాగా పైకి కనిపించకుండానే తనపని కాస్త చేసుకుపోతుంది. జితేంద్రియుల మని గప్పాలు కొట్టుకొనే వారు, దానిని మెచ్చుకొనేవారు, తమ తమ హృదయ చరిత్రలను చదువుకొంటే సత్యం బోధపడకపోదు అప్పటికీ కాదు పట్టిదేనని ఆత్మ వంచన చేసుకొంటే ఎవరేమీ చెబుతారు?

ఇంతకూ శర్మకు దక్కిన నూతన దేహంవల్ల అతనిలో మార్పువచ్చి తీరాలి వచ్చితీరిందికూడ అతని పూర్వ శిరస్సును బట్టి దేహంలోను దేహస్థితినిబట్టి ముఖంలోను, భావాలలోను మార్పువచ్చింది. ఈ మార్పునుబట్టి అతని అర్థాంగిఅయిన సుందరి చిత్తవృత్తిలోను మార్పువచ్చింది.

అయితే మనకు సుందరికథ ప్రధానం, అందువల్ల ఆమెలోని మార్పుకు కారణభూతమైన శర్మలోని మార్పులను పరిశీలించాము యీ మార్పులు ఎప్పుడు ప్రారంభమయ్యాయో, సుందరి ఆవందానికి ఎప్పుడు విఘ్నాలు తొలకరించాయో చెప్పలేము

ఏ వ్యక్తికైనా అనురాగంగాని, ద్వేషంకాని ఒక్క సారిగా ఊడిపడదు. ఆ వ్యక్తికి తెలియకుండానే అల్పాతి అల్పాలైన కారణాలెన్నో ఆ అనురాగం మొదలైన వాటికి దోహదమిచ్చి పోషిస్తాయి. సుందరిలో కూడా ఇలాగే జరిగింది

సుందరి శర్మ ముఖాన్ని నందుని దృఢమైన మొండాన్ని ఎంతో కాంక్షించింది. ఈ రెండూ తన కెంతో బాగుంటాయి అనుకొంది కాని రెండూ కలిపేటప్పటికి నందశర్మలకంటె భిన్నమైన ప్రత్యేకదేహం ఏర్పడింది. సుందరి ఇలా జరుగుతుందని కలలోకూడా అనుకోలేదు. అయితే తాను నంద శర్మలను భిన్నమైన నూతన దేహాన్ని అనుభవిస్తున్న సంగతి ఎప్పుడు ఆమెకు తోచింది? శర్మ కౌగిలిలో కరగి ప్రపంచాన్నే విస్మరించిన మొదటి రోజుల్లో ఈ స్ఫురణ కలిగి ఉండదు. మరెప్పుడు ఈ స్ఫురణ కలిగింది? ఈ స్ఫురణ కలగటానికి కావలసిన పర్వదశకూడా ఆమెలో ఏర్పడి ఉండాలి.

పైగా శర్మ తన పూర్వపు అలవాటునుపట్టి ముందూ వెనకా బిళ్లగోచీతో ధోవతి కట్టేవాడు. నందుడంటేనో పంచెను మోకాళ్ల క్రిందికి దిగనిచ్చేవాడు కాడు. తనదేహంనిండా నందుడు నువ్వులనూనె పూసుకొని, ఆతైలం ఇంకేటంతవరకూ కసరత్తుచేసి స్నానం చేసేవాడు. బారెడు దూరంలో ఉన్నప్పటికీ ఆవాసన సుందరిలో ఏవో భావాలను రేపేది శర్మ శిరస్సు అలాంటి వాసనను సహించలేదు. అందువల్ల అతడు తన నూతన దేహాన్ని తైలంతో మర్దించేవాడు కాడు అందువల్ల సుందరి కిష్టమైన ఆవాసన లభించేదికాదు 217

ఇంకొకటి గూడావుంది ఒకవ్యక్తి యెడల మనకు నిర్వ్యాజానురాగం కలుగుతూ ఉందంటేమన బుద్ధికి అందక మన అవ్యక్తానికిష్టమైన ఎన్నో అలవాట్లు, తీరులు, వాలకాలు ఆ వ్యక్తిలో ఉండి ఉండాలి. శూద్ర అలవాట్లన్ని పైకి సుందరి ఎంతవెక్కిరించినా, గొంతుకు కూర్చునే నందుని శరీరం ఆమెకిష్టం. శర్మకాళ్లు మొదట్లో లలవాటు చొప్పున గొంతుకు కూర్చునేవి. కాని తరువాత క్రమక్రమంగా శరీరంలో వచ్చిన మార్పువల్లనైతేనేమి, బుద్ధి బోధకత్వం వల్లనైతేనేమి, శర్మ పద్మాసనం వేసికొని కూర్చునేవాడు. ఇదికూడ సుందరికి కొంత నిరుత్సాహం కలిగించి ఉంటుంది

దేహం ముప్పాతిక మూడుపాళ్ళు జీవనవృత్తి మీద ఆధారపడి ఉంటుంది. నందుడెప్పుడూ కాయకష్టం చేసేవాడు. ప్రతినిత్యం కసరత్తు చేసేవాడు. శర్మ అంటేనో అలాకాదు. కాయకష్టం లేదు. కేవలం విద్యార్థులకు పాఠం చెప్పుకోవటం. లెక్కాడొక్కా చూచుకోవటం చేస్తూ ఉండేవాడు. అందువల్ల శర్మకు నందుని బలిష్ఠదేహం లభించి నప్పటికీ, సన్నగిల్లటానికి ప్రారంభించింది. కండలు తిరిగిన దండచేతలు, విశాల వక్షంసన్నగిల్లుతూ వచ్చాయి. బొజ్జ కూడ వేసున్నానంటూ పొడసూపసాగింది చేతులు పాదాలు చిన్నవై స్త్రీకి వలే పరిణమించ సాగాయి దేహచ్ఛాయ కూడ పాలిపోసాగింది

శిరస్సును బట్టి దేహంలో మార్పు వచ్చినప్పుడు దేహాన్ని బట్టి శిరస్సులోను, మనస్సులోను కూడ మార్పులు వస్తాయి. అంతకుముందు సన్నగా, కోమలంగా వున్న పెదవులు కొంత లావు పారాయి సన్నగా కోటేరులాగా ఉండే ముక్కులావెక్కి దాదాపు బుర్రముక్కులాగా తయారు కావటం మొదలెట్టింది. అంతకు ముందు కళ్ళు గంభీరంగా దేనికోసమో ఉరుకుతూ ఉన్నట్లు ఉండేవి. మొత్తం మీద బ్రహ్మవర్చస్సు ఒలుకుతూ ఉండేది ఇప్పుడంటేనో ఆ గాంభీర్యం పోయింది చిలిపి నవ్వు సంతృప్తి మత్తులు అధికంకాసాగాయి.

దుర్బలదేహమున్న రోజుల్లో, శర్మ సుందరమైన దృఢశరీరాన్ని కాంక్షిస్తూ ఉండే రోజుల్లో అతడొక విశిష్ట సౌందర్యాన్ని కాంక్షిస్తూ ఉండేవాడు. దైవికంగా అతనికి బలిష్ఠమైన నందుని దేహం లభించింది. అతడు ఆరాధిస్తూ వచ్చిన సౌందర్యానికీ, నూతనంగా ప్రాప్తించిన దేహానికి సంబంధంలేదు. పైగా, నూతన దేహంతో అతని సౌందర్యపిపాసలో కూడ మార్పు వచ్చింది వీటి ఫలితంగా అతని మనస్సులో విచారం బయలు దేరింది.

సౌందర్యవంతమైన వస్తువు లభించగానే, దాని యందుండే మక్కువ పోతుంది నందుని సుందర దేహం లభించిం తరువాత, శర్మకు కూడ అందమైన దేహంపై ఉండే ప్రీతి సన్నగిల్లింది.

అసలు శర్మలో ఈ శారీరకపు మార్పు రాకపోయినా, సౌందర్య పిపాస తగ్గి ఉండాలి. అన్వర్థ నామధేయ అయిన సుందరిని అతడు పెండ్లి చేసుకొన్నాడుకదా అని అడుగువచ్చును. నిజానికి అంతేకాని, స్థితిగతుల వైపరీత్యంవల్ల శర్మలో ఇది మరీ విషమించింది. మొత్తం మీద శర్మలో వస్తూ ఉన్న మార్పులు సుందరిని కలతపెట్టసాగాయి. భర్తలో వస్తూ ఉన్న మార్పులు చూస్తూ ఉన్న సుందరికి నందునిలోకూడా ఇలాంటి మార్పులే వస్తూ ఉండవచ్చునని పొడకట్టింది.

ఈ ఊహ తట్టగానే ఆమెలో కుతూహలం బయలుదేరింది.

నందుడు ఎలా మారి ఉంటాడు? ఇప్పుడెలా ఉంటాడు? ఆకాళ్లు చేతులు, ఆరొమ్ము, ఆవీపు ఎలా ఉన్నాయో? ఆ దుర్బల దేహంతో, ఆ అధ్వాన్నపు అడవిలో ఎంత అవస్థ పడుతున్నాడో, ఆ ముక్కు, కళ్లు, పెదవులు మారిపోయాయి కాబోలు! అతనికి నిజంగా అన్యాయం జరిగింది. అతన్ని వీడ్కొలివచ్చేనాడు నీ దేహాన్ని చక్కగా చూచుకొంటానన్నాను. ఆ దేహమిప్పుడు సన్నగిల్లిపోయింది. ఆ పిచ్చిబాబు ఆ దుర్బల దేహంతో ఆశోచనీయ ముఖంతో దిగులు దిగులుగా చెట్టు పుట్టా పట్టుకొని తిరుగుతున్నాడు కామోలు! ఇలాంటి చింతలు సుందరి మనస్సును కలతపెట్టసాగాయి. మళ్ళీ సుందరి భర్తకౌగిటిలో నిద్రిస్తూ, నందుణ్ణి కలవరించ సాగింది. మనః ప్రవృత్తిని ( యోగ సిద్ధులు తప్ప) ఎవరరికట్ట కలుగుతారు? కాలక్రమేణ సుందరికి ప్రొద్దులునిండి, కొడుకును కన్నది. పిల్ల వానికి చాలవరకు తల్లిపోలికలే వచ్చాయి ముక్కు మొగం అచ్చుగా తల్లివే. శరీరంలో మాత్రం కొన్ని తండ్రిపోలికలు – అంటే శర్మ పూర్వదేహపు పోలికలు వచ్చాయి.

సాధారణంగా కాలగమనంవల్ల, స్థల పరివర్తనవల్ల, చీకుచింతలు మరచిపోటానికి వీలేర్పడటమే కాకుండా, భావనలోకూడ కొంత మార్పు వస్తుంది పైగా, శిశుపోషణలో నిమగ్నమై ఉన్న సుందరి ఈ విషయం పూర్తిగా మరచిపోయి ఉండవలసింది.

కాని, అలా జరగలేదు కొడుకు తల్లిభావాల ప్రజ్వరిల్లటానికి తోడ్పడ్డాడు అతని సన్నని దేహం చూచినప్పుడల్లా సుందరికి నందుడు జ్ఞప్తికి వస్తూ ఉండేవాడు. పసి పిల్లలు సహజంగా ఎప్పుడూ కన్నార్పకుండా చూస్తూవుంటారు. ఈ చూపులు చూచినప్పుడు శర్మ పూర్వపు చూపులు జ్ఞప్తికి వచ్చేవి. దీనితోపాటు నందుడు జ్ఞప్తికి వచ్చేవాడు

ఇలా నాలుగు సంవత్సరాలు గడిచాయి ఈ మధ్యకాలంలో శర్మలో ప్రారంభమైనవని చెప్పుకొన్న మార్పులు సమగ్రమయ్యాయి. ఈ మార్పులను చూస్తూ వచ్చిన సుందరి యీ కాంలోనే, అంటే యీ అలీనావస్థలోనే పూర్తిగా గమనించ గలిగింది

కొడుకును చూచినప్పుడూ, అతని ముద్దు ముద్దు మాటలు విన్నప్పుడూ సుందరికి నందుడు దగ్గరుంటే, ఎంత బాగుండేది! అని అనిపించేది ''నందుడు తన కొడుకు చిలిపిచేష్టలను చూచి, ఎంత సంతోషిస్తాడో! ఆ నంగిమాటలను విని ఎంత మురిసి పోతాడో! తన కొడుకును చూచుకోటానికి అతడు నోచుకోలేదా?'' అని ఆమె బాధపడేది

ఎలాగైనాసరే, ఒకసారి నందునికి కొడుకును చూపించి వద్దామన్న బుద్ధిపుట్టింది. అతని కొడుకును అతనికి చూపించటానికివెళ్లితే తప్పేముంది? శర్మమాత్రమే మనుకొంటాడు? తన తలంపు దుష్టమైనది కాదే? తన తలంపు అన్యథాగా లేనప్పుడు, ఎవ్వరేమనుకొంటే ఏమిపోయింది. అయినా యీ కాస్తమాట శర్మచెవిని వెయ్యవచ్చును కదా! అతడు తీరా వల్లకాదు అంటే? అతని మాట త్రోసివేసి వెళ్ళటం దేనికి? అతని మనస్సుకు నొప్పి కలిగించటం దేనికి? అతనికి కష్టం కలిగించకుండానే పోయి కొడుకును నందునికి చూపించనూ చూపించవచ్చును మళ్ళీరానూ రావచ్చును. 219

ఇలా మధనపడ్డ సుందరి శర్మ ఊరికివెళ్లిన రోజున కొడుకును తీసుకొని ఇంట్లో చెప్పకుండా బయలుదేరింది గ్రామాలు దాటింది. నదులుదాటింది. దారి అడిగి తెలుసుకొంటూ ప్రయాణం సాగించింది ''పసికుర్ర వాడితో ఇలా ఒంటరిగా వెళ్లుతున్నావేమమ్మా? మీ మగవారేమయ్యారు'' అని ప్రశ్నిస్తే, ''యీ పిల్లవాని తండ్రి సన్యాసం పుచ్చుకొని తపస్సుకు వెళ్లారు. వీడిని వారిదగ్గరకు తీసుకొని వెళ్లి ఆశీర్వాదం పొందుదామని వెళ్లుతున్నాను. అనుగ్రహించి వీడికి విద్యాభిక్ష పెడతారన్న ఆసతో పోతున్నాను'' అని చెప్పేది. దానితో ప్రతి వారికీ కనికరం కలిగి చేయగలిగిన సహాయం చేశారు స్త్రీల కష్టాలను చూస్తే ఎవరికి దయకలగదు?

ఎలాగైతేనేం సుందరి కొడుకుతో కాకులుదూరని కారడవీ చీమలుదూరని చిట్టడవీ (?) గడచి నందుడున్న ఆశ్రమవాటికకు చేరుకొన్నది అప్పటికింకా ప్రొద్దుబారెడుంది. దూరాన నందుడు సన్నజాజికి నీళ్లుపోస్తూ ఉన్నాడు. ఉత్సాహంతో సుందరి కేకవేసింది. అతడు తిరిగి పారజూచాడు తనకోసం వచ్చేవారు ప్రపంచంలో ఎవరున్నారా అని మొదట్లో విస్తుపోయాడు. మళ్లీ ఆమె కేకవేసింది

వెంటనే నందుడు కంఠాన్ని గుర్తుపట్టి ఒక్క పరుగున ఆమె దగ్గరకు వచ్చాడు ''నా కోసమే – నా సుందరీ నా స్వప్న దేవత; నా ఆరాధ్య దేవత వచ్చిందా? నన్ను అనుగ్రహించటానికి దిగివచ్చిందా? ఆ లోకాలన్నీ దాటి వచ్చిందా? నమ్మలేను. నిజంగా సుందరివే?''

''ఔను నేనే ''

సుందరి ఊరకనే నిలబడలేక, నందుణ్ణి కౌగలించుకొంది ఆమె పూర్వభావ లతలు పొదులు తిరగబారాయి.

''ఈ నిర్భాగ్యునికోసమే?''

''ఆ'' అంటూ అరమోడ్పు కన్నులతో సుందరి నందుని రొమ్ము వేళ్లతో కొలిచింది. ''అమ్మా! లమ్మా'' అంటూ కుఱ్ఱాడు తల్లి దగ్గరకు వచ్చాడు. మామిడి చిగుళ్ల మధ్యలోనుంచి కోయిల సగర్వంగా కువూమంది

''ఎవరది'' సుందరి తల నిమురుతూ నందుడడిగాడు.

''వాడా!'' సుందరి మెత్తగా నవ్వింది.

''అమ్మా, అవో కాయలు బావున్నాయె, తింతాను, కోసి పెత్తవూ'' అంటూ కొడుకు తల్లి కొంగు పట్టుకొన్నాడు.

''నేను కోసిపెడుతా. రా'' అని నందుడు చేతులు చాచాడు

''నేను నీ దగ్గరికి రాను. రానంటే''



నందుడు కుఱ్రవాణ్ణి ఎత్తుకొని తన కుటీరంవేపు సాగాడు సుందరి వెంట వస్తూ ఉంది

''కాయలెయ్యి?''

''కుటీరంలోకి వెళ్లిం తరువాత యిస్తాను,''

'' ఆ పువ్వు కోసిపెత్తవూ,''

''నందివర్ధన పూవా?''

''కాదు అదేం? అది.''

గులాబీపూలు రెండుకోసి ఒకటి పిల్లవాడికిచ్చి నందుడు సుందరివైపు చూచాడు. ఆమె దగ్గరకు వచ్చి నిలబడింది. అతడు రెండో పువ్వు ఆమె జడలో పెట్టబోయాడు.

''అమ్మా నాదిగాదూ'' అంటూ కుఱ్ఱాడు రెండో పూవుకూడ లాక్కొన్నాడు.

''చూశావా నీ కొడుకు ఆశలు!'' సుందరి నవ్వింది.

''మన అబ్బాయా?''

''నువ్వు అప్పుడు నందుడివి కాదు''

నందుడు మరి రెండు పూలు కోశాడు.

''అవి కూల నావే'' కుఱ్ఱాడు మారాంచేశాడు.

''మగవాళ్ల స్వార్థం ఎక్కడకుపోతుంది?'' అంటూ సుందరి క్రీగంటిచూపు చూచింది

''స్త్రీలకు స్వార్థమంటే ఎలా ఉంటుందో కూడ తెలీయదురా బాబా! పరుల కష్టనిష్ఠురాలు కనిపెట్టి, మరీ నడుచుకుంటారు '' అంటూ రెండుపూలు ఆమె జెడలో పెట్టాడు.

''నిజమే పాపం?'' అని సుందరి గునిసింది.

నందుడు తన కుటీరద్వారంలో కుర్రవాణ్ణి దించి ముందు పూలు వేశాడు.

''కాయలెయ్యి? అని కుర్రాడు అడిగాడు.

''ఇదిగో తెస్తున్నా,'' అంటూ నందుడు లోపలికి వెళ్లి, రెండు మామిడి కాయలు, రంగురంగుల పూలు తెచ్చి, పిల్లవాడికిచ్చాడు. సుందరి వాకిలి కానుకొని కొడుకు ఆటలను చూస్తూ నిలుచుంది.

''మంచి నీళ్ళక్కరలేదా?''

కావాలని సుందరి నందునితో లోపలికి వెళ్ళింది అతడు కొబ్బరి బొండం కొట్టి నీళ్ళిచ్చాడు. ఆమె దప్పిక తీర్చుకొని తడిక కానించి పరచి ఉన్న కృష్ణాజినం మీద కూర్చుంది.

''నిన్ను చూస్తానని అనుకోలేదు.''

''నువ్వు చాల మారిపోయావు.''

''నీకన్నానా?'' నందుకడు ఆమె ప్రక్కన వచ్చి కూర్చున్నాడు.

''నేనేమి మారిపోయాను?'' 221

''చాలా మారావు.''

''ఏమిటీ ఆ మార్పు?

''నిజం చెప్పు, నీవు మొదట్లో ఇంత నిర్దయురాలివా?''

''నేను నిర్దయురాలినా?'' స్నిగ్ధనేత్రాలతో నందుణ్ణి చూచింది.

''లేదు''

''అయితే నాలో వచ్చిన మార్పేమిటి?''

''అందం చూపులలో మత్తు ఎందుకు రావాలి?'' సుందరి ముఖాన్ని నందుడు తనవైపు లాక్కున్నాడు.

''పొరపాటే!''

బలవంతాన లాగబడినట్లుగా అతనిపై కొరిగింది.

''కాదంటావా? ఈ నిండుతనం ఎందుకు రావాలి?''

''ఏ నిండుతనం?''

''ఈ నిండుతనమే''

''వదలండి, ఎక్కడికిపోయినా, బాధ తప్పనట్లుంది!''

"ఎక్కడికి వెళ్లితే బాధ?" (సుందరి నాలుక కొరుకుకుంది.)

" ఇంతదూరం వచ్చానా! ఇది బాధ కాదా?"

"నిజమే. పాపం! దారిలో ఎన్ని అవస్థలు పడ్డావో!"

"నీవు మాత్రం అవస్థపడుతూ ఉండలేదా? ముక్కుచూడు! ఎలా సన్నబడిపోయిందో, అమ్మోయి, ఈ ముక్కుతో పొడుస్తావా యేమిటి?"

"నిజంగా సన్నబడిందా?"

"అబద్ధం చెబుతున్నానా? ఈ పెదవులూ అంతే"

"కళ్లు మూస్తావేం?"

"నీ చూపులతో నన్నొకసారిగా త్రాగేసెయ్యవూ?"

"నిజంగా తాగి వెయ్యగలిగితే"

"త్రాగివేయకండి. పుణ్యముంటుంది ఒక్కసారిగా త్రాగివేస్తే, తరువాత ఏమిచేస్తావు?"

"తరువాత జీర్ణించుకుంటాను "



"ఇది నిజంగా శర్మ దేహమేనా?"

"అమ్మా, పూలు పలుతున్నాయే ఏలుకోనా?"

"ఏరుకో, అవతలకు వెళ్లకు"

"ఇక్కడేవుండి, ఏలుకొంటానే"

"ఎక్కడివీ ఆపూలు"

"ఈ వెదురు తడిక కల్లుకొంది సన్నజాజి – దానిపూలు కామాలు"

"ఏ తడిక?"

"నా కాయలు తాకితే ఊలుకోను. ఇదే చెప్పుతున్నా"

"మీకే చెప్పేది"

"ఏమిటి"

"వాడి కాయలుతాకితే ఊరుకోడట. తరువాత మీ యిష్టం."

ఇలా రెండు రోజులు పిల్లవాడు కుటీరం ముంగిట కాయలను చూచుకొంటూ, పూ- ఏరుకొంటూ గడిపాడు. మూడో రోజున తెల్లవారకముందే, శర్మ నందుని ఆశ్రమవాటికలో ప్రత్యక్షమయ్యాడు.

శర్మ ఊరినుంచి ఇంటికి తిరిగిరాగానే, సుందరి కొడుకుతో సహా కనపడలేదని అత్తమామలు చెప్పి యేడ్చారు అతడు ఆజ్యంపోసిన అగ్నిహోత్రుడౌతాడని ఊళ్లోవాళ్లు అనుకున్నారు. కాని,

ఇలాంటి దేమి జరుగలేదు. అనుభవం గడించిన వ్యక్తి కాబట్టి, ఏమీ పొక్కలేదు. మొదటి నుంచీ నందుడెక్కడున్నాడో అతను కనుక్కొంటూ వచ్చాడు సుందరికి చెబితే, అక్కడికి వెళ్లుతుందేమో నన్న భయంతో ఆమెకు చెప్పలేదు.

సుందరి కనిపించలేదన్న సంగతి తెలియగానే శర్మ ఏకాయెకిని నందుని ఆశ్రమువాటికకు వచ్చి, నది ఒడ్డున కూర్చున్నాడు ఆ చీకట్లో వారికి నిద్రాభంగం కలిగించటానికి అతడు ఇష్టపడలేదు. తెల్లవారుతూ ఉండగా సుందరీ నందులు అంగవస్త్రాలతో నదీస్నానానికి బయలుదేరారు.

కొంతదూరాన ఉండగానే సుందరి శర్మను గుర్తుపట్టింది సిగ్గు జంకులతో ఇద్దరూ అతన్ని పలుకరించారు.

''క్షమించాలి. మీతో చెప్పకుండా వచ్చాను మీ మిత్రుణ్ణి చూడాలన్న ఆతురతతో ఇలా చేశాను'' అని సుందరి అన్నది

''అవును భర్త దేహాన్ని చూడటానికి వచ్చావు అందువల్ల నందునిపై కోపగించు కోవలసిన పనిలేదు నందా! నిన్ను కూడా క్షమిస్తున్నాను. కాదు, నువ్వే నన్ను క్షమించాలి. నీకు నేను అన్యాయం చేశాను. దమన మహర్షి తలప్రధానమని చెప్పగానే సుందరిని నాతో తీసుకువెళ్ళి, నీకన్యాయం చేశాను సాధారణంగా స్వవిషయాలలో ఒకవ్యక్తి నిష్పాక్షికంగా నిర్లిప్తంగా ఆలోచించి వ్యవహరించటం చాల కష్టసాధ్యం జరిగిందేదో జరిగిపోయింది. గత చరిత్రనుబట్టిచూస్తే, సుందరి నీవు లేకుండానాతో కాని, నేను లేకుండా నీతో కాని, ఉండలేదనిస్పష్టమవుతూవుంది ఇద్దరితో కలసి ఒక స్త్రీ కాపురంచేయటం అధర్మం ఇలాంటి అధర్మానికి నీవు కాని, సుందరికాని ఒడిగట్టరని నా విశ్వాసం'' అని శర్మ అన్నాడు

''మీ వాక్యాలు ధర్మసమ్మతంగా ఉన్నాయి. స్త్రీ యెన్నడూ పెక్కుమందితో కాపురం చెయ్యకూడదు. అలాంటిదానికి నేనేమాత్రం సహించలేను '' అంది సుందరి.

''దీనికి నేనూ అంగీకరిస్తాను'' అన్నాడు నందుడు.

''ఆ పక్షంలో మనకు ఒకటే కర్తవ్యం మిగిలివుంది. నీవులేక కేవలం నాతోకాని, నేనులేక కేవలం నీతోకాని, సుందరి ఉండలేదు మనలో ఏ ఒకరు లేకపోయినా సుందరి హృదయం పరితపిస్తుంది. అందువల్ల, మనం ఇద్దరం చనిపోవటం మంచిది అప్పుడు సుందరి మన యిద్దరితో సహగమనం చేస్తుంది. మన యిరువురిలో ఎవరు మిగిలి ఉన్నా, సుందరి సహగమనం చేయటానికి శాస్త్రమూ అంగీకరించదు. పైగా, ఆమె హృదయమూ ఎంతో బాధ పడుతుంది. అందువల్ల మనం ఇద్దరమూ చావటం మేలు. అయితే, ఆత్మహత్య మహాపాపమని శాస్త్రాలు చెబుతూ ఉన్నాయి. కాబట్టి, మనం ఇరువురమూ ఒండొరులను పొడుచుకొని చనిపోదాం. అప్పుడు సుందరి సహగమనం చేస్తుంది'' అన్నాడు శర్మ

''అయితే, కుర్రవాడోమరి?'' అన్నది మాతృ హృదయం.

''అవును, ఈ విషయం ఆలోచించవలసిందే'' నని నందశర్మలన్నారు

''నేను విధవనై జీవిస్తే, ప్రయోజనమేముంటుంది? వాడికి ఎవరు తోడ్పడుతారు? నేను మీతో సహగమనం చేస్తే, మన మీది గౌరవంతో వాణ్ణి లోకం ఆదరిస్తుంది.'' అని సుందరి సూచించింది

''అయితే, కత్తులున్నాయా?'' అని నందుడు అడిగాడు.

''వచ్చేటప్పుడు ఆలోచించే రెండుకత్తులు తెచ్చాను '' లంటూ శర్మ తన దగ్గరనున్న రెండు కత్తులు సుందరి కిచ్చాడు.

ముగ్గురూ కలిసి నందుని కుటీరం దగ్గరకు వచ్చారు సుందరి వారిద్దరినీ బ్రతిమాలుకొని ఒప్పించి, వారికి విరిపాన్పు సమకూర్చింది ఇరువురు ఒండొరులను పొడుచుకొని శయ్యమీద ఒరిగారు తాను సహగమనం చేయదలచిన సంగతి సమీపంలో ఉన్న ఋషికి తెలియజేసి, ఆక్రియను శాస్త్రోక్తంగా జరిపించవలసిందని సుందరి కోరింది. ఈ వార్త నాలుగు దిక్కుల గుప్పున పాక్కి ఋషులు, ప్రజలు నందుని ఆశ్రమవాటికకు చేరుకున్నారు. గంధపు చెక్కలతో చితి ఏర్పడింది. చితి మీద యిరువురి శవాల మధ్య సుందరి కూర్చుంది.

సుందరి కొడుకుచేత శాస్త్రోక్తంగా తలకొరివి పెట్టించారు. మూడు దేహాలు ప్రకృతిలో లీనమయ్యాయి.

త్వరలోనే అక్కడ సుందరీదేవి ఆలయం ఏర్పడి, ఉత్సవాలు సాగుతూ వచ్చాయి

**అంకితం**

ఇతివృత్తం చూపి

ప్రకృత రచనకు

కారకులైన

శ్రీ బి.యన్. రెడ్డిగారికి

..... ఒకటి .....

శాంతాదేవిగారి ప్రత్తిచేలు పగలబడి నవ్వుతున్నవి చిత్రగారి చిలిపి గుజ్జం వెకిలిగా సకిలిస్తూ బయలుతన్ని పరువులు తీస్తున్నది ఈ ఇగిలింతలు సకిలింతలు శాంతకు బొత్తిగా సహించవు ఎప్పుడేది ఎలా జరగాలో అప్పుడది అలా జరిగిపోవాలి ఇప్పుడు ప్రత్తి కోతకువచ్చి కూర్చున్నా పని అలాగే నిలబడి పోయింది కొడుకు ధర్మకీర్తి మంచంలో ఉన్నాడు ఇంటికి పెద్ద అతడే ఏ పనివాళ్ళు తన దగ్గరకు వచ్చినా కొడుకు దగ్గరకు పంపేది అతడు చెప్పినట్లే చేయమనేది

వాస్తవానికి ఆ యింట ఏది జరిగినా ఆమె ఆలోచన లేకుండా జరిగేదికాదు పేరుమాత్రం ధర్మకీర్తిది ఆ సంగతి ఆమెకు తప్ప మరొకరికి తెలియదు ఆమె తెలివితేటలు, పట్టుదలలు ఆ ఊళ్ళోనే కాదు, ఆ మండంలోనే మరొకరికి లేవేమో! ఆమె భక్తి ప్రవత్తులుగూడ అలాంటివే ఎన్ని కష్టాలు ముంచుకొచ్చినా ఈది ఒడ్డున పడ్డది తన్ను గూర్చి ఎక్కడా పొక్కేదికాదు ఎన్ని సంక్షోభాలు బయలుదేరినా లోలోపల అణగిపోవలసపిందే పని తల పెట్టిందో ఇంద్రాదులు అడ్డుపడినా సాగిపోవలసిందే అడ్డు తగిలిన వారి ప్రాణాలు హతమారవలసిందే చూచేవారికి ఆమె ఈ లోకపు మనిషిగా కనిపించదు కూర్చున్నా నడుస్తున్నా చేతిలోని జపమాల తిరిగిపోతుంటుంది చూపులు మూడుబారలు మించి ప్రసరించవు ముఖంలో శాంతం, భక్తి తాండవిస్తుంటవి ఆమె స్వరం కూడ దానికే దోహదమిస్తుంది మిన్ను విరిగి మీద పడుతున్నా ప్రసన్నంగా ఉంటుంది బిగ్గరగా గాని, తొందరగా గాని ఆమె మాటాడగా విన్నవారు లేరు నిశ్చితి లేని దానివలె మాటాడుతున్నట్లు కనబడేది. కాని అదంతా ఆచి తూచి మాటాడలమే కాని మరొకటి కాదు

పెద్దపాలేరు వేదగిరి ప్రత్తికోత సంగతి ప్రస్తావించాడు మరొకరితో అయితే చిర్రు బుర్రులు బయలుదేరి ఉండేవి కాని వ్యవహరిస్తున్నది శాంతమ్మ బాబు, అంటే ధర్మకీర్తి, ఇంతవాడైనప్పటినుంచి తానే కోత కోయించి వ్యవసాయం దిద్దుకు వస్తున్నాడు ఇప్పుడు మాత్రం ఎందుకు చేయరాదు? బాబుకు ఆరోగ్యం చిక్కేదాకా ఉంటే పంట చేతికి చిక్కుతుందా? ఎక్కడనుంచో శకుల జట్టును ఎందుకు పిలివాలి? అసలు ఏటేట వారినే పిలుస్తున్నారు ఎందుకో వేదగిరికి అర్థంకాలేదు ఆ మాటే మెల్లగా అన్నాడు

''ఆ అనేదేదో పెద్దగా అనరా! పెద్దతనం పైన బడుతున్నదా, చెవులు వినిపించటం లేదు,'' అన్నది

వేదగిరి తబ్బిబ్బుపడ్డాడు ఆ చూపులకు ఆగలేక, ''క్షమించండమ్మా, క్షమించండి,'' అన్నాడు

''నాకు చెప్పుడువస్తే అది నీ దోషమా? ఈ సంవత్సరం చెవి బొత్తిగా వినిపించటం లేదు అబ్బాయి ధర్మకీర్తి ఎప్పటిలాగానే గుణవర్ధనుని జట్టును పిలిచాడట నీతో చెప్పలేదా? అలాంటి జట్టు ఈ ప్రాంతంలోనే లేదని వాడి నమ్మకం ఈ మాటే నాతో ఎన్నోసార్లు అంటూ వచ్చాడు ఒకటి రెండు వారాల్లో తేరుకొని వాడే చూచుకొంటాడు ఇంతలోనే ఏమి మునిగిపోతుంది? సరేకాని ఈ ఏడు పంట ఎలా ఉన్నది? మీ పెద్దదొర ఉండగా పైరుమీదనే రాలుబడి చెప్పివేసేవాడు'' శాంతమ్మ తాపీగా అన్నది

'' ఈ ఏడు అంత జాయగా లేదు అమ్మగారూ! అయినా నిరుటి రాలుబడికి తీసిపోదు,'' అన్నాడు వేదగిరి

అతనికీ చిన్నపాలేరు రుద్రదామునికీ పడదు రుద్రదాముడు వట్టి పనికిమాలినవాడనీ, తూర్పు పడమరలు తెలియవనీ అతని తలపు. అలాంటివాణ్ణి చిన్నదొర ధర్మకీర్తి దగ్గరకు తీశాడని అతనికి కడుపుమంట నిజానికి ఆ పని చేసింది శాంతమ్మ ఆ సంగతి వాడికి తెలియదని ఆమె నవ్వుకొన్నది ఆ నవ్వుచూచి శాంతాదేవి తన్ను అభి మానిస్తున్నదని వేదగిరి అనుకొన్నాడు ''చిన్ననాటి చెలిమి పట్టుకొని చిన్నదొర రుద్రదాముణ్ణి చేరదీశాడు. వాడివల్ల ఎంత చెరుపు కలుగుతున్నదో తెలుసుకోలేక పోతున్నాడు నేనెప్పుడో చెప్పాను ''ఈ మాట వేదగిరి ఎన్నడో చెప్పాడు నేనే పొరపడ్డాను'' అని చిన్నదొర ఏనాటికైనా అనకపోతే ఈ చెవి కోయించుకోనూ? ఏ చేను ఎప్పుడు దున్నాలో, ఏపైరు ఎప్పుడు పెట్టాలో వాడికేమి తెలుసు? గుబులు పుట్టిందంటే పశువుల నీరూమేత రెండూ మరచిపోతాడు '' అన్నాడు వేదగిరి

శాంతమ్మ ముఖంలోని నవ్వు మటుమాయమైంది నొసలు చిట్లించి ఆమె నిబ్బరంగా అన్నది ''పాలేళ్లు ఒకరిచాటున ఒకరు దొరకు చాడీలు చెప్పుకొనటం ఏమాత్రం మంచిదికాదు నిజంగా నీమాటలు చిన్నదొర వింటే ఏమిజరుగుతుందో ఆలోచించావా? రుద్రదాముడు దిక్కులేని పక్షైపోతాడు చేతనయితే ఒకని కింత గంజిపోయాలికాని కడుపుమీద కొట్టవచ్చునా? అది ఎంత పాపమో ఆలోచించావా? భిక్షువులువింటే ఏమంటారో పొరజూచుకొన్నావా?''

''అమ్మగారూ, క్షమించండి! – నాకే దురుద్దేశమూ లేదు.'' వేదగిరి ఆమె చివాట్లకు బెదరిపోయి అన్నాడు

శాంతాదేవి గిరుక్కున మళ్ళీ తలవంచుకొని మామూలుగా నడచిపోతున్నది చేతిలోని తావళం పూస ఒక్కటొక్కటే తిరిగిపోతున్నది వెళ్ళిపోతున్న శాంతాదేవిని వేదగిరి కళ్ళప్పగించి చూస్తున్నాడు '' ఏమి జపాలో! స్వర్గమనేది ఉంటే అదేవుడు నేరుగా ఈమెను అక్కడికే తీసుకుపోతాడు అమ్మగారికి లేనిపోని విసుగు కలిగించడం పొరపాటే, అయినా నేనేమైనా ఒళ్ళోవేసుకు పోదామని అన్నానా? ఆమె బాగు కోసమేగా చెప్పింది! సంసారానికి దెబ్బ తగులుతుంటే చూస్తూ యెలా

ఊరుకోవటం? ఇంతకూ ఆ పెద్ద దొర పోవటం వచ్చింది '' కాలిదగ్గర ఉన్న మట్టిపెళ్ళ అతడు ఒక్కతన్ను తన్నాడు గింగిరాలు కొడుతూ పోయి అది పెరటిలోని పెంటపోగుమీద పడ్డది

''భిక్షువులు వస్తారా? వారు ఎంతో మంచివారు వారినే అడుగుతాను, తల్లీకొడుకుల మధ్య ఎలా చావమంటారో కనుక్కొంటాను వారికిమాత్రం తెలియదా? అంతా తెలుసు ఇంత ఎగసాయం నెట్టుకు రావాలంటే మాటలా? ఇంతకూ ఆ పెద్దదొర పోవటం వచ్చింది ''

అంతలోనే జాగిలం జన్నడు కనిపించాడు దానిని పిలుచుకొని వేదగిరి వంట యింటి వెనుకకువెళ్ళి కూర్చున్నాడు

అప్పుడే అతనికి స్ఫురించింది భిక్షువులు వచ్చినప్పుడే గుణవర్ధనుని జట్టు వస్తూ ఉంటుంది అంటే భిక్షువులు రెండు రోజులు ధర్మం ఉపదేశిస్తారు దేవుడు, దయ్యం అనక తిరిగే ఆ పరదేశి జట్టుకు బత్తిముత్తి ఏర్పడుతవి ఇంతకూ దామిగాడు రాలేదేమా అనుకొన్నాడు.

మాలతి వంట యింట్లోనుంచి బయటికి వచ్చింది ఆ యింటి పనికత్తెలందరిలో ఆమె చిన్నది అందకత్తె కూడా ''ఏమివేదగిరి, ఆర్చుకతీర్చుక కూర్చున్నావు?'' అని ఎకసక్కెంగా అడిగింది అతడు ముదుసలి అతనితో ఎన్ని ఎకసక్కెలాడినా ఇబ్బంది లేదని ఆ యింటి పనికత్తెకల నమ్మిక ''మరదలుపిల్ల ఎలా ఉందో పలకరించి పోదామని వచ్చా,'' నని వేదగిరి అన్నాడు ఇంతలోనే వంట యింట్లోనుంచి మాలతి తల్లి ఉపానిక అంట్లు కడిగిన నీళ్ళు అతని నెత్తిమీదుగా ఆవల పడేటట్లు పోసింది దాపున ఉన్న దాసీ జనమంతా ఒక్కసారి పక్కుమన్నది 229

ఇంట్లో ఎందరు పనిచేస్తున్నారో పొలాలలో ఎందరున్నారో శాంతమ్మ ఎన్నడూ లెక్కకట్టలేదు దాసీజన బంధుత్వం ముస్నిడుకొని వచ్చి తినిపోయేవారి సంఖ్య లెక్కలేదు కాకపోతే నెలసరి జీతాలు తానెంతమందికిస్తున్నాడో మాత్రం చినబాబు ధర్మకీర్తికి తెలుసు. అంతేకాని ఇంట తిని దొడ్లో చేతులు కడిగే వారిని లెక్కించటం పరువు తక్కువ అని అతని భావం

శాంతమ్మకు తన యింట జనం లేనట్లే లెక్క కాకపోతే ఇంటిపనులు సర్దుకు పోయే వారున్నారని ఆమె అనుకొనేది ఆమెభర్త ఉండగా ఆడ మగ యాభైమందికి తక్కువలేకుండ ఇంటి ముందు చేతులు కడిగేవారు ఇంత మంది ఈ యింట్లో ఏమి చేస్తారా అని కొత్తవాళ్ళు అబ్బురపడేవాళ్ళు

ఆనాడు శాంతాదేవి వృద్ధురాలైన ఉపానికను చూచి, ''పాపం! వండి వార్చలేక ముసలిది చచ్చిపోతున్నది ఇకనుంచి మాలతినికూడ తోడు పంపా''లనుకొన్నది ఆమె తిన్నగా ధర్మకీర్తి గదికి పోయి ''రాత్రి బాగా నిదుర పట్టిందిరా బాబూ? నొప్పులు తగ్గిపోయాయా?'' అని అడిగింది కొడుకు ముఖంతీరే చెబుతున్నది అతడు హాయిగా నిద్రపోయాడు మామూలుగా

లేచి తిరగటానికి ఇంకా ఎన్నో రోజులు పట్టవు కృతజ్ఞతతో ఆమె బుద్ధదేవునకు లోలోన నమస్కరించింది తన కొడుకు ద్వారా దేవతలు తనకు భర్తృసందర్శనం అనుగ్రహిస్తున్నారనుకొన్నది. ''నా తండ్రి నిజంగా మహారాజని'' లోలోపల మురిసిపోయింది

శాంతి కొడుకుతో అన్నది ''పత్తికోతకు వేదగిరి తొందరపడుతున్నాడు మరి భిక్షువులు వచ్చేదాక అగుదామని అన్నావుగదా? కాక ఈ నడుమ మనస్సు మార్చుకొన్నావా? వారు వచ్చేదాకా అగితే శకులజట్టు వారి ఉపదేశం వినే సదవకాశం లభిస్తుంది ఉపాసకులమై ఉండి తోడిమానవులకు ఈమాత్రం సాయం చేయకపోతే ఏమున్నది? శాంతిభిక్షువులుకూడా ముసలివారై పోతున్నారు నాస్థితి అలాగే ఉన్నది ఈ ముసలి ఘటం నీ చేతిమీదుగా వెళ్ళిపోవాలనుకొంటున్నది.''

''అలా అంటావేమమ్మా? తిప్పించి మళ్ళించి లెక్కగడితేయాభై ఏళ్లయినా నిండలేదు అప్పుడే ముసలి తనమా? నాచేతిమీదుగా వెళ్లిపోవడమా? మా అమ్మను ఇంకా నాలుగుకాలాలపాటు బ్రతికించండని ఎల్లదేవతలకు మొక్కుకొంటున్నానమ్మా!'' ధర్మకీర్తి తల్లిచేతులు ముద్దుపెట్టుకొన్నాడు

శాంత తన బాబును చూచుకొని మురిసిపోయింది అతడు పెద్దవాడయ్యాడు అన్ని

వ్యవహారాలు చక్కబెట్టుకొంటున్నాడు ఇంకేమీ కావాలి? తన ముదుసలితనం ఏ దిగులు, చింత లేకుండా గడచిపోతుంది కొడుకు చేతి మీదుగా తాను వెళ్లిపోతుంది

''బాబూ! శాంతిభిక్షువులు రాకముందే ప్రత్తి కోత ప్రారంభించాలని ఉన్నదా? ఉంటే కాకిచేత కబురంపితే చాలు, శకులజట్టు రెండురోజులలో వచ్చిపడుతుంది కాదుభిక్షువులు రావాలంటే ఎంతలేదన్నా ఆరురోజులు పడుతుంది అందులో ముదిమి మూటిమూపున పడ్డది దారిలో అగక రావాలంటే ఈ వయసులో వారికి సాధ్యమా? వారు వచ్చేదాక అగితే నీవు కూడా పూర్తిగా కోలుకొంటావు'' శాంత వివరించింది

''నీరసత్వం తప్ప జ్వరమేమీ లేదమ్మా!''

''జ్వరం లేకపోయినా ఒకటి రెండు వారాలపాటు అలసట, నీరసత్వం అలాగే ఉంటాయి సరేకాని వేదగిరి ఊరక గోలపెతున్నాడు 'చిన్నదొరకోసం ఆగటం దేనికి? ఆయన పసితనంనుంచి నేనే పత్తి కోయించిపెండాలు తొక్కిస్తున్నాను గదా, అంటాడు ''

''అంత మాట అన్నాడా? వయసు మళ్ళుతున్న కొలదీ ముసలాడికి మతి పోతున్నది నా గొంతులో ఊపిరుండగ నేనే పత్తిని బోరాలకు తొక్కించాలి కాని మరొకడు తొక్కించటానికి వీలులేదు అసలు ఈ యింట్లో పెత్తనం ఎవరిది?'' ధర్మకీర్తి ముఖం కొంచెం జేవురించింది

''శాంతి భిక్షువులు వచ్చేదాకా కోతలు ఆపాలంటే అంత బాగుండదేమో? రోజులు మారాయి వారంటే భక్తి విశ్వాసాలు తగ్గుతున్నవి కుర్రకారుకు దైవభీతి సన్నగిల్లుతున్నది '' ఆమెనిట్టూర్చింది ''ఆరు నూరైనా, నూరు ఆరైనా ప్రత్తికోత ఆగవలసిందే '' ధర్మకీర్తి పట్టుపట్టాడు ఆ సంకల్పం, పట్టుదల అతడు తనవే ననుకున్నాడు నిజానికి కారకురాలు శాంతమ్మ తన సంకల్పాన్ని ఇతరుల సంకల్పం కావించి వారిచేతనే దానిని సాధింప జేయాలి. అందులోనే నేర్పరితనం ఉన్నది వాస్తవంగా అలాంటి విషయాలలో ఆమె అందెవేసిన చేయి

ఆ యింట ముఖ్యులు శాంత, ధర్మకీర్తి, వేదగిరి మాత్రమేకాదు, చిత్రకూడ ఉన్నది ఆమె అంటే ఆ బాలగోపాలం ప్రాణాలు విడుస్తారు ఆమె దొడ్లో కనిపిస్తే చాలు ఆవులు సైతం ఒకసారిగా ''అంబా'' అని అరుస్తాయి శాంత క్రుంగబోతున్న సూర్య మరీచి అయితే చిత్ర ఉదయిస్తున్న చంద్రకళ ఆమెను శాంత ఎన్నడూ హృదయపూర్వకంగా ప్రేమించలేదు అసలు ప్రేమించజాలదు అయినా చిత్రను చిన్నప్పటినుంచి శాంత తల్లి అయి పెంచింది పెద్దదానిని చేసింది ప్రేమించలేక పోయినా చిత్రను ఎన్నడూ నిర్దాక్షిణ్యంగా చూడలేదు ఒకప్పుడు శాంత మాటయిచ్చింది ఆమాటను ఇప్పటిదాకా నిలబెట్టుకొంటూవచ్చింది

చిత్ర పుట్టుపూర్వోత్తరాలు ఎవరికీ తెలియవు ఆమె తల్లిదండ్రులెవరు? ఆమెను ఎందుకు పెంచవలసి వచ్చింది? ఈ సంగతులు శాంతను అడిగి తెలుసుకొన్నవారు లేరు ఆయింట్లో ధర్మకీర్తికున్న చనవు, గారాము చిత్రకు చెల్లిపోతున్నవి



ఆమె కథ చెప్పాలంటే రెండుతరాలు వెనక్కి పోవాలి ఆ కథ విన్న యువకులు ఆశ్చర్యచకితులయ్యే వారు ఎక్కడలేని పారవశ్యం పొందేవారు

అవి శాంత చిన్ననాటిరోజులు ఆమెకు ఒక అక్క ఉండేది పేరు చిత్ర అందచందాలలో హావభావాలలో చిత్ర నిజంగా చిత్ర, శాంతకు అక్క ఆమెను భానుదత్తుడు ప్రేమించాడు. ఆమెకూడ అతనిని ప్రేమించకపోలేదు కాని తలిదండ్రులు ఆమెను మరొకనికిచ్చి పెండ్లిచేశారు. ఈ పని అతడు లేనప్పుడు జరిగిపోయింది ఆ సమయంలో వ్యాపారిఅయి పరదేశాలలో ఉన్నాడు తిరిగి రాగానే పెండ్లివార్త విని నిర్ఘాంత పోయాడు అతని జీవితం శూన్యమైపోయింది దుఃఖం దిగమ్రింగటానికి యత్నించాడు తుదికి త్రాగుబోతుగా మారాడు మనసు నిలకడకూడ తప్పింది అతనిని చూచి లోకం ఆడిపోసుకొన్నది, ''బంగారువంటి ఆ పిల్లను ఈతనికి అంటగడితే ఏమయ్యేది? బ్రతుకులు బొగ్గులయ్యేవి మరొకయ్య చేతబెట్టి తలిదండ్రులు మంచిపని చేశారు ''

భానుదత్తుడు తన నౌకలను ఒక్క టొక్కటే అమ్మివేశాడు అవి అయిపోయిన తరువాత అక్కడనుంచి వెళ్ళి శకులతో కలసిపోయాడనీ ఆ అప్రాచ్యులతోనే తిని తిరుగుతున్నాడని ప్రజలు

అనుకోసాగారు మరొకసారి శకాంగనను నలుగురు పిల్లల తల్లిని పెండ్లాడాడని అన్నారు ఆడికలు ఇన్ని అన్ని చిత్ర చెవికి దబ్బనాలయ్యాయి ఒకనాటి సాయంకాలం అతడు చుక్కతెగి పడ్డరీతిగా ఆమె ఎదుట ఊడిపడ్డాడు చేతులలో పసిబిడ్డ ఉంది ''ఒకనాడు నాకు తీరని అపకారం చేశావు దాని ప్రతిఫలంగా నీకు గొడ్రాలితనం కలిగింది నేనూ పాపినే అయ్యాను ఫలం అనుభవిస్తున్నాను అయినా భగవానుడు కనికరించి ఈ బిడ్డను ఇచ్చాడు మరొకసారి వేడుకొంటున్నాను నా పిల్లను పెంచి పెద్దదానిని చేయాలి చిత్రా! చేయగలవా? చేస్తానని మాటయిస్తావా?'' అతడు దీనంగా అడిగాడు

కలువల జంటనుంచి గలగలా సెలయేళ్ళు ప్రవహించాయి చిత్ర చేతులు సాచింది అతడు పిల్లను అందించాడు ఆ పసికందు నిద్రలో నవ్వుతున్నది ''మరి మా వారు ఏమంటారో?'' ఆమె సందేహం వెళ్ళబుచ్చింది ''సంకోచ మక్కరలేదు. శాంతి భిక్షువులు శాసిస్తారు వారి అనుజ్ఞ ఇదివరకే పొందాను '' అని భానుదత్తుడన్నాడు

''అయితే ఆటంకంలేదు కాని ఈ పిల్లతల్లి ఒప్పుకుంటుందా?''

'' ఆమె ఈ లోకంలో లేదు '' అతడు డగ్గుత్తికతో అన్నాడు

232 చిత్ర బిడ్డచెక్కిలి ముద్దాడింది భానుదత్తుడు సెగసోకిన కర్పూరమయ్యాడు ''నీపై పగతీర్చుకొనడానికి ఈ బిడ్డను తెచ్చాను చూస్తూ చూస్తూ యావజ్జీవం ఈ పాపతో ఎందుకు అవస్థపడాలి? ఎల్లప్పుడు ఈ నిర్భాగ్యుడు ఎందుకు గుర్తుకు రావాలి? ఎందుకు బాధపడాలి? నిజం చెప్పు ఈ పసిపాపపై ప్రేమ లేకపోతే యిల ఇచ్చివేయి, తీసుకుపోతాను'' అతను బిడ్డకై చేతులుచాచాడు. ''వద్దు భానూ, వద్దు, నేను బ్రతికి ఉన్నంతవరకు ఈ బిడ్డకు ఏ ఇబ్బందీ ఉండదు వారుకూడ ఏమి అనరనుకొంటాను నాకు కొంత ఊరట కలుగుతుంది ఇంతకూ ఈ బిడ్డ పేరేమిటి? ఆమె అడిగింది

''చిత్ర''

ఆమె కొయ్యబారిపోయింది భానుదత్తుడు ఎలాగో తెమిల్చుకొని వెళ్ళిపోయాడు ఆమెభర్త కర్కోటకుడు అతనిపేరు చెబితే చాలు ఊరునాడూ ఉలికిపడుతుంది ఆనాడు అతడు పసిపాప ఉయ్యాలను ఎడమకాలితో తాచాడు ఆతాపు గాలిలో హృదయజ్యోతి ఆరిపోయింది అయినా పసిపాప నవ్వులు అప్పుడప్పుడు ఆమె హృదయకుహరంలో తిల్లికలు వెలిగిస్తున్నవి

సంవత్సరం తిరిగిరాకముందే భానుదత్తుడు చనిపోయాడు చావునకుముందు తనవద్ద మిగిలిపోయిన రత్నాలన్నీ పెట్టెలో భద్రపరచి ఆప్తునిచేత చిత్రవద్దకు పంపించాడు దానిని భర్తచేతులలో పడనీక ఆమె శాంతను అప్పగించింది ఆ తరువాత కన్నుమూస్తూ బిడ్డనుకూడా

ఆమెకే అప్పగించింది శాంతి బిక్షువు ఆదేశించకపోతే ఆమె ఆ బరువు తననెత్తిమీద పెట్టుకొనేదికాదు చిత్ర శకకన్య కాదు ఆంధ్రకన్య కాదు జాతిసాంకర్యం శాంతకు సుతరాముగిట్టదు కాని బిక్షువుల ఆదేశాన్ని ఎలా త్రోసివేస్తుంది? చరాస్థితో పాటు నాలుగేండ్ల పిల్ల అయిన చిత్రను వెంటబెట్టుకొని ఆమె తన ఇంటికి చేరింది

ఈ వృత్తాంతం శాంత ఎవరికి చెప్పలేదు చిత్రకూ చెప్పలేదు ఒకసారి చిత్ర శాంతను అడిగింది ''మా అమ్మ నన్ను మీ అక్కయ్యకు ఎందుకు అప్పగించింది?'' శాంత దిమ్మరపోయింది నెమ్మదిగా తెమల్చుకొని అన్నది ''మీ అమ్మ ప్రస్తావన ఏమున్నది? మీ నాన్న అప్పగించాడు.''

''అయితే మా అమ్మ చచ్చిపోయిందా?''

'' ఏమో, తెలియదు అసలు మీ అమ్మనే ఎరుగను ''

మీ అక్కయ్యఅయినా చూచిందా?''

''కలలోకూడ చూచి ఉండదు చూచి ఉంటుందనుకోను '' శాంత కటువుగా అన్నది

''మా అమ్మ బ్రతికి ఉందో లేదో తెలిస్తే ఎంత బాగుండును!''

''దేనికి?''

''బ్రతికి ఉంటే నన్ను తనదగ్గిర అట్టిపెట్టుకొనక ఎందుకిచ్చి వేసిందో అడుగుతాను.''

ఆ మాటతో శాంత హృదయం బావురుమన్నది చిత్రను గుండెకదుముకొని ''ఇదంతా నీ కెవరు చెప్పా''రని అడిగింది

''వేదగిరి ''

'' ఇంకా ఏమి చెప్పాడు?'' ఆ మాటలలో బుస బుసలు గుస గుసలు పోయాయి

''నాతోకాదు రుద్రదామునితో చెబుతుంటే విన్నా ఒకసారికాదు, రెండుసార్లు చెప్పాడు మా అమ్మ మంచిది కాదట, మా నాన్నకూడ చెడిపోయాడట?'' చిత్ర చిన్నారి బుగ్గలపై సెలయేళ్ళుపారాయి

శాంతమ్మ ఆ అన్యాయం సహించలేకపోయింది మొదటిసారిగా కౌగిలించుకొని బుజ్జగిస్తూఅన్నది ''అది అర్థం లేని వాగుడు దానిని ఎప్పుడూ నమ్మకు వేదగిరి మనిషి అయితే అలా చెప్పి ఉండడు అతడెన్నడూ మీ నాన్నను చూడలేదు మీ అమ్మనూ చూడలేదు ఎరగడు, ఎరగనప్పుడు మీ అమ్మా నాన్నలు మంచి వాళ్ళో చెడ్డవాళ్లో ఎలా చెబుతాడు? ఎలా తెలుస్తుంది? మీ నాన్నను నేను స్వయంగా ఎరుగుదును అతడు చెడ్డవాడుకాడు మా

అక్కయ్యకూ తెలుసు. అతడు దుష్టుడుకాడు పైగా ఆమెకు కావలసినవాడు అందువల్లనే మీ నాన్న నిన్ను మా అక్కయ్యకు అప్పగించాడు ఆమెకు సంతానం లేదు అందువల నిన్ను పెంచుకొన్నది మరి మీ అమ్మకంటెనో చాలమంది పిల్లలున్నారు

చిత్రకు గుండె కుంపటి దించినట్లయింది "మరి మీ అక్కయ్య పిల్లలు కావాలనుకొనుదా?"

"ఎంతేనా? పిల్లలకోసం కలవరించేది"

లేత బుగ్గపై వ్రేలిడుకొని చిత్ర అడిగింది "మరి మా నాన్న ముందుగానే నన్ను నీవద్దకు ఎందుకు తీసుకురాలేదు? నీకు ఆడపిల్లలు అక్కరలేదని ముందే తెలుసుకొన్నాడా?"

ఒక క్షణం శాంత స్తబ్ధురాలై పోయింది. అంతలోనే తెప్పరిల్లుకొని అన్నది "మీ నాన్నకూ మా అక్కయ్యకూ ఎంతో స్నేహం పైగా నేను అప్పటికి చిన్నదాన్ని"

"అయినా బాబు ఉండగా నీకు మరొక అమ్మాయి దేనికి? అంతా కూతుళ్ళకంటె కొడుకులుంటే బాగుండుననుకొంటారు అయినా చాలమందికి కొడుకులేకాదు కూతుళ్ళు కూడ ఉంటారు" చిత్ర లోకంతీరు వర్ణించింది

ఈ వర్ణన శాంతకు ఏమాత్రం హితంగా లేదు బాబును చూస్తున్నంత ప్రేమతో చిత్రను

చూడలేకపోతున్నానే అన్న బాధ ఆమె హృదయాన్ని దేవింది "అమ్మా చిత్రా! నీవు పసిపిల్లవు ఈ సంగతులు నీకు ఇప్పుడప్పుడే బోధపడవు పెద్దదానవైనప్పుడు నేను మీ అమ్మ నాన్నలను గూర్చి తెలిసిందంతా చెబుతా నీవు రెండేండ్ల దానవై ఉండగా మీ నాన్న చనిపోయాడు మీనాన్నకూ భిక్షువులకూ మంచిదానవు కావాలనుకొంటే బుద్ధనామ స్మరణ చేయాలి చీటికి మాటికి ఇలాంటి చిలిపి ప్రశ్నలడుగుతుంటే బిక్షువులకు కోపం వస్తుంది. సమయం వచ్చినప్పుడు నేనే చెబుతా" అమె గోముగా మందలించింది

చిత్ర పదేండ్ల వయస్సులో ఉండగా ఈ సంభాషణ నడిచింది, ఇప్పుడామెకు పందొమ్మిదవయేడు ఆ తరువాత ఆమె ఆ ప్రస్తావన ఎన్నడూ ఎత్తలేదు శాంతి భిక్షువునకు గూడ ఆమె అంటే ఎక్కడలేని మమత ఏర్పడ్డది అది నానాటికి అనలు కొనలు సాగి అల్లి బిల్లిగా అల్లుకొంటున్నది చిత్రకూడ తన తల్లిదండ్రుల సంగతి ఇదిగో చెబుతుంది ఇవాళే తెలుస్తుంది అని ఈ తొమ్మిదేళ్ళనుంచి ఆశపడుతూనే వచ్చింది కాని శాంతమ్మ ఇంతవరకూ ఆ ప్రస్తావన తేలేదు చిత్ర గుణవంతురాలు కాకపోతే చిర్రు బుర్రులాడ వలసింది కాని చిత్ర చిత్రయే కాని మరొకతె కాదు

చిత్రముఖం ఏవేళ చూచినా చిరునవ్వు లొలుకుతుంటుంది ఆమె మాటలు తీరు తెన్నులు చూచిన వారెవరూ ఆమెకు చీకు చింతలున్నవనుకోరు ఆమెచేసే ప్రతిపనిలో సంతోషం ఉట్టి

పడుతుంటుంది పిన్న పెద్దలను ఆప్యాయంగా పలకరిస్తుంది క్షణం సేపు రిత్తగా కూర్చోదు ఎప్పుడూ ఏదో చేస్తూనే ఉంటుంది విహారంలో రెండేండ్లు చదువు సంధ్యలు అభ్యసించింది అక్కడ ఆ సన్యాసినులు ఆమెను కన్నులకు కప్పుకొనే వారు చిత్రలేఖనం, కుట్టుపని మొదలైనవి కూడా నేర్పారు సంగీతమన్నా కవిత్వమన్నా చెవికోసికొనేది అయినా శాంత యోగినివలె నిర్లిప్తంగా ఉండేది

దర్మకీర్తికి కన్నులే కాదు హృదయం కూడ ఉన్నది చిత్ర అంటే అమ్మ ఎందుకు అలా అంటీ పట్టుక ఉంటున్నదో అర్థం చేసుకోలేకపోయాడు తన తల్లి హృదయం చట్రాయి కాదు తన్ను ప్రేమిస్తూనే ఉన్నది మరి చిత్రను ఎందుకు ప్రేమించదు ప్రపంచంలో గట్లుదాటక ఉప్పొంగి, పారేనదులుకూడా ఉండవచ్చునని అతనికితోచింది అతనికి బాగా తెలుసు నన్ను ప్రేమిస్తున్నావేకాని చిత్రను ప్రేమించడం లేదని అంటే అమ్మ ఎంతో బాధపడుతుంది చిత్ర విషయంలో తనకున్న అభిప్రాయాలను తనలోనే దిగమ్రింగుకొనడం ధర్మకీర్తికి చిన్ననాటినుంచి అలవాటై పోయింది తల్లితో ఏ విషయమైనా హృదయం విప్పి మాటలాడుతాడు కాని చిత్ర సంగతి మాత్రం ఎత్తనే ఎత్తడు

..... రెండు .....

శాంతి భిక్షువు వృద్ధు ఎనభై ఏళ్ళ ముదుసలి తనం మూపున కూర్చున్నది అతని భక్తి ప్రపత్తులు, అనన్యాలు, కష్టాలు పడుతున్న వారిని చూచి కరిగిపోతాడు నిరుపేదలంటే నీరవుతాడు తనయందు భక్తి తాత్పర్యాలు కలిగి ఎవరైనా పట్టు చీవారాలు యిస్తే పట్టుమని అతని ఒంటిమీద పదిరోజులుండవు ఏ బిచ్చగాండ్రకో ఇచ్చివేస్తాడు ఉపాసకులకు ధర్మోపదేశం కోసం ఆవయసులో కూడా ఎంతదూరమైన వెళ్లేవాడు ఇప్పుడు వెనుకటి రోజులు కావు కాళ్ళు వంగవు చూపు ఆనదు "ఈ స్థితిలో ఉండి ఎలా నడుస్తారు? ఈ గుర్రాన్ని పుచ్చుకోండి" అని ఎవరైనా అంటే, "నాయనా! భిక్షువులు భోగభాగ్యాలు అంగీకరించరా"దని నిరాకరించేవాడు 

దేశానికి కొత్తగా వచ్చిపడ్డ యవనులు విహార భూములు స్వాధీన పరచుకోసాగారు భిక్షువులకూ వారి అండకాగే అనాథులకు ఆశ్రయం అంతరించసాగింది ఇన్ని ఇక్కట్లు చుట్టుకొంటున్నా శాంతి భిక్షువు ధర్మమే జయిస్తుందన్న విశ్వాసంకోల్పోలేదు రేపటికైనా మంచి రోజులు వస్తవని అతని నమ్మిక

అతడు శాంతాదేవి ఇంటికి బయలుదేరి వస్తున్నాడు దారిలోనే చిత్ర స్వాగతమిచ్చింది సాష్టాంగ పడి అతనిదీవనపొందింది "ఇంతభక్తి మానవులకు అందరికీ ఉంటే ఎంత బాగుండు"నని అతడనుకొన్నాడు "అంతా కుశలమేకదా!" అని అడిగాడు "అంతా

కుశలమే పది రోజులనుంచి మీ రాక కోసమే ఎదురుచూస్తున్నా''మని చెప్పింది భిక్షువుల యోగక్షేమాలడిగి తెలిసికొని నఖశిఖ పర్యంతం చూచింది అతడు అన్నాడు ''ఇంకా ఎన్నోసార్లు ఇక్కడకు వస్తాననుకోనమ్మా! వార్ధక్యం పైనబడ్డది కాళ్ళు వడకుపట్టాయి కడకంటి మీద కాకి చూపు వ్రాలింది.''

''అలా అనకండి భిక్షువులు అశ్వదానం పడితే బాగుండునని మా అత్తయ్య అన్నది అన్నట్లు ఎందుకు పుచ్చుకోరాదు? ఇక్కడ గుర్రాలకు తక్కువలేదు మీరొకటి పుచ్చుకొంటే నష్టమేమిటి? నడవలేనప్పుడు గుఱ్ఱం అక్కర పడుతుంది'' చిత్ర అడిగింది

భిక్షువు అన్నాడు ''మీ అత్తయ్య ఇస్తుంది సందేహం లేదు కాని మా భిక్షుక నియమాలు సమ్మతించవమ్మా ''

కంటికి అడ్డుపడుతున్న కందిరెమ్మల్లో దారిచేస్తూ చిత్రపోతూ ఉంటే శాంతి భిక్షువు వెనుక వెళ్ళుతున్నాడు. ఇంతలోనే భిక్షు సందర్శనంకోరి ధర్మకీర్తి ఎదురువచ్చాడు అతని ముఖవర్చస్సు చూచి చిత్ర విస్తుపోయింది ''ఇంత అందంగా ఉంటాడు కాబట్టే అత్తయ్య బాబును ప్రేమిస్తున్నది నేనుకూడా ఇంత అందంగా ఉంటే నన్ను కూడా ప్రేమించేదే,'' నని ఆమె నిట్టూర్చింది. చిత్ర తన అందం తానెరుగని పిల్ల



భిక్షువు శాంతాదేవిగారి ఇంటికి వెళ్ళాడు మాలతి కాళ్ళుతొక్కుకొంటున్నది బుద్ధ దేవునకు కప్పే ఉత్తరీయం ఉదికి కంచెమీద ఆరవేసింది ఎండిన తరువాత తీయబోతే కొర్రుపట్టి కొంత చినిగింది ఆ సంగతి తెలిస్తే శాంతమ్మ ఆమెను బ్రతుకనీయదు ఆ సంగతి తెలుసుకొని చిత్ర దానిని చక్కబరచేపని తనపైన వేసుకొన్నది ఉత్తరీయం చక్కగాకుట్టి తిరిగి నదిరేవులో జాడిస్తున్నది శకయువకుడు గుణవర్ధనుడు ఆమె సౌందర్యంచూచి ముగ్ధుడయ్యాడు ఆమె ధర్మకీర్తి అర్ధాంగీ కాబోలు ననుకొన్నాడు

## ..... మూడు .....

మరునాటి వేకువనే భిక్షువు మేలుకొలుపుపాట పాడ నారంభించాడు ఆపాట అందరికీ వచ్చు ఏ మూల ఉన్నవారు ఆమూలనుంచే గొంతులు కలిపారు శాంత, ధర్మకీర్తి, చిత్ర, మాలతి, ఉపాసిక, వేదగిరి, రుద్రదాముడు పాడుతున్నారు ఆ గొంతులన్నిటికంటె మధురంగా మరొక కొత్తగొంతు ఎవరిదో చిత్రకు వినిపించింది ఆమె చకితురాలై ఆ క్రొత్తగొంతు ఎవరిదో కనుగొనాలని అనుకొన్నది తరువాత ధర్మకీర్తి చెప్పాడు ఆ మధురకంఠం గుణవర్ధనునిది.

శకులజట్టు ప్రత్తి తెచ్చి గంపలతో అందిస్తూ ఉంది ధర్మకీర్తి వెన్నుగాడిపట్టుకొని పెద్ద బోరంలో ప్రత్తి తొక్కుతున్నాడు పడి లేచినవాడు కావటంవల్ల సత్తువలేదు అలసట కలుగుతున్నది

కాని దిగివచ్చి ఆ పని వేదగిరికి అప్పగించటం మనస్కరించలేదు పట్టుదల కొలది అలాగే పనిచేయనారంబించాడు ఆ దూగరతో, ఆశ్రమతో అతడు అలాగే స్పృహతప్పి త్రాళ్ళపై వ్రాలాడు పనివారుఅంతా గొల్లుమన్నారు శాంత చేతులు పిసుగుకొంటూ నిలబడ్డది. ''ఎక్కండి క్రిందకు దించం''డని చిత్ర కేకలు పెడుతున్నది గుణవర్థనుడు సాహసించి పై కెక్కి ఎలాగో అవస్థపడి ధర్మకీర్తితో దిగివచ్చాడు అదిచూచిన చిత్రకు గుణవర్థనుడంటే ఎక్కడలేని ఆదరాభిమానాలు పుట్టుకొచ్చాయి

## .... నాలుగు .....

''భిక్షువుల రాకకోసం ఆగకుంటే చినబాబు పనికి దిగేవాడుకాడు ఈ ప్రమాదం సంభవించేది కాదు,'' అని అంతా అన్నవారే కాని శాంతకుమాత్రం ఒకవిధంగా నిబ్బరమేర్పడింది ఆకష్టస్థితిలో భిక్షువులు తమవద్దనే ఉన్నరు

ధర్మకీర్తిపడి మంచమెక్కిన మూడవనాడే వెన్నుగాడినుంచి పడి వేదగిరి కాలు విరగగొట్టుకొన్నాడు అతనికి వయస్సు మళ్ళింది వయస్సులో విరిగిన ఎముక తిరిగి కట్టుకొనే అవకాశం తక్కువ ఇక జీవితమంతా అవిటిబ్రతుకే ఏది ఎలా ఉన్నా ఎముక కదల్రేని కట్టుకట్టాలి. అందుకై రుద్రదాముణ్ణివైద్యునికోసం తరిమారు అతడు రావాలంటే ఎటులేదన్నా పదిరోజులు పడుతుంది



వేదగిరికి పోట్లు ప్రారంభమయ్యాయి బాధ భరించలేక దేవతలను తిట్టిపోయసాగాడు మాలతి ఆ తిట్లు వినలేక చెవులు మూసుకొన్నది శాంతమ్మకూడా కష్టస్థితిలో ఉండి వేదగిరి సంగతి పట్టించుకోలేకపోయింది తన బాబుకు అంకపొంకాలతో జ్వరం, ఒకటే పలవరింత, గుణవర్థనుని, వేదగిరిని పదేపదే కలవరిస్తున్నాడు ధర్మకీర్తివద్దకు ఒకసారి గుణవర్థనుని పిలిపించ వలసిందని శాంతకు భిక్షువు చెప్పాడు గుణవర్థనుడు వచ్చి బాబుకు ఎదురుగా నిలబడ్డాడు అతడింకా గుణవర్థనుని కలవరిస్తూనే ఉన్నాడు

''గుణవర్థనుడు కాసేపు వీణవాయిస్తే బాబు మనస్సు కుదుట పడుతుందేమో. అతడు చక్కగా వాయిస్తాడు పాడుతాడు అని బాబు ఎంతో మెచ్చుకొనేవాడు'', అన్నది చిత్ర

''అవును, నాయనా వర్ధన్! కాసేపు నీవీణ పలికించలేవూ?'' అని భిక్షువు అన్నాడు

''నా వీణ ఇంటివద్ద ఉంది'' అన్నాడు గుణవర్థనుడు

''కాసేపుపాడితేనో?'' చిత్రసూచన ప్రాయంగా అందించింది

గుణవర్థనుడు మెల్లగా గొంతు విప్పాడు ధర్మకీర్తి ముఖం కవళికలో మార్పు కనిపించింది.

అతడు పాట వింటున్నాడనిపించింది ప్రక్కకు తిరిగి చెంపకింద చేయి పెట్టుకొని పండుకొన్నాడు కన్నులు ముకుళించాయి అతనిని చూస్తున్న తక్కిన ముగ్గురు చకితులయ్యారు

"కాస్త ఇప్పుడే నిద్రపడుతున్నట్లున్నది" అన్నాడు భిక్షువు

"బాబుకు ఆపాటే కావాలి," అన్నది చిత్ర

శాంత మాటాడలేదు పాట ఆపవద్దని వేడుకొంటున్నట్లు దీనంగా చూస్తున్నది గుణవర్ధనుడు ఎత్తుకొన్నపాట అయిపోయింది ధర్మకీర్తి మళ్ళీ కనులు తెరిచాడు

"ఆపకు గుణవర్ధన్ ఆపకు? మరొకజన్మలోనైనా నీ ఋణం తీర్చుకొంటాను" శాంతప్రాధేయపడ్డది

అతడు మరొక పాట ఎత్తుకొన్నాడు బాబుకు నిద్ర పట్టింది క్రమంగా అతనిపాట కూడ ముగిసింది

"ఇంక వెళ్ళనా?" అతడు అడిగాడు

"వద్దు వద్దు మళ్ళీ మెలకువ వస్తుందేమో!" అని శాంత బ్రతిమాలుకొన్నది



అందరూ తలొక ప్రక్కన చతికిలబడ్డారు చిత్ర చెమ్మరించిన కన్నులతో బాబును చూస్తూ కూర్చున్నది బహుశ ఆమె అతన్ని ప్రేమించి ఉంటుందనుకొన్నాడు గుణవర్ధనుడు కొంతసేపటికి అతడు లేచి "ఈ గది వెలుపలే ఉంటాను అవసరమయితే పిలవం"డని చిత్రకు చెప్పి బయటకు వెళ్ళాడు

ఆరు గడియలు గడిచాయి మరొకసారి గుణవర్ధనుడు లోపలికి తొంగిచూచాడు శాంతా భిక్షువుల చేతులలోని తావళాలు మెల్లగా తిరుగుతన్నవి చిత్ర గోడకు చేరగిలబడి నిద్రపోతున్నది ఆమె మనస్సు ఏవేవో కలలు కంటున్నది. బాబు చనిపోతేనో! గుండె గుభేలు మన్నది భిక్షువును తన్ను వెంటకొనిపొమ్మని అడగాలనుకొన్నది అవును ఒంటరిగా తానెలా బ్రతుకుతుంది? ఆ లోకంలో ఉండి శాంత సంగతే మరిచిపోయింది

నిద్రలో ఉన్న చిత్ర ముఖం గుణవర్ధనునికి అందంగా కనిపించింది బాబు లేకపోతే ఆమె బ్రతుకలేదనుకొన్నాడు భిక్షువులేచి అతన్ని పిలిచాడు భిక్షువు ముఖం చూడగానే "ప్రమాదం గడచింది బాబు బ్రతుకుతాడు" అన్న ఆశ అతనికి కలిగింది.

భిక్షువు అన్నాడు "వర్ధన్! నీవు శ్రమ పడాలి మీ వాళ్ళను పంపించి నీవు ఇక్కడ దిగడాలి వేదగిరికి బదులుగా నీవు ఇక్కడ ఉంటే అతనికిచ్చే జీతమే శాంతమ్మగారు నీకిస్తారు ఏమంటావు?"

గుణవర్ధనుని మనస్సులో కుమ్ములాట బయలుదేరింది ఎలాగో తెమల్చుకొని ''ఇక్కడ పని కాగానే వస్తామని శ్యామదేవుగారికి మా జట్టు మాట ఇచ్చిందండి!'' అన్నాడు

''మాట యిచ్చిన తరువాత తప్పరాదనుకో. కాని ప్రస్తుతానికి మీ జట్టు మరొక నాయకుణ్ణి ఎన్నుకోరాదా?''

ఇంతలోనే చిత్ర వచ్చింది ''గుణవర్ధనుని ఉండమనేగా మీరు చెబుతున్నది గుణవర్ధన్ నీవు పోవటానికి వీలులేదు నీకు బదులు మరొకణ్ణి డబ్బిచ్చి అత్తయ్య పంపుతుంది బాబుకు స్వస్థత చిక్కేదాక నీవు ఇక్కడే ఉండాలి అంతేకాదు వేదరిగి తిరిగి లేచేవరకూ నిలిచిపోవలసిందే చినబాబు మళ్ళీ పాడమంటే ఏమిచేయాలి? కాదనకు మామాట తీసివేయకు''

''ఇంతగా అడుగుతుంటే ఎలాకాదంటాను? అవసరం ఉన్నంతకాలం ఉంటాను.'' అని గుణవర్ధనుడు అన్నాడు.

''అమ్మయ్య బ్రతికాము అత్తయ్య మీ మేలు ఎన్నడూ మరచిపోదు మీకష్టం ఉంచుకో''దని ఆమె వెళ్ళిపోయింది

''డబ్బుకోసమా?'' అతడు బాధపడ్డాడు ఆమాట చిత్రకు వినపడలేదు 239

''అయ్యో! డబ్బుకోసం నాజట్టును వదలను వదలుకోలేను కాని కష్టాలలో ఉన్నారు అందుకని చేదోడుగా ఉండాలని ఉన్నది.'' అతడు భిక్షువుతో అన్నాడు

చిన్నప్పటినుంచి భిక్షువు అతనిని ఎరుగు

''నీసంగతి నాకు తెలియనిదా? మంచిపని చేస్తున్నావు నీ సాయం శాంతమ్మగారు మరచిపోలేరు ఈ స్నేహం, సానుభూతి డబ్బు కొనగలదా? వట్టిది నాయనా! వట్టిది ఇంట్లో ఉన్నది ఇద్దరూ ఆడంగులే మరి మగతోడులేదు నేనుకూడవెళ్ళిపోతున్నాను'' అన్నాడు భిక్షువు

''చినబాబుగారుతొందరగానే కోలుకొంటారా?''

''మంచి లక్షణాలే కనిపిస్తున్నవి అయితే నీరసం వెంటనే తగ్గదనుకొంటాను'' భిక్షువు వివరించాడు

గుణవర్ధనుడు తన జట్టువద్దకు వెళ్ళాడు వారిలో కస్సుబుస్సులు రేగాయి. ప్రొద్దు వాటారుతున్నది మధ్యాహ్నం తిండి తిప్పలు లేవు పనికాగానే జట్టు పదిగంటలకు వెళ్ళిపోతుందని వంటచేయలేదు గుణవర్ధనుకు తాను దిగడిపోతున్నానని చెప్పటానికి ఏమాత్రం తరుణంకాదు ఆ కబురు, ఈ కబురు చెప్పి మెల్లగా భిక్షువులు తన్ను నాలుగురోజులపాటు

అక్కడ ఉండమన్నారని చెప్పాడు బిక్షువంటే వారు ప్రాణాలు విడుస్తారు అలాగైతే సరేలెమ్మని వారు ఒప్పుకొన్నారు అతని సూచనపై మరొక నాయకుని ఎన్నుకొని బయలుదేరబోతున్నారు

ఇంతలో చిత్రవచ్చి ''మీవాళ్ళు భోజనాలు చేయలేదటగా! ఇప్పుడే తెలిసింది, ఎంతపని జరిగింది! భోజనం చేసి వెళ్ళుతారు ఉండమను'' అని గుణవర్ధనునితో చెప్పింది

''ఎందుకు శ్రమ? శ్యామదెవ్ గారింటికి వెళ్ళటానికి ఎంతో సేపు పట్ట''దని అతడన్నాడు

''లేదు భోజనం చేయ్యందే బయలుదేరటానికి వీలులే''దని చిత్ర పట్టుపట్టింది శాకపాకాలు నిమిషాలమీద జరిగిపోయాయి గుణవర్ధనుని సాయంతో ఆ జట్టుకు భోజనాలు జరిగిపోయాయి ఆ కమ్మని తిండి తనకు దొరకలేదే అని వేదగిరి తిన్నవాళ్ళను తిట్టిపోస్తూ మంచంలో పొర్లాడుతూ వున్నాడు పయనమై బయలుదేరిన జట్టులోనుంచి ఒక మంచి రౌతును చాటుకు పిలిచి తనయింటనున్న వీణను తెచ్చియిచ్చి తరువాత జట్టును కలుసుకోవలసిందని గుణవర్ధనుడు చెప్పిపంపాడు

..... ఐదు .....

గుణవర్ధనుడు ఆ యింట చక్కగా అతుక్కుపోయాడు ఏ పని ఎప్పుడు చేయాలో ఎరిగి అందుకొంటున్నాడు ''అది ఇలా చెయ్యి ఇది అలా చెయ్యి,'' అని వేదగిరి ముసలి నసుగుడు నసుగుతున్నాడు అన్ని పనులలో అతడు ఆరితేరిన వాడని వేదగిరికి తెలియెదు ఒకప్పుడు ఆశకయువకునికి చినబాబుకున్న భూవసతి ఉండేదనీ దానినంతా ఒక్కచేతి మీదుగా దిద్ది తీర్చుకొనే వాడని ఆ ముదుసలి ఎరుగడు. అతని శరీరం ఉత్తుంగ మయినట్లే హృదయం విశాలం. గుణగణాలలో చినబాబుకు గుణవర్ధనుడు తీసిపోడు అయితే ఇప్పుడు చితికి అతడు నివురుగప్పిన నిప్పువలె ఉన్నాడు వేదగిరికి కూడ అతనియందు అనురాగం ఏర్పడ్డది అది నిస్స్వార్థం కాదు శాంతమ్మగారు శకయువకుడైన గుణవర్ధనుని ఎంతో కాలం పనిలో ఉంచదు ఈ నాలుగు రోజులు పోతే పంపివేస్తుంది మళ్లీ తాను పనిలో చేరవచ్చును అలా కాక ఏ ఆంధ్రునో పనికి కుదుర్చుకొని ఉంటే ఆమె అతన్ని పంపివేయదు అప్పుడు తనకు దిక్కూ మొక్కూ ఉండదు

తన జట్టు వెళ్ళిపోయిన మరునాటి సాయంకాలం గుణవర్ధనుడు ధర్మకీర్తి గదివద్దకు వెళ్ళాడు పంచలో చిత్ర నిలబడి ఉంది. ''చినబాబుగారికి ఈ రాత్రి వీణ వినిపించమంటారా?'' అని అతడు అడిగాడు

''వీణా? ఎక్కడిది?'' అశ్చర్యపడి చిత్ర ప్రశ్నించింది

''నాదే''

''వెంట తేలేదంటివే?''

''నిజమే కాని రాత్రి మనిషిని పంపి తెప్పించాను ''

''మీ ఊరినుంచి తెప్పించావా?''

ఆవూరు ఇక్కడ లేదు ముప్పై అయిదు క్రోసులుంది

''అవును, మా గుర్రాలు దమ్ముపట్టి ఎంత దూరమైనా దూకుతాయి రోజుకు యాభై క్రోసులంటే వాటి కొక లెక్కకాదు ''

విస్మయంతో చిత్ర కనులు చెంపకు చేరడయ్యాయి ''ఆసంగతి చెబితే బాగుండేది తగిన పారితోషికం ఇచ్చే వాళ్ళము ''

''ఆ ఇవ్వవలసిందేదో నేనే ఇచ్చాను అసలు అతన్ని పంపింది నేనుకదా!'' గుణవర్ధనుడు ముఖం చిన్నబుచ్చుకొన్నాడు

''మాకోసం కదా నీ వతనిని తరిమింది? అతనికి యివ్వవలసిందేదో మా అత్తయ్యే ఇస్తుంది,'' అని చిత్ర అన్నది

''ఇదివరేకు యిచ్చాను చినబాబుగారు వినటమే నాకు కావలసింది '' గుణవర్ధనుడు వెళ్ళిపోయాడు వెళ్ళిపోతున్న గుణవర్ధనుని చిత్ర మొదటసారి తేరిచూసింది. 

'' ఏమి నడక! ఏమి ఠీవి! డబ్బు ఇస్తామంటే అతన మనస్సు నొచ్చుకొని వుంటుంది చిన బాబుకోసం తానే ఖర్చు పెడుతున్నాడు బాబుకు చెప్పాలి వెళ్ళిపోయేటప్పుడు తగిన కానుక ఏదో ముట్టజెప్పమనాలి ''

ఇంతలో మాలతి వచ్చింది. ''చూడు! చిత్రా గుణవర్ధనుడు ఎంత అందంగా ఉన్నాడో! బంగారు కొండ నడుస్తున్నది ఎంత చక్కగా నాట్యం చేస్తాడని! క్రిందటి ఏడు అతనితో కలిసి నాట్యం చేశాను ఆ ఒడుపు, ఆ నేర్పు మరొకరికి రావు'' అన్నది చిత్ర చటుక్కున దూరంగా జరిగి ''పరాయి మగవాళ్ళను గూర్చి అలా మాటాడటం బాగుండలేదు నీ మాటలు వింటే అత్తయ్య ఏమంటుంది?'' అని కన్నె త్రాచువలె అచటనుంచి వెళ్లిపోయింది మాలతికి ఆ మాట చెంపపెట్టయి అలాగే నిలబడి పోయింది ఒకసారి గుణవర్ధనుని వైపు మరొకసారి చిత్ర వైపు చూచింది సన్నిహితంగా సాగి కొండముందు చీలి దూరమైపోయే నదులవలె వారిద్దరు వెళ్ళిపోయారు ఆ సన్నివేశం ఆ రోజున మాలతి హృదయంలో ఒకటి రెండుసార్లు మెదలి తుదకు ఒక అనిర్వచనీయ బీజంగా నాటుకుపోయింది

చిత్ర చిన బాబు గదికి పోయింది అతడు నిద్రపోతున్నాడు శాంత అతని మంచం ప్రక్కనే కూర్చుంది మెల్లగా విసనకర్రతో విసురుతున్నది నిద్రాహారాలువర్జించి సేవచేస్తున్న ఆముఖం కళావిహీనంగా ఉన్నది ఆమె కంఠంలో కూడ దుఃఖం, దౌర్బల్యం తొంగి చూస్తున్నవి

''కాసేపు తోటలోకి వెళ్ళి విశ్రాంతి తీసికోండి నేను రోగివద్ద కూర్చుంటాను'' చిత్ర మృదువుగా అన్నది

''నా స్థానం ఇక్కడే '' సానరాతి మీద కత్తి కదలించి, ఎవరి కనికరం శాంతకు అక్కరలేదు అలాంటిది కనిపిస్తే ఆమెకు చీమలు జెర్రులు పారుకాడినట్లుంటుంది

చిత్ర గొజ్జంగిపూవు తెచ్చి బాబు చెంప ప్రక్కన పెట్టింది ఆ పూవంటే అతనికి ఎంతో ఇష్టం. ఆ సంగతి చిత్రకు తెలుసు శాంత చటుక్కున ఆ పూవుతీసి విసిరి పుచ్చుకొని కిటికీ గుండా గిరాటు పెట్టింది ''జబ్బుగా ఉన్న మనిషికి పూవులు పనికిరావు.'' ఆమె చిడిముడిపడ్డది చిత్ర కనులు మంచం దాపులో ఉన్న సంపెంగ మొగ్గలపై పడ్డాయి చినబాబుకు అవి అంటే ఏ మాత్రం ఇష్టంలేదు ఒంటరిగా ఉన్నప్పుడు తనతో బాబు అన్నాడు తల్లితో సాహసించి ఎన్నడూ ఆ సంగతి చెప్పలేక పోయాడు

'' ఇక్కడ ఉండనా?'' చిత్ర అడిగింది



''నీ యిష్టం'' శాంత త్రుంచివేసింది చిత్ర ఉనికే ఆమెకు అవ్యక్తబాధ కలిగించింది తన బాధను ఆమె పరిశీలించుకోలేదు తనకొడుకు నానాటికి శుష్కిస్తున్నాడు మృత్యుముఖాన పడబోతున్నాడు. చిత్ర గుజ్జెంలాగా తిని తిరుగుతున్నది అదృష్టంచాలక బాబు పోయేడేపో, దీని ముఖం తాను ఎలా చేస్తూ కూర్చుంటుంది? దేవతలు ఇలా ఎందుకు చేస్తున్నారో। ఇలాంటి భావాలేవో ఆమె మనస్సులో దాగుడు మూతలు ప్రారంభించాయి

బాబు దురవస్థచూచి కంటతడిపెట్టే చిత్రను చూచినప్పుడు శాంతకు అరికాలిమంట నెత్తికెక్కేది. ''బుడిబుడి ఏడ్పులు దీనికెందుకు? తల్లి ప్రేమ దీనికేమి తెలుసు? అసలు నా బాబుకు ఇది ఏమౌతుంది?'' అనుకొనేది నిజానికి బాబుహృదయం తెలిసి ఉంటే, చిత్రను అతడు గాఢంగా ప్రేమిస్తున్నాడని పసికట్టి ఉండే శాంత గుండె బదాబదలై ఉండేది లేదా చిత్రను నిలువున చీల్చి చంపి ఉండేది కాని అది ఆమె ఎన్నడూ తెలిసికో లేక పోయింది

ఒకనాటి అసుర సంధ్యవేళ పక్కకుదరక బాబు దొర్లుతున్నాడు జ్వరం ఎక్కువయింది గుణవర్ధనుని పిలిపించి పాడించమని అతడు కోరాడు అక్కడే ఉన్న చిత్ర ఆ మాట విన్నది ''మనిషినిపంపి గుణవర్ధనుడు తన వీణ తెప్పించుకొన్నాడు ఆ మనిషికి కూలి ఇప్పిస్తానంటే ఎంతో నొచ్చుకొన్నాడు 'నేనే ఇచ్చివేశానుగా, ఇంకా దేనికి? అన్నాడు '' అని ఆమె చెప్పింది

''గుణవర్ధనుని తత్త్వం నీకు తెలియదు అతడు పుట్టినతరువాతనే అభిమానం పుట్టింది వాళ్ళనాన్న శకసంఘాలకు పెద్ద అతడంటే ఆంధ్రసామ్రాట్టుల కెంతో నమ్మకం మనకున్నంత ఆస్తిపాస్తులు ఒకప్పుడు అతనికీ ఉండేవి'' ధర్మకీర్తి స్థితిగతులు వివరించాడు

చిత్ర విస్తుపోయింది ''మరి గుణవర్ధనుడు నిరుపేదవలె కనిపిస్తాడే?''

''అవును, మనతో పోల్చుకొంటే అంతే కాని గుణవర్ధనుడు వాళ్ళనాన్న తమకున్న ఆస్తిని తామే బొక్కరు ఉన్నది కాస్త ఆ ఊరి వారి అందరితో కలిసి అనుభవిస్తారు అందువల్ల అలా ఉన్నారు తమవద్ద చిట్టెడు గిజలున్నంతవరకు శకజాతిలో ఎవరూ తిండిలేక మాడరు ''

''ఎంత ఔదార్యం! మనకంటె వాళ్ళే సంస్కారవంతులన్న మాట!'' చిత్ర అమాయికత్వం వెళ్ళబోసింది

''శకజాతి స్వభావమే అంత '' అన్నాడు ధర్మకీర్తి ఎందుకురా అంతగా వాగుతావు? అంటూ శాంత గదిలోకి వచ్చింది ఆ దోషమంతా నీ దేనన్నట్లు చిత్రవంక చూచింది ''నీవు ఇలాంటి దానివి కాబట్టే గదినుంచి నేను కాలు కదపటానికి వీలులేకపోతున్నది.'' అన్నట్లు ఆ చూపులు కనిపించాయి చిత్ర నొచ్చుకొన్నది. ''నీకు బాధకలిగించానా'' అని బెదురుతూ చినబాబు నడిగి, ''నిజమే, కొంచెం సేపటి నుంచి మాటాడుతున్నా''డని ఆమెతో అన్నది



కత్తివ్రేటు నుంచి మేకపిల్లను తప్పించాలి వెంటనే బాబు అన్నాడు ''గుణవర్ధనునితో వీణ పట్టుకురమ్మని చెప్పు ఆ వాదనతో అయినా కాస్త కునుకు పడుతుందేమో!''

చిత్ర గుణవర్ధనుని కోసం తలచావడి, దొడ్డి, తోట, సందు, గొంది అంతా వెదకింది అతని ఆచూకి కనిపించలేదు ఈవేళ అతడు ఎక్కడికి పోయినట్లు? పెరటి దొడ్డి తలుపు తెరచి వాగువంక చూచింది రేవు దాపున రెల్లు దుబ్బుల మాటున రెండు మూర్తుల కదలిక కనిపించింది అతడేనా? ఈ వేళ అక్కడ ఏమి చేస్తున్నట్లు? అతని ప్రక్కన ఉన్న రెండవమనిషి ఎవరు? ఆమె బయలుదేరి వెళ్ళి ''గుణవర్ధన్'' అని పిలిచింది ఆ కేక వినిపించగానే తన ప్రక్కన ఉన్న వ్యక్తిని వదలి వచ్చి ఒక్కక్షణంలో గుణవర్ధనుడు చిత్రముందు నిలబడ్డాడు

''బాబుగారు పిలుస్తున్నారా? ఈ సంజవేళ వీణ వింటారేమోనని పట్టుకొచ్చా''నని అతడన్నాడు

''అవును బాబు నీ వీణ వినాలని కలవరిస్తున్నాడు నీకోసం అంతటా గాలించాను '' అంటూ చిత్ర రెండవ వ్యక్తివైపు చూపుసారించింది ఆమె తాత్పర్యం గ్రహించి, '' ఎవరో కాదు - మాలతి. పిలవమంటారా?'' అన్నాడు.

''లేదు అవసరంలేదు చిత్ర గొంతులో ఎందుకో పలుగురాల పటపటలు వినిపించాయి ''ఈ వేళ అక్కడ ఏమిచేస్తున్నట్లో?''

''బట్టలు ఉదుకుతున్నది ''

''ఈ మునిమాపు చీకట్లోనా?'' ఇలాంటి వేషాలు అత్తయ్యకు గిట్టవని అనుకొన్నది గుణవర్ధనుని వెనుకనే ఇంట్లోకి వెళ్ళుతూ ''మాలతిని మందలించటమా లేదా? మందలించవలసివస్తే ఎలా మందలించాలి?'' అని ఆలోచించింది

మాలతి మనసులో ఎన్నో భావాలు పింపిళ్ళు కూయసాగాయి పావడాను నీళ్ళలో జాడిస్తూ ఆలోచించింది. ''నేను వచ్చి అతన్ని పలకరించానో లేదో ఎక్కడనుంచి ఊడి పడ్డది చిత్ర? మెరుపులాగా వచ్చి పిలిచింది గాలిలాగా అతడు దూసుకుపోయాడు ఇంత అనతికాలంలో అతనిలో ఇంతమార్పు ఎందుకు వచ్చిందో అర్థం కావటం లేదు ఒక గడియసేపు మాటాడితే అంతా తేలిపోతుంది నా చూపులు అతన్ని త్రాగివేస్తున్నవి శకుడే కావచ్చు చినబాబుకంటే వేయిరెట్లు బాగుంటాడు వేదగిరి అంటున్నాడు ఈపని తెలుసు ఆ పని తెలియదు అనరాదట అన్నిట్లో అందెవేసిన చేయట ''

మాలతి మడుగులు బుజాన వేసికొని గాలిమేడలు కట్టుకొంటూ నడుస్తున్నది ''గుణవర్ధనుని పెండ్లాడితే హాయిగా ఉండవచ్చును శాంతమ్మగారివద్దనే పని దొరుకుతుంది అతన్ని పెద్ద పాలేరును చేస్తుంది చిత్ర బహుశః చినబాబును పెండ్లాడుతుంది నిజంగా బాబు చిత్రఅంటే ప్రాణాలు విడుస్తాడు ఆమె మెట్టినచోట్లన్నీ అతనికి పుణ్యక్షేత్రాలే ఇంతకూ శాంతమ్మగారు పడనిస్తుందా? ఏది ఏలా ఉన్నా చినబాబు పెండ్లాడుతాడు. పిల్లాజెల్లా కలుగుతారు '' ఆ సౌధాలు గాలికి కొట్టుకు పోతాయని ఆమె కెలా తెలుస్తుంది?

ఆ రాత్రికి గుణవర్ధనుని మనస్సు ఏమో తేల్చుకోవాలని చిత్ర నిశ్చయించుకొన్నది ''చాటుమాటుగా మాలతి అతన్ని రెల్లు దుబ్బుల వెనుక కలుసుకొంటున్నట్లుంది అది ఆమెకు మర్యాద కాదు ఆ సంగతి వింటే అత్తయ్య మండిపడుతుంది ఆమె చెవిని బడకముందే అణచివేయాలి ఏది ఏలావున్నా గుణవర్ధనుడు అత్తయ్య దృష్టిలో చులకనైపోడా?'' అది చిత్రకు ఏమాత్రం యిష్టం లేదు. ''అయినా ఆతని దోషమేముంది? వెర్రి గంగుర్లెత్తి ఆడపిల్లలు వెంటబడుతున్నారు అతడెలా మానగలుగుతాడు? అలాటి విపరీత ప్రవర్తనకు లోనైతే మాలతిని గట్టిగా మందలించా''లని చిత్ర సంకల్పించుకొన్నది

చిత్రలో మార్పు ప్రారంభమైంది గుణవర్ధనుని కన్నులలో వింత సొగసులు కనిపించసాగాయి మరునాటి ప్రొద్దున ఆమె వరండాలో కూర్చొని బుద్ధదేవునికి దండకడుతున్నది అపుడే

గుణవర్ధనుడు కొడవలి పట్టుకొని వాగువైపు వెళ్ళుతున్నాడు తలయెత్తగానే ఆ దృశ్యం కనిపించింది ''ప్రొద్దుపొడవకముందే పొలానపనేమిటి?'' విస్తుపోయింది. మరల తలవంచుకొని తనపని సాగిస్తున్నంది అప్పుడే మరొకవైపునుంచి పాదాల సవ్వడి వినిపించింది. తిరిగిచూస్తే మాలతికూడ అతడుపోయిన దిక్కుకే పోతున్నది ఒకవేళ అత్తయ్య పంపితే పనిమీద వెళ్ళుతున్నదేమో ననుకొన్నది అయినా తెల్చుకొందామని ఆమె ధర్మకీర్తి గదికి వెళ్ళింది అత్తయ్య బాబు మంచం వద్దనే కళ్ళుమూసుకొని కూర్చున్నది

''అత్తయ్య! మాలతి ఎక్కడ? ఎక్కడికైనా పంపించారా?'' ఆమె అడిగింది

వంటయింట్లో ఉపాసికకు తోడ్పడమని చెప్పానే?

చిత్రవెళ్ళి వంటయింట్లో చూచింది ఎక్కడ పని అక్కడే ఉన్నది తిరిగి వరండాలోకి వచ్చింది వెంటనేపోయి మాలతిని పిలిస్తేనో? అది రుచించలేదు పొంచి చూడటం అసహ్యమనిపించింది దండపూర్తి చేదామని కూర్చున్నది కాని మనస్సు కుదుటపడలేదు ఆమె లేచి వారు వెళ్లినవైపు వెళ్ళింది

చిత్ర దగ్గరకు రాగానే మాలతి దూరంగా జరిగింది గుణవర్ధనుడు మాలతి చేతినుంచి తనచేయి విదల్చుకొన్నాడు రాగవిరాగాలతో మాలతీ గుణవర్ధనుల ముఖాలు మలిసంజలోని 
అవరోదయ దిశాముఖాలవలె వింతగా కనిపించాయి ''అత్తయ్య నిన్ను పిలుస్తున్న''దని మాలతితో చెప్పి చిత్ర గిరుక్కున మళ్ళి ఇంటివైపు చెర చెర నడక సాగించింది లోని సిగ్గు కినుకల క్రుమ్ములాట ఆచుకోలేక మాలతి తలవంచుకొని ఆమె వెనుకనే బయలుదేరింది

తనపై చిత్ర కెలాంటి దురభిప్రాయం కలిగిందో! తన్ను నిజంగా అర్థంచేసుకొంటుందా? లేక ఈ మాలతిని ప్రేమిస్తున్నానని అనుకొంటుందా? ప్రేమిస్తున్నానని అనుకొనక ఏమి చేస్తుంది? చేతిలోని చేయి చూస్తే ఎవరైనా ఏమనుకొంటారు? గుణవర్ధనునికి తన మీద తనకే కోపం వచ్చింది చేతిలోని కొడవలి గిరాటువెట్టాడు అది అనతి దూరంలో ఉన్న అరటి బోదెలో సగం మేర గుచ్చుకుపోయింది.

మాలతి మొదట దిగ్భ్రాంతి పొందింది తరువాత సిగ్గుతో క్రుంగి పోయింది తాను గుణవర్ధనుని ప్రేమిస్తున్నానని చిత్రకు చెప్పవచ్చు ననుకొన్నది తన చేతిని అతడు పురుగును విదల్చినట్లు విదల్చాడు. ఆమె చిత్రా గుణవర్ధనులను చూచింది వారి చూపుల్లో తొలిసారిగా ఆమెకు అనురాగం పొడకట్టింది ఈర్ష్య ఆమె హృదయంకలో పొయ్యి రాజేసింది ''శాంతమ్మగారు పిలుస్తున్నారా?'' ఆమె కటుస్వరంతో ప్రశ్నించింది.

చటుక్కున చిత్ర వెనుదిరిగి అన్నది। ''నీ ప్రవర్తన చూస్తున్నాను నిన్నకు నిన్న నేటికి నేడు గుణవర్ధనునితో కనిపించావు మరొకసారి ఇలాంటిది కంటబడితే అత్తయ్యతో చెబుతాను ''

'' ఇందులో తప్పేముంది?'' మాలతి ప్రశ్నించింది

'' ఇలాంటి పనులు ఏవీ అత్తయ్యకు గిట్టవు'' జాగ్రత్త

మాలతి వంట ఇంట్లోకి, చిత్ర వరండాలోకి వెళ్ళారు

''నా నడవడి శాంతమ్మగారికి విప్పిచెప్పటం ధర్మం వారి పనిలో ఉంటూ ఇలాంటి అపోహలకు తావివ్వటం మంచిదికా''దని గుణవర్ధనుడనుకొన్నాడు త్వరత్వరగా అతడు చిత్ర కూర్చున్న పంచవైపు బయలుదేరాడు పాదాల సవ్వడినిబట్టి అతడు వస్తున్నాడని గ్రహించి చిత్ర తన దృష్టిని దండపై కేంద్రీకరించింది పంచలోకి వచ్చి అతడు నిలబడ్డాడు ఆగిపోయిన పాదాల సవ్వడిని బట్టి అతడక్కడ నిలబడ్డాడని చిత్ర పసికట్టింది ఉండి ఉండి తుదికి ముఖమెత్తి చూచింది అతని కన్నులు మెరిసిపోతున్నవి

''శాంతమ్మగారికీ, మీకు కృతఘ్నుణ్ణి కాను కాలేనుకూడా ''

''చెప్పనక్కరలేదు నాకు తెలుసు '' చిత్ర గంభీరంగా అన్నది



ఆ మాటతో దిగులు తీరినట్లయి అతడు ప్రశాంతంగా వెళ్ళిపోతున్నాడు ఆమె స్నిగ్ధ వీక్షణాలతో చూస్తున్నది

''ఇదా సంగతి। అయితే తేలుస్తా '' దూరాన ఉండి చూచిన మాలతి చూపుడు వ్రేలితో బెదిరించింది ''భిక్షువులు ఇక్కడ లేకపోవటం గూడ మంచిదయింది ఈ కథ అంతా వారికి చెప్పవలసి వచ్చేది. ఇంకా సంవత్సరం దాక వారు ఈ ప్రాంతానికి రారు ఈలోగా ఎన్ని జరగాలో।'' మాలతి సంతృప్తితో తల ఊచింది

జ్వరపు పొంగులు తగ్గినా ధర్మకీర్తికి నీరసత్వం తగ్గలేదు గుణవర్ధనుడు మాపులు అతనికి వీణ వినిపిస్తూ వచ్చాడు అప్పుడప్పుడు బాబు పొలం పనుల గూర్చి అడుగుతుండేవాడు తమపని తాము చూచుకొని పోయే వారంటే శాంతమ్మకెంతో ఇష్టం ఆమె స్వభావం కూడా అంతే పైగా తనకొడుకు కోలుకొనడానికి గుణవర్ధనుడు తోడ్పడుతున్నాడు దీనికితోడుగా వేదగిరికూడా చెబుతున్నాడు ''అతనివంటి పనివాడు మరొకడు లేడు ఏ క్రొత్తపనిఅయినా సులువుగా చేస్తాడు అలాంటివారు ఎందరో ఉండరు '' ఈ మాటలతో ఆమెకు అతడంటే సదభిప్రాయం ఎక్కువవుతూ వచ్చింది పెద్దపాలేరుగా తమవద్ద ఉంచుకోవడం ఆమెకు మంచిదనిపించింది. తాను బయటపడక కొడుకుచేతనే ఆపని చేయించాలి.

ఒకరోజున బాబుతో అన్నది ''గుణవర్ధనుని కంఠం మధురం అతడు వెళ్లిపోతే లోటేకదా?''

''గుణవర్ధనుడు వెళ్ళిపోతున్నాడా?'' ధర్మకీర్తి ఉలికిపడి అడిగాడు ఆమె సర్దుతూ అన్నది ''ఇప్పుడప్పుడేకాదనుకో వేదగిరి కాలు నయమై తిరిగాలి ఇంకా దానికి ఏడెనిమిది వారాలు పట్టకపోతుందా?''

'' ఎంత కాలం గడచింది '' తాను పడకవేసిన కాలం గుర్తుకువచ్చి బాబు అన్నాడు

''మన వేదగిరి మెచ్చుకొంటున్నాడు ఆ వయస్సుకు అంత తెలివితేటలుండటం ఆశ్చర్యం అతడు చేయలేనిపని అంటూ లేదట మనిషికి ఎంతనిబ్బరమో, మిన్ను విరిగి మీదపడుతున్నా తొణకడు, బెణకడు ఆ ఒద్దిక అదీ నిజంగా అరుదే ''

''వాళ్ళ నాన్నకూడ అంతే అచ్చంగా తండ్రి గుణాలు అబ్బాయి. అందులో భిక్షువులక్రింద మెదిగారు అసలు ఆ శక జాతిలోనే ఆతత్త్వం ఉన్నదనిపిస్తున్నది

''అతడు వెళ్లిపోవడం నాకిష్టం లేదు అయినా పూర్తిగా కోలుకున్నతరువాత నీకు అతడు లేనిలోటు ఉండదనుకొంటాను ''

''లోటు లేకపోవటమేమిటి? అతడు నాదగ్గరే ఉండాలని కోరిక కాని ఉంటాడా డబ్బుకాసపడి ఉండే పిండం కాదు '' బాబు నిట్టూర్చాడు

'' ఇంతకూ జీతమిచ్చి ఉంచదలచుకుంటే ఆ పని అంత కష్టంకాదు పేదవాడుకదా! కాకుంటే ఆ జట్టుతో కలసి ఎందుకు బయలు దేరుతాడు?''

''అది కాదమ్మా! వాళ్ళ సంగతి నీకు తెలియదు మానాభిమానాలు మనకెంతో వాళ్ళకూ అంతే నేను ప్రత్తి అమ్మి డబ్బు పుచ్చుకొంటున్నట్టే వాళ్లు పనిచేసి డబ్బు పుచ్చుకొంటున్నారు గుణవర్ధనుని జట్టు అంతా అతడు కూర్చోమంటే కూర్చుంటుంది నిలుచోమంటే నిలుచుంటుంది అందువల్ల డబ్బు అతన్ని ఆకట్టలేదు ''

శాంతమ్మ తిరస్కారంతో అన్నది ''బాబూ! నీ మాటలకు అర్థం పర్థం కనపడదురా! వాళ్ళకు ఏమి చూచుకొని మిడిసిపాటు? నీతా, జాతా? పందేండ్ల క్రితమేగా సైపంచెలతో దేశానికి వచ్చింది! చదువా, సంస్కారమా? భిక్షువులు దయదలచి వినీతులను చేయకపోతే కొమ్మల్లో కూచునేవారు చాకిరికికాక మరి దేనికి పనికివస్తారు? గుణవర్ధనుడు ఒక్కడు వేరుకావచ్చును అతడయినా వేదగిరికిచ్చే జీతమిస్తామంటే ఎగిరి గంతువేసి పుచ్చుకోడా?''

''ఆలోచించాలి, అతడు మనవద్ద ఉంటేనే బాగుండును అతడంటే నాకూ ఎంతో యిష్టం అయినా చూదాము '' అదేకదా ఆమెకు కావలసింది

ఈ నెల రోజులలోను గుణవర్ధనునితో చిత్రకు పరిచయం అధికమయింది అంతకు ముందు అడ్డుగోడగా నిలచిన అతని శక జాతిత్వం క్రమంగా కనుమాటు కాసాగింది బాబుకంటె గుణవర్ధనుడు చూపరిగా ఆమెకు కనిపించసాగాడు అయితే తానతన్ని ప్రేమిస్తున్నానని గుర్తించలేక పోయింది "బాబుకూడా గుణవర్ధనుని అంత పొడవుగా దృఢంగా ఉంటే ఎంత బాగుండును!" అని అప్పుడప్పుడు అనుకొనేది మరొకప్పుడు అత్తయ్యకు గుణవర్ధనుడు అందంగా కనిపిస్తున్నాడా! అని విస్తుపోయేది "డబ్బిచ్చి అతన్ని ఆకట్టుకోలే"మని బాబు తల్లితో అంటున్నప్పుడు చిత్ర అక్కడే ఉన్నాది నోరువిప్పి ఏదో చెప్పబోయింది కాని, తల్లీ కొడుకుల నడుమ తన జోక్యం అత్తయ్యకు గిట్టదని గుర్తుకు వచ్చి మానుకొన్నది అది బాబు కనిపెట్టాడు తల్లి అవతలకు పోయిన వెనుక చినబాబు ఆ ప్రస్తావన తెచ్చి "అన్నట్టు ఇందాక ఏదో అనబోయి మాని వేశావే ఏమిటి?" అని అడిగాడు. చిత్ర సిగ్గు పడ్డది అతనివద్ద సిగ్గుపడడానికదే మొదలు

"గుణవర్ధనుడంటే నీకు ఇష్టం లేదా?"

"ఇష్టం లేకపోవడమా? దేనికి?"

"అతన్ని గూర్చి మరేవైనా పుకార్లు బయలుదేరినావా?"



"లేదు, లేదు, అంతా అనుకొనేది ఒకటే వేదగిరికి కులాసా చిక్కేవరకు ఉంటాడనుకొంటున్నారు. జీతానికి ఉండడని ఇంతకుముందే నీవే అన్నావుగా!"

"మరి ఉంటాడంటావా?"

"జీతానికి కాదుగాని ఉండవచ్చునేమో" సంతోషిస్తూ చిత్ర అన్నది.

"నీ కెలా తెలుసు?"

"అతడు నాతో అనలేదు" ఆమె ముఖం వంచుకొన్నది తానా మాట ఎందుకన్నానా అని నాలుక కొరుకుకొన్నది విస్మితుడై బాబు ఆమెవంక చూచాడు వంకపరకమాటలు, సంకోచాలు, ఆమెకు పనికిరావు, అనదలచుకొన్న దేదో ముఖాన అనివేయడం ఆమెకు పరిపాటి అలాంటి చిత్ర ఇప్పుడు తటపటాయిస్తున్నది "ఒక వేళ గుణవర్ధనుని చిత్ర ప్రేమిస్తున్నదేమో" నన్న భావం అతని మనసులో లీలలా మెదలింది అయితే ఈర్ష్యకు అతని స్వభావంలో తావులేదు అయినా నాటి నుంచీ ఆమె మాటలు చేతలు కనిపెట్టి చూస్తున్నాడు

ఇప్పుడు ఆరుకన్నులు అనుపదం ఆమెను వెన్నాడుతున్నవి ఒక ప్రక్క నిర్మల ప్రణయి

గుణవర్ధనుడు, మరొక ప్రక్క ఈర్ష్యాగ్రస్త మాలతి వేరొకవంక అరగొరలులేని చినబాబు ఈ ముప్వురి చూపుటురుల నడుమ చిత్ర తప్పుకొని తిరుగుతున్నది ఏదీ గమనించక యదాపూర్వం శాంత తలవంచుకుని పోతున్నది నిజానికి ఎదుటివారి మనస్సు పసికట్టి అర్థం చేసుకోగల నేర్పు ఆమెకు ఉన్నది కాని ఆమె చూపే అటు వ్రాలలేదు వ్రాలి ఉంటే స్థితిగతులు మరొకరీతిగా ఉండేవి ఆమెకు ఒకటే సంకల్పం అక్కగారు అప్పగించి పోయిన పిల్లకు కూడు గుడ్డలు కొదవకారాదు అంతమేరా తాను చేయగలిగినది చేస్తున్నది ఇంకా మరేమి కావాలి? తల్లి ప్రేమ ఏది అంటే ఆ బాధ్యత తనదికాదు అందుకు తాను మాటపడలేదు ఒకప్పుడు శాంతిభిక్షువులవద్ద ఈప్రస్తావనే వచ్చింది. ''స్వామి, నే చేయగలిగినదంతా చేస్తున్నాను'' అని చెప్పుకొన్నది

''నిజమేనమ్మా! ఆ తల్లి ప్రేమ ఒకటీ ఉంటే చిత్రకు మరేకొదవాలేదు '' ఆయన సూచన ప్రాయంగా మందలించాడు.

''ప్రేమ అనేది సంకల్పంతో పుట్టుకొని వస్తుందంటారా? దానంతటది కలిగేదికాదా?'' అని తాను అన్నది

''సంకల్పంతో కలుగకపోయినా కొంతయత్నం అభ్యాసం అవసరమేమో.''

''ఏదో మొలక ఉంటే నీరు పోయవచ్చు పెంచ వచ్చు కాని లేని మొలకకు నీరెలాపోసేది? పోసినా లేనిమొక్క మొలచుకొని వస్తుందా? నూరుచెప్పండి వెయ్యిచెప్పండి చిత్రను ప్రేమించడం నావల్లకాదు ఆనాడు మా అక్కకు ఊరట కల్పించాలనుకొన్నాను. మీ మాట త్రోసివేయలేకపోయాను. ఈ పిల్ల పెంపకానికి ఒప్పుకొన్నాను కాని దీనిని ప్రేమించడం నా వల్లకాదు.'' అని భిక్షువుతో అనివేసింది ఆయన మారుచెప్పలేదు సముద్రస్నానం మంచిదని పర్వతానికి చెప్పినా, చిత్రను ప్రేమించమని శాంతకు చెప్పినా ఒకేటనని ఆయన గ్రహించాడు. అతడే అక్కడికి వచ్చినప్పుడల్లా ఆ పిల్లను గారాబంగా చూచేవాడు ఏండ్లు గడచినకొలది అతనికి చిత్రమీద మమకారం మెండు కాసాగింది



చినబాబు వినా చిత్ర ఒంటరితనం వెళ్ళబోస్తున్నది రోజులు గడుస్తున్నా ధర్మకీర్తికి చిన్నమెత్తు సత్తాఅయినా రావడం లేదు మంచం దిగి తిరిగే ఓపిక అయినా కలగడం లేదు గుణవర్ధనుడు ఆలోచించాడు గాలి వెలుగులులేని ఆగదే సగం కారణమనీ, వరండాలో పక్కవేస్తే త్వరలో కోలుకొంటాడని, ఒకనాడు శాంతమ్మకు చెప్పాడు ఆమె అందుకు అంగీకరించింది ''అవునవును గడియసేపు ఆ గదిలో కూర్చుంటే నాకే తలనొప్పి వస్తున్నది స్థలంమార్పు అవసరం'' అని చిత్ర కూడా ఒప్పుకొన్నది.

వరండాలో మంచం అమర్చి గుణవర్థనుడు గదిలోకి వెళ్లి, ధర్మకీర్తిని చేతుల్లోకి ఎత్తుకొన్నాడు చిత్ర గబ గబ దిళ్ళు తీసుకొని కొత్తమంచం వద్దకు వెళ్లింది శాంత ఆమె చేతులలోని దిళ్ళు లాగుకొని 'నేను వేసుకొంటాలే పొ'మ్మని కసురుకొన్నది చిత్ర కన్నీటి పర్యంతమై ఆ దిళ్ళతో పాటు పక్కదుప్పటి కూడా శాంతకిచ్చి తప్పుకొన్నది ఆ సంఘటనలు ధర్మకీర్తి, గుణవర్ధనులు చూస్తూనే ఉన్నారు. ఆ దృశ్యం చూడలేకా, తల్లినిమందలించలేకా, బాబు కళ్ళుమూసుకొన్నాడు

'ఇక్కడ ఎలావుందిరా?' తల్లి అడిగింది

''హాయిగా ఉందమ్మా! గుణవర్ధన్, పోకు, నీతో కాస్త మాటాడాలి ఈ కుదలింపుతో ఆయాసంగా ఉంది తేరుకోగానే మాటాడుతాను '' బాబు కనులు మూసుకొన్నాడు

''అయితే నేను వచ్చేదాక ఇక్కడే ఉండు ఇంట్లో పనిచూచుకొని యిప్పుడే వస్తాను నీవు అబ్బాయి దగ్గర ఉంటే నాకే దిగులు ఉండదు '' శాంత లోపలికి వెళ్ళింది

గుణవర్ధనునకు ఆ యింటినుంచి త్వరగా వెళ్ళిపోవటం మేలనిపించింది కొంతసేపటికి బాబుకళ్ళు తెరచి 'గుణవర్ధన్!' అని మెల్లగా పిలిచాడు అతడు దగ్గరకు వెళ్ళాడు

''నీవు ఎప్పుడూ ఇక్కడే ఉంటే ఎంతో బాగుంటుందని మా అమ్మ అంటున్నది వేదగిరికూడ ముసలి వాడయ్యాడు ఈ వ్యవసాయాన్ని, ఈ పశువులను సంబాళించలేడు పైగా కర్రపోటీతో తిరగవలసిన దుస్థితి వచ్చింది మాకు ఇదంతా దిద్దుకుపోయే మనిషికావలి '' చినబాబు అతని ముఖం లోనికి చూచాడు. గుణవర్ధనునిలో అతనికి ఆశ్చర్యం కనిపించింది. ''అవును నీకు విడ్డూరంగానే కనిపిస్తుంది ఏదో కష్టాలలో ఉన్నాము కాబట్టి ఇక్కడ ఉన్నావు కాని, లేకపోతే ఉండవని మా అమ్మతో అంటూవచ్చాను'' అతడు కృతజ్ఞతను వెల్లడించాడు

'అవునండి! జీతంకోసం ఉండనని భిక్షువులకు చెప్పాను డబ్బు సంపాదన మా నాన్నగారికీ, నాకూ అవసరమే మా వాళ్ళు నిరు పేదలు అయినా నేను యిక్కడ ఉండడం మా నాన్నగారికి ఇష్టమో లేదో తెలియదు. అడిగి తెలుసుకొంటాను '

''అయితే ఉంటున్నావన్న మాటేగా?''

''నాన్నగారిని అడుగుతాను ఆయన ఒప్పుకొంటే నాకేమీ అభ్యంతరం లేదు '' కొంత ఆగీ మళ్ళీ అన్నాడు ''మీకు తోడుగా ఉండడం నాకెంతో సంతోషం ''

ఇంతకుముందే అచటినుంచి వెళ్లిపోవాలనుకొన్న గుణవర్ధనునిలో ఆ మార్పు ఎందుకు వచ్చినట్లు? చిత్రా సందర్శనం ప్రియకరమే అయినా చిన బాబు స్నేహం కూడ అతడబిలషించాడు

..... ఆరు ......

ఆ రాత్రి ఆకాశం నిర్మలంగా ఉన్నది చంద్రుడు ఏకాంత ప్రయాణం చేస్తున్నాడు గుణవర్ధనుడు చినబాబు దాపులో నిద్రపోక అటూ ఇటూ పచారుచేస్తున్నాడు ఆ అడుగుల సవ్వడులు పక్కమీద పడుకొన్న చిత్ర హృదయంలో ప్రతిధ్వనిస్తున్నవి ఆమెకు ఒకటే బాధ బాబుకు ఉపచారాలు చేసే అవకాశం అత్తయ్య తనకు లేకుండా చేసింది తన బ్రతుకు ఎవరికోసమో ఆమెకు బోధపడలేదు తాను బాబునైనా ఒంటరిగా కలుసుకొనే అవకాశం చిక్కడంలేదు మాలతి కూడ తనకుతానై చిత్ర వద్దకు రావడం మానివేసింది జీవితం ఆమెకు పంజరంలోని చిలుక బ్రతుకైపోయింది ఒక రాత్రి మెలకువ వచ్చింది ప్రక్కవరండాలోనుంచి ఎగుడు దిగుడులు లేని బాబు ఉచ్ఛ్వాస నిశ్వాసాలు వినిపిస్తున్నవి ఆమె ఉండబట్టలేక కిటికీ తెర తొలగించింది ఆ సవ్వడికే గుణవర్ధనుడు కిటికీ వద్దకు వచ్చి పలకరించి ఏమి కావాలని అడిగాడు ''బాబుకు బాగా నిద్రపట్టిందా?'' ఆమె అడిగింది

''హాయిగా నిద్రపోతున్నాడు ''

చిత్ర మాటాడక తిన్నగా వెళ్లి ప్రక్కమీద పండుకొన్నది

ఆ ఉదయం బాబు బారెడు ప్రొద్దెక్కిన తరువాత మేలుకొన్నాడు ఎక్కడలేని ఆకలి కలిగింది. జావత్రాగాడు తన కొడుకులో వచ్చిన మార్పు గమనించి శాంత లోలోన దేవతలకు మ్రొక్కింది 251
గుణవర్ధనుని మెచ్చుకొన్నది అది మొదలు ఆ వరండాయే చిత్రా శాంతలకూ, గుణవర్ధునికీ ఇల్లైపోయింది శాంత బాబుతలగడకు ప్రక్కగా కుర్చీలో కూర్చుండేది పాదాల దిగువవైపున చిత్ర ముక్కాలి పీటమీద పుస్తకమో, కుట్టుపనో ముందు వేసుకొని కూర్చుండేది గుణవర్ధనుడు పంచ మెట్లమీద కూర్చునేవాడు ఆ కూర్చున్నచోటికి చిత్రముఖం చక్కగా కనిపించేది మంచంమీద పండుకొన్న ధర్మకీర్తికి అందరి ముఖాలు కనిపించేవి

గుణవర్ధనునికి చిత్రయందు ప్రేమ ఉన్నదని బాబు గుర్తించాడు ఆమెకూడ అతన్ని ప్రేమించి ఉంటే ఉండవచ్చుననుకొన్నాడు ఆ భావంతో అతనిలో ఈర్ష్యా ద్వేషాలు తలనూపాయి ఆ సమయంలో అతడు అతి దుర్బలంగా ఉన్నాడు ఆ దౌర్బల్యంవల్ల తనకు చావు తప్పదనుకొన్నాడు తాను చనిపోతే చిత్ర జీవితం ఏమి కావాలన్న ప్రశ్న బయలుదేరింది చిన్ననాటినుంచి అన్నాచెల్లెళ్ళవలె పెరిగారు తాను నిజంగా చిత్రను చెల్లెలి వలె ప్రేమిస్తున్నాడు ఆ ప్రేమ ఇప్పుడూ అలాగే ఉన్నది అయితే శాశ్వతంగా కనుమూయబోతున్న తాను చిత్రకు ఏమిచేయాలి? గుణవర్ధనుని ఋణం ఎలా తీర్చుకోవాలి? తన అమ్మ ఏమనుకొంటుంది? తాను కనుమూసిననాడు చిత్ర బిచ్చగత్తె అయి దేశాలు పట్టినా తల్లి పట్టించుకోదు ఆమె చిత్రా గుణవర్ధనుల పెండ్లికి ఒప్పుకొంటుందా?

బాబుకు సందేహం కలిగింది ఆలోచించిన కొలది అనుమానం ఎక్కువయింది ఎలాగైనా తల్లిని ఒప్పించాలి అయితే అతడు స్వాభావికంగా మందకొడి అప్పుడన్న పని అతనికి ఆరునెలలవుతుంది గుణవర్ధనుడు తనకు చేదోడువాదోడుగా ఉంటున్నాడు తన భూములపై పెత్తనమిచ్చి అతనికీ చిత్రకూ పెండ్లిచేస్తే బరువుతీరిపోతుంది అమ్మతో మాటాడి ఏర్పాటు చేయాలి ఆ పని రేపు అనుకొన్నాడు అలాంటి రేపులు గడిచిపోతున్నవి

అదనుకోసం పొంచి ఉన్న మాలతి చిత్రా గుణవర్ధనులను వేయికన్నులతో చూస్తున్నది ఎప్పుడు చిక్కుతారా, ఎప్పుడు చిత్రపై కక్ష తీర్చుకొందామా అని ఎదురుచూస్తున్నది అయితే చిత్ర అతన్ని పెండ్లాడవచ్చునని ఆమె ఎన్నడూ ఊహించలేకపోయింది తన వలె చిత్ర భ్రష్టురాలవుతుందను కొన్నది ఆమెకు చిత్రహృదయ నైర్మల్యం అందదు నిచ్చెనకు స్వర్గం ఎలా అందుతుందీ?

చిత్ర అనుదినం దేవతలకు పూల మాలలు వేసేది. గుణవర్ధనుడు ఆ మాలలకు వలసిన పూలు అడవినుంచి తెచ్చి ఇచ్చేవాడు కొండజాతులవారి నుంచి బుట్టలు, వలసంచులు, పూసల పేర్లు మొదలైన వింత వస్తువులు సేకరించి ఆమెకు సమర్పించేవాడు అప్పుడప్పుడు వెనుకటి
252 బౌద్ధ భిక్షువుల పవిత్ర దీక్షలు, చరిత్రలు, మహిమలు వర్ణించి ఆమెకు విస్మయ చకితను చేసేవాడు

ఇప్పుడు చిత్ర తనకు తాను గుణవర్ధనుని పలకరించడం లేదు తిన్నగా అతనివంక చూడలేకపోతున్నది ఇద్దరూ మాటాడుకోవలసి వచ్చినా ఆ సంభాషణలు ముక్తసరిగా ఉంటున్నవి గుణవర్ధనుడు తన్ను పిలిచినప్పుడు ఒక్కసారి ముఖంలోకి చూచి చటుక్కున చూపు క్రిందికి వాల్చేది ఇదంతా గమనిస్తున్న గుణవర్ధనుడు లోలోన సంతోషపడుతూ వచ్చాడు ఏకాంతంగా తాము సమావేశమయినప్పుడు ఆమె చూపులలో వచ్చేమార్పులు అతడు గుర్తించాడు అది తానే చూచాననుకొన్నాడు, కాని వాస్తవానికి మరొక ప్రక్కన మాలతి కనిపెడుతూనే ఉన్నది.

వాగురేవులో రెల్లుదుబ్బుల దాపున చిత్ర ఒకటి రెండు సార్లు గుణవర్ధనునికి కనిపించింది ఆసతో అతడు తరచు అక్కడకి వెళ్ళేవాడు కాని చిత్రమాత్రం వచ్చేది కాదు తరువాత క్రమంగా వారిద్దరు ఆ రెల్లుదుబ్బుల వద్దనే కలిసికొనేవారు. అంతంతకూ ఆ సమావేశాలు, ఆ ఎడబాట్లు దీర్ఘతరాలు బాధాకరాలు కాసాగాయి. '' ఇరువురు కౌగిలింతలో ఉండగా చిక్కితే ఎంత బాగుండును! చిత్రా మీ అత్తయ్య పిలుస్తున్నదంటాను కత్తితో బొడిచినా ఆమె ముఖాన నెత్తురు చుక్క ఉండదు '' అని ఊహించుకొంటూ మాలతి సమయంకోసం ఎదురు చూస్తున్నది.

..... ఏడు .....

ఆ సమయం వచ్చింది మాలతి ఊహించిన దానికంటె చిత్రకు పెద్ద విపత్తు కలిగింది అయితే మాలతి వలనకాదు

ధర్మకీర్తి కొంచెం తేరుకున్నాడు తన దుస్తులు తానే వేసుకొని ఇంట్లో కాస్త అటూ ఇటూ తిరిగేస్థితి ఏర్పడింది శాంతకు కొంత ఊరట కలిగింది తిరిగి ఆమె ఎప్పటివలె పనిపాటల్లో నిమగ్నమవుతూ వచ్చింది ఆనాడు సాయంకాలం వాగు వైపు వెళ్లి పంటచేలు ఒకసారి చూచిరావాలన్న బుద్ధిపుట్టి బయలుదేరింది ఆ చల్లగాలి ప్రకృతి దృశ్యాలు చాల దూరం లాక్కువెళ్ళాయి మసక చీకట్లు పడుతున్నవి ఆమె ఇంటివైపు బయలుదేరి వస్తున్నది రెల్లుదుబ్బుల దగ్గరకు వచ్చేటప్పటికి ఇద్దరు వ్యక్తులు ఒండొరుల కౌగిలిలో తవిలి ఉన్న దృశ్యం కనిపించి విస్తుపోయింది. అంతలోనే ఆ విస్మయం కోపంగా మారింది ఆమె చూపు ఆ కనుచీకటిలో ఆ వ్యక్తులను గుర్తించగలిగింది జేవురించిన కన్నులతో చూస్తూ నిలబడ్డది అప్పుడే ఎడమై చిత్ర నిలచింది ఒక్కక్షణం ఎవరూ మాటాడలేదు మొదటిసారిగా ఆదుర్భర నిశ్శబ్దతకు భగ్నం జేస్తూ ''అత్తయ్యా!'' అని చిత్ర పలకరించింది

''నోర్ముయ్! పాపిష్టురాలా! తిన్నగా ఇంటికి పద'' నీలిమేఘం గర్జించింది గుణవర్ధనునివైపు గిరుక్కున మళ్ళి ''ఈ క్షణం నుంచి నీవిక్కడ ఉండనక్కరలేదు పో నీ యిష్టం వచ్చిన చోటికి వెళ్ళు'' అన్నది కొంచెమాగి ''బాబువద్దకు పద నీ సంగతి అతడే తేలుస్తాడు'' అన్నది ''ఇంకా దేనికి, పో! అని మళ్ళీ కసిరింది ''పొమ్మంటే ఇంకా నిలుచున్నావా?'' 253

గుణవర్ధనుడు కదలలేదు కర్తవ్యం అడుగుతున్నట్టు చిత్రవైపు తిరిగాడు ఆమెకు ఇష్టంలేని పని చెయ్యడం అతనికి గిట్టదు ఈ విషమ పరిస్థితిలో ఆమె మనస్సేమిటో అతనికి తోచలేదు

''గుణవర్ధన్! వెళ్ళు'' అని నిబ్బరంగా చెప్పి చిత్ర శాంతవైపు తిరిగి నిలబడ్డది అతడు ఆమె మాటలను శిరసావహించి వెళ్ళిపోయాడు

చిత్ర నిండుకుండలాగ నిలబడడం, గుణవర్ధనుడు తన మాట లెక్కచేయక చిత్రమాటకు తల ఒగ్గడం, ఈ రెండూ శాంతకు సివమెత్తించాయి మున్ను కనివిని ఎరుగని కోపం ఆనాడు చిత్రకు శాంతలో కనిపించింది ''అత్తయ్య!'' చిత్ర ఏదో చెప్పబోయింది అంతలోనే ఆమె చెంప చెళ్ళున మోగింది.

''నోర్ముయ్!'' అంటూ చిత్ర చెయ్యిపట్టుకొని జరజరా ఇంటివైపు శాంత లాగికొని పోతున్నది

''అబ్బబ్బ! నొప్పి అలా ఈడుస్తావు దేనికి? ఇంటికి వస్తున్నా వదలు,'' చిత్ర నదురుబెదురు లేకుండా అని వేసింది

'' ఇది నిజంగా చిత్రేనా?'' శాంత విస్తుపోయింది నిగ్గుపడి ఆమె చేయి వదిలి పెట్టింది తారల కాంతిలో చిత్ర నిబ్బరం, మొండిపట్టు ఆమెకు కనిపించాయి ''దీని కెక్కడనుంచి వచ్చిందా ఈ మొండి ధైర్యం'' అని కోపంతో వణికిపోయింది మళ్ళీ చేయి పట్టుకొని లాక్కుపోయి చిత్రను గదిలోకి త్రోసి తాళంపెట్టి పైట కొంగున చెవి ముడిచి రొంట దోపింది.

మాలతి అంతా కనిపెడుతూనే ఉంది చిత్రా గుణవర్ధనులు రెండుగడియల క్రిందనే రెల్లుదుబ్బులవద్దకు చేరారని ఆమెకు తెలుసు, శాంతమ్మ వెళ్ళి చాలాసేపయింది ఇంకా రాదేమా అని తహతహ పడుతున్నది ఒకటి రెండుసార్లు చినబాబువద్దకు వెళ్ళి అతని ఆరోగ్యం కోరుతున్నదానివలె ''బాబుగారికి ఆకలి కావడం లేదా?'' అమ్మగారూ, మీరూ, ఒకేసారి భోంచేస్తారా?'' అని అడిగింది

''అమ్మ వచ్చేదాకా భోజనం చేయను'' ధర్మకీర్తి చెప్పాడు ఈసారి అతనికి చిత్రా గుణవర్ధను లెక్కడ ఉన్నారో తెలుసు అమ్మ ఎక్కడికి పోయిందో ఎరుగు కాని ఆ రెల్లుదుబ్బుల మీదుగా ఇంటికి తిరిగి వస్తుందనుకుంటే చిత్రను ఆ విషాద సంఘటనకు పాల్పడనీక పిలిచించి
 ఉండేవాడే

చిత్రను గదిలోకి త్రోసి దభేలున తలుపువేసి తాళం పెట్టడం మాలతి చూచింది. భయంతో ఒక్క గంతున పోయి దొడ్లోపడ్డది లోగడ శాంతమ్మ తనపై కినుక వహించినప్పుడు చిత్ర తనకు తోడ్పడిన సన్నివేశాలు గుర్తుకువచ్చాయి ఇలాంటి కఠోరశిక్షకు ఆమె పాల్పడుతుందని మాలతి ఎన్నడూ అనుకోలేదు. చిత్ర చీవాట్లు పెట్టించి గుణవర్ధనుని సాంగత్యం మాన్పించాలని మాత్రమే ఆమె కోరిక. తీరచూస్తే శాంతమ్మ చిత్రను నిలువుగ చీల్చి చంపేటట్లు కనుపిస్తున్నది.

మాలతి మనస్సు అలంగం తిరిగింది. శాంతమ్మ గారికి ఏనాడూ చిత్రఅంటే ప్రేమలేదు ఏది ఎలా ఉన్నా తిండి పెట్టక ఆమెను మాడ్చిచంపరాదు అలాంటిపని జరుగుతుంటే తాను కళ్ళప్పగించి చూస్తూ ఊరుకోరాదనుక్నొది అంతలోనే అసూయాగ్రస్తఅయి చిత్ర ఏదో అప్రతిష్ఠపని చేస్తుంటే చూచి ఉండాలి లేకపోతే శాంతమ్మగారు ఇంతపని చేస్తుందా? తగినశాస్తే జరిగింది కల్లాకపటం తెలియనివాణ్ణి, ఇలా చేసినందుకు తగిన ప్రాయశ్చిత్తమే జరిగిందనుకొన్నది

తలుపుమూసిన చప్పుడు విని ధర్మకీర్తి పంచకిటికీలోనుంచి లోపలికి చూచాడు తల్లిచేసిన పని కనిపించింది. అతడు నెత్తిమోదుకున్నాడు ''ఎప్పుడో అమ్మకుచెప్పి ఒప్పించి

ఉండవలసింది ఇంక ఆమె చిత్రను క్షమించదు '' తిన్నగా వెళ్ళి మంచంమీద పడ్డాడు ఇప్పుడేమీచేయాలి? చిత్రను ఎలా బయటపడవేయాలి అతడు ఆలోచనకు దొంకొన్నాడు ఇంతలోనే 'బాబూ' అని తల్లిగొంతు వినిపించింది ఆ గొంతులో ఇంకా కత్తులాడుతూనే ఉన్నవి మెదలకుండ ఉంటే ఆమె తన గదిలోకి వస్తుందని ఊరుకొన్నాడు ఆమెవచ్చి ''ఏమిరా నాయనా! ఒంట్లో బాగాలేదా?'' అని అడిగింది

'ఏమీలేదు, కొంచెం అలసటగా ఉన్నది అంతే' నన్నాడు బాబు, తల్లి దగ్గరకు వచ్చింది ఆప్యాయంగా ఆమె మెడకు చేతులు పెనవేసి, ''అమ్మా నీవులేకపోతే నాగతి ఏమయ్యేదో అని అతడన్నాడు ఆమె హృదయం మెత్తపడ్డది ఎప్పటి ప్రశాంతత ఆమెను తిరిగి ఆవరించింది తన గారాబుకొడుకు తనవాడై ఉండగా ఏ ప్రపంచం ఎలాపోతేనేమి? అలసి ఉన్న తనకొడుకునకు ఇప్పుడు ఆ పాడుకథ దేనికి? తెల్లవారినతరువాత చూచుకోవచ్చు ''నాయనా, భోజనం గదికి పంపిస్తాను తిని పండుకో పగలంతా అటూ ఇటూ తిరిగి అలసి ఉంటావు '' అని చెప్పిలేచి వెళ్ళింది చిత్ర కనిపించకపోయినా అతడు అనుమానించడని ఆమె నమ్మకం

శాంత తిన్నగా భోజనాల గదికి వెళ్ళింది మాలతి ఏమి ఎరుగనట్లు ఒదిగి ఒక ప్రక్కన నిలబడ్డది ''బాబు భోజనం గదికి తీసుకు వెళ్ళు అలసివున్నా''డని ఆమె ఎప్పటివలె ప్రశాంతంగా చెప్పింది ఆ మాటతో మాలతికి అంతా అయోమయమయిపోయింది ఇందాకటి శాంతమ్మేనా ఈ శాంతమ్మ? లేక తానేమైనా కలగంటూ వచ్చిందా? రిచ్చవడి మాలతి శాంతమ్మను చూస్తుంది 255

''మొద్దులాగా అలా నుంచున్నావు దేనికో?'' శాంతమ్మ కసిరింది మాలతి ఉలికిపడ్డది ''ఏమిలేదు అమ్మగారూ, చిన్నమ్మగారు భోజనం చేయదూ? పోయి పిలుచుకురానా?''

శాంతమ్మ మాలతిని ఒకసారి క్రిందికి మీదికి చూచింది. కొంపతీసి దీని కంటపడలెదుగదా! శాంతమ్మ తిరిగి ఎప్పటి శాంతమ్మ అయింది చిత్ర తన ఇంట ఉన్నంత కాలం తానేమి చేసినా, ఏమన్నా ఏదానీ ఆమెను అగౌరవంగా చూడరాదు

''చిత్రకు ఒంట్లో బాగుండలేదు గదిలో పండుకొన్నది కావాలంటేనేను భోజనం తీసుకువెళ్ళి ఇస్తాను ఆమెను పలకరించి బాధపెట్టకు,'' అని హెచ్చరించింది

''చిత్రా గుణవర్ధనుల ఇద్దరికీ కడుపునిండి ఉండాలి అతడు రేపటినుంచి ఎలా తల ఎత్తుకు తిరుగుతాడో చూడాలి.'' అని మాలతి అనుకొన్నది

పనివాళ్ళు వచ్చి తిండితిని వెళ్ళారు ప్రొద్దుపోయింది గుణవర్ధనుడు మాత్రం భోజనానికి రాలేదు మాలతికి కుతూహలం పట్టుకొన్నది ఏమైపోయాడు? ఆమె అతనికోసం చావడి,

దొడ్డి, తోట అంతా వెదకింది ఎక్కడా కనిపించలేదు ఎక్కడకు పోయినట్లు? పూజా మందిరంవైపు వెళ్ళింది అక్కడ పూలమొక్కల వెనుక దాగి ఉన్న గుణవర్ధనుడు తన్ను మాలతి చూచిందేమో ననుకొన్నాడు పలకరించబోయి మానివేశాడు ఆమె అలాగే వెళ్ళిపోయింది

గుణవర్ధనుడు అక్కడే ఎందుకు చదికిలబడినట్టు? చిత్ర కిటికీకి ఆ ప్రదేశం ఎదురుగా ఉంది ఆమెకు ఏ సమయాన ఏ సాయం కావలసి వస్తుందో? కిటికీ తీసి పిలిస్తే చాలు, తాను అందుబాటులో ఉంటాడు తన్ను చిత్ర ప్రేమిస్తున్నది ప్రేమిస్తున్నానని తన నోటి మీదుగా చెప్పింది తనతో బయలుదేరి వస్తానని, తన్ను పెండ్లాడుతాననీ అన్నది సరిగా శాంతమ్మ వచ్చినప్పుడే ఆ మాటలు ఆమె నోటినుంచి వెలువడ్డవి ఆ సంఘటన మనో వీధిలో గోచరించగానే సంతోషభయాలు మసకలాడసాగాయి

ఆమె ఎంతటిఘోరానికి ఒడికడుతుందో? తన్ను, చిత్రను అంత జుగుప్సతో, అంత ద్వేషంతో చూడడం దేనికి? చిత్ర తన బిడ్డకాదు శకకన్య ఆ మాట తనకు వేదగిరి చెప్పాడు శకకన్య శకయువకుని పెండ్లాడడం తప్పా? తప్పుకాదనుకో అయినా తాను చిత్రకు చేకూర్చగలిగిన భోగభాగ్యాలేమిటి? చిత్ర తన గూడెంలో ఉండగలుగుతుందా? విద్యా గంధం లేని తన జాతిలో అనాగరక స్త్రీలమధ్య జీవించగలుగుతుందా? లేదు ఆమెకై తాను తనవారిని వదలి ఏ నగరానికో చేరుకోవాలి డబ్బుకోసం ఏదోపనిచేయాలి ఏ సుఖం లేకుండా దారిద్ర్యంతో ఎలా కాపురం చేస్తుంది భవిష్యత్తును గూర్చి ఆలోచించిన కొలదీ అతనికి సంతోషం అంతరించి భీతి పెచ్చరిల్లసాగింది ఆమె తన్ను ప్రేమిస్తుందనీ తమ భవితవ్యం ఆలోచించవలసి వస్తుందనీ అతను ఏనాడు అనుకోలేదు ఆమె నోటి నుంచి ఆ మాట రావడంతో స్థితిగతులన్నీ తలక్రిందులై పోయాయి ఆమెను తాను ముద్దుపెట్టుకొన్నాడు ఆమె తన్ను తప్ప మరొకరిని వరించదు అయితే శాంతమ్మను తాను ఎదుర్కోగలడా?

చినబాబు తనకు తోడ్పడుతాడా? అవును అతడు ఆప్తమిత్రుడు సందేహం ఏ మాత్రం లేదు అయితే అతడు తల్లిని ఒప్పించగలుగుతాడా? ఆమె బెబ్బులి తన్నింక బ్రతుకనిస్తుందా?

నీట మునిగినవారికి గతమంతా ఆ ఒక్కక్షణంలో జ్ఞప్తికి వస్తుందంటారు అలాగే గుణవర్ధనుని మనస్సులో ఆ ఒక్క క్షణకాలంలో గతమంతా గిర్రున తిరిగింది గుణవర్ధన్ అంటే నీవేనా? అని మొదటిసారిగా చిత్ర తన్ను పలకరించింది చినబాబును తాను రక్షించినప్పుడు నోరార పలకరించింది అతనిని వరండాలోనికి తీసుకొనివచ్చిన రాత్రి తానామె ప్రార్థనలను విన్నాడు ఆకటి నకనకలతో బయలుదేరబోతున్న తన జట్టును భోజనంచేసి పొండని బ్రతిమాలింది ఆ తరువాత తన్ను ప్రేమిస్తున్నాని చెప్పింది ఇరువురిమధ్య ఇలాంటి ప్రేమ ఉన్నప్పుడు ప్రపంచంలో ఏదీ తమ సుఖాన్ని చెరపలేదు

''చినబాబు నన్నిక్కడ ఉండమని కోరాడు దానికి ఏర్పాట్లు తలపెట్టాడు ఆసంగతి తెలుసా!'' అని తానామెతో అన్నాడు

'' ఆ , అత్తయ్య కొన్నిరోజులక్రితం బాబుతో చెబుతూండగా విన్నా.''

''మరి నేనుండడం ఆమె కిష్టంలేదా?'' తాను అడిగాడు

'' ఇష్టంలేదనుకోను అయినా ఆమె ఇష్టానిష్టాలు ముందుగా తెలుసుకోవడం కష్టం ఆ ప్రతిపాదన చినబాబు చేశాడు ''

'' ఆమె ఇష్టానిష్టాలు ముందుగా తెలియవంటున్నా వేమిటి?''

'' ఏమీ లేదు ఇది నాకిష్టం, ఇది నాకిష్టం కాదు,'' అని ఆమె తన నోటిమీదుగా ఎన్నడూ చెప్పదు ప్రత్తీ దానిని చిన్నబాబుకో, శాంతిభిక్షువులకో వదలివేస్తుంది. చివరకు మాత్రం ఆమె కోరినట్టే జరుగుతుంది అత్తయ్య నిజంగా విచిత్రవ్యక్తి!''

''బాబుఅంటే ఆమెకు పంచప్రాణాలట్లుంది '' సమాధానం చెప్పక తాను దాటవేయాలని చూచాడు

''అవును, ఎంతగా ప్రేమిస్తున్నదో నీకు సరిగా తెలియదు ప్రపంచంలో మరొక మానవమాత్రుణ్ణి ఆమె ప్రేమించదు ప్రేమించలేదు ఆ అఖండ ప్రేమ అంతా బాబుదే అతడు చనిపోయి ఉంటే ఆమె బ్రతికి ఉండేదికాదు అందువల్లనే నీవంటే ఆమెకు ఇష్టం బాబును బ్రతికించావని ఆమె నమ్మకం.'' చిత్ర నవ్వుతూ తనవంక చూచింది.



''నేనంటే ఆమెకు ఇష్టం ఉన్నదనుకోను అసలు ప్రపంచంలో ఎవరంటేనూ ఇష్టంలేదేమో అలాంటి మనిషిని నేనెక్కడా చూడలేదు ''

''అవును ఆమె అంటే నాకు ఎక్కడలేని భయం చిన్నప్పటినుంచి చూస్తున్నాను గదా! నేనంటే ఏవగింపూ, కోపం తప్ప మరొకటిలేదు ఇప్పుడు నేనేమైనా ఆమె పట్టించుకోదనుకుంటాను ఆమెకు కావలిసింది ఒకటే నేనామెకు కంటబడరాదు '' పాదాలముందు ప్రవహిస్తున్న నీళ్ళవంక ఆమె చూస్తూ అన్నది ''నడిరేయి ఎన్నోసార్లు ఈ వాగువద్దకు వచ్చాను ఇది పెద్దనది అయితే ఎంత బాగుండేది? నీళ్ళలో దూకితే నా శరీరం సముద్రంచేరి ఉండేది అది మహాపాపం భిక్షువులు ఆత్మహత్య కూడదని చెబుతుండేవారు మరునాడు మేల్కొని పక్షులు కిలకిలారావాలు విన్నప్పుడు, రంగు రంగుల లోకాన్ని చూపుతున్న సూర్యరశ్మిని చూచినప్పుడు ఆ పని చేయనందుకు సంతోషించేదాన్ని, నీ కెప్పుడైనా అలాంటి దుఃఖం కలిగిందా?''

''లేదు, చేతులారా నిండుప్రాణాలు తీసుకోవడం మహాపాపం. ఆపని ఎప్పుడూ చేసి

ఉండేవాణ్ణి కాదు నీ కష్టాలు విని మనస్సు కలత పడుతున్నది నీకివి తప్పవా? ఎల్లప్పుడు నీ విక్కడే ఉండాలా?''

''పొరపాటు నేనెప్పుడూ ఇలాగే ఉంటున్నాననుకోకు, సాధారణంగా నేను హాయిగానే ఉంటా పాపం చేయని జీవి ఎప్పుడు సుఖంగానే ఉంటుందని భిక్షువులంటారు ప్రతి గడియ ఆనందించాలి ఈ వెలుగు, చీకటి, చేతినిండుగా పని ఉంటే ఎందుకు దిగులుపడాలి? అయినా నేనెప్పుడూ ఇక్కడే ఉండవలసి వస్తుందనుకొంటాను నాకు మరొక ఇల్లూ వాకిలీలేదు అత్తయ్యకు నేను పెంపకం వచ్చాను ఈమె అక్కయ్య మొదట నన్ను పెంచుకొన్నది ఆమె నా చిన్నతనంలోనే చనిపోయింది. దయతోనే అత్తయ్య నన్ను చూస్తున్నది ''అమ్మా నీవు ఆమె మేలు మరవరాదు'' అని భిక్షువులు చెప్పేవారు.

తాను ఆమెవంక తేరిచూచాడు వేదగిరి చెప్పిన కథ అతని మనస్సులో మెదలింది ''నీకు పెరదానవు కావు, మనది ఒకటే జాతి,'' అని అందామని అనుకొన్నాడు కాని, అనలేకపోయాడు.

చిత్ర ఆవేశంలో తన కథ చెప్పసాగింది ''అత్తయ్య, మా అమ్మ ఎవరో చెప్పక వచ్చింది ఆమె బ్రతికి ఉన్నదో, లేదో తెలియదు ఒకసారి అడిగాను మళ్ళీ తానెత్తేటంతవరకు ఆ ప్రస్తావన

 తేవద్దన్నది. సమయంవచ్చినప్పుడు తానే చెబుతానన్నది ఇంతవరకూ చెప్పలేదు.

రహస్యం తెలుసునన్న సంతోషంతో తాను కంపించి పోయాడు సత్యం చెబితే ఏమవుతుంది? ఆ రహస్యం ఆమెను తనకు సన్నిహితురాలిని చేస్తుందా, లేక ఎడబాపుతుందా?

''మళ్ళీ ఆ సంగతి అడగలేదా?''

'' ఆమె మాటను ఎవరు ధిక్కరించలేరు'' చిత్ర విస్మయపడి అన్నది.

''నేనైతే అడిగి ఉండేవాణ్ణి.''

''మాటలు ఎన్నైనా చెప్పవచ్చు నీకైనా అడిగే దమ్ములుండవు భిక్షువుల నడిగాను ''

'' ఏమన్నారు?'' కుతూహలంతో తానుఅడిగాడు

''వారూ ఆ మాటే అన్నారు తెలుసుకోదగిన వయస్సు రాలేదన్నారు సమయం వచ్చినప్పుడు చెబుతామన్నారు సమయమంటే అర్థమేమిటి?''

''నాకు మాత్రం ఏమి తెలుసు? మీ వాళ్ళ పనులు నాకు బోధపడవు అయినా మీ అమ్మ ఎవరో వాళ్ళకు తెలియదేమో?''

''కాదు, కాదు వాళ్ళకు తెలుసు  పోనీ ఆ కష్ట కధలు దేనికి? సుఖవార్తలు చెప్పుకొందాము, నీవు ఇక్కడ ఉంటున్నావా?''

'' ఉంటే సంతోషపడుతావా?'' అని తాను ప్రశ్నించాడు

''ఎంతోనా? ఆ సంగతి నీకే తెలుసు  నీవు లేకపోతే ఇక్కడ ఒక్కపనీ జరగదు  బాబునిన్ను పోనీయడు.''

''మా నాన్న ఏమంటాడో? నిన్ననే ఆయన దగ్గరనుంచి మనిషి వచ్చాడు  చినబాబు ఉండమంటున్నాడు  మరేమి చేయమంటారో కబురు చేయండని ఉత్తరం వ్రాసి పంపాను. మా నాన్న మూడు కాళ్ల ముదుసలి  నన్ను వదలి ఆయన ఉండలేడు  పైగా మా నాన్నకు నేను ఒకణ్ణే  మా అమ్మ ఎప్పుడో చనిపోయింది  మాయింట మే మిద్దరమే  నేను లేకపోతే మా నాన్న ఒక్కడే బిక్కు బిక్కుమంటూ ఉంటాడు  అయితే నేను డబ్బుసంపాదించడం మానాన్నకు ఇష్టం అందువల్ల ఉండమంటాడనుకొంటాను  మా గ్రామానికి ఎన్నో వసతులు కల్పించాలని ఉన్నది. మావాళ్ళంతా ఆపూటకు పొయ్యి రాజని నిరుపేదలు  సంపాదించినది తినటానికి చాలదు. తానుకన్ను మూసేలోగా వారికి ఒక దారి చూపించి పోవాలని ఆయన ఆశ  యవనులువచ్చి చుట్టుముట్టడిస్తున్నారు  అందువల్ల ఎంతో బయపడుతున్నాడు  ఉన్నభూమి పరాక్రాంతంకానీక నిలబెట్టాలని ఆయన తహతహ  చుట్టూ అలవ వేయించాలని చూస్తున్నాడు. అయితే ఆపని మావాల్ళు చేయలేకపోతున్నారు. కాలమంతా ఉదరపోషణకే సరిపోతున్నది. ఇప్పుడు మావాళ్ళు బ్రతుకుతెరువుకోసం నానాపాట్లు పడుతున్నారు  ఎప్పుడైన మా ఊరుచూశావా?''

''లేదు  ఊరు పెద్దదా?'' చిత్ర అడిగింది

''లేదు  మొత్తం ఏ ఇరవై ఇళ్ళే వుంటాయి  అవి ఇళ్ళుకాదు  గుడిసెలు  తీగలనేత, ప్రక్కనే పూజామందిరం  దానికి ఆవల శ్మశానం.''

''మీ ఊళ్లో ఎంతమంది ఉంటారు?''

''మొత్తం రెండువందలు  అయితే అందరూ ఉండరు  చాలమంది పనిపాటలకోసం దేశాలు పట్టుకు పోతుంటారు  పొలంపనులు కాలువల త్రవ్వకం చూచుకొంటారు  అంతలేవడి మరెక్కడా చూడవు ''

''చూచాను  సన్యాసినుల ఆరామంలో ఉండగా చూచాను  అప్పుడప్పుడు భిక్షువులు ఆ పేదలకు అన్న వస్త్రాలు దానం చేసేవారు  వారిలో ఎవరికి అక్షరం ముక్కరాదు ''

''అదే వచ్చినచిక్కు, చదువుకోండిరా అని మా నాన్న నెత్తినోరు కొట్టుకొని చెబుతుంటారు

వింటేగా! చదువుతిండి పెందుతుందా? గుడ్డ ఇస్తుందా? అంటారు ఆయిన ఎప్పుడూ ఏదోసాయం చేస్తూనే ఉంటాడు అయినా నిత్యదారిద్ర్యమే అంతమందిలోను వ్రాయను, చదవను నేర్చినవాడు ఒక్కడే అదేమంటే తీరిక ఏదీ అంటారు ఆగోడు అలా ఉంది ''

ఇంతకుముందెన్నడు వారిద్దరు తమ సొంత విషయాలు చెప్పుకోలేదు

''నా కష్టాలు కష్టాలుకావు నీవి నిజమయిన కష్టాలు మీ వాళ్ళకు తోడ్పడాలని ఉన్నది మీ వూరు ఈ దాపులో ఉంటే చదువు నేర్పగలిగేదాన్ని భిక్షువులు ఎప్పుడూ చెబుతుండేవారు, నిరక్ష కుక్షులకు చదువు చెప్పటంకంటె మరొక పుణ్యకార్యం లేదనేవారు నేను మీ వాళ్ళకు చదువు చెప్పాలని ఉన్నది ఇంతకూ నువ్విక్కడ ఉండటానికి మీ నాన్న ఒప్పుకోడనుకుంటాను'' అని చిత్ర అన్నది

''అలాగే కనిపిస్తుంది ''

'' ఆయన ఒప్పుకొనకపోతే ఉండవుగా?''

'' ఎలా వుంటాను?''

'' ఉండటం మంచిది కాదు '' చిత్ర కన్నులవెంట అశ్రువులు జారాయి ఇద్దరు ఒండొరుల


కౌగిలిలో ఒదిగారు ''అయితే నాతో వచ్చివేస్తావన్నమాట!'' ఆమె తల ఊపింది సరిగా ఆ సమయానికి శాంతమ్మ కేక పెట్టింది

ఈ దృశ్యం స్మరిస్తూ గుణవర్ధనుడు అలాగే పూలమొక్కల మాటున కూర్చున్నాడు శాంత కొడుకు దగ్గరకు వచ్చి మాటాడి తిరిగి తన గదికివెళ్ళి గడియవేసికోవటం అతడు విన్నాడు వెంటనే ధర్మకీర్తి వద్దకు వెళ్ళి మెల్లగా 'బాబూ!' అని పిలిచాడు

'' ఇస్ అలికిడి అవుతుంది తెల్లవారుజామున పశువులకొట్టం వెనుక కలిసికొంటాను ఇక్కడ మాటాడటం మంచిది కాదు'' అని బాబు అన్నాడు.

''శాంతమ్మగారెక్కడ?''

''గదిలో''

గుణవర్ధనుడు వెనుకకు తిరిగాడు

## ..... ఎనిమిది .....

శాంత బాబువద్దనుంచి తనగదికి వెళ్ళి నిద్రపోలేదు అసలు నిద్ర ఎలా పడుతుంది? చిత్రను ఏమి చేయాలి? బాబుకు చెప్పి అతనిని చీకాకుపరచడం ఇష్టం లేదు పైగా గుణవర్ధనుని ఏమిచెయ్యాలో తనకు తేలలేదు చిత్రను బౌద్ధసన్యాసినుల ఆశ్రమానికి పంపివేస్తే అతన్ని పనినుంచి

తీసివేయనక్కరలేదు ఆ కోపంతో వెళ్ళిపోమ్మన్నదేకాని అతన్ని పంపించివేయడం ఆమెకు ఇష్టంలేదు పంపించివేస్తే పని ఏమికాను? ఆమె ఆలోచించింది మార్గం పొడకట్టినట్లయింది మానవహృదయాలతో నిమిత్తంలేనివారికి అన్ని సమస్యలు ఇట్టే తేలిపోతాయి

చిత్రను ఆశ్రమానికి పంపివేస్తే చిక్కులు తీరినట్టే భిక్షువులుకూడ ఇలాంటి చెడిపెకు ఆశ్రయం ఇవ్వలేదని తన్ను నిందించరు అక్కయ్య ఆదేశం అందుకు అనుకూలంగాను ఉన్నది తారాదేవి చిత్రం గోడకు తగిలించి ఉంది శాంత దానిని ప్రక్కకు నెట్టగానే గూఢసొరంగం కనిపించింది అందులోనుంచి ఒక చిన్న పేటిక బయటికి తీసింది అది చిన్న ఇనపపెట్టె త్రుప్పుపట్టి ఉంది దాన్ని మంచంమీదపెట్టి తనవద్దనున్న చెవుల గుత్తిలోని ఒకదానితో కష్టంమీద తెరిచింది ఆర్థిక క్లేశాలు వచ్చినప్పుడు ఆ పెట్టె తోడ్పడి ఉండేది కాని దేవతల ముడుపునువలె ఆమె దానిని ఎన్నడు తాకలేదు అందులో వజ్రాలు, వైడూర్యాలు, గోమేధిక పుష్పరాగాది నవరత్నాలు ఎన్నో ఉన్నాయి వాటిని చూడగానే ఆమె పెదవి విరిచింది ఇలాంటి పాపిష్ఠురాలికి ఈ కట్నమా? మొదటనే అనుకొన్నాను కీడుతప్ప మరొకటి జరగదన్నాను కొంచెపుజాతికి కొంచెపు బుద్ధులు కాక మంచిగుణాలు ఎక్కడనుంచి వస్తాయి? ఇంకా నయం బాబు దీనివలలో పడలేదు నా బిడ్డ కాపురం నట్టేట కలిపి ఉండేది ''నీ అనుమతి పొంది యోగ్యుడైనవానిని చెట్టపట్టినప్పుడు నా పెంపుడు తల్లికి వీటినన్నిటిని అప్పగించవలె అలాకాక అయోగ్యుని వరించినా, మరొక విధంగా జరిగినా ఈ వస్తువులన్నీ బౌద్ధవిహారానికి సంక్రమించవలె '' 261

పెడత్రోవ పడితే దీనిని ఏమి చేయాలో వ్రాసి పోయిందికాదు ఈ అవమానంకంటే ఆశ్రమవాసమే మేలు మొదట దీని తండ్రి ఆశ్రమానికి అప్పగించాలని అనుకొన్నాడని చెప్పినట్టు గుర్తు అలా చేసినా బాగుండేది లేదా దాని తల్లివద్ద వదిలినా పీడ వదిలేది ఈ అప్రతిష్ఠ చుట్టుకొనకపోను ఆమె లేచి ఆలోచనతో గదిలో అటూ ఇటూ తిరిగింది చేతిలోని పత్రం జారి క్రిందపడ్డది దానిని అందుకొని మరొకసారి చదివింది అక్కగారి స్మృతితో చిత్రపట్ల ఆమె హృదయం ఏ మాత్రం స్నిగ్ధం కాలేదు చిత్ర ఎందుకూ పనికిరాని చెడు బాకిదయిపోయింది అది ఇంటినుంచి పోయినప్పుడే తనకు హాయిగా నిద్రపడుతుంది తాను తన బాబు సుఖంగా ఉండవచ్చు బాబు ఒకనాటికి ఒక ఇంటి వాడవుతాడు

అతనికి గుణంలో రూపంలో తగినపిల్ల దొరుకుతుందా? ఏది ఎలా ఉన్నా అతనికి పెళ్ళి కావాలి అప్పుడు మనుమల ఎలుగులతో తన ఇల్లు సందడిగా ఉంటుంది చిత్ర మాటే మరిచిపోతాము.

ఎంత ప్రొద్దుపోయిందో ఆమెకు తెలియలేదు ఈ రాత్రే చెబుతాను ఇంకేమాత్రం జాగుచేయను తన తల్లి ఎవరో నేడు చెవులారా వింటుంది

చిర్రు బుస్సుమంటున్న శాంతకిప్పుడు దేనికో చిత్ర భోజనం చెయ్యలేదని జ్ఞప్తికి వచ్చింది వెంటనే వంట ఇంట్లోకి వెళ్ళి గిన్నెడు పాలుపట్టుకొని ఆమెగదికి వెళ్ళింది చినబాబు మేల్కొంటాడేమోనన్న భయంతో సద్దుకానీక గది తలుపు తెరచి లోనికి వెళ్ళింది చిత్ర గొంతు వినించలేదు చేతిలోని గుడ్డి తిల్లి కనుపైకెత్తి చూచింది కనిపించలేదు వట్టి మంచం ఆమెను వెక్కిరించింది ఒక్కసారిగా భయక్రోధాలుముసురుకొన్నాయి కొంపదీసి వాడితో లేచిపోలేదు గదా? అంతకన్న తలవంపు లేముంటాయి? నాలుగైదు నిముషాలు కొయ్యబారి నిలిచి పోయింది ఆమెకు క్రమంగా ఉచ్ఛ్వాస నిశ్వాసాలు వినిపించసాగాయి మెల్లగా గది రెండవ ప్రక్కనుపోయి చూచింది బుద్ధదేవుని పాదాల చెంత తల ఉన్నది చిత్ర చేతులలో పాదాలున్నవి అలాగే కటికి నేలమీద పడి నిద్రపోతున్నది చెక్కిలి కన్నీటి జల్లుతో తడిసి ఆ గుడ్డి వెలుగులో మెరుస్తున్నది శాంత ఆమెనూ, ఈ తెరచి ఉన్న కిటికీని చూస్తూ కొంతసేపు నిలబడ్డది అప్పుడు స్ఫురించింది బాబుకు తోడుగా పండుకొంటున్న గుణవర్ధనునికి ఆ కిటికీ ఆమెను సన్నిహితురాలిని చేస్తున్నదని మొదటి సారిగ గుర్తించింది సిగ్గా నెరమా అనుకొన్నది తెచ్చిన పాలు బల్లమీద పెట్టి మంచం మీది శాలువా తెచ్చి చిత్రకు ఆపాద మస్తకం కప్పింది తరువాత గది తలుపు భద్రంగా తాళం వేసి వెళ్ళిపోయింది.

చినబాబు ఆ సవ్వడి వింటూనే ఉన్నాడు అంతా ఊహించాడు ఈ కూర్కు పట్టడం
262 ఎంతమేలు? ఆమెతో మాట్లాడితే మేలుకొంటానని అమ్మ మాని వేసింది రేపు ఏమవుతుందో? అటు ఇటు బాబు పక్కలో పొల్లిగింతలు పెట్టాడు. ఇంతలోనే శాంత గదినుంచి సుప్రభాత గీతం బయలుదేరింది నలుమూలల నుంచి ఆ గీతం అందరూ అందుకొన్నారు గడియ క్రితమే మేలుకొని చిత్రగతి ఏమైనదా అని ఆలోచిస్తున్న మాలతి కూడా గీతమందుకొన్నది దుర్బలమైన తన కంఠాన్ని కూడ బాబు కలిపాడు. గదిలోనుంచి చిత్ర, పూజా మందిర ప్రాంతంనుంచి గుణవర్ధనుడు అందుకొన్నారు తన చిత్ర సురక్షితంగా ఉన్నదని గుణవర్ధనుడు తన్ను విడిచిపోక తనకు బాసటగా ప్రియుడున్నాడని చిత్రా గుర్తించారు ఆ జంట గొంతు విని శాంత విస్మితురాలైంది పాట ముగియగానే గుణవర్ధనుడు చినబాబు రాకకోసం ఎదురు చూస్తూ వావడి వెనక నిలుచున్నాడు

చిత్ర నిద్రమత్తు వదల్చుకొని చూచేటప్పటికి తన ఒంటి మీద శాలువ కనిపించింది అత్తయ్య తప్ప మరొకరు వచ్చి తన కాదుప్పటి కప్పరు ఆ ఇంటి దాసీ దాసానికి తమ గుట్టు తెలియడం అత్తయ్యకు ఏ మాత్రం ఇష్టం లేదు కాబట్టి ఆపని ఆమే చేసి ఉంటుందని చిత్ర తేల్చుకొన్నది గది అంతా చక్కగా సర్ది శుభ్రపరిచింది పలుదోమీ కేశ సంస్కారం తీర్చుకొని మళ్లీ ఊహలో పడ్డది తన అత్తయ్యకు అందని భావనా జగత్తులో గుణవర్ధనునితో విహారం సాగించింది

రానీండి నేను మాత్రం గుణవర్ధనుని పెండ్లి చేసుకొకమానను అతన్ని ప్రేమిస్తున్నాను మాట కూడ ఇచ్చాను ఆమాట నిలబెట్టుకొని తీరుతాను '' చిత్ర కుబుస మూడ్చిన త్రాచైంది

ఆకోపంలో గూడ శాంతకు కొంచెం నవ్వు వచ్చింది ''ఏమీ వాగుతున్నావో నీకు తెలియడం లేదు తలచుకొంటే నిన్ను రేపీపాటికి తల గొరిగించి సన్న్యాసినుల ఆశ్రమంలో వదలి వేస్తాను, తెలిసిందా?''

''అది మీ వల్లకాదు ''

''అయితే నన్నెవరు ఆపుతారంటా?'' శాంత సగర్వంగా అడిగింది

''గుణవర్ధనుడు ''

''గుణవర్ధనుడా? ఆ బిచ్చగాడా? ఆ శకుడా? ఒల ఊపితే చాలు నాపరిజనం మెడపట్టుకు గెంటుతుంది.''

చిత్రకు కారం రాచుకొన్నట్టయింది ''నీ తరం కాదు ఆపని చేస్తుంటే బాబు చూస్తూ ఊరుకోడు ''

''బాబా? అతని పేరెత్తే అధికారమైనా నీకు లేదు అతనితో నీకేమిటి సంబంధం? ఈ నిమిషం నుంచి నీతో అసలు మాటాడవద్దనే అంటాను నిజం తెలిస్తే వాడు నీ ముఖం కూడా చూడడు ''



''అత్తయ్యా! పొరపడుతున్నావు బాబు గుణవర్ధనుకు ప్రాణస్నేహితుడు నే నన్నా అతనికి ప్రాణాలు లేచివస్తాయి ''

''ఇంతకూ ఈ ఇంట పెత్తనగత్తెలు తమరేనన్న మాట! ఇప్పుడే తేలుతుందిగా! రా నావెంట '' శాంత బయలుదేరింది చిత్రే తటపటాయించింది.

''రా, ఆగావే ?'' మళ్ళీ గద్దించింది

ఎన్నడూ లేని తొందరపాటుతో శాంతమ్మ, మందగమనంతో చిత్ర వెళ్ళుతున్నారు భోజనాల-గదిలో నుంచి వెళ్ళుతుంటే, ''నీ తిక్క అలాగే కుదరాలి'' అన్నట్టుగా మాలతి చిత్రవంక చూచింది ''ఏ విపత్తు వచ్చినా, మాలతి ఉన్నది అడ్డుకొంటుందని ఆ అమాకురాలు అనుకొన్నది

శాంతమ్మ గదిలోకి వెళ్ళారు తెరచి ఉన్న రెండు కిటికీలు శాంతమ్మ మూసివేసింది తెరలు జార్చింది తలుపులకు లోపల తాళం వేసింది చిత్ర చూస్తూ నిలబడ్డది

''ఆ కుర్చీలో కూర్చో!'' శాంత ఆజ్ఞాపించింది

''ఇక్కడే నిలుచుంటాను '' చిత్ర పళ్ళుబిగింపుతో అన్నదే కాని లోపల భయం పీడిస్తూనే ఉన్నది

''ముందు చెప్పినట్లు చెయ్!'' శాంత గద్దించింది.

చిత్ర కుర్చీలో కూలబడ్డది తన కేమిభయం? ఆ గది చుట్టూ మనుష్యులే ఎప్పుడు కేక పెట్టినా పదుగురు పరుగెత్తుకు వస్తారు అనుకొన్నది శాంతా తారాదేవి పటం ప్రక్కకు తొలగించింది. రహస్య ద్వారం బయటపడ్డది పెద్ద తాళం చెవి తీసి దానితో ఆ తలుపు తెరచింది. తన్ను ఆ గోడ కంతలో త్రోసి అన్నం నీరు లేకుండా చేసి చంపదుగదా? చిత్ర భయపడ్డది. శాంత ప్రశాంతంగా సాగి ముందు చిన్న ఇనపపెట్టె తెచ్చి బల్లమీద పెట్టింది. తరువాత పెద్ద తోలుపెట్టెను వంగి ఆ ద్వారం నుంచి బయటకులాగి చిత్రవద్ద పెట్టింది. ఇదంతా మౌనం వహించి చేస్తున్నది చిత్రకు ఆమెను ఏ భూతమో ఆవేశించినట్టు కనిపించింది మళ్ళీ రహస్య ద్వారం మూసి పటం ఎప్పటి స్థానానికి పెట్టింది తన్ను ఆ గోడ గదిలో బంధించదని తేల్చుకొని నిట్టూర్చింది. శాంత కుర్చీ లాగుకొని బల్లప్రక్కన కూర్చుండి, ''చిత్రా! నీవు ఆ గుణవర్ధనుని ఎందుకు పెండ్లాడరాదో చెబుతా'' నన్నది మళ్ళీ చిత్రకు ఎక్కడలేని ధైర్యం వచ్చింది. తాను యువతి, అంతముప్పు వస్తే ఒక్క గంతున పోయి బయటికి దూకవచ్చు, అత్తయ్య అడ్డుపడుతుందా అన్న నిబ్బరం కలిగింది

''నేను గుణవర్ధనునే పెండ్లాడుతాను అది ఎటూ తప్పదు.'' చిత్ర తెగించి అన్నది.

''మధ్య అడ్డుతగలకు, చెప్పవలసింది చాల ఉన్నది విను.'' పెట్టె తెరచి చందుకం వెంట చందుకం బయటికి లాగి శాంత బల్లమీద పెట్టింది. పెట్టె అడుగున పత్రమున్నది.

''ఈ పత్రం చూచావా'' అంటూ, పైకి తీసింది. '' ఇది నిన్ను పెంచుకొన్న మా అక్కయ్య వ్రాసి పెట్టినది, నీకిచ్చిన ఆస్తి ఏమి చెయ్యాలో ఈ పత్రంలో వ్రాసిపోయింది.''

ఆశ్చర్యపడి చిత్ర వింటున్నది శాంత చదివే ఒక్కొక్కవాక్యమే వింటూ చిత్ర ఆమె ముఖం చూస్తున్నది ఆమె ముగించి, అన్నది. ''విన్నావుగా! ఆ ఆస్తి అంతా నా అధీనం. నేను ఏమిచేసినా చెల్లుతుంది ''

''ఇంతకూ మా అమ్మ ఎవరో చెప్పలేదే? ఆ పత్రంలో అంతకన్నా మరేమీ వ్రాసిలేదా?''

శాంత ఒక్కసారి చకితురాలయింది చిత్ర నటిస్తున్నదా? ''ఇంత ఆస్తి ఈ పిల్లకు ఒక చిల్లిగవ్వపాటి కూడా కాకపోతున్నదా?'' అని విడ్డూరపోయింది.

''మీ అమ్మ ఎవరు? ఆసంగతి వ్రాయవలసిన అవసరం లేదు మీ అమ్మ శకస్త్రీ ఆ సంగతి అందరికీ తెలుసు ''

''శకాంగన!'' ఆశ్చర్యంతో అడిగింప

శాంత అపోహపడ్డది ''అవును అధమజాతిది మీ అమ్మ ఆనాడే అక్కయ్యతో చెప్పాను నీచజాతికి నీచత్వంపోదు ఏనాటికో ఒకనాటికి బయటపడకతప్పదని మొత్తుకొన్నాను ఆ మాట నేటికి నిజమయింది ''

కోపంతో చిత్రముఖం జేవురించింది ''శాంతమ్మ గారూ! ఇవాళ నాజాతి గుణావగుణాలు బయటపడుతున్నవి మునుపు బోధపడని విషయాలెన్నో నేడు అర్థమవుతున్నవి శకాంగననుకాబట్టేకదా నన్ను మీరు ద్వేషించింది?''

''నీవు శకాంగనవుకావు నిన్నెన్నడూ ద్వేషించలేదు ''

చిత్ర ఆమెను లెక్కచేయలేదు ''నేను నిజంగా శకాంగననే అయితే, నేను శకయువకుని పెండ్లాడడానికి ఎందుకభ్యంతరపెడుతున్నారు ఆ జాతిలో పుట్టినందుకు గర్విస్తున్నాను నేను అతని జాతి దానను ఈ వార్త వింటే అతడు ఎంతసంతోషిస్తాడు!'' ఆ ఆవేశంలో దగ్గర దగ్గరకు



వెళ్లింది ''నిజంగా నీహృదయం గండశిల ఇది వరకు గుర్తించలేకపోయాను ఇప్పుడు బోధపడుతున్నది నేను శకాంగనని తెలిసి తెలిసి అలా అవమానపరచావంటే ఏమనాలి? నిజంగా నేనంటే నీకెప్పుడూ ద్వేషమే మా అమ్మ బ్రతికి ఉన్నదా? ఎక్కడ ఉన్నది? చెప్పు త్వరగా చెప్పు! ఇవాళే ఆమె దగ్గరకు పోతాను గుణవర్ధనుడు నన్ను ప్రేమిస్తున్నాడంటే ఎంతో సంతోషిస్తుంది ''

శాంత కటువుగా అన్నది! '' ఇంకా నాకు పనేమున్నది! మీ అమ్మ బ్రతికి ఉందో చచ్చిందో, ఉందో, ఏమి చేస్తున్నదో, కనుక్కోవటమేగా నా పని! ఆమె సంగతి ఎవరికీ పట్టలేదు ఎవరికీ తెలియదు మీ నాన్న నీలాగే మతి చెడిపోయినప్పుడు పెండ్లి చేసుకొన్నాడు సుపుత్రివి నీవు పుట్టావు ''

'' ఇంతకూ మా నాన్న ఆమెను పెండ్లి చేసుకొన్నాడన్నమాట! ఆసంగతి నీకెలా తెలుసు?'' చిత్ర రెట్టించి అడిగింది

''మీ నాన్న మా అక్కయ్యతో చెప్పాడు '' శాంత సణిగింది

''అయితే ఆయన పేరు ''

''భానుదత్తుడు '' ఆమె పెద్ద పెట్టెలోనుంచి పట్టు చీరలు, రవికలు, మేలి ముసుగులు,

అంగవస్త్రాలు, శాలువలు బయటికి తీసింది అవి వెలుగును చూచి ఎంతో కాలమయింది? మిల మిల మెరిసిపోతున్నవి

''ఇవన్నీ మా పెంపుడమ్మ ధరించేదా?'' ఆశ్చర్యచకిత అయి చిత్ర అడిగింది మరొకసారి శాంత అపోహపడ్డది ఈ అమూల్య వస్త్రాలంటే చిత్రకు వ్యామోహమని అనుకొన్నది వాటి యందలి ఆసతో తన మాట వింటుందని అపోహపడ్డది

''అవును చిత్రా! ఇవన్నీ నీవే నేను ఆమోదించిన వరుణ్ణి పెండ్లాడినప్పుడు ఇవన్నీ నీవే ఇప్పుడు చదివిన వాక్యాలర్థమయ్యాయి కదా?''

చిత్ర మాటాడలేదు నగల పెట్టెలో ఒక మూల ఉన్న పట్టు జేబురుమాల అందుకొన్నది దానికి ఎన్నో ముళ్లు వేసి ఉన్నది

''భద్రం, ముత్యాలు, మీ నాన్న చనిపోతూ అక్కకు పంపించాడు ''

చిత్ర కన్నులు చెమ్మరించాయి ఆమె మెల్లగ ఒక్కొక ముడే విప్పి ముత్యాలు పెట్టెలో పోసింది ''ఇంతకూ ఇవి మా నాన్నవన్నమాట!''

''అవును,'' చీదరింపుతో శాంత అన్నది రత్నాలకు ఆసపడుతున్నదని ఆమె అపోహ ఆ నగలన్నీ తన తండ్రివి కాబట్టి అవి తనకే రావాలంటుందనుకొన్నది



''ఇవన్నీ మీ నాన్నవే ఈ కెంపులు ఈ పచ్చలు, ఈ నీలాలు - అన్నీ అతనివే '' పెట్టె చిత్ర ముందుకు నెట్టింది

''ఈ జేబురుమాలు నే నట్టిపెట్టుకుంటాను '' చిత్ర చటుక్కున దానిని తన రవికలో దాచి వేసింది ''మా నాన్న వస్తువొకటి నాకు దక్కింది సంతోషం శాంతి భిక్షువులు యోగ్యమంటే ఈ రత్నాలు, నగలు బౌద్ధ విహారానికి ఇచ్చివేయండి నేను గుణవర్ధనుని పెండ్లాడుతాను'' చిత్ర లేచి వెళ్ళి మొదటి కుర్చీలో కూర్చున్నది

భిక్షువుల పేరెత్తగానే శాంతకు బాకుతో కుమ్మినట్టయింది ఆ ఎనిమిది జాములలో ఆయన పేరే ఆమెకు జ్ఞాపకం రాలేదు ఇలాంటి పరిస్థితులలో ఆయన ఏమి ఆదేశిస్తాడా అని కూడ ఆలోచించలేదు ''శాంతి భిక్షువులా! వారికి దీనితో నిమిత్తం లేదు ''

అత్తయ్యలో వచ్చిన వెల వెలపాటును చిత్ర గుర్తించింది ''ప్రతి దానిలోను వారి ప్రమేయం ఉన్నది లేదంటే పోతుందా ఏమిటి? ఆయన గుణవర్ధనుని ఎరుగు మా పెండ్లి, వారు నిషేధించరు ఒక వేళ నిషేధిస్తే'' . చిత్రమధ్యలోనే ఆగిపోయింది

''ధిక్కరిస్తావా?'' తీక్షణంగా చూస్తూ శాంత అడిగింది

''ఆ .''

''ఈ సంగతే ఆయనకు చెబుతాను ఈ అవమానం దేనికి? ఆయన అసలు చెప్పటమే మానివేస్తారు ''

చిత్ర కన్నులలో గిర్రున నీళ్ళుతిరిగాయి ఆ వృద్ధ భిక్షువులంటే చిత్ర కెంతో గౌరవం, భక్తి చిన్నప్పటి నుంచి ఆయన అంటే ప్రాణాలు విడుస్తూ ఉండేది అతనికి అసంతృప్తి కలిగించటమా! చిత్ర వణికిపోయింది చేతులు పిసుక్కొంటూ, ''అత్తయ్యా! ఈ సంగతి ఆయనతో చెప్పకు'' అన్నది

''నా కుటుంబంలో ఏమిజరిగినా ఆయనకు ఎలా తెలియకపోతుంది? నివేదిస్తాను నివేదించడం నా ధర్మం నీవు ఎదిరించి పోయావంటే ఘోర శిక్షార్హమని ఆయన కూడా అంగీకరిస్తాడు'' చందుకాలను తిరిగి పెట్టిలో పెడుతున్నది

'నీవు వాస్తవం చెప్పవు నేనే ఆయనకు స్వయంగా చెబుతాను '' అని చిత్ర అన్నది

''నీవు ఆయన్ను చూడరాదు అసలు ఎలా చూస్తావో చూస్తాగా! ఇదిగో తుదిసారిగా అడుగుతున్నాను, ఆ శకునితో ఏ ప్రమేయం లేకుండా ఉంటావా?'' శాంత వస్త్రాలు మడిచి పెట్టిలో పెట్టింది



''అది అసంభవం ''

''అయితే ఫలితమనుభవిస్తావు పో, దౌర్భగ్యురాలా, నీ గదికి పో! ఈ సంగతి బాబుతో చెప్పకు వినపడిందా?''

'' ఆ , విన్నా'' ఆ గది నుంచి బయటపడి చిత్ర వేటకానిచే తరుమబడిన లేడిపిల్లవలె వరండా మెట్లు దూకి తోటమీదుగా సన్నని గొంతుతో, ''బాబూ! బాబూ'' అంటూ పరెగెత్తుకు వెళ్ళింది

## ..... తొమ్మిది .....

చిత్ర చినబాబుకోసం వెదకుతున్నది వెనక ఇంట్లోనుంచి శాంత పిలుపు వినిపిస్తున్నది అతడు ఎక్కడున్నాడు? దొరుకుతాడా? తన విముక్తికి వెరవేర్పడుతుందా? ఆందోళనతో నాలుగుదిక్కులు పరికించి చిత్ర గబగబ ముందుకు సాగింది అదృష్టంపండి బాబు ప్రక్క దారినే ఇంటివైపు వస్తున్నాడు ఆమె ఒక్కపరుగున పోయి అతనివద్ద వ్రాలింది. ''బాబూ! బాబూ!'' అని చేయి పట్టుకొన్నది.

''తెలిసిందమ్మా! తెలిసింది గుణవర్ధనుడు చెప్పాడు ''

''అత్తయ్య నీతో మాటాడవద్దన్నది దుర్భరం ఏమి చెయ్యాలి? గుణవర్ధనుడు ఎక్కడ?'' చిత్ర ఆందోళనతో అడిగింది

''అమ్మ నిన్ను నాతో మాటడవద్దన్నదా! చిత్రా! ఆమెనెందుకు ధిక్కరించావు? మనమిద్దరం మాటడటం చూస్తే మరీ మండిపడుతుంది పో, త్వరగా నీ గదికి పో! నేను చూస్తాగా, నాకు వదిలివెయ్ ''

''బాబూ, బాబూ!'' చిత్ర చేతులు నులుముకొంటూ నిలబడ్డది

''తెలుసు, తెలుసు అమ్మకు మరీకోపం తెప్పించకు ఆమె ఏమిచేస్తుందో తెలియదు మాటాడితే కాని అవగతం కాదు నీగదికి వెళ్ళు వెళ్ళమని ఆమె చెప్పలేదా?''

చిత్ర ఏడుస్తూ అన్నది. ''నేను గదికి పోలేను బాబూ! ఆ గది అంటేనే గెండెలవిసిపోతున్నవి మమ్మి ఒడ్డున పడవెయ్ అందుకు మార్గమున్నదంటావా? నన్ను తలగొరిగించి ఆశ్రమానికి పంపిస్తుంటే చూస్తూ ఊరుకొంటావా? గుణవర్ధనుడెక్కడ? ఇప్పుడే మేము ఎందుకు వెళ్ళిపోకూడదు

భయంతో బాబుముఖం ముడుచుకుపోయింది ''ఆశ్రమానికి పంపిస్తానన్నదా? నిజమేనా 269 చిత్రా! సరే నీవు తిన్నగా గదికిపో నేను అమ్మతో మాటాడి చూస్తాను మనమిద్దరం మాటాడుతుండగా చూచిందో నేను చేయగల సాయంకూడా ఉండదు నామాట విను '' అతడు చేయి విడిపించుకొని గబగబ తనగదివైపు నడవసాగాడు.

చిత్రకు ప్రపంచ మంతా నిప్పుచ్చరమైపోయింది ఆ ఇంట్లో మళ్ళీ అడుగు ఎలా పెడుతుంది? మెల్లగా నడక ప్రారంభించింది. బయటపడే మార్గం ఆలోచించసాగింది గుణవర్ధను డేమయినట్లు? తన రక్షణకై ఎందుకు రాలేదు? ఆమె గదికిపోయి ఏడుస్తూ కూర్చున్నది ఆ క్షణాన గుణవర్ధనుడు గుర్రం మీద వెళ్ళిపోతున్నాడన్న సంగతి తెలిస్తే పై ప్రాణాలు పైనే పోయి ఉండేవి

గుణవర్ధనుడు బాబుకు అంతా వివరించి చెప్పాడు అతనికి కలవరం కలిగింది అంత కోపం అమ్మకు ఎన్నడూ రాలేదు రావలసిన అవసరం కూడా కనిపించలేదు ఆ కోపం తగ్గేటంతవరకు తాను ఆ ప్రాంతంలో లేకపోవటం మంచిదనిపించింది ''నీవు వెళ్ళిపో! నేనే పంపించానని చెబుతాను నాలుగు రోజులు గడచిన తరువాత మళ్ళీరా అప్పటికి అన్నీ కుదుటబడతాయి చేయవలసిన పని తేలిపోతుం''దని సలహా ఇచ్చాడు

చిత్రను చూడకుండా పోవటానికి గుణవర్ధనుడు మొదట ఒప్పుకోలేదు అంతకంటె తెలివి తక్కువపని మరొకటి ఉండదని బాబు మందలించాడు

"అయితే ఆమెకు ఈ సంగతంతా చెబుతావా బాబూ? తనకోసమే వెళ్ళిపోయానని చెప్పు. గుణవర్ధనుడు దీనంగా అన్నాడు

"తప్పకుండ చెబుతాను మీ ఇద్దరకు నేచేయగల సాయమంతా చేస్తాను పోయిరా గుణవర్ధన్, పోయిరా!" కరచాలనంతో వీడ్కోలిచ్చాడు

"నీ మేలు ఆ భగవానుడెన్నడు మరచిపోడు" అంటూ గద్గద కంఠంతో సెలవు తీసుకొని అతడు గుర్రం మీద వెళ్ళిపోయాడు

" ఎంత ఉదాత్తుడు! చిత్ర అతన్ని ప్రేమించిందంటే వింత ఏమున్నది? ఇంతకూ ఏమి చెయ్యాలో పాలుపోవటం లేదు " ఆలోచిస్తూ ధర్మకీర్తి ఇంటివైపు బయలుదేరాడు

ఇంతకు ముందెన్నడూ తనకూ అమ్మకూ కలతరాలేదు ఈవాళ గాలి దుమారం బయలుదేరుతున్నది నిజంగా బయలు దేరింది అమ్మ తన మాట ఎంత వరకు వింటుందో తెలియదు ఆశ్రమంలో చేర్పిస్తానన్నమాట స్ఫురణకువచ్చి అతడు వణకి పోయాడు అంతపని
 చేస్తుందా? చేయగలనని ఆమె అనుకొంటూ ఉండాలి లేకపోతే నోటినుంచి ఆ మాటరాదు ఆమెకు హృదయం లేదా?

గుణవర్ధనుని ప్రేమించటం తప్పా? అంతగా అయితే అతనితో వెళ్ళిపోతుంది దానికి తాను చేయగలిగినంత సాయం చేస్తాడు అతడు అటూ ఇటూ పచారులు చేయసాగాడు పైన ఎండ చుర్రు మంటున్నది మామిడి చెట్టు క్రిందకు చేరి నడుము వాల్చాడు తాను అమ్మను ఎలా ఒప్పించాలి? ఆలోచించినకొలది మార్గం కనిపించటమే మానివేసింది ఇంతలో "బాబు గారు! బాబుగారు!" అని పిలుస్తున్న మాలతి కంఠం వినిపించింది అప్పుడే భోజనవేళ అయిందా అంటూ అతడు లేచి వెళ్ళాడు

మాలతి అంతా చూస్తూనే ఉన్నది గుణవర్ధనుడు గుర్రమెక్కి పోవటం, ఉదయాన శాంతమ్మగారు చిత్రను తన గదికి కొనిపోవటం – ఒకటేమిటి – గడిచిన ఎనిమిది జాములలో జరిగిన విశేషాలన్నీ గమనిస్తూనే ఉన్నది. ఇకమీదట ఏమి జరుగుతుందా? అని ఆమె ఆశ్చర్యపడుతున్నది

తల్లికొడుకులు భోజనాలకు కూర్చున్నారు "ఒంట్లో బాగుండలేదు చిత్ర భోజనానికి రాద"ని శాంత చెప్పింది, మాలతి భోజనం వడ్డిస్తున్నది బాబు ముఖం చిన్నవోయి ఉన్నది

శాంత ముఖంలో ఇంకా కినుక, చిరాకు కనిపిస్తూనే ఉన్నవి ఓరచూపుతో అతనికి తెలియకుండానే కొడుకు ముఖం చూచింది చిత్ర బాబును కలుసుకొన్నదా? తాను చూస్తూనే ఉన్నదిగా అవకాశమేది? తాను పోయి చూచినప్పుడు చిత్ర గదిలోనే ఉన్నది తాను తలుపునకు తాళంపెట్టి వచ్చింది ఇంక ఎప్పుడు కలుసుకొని ఉంటుంది? ఇన్నేండ్లు వచ్చిన తన కంట కారం కొట్టటమా? ఏదో తన కనులముందే జరిగి ఉంటుంది బాబున్నాడు ఊరుకోడన్న చిత్ర బెదరింపు జ్ఞప్తికి వచ్చింది వారిద్దరికీ బాసటగా నిలవటానికి బాబుతో ఏమి చెప్పి ఉంటుంది? తన ఇంట్లో తనకొడుకు, తన సేవకులు తన్ను ధిక్కరించేదాక వచ్చిందా?

''తీరిక ఉంటే నా గదికి రారా–కాస్త పని ఉంది'' చేయి కడుక్కొంటూ కొడుకుతో అన్నది శాంత

ధర్మకీర్తికి సంతోషం కలిగింది సంప్రదింపులకు స్వయంగా అవకాశం కల్పిస్తున్నది అతడు శాంత ప్రక్కనే బయలు దేరాడు

కొడుకు బుజంమీద చేయివేసి, ''నాయనా! ముసలితనంపైనపడుతున్నది ఈ బరువుభారం ఆదుకోవలసినవాడవునీవే నీ చేతులమీదుగ ఎలా వెళ్ళమారుస్తావో?'' శాంత తన జరాబార్ధక్యాన్ని వెళ్ళబోసింది

''అలాగంటా వేవమ్మా? ఈ యింట ఎన్నో శుభకార్యాలు జరగాలి, నీవు లేకుండా ఎలా జరగుతాయి?'' 

''ఆ పనులన్నీ అయ్యేదాకా కాలం కనికరిస్తుందా?'' శాంత నవ్వింది

''ఏ మంత పెద్ద వయస్సువచ్చింది? ముఖాన ఒక ముడుత కూడ లేదు ''

''ప్రేమ అలా అనిపిస్తున్నది అంతకు దక్కమరేమి లేదు రోజు రోజుకు నాలో ఎన్నో మార్పులు వస్తున్నవి వెనుకటి జవ సత్వాలు లేవు దిగుళ్ళు, చింతలు ఇన్నాళ్ళ మాదిరిగా ఎదుర్కొలేకుండా ఉన్నా అవి ఆవజీవాలు క్రుంగదీస్తున్నవి ఈ ఎనిమిదిజాములలో ఎంత మార్పువచ్చిందో నాకు తెలుసు ''

ఇద్దరు శాంత గదిలోకి వెళ్ళి కుర్చీలలో కూర్చున్నారు బాబు మాటడలేదు శాంత అందుకొన్నది ''చిత్ర అంతా చెప్పిందన్న మాట ''

''లేదు గుణవర్ధనుడు ఈ ప్రొద్దున చెప్పాడు'' తల్లి దృష్టిని చిత్రనుంచి తప్పించాలన్న తాత్పర్యంతో అన్నాడు

''అలాగే ఇంకా ఏమన్నాడేమిటి? . ''జరిగిందంతా చెప్పాడు ''

''అంతానా  జరిగినదంతా చెప్పాడంటావా?'' ఆమె అడిగింది

''మళ్ళీ నీ ముఖం చూపవద్దని గద్దించావట  ఇక్కడనుంచి వెళ్ళిపోవటమే ఉత్తమమనుకొన్నాడు  అదే మంచిదని సలహా ఇచ్చాను  అతడు మళ్ళీ కనిపించటం నీ కిష్టంలేదుగా?''

''మరి నీ యభిప్రాయమేమో తెలియదు  వెంటనే పంపివేయటం మంచిదో, కాదో, నీవేమి నిశ్చయించుకొన్నావో నాకెలా బోధపడుతుంది? తిన్నగాపోయి బాబుకు కనిపించమన్నాను  అతన్ని ఇక్కడ ఉంచే మార్గమేదైనా ఆలోచిస్తావనుకొన్నాను ''

చిత్ర పొరపాటుపడ్డదని బాబు అనుకొన్నాడు  సంతోషంతో అనివేశాడు  అతన్ని ఇక్కడ ఉంచే మార్గమేదైనా ఉంటే అన్నీ చక్కబడుతవి  చిత్రా గుణవర్ధనుల అనురాగం వెంపొందుతున్నకొలది ఈ పని ఎలా జరుగుతుందా అని ఆలోచిస్తున్నాను  గుణవర్ధనుడు మంచివాడు  అన్నిట అందెవేసినచేయి  ఈ జమీపై పెత్తనమిస్తే ఎంతో బాగుంటుంది  నాడు చిత్రను పెండ్లాడడానికి ఏ ఆక్షేపణ ఉండదు ఇద్దరు సుఖంగా ఉంటారు ''

''చాలు ఆవాగుడు!'' క్రోధంతో హుంకరించింది శాంత

బాబు బిత్తరపోయాడు  ''కానిమాట నేనేమన్నాను? ఎందుకలా చూస్తావు?'' అతడు తల్లివంక చూశాడు  'నాకే ఇంతభయం కలుగుతున్నదే పాపం చిత్ర ఎంత హడలిపోయిందో' ననుకొన్నాడు.

శాంతహృదయంలో బడబానలం బయలుదేరింది  ఈ చిత్రమూలానగదా ఇంత వచ్చిందని ఆమెమీద పళ్లునూరింది  అదిలేకపోతే తనకూ, తనకొడుకుకూ ఇలాంటి పొరపొచ్చాలువచ్చేవా అనుకొన్నది  కోపం దిగమ్రింగి వాత్సల్యంతో అన్నది  ''ప్రపంచంలో ఏదీ నన్నింత కుపితను చేస్తుందనుకోలేదు  ఇంతకూ ఆ పాపిష్ఠిదే కారణం  అది ఇక ఈ ఇంట్లో ఉండటానికి వీలులేదు ''

చిత్ర ఏ మాత్రం పొరపడలేదు  ఆమె చెప్పింది అక్షరాల నిజమని అతనికి తెలిసివచ్చింది తల్లి కనుగొలుకులలో నిలిచిన రెండు కన్నీటి బిందువులను చూడగానే అతడు కరగిపోయి మెల్లగా అన్నాడు  ''ఎందుకంతమాట? చిత్ర గుణవర్ధనుని ప్రేమిస్తే తప్పేమిటి?''

''వాడి కౌగిట్లో ఉందిరా!''

అవును చెప్పాడు. నీవు వెళ్లినప్పుడే ప్రేమించుకొన్నట్లు తెలుసుకొన్నారు వెళ్ళినిశ్చయించుకొన్నారు ''

''పెండ్లి, పెటాకులు! ఆచిత్ర అలుసు ఇవ్వకపోతే ఆమాట అనటానికి ఎన్ని దమ్ములుండేవి? కకులకు పెండ్లేమిటి? ఇవాళ ఒకతె  రేపు మరొకతె!'' ఆమె చీదరించుకొన్నది

తల్లి హృదయం అతనికి బొమ్మ కట్టినట్లు కనిపించింది వెంటనే అందుకొన్నాడు "గుణవర్ధనుడు అలాంటి వాడు కాదమ్మా! అతడు విజాతీయుడైనా సంస్కారవంతుడు చిత్రకూడ చిన్నపిల్ల కాదు మంచి చెడుగులు తెలుసు"

"తెలియకేం మాబాగా తెలుసు! అతడు కాబట్టి సరిపోయింది మరొకడయితే ఎంత అప్రతిష్ఠ నెత్తిన పడేదో! అసలు తప్పంతా దానిదే"

తన ముందు చిత్రను తిడుతూ ఉంటే సహించలేకపోయాడు "అమ్మా! నీకు కోపం వస్తుందని తెలుసు ఏం చేసేది? చిత్రను అలా అంటూ ఉంటే సహించలేను చిత్ర అడుగుపెట్టిన చోట్లు అతనికి పుణ్యక్షేత్రాలవుతున్నవి అతన్ని ప్రేమించక పోతే చిత్ర స్త్రీ కాదు. శిల అనాలి అంతా కనులారచూచింది మనసార ప్రేమించింది అంతగా ప్రేమించే అర్ధాంగికంటె పురుషునికి మరేమి కావాలి? అలాంటి సహధర్మ చారిణి దొరికితే జీవితం చరితార్థమేనంటాను వారిద్దరికీ వివాహం జరగటం మంచిది జమీపై పెత్తనమిస్తే ఇద్దరూ హాయిగా ఇక్కడే ఉండిపోతారు ఇందులో అవమానంలేదు, అప్రతిష్ఠలేదు, అదర్మం లేదు, నీకు తెలియనిదేముంది? చిత్ర మన కుటుంబంలో పుట్టలేదు ఆమె శకాంగన కడుపున పుట్టిన సంగతి నీకు తెలియనిదికాదు అప్పుడప్పుడు చిత్ర భవితవ్యం ఆలోచిస్తూనే ఉన్నా తల్లివైపున ఆమె శకజాతీయ మన ఆర్యజాతిలో ఎవరు ఆమెను పెండ్లాడుతారు? నీవే ఆలోచించు నేను పెండ్లాడుతానంటే ఒప్పుకొంటావా? లేదు ఏమాత్రం ఒప్పుకోవు ఆసంగతి నాకు తెలుసు అందుకని నేను చిత్రను పెండ్లాడబూనుకోలేదు నీవెన్నడూ ఆమెను ప్రేమించలేదు అసలు ఆమె పొడే నీకు గిట్టలేదు చిన్నప్పటి నుంచి చూస్తున్నాను నా మీద చూపిన వాత్సల్యంలో వెయ్యోవంతైనా ఆమె మీద చూపావా? ఇప్పుడు కూడా నీవు ఆమెకు తీరని అపకారం చేస్తున్నావమ్మా! ఈ వేసవి అంతా పరికిస్తూనే ఉన్నా - చిత్రా గుణవర్ధను లిరువురు నిరంతరం కలిసే ఉంటున్నారు అతడు మన బంధువైనట్టుగా ఎప్పుడూ మనతోనే ఉంటున్నాడు నేను చూస్తూనే ఉన్నాను నీవుకూడా చూచావనుకొన్నాను నేను చేయదగనిపని గుణవర్ధనుడు చేయలేదు నా చెల్లెలు చేయరాని పని చిత్ర చేయలేదు"

శాంత కొడుకు ముఖం తేరిపారచూచింది "నిజంగా నీచెల్లెలు చేయరానిపని చిత్ర చేయలేదంటావా? నీతో బుట్టువే గుణవర్ధనుని పెండ్లాడుతానంటే ఒప్పుకొంటావా?"

తనకొడుకు తన చేతిలోనుంచి జారిపోరాదు అతడు తాను చెప్పినట్లు చేయాలి ప్రత్యక్షంగా అతన్ని కాదంటే తనవాడు కాకపోతాడు ఎలాగైనా అతని చేతనే కాదనిపించాలి మళ్ళీ ఆ ప్రశ్నే అడిగింది "చిత్ర నిజంగా నీ చెల్లెలే అయితే అతన్ని పెండ్లాడడానికి ఒప్పుకొంటావా?"

తల్లి తన్ను ఎటు ఈడుస్తున్నదో గ్రహించాడు '' ఒప్పుకోను కాని-''

''కానులు అలా ఉంచు నీకు చెల్లెలే ఉన్నదనుకో ఆ గుణవర్ధనునితప్ప మరొకణ్ణే పెళ్ళి చేసుకోనని పట్టుపట్టిందనుకో నీవు ఒప్పుకొంటావా? 'చచ్చినా బాగే కాని ఆ పెండ్లి మాత్ర వీలులేదంటావు' అవునా?''

''అలా కాదమ్మా?''

''ఉండరా ఉండు నన్ను మాటాడనీ నీమనసెంత మెత్తనో నాకు తెలుసు పూర్వజన్మలో ఎంతో పుణ్యం చేసుకొన్నాను నీవు నాకడుపున పుట్టావు ఇంత కన్నా నాకేమి కావాలి? నీవు చెప్పిందే ఒప్పుకావచ్చు నాదే తప్పుకావచ్చు ఇప్పుడావిషయాలు మనకక్కరలేదు ఇంతకూ మన ప్రశ్న ఏమిటి? ఆ నీ చెల్లెలు చేయరాని పని చిత్ర చేస్తున్నప్పుడు సహించవచ్చునా? అది ఒప్పని అనవనుకొంటాను '' శాంత కొడుకుముఖంలోకి చూచింది

''కాదు, కాని ''

''నా తండ్రి అలాఅనుకోడు ఆ సంగతి నాకు తెలుసు కాబట్టి మనబిడ్డ చేయరానిపని చిత్ర చేస్తుంటే ఊరుకోవచ్చునా? ఇదే నా ప్రశ్న మన బిడ్డలాగా పెంచాలని మీ పెద్దమ్మ తాత్పర్యం ఆ ఉద్దేశంతోనే దగ్గరకు తీశాను చనిపోయేటప్పుడు నన్ను పిలిచి, అప్పగించింది మీ పెద్దమ్మ



బ్రతికి ఉంటే తనకూతురు కాని జాతివాణ్ణి పెండ్లాడ్డానికి ఒప్పుకొంటుందా?''

''లేదు''

''అలాంటప్పుడు మన బాధ్యత మరీ మెండు మన జాతికి అప్రతిష్ఠ తెచ్చే పని చిత్ర చేయరాదు చేయకుండా చూడడం మన విధి మీ పెద్దమ్మ ఆశ నిరాశ కారాదు అవునా?''

''నిజమేనమ్మ''

దారులన్నీ మూసివేస్తున్నది. తల్లి వాదనలో ఎక్కడో లోటువున్నది అదే అతనికి బోధపడలేదు మనసు తిక మక పడుతున్నది ఏది ఎలావున్నా చిత్ర గుణవర్ధనుని పెండ్లాడక మానదు దానికి ఆమె సుతరాము ఒప్పుకోదు తాను కూడా దానికి ఒప్పుకోరాదంటున్నది అదే బోధపడటంలేదు అయినా గుణవర్ధనునికి మాట ఇచ్చాడు చేయగల సాయమంతా చేస్తానన్నాడు ''అసలు అతడు ఇక్కడకు రాకుంటే ఎంత బాగుండేది?'' చిరాకుతో బాబు పెద్దగా అన్నాడు

''ఇంతకూ తప్పంతా నాదే కళ్ళు మూసుకొని జరుగుతున్నది చూడలేక పోయాను నీకు జబ్బువచ్చిన నాటినుంచి అతడు మనతోపాటే ఉంటున్నాడు పాటకని, వీణావాదనకని, దీనికనీ దానికనీ చిత్రకూ మనకూ దగ్గరలో మసలుతూ వచ్చాడు అయితే చిత్ర అతన్ని ప్రేమిస్తుందని కలలో కూడ అనుకోలేదు జీతగాళ్ళను ప్రేమిస్తుందని ఏలా అనుకొంటాను?''

''అవును, జరగరాని దేదో జరిగిపోయింది '' తల్లి మనస్సు మార్చాలని దర్మకీర్తి అన్నాడు

''ఇంతకూ గుణవర్ధనుడు ఇక్కడనుంచి వెళ్ళిపోవడం నీకిష్టం లేదు పైగా నోరుజారి ఇక్కడే ఉండిపొమ్మన్నావు తీరా ఇంత జరిగిన తరువాత చిత్ర ఇక్కడ ఉండడం కూడా మంచికాదు కొంతకాలం పాటు ఆశ్రమానికి పంపిస్తే బాగుటుంది లోగడ హాయిగా కాలం గడిపి వచ్చింది పైగా కనుచెదరు కలకాలం ఉండదు.''

బాబుకు చిత్రమాటలు జ్ఞప్తికి వచ్చాయి మళ్ళీ కోపం రగుల్కొన్నది ''లేదు వీలులేదు తలగొరిగించి సన్యాసిని చేయాలని చూస్తున్నావు కాని వీలులేదు నా గొంతులో ఊపిరి ఉండగా అలా జరగడానికి వీలు లేదు

విస్మితురాలై శాంత అన్నది ''ఎవరన్నారా మాట! భిక్షుకులవద్ద కొంత కాలముంటుంది ఇప్పటి ఉడుకు చల్లారుతుంది ఇందుకు తప్పేముంది? కాకపోతే మరొక ఉపాయమున్నదంటావా? ఉంటే చెప్పు ''

సగం చిక్కుకొన్న పురుగుకోసం కొంచెం వెనుకకు జరిగి మిగిలిన దారులు మూసే తంతునాభవలె శాంత ఉచ్చులు బిగిస్తుంది

''ఉపాయమా! లేకేమి? వారిద్దరినీ పెండ్లాడనీ, ఇప్పటి పరిస్థితులలో అంతకన్నా మార్గంలేదు '' బాబు సూచించాడు 

''నిజమే ఇంత జరిగినప్పుడు తలకొట్టి వేసినట్లే ఉంటుంది ఎలా బయట పడటమన్నదేగా ప్రశ్న!'' ఆమె పట్టు జారనీయలేదు

''ఎదుర్కోవటంలేదు బయటపడటం లేదు ఆమె కిష్టమయితే అతనితో వెళ్లిపోతుంది ''

''మన ఇష్టం లేకుండానా?'' తల్లి ప్రశ్నించింది

''మన ఇష్టం పొందవీలు లేనప్పుడు పొందకుండానే వెళ్లిపోతుంది ఆమె గుణవర్ధనుని పెండ్లాడితే దానికి మనం బాధ్యులమా? దయచేసి, చిత్రను పోనీ! ఎటు దిరిగి ఆమె వెళ్ళిపోతుంది వారిద్దరు ఎంతగా ప్రేమించుకొంటున్నారో నీకు తెలియదు ''

''ఇంతకూ నీవు చెప్పేదేమిటి? వాడితో లేచి పోతుందంటావా?'' శాంత ఆసక్తితో అడిగింది

''పోతుందనే నా నిశ్చయం ''

''ఇంతకూ దాని ఇష్టం వచ్చినట్లు చేసుకొమ్మని, చూస్తూ ఊరుకోవటమే మన

దర్మమంటావా?''

''అంతకన్నా మనం చేయగల్గినదేమున్నది? అపలేము ప్రయత్నించిగూడ లాభం లేదు మీ ఇష్టం వచ్చినట్లు కానిండని చెప్పటమే మేలమ్మా!''

''ఆ లెక్కలో గుణవర్ధనుడిక్కడ ఉండటానికి వీలులేదు వారిక్కడ కనిపించరాదు ''

''ఎందుకని?''

''ఇక్కడ ఉండనివ్వటమంటే వారి పెండ్లికి ఒప్పుకొనటమే అంతగాక మరే మవుతుంది?''

''ఆ పక్షంలో వారి పెండ్లికూడ ఇక్కడ జరగటానికి వీలులేదన్నమాట!?

''అవును మనకిష్టం లేని పెళ్ళి ఇక్కడెలా జరుగుతుంది?''

''ఇంతకూ వారిని తరిమివేయక తప్పదంటావు!''

''అదికాదు ఇష్టమై వెళ్లిపోతేపోనీ అలాంటి పిచ్చిపని చేయదనుకో ఒకవేళ చేస్తే వారించలేదన్న దోషం మనకు దేనికి? అసలు నివారణమే మంచిది కాదనుకొంటే మనం చేయగలిగినది ఏమున్నది?



మాటయిచ్చి నమ్మించి చిత్రా గుణవర్ధనులను మోసగించినట్లుగా బాబుకు తోచింది స్థితిగతులిలా ముంచుకువచ్చాయి తల్లినుండి ఇంక ఏమికోరాలో, ఏమి చెప్పాలో అతనికి పాలుపోలేదు

''బాబూ! నీకేమీ రుచించినట్లు కనిపించటం లేదు ఇంతకన్న మనకు మార్గమేదైనా ఉన్నదంటావా''

''లేదమ్మా లేదు మనం చిత్రను ఇంటినుంచి గెంటివేస్తున్నాము ''

''ఎంత మాట అన్నావురా బాబు! నీకై నీవు ఎప్పుడూ అలాంటిపని చేయవు సొంత చెల్లిలికివలె ఆశ్రయమిచ్చావు ఆ ఆశ్రయం కావలనుకొంటే ఎప్పుడూ ఉంటుంది పొదలమకొనిపోతే అది నీ దోషమా? దాక్షిణ్యంతో ధర్మానికి అపచారం చేయకు ఇంటినుంచి వెళ్ళగొట్టటమా! మీ పెద్దమ్మతో ఏమన్నానో తెలుసా! నా బిడ్డలాగ పెంచుకొంటానన్నాను నా ఊపిరిపోయినా నా తండ్రి నామాట నిలబెడతాడనుకొన్నాను చిత్రకు ఇష్టం ఉన్నంతకాలం ఈ ఇంట్లో వేటున్నది అంతేకాని మనం తరిమివేయటంలేదు ''

''క్షమించు ఈ వయస్సులో ఈ బారం మరొకటి నెత్తిన వేస్తున్నాను ఈ పాడుగొడవతో

మతిచెడి ఏదీ ఉన్నది ఉన్నట్లుగా కనిపించటం లేదు అసలు ఇదంతా ముగిసి ఉంటే ఎంత బాగుండును '' వినిగి బాబు అన్నాడు.

''నాయనా, నీవు ఉన్నావుకాబట్టి ఈ బరువు భారం ఈదుకుపోతున్నాను. నీ సాయం లేకపోతే గుండెపగిలి చచ్చిఉండేదాన్ని తతిమ్మా చిక్కులన్నీ ఒకయెత్తు ఇదొకయెత్తు మనవంశానికే ఈనాడు అప్రతిష్ఠ వచ్చిపడింది ఏమిచేస్తాము? తల ఒగ్గక తప్పదు నీవు అన్నట్లు తేలిపోతే బాగుండేది చిత్రను పిలిపించి మన నిర్ణయం చెప్పివేస్తే తేలిపోతుంది అదికూడా తొక్కిసలాడుతుండాలి ''

చిత్రను ఒంటరిగా కలసికొనటం బాబుకు ఇష్టం ఇప్పుడు తల్లిని ఎలా కాదంటాడు? అతడు నిరుత్తరుడై తల ఒగ్గాడు.

శాంత లేచి వెళ్ళి చిత్రగది తాళంతీసి ఆమెను వెంటబెట్టుకు వచ్చింది

''తన భావాలే తన కొడుకుకు ఎక్కించి ఉంటుంది, ఇంక నాగతి ఏమికావాలి?''

చిత్ర నిస్స్పృహతో చినబాబు వంక చూచింది అతని చూపులు కొంత ఊరట కలిగించాయి

''చిత్రా! విను గుణవర్ధనుని పెళ్లి చేసుకుంటానని పట్టుపట్టి ఈ కుంబానికి నీవు ఎద్దడి తెచ్చిపెట్టావు అబ్బాయి, నేనూ ఆలోచించాము ఈ పెండ్లికి మేము ఒప్పుకోవడం అసంబవం మా బొందిలో ప్రాణం ఉండగా ఒప్పుకోము మా కుటుంబ గౌరవం మా జాతి మర్యాద నాశనం చేసుకోలేము '' 277

చిత్ర బిత్తరపోయింది ముఖాన ఎక్కడ నెత్తురు చుక్కలేదు చినబాబు చూపులు క్రిందికి వ్రాలాయి ఆమెకు ఉన్న ఒక్క ఆశ అంతరించింది బాబు కూడ తప్పుకొన్నాడన్నమాట!

శాంత నిబ్బరంగా తీర్పు చదువుతున్న న్యాయాధికారిణిలాగా అన్నది ''నీ పెండ్లిని నిషేధించినా ప్రయోజనం లేదని అబ్బాయి అంటున్నాడు కాదన్నా అతనితో వెళ్ళిపోతావంటున్నాడు వాడు చెప్పింది నిజమే శాంతి బిక్షువులు శాసించినా ఆగేది లేదని నీవే అన్నావు ఇదే నీ నిశ్చయమైతే మేము చేయగలిగింది ఏమీ లేదు నిన్ను ఆశ్రమంలో చేర్పించినా అక్కడనుంచి ఎలాగో పారిపోతావు కుటుంబానికి ఆశ్రమానికి అప్రతిష్ఠ తెస్తావు ఆ విధంగా నిన్ను మార్చడం సాధ్యపడదని అబ్బాయి అంటున్నాడు అందువల్ల మేము చేయగలిగింది ఏమీ లేదు ఇప్పుడు నీకు మేము చెప్పగలమాట ఒక్కటే, నిన్ను మా బిడ్డగా చూచుకొంటున్నాము మాకు ఇల్లుఅంటూ ఒకటి ఉన్నంత కాలం అది నీ యిల్లే

ఇంతకుముందెట్లో ఇకమీదకూడ అట్లే ఈ ఇల్లు వదలి శకుణ్ణి పెళ్ళిచేసుకొని నీవు మాకుటుంబానికి అవమానం కల్పించదలచుకొన్నావా, మేము చేసేది ఏమున్నది?'' చిత్ర శాంతముఖం తేరిచూస్తూ నిలబడ్డది ''ఇక నీవు చెప్పేదేమైన ఉన్నదా?'' శాంత ప్రశ్నించింది

''నేను చెప్పవలసిందేదో ప్రొద్దుననే చెప్పివేశాను ఇప్పుడు క్రొత్తగా చెప్పేదేమున్నది? అన్నట్టు ఒక మాట నేను వెళ్ళేలోగా మళ్ళీనీతో మాటాడవలసింది ఏమీలేదు ఇన్నిసంవత్సరాలు ఆశ్రయమిచ్చి పోషించినందుకు ఇవిగో నమోవాకాలు ''

చిత్ర బాబువైపుకు తిరిగి పొంగిపొరలుతున్న భక్తిగౌరవాలతో అన్నది ''బొందిలో ప్రాణమున్నంత వరకు నిన్ను మరచిపోలేను బాబు। ఎంతగానో బుజ్జగించావు లాలించావు ప్రేమించావు. ఎలా మరచిపోతాను '' మోడ్చిన ఆమె చేతులను బాబు తన చేతులలోకి తీసుకొన్నాడు

శాంత అడ్డుతగిలింది వారిద్దరిమధ్య ఇలాంటి అనుబంధం ఉండరాదు

''అయితే వెళ్లిపోదలిచావన్నమాట! ఇప్పుడే పోదలచుకొన్నావా?'' శాంత అడిగింది

''గుణవర్ధనుడు కనిపించలేదు'' చిత్ర బాబువంకకు చూచింది



''అతడు వెళ్ళిపోయాడు''

''బాబూ! వెళ్ళాడా? లేదు లేదు వట్టిది ''

''ఈ నాలుగురోజులే కనిపించడు స్వగ్రామం వెళ్ళాడు ఒకటి రెండు రోజులిక్కడ లేకపోవడం అతనికి మంచిదనుకొన్నాను పంపివేశాను. ఎల్లుండి వస్తాడు ''

'' ఎందుకు వెళ్ళాడు? అతనితో పాటు నన్నెందుకు పోనీయలేదు?'' చిత్ర బాధతో అడిగింది.

చిత్ర చినబాబు సానుభూతి సంపాదించడం శాంతకు సమ్మతంకాదు అందువల్ల అధికారం చాటుతూ ఆమె అన్నది ''మావాడు అజ్ఞాపించాడు కాబట్టి వెళ్ళిపోయాడు అతడు నాకంటబడితే బాధపడుతానని పంపించివేశాడు గుణవర్ధనుడు పిల్లిలాగా పారిపోయాడు

అమ్మదెబ్బతిన్న బెబ్బులిలాగా చిత్ర ఆమె వైపుకు గిరుక్కున మళ్ళింది ''నీవంటి రాక్షసి మళ్ళీ పుట్టబోదు పెరగబోదు. ఈశ్వరుడు లేడా? నిన్ను తప్పక శిక్షిస్తాడు '' అని ఆమె చెరచెరా గదిలోనుంచి వెళ్లిపోయింది

''చూచావా? చూచావా? మనం దానికి ఒక లెక్కగా లేము '' శాంత వాపోయింది

గుండెచెరువైపోయి అతడన్నాడు ''గుణవర్ధనుని పంపివేసి పొరపాటు చేశాను ''

''కాదు మంచిపని చేశావు ఒంటరిగా నాలుగురోజులు పాటుంటే దానికే తలతిరిగి వస్తుంది ''

''గదిలో పెట్టి తాళం వేస్తావా ఏమిటి?'' చకితుడై బాబు అడిగాడు

''మంచిది కాదన్నావుగా?''

''అవును అలాగే చెప్పాను కాని ''

''ఇంతకు ఏమంటావురా?''

''ఏమీలేదు నీవు ఏమిచేయబోతున్నావో బోధపడలేదు ''

''ప్రయోజనం లేదని చెప్పావుగా! నాకూ ఆ అభిప్రాయమే కలిగింది ''

''చిత్ర ఇక్కడ ఉన్నంత కాలం అన్నీ యధా ప్రకారంగానే జరిగిపోతవి కదా?''

''బాబూ! అది సాధ్యమా? నిన్నూ నన్నేకాదు, శాంతి భిక్షువులను గూడా ధిక్కరించి కుటుంబానికీ అక్కకూ అగౌరవం తెస్తున్న ఈ పిల్లపట్ల వెనుకటి లాగ ఎలా ఉంటాము? అది సంభవమా?''



''కాదనుకో, అయినా పైకయినా అలా కనిపించాలి కదా?''

''అవును అందుకయినా ప్రయత్నించక తప్పదు '' శాంత ఆలోచిస్తూ అన్నది

. ..పది .....

ఆ మధ్యాహ్నం నడుమువాల్చిన శాంత చిత్రా గుణవర్ధనుల వ్యవహారం ఆలోచించకుండ ఉండలేకపోయింది మనస్సులో మళ్ళీ బేరీజు కట్టింది తాను మొదట ఏ మనుకొన్నది? గుణవర్ధనునికి జమీపై పెత్తనమిచ్చి అక్కడే ఉంచాలనుకొన్నది చిత్రను తిన్నగా బౌద్ధసన్న్యాసినుల ఆశ్రమానికి పంపివేయాలని తలపోసింది ఆమె ఆస్తిని విహారానికి సంక్రమింపచేయాలని నిశ్చయించింది బాబుతో మాటాడిన తరువాత ఏమి జరిగింది గుణవర్ధనుడు పెత్తందారు కాడు చిత్రసన్న్యాసినుల ఆశ్రమానికిపోదు విశేషించి ఆ ఇద్దరు వెళ్ళిపోయి పెళ్ళి చేసుకొంటారు నగల సంగతి ఇకముందు నిర్ణయించవలసి వుంటుంది శాంతి భిక్షువులు ఆ తగవు తెమల్చాలి తానే ఆలోచించి తెగటార్చే ధైర్యసాహసాలు లేవు

మరొకటికూడ తేలిపోయింది. బాబుతో నగల సంగతి చెప్పనక్కరలేదు అవి ఉన్నవని ఎరగడు ఇప్పుడు చెప్పవలసిన అవసరమూ లేదు చిత్ర అంటే అతనికి సానుభూతి ఎక్కువ కాబట్టి ఈ విషయం నిష్పాక్షికంగా ఆలోచించలేడు అవి చిత్రవే కాని మరొకరికి సంక్రమించడానికి వీలు లేదనవచ్చును శాంతిభిక్షువుల మనస్సుకూడ అటువైపే మొగ్గుతుంది మరి ఆయన చెబితే తాను వినక తప్పదు నిజానికి ఆ సంగతి తాను ఆయనకు తెలియనీక దాచి ఉంచేదే కాని అక్క చనిపోతూ అంతా పూసగ్రుచ్చినట్టు ఆయనకు చెప్పిపోయింది ఏది ఎలా ఉన్నా ఆయన మళ్ళీ ఈ చాయలకు వచ్చేప్పటికి సంవత్సరం పడుతుంది ఈలోగా ఆయనకు ఈ సంగతి వ్రాయడం మంచిది కాదు ఈ పదునాలుగు సంత్సరాలనుంచి నక్కట్టు సురక్షితంగా అక్కడే వున్నది తార కాపాడుతున్నది ఇన్నేండ్లు కాపాడిన తల్లి మరొక సంవత్సరం కాపాడదా? చిత్ర గుణవర్ధనునితో వెళ్ళిపోతే, శాంతిభిక్షువులకు తాననుకొన్న సత్యాన్ని వ్రాస్తుంది తక్కిన విషయాలు ఆయన వచ్చినప్పుడు తేల్చవచ్చును

శాంత తాను చేయవలసిన పని ముందే తేల్చుకొన్నది దానితో ఆమె మనస్సు కొంత ఊరటపొందింది చిత్ర విషయంలో తాను మరేమి చేయబోవడం లేదు అది ఆమెకు బాధ కలిగించింది బాబు కూడ జోక్యం కలిగించుకోడు అతనితో మాటాడి అంతవరకు సాధించింది చిత్ర అన్నా, గుణవర్ధనుడన్నా అతనికి ప్రాణం తాను గుర్తు చేసేటంత వరకు వారి పెండ్లితో
280
తన కుటుంబ గౌరవం ఏమౌతుందో ఆలోచించలేదు తాను మళ్ళీ ప్రస్తావించకపోతే అది అడుగున పడుతుంది మళ్ళీ బాబు మెత్తగిల్లుతాడు అయినా తానా విషయం తిరిగి ప్రస్తావించటం మంచిది కాదు చిత్ర లేచిపోయి కుటుంబగౌరవాన్ని మంటగలిపినా, ఉండి నిలబెట్టినా కన్నులప్పగించి చూస్తుండవలసిందే

తను తటస్థం ఎలా ఉండాలో శాంత ఆలోచించింది చిత్రను ఎప్పటివలె చూస్తుండాలి ఆమె అహార విహారాలలో కార్యకలాపాలలో మార్పు ఉండరాదు అయినా చిత్ర తాను తప్పుచేసినట్టు అనుక్షణం బాధపడాలి ఏదో తాను ఆ కుటుంబంలో ఉంటున్నదే కాని తనకు ఆ కుటుంబంలో ఏ సంబంధం లేదు, అంత అదృష్టమూ లేదని భావించాలి దీన్ని సాధించే మార్గం శాతం ఆలోచించే పెట్టుకొన్నది చిత్ర ఎలాగైనా పశ్చాత్తాపడితే తనకు అంతకన్నా కావలసిందేముంది? తన తప్పిదం తెలిసికొని గుణవర్ధనునితో పెండ్లిమానివేస్తే తాను క్షమిస్తుంది మున్ను చూపని ఆదరాభిమానాలు చూపుతుంది తనతో భౌద్ధ పుణ్యక్షేత్రాలకు తీసుకు వెళ్ళుతుంది బాహ్యప్రపంచాన్ని కొంత చూపుతుంది ఆమెకు గౌరవప్రదమైన మరొక సంబంధం వస్తుంది అప్పుడు బాబు గ్రహిస్తాడు తనది హృదయమే కాని, రాయికాదు చిత్రను ప్రేమిస్తున్నది తానేదో అపోహ పడ్డాననుకొంటాడు ఇంతకూ చిత్ర సరిగా మెలగాలికదా!

ఆ సాయంకాలం శాంత చిత్ర గదికి వెళ్ళి 'మిద్దెమీద కందులు ఎండబోయించావు కదా! ఎండలేదా? ఇంకా దేనికి, ఎత్తించు' అని అనగానే ఆమె విస్తుపోయి చూచింది చిత్రలోని మార్పు చూచికూడ చూడనట్లే ఎప్పటి తీరున మాటాడసాగింది, చిత్ర వెంటనే పనికట్టింది శాంతమ్మగారి అంపకాదిలోని అమ్ములు వెరిని తేల్చుకొన్నది "ఈ నాలుగు రోజులు ఏ బాధలు వచ్చిన సహించక తప్పదు గుణవర్ధనుడు రావడమే తడవుగా వెళ్లిపోతాను" ఈభావం ఆమె ముఖాన వ్రాసి పెట్టినట్లు స్పష్టంగా కనిపించింది శాంత ఆకళించుకొన్నది యుద్ధమన్న తరువాత యుద్ధమే కనికరానికి తావెక్కడ? లొంగే సూచనలు లేవు జంకుగొంకులు దేనికి!

మాలతి అయోమయత్వంలో పడ్డది ఏమి అర్ధం కావడంలేదు మొదట తల్లి ఉపాసికతో చిత్రా గుణవర్ధనుల కలయికను ప్రస్తావించింది ఉపాసిక తన కూతురు నోరునొక్కింది చిత్రను శాంతమ్మగారు గదిలో పెట్టి తాళం వేయడం మాలతి తల్లికి చూపించింది మరునాడు గుణవర్ధనుడు కనిపించకపోవడంతో అనుమానం బలపడింది శాంతమ్మగారు తనగదిలో చిత్రతోను, చినబాబుతోను మాటాడటం ఇద్దరూ చూచారు కాని ఉపాసికకు ఎక్కడలేని భయంకలిగింది నలభై ఏళ్ళనుంచి ఉపాసిక ఆ కుటుంబం ఉప్పుపులుసు తిని బ్రతుకుతున్నది ఇప్పుడ లేనిపోని అభాండాలు వేసి నిలువనీడలేకుండ చేసుకోవడానికి ఆ ముసలిప్రాణం ఒప్పుకోలేదు పైగా పరిజనానికి చిత్రఅంటే ప్రాణం జరిగిన సంగతులెవరూ నమ్మరు వాటిని బయటపెట్టి ఉంటే మాలతిని గొంతు పిసికి ఉండేవాళ్ళు గుణవర్ధనుడంటే వేరు అతడు నిన్నగాక మొన్న వచ్చాడు తమకన్న నేర్పరికావడం, కుటుంబగౌరవం పొందడం కొంత మెరమెరలు కలిగించాయి కాని ఆ రొంపిలోనికి చిత్రను ఈడ్వాలి. ఇది వారికి దుస్సహం అందువల్ల వారు తటస్థంగా దాదాపు ఏమీ జరగనట్లే ఉన్నారు 

తల్లి కొడుకులు చిత్ర కలిసి ఎప్పటిలాగే భోజనం చేయడం, మాలతికీ ఉపాసికకూ భ్రాంతి కొలిపింది "ఏదో కుటుంబకలహం వచ్చింది ఇప్పుడు సర్దుకొన్నది అంతకన్నా ఏమీలేదు కుటుంబం అన్నతరువాత తగాదాలు రావా, పోవా?" అని ఆ వృద్ధురాలు సంతృప్తి పడి నిట్టూర్చింది.

శాంత ఎప్పటిలాగానే ఇంటి వ్యవహారాలు సర్దుకోవడం, సాయంకాలం వాగువైపువెళ్లి రావడం సాగించింది చిత్ర పూజామందిరం అలకంరించి దేవతా పూజకు వలసిన పూజాకుసుమాలు, దండలు తయారుచేసేది మధ్యాహ్న సమయాన రంగుదారంతో మేలి ముసుగుపై అందమైన కుట్టు పువ్వులు కుట్టేది ఆ మేలి ముసుగును మొదట్లో అత్తయ్యకు ఇవ్వాలనుకొన్నది ఈనాడు తన చేతినుంచి ఆ కానుకపుచ్చుకోదు పుచ్చుకొన్నా దానిని తారాదేవికి అలంకారంగా ఉపయోగించదు ఆమె దృష్టిలో అది అపవిత్రం దేవాలంకరణకు అయోగ్యం

రా॥రేఖలు

అలాంటప్పుడు దానిని ఆమెకు ఎందుకు ఇవ్వాలి? తనవెంట తీసుకొని పోవడం మేలని నిర్ణయించుకొన్నది గుణవర్ధనునికిచ్చి శాంతిభిక్షువులకు తాను దానిని పంపిస్తుంది ఆయన దేవతలకు సమర్పిస్తాడు గుణవర్ధనుడు జ్ఞప్తికి రాగానే ఇంకా నాలుగు రోజులు, నాలుగు రోజులంటే మూడెన్నొక్కటే ఈ నాలుగు నాళ్ళు ఎలాగో కళ్ళుమూసుకుంటే చాలునని చిత్ర గుండె బిగబట్టుకు కూర్చున్నది

గుణవర్ధనుడు వెళ్ళడం మంచిదే అయింది రాగానే తన్ను తప్పకుండా ఈ నరకం నుంచి తప్పించి తీసుకుపోతాడు ఎక్కడకు పోవడం? ఆ ప్రశ్న అనవసరం ఇక్కడ ఉంటే కంటే ఏడకు పోయినా మేలే పోయేటప్పుడు తాను శాంతకు చెప్పదు చెప్పినా ప్రయోజనం ఏమిటి? అసలు తప్పెవరిది? తానేం చేసింది? బాధ్యత అంతా ఆమెదే పెండ్లి, చుట్టపక్కాల రాక, విందులు వినోదాలు, ఏవీ జరుగవు ఇంత లెక్క వచ్చిన వెనుక ఎలా జరుగుతవి! కావాలని ఆమె తరిమివేస్తుంటే ఎవరేమీ చేస్తారు? వాస్తవానికి శాంతిభిక్షువులకు వర్తమానమంపితే మహాసంతోషంగా పెండ్లిచేయిస్తారు కాని వర్తమాన మంపటమా? తామిద్దరు ఆయన వద్దకు పోతారు. ఆయన సంతోషించి ఆశీర్వదిస్తారు గుణవర్ధనుడంటే ఆయనకు ఇష్టం తానంటే ఎంతో ప్రేమ. ఆయన ఆశీర్వాదం తప్పక లభిస్తుంది

282 ఇలాంటి ఆలోచనతో చిత్ర ప్రశాంతంగా వరండాలో కూర్చున్నది బాబు ఆమె ప్రశాంతతను చూచి లోలోన అబ్బురపడ్డాడు తల్లి చెప్పినట్టు చిత్ర గుణవర్ధనుని యందలి అనురాగాన్ని వదలుకొంటున్నదా? అని ప్రశ్నించుకొన్నాడు ఆమె తత్త్వం అతనికి బోధపడలేదు అనురాగం అంకురించాలే కాని, అంకురించిన తరువాత ఏ విషవాయువులు దానిని నాశనం చేయలేవని అతడు గుర్తించలేకపోయాడు

''గుణవర్ధనుడంటే ఎందుకు నీకింత మమత?'' అని ఎవరైనా చిత్రను ప్రశ్నించి ఉంటే ఆమె కూడా ఏమీ చెప్పగలిగి ఉండేది కాదు ప్రణయం అవ్యాజం అప్రతిహతం

## ..... పదకొండు .....

రెండురోజులు గడిచాయి, చిత్ర, బాబు మాటాడుకోలేదు ఒకటి రెండు మాటలు ఆడి ఉంటే అదిగూడ శాంతమ్మముందే జరిగింది చిత్ర ప్రశాంతంగానే ఉన్నది కాని ధర్మకీర్తికి మాత్రం పిచ్చెక్కినట్లుంది చిత్రకు తాను చేయగలిగినంత సాయం చేయలేకపోయానని బాధపడుతున్నాడు ఆమె మనస్సు మాత్రం మధుర స్వప్నాలు కంటున్నది

వేసవి ఎండలు నిప్పులు చెరుగుతున్నవి. బయట సుడిగాలులు, దుమ్ములు చిమ్ముతున్నవి వెట్టకు ఇండ్లలో అంతా సొమ్మసిల్లి పండుకొన్నారు శాంతమ్మ ఎప్పుడు చూచినా మేలుకొనే

ఉంటున్నది చాటుగా చిత్రతో బాబు మాటాడుతున్నప్పుడు చూచిందో స్థితిగతులు మరీ విషమిస్తవి అయినా బాబు పిల్లి అడుగుకలు పెట్టుకొంటూ బయలుదేరాడు శాంతమ్మ గొంతు వినిపించింది ''ఏమిరా కునుకు పట్టలేదా? వచ్చి విసరేదా?'' అని పలకరించింది ''అక్కరలేదులే'' అని అతడు తిరిగి పోయి తన పక్కమీద పండుకొన్నాడు చిత్ర అతని మంచానికి దిగువ పీటపై కూర్చుండి మేలిముసుగు కుట్టుపని పూర్తిచేసింది

బాబు తల్లివైపు తిరిగి చూచాడు ఆమె కుర్చీలో కునికిపాట్లు పడుతున్నది వెంటనే ఉపాయం తోచింది అందికలో ఉన్న ఆకుగంటం తీసుకొని ఒకసారి తల్లివైపు మరొ ఒకసారి చిత్రవైపు చూచాడు ఆ చీటి తనకోసమే బాబు వ్రాస్తున్నాడని చిత్ర గ్రహించింది అత్తయ్య మేల్కొంటుందేమో నన్నభయంతో ఆమె వంకే చూస్తున్నది అతడు వ్రాత పూర్తిచేసి ఆకుచుట్టి కనబడకుండ గుప్పిట పట్టి లేచి చిత్ర గదివైపు వెళ్లి కిటికీ వద్ద నిలిచాడు ఇంతలో తల్లి మేల్కొని కుర్చీలో నిటారుగ కూర్చుని ''నిద్రపోయానా'' అని అడిగింది

''లేదమ్మా! ఒక క్షణం నేపుకునికావు'' అన్నాడు బాబు చేతులు వెనుకకు ముందుకు జాడించి, బిగ్గరగా ఆవులించి, అతడు వచ్చి పక్కమీదికి చేరుకున్నాడు ఇదంతా చూస్తున్న చిత్రకు చిరుచెమటలు పోస్తున్నవి ఆ చీటి అత్తయ్య కంట పడుతుందేమో ఆమె ముందుగా తన గదికి వెళ్ళి ఆ చీటి తీసుకొంటే ఏ మవుతుంది? ఆతురతతో ఆమె శాంత ముఖంలోకి చూస్తూ ఉంది మళ్ళీ అత్తయ్యకు కునుకుపట్టింది చిత్ర లేచి గడప వద్దకు చేరుకొన్నది మళ్ళీ శాంత లేచిచూచింది ''గదికి వెళ్ళుతున్నావా?'' అని అడిగింది



''అవును, పని ఉన్నదా?'' చిత్ర ప్రశ్నించింది

''లేద''నీ మళ్ళీ మాగన్ను పెట్టింది

''నీతో ఒంటరిగా మాటాడుదామంటే పడక వచ్చింది. దీనికి మార్గమేదైనా ఆలోచించగలవా? సంగతులన్నీ విశదంగా చెప్పాలని ఉన్నది అసలు విషయం బోధపడలేదని నా అనుమానం దిగులు పడకు, నాలుగురోజుల్లో గుణవర్ధనుడు తిరిగి వస్తాడు చేయగలిగిన సాయమంతా చేయాలని ఉన్నది కాని చూచావుగా – చేయలేక పోతున్నాను నీ ఇచ్చవచ్చినట్టు నడుచుకోవచ్చు నిన్నడ్డుకొనేవారు లేరు కాని మమ్ము వదలిపెట్టి పోవని ఆశ '' బాబు వ్రాసిన ఈ మాటలు చదువుకొని ఆకు చించి తరువాత కాల్చివేయడానికి పైట కొంగున ముడిచి రొంటదోపింది మరొక ఆకు తీసి గబగబ ప్రత్యుత్తరం వ్రాసింది

''బాబూ! నీ మేలు మరచిపోలేను నాకోసం ఆందోళనపడకు అంతా అర్థమయింది నాకేదిగులూ లేదు కాని ఆయన రాగానే వెళ్లిపోక తప్పదు ఈచీటి మడిచి వస్తూ వస్తూ వరండా

మెట్టుమీద పెట్టి తిరిగి వచ్చి తనపీటిమీదకూర్చున్నది  బాబువెళ్ళి చీటి తీసుకున్నాడు  ఇంతలోనే శాంతమ్మ మళ్ళీ కళ్ళు తెరచింది  బాబు నవ్వుతూ నిద్రపొమ్మని సైగ చేశాడు  మళ్ళీ ఆమె కునుకుపాట్లకు పడ్డది

ఈ చీట్లతో ఇద్దరి మనస్సులు సన్నిహితాలయ్యాయి  లోకం శాంతమ్మకు యథాప్రకారంగానే సాగిపోతున్నది

౨౮.

నాలుగోరోజు కూడ వచ్చింది  ఆనాడు చిత్ర ముఖమంతా కన్నులు చేసుకొని చూస్తున్నది  చెవులు రిక్కించి వింటున్నది  చినబాబూ ఆస్థితిలోనే ఉన్నాడు  ఆనాడు కనిపించిన ఉత్కంఠనుబట్టి గుణవర్ధనుడు కిందటి రాత్రే వచ్చి ఉండాలి  అతని గుర్రం రామబాణం  సగం కాలంలోనె అంతదూరం దూకుతుంది  అయితే అతడెందుకు రానట్లు? బహుశః గ్రామంలో వ్యవహారాలు చక్కబెట్టుకోవలసి వచ్చి ఉంటుంది  నిస్సందేహంగా తిరిగివస్తాడు  అనుకూలంగా లేకపోతే చిత్రను తన ఊరుతాళ్ళ చెరువు తీసుకువెళ్ళుతాడు  తాళ్ళచెరువు జ్ఞప్తికి రాగానే చిత్ర భావిజీవితం మనస్సులో మెదిలింది  ఆ గ్రామదారిద్ర్యం అతని కడుపులో దేవింది  చిత్ర ఎలా కాపురం చేస్తుంది? రెక్కలమ్ముకొని జీవించేవాని ఇల్లాలై ఎలా జీవితం సాగిస్తుంది  నిజమైన ప్రణయం ఇలాంటివాటిని సరకుచేయదని అతడింకా జీవితంలో నేర్చుకోవలసి ఉన్నది

284 రాత్రి వచ్చింది  కాని గుణవర్ధనుడు రాలేదు  కారుచీకట్లు క్రమ్ముకొనేటంతవరకు చిత్ర వాగురెల్లుదుబ్బుల వంక చూస్తూనే ఉన్నది  చూపు ప్రసరించక మానగానే చెవులు రిక్కించి వినసాగింది  దీనినంతా గమనిస్తున్న శాంతగూడ అటువైపే చెవి ఒగ్గింది  తరువాత ఏమవుతుందా? అన్న ఆందోళన ఆమెకు కలిగింది  కాని నోరు మెదపలేదు  తనమార్గం అణుమాత్రం వీడరాదని పంతంపట్టి కూర్చున్నది  మెల్లమెల్లగా కొండ మీదుగ చంద్రబింబం పైకి రాసాగింది  వెన్నెలతో తోటంతా తెల్లబడ్డది  మొదటినాడు గుణవర్ధనుడు బాబును పంచలో పండుకోబెట్టినప్పుడు ఎలా ఉన్నదో ఇప్పుడు అలాగే ఉన్నది  కిటికీ చువ్వలకు మొగమెత్తి చిత్ర బయటికి చూస్తూ నిలుచున్నది  చీమ చిటుక్కుమన్నా, ఏ నీడ కనిపించినా ఆమెకు అతడేమో ననిపించింది  వేగుజామునకు వెళ్ళి ప్రక్కమీద వ్రాలింది  కన్నులు అలాగే చూస్తున్నవి  అతడు రాడేమోనన్న సందేహం అంతవరకు కలుగలేదు  కాని ఇప్పుడు ఆమెకు ఎన్నో శంకలు కలుగుతున్నవి  ''అసలు అతడు వస్తాడా! వీళ్ళు వెళ్ళిపొమ్మన్నారు  అతడు ఎంతో అభిమాని అభిమానం చంపుకొని వస్తాడా?'' అని అనుకొన్నది  అంతలోనే విశ్వాస తలనూపింది  ''అతడు నన్ను ఎన్నడూ విడిచిపోడు  ఈ ప్రపంచంలో తాను తప్ప నాకెవరు లేరని అతనికి తెలుసు నేనెంతగ తన్ను ప్రేమిస్తున్నానో ఎరుగు'' అని స్థిమితపడ్డది

మరునాడు భోజనాలవద్ద ఆమె ముఖం చూచిన మాలతికి గుండె చెరువైపోయింది

ఆపిచ్చిచూపులు బాబును బాధించాయి శాంత చీకాకు పడ్డది. ''వలపుకాడు రాలేదని అది వగలుపోతుంటే మధ్య వీడికెందుకు బాధ? లక్షణా లేమి బాగుండలేదు ఏదో చిక్కే తెచ్చిపెట్టేట్టున్నా''డనుకొన్నది

గుణవర్ధనుడు వెళ్లిపోయి వారం రోజులయింది అతనికోసం ఎదురుచూస్తున్న ముగ్గురూ ఒండొరులను చూచుకొంటున్నారు

చిత్ర చిక్కిపోయింది ఆమెకు కంటిమీద కూర్కులేదు ఎందుకో గుణవర్ధనుడు చనిపోయాడన్న భావం కలిగింది అతడు వెళ్ళిపోయిన ఆరవనాటి సాయంకాలం, ఏడవనాటి సాయంకాలం అతడు వచ్చే మార్గాన వాగువైపు చూపు సారిస్తూ వెళ్ళింది బాగా ప్రొద్దుపోయిన తరువాత మరీ వెల వెలపోతూ తిరిగి వచ్చింది భోజనంవద్ద కూర్చునేదికాని ఎంగిలి పడేది కాదు మాలతి కన్నీరు పెట్టుకునేది ''అతడు రాకుండానే ఉండాలి. ఈ నాలుగు రోజులపోతే చిత్ర సర్వం మరిచిపోతుంది,'' అని శాంత అనుకొన్నది అంతేకాదు ''ఇది ఇంత వెకిలిపిల్ల అయిందే? నలుగురు నవ్విపోతారన్న సిగ్గన్నా లేకుండా మొగమింత చేసుకొని తిరుగుతున్నది నేనైతే చస్తాగాని నలుగురిచేత నవ్వించుకొంటానా?'' అనుకొన్నది అవును ఆమె స్వబావమే అంత

ఏడవనాటి ఉదయం చిత్ర తెగించి వరండా మెట్లు దిగివస్తున్న బాబును ఆపింది ఆ సమయానికి శాంత తోటలో ఉండి ఇద్దరిని చూచింది చిత్ర ఆమెను చూచి లక్ష్యపెట్టక పెద్దగ అన్నది ''బాబూ!'' ఒక మాట! గుణవర్ధనుడు చనిపోయాడంటావా!'' గొంతుడగ్గుత్తికపడ్డది 285

''అలా అనకు! ఏవో ఇబ్బందులువచ్చి ఉంటాయి అందువల్లనే రాలేకపోయాడు '' బాబు ఓదార్చాడు

''లక్ష అడ్డంకులు వచ్చినా, ఆగి ఉండేవాడు కాదు అతడు చనిపోయి ఉంటాడు. నాకు తెలుసు మనిషిని పంపించి కనుక్కోలేవా? బాబూ!''

శాంత వారివైపు వస్తూ చివరిమాట విన్నది కొడుకువంకచూచి, ''మనగౌరవానికి ఈ పనియోగ్యంగా కనిపించడంలేదు ఏమంటావు? పంపటం మేలనుకొంటె చేతిలోపని అయిపోగానే పంపవచ్చును,'' అని అన్నది ఆ పని ఎటులేదన్నా ఇంకా వారం రోజులు పడుతుంది

చిత్ర ఇంట్లోకి పోగానే శాంత కొడుకు దగ్గరకు వచ్చి బుజాన చేయివేసి, చిత్రవైపు చూస్తూ ఆప్యాయంగా అన్నది ''దాని స్థితి బాగున్నట్టులేదు మనం చేయగలిగింది కనిపించడలేదు. మనం ఇష్టపడని వరుని కోసం కబురుపంపటం మర్యాదవుతుందా? అంతా చిక్కుగానే ఉన్నది ఇంతకూ మన అదృష్టం బాగుండలేదు '' అతని కాళ్ళకు ఉచ్చువేసింది

''అవునమ్మా! కబురెలా చేస్తాము?'' బాబు కోపంతో అన్నాడు 'పెండ్లికి మనం ఇష్టపడితే మనం కబురు పంపవచ్చును అసలతడు ఇక్కడ అడుగు పెట్టకుండా ఉంటే ఎంతో బాగుండేది ఏమీ తోచడంలేదు చిత్ర చూపులు చూస్తే భయమేస్తున్నది అన్యాయంగా చచ్చేటట్లున్నది ''

''అలా అనకు అతడేం చేశాడు? నీవు బ్రతికి బట్టకట్టావంటే దానికతడే కారణం చిత్ర ప్రవర్తనకు అతడు బాధ్యుడా? చనిపోతుందని భయపడకు కాకా పోతే జబ్బుగా ఉన్నది అంతేకాని అలాంటి పిచ్చి వలపుతో ప్రజలు చచ్చిపోరు ''

''మరి ఎలాంటి వలపుతో చచ్చిపోతారు?'' బాబు చిరాకుతో ప్రశ్నించాడు

తల్లి తాపీగా అన్నది ''చదువులు, రుచులు, నడవడులు, మనసులు, హృదయాలు సన్నిహితాలు కావాలి అలాంటి ప్రేమలే నిలుస్తవి కులంలో, గుణంలో, చదువులో తనకంటె తక్కువ వారిని ప్రేమిస్తున్నప్పుడు, ఆ ప్రేమ తాత్కాలికమే కాని చిరకాలం మనదు తైలం కొంచెంగా ఉన్నప్పుడు దీపం పెద్దకాలం వెలగదు అలాంటి ప్రేమ అలతికాలంలో అంతరిస్తుందే కాని ప్రాణాలు తీయదు ''

దర్మకీర్తికి తల్లి చెప్పినది యుక్తి యుక్తంగానే కనిపించింది చదువులో, సంస్కారంలో, ఆచారంలో, అభ్యాసంలో గుణవర్ధనుడు చిత్రకు ఎక్కడా తగడు కాని హృదయమో? నిర్మలతలో, ఉదాత్తతలో, సానుభూతిలో ఎవరికీ తీసిపోడు అయితే ఈ సంగతి ఆ క్లిష్ట పరిస్థితిలో ఎలాంటి మార్పు తీసుకురాలేక పోయింది గుణవర్ధనునికై మనిషిని పంపడమా? అతన్ని వరునిగా ఆమోదించి ఉన్నా బాబు మనిషిని పంపి ఉండేవాడు కాదు ఆ మాత్రం ఆత్మాభిమానం చిత్రకుండాలి. ఆరోజున మరోసారి ఆమె తటస్థపడినప్పుడు ఆ మాటే చెప్పాడు కాని దాని అంతర్యం ఆమెకు అంతుపట్టలేదు. ఆలోచించి చివరకు అన్నది ''గుణవర్ధనుడు చనిపోయాడేమో తెలిసికోవడానికి మనిషిని పంపడమంటే ఇష్టం ఉన్నా లేకపోయినా నేను నిన్ను పెండ్లాడదలచుకొన్నాని చెప్పి పంపటమవుతుందనేగా నీ తాత్పర్యం?''

మొదట కాదన్నా తరువాత బాబు ఒప్పుకొనక తప్పలేదు చిత్ర మెల్లిగా అన్నది ''అదే నీ అభిప్రాయమైతే మళ్ళీ మనమతని ప్రస్తావన తేవడం మంచిదికాదు అతడు ప్రాణాలతో ఉంటే తప్పక వచ్చి ఉండేవాడు ''

రోజులు దొర్లుతున్నవి మరొకవారం గడచింది పనులుకూడ ముగిసాయి తాళ్ళచెరువుకు మనిషిని పంపించమని చిత్ర మళ్ళీ అడుగుతుందేమోనని శాంత ఎదురుచూచింది ఆమె మాటాడక వాగు రెల్లు దుబ్బులువైపు చూస్తూకూర్చున్నది కుట్టుపని పూర్తిచేసి మేలి ముసుగు మడిచి పక్కపీటమీద పెట్టింది దానిని శాంతి భిక్షువులకు సమర్పించాలని ఆమె కోరిక ఆయనను

ఎలాగైనా మరొకసారి దర్శించాలనుకొన్నది అంత ముదుసలి అక్కడికి నడిచి వస్తున్నప్పుడు లానతని విహారానికి వెళ్ళలేదా? దారి తెలియదనుకో నోట్లో నాలుక ఉంటే ఎవరు చెప్పరు? ఏ ఆశ్రమం పేరు చెవితే వెనుక చిత్ర కంపించిపోయిందో, ఆ ఆశ్రమమే తనకు ఇప్పుడు శరణ్యంగా కనిపించసాగింది ఆ ఆశ్రమంలో అనాథబాలికల పాఠశాల ఉన్నది తానక్కడ ఉండి ఆ దిక్కులేని పిల్లలకు నాలుగుముక్కలు చెప్పవచ్చును దానికి తాను శాంతిబిక్షువుల అనుమతి కోరుతుంది అతడు మహాసంతోషంతో అంగీకరిస్తాడు మిగిలిన తన జీవితమంతా భగవదారాధనతో విద్యాదానంతో గడచిపోతుంది ఒంట్లో కొంచెం బలం సమకూరగానే భిక్షువులవద్దకు బయలుదేరాలి ఇప్పుడప్పుడే బయలుదేరలేదు కాళ్ళలో బొత్తిగా సత్తువలేదు గుణవర్ధనుడు చనిపోయాడు ఇంకా సందేహంలేదు అతడు పేర్కొన్న శ్మశానంలోనే అతనికి అంత్యక్రియలు జరిగి ఉంటవి అప్పుడప్పుడు తాళ్ళచెరవుపోయి అతని సమాధి దర్శించడం తన కర్తవ్యమని బావించేది అతని తండ్రి అక్కడే ఉంటాడు తన సంగతి అతనికి చెప్పి ఉండాలి తన్ను చూస్తే ఆ ముదసలి తప్పక సంతోషిస్తాడు. అసలు తన కర్తవ్యమంతా అక్కడే ఉన్నది ఆ శకులతో కలిసి మెలిసి వారి కష్ట సుఖాలలో పాలుపంచుకోవడం కంటె ధర్మమేమున్నది? ఆపని దుష్కర మనిపించింది తనకు ధైర్యం చాలదు శక్తి తక్కువ తన దుర్బల దేహంతో ఏమి చేస్తుంది? తనకు ఇప్పుడు ఆశ్రయం, విశ్రాంతి కావాలి ఇలా అనుకోగానే ఆమె చెవులకు విహార ఘంటికలు, ప్రార్థనలు వినిపించాయి భిక్షువుల ఆశీర్వాదాలు మొరశాయి ఆశ్రమమే తనకు శరణ్యం 

గుణవర్ధనుడు చనిపోయాడని అనుకొన్నదేకాని చిత్ర కన్నులు అతని రాకకోసం ఎదురుచూస్తూనే ఉన్నవి చెవులు అతని పాదాల సవ్వడి కోసం రిక్కపొడుచుకొని వింటున్నవి ప్రతి సాయంకాలం వాగువద్దకు వెళుతున్నది చీకటి పడేదాకా అక్కడే కూర్చుని వస్తున్నది ఒకరోజున పక్కమీద నుంచి లేవలేక పోయింది అలాగే పండుకొని చూస్తున్నది శాంత వచ్చి చూచి జబ్బుగా ఉన్నదా? అని పరామర్శించింది ''లేదు అత్తయ్యా! లేదు నాకెక్కడ నొప్పి, బాధ లేదు ఎందుకో లేవలేకపోతున్నాను రేపటికి అంతా చక్కబడుతుంది '' ఆమె ప్రశాంతంగా సమాధానం చెప్పింది

''ఇదిగో మందు పంపిస్తున్నానని పోయి శాంత మాలతిచేత కషాయం పంపింది చిక్కి శల్యమై ఉన్న చిత్రను చూచి మాలతి గ్రుడ్లనీరు గ్రుడ్లనే కుక్కుకొంటూ ''క్షమించు చిత్రా! నన్ను క్షమించు!'' అన్నది

''క్షమించడాని కేమున్నది? నీవు తప్పుచేయలేదు ''

''అలాకాదు నీవు క్షమించాలి '' మాలతి కాళ్ళు పట్టుకొన్నది

''ఎరిగినంతలో నీవు నాకే అపకారం చేయలేదు చేశానంటే క్షమించాను లే, లే, నేను వెళ్ళిపోతున్నాను '' అప్పుడు మాలతికి చెప్పివేస్తే ప్రమాదం లేదని చిత్ర అనుకొన్నది ఎందుకంటే గుణవర్ధనుడు చనిపోయాడని ఆమె నిశ్చయం

''కాస్త బలంరాగానే సన్యాసినుల ఆశ్రమానికి వెళ్ళిపోతాను ఈ సంగతి అత్తయ్యకు తెలియదు ఆమెకు ఈసంగతి చెప్పవుకదా?''

''చెప్పను, చిత్రా! చెప్పను'' చిత్ర పోతున్నది సన్యాసినులవద్దకు కాదు దేవలోకానికని మాలతి భయపడ్డది ''నీవు కోరినట్లే మీ అత్తయ్యకు చెప్పను '' అని మాట ఇచ్చింది

చిత్ర పడుకొన్నది మాలతి ఏడుస్తూ తల్లిదగ్గరకు పోయి, ''ఆమె బ్రతకడం కల్ల'' అని చెప్పింది

''అవును, పచ్చిగంగకూడ ముట్టడం లేదు '' అన్నది ఉపాసిక

'వేదగిరి అసలు ఇక్కడ ఉండనంటున్నాడు ' అన్నది మాలతి

'పోతే పీడావదులుతుంది సగం అతని మూలననే చిన్నమ్మకీ గతి పట్టింది

''చిత్రమీద లేనిపోని అభాండాలువేసి పాపం మూటగట్టుకొన్నాను నాకు పుట్టగతులుండవు



ఆమె చచ్చిపోతున్నది '' మాలతి ఏడ్చింది

''నీవనుకొన్నంత ప్రమాదమేమీ లేదు పడుచుదనంగదా! దిగులుపడుతున్నది ఒకప్పుడు నేనూ ఇలాగే బాధపడ్డాను ఆ వయసులో అలాగే జరుగుతుంది ''

''నేనూ వయస్సులోనే ఉన్నాగా, నాకెందుకు లేదు బాద?'' మాలతి అడిగింది

''అప్పుడే ఏమయింది, కాస్త గ్రురాన్ని కట్టివేయి'' ఉపాసిక మందలించింది

మాలతి ఆలోచనలో పడ్డది చిత్ర ఆశ్రమానికి పోతానన్నది, నిజానికి గుణవర్ధనునివద్దకు పోదలచి అలా చెప్పిందా? ఛీ పోదు చిత్ర అభిమానం లేనిదికాదు పోయేదే అయితే అప్పుడే అతనితో పోయి ఉండేది లేచి పోయేవాళ్ళు ఇంతగా ఎందుకు వరడుగప్పలవుతారు? ఎందుకు బాధపడతారు?

గుణవర్ధనుడు వెళ్ళినాటికి పదునెనిమిది రోజులు సూర్యుడస్తమిస్తున్నాడు నాలుగురోజులనుంచి చిత్ర ప్రక్కమీదనుంచే లేవడంలేదు చనిపోతున్నాన్న భావం ఆమెకు కలుగసాగింది మనస్సు నిరామయంగా ఉంది గుణవర్ధనుని మృతికైనా దురపిల్లటం మానివేసింది శారీరకంగా మానసికంగా ఎలాంటి చలనంలేక మైకంగా పండుకొన్నది.

ఆనాటిసాయంకాలం జాగ్రదావస్థ స్వప్నావస్థ కాని స్థితిలో ఉండగా చిత్రకు వింత అనుభూతి కలిగింది అది శబ్దమూకాదు రూపముకాదు ఆమె ఏకాంతంగా ఉన్నది ఎక్కడ ఏ సవ్వడీ లేదు చటుక్కున లేచి చిత్ర మంచంలో కూర్చున్నది సగం అందోళన, సగం సంతోషం, సగం విభ్రాంతి, ఏమి జరిగింది? సంజ ముదురుతున్నది గాలికూడ కదలడంలేదు గదంతా కలియజూచింది గోడలు వింతకాంతితో ప్రకాశిస్తున్నవి మంచంమీదినుంచి చిత్ర ఒకసారి దూకింది ''గుణవర్ధనుడు చావలేదు '' పెద్ద పెట్టున ఆమె పిచ్చినవ్వు నవ్వింది 'అతడు చావలేదు చావలేదు '' ఈ దాపులో ఎక్కడో ఉన్నాడు ఆమె కేక పెట్టింది

ఆదరా బాదరా దుస్తులు మార్చుకొని చిత్ర చాటుగా ఇంటినుంచి బయట పడ్డది అంతకు ముందు లేని సత్తువతో ముందుకుసాగి రెల్లుదుబ్బులు దగ్గరకు పోయింది అది నిశ్శబ్దంగా ఉన్నది ఎక్కడ ఏ ఆచూకీ కనిపించలేదు దాపలిబండమీద చతికిలబడ్డది మళ్ళి నైరాశ్యం ముంచుకొచ్చింది. ''ఇక్కడ కాదు ఇక్కడ కాదు'' అనుకొన్నది వెంటనే ''నాకేమైనా మతిపోయిందా? ప్రజలకు ఇలాగే మతులుపోతవికాబోలు'' ననుకొన్నది

''కాదు, కాదు ఉన్మాదం కాదు గుణవర్ధనుడు ఎక్కడో ఈ దాపులోనే ఉండాలి'' అనుకొని, వాగు ప్రక్కదారి పట్టింది ముందుకు పోతున్న కొలది అతన్ని సమీపిస్తున్నట్టు తోచింది అలా కొన్ని విండ్లదూరం పోగానే దూరాన ఎవరో చెట్టుకు అనుకొని ఉన్నవ్యక్తి కనిపించాడు అతడు గుణవర్ధనుడే అయితే ఇంతదూరం వచ్చి ఎందుకు ఆగాలి? ఆమెకు భయంకలిగింది ఒంటరి చోట కొత్తవాళ్ళను కలిసికోవడం ప్రమాదకరం ఇంతకూ ఆ నిల్చున్నదివ్యక్తేనా, లేక కనుచెదిరి వ్యక్తిగా కనిపిస్తున్నాడా? ఆమె జంకుతూ జంకుతూ రెండడుగులు ముందుకువేసింది ఆ వ్యక్తి రెండడుగులు ముందుకు వచ్చి ఆగిపోయాడు ఒడ్డు పొడవులు చూస్తే గుణవర్ధనుని లాగానే ఉన్నాడు మరి ఎందుకు ఆగినట్టు? కొన్ని నిమిషాలు ముందుకుపోలేక వెనకకురాలేక అలాగే నిలబడి పోయింది ముందుకు పోవడం మంచిది కాదు నిజంగా గుణవర్ధనుడే అయితే వస్తాడు కాబట్టి ఇంటికిపోవడం మంచిది కాని కాళ్ళు కదలలేదు ఒకవేళ అతడు గుణవర్ధనుడు పంపితే వచ్చాడేమో? చీకటిపడేదాకా ఇంటివైపు వెళ్ళవద్దని చెప్పిపంపాడేమో! మళ్ళీ చిత్ర అతనివైపు చెరచెర వెళ్ళింది అతడు గుణవర్ధనుడే చిత్రను చూడలేదు కొంతసేపటికి పాదాల సవ్వడివిని చూచి ఒక్కగంతున వచ్చి కౌగిలించుకొన్నాడు ''గుణవర్ధన్'' శబ్దం ఆమెనోటినుంచివచ్చింది ముఖంలోకి చూచి దిమ్మెరిపోయింది '' ఏమి జరిగింది వర్ధన్? జబ్బుపడ్డావా? అవును కనిపిస్తూనే ఉన్నది ''

''చిత్రా!'' అన్నాడు అతని గొంతుకలో కూడా ఎంతో మార్పువచ్చింది ''నిన్ను కడసారం చూచిపోవాలని బుద్ధిపుట్టింది తీరా ఇక్కడకు వచ్చిన తరువాత ఇంటివద్దకు రావడానికి గుండెచాలలేదు నీవు రాకపోతే నిన్ను చూడకుండానే వెళ్ళిపోయేవాణ్ణి ''

ఆమెకు ఆ మాటలు అర్థంకాలేదు విపరీత భయంతో మాటాడలేక అలాగే నిలబడ్డది

''మాటాడవేమి చిత్రా? వినబడలేదా? ఏమి జరిగిందో తెలియదా?''

''నాకేమీ తెలియదు ఎవరూ చెప్పలేదు పదిరోజులు నీవు చనిపోయావనే అనుకొన్నాను కాని ఈ రాత్రి నీవు ఇక్కడ ఉన్నట్లనిపించింది వెంటనే కలుసుకొందామని వచ్చాను ''

''చిత్రా! చిత్రా! ఏమి చెప్పేది?'' దుఃఖావేశంతో అతని కంఠం నొక్కివేసినట్టయింది

''చెప్పడానికేమున్నది? నీవు బ్రతికి ఉన్నావు అంతేచాలు ''

''చిత్రా! నీకు చెప్పలేను నిజంగా నేను చచ్చిపోయి ఉంటే ఎంతో బాగుండేది ఈ దుర్వార్త చెప్పే దౌర్భాగ్యం కలిగేదికాదు నాకిల్లులేదు తండ్రిలేడు మావారిని క్రూరమృగాలనువలె గ్రామం నుంచి తరిమి వేశారు బికారినై నేనొక్కణ్ణే మిగిలాను ఆశ్రమంలో కనిపించారన్న పిల్లలకంటే హీనంగా ఉన్నాను '' అతడు దగ్గరన్ను చెట్టుకొమ్మను అనుకున్నాడు ''బలంకూడ కరిగిపోయింది తిండిలేక మాడుతున్నాను ''

ఆ చీకటిలో ఆమెముఖం కనిపంచలేదు ఆమె మౌనాన్ని అతడు అపార్థం చేసుకొన్నాడు

''ఒక్కసారి నిన్ను చూచిపోదామని వచ్చాను చూచాను ఇక వెళ్ళుతాను చిత్రా నిన్ను ఆ దేవతలు అనుగ్రహించాలి అంతకన్నా ఈ దీనుడు చేయగలిగింది లేదు నీవిక్కడికి రాకపోతే నీ దర్శనమైనా లభించేది కాదు ''



చిత్ర తన ముఖం అతని రొమ్మున దాచుకొని, ''చచ్చిపోయానని నన్ను వదలిపెట్టిపోతావా, వర్ధన్?'' అని అన్నది

''మా ఊరిసంగతి నీకు తెలిసిందనుకొన్నాను. నేను ఇప్పుడు ఇల్లూ వాకిలీ లేని బికారినని గ్రహించి ఉంటావనుకొన్నాను నా ముఖం చూసి మునుపటి నీ వాగ్దానాన్ని జ్ఞప్తికి తెచ్చి బాధపెట్టరాదనుకొన్నాను ఇప్పుడు నాకున్నదేమిటి? నీకు నేనేమి ఇవ్వగలను? నీవు నాతో వస్తావని ఎందుకు అనుకొన్నానో, ఎలా సాహసించానో నాకే బోధపడటం లేదు గొంతెమ్మ కోర్కెలు కొరుకొన్నందుకు దేవతలు చక్కని ప్రాయశ్చిత్తం చేశారు

నా ప్రజలను విడిచిపోదామని సంకల్పించిన మహాపాపానికి మంచిశిక్ష విధించారు ఇక నాకేమీ లేదు ''

''ఏమి జరిగింది గుణవర్ధన్? యుద్ధం వచ్చిందా? మీ నాన్నను శత్రువులు చంపివేశారా?''

''లేదు యుద్ధం లేదు నా యిష్టంప్రకారం జరిగి ఉంటే నెత్తురు ప్రవహించి ఉండేది మా నాన్న వద్దురా తండ్రీ! ప్రతిఘటించవద్దురా! అన్నాడు దానితో మరీ ఘోరప్రతీకారం

జరుగుతుందన్నారు గ్రామాధికారి కూడా ప్రశాంతంగా పోనియమని బ్రతిమాలాడు అతని పేరు రత్నవర్ధనుడు అతని పొలాలలో పనిచేస్తుండే వాళ్ళము అతడెంతో మంచివాడు దయాదాక్షిణ్యాలుండేవి మేము ప్రతిఘటిస్తే తన వాళ్ళను మా మీదకు దూకించవలసి వస్తుందన్నాడు నిజంగా అతడు రత్నవర్ధనుడు కాకపోతే అప్పుడే అతని తల ఎగరగొట్టి ఉండే వాణ్ణి కాని అతడు వెళ్ళిపొమ్మని సలహా ఇచ్చినప్పుడు కాదనలేకపోయాను ''

''అతనిచేత ఆపని చేయించింది ఎవరు? ఇప్పుడా భూవములు ఎవరు స్వాధీనపరచుకొన్నారు?''

''ఎవరో యవనులు ఎనిమిదిమందో తొమ్మిది మందో ఉన్నారు ఎవరో న్యాయాధికారులట భూములు వారివని తీర్పుచెప్పారట, ఆతీర్పుకు ఒప్పుకొమ్మని రత్నవర్ధనుడు చెప్పాడు ''

''అవును వాళ్ళకు నీతి, జాతిలేదు మా అత్తయ్య భూములు కూడా వాళ్ళు చాల ఆక్రమించుకొన్నారు ''

''వాళ్ళు పచ్చి దొంగలు ఈ భూమి అంతా కాజేయాలని కూర్చున్నారు మానాన్నగారు మొదటి నుంచీ చెబుతూనే ఉన్నారు మందబుద్ధిని నేనే నమ్మలేదు మానవు-లింతక్రూరులనుకోలేదు ఆయన చెప్పింది అక్షరాల నిజమయింది ఆయన చనిపోయాడు. నిజంగా అదృష్టవంతుడు ఒకరోజున ఆయన కోలుకొని తిరిగి బ్రతుకుతాడనిపించింది - మంజుశ్రీకి మొరపెట్టుకొన్నాను తన సన్నిధికి ఆయనను తీసుకొనిపొమ్మని ప్రార్థించాను ఆయన బ్రతకడం నాకు ఇష్టం లేదు ఇంట్లోనుంచి బయటకు ఈడ్చివేసిన తరువాత ఆయనకు ఏమి తెలియదు, మతిపోయింది ఇదంతా నేను పోకముందే జరిగిపోయింది ఆయన ఇంటికి వెలుపల అలాగే చతికిలబడి ఉన్నాడు ఆ ఎండధాటికి ఆయనకు మతి పోయిందన్నారు నిజంగా అది కారణం కాదు ఆయనకు హృదయం బ్రద్దలై పోయింది ఇంట్లోనుంచి కదలక పోతే నలుగురు వెళ్ళి బలవంతాన ఆయనను ఎత్తి బయటకుదవేశారు తరువాత ఇంట్లోని వస్తువులన్నీ బయటికి గిరాటు పెట్టారు అదిచూచి నెత్తిన చేతులు పెట్టుకొని '' ఓ గుణవర్ధన్! ఓ గుణవర్ధన్!'' అని కేకలు పెట్టాడు నేనక్కడ లేను చిత్రా! ఆ ముదుసలి అలా అరుస్తూ ఉంటే అక్కడ ఉన్న వాళ్ళకు గుండెలు బ్రద్దలై పోయాయి ఎవరూ ఆయనను ఓదార్చలేకపోయారు ఆ పగలూ ఆ రేయీ నాకోసం కేకలు పెడుతూవచ్చాడట విచిత్రంగా ఉన్నది ఆ వార్త విన్నప్పుడు నేనెందుకు చావలేదో తెలియదు మొండిఘటమెందుకు పోతుంది? నేను వెళ్ళేటప్పటికి ఆయన నెత్తిమీద చిన్న పాకవేశారు కేకలు అణగిపోయాయి దాహం దాహం అని ఒకటే కలవరింత వారు ఆయనకు చేయగలిగినదంతా చేశారు అయినా చేయడానికేమున్నది? రత్నవర్ధనుని మనుష్యుల తొందరింపు ఎక్కువ అయింది రెండు రోజులలో ఆ ఊరి వారంతా వెళ్ళిపోవాలన్నారు

ప్రతివారు అటూ ఇటూ పరుగెత్తారు ప్రతి ఇంటివెలుపల మంచాలు, కంచాలు, గుడ్డలు, గోనెలు, రాశులుపడ్డాయి ఇంక చెప్పడం దేనికి?''

చిత్ర వెక్కి వెక్కి ఏడువసాగింది. ఏమనాలో ఆమెకు తోచలేదు అలాంటి మహావిపత్తులో ప్రణయమా? అలాంటి దురవస్థకు పాల్పడినవారికి ఆమె చేయకలిగిన సాయమేమున్నది?

''ఏడువకు చిత్రా ఏడవకు, ఏడ్చి ఏడ్చి గుండెలు బ్రద్దలు చేసుకోవడం కంటె ప్రయోజనమేమున్నది?'' అతడు ఓదార్చాడు

''అలా మీ నాన్నగారు ఎంతకాలం ఉన్నారు?'' చిత్రఅతన్ని అనునయిస్తూ అడిగింది

''అయన? నాలుగురోజుల క్రిందటనే చనిపోయారు అంత్యక్రియలుజరిపి వచ్చేశాను మూడు రోజులు ప్రయాణంలోనే గడిచాయి ఆ గుర్రం కూడ దుర్బలమైపోయింది దానిని కూడ యవనులు లాక్కొన్నారు ''

''ఘోరం! దేశంలో ధర్మం లేదు ''

అతడు చెప్పుకుపోయాడు ''మిగిలిన శకజాతి వారమంతా దక్కిన వస్తువులతో బ్రతుకుజీవుడా అని ''అడిదానికి'' చేరాము అది ఎవరిభూమి కాదు అక్కడ నీరు లేదు ''



''నీరు లేదా?''

''పారే వాగులేదు పోగానే బావి త్రవ్వాము త్రాగటానికి మాత్రం నీరు ఏర్పడ్డది'' అని నిట్టూర్చాడు. కొంతసేపు గడిచిన తరువాత తిరిగి ప్రారంభించాడు ''చిత్రా!'' ప్రొద్దు పోతున్నది నిన్ను రేవుదాకపంపిస్తాను ఎవరూ కనిపించరుగదా! దేవతలు కనికరించి నిన్నిక్కడికి పంపించారు లేకపోతే నిన్ను చూడడానికైనా అవకాశముండేది కాదు.'' గుణవర్ధనుడు లేచి నిలబడ్డాడు ఆమె కదలలేదు సంధిగ్ధావస్థలో పడ్డది అతడు రమ్మని కోరలేదు ఆ ఉద్దేశం కూడ అతనికి ఉన్నట్టు లేదు తాను వెంట వెడితే అతనికి భారంకాదా? అతడు చెప్పినట్లే నిజంగా బికారి అయితే తన అనుగమనంతో అతని జీవితం దుర్భరం అవుతుందా? సుకర మవుతుందా? తనకు జవసత్వాలు ఉన్నట్టు భావించింది ఒళ్ళు విరుచుకోవలని వస్తుందన్న భయం ఆమెకు ఎన్నడూలేదు కష్టాలంటే ఆమె ఎరుగదు అందువల్ల వాటికి భయబడలేదు చిత్ర అతని దగ్గరకు వెళ్ళి భుజాల మీద చేతులువేసి ''గుణవర్ధన్! నేనొకమాట చెబుతాను నేనూ శకాంగననే నీజాతిదాననే '' అని అన్నది

అతడు మాటాడలేదు ''విడ్డూరపడుతున్నావా? నీవు సంతోషిస్తావనుకొన్నాను ''

''ఆ సంతోషం ఎప్పుడో పొందాను ఈ సంగతి ఇదివరకే తెలుసు ''

''ఎలా? ఎప్పుడూ చెప్పలేదు!'' ఆశ్చర్యంతో అడిగింది

''ఎలా చెప్పగలను? వేదగిరి అంతాచెప్పాడు'' ''వేదగిరా? అతనికెలా తెలుసు?'' చిత్ర శాంతమ్మ చెప్పినదంతా తిరిగి అతనికి చెప్పి ''ఇదేనా వేదగిరి చెప్పింది?'' అని ప్రశ్నించింది

''అవును తండ్రిపేరు తప్ప అంతా అదే''

''నా తండ్రి ఎవరని చెప్పాడు?'' గుణవర్ధనుడు మాటాడలేదు

''దానితో ఇప్పుడేమిపని? అతడు పొరబడి ఉంటాడు శాంతమ్మకు తెలుసు ఆమెకూ, ఆమె అక్కయ్యకూ మిత్రుడై ఉంటాడు అందువల్ల మానాన్న ఆమె అక్కయ్యకు అప్పగించిపోయాడు ఏది ఎలా ఉన్నా మా తండ్రి గుణాలకంటే తల్లిగుణాలే నాకు వచ్చినట్టున్నాయి''

''అవును అందువల్లనే నీ ముఖం చూచినప్పుడు బంధువులనంతా చూచినట్లుంటుంది''

''నీకు సంతోషకరంగా లేదా?'' చిత్ర అడిగింది

''ఆ''

''గుణవర్ధన్! నీతోవస్తాను తీసుకపో నీవు వదలి పోతే నేను బ్రతకడంకల్ల'' చిత్ర అతన్ని గాఢంగా కౌగిలించుకొంది 

## ..... పన్నెండు .....

''చిత్రా! నా జీవితం నీ అధీనం నిప్పులో దూకమంటే దూకుతాను కాని నీ జీవితాన్ని కడగండ్లపాలు చేయలేను కటికనేలమీద పండుకోలేవు తిండి లేక బాధపడలేవు. నీవేమి కోరుకొంటున్నావో నీకు తెలియడం లేదు.'' గుణవర్ధనుడు తన హృదయాన్ని వెల్లడించాడు

చిత్ర నిబ్బరంగా అన్నది. ''నాకూ రెక్కల్లో సత్తువ ఉన్నది నేనూ పనిచేయగలను వర్ధన్! నీకు తెలియదు మనిద్దరం పాటుపడదాము నేలమీద పండుకోవడం కష్టకాదు నారుపోసిన దేవుడు నీరు పోయక పోతాడా?''

''ఇప్పటిదాక అలాగే అనుకొన్నాను ఆరోజున వెళ్ళిపోయేప్పుడు నీవు భయపడకపోతే నేను భయపడనక్కరలేదనన్నాను తిండికి కొదవ ఉండదనుకొన్నాను నీకెలాంటి కష్టం లేకుండా చేయవచ్చు ననుకొన్నాను కాని విధికి మన మీద దయ తప్పింది ఈ యవనులు మనలను బ్రతకనీయరు జంతువులను వేటాడి తరిమివేసినట్టు ఈ దేశం నుంచి మనలను తరిమివేస్తారు ప్రస్తుత స్థితి కంటే మరణం మేలు కదా?''

అతడన్న ప్రతిమాటతో అతనికి అర్ధాంగి అయి అతని కష్టసుఖాలలో పాలుపంచుకోవాలన్న పట్టుదల చిత్రకు అధికమయింది ''మీలో పెక్కుమంది పెండ్లిచేసుకొని భార్యలతో ఉండటం లేదా!''

'' ఉంటున్నారు '' చిత్ర తాత్పర్యం అర్ధం కాక అతడు రిచ్చపడి పోయాడు

''మరి కడగండ్లు వచ్చాయని వారు భర్తలను వదలిపెట్టి పోయారా?''

''లేదు ఎలా వెళ్ళిపోతారు!''

''తమ భర్తలవద్దనే ఉండి సుఖపెట్టడానికి ప్రయత్నిస్తున్నారు ''

''అవును!'' గుణవర్ధనునికి ఆమె లక్ష్యమేమో ఇప్పుడు బోధపడింది

''వారికి వారి భార్యలందు ప్రేమ ఉందంటారా?''

''ఉన్నది ''

''నిన్ను నేను ప్రేమిస్తున్న దానికంటె వారు వారి భర్తలను ఎక్కువగా ప్రేమిస్తున్నారా?''

''చిత్రా! నిజంగా నీవు నన్ను నేరుగా స్వర్గద్వారం వద్దకు కొనిపోయావు కాని నాకు లోపల అడుగిడడానికి గుండె చాలడం లేదు నన్ను వదలిపెట్టు చిత్రా నన్ను వదలిపెట్టు, అసలు నీవు నన్ను చూడకపోతే ఎంతో బాగుండేది ''

చిత్ర నిబ్బరవంగా అన్నది ''నీవు రాకపోతే, ఏమి చేసేదాన్నో తెలుసా? ఇంటి నుంచి పారిపోయి శాంతిభిక్షువుల వద్దకు చేరేదాన్ని ఆయన నన్ను సన్యాసినుల ఆశ్రమంలో చేర్పించేవారు నీవు నన్ను వదలి పెట్టిపోతే ఇప్పుడూ ఆపనే చేస్తాను ''

''వద్దు. వద్దు ఆ పనిమాత్రం చేయవద్దు '' కలత పడుతూ అతడు అన్నాడు

''నీతో రానీకపోతే ఆపనే చేస్తాను రేపు ప్రొద్దున్నే బయలుదేరుతాను ''

అతడు దిగులుగా అన్నాడు ''నాతో వచ్చి కడగండ్లు పడేకంటే సన్యాసినులతో కలసిపోవడమే మేలేమో ?''

''నీవు చనిపోయావనుకొన్నప్పుడు ఆశ్రమ జీవితం భయంకరంగా తోచలేదు అది ప్రశాంతంగా ఉంటుంది అనాధ బాలికలకు చదువు చెప్పవచ్చు ననుకొన్నాను కాని ఇప్పుడలా కాదు నా మనస్సుకు ఊరటలభించదు గుణవర్ధన్! నన్ను నీతో తీసుకుపో ''

అతడు ఒప్పుకొనక తప్పలేదు సంతోష శూన్యంగా అన్నాడు ''తీసుకు వెళ్ళుతాను చిత్రా!

తీసుకువెళ్ళుతాను దేవతలు నన్నూ, నా ప్రజలను కనికరించకపోయినా నిన్నైనా అనుగ్రహించాలి ''

''నీ ప్రజలే నా ప్రజలు తమ్ముస్మరించే వారిని దేవతలు ఎన్నడూ మరిచపోరు '' ఆమె అతని రొమ్మున తలవాల్చింది అతని కన్నులు ఆమె శీర్షాన్ని అభిషేకించాయి

నేరుగా ఇంటికి వెళ్ళి బాబుకు, వీలైతే శాంతమ్మకూ చెప్పి వెళ్ళిపోదామని అతడన్నాడు ఆమె పేరు చెప్పగానే చిత్ర వణికి పోయింది ''నీకు తెలియదు వర్ధన్! ఆమె కాంద్రుమనని బెబ్బులి వీలు చిక్కలేదు కాని, చిక్కితే ఏ కండకు ఆకండ, ఏ నరానికి ఆ నరం చీల్చి ఉండేది నేను వెళ్ళిపోతే అడ్డుపెట్టనని మాటవరసకు అంటున్నది కాని నిజానికి తుది గడియలో నన్ను ఏ బావిలోనో త్రోసి కప్పెడుతుంది కానీ నీతో రానీదు ''

'' ఆమె వల్ల నీ కెలాంటి కీడు రానీను బాబు వల్ల కూడ ఏ ఇబ్బంది కలుగదు ''

'' ఆమె బాబును బొమ్మను చేసి ఆడిస్తున్నది కాని, మరొకటి కాదు నిలుకడగా ఉండనీదు నిమిషంలో వంద ఆలోచనలు తెచ్చిపెట్టుతుంది పాపమతడు మాత్రం ఏమిచేస్తాడు? చూడగా చూడగా ఆమెకు ఏ దయ్యమైనా పూనిందా అనిపిస్తున్నది నీవు ఆ ఇంటి దరిదాపులకు కూడ రావద్దు అంతా నిద్రపోగానే నేను ఇక్కడకు వస్తాను వెంటనే వెళ్లిపోదాము ''

చిత్ర మాటలతో అతడు తన యత్నం మానివేశాడు ''నేను వచ్చేదాక ఇక్కడే ఉండాలి ఏది చేతిలో చేయి వేయి '' ఆమె చేయి చాచింది

''నీవు వచ్చేటప్పటికి ఇక్కడే ఉంటాగా'' అతడు చేయిలో చేయి వేశాడు.

''నాలుగు అయిదు గడియలలోనే వస్తాను'' చిత్ర ఇంటివైపు వెళ్లింది

తాను కోరినదానికీ గుణవర్ధనుడు ఇచ్చిన మాటకూ ఉన్న తేడాను ఆమె గుర్తించలేదు. చిత్రను ఎలా తీసుకుపోవాలో అతనికి పాలుపోలేదు. తానెక్కివచ్చిన గుర్రం పని ఏమీ బాగాలేదు వచ్చేటప్పుడే సగం దూరం తానుదిగి దానిని నడిపించుకు వచ్చాడు ఇప్పుడది తమ ఇద్దరిని చేరవేస్తుందా? గత్యంతరమేమిటి? చిత్ర పెంచిన బాబా అతనికి గుర్తుకువచ్చింది దానిని వేసుకువెళ్లితే ఏమి? అది చిత్రదేకదా! కడుపులో ఉంటే బయటికి లాగవచ్చు ననుకొన్నాడు

చిత్ర పిలిస్తేచాలు, బాబా దగ్గరకువచ్చి వాలుతుంది ఆమె ఎటుపోతే అటుపోతుంది దానికి అంత మాలిమి రెండవ గుర్రానికి అందదు అసలు చెలకట్టనీదు తెలిసి గుణవర్ధనుడు అక్కడ ఉండగా దానిని మచ్చిక చేసుకొన్నాడు అతడు వందమందిలో ఉన్నా గుర్తుపడుతుంది. ఈలవేస్తే దగ్గరకు వస్తుంది చిత్రచూపు మేర దాటిపొగానే అతడు గుర్రాల దొడ్డి దగ్గరకు

వెళ్ళాడు కాపరుల కుటీరాలలో ఎక్కడ దీపం కనిపించలేదు అంతా నిద్రలో ఉన్నారు ఆ నిద్ర ఎంత గాఢమో అతనికి తెలుసు కాని బాబా పెద్దగా సకిలించరాదు దొడ్డివాకిలి దగ్గరకు వెళ్ళి అతడు మెల్లగా ఈల వేశాడు గుర్రాలన్ని రెండవ వైపున ఉన్నవి ఆ సవ్వడివనపడగానే మందలో కొంచెం కదలిక కలిగింది వాటిలో ఒకటి రెండు మూడు బారలు ముందుకు వచ్చింది ''అదే బాబా కావాలి '' అనుకొని మరొకసారి ఈలవేశాడు ఈసారి అది గబగబ కదిలింది అతడు ''బాబా, బాబా!'' అని పిలిచాడు ఈసారి అది అతని గొంతు గుర్తుపట్టింది రహస్యం గ్రహించినదానివలె మెల్లగా సకిలించి అలవవెలుపల నుంచున్న గుణవర్ధనుని దగ్గరకువచ్చి నెలవులతో అతనిచేయి స్పృశించింది ''బాబా గోలచేయకు '' అంటూ అతడు వాకిటికి కట్టిన కమ్మీలు రెండు విప్పాడు అతని హృదయం గ్రహించి నాలుగుబారలు వెనకకుపోయి బాబా ఒక్కదాటున దూకివచ్చి అతని ప్రక్కన నిలబడింది అతడు కమ్మీలను ఎప్పటిలాగా కట్టివేశాడు

జీనూ కళ్ళెమూ తెస్తే బాగుండును, అవిచావట్లో గోడ వంకెలకు తగిల్చి ఉన్నవి పోయి తెద్దామంటే బాబాను ఏమి చేసేటట్లు? తాను తిరిగి వచ్చేటంతవరకు అది అక్కడ పండుకొంటే బాగుండును అంతకాలం పండుకోదు లాభంలేదు చేతులార యెందుకు చిక్కుతెచ్చుకోవాలి? అతడు బాబాను పిలుచుకొనివెళ్ళి రెల్లుదుబ్బులచాటున కట్టివేశాడు వెంటనే తిరిగివచ్చి మెల్లగా చావట్లో ప్రవేశించాడు రుద్రదాముడక్కడ పండుకోలేదుకదా? అప్పుడప్పుడు అతనికి అక్కడేపడక తేరిపారజూచాడు అదృష్టం బాగుంది అతడు అక్కడ పండుకోలేదు మెల్లగా జీనూ కళ్ళెము వంకెలనుంచి తీసి మళ్ళీ ప్రాకుతూవచ్చాడు కావలాకుక్క లేవి సడికట్టలేదు ఆ జన్నుడుకూడా నిద్రపోతున్నాడు ఇక ఇబ్బందిలేదనుకొన్నాడు తరువాత లేచి అతడు గబగబ బాబా దగ్గరకు వచ్చాడు ఇంక చిత్ర సుఖంగా ప్రయాణం చేయవచ్చునని సంతృప్తితో నిట్టూర్చాడు ప్రక్కన పండుకొని ఉన్న ఈ వింతజంతువు ఏమిటా అన్నట్లు ఈసడింపుతో బాబా ఒక్కసారి సకిలించింది

దానిమెడ తడుతూ గుణవర్ధనుడు ఆలోచనలో పడ్డాడు ముందు ఎక్కడికిపోవాలి? ఏమిచేయాలి? తమ్ము వెంబడిస్తారా? ఎక్కడ దాక్కోవాలి? ఎక్కడ కాపురం పెట్టాలి ఇలాంటి ప్రశ్నలెన్నో అతని మనస్సులో తూనీగలై ఎగురుతున్నవి

చిత్ర వచ్చిన తరువాత ఆలోచిస్తే మేలు, ఉన్న మార్గాలు వివరించి చెబితే ఆమే నిర్ణయిస్తుంది ముందు బుద్ధరక్షితుని వద్దకు వెళ్లి అతని ఆశీర్వాదం పొంది పెండ్లాడాలి అక్కడకు పోవాలంటే ఎంతలేదన్నా మూడురోజులు పడుతుంది. దారిలో మరితిండి? రత్నగిరివద్ద దాచిన తన తండ్రి వీణ గుర్తుకు వచ్చింది అది తీసుకొని అతడు డబ్బు ఇస్తాడు తన వీణ గుర్తుకు వచ్చింది అది చినబాబు గదిలో ఉండాలి చిత్రవస్తూ వస్తూ దాన్నిగూడ తెస్తుందా? ఏమో, ఈ తొందరలో

ఎలా జ్ఞాపకముంటుంది మరి ఏమి తెస్తుంది? తెలివి తేటలకు కొదవలేదు అంతా ఆమెకు తెలుసు మింటిపైకి చూచాడు చంద్రుడు లేడు చుక్కలు కూడా కనిపించలేదు దేవతలంతా ప్రసన్నులై నాచిత్రను కాపాడదలచుకొన్నారనుకొన్నాడు

చిత్ర బయలుదేరి వెళ్ళి చప్పుడు చేయక తన గదిలో ప్రవేశించింది మాలతి పంటిబాధ పడలేక ఆ రాత్రి మత్తుమందు త్రాగింది అందువల్ల ఆమెబాధ లేదు వరండాలో నుంచి తల్లి కొడుకుల మాటలు ఇంకా వినిపిస్తూనే ఉన్నవి తాను గదిలో ఉన్నాని సూచించడానికి ఆమె కిటికీ ఒకటి మూసివేసింది బుద్ధదేవుని పాదాల ముందు ప్రణమిల్లి ప్రార్థించింది తాను వెళ్ళి పోతున్నాని, తనను, తన గుణవర్ధనుని అనుగ్రహించాలనీ వేడుకొన్నది వెళ్ళేటప్పుడు తనతో ఏమి తీసుకుపోవాలో రెండు వారాల క్రితమే నిర్ణయించుకొన్నది. ఇప్పుడావిషయం ఆలోచించవలసిన పనిలేదు గుణవర్ధనుడు తీగలతో అల్లిన వలసంచులు రెండు లోగడ తనకు కానుకగా ఇచ్చాడు ఎన్ని వస్తువులనైనా వాటిలో వేసికొనలు తలకు తగిలించుకొని అనాయాసంగా కొనిపోవచ్చును చిత్ర నాలుగు చీరలు, తన శాలువ, క్రొత్తగ కుట్టి ఉంచిన మేలిముసుగు మూట గట్టింది అంతవరకు కొనిపోవడానికి తనకు అధికారం ఉన్నది తన ధనమంతా అత్తయ్య వద్ద ఉన్నది గుణవర్ధనుని వీణ గుర్తుకు వచ్చింది రేపు జీవనోపాధికి తోడ్పడవచ్చును అందువల్ల దానిని గూడ తీసుకొనివచ్చి సంచిలో పెట్టింది తిండి తిప్పలు లేక ప్రయాణం ఎలా సాగుతుంది? అందుకని వలసిన పదార్థాలు సేకరించి మూటగట్టింది ఎందుకయినా మంచిదని మరొకసారి వరండా వైపు తొంగి చూచింది బాబు గాఢనిద్రలో ఉన్నాడు ఎక్కడ ఏ సవ్వడి వినిపించడం లేదు అతనికి చెప్పక వెళ్ళిపోవడం కష్టమనిపించింది ఆకు తీసుకొని ఉత్తరం వ్రాసింది



''బాబూ! గుణవర్ధనుడు వచ్చాడు అతనితో ఈ రాత్రి వెళ్లిపోతున్నాను మాకోసం నీవు బాధపడవద్దు ఎక్కడికి పోతున్నామో తెలియదు బహుశః శాంతిభిక్షువుల వద్దకు వెళ్ళుతాము నీ వాత్సల్యం ఈ జన్మలో మరచిపోలేను సెలవు

ఇట్లు

నీ ప్రియ సోదరి,

చిత్ర

ఉత్తరం ముగించగానే తిల్లిక ఊదివేసి చిత్ర తిన్నగ తన గదికి చేరుకొన్నది తన గది కిటికీవైపుననే బాబు మంచం కాళ్ళకట్ట ఉన్నది చువ్వల సందునుంచి చెయ్యిపోనిచ్చి ఆకు జారవిడిచింది. బాబు లేవకముందే అత్తయ్య వచ్చి ఉత్తరం చూడవచ్చును చూచినా ఇబ్బంది లేదనుకొన్నది.

---

రాగరేఖలు

''బాబూ! వెళ్లివస్తాను,'' అని ఆమె మెల్లగి అన్నది

చిత్ర వలసంచులు నెత్తికి తగుల్చుకొని నాలుగు అడుగులు వేసింది ఇంతలో జన్నడు ఎక్కడనెంచో దూకి కోపంతో గుర్రుమన్నాడు చిత్ర బొమ్మలాగ నిలబడి పోయింది అంతలోనే తెమల్చుకొని '' ఇజ్జూ జన్నా!'' అనగానే అది గుర్తుపట్టి గుర్రుమాని తోక ఆడించుకొంటూ దగ్గరకు వచ్చింది ''మా బాబుగ, రా! గోలచేయకు!'' దాని తల నిమిరి ముందుకుసాగింది అది వెంటవస్తున్నది దానిని వెనుకకు పంపించట మెలా? వస్తే వచ్చింది లెమ్మని ఆ సంచుల బరువుతో సాగి రెల్లుదుబ్బుల వద్దకు వచ్చి ఆమె వెనుకకు తిరిగి ఇంటివైపు చూచింది అంతా ప్రశాంతంగ ఉన్నది కటికి చీకటిలో ఏమి కనిపించలేదు అయినా ఆమె హృదయం బావురుమన్నది. పదనాలుగు సంవత్సరాల నుంచి ఆ గడియవరకు ఆ యింటనే ఉండి అచటనే పెరిగింది తన సుఖదుఃఖాలు అక్కడే పురుడుపోసుకొన్నాయి చినబాబు, సేవకులు, పక్షులు, తోట, పూజామందిరం తనకు పరిచతమైనవన్నీ దాదాపు అక్కడే దిగడిపోతున్నవి రేపటినుంచి పూజామందిరంలోని దేవతా విగ్రహాలకు ఎవరు పూలమాలలు వేస్తారో! బాబు ఎంత బాదపడతాడో! తాను వెళ్ళిపోయినందుకు పరిజనమెంత నొచ్చుకొంటుందో! ఎటుదిరిగి సంతోషించేది అత్తయ్యమాత్రమే వారందరికి చెప్పిపోతే ఎంత బాగుండేది! మళ్ళీ చిత్ర బాటపట్టింది 'నీవుకూడా వస్తున్నావా?' అంటూ జన్నని తల నిమిరింది ' ఈ ఒకటి వచ్చినా ఆమెకు ఏలోటురాదు ఎన్నో కుక్కలున్నవి ఇల్లు జ్ఞాపకం చేస్తూ ఇదైనా దగ్గర ఉంటుంది '

దూరాన ఉండి గుణవర్ధనుడు లీలామాత్రంగా కనిపిస్తున్న ఆమె ఆకారం చూచి గుర్తుపట్టలేకపోయాడు ఈ నడిరెయి ఒంటరిగ ఈ బాటను ఎవరువస్తారా? అని సందేహించాడు త్వరితంగా గుర్రాలను తీసుకొనిపోయి తోపులో వదలి చెట్టుమాటుననుంచి చూస్తున్నాడు కొలది నిమిషాలలో వ్యక్తి ప్రక్కన వస్తున్న జన్నణ్ణి గుర్తుపట్టాడు ఆ వచ్చేవ్యక్తి ఆ బరువుతో శకాంగన వలె కనిపించింది శకాంగనవెంట జన్నడు ఎందుకు వస్తాడు? అతడు కన్నులు పొడచుకొని చూస్తున్నాడు అంతలోనే ఆ వ్యక్తి ఆగి ఒకసంచి కిందబడవేసి ''ఏవర్ధన్!'' అని మెల్లగా మదురంగా పిలిచింది.

అతడు లేడిలాగ ముందుకుదూకి ''నువ్వా చిత్రా! ఇంతబరువు ఎలా ఎత్తుకొచ్చావు?'' అని ప్రశ్నించాడు ఆమె నవ్వింది

'ఈ వలసంచులు మీ ఆడవాళ్ళు ఎలా వాడుతారో ఆనాడు చూపించలేదు? ఇంతతొందరలో వీనిని వాడుతాననుకోలేదు ఒరుసుకొని నుదురంతా మంట పుడుతున్నది '

''అవును. తలమీద బుట్టలేనప్పుడు ఒరుసుకుపోదా?'' అంటూ అతడు ఆ రెండు సంచులు దూది మూటలవలె తనబుజాన వేసుకొన్నాడు అతనికి ఒకసంచిలో వీణపెట్టె తగిలింది

''వీణా? ఎక్కడనుంచి తెచ్చావు?''

''చినబాబు బల్లమీద ఉంటే తీసుకువచ్చాను ఏది ఉన్నా లేకపోయినా, ఇది నీకెంతో ఇష్టమని పట్టుకొచ్చాను తెచ్చిందేమీ లేదు కాని మోయబోతే బరువనిపించింది ఇదిగో జన్నుడు కూడా వచ్చాడు గోల చేస్తాడేమోనని వెంటబెట్టుక వచ్చాను వీణ్ణి కూడ తీసుకుపోదామా?''

జన్నుడు నేరుగ వెళ్ళి ముంగాళ్ళు రెండు అతని రొమ్ముమీద వైచి, తోక ఆడిస్తూ నిలబడ్డాడు గుణవర్ధనుడు నవ్వసాగాడు అతడు నవ్వగా మొత్తంమీద ఏ రెండు మూడుసార్లో చూచి ఉంటుంది ఆమెకు భయం కలిగింది. ''వర్ధన్ దేనికి నవ్వుతా''వని అడిగింది

ఏమీ లేదని అంటూ తెమల్చుకొని ఒక్కసారిగి ఈలవేశాడు బాబా తరాటున తోపులో నుంచి బయటకు వచ్చి చిత్రను చూడగానే ముంగాళ్ళెత్తి సకిలించి ప్రశాంతంగా నిలబడ్డది సంతోషంతో చిత్ర కన్నులనిండ నీళ్ళు నిండాయి

''సంతోషంగా లేదా? ఈ గుర్రం నీదే కదా? దీనిని తీసుకురావడం ఇష్టం లేకపోతే తిరిగి వెళ్ళి దిగవిడిచి వస్తాను ''

'' ఇష్టం లేకపోవటమేమిటి? కాని ఇది ఇక్కడకు ఎలా వచ్చింది? జీను కూడ ఉన్నదే!''.

'' ఏమీలేదు దొడ్డి దగ్గరకు పోయి పిలవగానే అలవ దూకి వచ్చింది ఇది నీదేగా?. తీసుకుపోతే ఇబ్బంది వస్తుందీ?''

''నాదే పుట్టగానే దీన్ని బాబు నాకిచ్చాడు. రెండు రోజుల పిల్లగా ఉన్నప్పటి నుంచి నా చేతలుమీదుగా ఈనాటి వరకు సాకుతూ వచ్చాను దీనికిప్పుడు ఐదేళ్ళు'' దాని మెడ కౌగిలించుకొని చిత్ర జూలు దువ్వుతున్నది

అతడు రెండు సంచులూ బాబాకు ఇరువైపుల వేసి జీనుకు బిగించి కట్టాడు

''కొన్ని గంటలసేపు వేగంగా పయనించి తరువాత విశ్రాంతి తీసుకొందాము తెల్లవారేలోగా మానవమాత్రులు కనుగొనలేని చోటికి చేరుకొని పగలంతా అక్కడే గడపుదాము రాత్రులే ప్రయాణం సాగిద్దాము ఇలాచేస్తే మనలను ఎవరు తరుముకొని రారు,''

'' ఎవరూ రారు ఆ ప్రమాదం లేదు అత్తయ్య నా జోక్యమే తలపెట్టనన్నది బాబుచేతకూడ ఆ మాటే అనిపించింది అతడు మన కెంతగానో తోడ్పడాలనుకొన్నాడు తనవద్దనే మనం ఉంటే బాగుండనని భావించాడు కాని ఏమి లాభం! మన జోక్యం పట్టించుకొనకపోవడమే జరిగింది ఇక వారికి కావలసింది ఒకటే నా ఊసు వినిపించరాదు ముఖ్యంగా అత్తయ్యకు అంతకన్న పరమార్థం లేదు కాని, బాబు మాత్రం పుట్టెడు దిగులు వేసుకొంటాడు అతడు చాల మంచివాడు వర్ధన్!''

చిత్రను బాబా మీద కూర్చుండబెట్టి తన గుర్రాన్ని అతడు ప్రక్కన నడిపించుకొని పోతున్నాడు ఆమె హృదయం సంతోషంతో పొంగిపోతున్నది ''భయపడతానేమో ననుకొన్నాను కాని భయపడలేదు ఇక కలుగదు

''నేను మాత్రం నీకోసం భయపడుతున్నాను అయినా ఇప్పుడు వెనుదిరిగేది లేదు '' గుణవర్ధనుడు నిట్టూర్చాడు

..... పదమూడు .....

''అడవిదున్నలుమడుగులో మునుగుతూ తేలుతూ, నీళ్ళను కొమ్ములతో తెప తెప కొడుతున్నవి లేళ్ళు గుంపులు గుంపులుగ చెట్ల నీడలలో నిల్చి నెమర్లు వేస్తున్నవి అడవిపందులు బురదగుంటలలో పొరలుతు తుంగముస్తెల కోసం ఒడ్లు ముట్టెలతో కుళ్ళగిస్తున్నవి.'' జన్నడు చెట్ల కొమ్మలమీదికి చూస్తూ భౌభౌమని పైకి గంతులు గడుపెడుతున్నాడు

జన్నడి అరువులతో రెండు కొమ్మలనడుమ ఊడలతో అల్లి ఆకులతో మెత్తగా నమర్చిన పక్కమీద మేలుకొన్న చిత్ర, క్రింద అది పడుతున్న పాట్లుచూచి నవ్వుతూ ప్రక్కకొమ్మల సందున తనవలె పండుకొన్న గుణవర్ధనునివైపు తిరిగి ''వర్ధన్, వర్ధన్!'' అన్నది ''క్రిందికి చూడు పాపం జన్ననికి ఆకలయినట్లున్నది అతడు క్రిందకు చూచి దాని గంతులకు పెద్దవెట్టున
 నవ్వుతూ, '' ఎక్కడా ఏమీ గిట్టుబాటూకాలేదా!'' అన్నాడు

లేదన్నట్టుగా తోక ఆడిస్తూ అది అరిచింది

''పాపం! దానికడుపులో ఎలుకలు దొరబడ్డట్టు ఉన్నాయి ఆ దుంపలు వేయం''డని చిత్ర అన్నది

'' ఏయ్ జన్నా! ఒకటి, రెండు'' అంటూ తన పక్కమీద ఉన్న కాల్చిన దుంపలుతీసి క్రిందకు వేశాడు జన్నడు ఎగిరి ఎగిరి కిందపడకుండ ఆ దుంపలు పట్టుకొని పోయి చెట్టు మొదట్లో పెట్టుకొని తింటున్నాడు

''మిట్టమధ్యాహ్నమైనా ఎంత చల్లగ ఉందీ! రాచబాటను పోతే ఈ అడవి సొగసు, మృగాల పోకిళ్లు చూడకలిగేదాన్నా?''

''రాచబాటను పోవటమా'' గుణవర్ధనుడు ఉలికిపడ్డాడు

''భయం దేనికి? మనం దొంగలంకాదే!''

''కానిమాట వాస్తవమే, కాని బాబాను దొంగిలించామని ఈపాటికే శాంతాదేవిగారు మనుషులను తరిమి ఉంటారు ''

''బాబాను దొంగిలించామా? బాబా ఎవరిది? నాది బాబు నాకిచ్చాడు నా చేతులమీదుగ పెంచుకొన్నాను నా గుర్రాన్ని నేను తెచ్చుకొంటే దొంగతనమా? బాబులేడూ! అమ్మమీద మమకారమున్నా ఎదుటపడి అడిగితే అబద్ధమాడడు ''

''అది విచారణకు వచ్చినప్పటి సంగతి ఈ లోపున ఏమి కావాలి?''

''అవునవును మా అత్తయ్య అంతకు తగ్గమనిషే నామీద ఇప్పుడున్న కచ్చె కొందికి ఏమైనా చేస్తుంది సందేహం లేదు.''

'' ఈ కోపతాపాలన్నిటికీ ఒడికట్టే బయలుదేరాము ఇప్పుడు దిగులు దేనికి?

''అయితే ఇక్కడే ఉండి పోదాము '' ఆమె అమాయికంగ అన్నది.

''ఇక్కడనా! తిండో?''

''దుంపలతో బ్రతకలేమా?''

గుణవర్ధనుడు నవ్వాడు ''మరి గుర్రాలో ఈ ప్రాంతంలో మేతకూడ అయిపోయింది అందువల్లనే చూపుమేర దాటిపోయాయి ఈ రాత్రికి బయలుదేరకపోతే ఇబ్బంది పడాలి ''

''ఎక్కడికి పోదాము?''

''ఎక్కడికి పోయినా ముందు డబ్బు అవసరం అది సంపాదించాలంటే ఒకటే ఉపాయం మా ఊరి దగ్గర సత్రమొకటి ఉన్నది రత్నగిరి అని శ్రేష్ఠి ఒకాయన అక్కడ కొట్టుపెట్టుకొన్నాడు చాలమంచివాడు మా ఊరు యవనులు ఆక్రమించుకొన్నప్పుడు నా మిత్రుడు సింహాద్రి మా ఇంట్లోని వస్తువులన్ని రత్నగిరి ఇంటికి చేరవేశాడు వాటిలో కాస్త వెలగలది మానాన్న గారి వీణ అది కుదవబెట్టుకొని డబ్బు ఇమ్మంటాను అతడు ఇస్తాడు ''

''ఇవ్వకపోతేనో?''

''ఎందుకివ్వడు?''

''ఎందుకివ్వాలి? కొంపాగోడా? ఏ మున్నదని ఇస్తాడు?''

''ఏమున్నదని నన్ను పెళ్ళి చేసుకోబోతున్నా నీకువలెనే నామీద ఎంతో మందికి నమ్మకముంది అసలు నమ్మకంతో పనేమిటి? వీణకుదవ బెట్టుతున్నాను! డబ్బు ఇవ్వమంటున్నాను''

''అయ్యావారు అసలు సంగతి మరచిపోతున్నారు ''

ఏమి మరచిపోయాను?''

''మనకోసం అత్తయ్య మనుష్యులు అక్కడ కాచుకు కూర్చుంటేనో?''

''నిజమే అయినా పోక తప్పదు ఏ పనికైనా డబ్బు అవసరం కదా! రాత్రి వేళ పోదాము''

అతని కనుల పొంలు తొలగిపోట్లుయింది తానూ తనతల్లీ ఆపని చేయించారు తానుగూడ కారణమే కాకపోతే చిత్ర ఆపని చేయదు తన వంశానికి ఎంత అప్రతిష్ఠ! పరిజనం మధ్య తిరిగి ఎలా తల ఎత్తుకొవాలి? ఎక్కడికి పోయిందని చెప్పాలి? తల్లికి ముందే చెప్పాడు ఆమే ఇంతచేసింది అభమూ, శుభమూ ఎరుగని పిల్ల ఏ మవుతుంది? కూర్చుంటే లాభం లేదు వెంటవెళ్ళి కాళ్ళూ గడ్డం పట్టుకొని బ్రతిమాలి ఇంటికి తీసుకురావాలి

గబగబ ధర్మకీర్తి దుస్తులు వేసుకొన్నాడు కాస్త ఆలోచించడం మంచిదేమోనని తన గదిలో ఒకటి రెండుసార్లు పచార్లుచేసి, తల్లిగది వద్దకు వెళ్ళాడు వెలవెలపోతున్న ముఖంతో ఆమె వాకిట ప్రత్యక్షమయింది

''బాబూ! చిత్ర కనిపించలేదురా!'' ఆమె ఆతురతతో అన్నది

''అవును తెలుసు గుణవర్ధనునితో పారిపోతేగాని వీలులేదని మనమే తరిమివేశాము ''

''గుణవర్ధనునితోనా?''

''అవును, ఆ అప్రాచ్యునితోనే ఈ ఇంట్లో ఆ ఇద్దరికి పెండ్లి జరిగేకంటే వారు లేచిపోవడం మర్యాదఅని నిశ్చయించావు నీవు నిశ్చయించినట్లే జరిగింది నీ మాటవిని ఆ పసిదాని గుండెలు బ్రద్దలుచేశాను చేసినపాపానికి ప్రాయశ్చిత్తంగా ఇప్పుడే పోయి వారిని తీసుకురాబోతున్నాను '' 

శాంతకు నెత్తిమీద పిడుగులు పడుతున్నవి ''గుణవర్ధనునితో వెళ్ళిపోయిందని ఎలా తెలుసు?''

''ఇదిగో వ్రాసిపెట్టి పోయింది పోతూ పోతూ నా ఆశీస్సులు ఆశించింది నీమేలు ఎన్నటికీ మరచిపోనన్నది అవును ఎలా మరచిపోతుంది? నా ఇంటినుంచి దయ్యాన్నె తరుముతుంటే ''

''నా ఇల్లు'' అన్న పదం ఆమెకు చెంపపెట్టు పెట్టింది ఈ మాటాడుతున్నది తన బాబేనా? ఆమె ఏదో చెప్పబోయింది ఇంతలోనే రుద్రదాముడు పరుగున వచ్చి పడ్డాడు అతని వెనుక కర్రపోటీతో వేదగిరి వచ్చాడు

''బాబుగారూ, బాబుగారూ! రాత్రి దొంగలు పడ్డారు'' రుద్రదాముడు వగర్చుకొంటూ చెప్పాడు

''మన బాబా కనిపించడం లేదు జీను కూడ లేదు '' అన్నాడు వేదగిరి

శాంత ముఖంలో వికృతహాసం మెరసింది ఆ కంఠం కఠోరంగ ఉంది బాబు చెవులు మూసుకొన్నాడు ''నీవు చెబుతున్నట్లు దొంగలాగ రాత్రి '' అర్ధోక్తిలోనే ఆగింది బాబు

చటుక్కున తల్లి వద్దకు చేరి, ''నీకు పుణ్యముంటుంది ఈ సంగతి వాళ్ళముందు ఎత్తకు '' అని మెల్లగా అన్నాడు రుద్రదాముని వైపు తిరిగి, '' ఏమిటి! బాబా లేదా ? ఇప్పుడే వస్తున్నా పదండి!'' అని అతడు తల్లి చేయి పుచ్చుకొని గదిలోకి లాగుకొని వెళ్ళాడు

ఆమె ఆ విచిత్ర ప్రవర్తనకు ఆశ్చర్యపడి అలాగే చూస్తూ నిలబడ్డది

''చూడు నీ ఇష్టం వచ్చినట్లు చూడు నీ చూపులతో మాడ్చివేయి. ఏ మగవాడూ సహించరాని పని నాచేత చేయించావు నా చెల్లెలు ఇంట్లోనుంచి పారిపోయిందాక ఊరుకొన్నావుకావు – నీ కళ్ళు చల్లబడ్డాయి కాబోలు! ఇదుగో, మళ్ళీ ఇప్పుడే తీసుకు వస్తున్నా!''

''ఈ ఘటంలో ప్రాణాలుండగ జరగదు జరగరాదు ఈ ఇంట్లోకి తెచ్చి కులభ్రష్టులను ఒకరిని కాదు వందమందిని పెంచుకో నెత్తి కెక్కించుకో కాని నేను బ్రతికి ఉండగ మాత్రం కాదు '' కోపంతో శాంత కుర్చీలో కూలబడ్డది అంతలోనే ఆ కోపం దుఃఖంగా మారింది ఆమె చెక్కిళ్ళమీద సెలయేళ్ళు పారుతున్నవి బాబు చతికిలబడి తల్లి కాళ్ళు కౌగిలించుకొన్నాడు ''గుండెలు బ్రద్దలు చేస్తున్నావమ్మా! ఈ కఠోర కర్మ నాచేత ఎందుకు చేయిస్తావమ్మా ? నీ కోసం చావమంటే మహాసంతోషంతో చస్తాను కాని నా చెల్లెలు తిండి గుడ్డలకు వాచి దేశం పట్టుకొని అల్లాడుతుంటే ఊరుకోలేను ''

''గుణవర్ధనునకు కొంప ఒకటి ఉన్నది కదా! ఏ అండ చూచుకొనక ఎలా వెళ్ళిపోతారు ? ఆ చీకటిలో ఏమీ వ్రాయలేదా ?'' కొంత సంబాళించుకొని శాంతమ్మ అడిగింది

''ముందు శాంతిభిక్షువుల ఆశ్రమానికి పోతామని వ్రాసింది ''

ఆమె ఆశ్చర్యపడ్డది ''శాంతి భిక్షువులు ఆ ఇద్దరికి కర్తవ్యం ఉపదేశిస్తారు ఏదో విధంగా ఆశ్రమప్రాంతాలలోనే బ్రతుకు తెరువు చూపించక పోతారా ? కొంచెం ఆలోచించుకో నీ యిష్టం వచ్చినట్టు వాళ్ళకు తోడ్పడు కాదనను కాని ఇక్కడకుమాత్రం తీసుకురాకు నేను బ్రతికి ఉండగావద్దు నేనూ ఎంతో కాలం బ్రతక బోవడం లేదు నా రోజులకూడా దగ్గరకే వస్తున్నవి ''

బాబు తల్లి తొడమీద తల వాల్చాడు. ఆమె అతని తల నిమురుతూ ''విధి మనలను దూరం చేస్తున్నది'' అని అన్నది

''ఎందుకు ఇలా హింసిస్తున్నావో తెలియడం లేదమ్మా ?''

''ఇంక నిన్ను బాధించబోనురా! నా కోరిక ఒకటే ఆ నిష్ఠదరిద్రుల పేరెత్తకు నడిరేయి దొంగవలె గుర్రాన్ని కూడ అపహరించుకు పోయింది ''

బాబు చటుక్కుని లేచి అన్నాడు ''ఎందుకు అభాండాలువేస్తావు ? బాబా పుట్టగానే నేను చిత్రకు ఇచ్చాను ఆమె తన చేతులమీదుగ దానిని పెంచుకొన్నది

శాంత స్పృహ తప్పి పడిపోయింది మాలతిని, ఉపాసికను పిలిచి వారి సాయంతో దర్మకీర్తి తల్లిని పక్కమీదికి చేర్చాడు కొన్ని రోజులపాటు ఆమెచావు బ్రతుకుల నడుమ ఊగిసలాడి చివరకి ఎలాగో తేరుకొన్నది నాటినుంచి ఆమె అంతగా మాటాడడంలేదు. తన కన్నకొడుకు తనకిప్పుడు ఎదురయ్యాడు ఇలా జరుగుతుందని ఆమె కలలోకూడ అనుకోలేదు.

తల్లి ఇంట్లో తిరుగ నారంభించినప్పటినుంచి ధర్మకీర్తి మనస్సులో చిత్ర మెదలసాగింది. ఒకసారి శాంతిభిక్షువుల ఆశ్రమానికి పోవాలి చిత్రను చూడాలి తన ముఖం కనిపిస్తే ఆమె ఎంతో సంతోషిస్తుంది తాను బహిష్కృత నన్న బాధను మరచిపోతుంది. ఆమె ఇంటికి రాదు. అయినా ఆమెను చూచి రావడం అవసరం

ఒకనాటి రాత్రి అతడు తల్లితో అన్నాడు ''అమ్మా ఇప్పుడు నీకు ఒంట్లో కొంచెం నెమ్మదిగానే ఉన్నది కదా! శాంతి భిక్షువులను చూచి రావాలని ఉన్నది ఒక వారం రోజులలో తిరిగి వస్తానమ్మా!''

''పూచికపుల్ల ఎత్తే సత్తువ కూడ నాకులేదు అయినా పోయిరావాలని ఉంటే పోయిరా బాబు!'' తన తల్లితో ఇంతమార్పు వస్తుందని ధర్మకీర్తి అనుకోలేదు ఆమెకు ఇలాంటి బుద్ధి కలిగించినందుకు అతడు దేవతలందరికి మనస్సులో నమస్కరించాడు అయితే తెల్లవారుజామున బయలుదేరుతున్నాని చెప్పి తనగదికి వెళ్లిపోయాడు

మరునాటి వేకువన కొడుకు గదిలో చప్పుడు కాగానే శాంత తన గది కిటికీతలుపు తెరచి నిలబడ్డది బాబు కనిపించగానే ''బయలుదేరుతున్నావా బాబూ?'' అని ప్రశ్నించింది. అతడు ఆమె గదిలోకిపోయి ''వెళ్ళుతున్నానమ్మా! నీ ఆశీర్వాదం కావాలి నవ్వుతూ దీవించు'' అంటూ నమస్కరించాడు

''నవ్వుతూనా? ఆశక్తిలేదు వెళ్ళిరా బాబూ, వెళ్ళిరా!'' ఆమె ఊరుకొన్నది.

బాబు గుర్రంమీద బయలుదేరాడు దారి పొడుగునా చిత్రా, గుణవర్ధనుల పోలికలు చెప్పి ''కనిపించారా?'' అని తన కెదురైన వారందరినీ అడిగాడు అంతా తమకు కనబడలేదంటే తమకు కనపడలేదని చెప్పినవారే చిన్నపోయిన ముఖంతో అతడు అలాగే ప్రయాణించేసి మునాటి సాయంకాలానికి ఆశ్రమం చేరుకొన్నాడు

శాంతిభిక్షువు తన కుటీరమందలి పూలమొక్కలకు కూర్చుండి నీళ్ళు మలుపుతున్నాడు. అతనికి గుర్రం సకిలింత వినిపించింది క్రుంకుతున్న ప్రొద్దుకు చేయి అడ్డంపెట్టి తేరిచూచాడు. చినబాబు ముఖం కనిపించింది సంతోషంతో మెల్లగా లేచి ''రానాయనా, రా!'' అంటూ తీసుకువెళ్లి కుటీరం అరుగు మాపించాడు

''ఇంటివద్ద అంతా కులాసాయేనా?''

ఆమాటతో అతనికి గుండెలవిసిపోయాయి చిత్రవచ్చి ఉంటే ఆయనకు అన్ని సంగతులు సాకల్యంగతెలిసి ఉండేవి అప్పుడు ఇలా అడిగి ఉండేవాడుకాడు పుట్టెడు దిగులుతో తలవాల్చి ''చిత్రకోసం వెదకుకుంటూ వస్తున్నాను '' అన్నాడు

''చిత్రా? ఆమెకోసం వెదుకుతున్నావా?'' అతడు విస్మయ విచారాలతో ప్రశ్నించాడు

''ఇంతకూ ఇక్కడకు రాలేదన్నమాట!'' ధర్మకీర్తి బిక్కమొగం పెట్టాడు

''బాబు! ఏమిజరిగింది? చెప్పవయ్యా చెప్పు'' భిక్షువు ఆతురతతో అడిగాడు

''తాము గుణవర్ధనుని ఎరుగుదురు గదా?''

''ఎరుగకపోవటమేమి? ఆశకయువకుడే కదా? . యోగ్యుడు ''

''చిత్ర అతన్ని ప్రేమించింది ''

''ఇంతకూ మీ అమ్మ ఒప్పుకోలేదా?''

''లేదు అతన్ని పనిలోనుంచి తీసివేసి మళ్ళీ మా ప్రాంతంలో కనిపించరాదన్నది అతనికోసం చిత్ర బెంగపెట్టుకొన్నది మా అమ్మ చిత్రను మందలించి ఆ అప్రాచ్యుణ్ణిపెండ్లాడ వీలు లేదన్నది ఇంట్లో ఉండదలచుకొంటే ఆ పని జరగరాదన్నది అమ్మకు నచ్చజెప్పాలని ప్రయత్నించాను నావల్ల కాలేదు తుదకు చిత్ర గుణవర్ధనునితో వెళ్ళిపోతున్నానని చీటి వ్రాసి ఒక రాత్రి వెళ్ళిపోయింది

''అలాగా?'' వృద్ధ భిక్షువు కుటీరం ముందు పచార్లు సాగిస్తున్నాడు ''భగవన్ భగవన్! మానవ హృదయాలు ఎంత విచిత్రాలు!''

''అమ్మ ఒప్పుకొంటే ఇలా జరగక పోను''

''ఎలా ఒప్పుకొంటుంది? ఒప్పుకోదు ''

''తాము చెప్పినా?'' ఆశ్చర్యంతో ధర్మకీర్తి అడిగాడు

''మీ అమ్మ మనస్సు నీకు తెలియనిదా నాయనా!''

''అటు సూర్యుడు ఇటు పొడిచినా ఆమె మనస్సు మారదు అయినా తమరంటే ఎంతో భక్తి ఎంతో గౌరవం కాదు కూడదు అని చెబితే తమ మాట తీసివేస్తుందా?''

బిక్షువు ఆలోచనలో పడ్డాడు బాబు ఆందోళనతో అడిగాడు

''ప్రయోజనం ఉండదంటారా?''

''పాపం ఆ పసిపిల్ల ఎంత అవస్థ పడుతున్నదో!'' మరొక లోకంలో ఉన్న భిక్షువు జాలిగ అన్నాడు

''అందువల్లనే కదా బయలుదేరింది తమ రొకసారి మా యింటికి దయచేస్తే లాభం ఉండవచ్చును జాగు చేయకండి బండి తెప్పించమంటారా?'' ధర్మకీర్తి ఆశతో అడిగాడు

''అంతా విచిత్రం నాలుగు రోజుల భగవతానికి మానవుడు ఎంత స్వార్థపరుడు, దురభిమాని, దురహంకారి అవుతున్నాడు? నీతి జాతి పేరుతో ఎంత నాటకమాడుతున్నాడు? సరే చూదాము యత్నం మానవుని వంతు. మిగిలిన దానికి భగవంతుడున్నాడు ''

ధర్మకీర్తికి ఎక్కడలేని ఉత్సాహం కలిగింది భిక్షువులు చెప్పడం అమ్మ కాదనడమూనా? నూటికి తొంబది తొమ్మిది పాళ్ళు ఒప్పుకొంటుంది అతడు బండి మాటాడి తెచ్చి బయలుదేరమన్నాడు

''మరి నీవో?'' భిక్షువు ప్రశ్నించాడు

''చిత్ర ఆచూకీ తెలియలేదు ఎక్కడ ఉన్నా గాలించి తీసుకువస్తాను ఆశీర్వదించి పంపండి ''



''ఇష్టార్థ సిద్ధిరస్తు పోయిరా తండ్రీ! పోయిరా ''

## ..... పదిహేను .....

ఆనాటి పొద్దున శాంతాదేవి మేల్కొనేటప్పటికి ప్రభాతగీతం మాలతి కుటీరం వైపు నుంచి వినవస్తున్నది ''ఎవరిది ఆ కంఠం?'' రిక్కించి విని ''భిక్షువులా? ధర్మకీర్తి ఏమైనట్లు?'' ఆమె మనస్సులో ఎన్నో ఆలోచనలు బయలుదేరాయి అయినా వాటినన్నటిని ఆకట్టుకొని భిక్షువు పాడుతున్న గీతాన్ని అందుకొని ఆయనతో పాటే దానిని ముగించి లేచి కాలకృత్యాలు తీర్చుకొని ఆయన సందర్శనార్థం బయలుదేరింది రాత్రి వచ్చి ఉంటారు వచ్చినవారు తన్ను లేపలేదేమి ' తన భిక్ష స్వీకరించే భిక్షువులు ఇలా నేడు మాలతి ఇంట దిగటం వింతగా ఉన్నది చిత్ర విషయమై తనమీద కోపం కలిగిందా? ''బాబు ఏమయ్యాడు?'' వెంట ఉంటే ఈ పని జరగదు తల్లిని అవమానించడు ఇంతకూ బాబు ఏమైనట్లు? భిక్షువులను దర్శించలేదా? మరి వారు ఆకస్మికంగా ఎలా వచ్చారు? అయినా తేలుతుంది శాంత వెళ్లి ఆయనకు నమస్కరించింది ఆయన ఆశీర్వదించి కూర్చోమన్నాడు మాలతి భయపడుతూ భయపడుతూ ఒక ప్రక్కను నిలబడింది ''నీ పనులు చూచుకో తల్లీ!'' అని మాలతిని ఆయన పంపివేశాడు ఆమె

వెళ్ళిపోయినదని తెల్సుకొన్న వెనుక శాంత అన్నది ''ఇదేమిస్వామి! మీ శిష్యురాలింకా బ్రతికే ఉన్నది కదా?''

''ఎంత మాటన్నావు తల్లీ!''

''లేకపోతే ఇలా ఎందుకు చేశారు? ఇక్కడ ఎందుకు దిగారు?''

''అలా అడుగు బాగుటుంది రాత్రి వచ్చేటప్పటికి చాల పొద్దుపోయింది మాలతి వచ్చి తలుపు తీసి ఆహ్వానించింది ''అమ్మగారు నిద్రపోతున్నారు దయచేయండి ఇప్పుడే పోయి లేపుతాను'' అన్నది ''ఒంట్లో ఆమెకు బాగాలేదు నిద్రాభంగం చేయకు మీ ఇంటికి పోదాం పద' అన్నాను ఆమె ఎంతో భయపడ్డది మేమే కాదని ఆమె ఇంటికి వచ్చాము అయినా మాలతి మే మంటే ప్రాణాలు విడుస్తుంది ఒకసారి అయినా ఆమె భిక్షను స్వీకరిస్తే ఆమె ఎంత ఆనందపడుతుందో ఆలోచించావా? అందుకోసమే ఇలా చేశాము అంతకన్నా ఏమీ లేదమ్మా!''

''తాము ఏమైనా సమర్థిస్తారు సంసారబంధంలో తగుల్కొన్న మా కష్టాలు ఎలా తెలుస్తవి?'' ఆమె నిష్ఠురత వెళ్ళబోసింది.

''ఇటుచూడు తల్లీ! ఈ చాపమీద కూర్చున్నామా? లేక గాలిలో తేలిపోతున్నామా? ఈ దేహం ఉన్నంతవరకూ అంతా సంసారంలో ఉన్నవారే ఎంత చెట్టుకు అంతగాలి ఎప్పుడూ తప్పదు ''

''ఇంతకూ ఈ పాపిష్ఠురాలి భిక్ష స్వీకరించరా?''

''పరుషవాక్యాలవల్ల మనసులు బాధపడటం తప్ప ప్రయోజనం లేదు భిక్షకు పిలుస్తూ ఉంటే కాదంటామా?''

శాంత భిక్షువులను ఎప్పటివలెనే దక్షిణపుగదికి కొనిపోయింది ఆయన పరికరాలు మాలతిచేత ఆగదికి చేర్పించింది ఆయన స్థిమితంగ కూర్చున్నాడు

''బాబు కనిపించలేదా?''

''లేకపోతే ఇచటికి ఈనాడు ఎలావచ్చాము?''

''అయితే కథంతా విన్నారన్నమాట!''

''బాబు చెప్పిన కథ విన్నామమ్మా!''

''మరి తప్పిదమంతా నాదేనంటారా ?''

''ముందుగానే ఎలా చెప్పగలం। అయినా, పాపపుణ్యాలపై తీర్పు చెప్పడానికి మనమెవ్వరం తల్లీ!''

''అవును మీ హృదయం నాకు తెలియదా। ఎప్పుడూ తొందరపడరు ఎదుటివారి కష్టసుఖాలు ఆలోచిస్తారు మేలెరిగి బోధిస్తారు సాధిస్తారు మీరేచెప్పండి మీ ఆదేశం శిరసావహించి అక్కయ్య చిత్రను పెంచుకొన్నది ''

''అవును''

''తన సర్వస్వంతోపాటు ఆమెను నాకు అప్పగించింది ''

''నిజమే ''

''ఆమెకు ఏ కొదవలేకుండా పెంచాను నా బిడ్డతో సమానంగా చూచుకొన్నాను తుదకిలా చేస్తుందని కలలో కూడా అనుకోలేదు ''

''అంటే?''

'' ఇలా అప్రాచ్యుణ్ణి, ఆగర్భ దరిద్రుణ్ణి ప్రేమించి పండువంటి సంసారానికి పాడుమచ్చ తెస్తుందనుకోలేదు కొంచెం ఆలోచించండి వాడితో లేచిపోయిందన్నవార్త పొక్కితే మళ్ళీ తల ఎత్తుకోగలమంటారా? కాటికి కాళ్ళు చాచుకున్న నాసంగతి విడిచిపెట్టండి బాబు సంగతే చూడండి। అతనికింకా పెండ్లికావాలి నలుగురిలో తిరగాలి ఆమె చేసిన పనికి నా బాబు తిరిగి తల ఎత్తుకు తిరుగుతాడా? గౌరవ మర్యాదలేమైనా నిలుస్తవా?'' శాంత ముఖం క్రోధ దుఃఖాలతో జేవురించింది

భిక్షువు మెల్లగా నవ్వాడు ఆమె ఉలికి పడ్డది

''మానవుల మనస్సులు ఎంత విచిత్రాలు!''

''అదేమి అలా అంటారు?'' చికాకుతో ఆమె ప్రశ్నించింది

''చిత్ర గుణవర్ధనుని ప్రేమించిందని ఒప్పుకొంటావా?''

''అది ప్రేమా? మంచి చెడుగులు తెలియని కామం ప్రేమ ఎలా అవుతుంది?''

''సరే ప్రేమ కాదు కామమే అను ఆమె కావాలని నీ ప్రతిష్ఠ, నీ వంశ ప్రతిష్ఠ, నీ జాతి ప్రతిష్ఠ మంట గలుపుదామనే అలా చేసిందంటావా?''

''చెప్పినా వినక మరి ఈ పని ఎందుకు చేసినట్టు?''

''ఇన్నాళ్ళనుంచి ఎంతో తెలివిగలదాన వనుకొన్నాము పొరపడ్డాము తల్లీ, పొరపడ్డాము ఒకసారి నీవు అన్నమాటలే జ్ఞప్తికి తెచ్చుకో చిత్రకు తల్లివైనా తండ్రివైనా నీవే కాస్త వాత్సల్యం చూపమన్నాను అంటే ఏమన్నావో గుర్తున్నదా? ''అది సంకల్పంతో వచ్చేదికాదు హృదయంనుంచి జాలువారా''లన్నావు చిత్ర విషయంలో ఇలాగే జరిగిందేమో? కావాలని నీకు; నీపుత్రునికి, నీవంశానికి, నీజాతికి కళంకం తేవాలని ఆమెకు లేకపోవచ్చును ఆమె హృదయం అవ్యాజంగా ఆ యువకుని ప్రేమించి ఉండవచ్చును పుత్రికా ప్రేమ నీకెలా సాధ్యం కాకపోయిందో, గుణవర్ధ నానురాగ నివారణ ఆమెకు అలాగే సాధ్యం కాకపోవచ్చును నీవు చెప్పింది ఒప్పేనని నీ నిశ్చయం ఆమెచేసింది మాత్రం తప్పు అంతేకదా!''

ఆమె కొయ్యబారి పోయింది భిక్షువు సమాధానంకోసం యెదురుచూచాడు ఆమె మాటడలేదు

''సరేపోనీ, ఆ సంగతి అలా ఉంచు ''ఎవరి పాపపుణ్యాలకు వారేకర్తలు, భోక్తలు కదా? ఇదికూడ ఒప్పుకోనంటావా?''

అవునని శాంత తల ఊపింది

మరి చిత్రచేసికొన్న పాపపుణ్యాలు చిత్రే అనుభవించాలి కాకపోతే ''ఇది పాపం ఇది పుణ్యం '' అని తెలిసినవారు చెప్పడం ధర్మమే ఎవరూ కాదనరు తెలిసిన దానవు నీవు చెప్పావు ఆమె వినలేదు ఆ ఫలం అనుభవించవలసింది చిత్ర నీవు అలాగే చేశావా?''

''అలా చేయక మరేమి చేశాను? గుణవర్ధనునితో లేచిపోతే చూస్తు ఊరుకున్నాను కాని పల్లెత్తుమాట అనలేదు కొట్టితెచ్చి కొరతను వేయలేదు ''

''అదే మేము అనబోతున్నది మధ్యలో అడ్డుకొన్నావు అంతవరకు బాగానే వున్నది కాని ఆమె ఆస్తిని ఆమెకు అప్పగించవలసింది ఇంత తెలిసినదానవు ఎందుకు అప్పగించలేదో బోధపడటం లేదమ్మా!''

''మా అక్కయ్యకు ఇచ్చినమాట ఎలాతప్పేది?''

''తెలుసు అమ్మా! తెలుసు మీ అక్కయ్య మాకూ చెప్పింది మీకు నచ్చిన వరుని పెండ్లాడినప్పుడు చిత్రకు తన నక్కట్టంతా ముట్టజెప్పమన్నది అంతేగా?''

''అవును, మరొక మాటకూడా అన్నది ''

''ఏమని?''

''వరుడు నచ్చనప్పుడు ఆ సొమ్ము విహారానికి ఇచ్చి వేయమన్నది ''

''నిజమే వంశము నచ్చనప్పుడు కదా!''

''అవును''

''మరి గుణవర్ధనుడు కుంటివాడు, గుడ్డివాడా, గుణహీనుడా?''

''అంతేనా?''

''మరేమి తక్కువ?''

''ఆ అప్రాచ్యునికి బిడ్డను ఇమ్మంటారా?''

''అప్రాచ్యుడు కావచ్చును కాని, గుణహీనుడు కాడుగదా! గుణహీనుడైతే, నీవు నిశ్చయించినట్లే చేయవచ్చును కాని అతడు నిజంగా గుణవంతుడు అతన్ని, అతనికి చిన్నతనంనుంచి ఎరుగుదను ఏ గుణంలోను కొదవ కనిపించలేదు ఒడలు దాచుకోడు కష్టసుఖాలు తెలుసు ఇతరులకు ఇంతమేలు చెయ్యాలి అనేవాడే కాని, కొంపలార్పాలనేవాడుకాదు సహనం, ధైర్యం, సత్యం, శౌచం, దయాదాక్షిణ్యం, పాపభీతి ఉన్నవి కాకపోతే ఆస్తిలేదు నీవు అనుకొనే ఉన్నత వంశంలో పుట్టలేదు అది అతని దోషమా? ఎవరి కర్మలకు వారు కర్తలు కాని, పుట్టుకకు కర్తలుకారు, అమ్మా! మరొకసారి ఆలోచించు! చిత్ర అతన్ని వరించింది తన ఆస్తితో ఆమెకు సుఖంగా బ్రతకడానికి అవకాశమున్నది అలా వీలులేదని ఆమెను త్రోసిపుచ్చి ఆ ఆస్తిని విహారానికి సంక్రమింపజేయడం ధర్మమా? విహారాలుమాత్రం అలాంటి దానాలు ఎలా స్వీకరిస్తవి? దేశమ్మకాకులై అల్లాడుతుంటే ఆమె సొమ్ము దానం చేయడానికి నీకేమి అధికారమున్నది? ఏ విహారాలైనా, ఏ ఆశ్రమాలైనా, ఏ మతాలైనా మానవుల శ్రేయస్సుకోసం ఏర్పడ్డవే కాని మానవులను పశువులను చేయడానికి కాదు హింసించడానికి కాదు మరొకసారి నీ అంతరాత్మను అడుగు ఇంత మేము ఎందుకు చెప్పాలి? చిత్ర ఎవరు? మేము ఆమెను ఎత్తలేదు, పెంచలేదు అన్నవస్త్రాలిచ్చి పోషించలేదు రోగంవస్తే సేవచేయలేదు కాకపోతే వచ్చినప్పుడు దీవనలిచ్చాము అంతే కదా? కాక మరేబంధమైన ఉన్నదా? ఏ అంటు సొంటులున్నా నీకే ఉండాలి ఏ మమతలున్నా నీకే సన్యాసులుము మా కెలా ఉంటాయి? అయితే ఈ కంఠశోష అంతా దేనికంటావేమో? ధర్మమనేది ఉన్నది దానిని మరుగుపరచలేక చెపుతున్నాము చెప్పడం వరకే మాపని చిత్రకు నీవు ఎలా చెప్పావో అలాగే నీకు చెప్పవలసివచ్చింది అయితే నీవు ఆమెను దండించడానికి పూనుకొన్నావు అది తగదన్నాము నీపట్ల కూడ మాకది తగదని భావిస్తున్నాము అయినా, ఈ సన్న్యాసి నీవంటి సత్కుల సంజాతను, సంపన్నురాలిని ఎలా దండించగలడు? అది సాధ్యమా? భిక్షువు విచారంతోలేచి కిటికీవద్దకు వెళ్ళి తోటలోని పూలమొక్కలవైపు చూడసాగాడు

''ఇంకా బెబ్బులిలాగానే కనిపిస్తున్నానా?'' శాంత నవ్వుతూ చిత్రను దగ్గరకు తీసి కౌగిలించుకొన్నది మరి ఆలస్యం దేనికంటూ కొడుకు వంక చూచింది

ధర్మకీర్తి వెళ్లి వలసిన సన్నాహాలు చేశాడు శాంత భిక్షువుల ఆశీర్వాదాలతో చిత్రాగుణవర్ధనుల వివాహం మహావైభవోపేతంగా జరిగిపోయింది తల్లి ధర్మకీర్తిని పిలిచి తారాదేవి పటంచాటున దాచిన రత్నాలు, అమూల్య వస్త్రాలు తెప్పించి వధూవరులకు కానుకగా ఇప్పించి దీవించింది

మాలతి విడ్డూరపడి చూస్తున్నది భిక్షువులు వచ్చిన నాటినుంచి శాంతమ్మగారు స్వగృహంలో కాలుపెట్టడంలేదు ఏమి జరిగింది? భిక్షువులు ఏమన్నారు? చిత్రాగుణవర్ధనుల వివాహం ఆమెకు సమ్మతం కాదా? కాకపోతే వారిని ఎలా ఆశీర్వదించింది? కొడుకుమీద కోపమా? ధర్మకీర్తి తల్లివద్దకు వచ్చిపోతూనే ఉన్నాడు ఆమె ఎంతో ఆప్యాయతతో పలకరిస్తూనే ఉన్నది

అంతకంటే విభ్రాంతికరంగా మరొకటి జరిగింది చిత్రాకీర్తులు బ్రతిమాలుతున్నా వినక ఉపానికను వెంటబెట్టుకొని శాంత ఆశ్రమానికి పయనంగట్టిన భిక్షువుల వెంట బయలుదేరింది

సమాప్తం

''సర్వసంగ పరిత్యాగికి అసత్యం చెప్పవలసిన అవసరమేమున్నది? ఈ లేఖ లెనిదర్శనం ఎంత విచిత్రం! స్వార్థం ఎన్ని మెడలు కడుతుంది! ఎన్ని అంతరువులు నిర్మిస్తుంది! దేశమంటుంది, జాతి అంటుంది, నీతి అంటుంది ఇవన్నీ ఆస్వార్థం వికృతావతారాలు నీ ఊహా సౌధాన్ని బ్రద్ధలుచేసి దుఃఖ కూపంలో కూలద్రోయడానికి ఇష్టంలేక ఇంతకాలం దాచి ఉంచాము కాని అది మరి రెండు జీవుల జీవనంలో విషంగ్రక్కబోతూ ఉంటే చూడలేక పోయాము క్షమించు తండ్రీ! ఏ జీవిని హింసించరాదని మీ ఆదేశం అమ్మా, ఇప్పుడు నీ యిష్టంవచ్చినట్టు నిర్ణయించుకో, నడుమ అడ్డు పడడానికి అధి కారము లేదు మాలతీ! మాలతీ!''

''స్వాములు పిలిచారా?'' అంటూ మాలతి వచ్చింది

''అవును, శాంతమ్మగారి ఒంట్లో బాగున్నట్టులేదు మెల్లగా వెళ్ళి ఆమెను పక్కమీద పరుండబెట్టు'' అని చెప్పి ఇద్దరిని పంపివేసి, ''భగవాన్! నీ లీలలు నీకే తెలియాలి'' అన్నాడు

..... పదహారు .....

చిత్రా గుణవర్ధనులతో ధర్మకీర్తి తిరిగి వచ్చాడన్న వార్తవిని పరిజనమంతా సంతోషించిచారు. చిత్ర నేరుగా వెళ్లి దక్షిణపు గదిలో ఉన్న భిక్షువులకు ప్రణమిల్లింది గద్గద కంఠంతో ఆయన ఆశీర్వదించాడు 

''స్వామీ!''

''ఏమీ తల్లీ?''

''అత్తయ్య ఎక్కడ? ఇంట్లో ఉన్నట్టు కనిపించదే? ఏమి జరిగింది? అస్వస్థగా ఉన్నదా?''

''అందోళన పడకు, మీ అత్తయ్య కుశలమే మాలతి ఇంట్లో ఉంటున్నది''

చిత్రకు అంతా అయోమయంగా కనిపించింది

''మాలతికి జబ్బుచేయలేదుగదా?'' ఆమె ఆతురతతో ప్రశ్నించింది

''లేదమ్మా! లేదు భగవదనుగ్రహం వల్ల అంతా కుశలంగానే ఉన్నారు''

చిత్ర మాలతి ఇంటికి వెళ్ళింది ధర్మకీర్తి తల్లి దగ్గర కూర్చుని ఉన్నాడు ఆమె కొడుకు తలను గోముగా నిమురుతున్నది తుపాను విచ్చిపోయిన వెనుక గగనాంగణాన కనిపించే విశ్రాంతి ఆమెలో గోచరించింది విస్తుపోతూ వెడగా నిల్చి చిత్ర ఆమెకు నమస్కరించింది

---

“ఇంకా బెబ్బులిలాగానే కనిపిస్తున్నానా?” శాంత నవ్వుతూ చిత్రను దగ్గరకు తీసి కౌగిలించుకొన్నది. మరి ఆలస్యం దేనికంటూ కొడుకు వంక చూచింది.

ధర్మకీర్తి వెళ్లి వలసిన సన్నాహాలు చేశాడు శాంత భిక్షువుల ఆశీర్వాదాలతో చిత్రాగుణవర్ధనుల వివాహం మహావైభవోపేతంగా జరిగిపోయింది. తల్లి ధర్మకీర్తిని పిలిచి తారాదేవి పటంచాటున దాచిన రత్నాలు, అమూల్య వస్త్రాలు తెప్పించి వధూవరులకు కానుకగా ఇప్పించి దీవించింది.

మాలతి విడ్డూరపడి చూస్తున్నది. భిక్షువులు వచ్చిన నాటినుంచి శాంతమ్మగారు స్వగృహంలో కాలుపెట్టడంలేదు. ఏమి జరిగింది? భిక్షువులు ఏమన్నారు? చిత్రాగుణవర్ధనుల వివాహం ఆమెకు సమ్మతం కాదా? కాకపోతే వారిని ఎలా ఆశీర్వదించింది? కొడుకుమీద కోపమా? ధర్మకీర్తి తల్లివద్దకు వచ్చిపోతూనే ఉన్నాడు. ఆమె ఎంతో ఆప్యాయతతో పలకరిస్తూనే ఉన్నది.

అంతకంటే విభ్రాంతికరంగా మరొకటి జరిగింది. చిత్రాకీర్తులు బ్రతిమాలుతున్నా వినక ఉపాసికను వెంటబెట్టుకొని శాంత ఆశ్రమానికి పయనంగట్టిన భిక్షువుల వెంట బయలుదేరింది.

సమాప్తం